## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి

గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరవిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి, జ్ఞాన, ధర్మ ప్రచారార్ధం మహానుభావులైన శ్రీ రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన మాసపత్రికలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు.వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. ఈ మాసపత్రికలు క్రొత్తవా లేక పాతవా? అని చూడకుండ, అందులోగల రత్నాలలాంటి విషయాలను తెలుసుకోవటానికి ప్రయత్నం చేయగలరు అని మనవిచేసుకొంటున్నాము..

ఈ మాసపత్రికలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) రామకృష్ణ మఠ్ వెబ్ సైట్: http://www.rkmath.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో రామకృష్ణ మఠ్ వెబ్ సైట్ సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

## రామకృష్ణ మఠ్ వారి వెబ్ సైట్

## http://www.rkmath.org

Archives

www.rkmath.org/prabhaarchives

Home | Universal Temple | Activities | Languages | Human Excellence | Health | Publications | Downloads

Magazine | Telugu Books, CDs & Posters | Online Shopping

About | Archives | Subscription

శ్రీ రామకృష్ణ ప్రభ

Sri Ramakrishna Prabha
The Telugu Monthly of the Ramakrishna Order

Aa | What's New | Our Location

Would you try to wash dirt with dirt? Will sin cure sin, weakness cure weakness? Strength, O man, strength, say the Upanishads, stand up and be strong.
- Swami Vivekananda

Donate | Serve with us | Contact Us

Universal Temple
- Temple
- Arathi
- Bhajans
- Festivals
- Rama Nama
- Worship

Activities
- Weekly discourses
- Relief
- Library
- Retreats
- Anna Danam
- Balanarayana Seva
- Vidya Danam
- Jnana Danam
- Satsangas
- Diksha

Ramakrishna Prabha Magazine Archives

Submit

2012

2011

Click to read

Click to read

Click to read

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# దేవీ మాహాత్మ్యము

(శ్రీ దుర్గాసప్తశతి)

అనువాదకులు: శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

ఇందు మూలశ్లోకములు, వానికి ధారాళమయిన ఆంధ్రానువాదమును పొందుపఱుప బడియున్నవి. అందు ముఖ్యములును నిగూఢములును అగు శబ్దములకు పాదదీపికలందు వివరణములు చేర్పబడియున్నవి. దేవీనవరాత్రములందును, ఇతర పవిత్రావసరములందును నిత్యపారాయణ మొనర్పవలసిన ఉత్తమగ్రంథము. ఈ గ్రంథప్రాశస్త్యము పూర్తిగా వివరించు పీఠికయు చేర్పబడియున్నది.

(170 + 16) పుటలు ప్రజ్వలమగు ప్రథమ ముద్రణము వెల : రూ. 2-0-(

# శ్రీ వివేకానంద లేఖావళి

(రెండు భాగములు)

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

భారతదేశమున ఇంటింటను ఉండవలసిన పుస్తకములలో నిది యొకటి; బాలికా బాలకు లెల్లరును శ్రద్ధతో పదేపదే చదువవలసిన పుస్తకములలో నిది యొకటి.

ఈ లేఖలయందు దైవభక్తి, మానవరక్తి, కార్యాసక్తి—ఇవి నిరంతరసంయోగము దాల్చి జీవితాంధకారమును దొలగింపజేయు జ్యోతిగ నుండుట స్పష్టము.

—కట్టమంచి రామలింగారెడ్డి

మొదటి భాగము : 256 పుటలు
రెండవ భాగము : 226 పుటలు

ఒక్కొక్క భాగము వెల : రూ. 1-8-0

---

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౩ ౧౯౫౭, జాన్యువరి—దుర్ముఖి, మార్గశిరము సంచిక ౭

## విషయసూచిక

ఆత్మపఞ్చకమ్—శ్రీమచ్ఛఙ్కర భగవత్పాదాః ... ... .. ౨౨౫

క్రీస్తు - దివ్య సందేశ హారి—[సంపాదకీయము] ... ... .. ౨౨౭

ప్రజ్ఞాపారమితాపిండార్థము—డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఎం.ఏ., ఎం.లిట్., పిఎచ్.డి. ... ... .. ౨౩౦

మహాప్రభు వల్లభాచార్యులు—శ్రీ కర్ణ రాజశేషగిరిరావు, ఎం. ఏ. ... .. ౨౪౧

అద్వైతమతము—విద్వాన్ చదలవాడ జయరామశాస్త్రి ... ... .. ౨౪౩

శ్రీవిశుద్ధానందవాణి ... ... .. ౨౪౮

వార్తలు, విశేషాలు ... ... .. ౨౫౧

గ్రంథసమీక్ష ... ... .. ౨౫౫

# శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

(తృతీయ ముద్రణము)

శ్రీరామకృష్ణుని గృహస్థశిష్యులలో ఉత్తమగణ్యుడు నాగమహాశయుడు. గృహస్థ జీవనమును శాస్త్రీయముగా గడుపుచు పారమార్థికమార్గమున పురోవృద్ధిగాంచుట ఎట్లా యను విషయమును ఈయన చరిత్రము మనకు నిరూపింపగలదు.

ఆబాలగోపాలము అందఱకును అర్థముకాగల సులభశైలి. చక్కని ముద్రణము!

132 పుటలు వెల: రూ. 1-4-0

# అనుష్ఠాన వేదాంతము

(శ్రీ వివేకానందస్వామి ప్రవచనము)

వేదాంతమనగా విశ్వశరణ్యమగు మతసిద్ధాంతము. ఆబాలగోపాలము సమస్త దేశీయులకును సమస్తమతావలంబులకును సర్వకాల సర్వావస్థలయందును ఆ వేదాంతము ఎటుల అనుష్ఠానయోగ్యమో కన్నులకు కట్టినటుల శ్రీస్వాములవారిందు స్పష్టీకరించి యున్నారు.

130 పుటలు (దివ్యమగు ద్వితీయ ముద్రణము) వెల: రూ. 1-4-0

అడ్రెసు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4



'సర్వేశ్వరుని శరణు జొరుము, అతని కృప నీ యనుభవమునకు అప్పుడు వచ్చును.''

-శ్రీ శారదామణి.

# శ్రీ కృష్ణ ప్రభ



సంపుటము ౧౩ } ౧౯౫౭ జాన్యువరి దుర్ముఖి – మార్గశిరము సంచిక

## ఆత్మపఞ్చకమ్

[శ్రీమచ్ఛఙ్కర భగవత్పాదాః]

నాహం దేహో నేన్ద్రియా ణ్యన్తరఙ్గం
నాహఙ్కారః ప్రాణవర్గో న బుద్ధిః
దారాపత్య క్షేత్ర విత్తాది దూరస్
సాక్షీ నిత్యః ప్రత్యగాత్మా శివో ఽహమ్ ॥ ౧

దేహము ఇంద్రియములు మనస్సు అహంకారము ప్రాణవర్గము బుద్ధి అనెడి వీనిలో నేను ఏదియును కాను. పెండ్లము బిడ్డలు స్థిర చర సంపద మొదలైన వాని నుండి వేఱై, సాక్షినై, నిత్యుడనై, ప్రత్యగాత్మనైన నేను శివుడనే

రజ్జ్వజ్ఞానాద్ భాతి రజ్జుర్ యథాహిస్
స్వాత్మాజ్ఞానా దాత్మనో జీవభావః ;
ఆప్తోక్త్యాహి భ్రాన్తి నాశే స రజ్జుర్,
జీవో నాహం దేశికోక్త్యా శివో ఽహమ్ ॥ ౨

త్రాటిని త్రాడు అని ఎఱుగకుండునంతవఱకును, అది పామువలె కనిపించును. ''అది పాము కాదు, త్రాడు'' అని ఆప్తులు చెప్పిన మీదట, సర్పభ్రాన్తి తొలగుడు, త్రాడు త్రాడే అగును. స్వాత్మజ్ఞానము లేకుండునంతవఱకును 'ఆత్మ జీవుడు' అను భ్రాన్తి ఉండును. గురూపదేశముచే ఆ భ్రాన్తి తొలగుడు, నేను జీవుడను కాక, శివుడనే అగుదును.

ఆభాతీదం విశ్వ మాత్మ న్యసత్యం
సత్య జ్ఞానానన్ద రూపే విమోహాత్
నిద్రామోహాత్ స్వప్నవత్ త న్న సత్యం
శుద్ధః పూర్ణో నిత్య ఏక శ్శివో ఽహమ్ ॥ ౩

నిద్రాపరవశదశలో స్వప్నము కలుగును. ఆ కల కల్ల. అట్లే సత్య జ్ఞానానంద రూపమైన ఆత్మస్వరూపము తెలియకుండునంతవఱకును, ఈ జగత్తు భాసించును. ఇది మిథ్యయే. శుద్ధుడును పూర్ణుడును నిత్యుడును ఒక్కడును ఐన శివుడనే నేను.

మత్తో నాన్యత్ కిఞ్చి ద త్రాస్తి విశ్వం
సత్యం బాహ్యం వస్తు మా యోపక్లృప్తమ్
ఆద ర్శాన్త ర్భాసమానస్య తుల్యం
మ య్యద్వైతే భాతి తస్మా చ్ఛివో ఽహమ్ ॥ ౪

ఆత్మ అద్వైతము అని తెలిసిన వెంటనే, బాహ్యవస్తువులు అన్నియును మాయచే భాసించునవే అనియు, అద్దములోని ప్రతిబింబాలవంటి మిథ్యలే అనియు స్పష్ట మగును. సత్యమైన విశ్వము ఆత్మకంటె వేఱు ఏదియు లేదు. లేక పోగా, శివుడనే నేను.

నాహం జాతో న ప్రవృద్ధో న నష్టో
దేహ స్యోక్తాః ప్రాకృతా స్సర్వ ధర్మాః
కర్తృత్వాదిశ్ చిన్మయ స్యాస్తి నాహం
కార స్యైవ హ్యాత్మనో మే శివో ఽహమ్ ॥ ౫

ఆత్మకు పుట్టుక లేదు, వృద్ధి లేదు, వినాశము లేదు. పైని చెప్పిన యీ ప్రకృతి ధర్మాలు అన్నియు దేహమువే. కర్తృత్వాదులు నాలోని అహంకారమునకు కలవే కాని చిన్మయునకు లేవు. శివుడనే నేను.

నాహం జాతో, జన్మమృత్యూ కుతో మే ?
నాహం ప్రాణః, క్షుత్పిపాసే కుతో మే ?
నాహం చిత్తం, శోకమోహౌ కుతో మే ?
నాహం కర్తా, బన్ధమోక్షౌ కుతో మే ? ౬

నేను పుట్టనే లేదు. జననమరణాలు నాకు ఎక్కడివి ? నేను ప్రాణమను కాను, ఆకలి దప్పులు నాకు ఎక్కడివి ? నేను మనస్సను కాను, దుఃఖాజ్ఞానములు నాకు ఎక్కడివి ? నేను కర్తను కాను, బంధమోక్షములు నాకు ఎక్కడివి ?

# క్రీస్తు - దివ్య సందేశహారి*

## [సంపాదకీయము]

మహాసముద్రమున అల లేచును, వెంటనే పడును. ఆ వెనుక అంతకంటె పెద్దయల మఱియొకటి లేచును, అదియు పడును, మఱల లేచును, ఇట్లు పైకి త్రోసికొని పోవుచునే ఉండును. లోక చరిత్ర పురోగతిలో కూడ ఇట్లే పొంగుటయు లొంగుటయు చూపట్టుచుండును. కాని సామాన్యముగా మనము పతనమును దలంపక వృద్ధినే నిరీక్షించుచుందుము. పోటును పాటును, హెచ్చును లొచ్చును, రెండును అనివార్యములే, ఆవశ్యకములే; రెండును గొప్పవే. ఇది లోకస్వభావమే. మన భావప్రపంచములోఁ గాని, చుట్టఱికముల రంగములోఁ గాని, సంఘమునందుఁ గాని ఆధ్యాత్మిక విషయములందుఁ గాని ఈ వృద్ధి క్షయములు సాగుచునే ఉన్నవి. కావున లోక చరిత పురోగతిలో ప్రబలములును ప్రధానములును ఉదారములును అగు ఆదర్శములు పైకి వచ్చును, మఱల పడిపోవును, కాలము సాగఁగాసాగఁగా సమైక్యమొంది, పర్యాలోచితములై, పదిలపడి, బలపడి క్రొత్తదియు మునుపటికంటె హెచ్చుదియు అగు స్థాయికి మఱల లేచును.

దేశ చరితముల రీతియు సదా ఇట్టిదే. ఏసు దేవుని చరిత్రమును కదా నేఁటిసాయంకాలము మనము పరిశీలింప నున్నాము! ఆ దివ్యసందేశహారి అవతరించినప్పుడు అతని జాతివారి చరిత్రములో ఎంతో నీచమని అనఁదగిన దశ జరుగుచుండెను. అతని చరితములును భాషితములును అక్కడక్కడ గ్రంథస్థములై ఉన్నవి. వానిని బట్టి మనము అక్కడక్కడ కనిపట్టగల విషయము ఇంచించుకే. అదియునుగాక ఆమహాత్ముని చరితములను భాషితములను సమగ్రముగ వ్రాసి పెట్టఁ గలిగినచో అవి విశ్వమునెల్ల ముంచివేసి ఉండెడివని పెద్దలు సరిగానే చెప్పినారు. ఆయన యాచార్యకము (మినిస్ట్రి) చెల్లినది మూఁడేండ్ల కాలమే ఐనను, అనంత కాలమునకు వలసిన గ్రాహ్యాంశములు అందు కూడియున్నవి, ఇమిడి ఉన్నవి. ఆ ముల్లెమూటను విప్పుకొనుపనిని మన మిప్పుడు చేయుచున్నాము. ఇప్పటికి పందొమ్మిది వందల సంవత్సరములు ఐనవి, ఇంకెంత కాలము పట్టునో ఎవరు చెప్పఁగలరు? మనము అల్పులము, మనలో ఉన్న శక్తియు కొంచెమే. కావున మనలోని గ్రాహ్యాంశములను అన్నిటిని వినియోగించుటకును వాని సారమునకు తగినంతగా వానిని విపులపఱచుటకును కొన్ని నిమిషములు చాలును, లేదా, కొన్ని గంటలు చాలును, ఎక్కువ కావలసి యున్న, కొన్ని సంవత్సరముల కాలమైన చాలును. ఈ దివ్యమహిముని క్రైస్తును జూడుఁడు. శతాబ్దులును యుగములును దాఁటిపోవుచున్నవి. ఆయన లోకమువ

* మూలము శ్రీస్వామి వివేకానందులు అనుగ్రహించినది.

ఉంచి ఏఁగిన తేజము వికసించుచూ ఇంకనుసాగు చున్నది, ఏనాఁటికైన అది పూర్తిగ ఖర్చుపడి పోవునా? కాలచక్రము చుట్టు తిరుగు కొలఁదియు ఆ తేజమునకు నూత్న శక్తి కదా చేకుఱుచున్నది!

అనాది కాలమునుండి క్రైస్తు వఱకును గడచిన మానవ జీవితమును అంతటిని ఆయన జీవితములోఁ గాంచుచున్నాము. ఒక విధముగ ప్రతివ్యక్తియందును, పూర్వకాలమునుండి ఆ వ్యక్తికాలమువఱకును వచ్చిన సంఘజీవితము, రూపుదాల్చి యుండును. జాతియంతటియొక్క పూర్వచరిత్రము వంశపారంపర్యమునుబట్టియు, పరిసరములను బట్టియు, శిక్షణమును బట్టియు, జన్మావృత్తులను బట్టియు ప్రతివ్యక్తిలోనికిని సంక్రమించును. ఒకవిధముగ యావద్భూమండల–సర్వలోక చరితములముద్రకూడ ప్రతివ్యక్తిలోను ఉన్నది. ఈయుగమున ఉన్నట్టి మనము అందఱమును అపార భూతకాల చరిత్రకును పరిణామముగను ఫలితముగను ఏర్పడిన వారమే, కాని వేఱు కాము. అనాదియు అనంతమును అగు చరిత్రప్రవాహముపై తేలిన చిట్టి కెరటాలమే మనము, ముందునకును మీఁదికిని ఉఱ్ఱూతలూఁగుచు విశ్రాంతి నెఱుంగక యున్నాము. గతచరిత్రమునకు మనలో ఒనఁగూడిన మూర్తీభావము కొంచెమే. మనము ఒక లెక్కలోని వారము కాము, బుడగలము. చరిత్ర యనెడి సముద్రమున కొండ లంతటి యలలను బోలిన వారు ఉన్నారు. వారిలో భూతకాలచరిత మంతయును మూర్తీభవించుటే కాదు, చాఁచిన వారి బాహువులకు భవిష్యత్తు కూడ అందును. వారు మానవుల పురోగమనమును సూచించుచు అక్కడక్కడ ఉన్న స్తంభముల వంటి వారు. వారి మహిమ అతిమానుషము. వారి నీడ భూమినంతటిని తనలో ఇముడ్చుకోఁగలదు. వారికి మరణము లేదు, వారు శాశ్వతులు. మహనీయుడైన క్రైస్తు తానే ఒకచోట "అవతారపురుషుని గుండ కాక, ఏమానవుఁడును, దేవుని ఎప్పుడును సాక్షాత్కరించుకొని యుండ లేదు" అన్నాఁడు. నిజమే! అవతార పురుషునిలోఁ గాక మనము దేవుని ఎచట చూడఁగలము? మీయందును నాయందును అత్యం తాకించను లందును నికృష్టు లందును దేవుఁడు ఉన్నాఁడు అనుటయు, ప్రతిఫలించుచున్నాఁడు అనుటయు నిజమే. జ్యోతి స్పంచలనము (వైబ్రేషన్ ఆఫ్ లైట్) సర్వత్ర ఉన్నది; సర్వగతమై ఉన్నది, అయినను దీపపు వెలుఁగుననే మనము ఆ సంచలనమును గుర్తింపఁగలము. అట్లే దేవుఁడు విశ్వ మంతటను ఉన్నాఁడు. అయినను ఆయనను, భూమండలమున పెద్ద దీపస్తంభముల వంటి వారైన యీ భగవ దావిష్టులలోను దైవమూర్తులలోను దివ్యమానవులలోను అవతారపురుషులలోను ప్రతిఫలించినప్పుడే కాని, మనము సాక్షాత్కరించుకొన లేము.

దేవుఁడు ఉన్నాఁడు అని మనము అందఱమును ఎఱుఁగుదుము. కాని దేవుఁడు మనకు అగపడఁడు, దేవుని మనము అర్థముచేసికొలేము. దివ్య సందేశ జ్యోతిని వెలిఁగించిన యవతారపురుషులలో ఒకరిని పరిశీలింపుఁడు. ఆయన తత్త్వమును మీ భావవీధిలో రూపుగొన్న యాదర్శ దైవముతోఁ బోల్చిచూడుఁడు. మీరు భావించిన యాదర్శమునకంటె మీ దైవము తక్కువపడునే కాని అవతారపురుషుఁ డన్ననో మీయూహను మించియుండును. ఈ ప్రత్యక్ష మహావ్యక్తులు తమ యనుష్ఠానమున వాస్తవముగ సాధించి మనయెదుటఁ బెటిన యాదర్శ

ములను మించిన యాదర్శములను మీరు ఊహింపనైన లేరు. కాబట్టి అట్టివారిని ఆరాధించుట తప్పా? ఆదివ్యమానవుల పాదములంటి, లోకములో ఉన్న దివ్యులు వారే అని నమ్మి, ఆరాధించుట పాపమా? అవతారపురుషులు మనము ఊహించిన దైవస్వరూపమును యథార్థముగను వాస్తవముగను మించి యున్నప్పుడు, వారిని ఆరాధించుటవలన ఏమి కీడు మూడును? కీడు మూడ దనుటే కాదు, వాస్తవ మైన సుసాధ్య మైన యారాధనా ప్రకారము అదొక్కటే యగును. ప్రత్యేకించుటచేతగాని (ఆబ్స్ట్రాక్షన్), మీకు నచ్చిన వేఱొక మార్గము దేనిచేతగాని, మీ రెంత ప్రయత్నించినను, గిజగిజ తన్నుకొన్నను మీరు మానవులుగ ఉన్నంత వఱకును, మానవ లోకమున మీరు ఉన్నంతవఱకును, మీది మనుష్యప్రపంచమే, మీ మతము మనుష్యమతమే, మీ దైవము మనుష్యరూపియే. అది ఉండ వలసిన దట్లే. దుర్గ్రాహ్యమును అప్రధృష్యము నగు తత్త్వమును మాని వాస్తవమును అభిగమ్యము నైన తత్త్వమును ఆశ్రయించు వివేకము ఎవరికి లేకుండును? కావున సర్వ దేశ సర్వ కాలము లందును అవతారపుషల యారాధనము జరుగుచున్నది.

యూదుల యవతారమూర్తి మైన క్రైస్తు జీవితమును మనము ఇంచుక పరిశీలింపనున్నాము. క్రైస్తు అవతరించినప్పుడు యూదులు ఉండిన దశనే నేను రెండు పొంగులకు మధ్య ఉన్న క్రుంగుదశ అని పేర్కొంటిని, అది ప్రాతవానిని పట్టుకొని పీకులాడు దశ, మనస్సు ఒక్క అడుగై నను ముందునకు వేయలేనంతగా బడలిపోయి, ఉన్నదానిని భద్రపఱచుకొనుటలో మాత్రమే శ్రద్ధవహించు దశ, సమష్టి జీవిత మహా సమస్యలందు చూప వలసిన ఎక్కువ శ్రద్ధను అల్పములైన వ్యష్టివిషయాలలో చూపు దశ, పురోగతికంటె స్తబ్ధతయే ఎక్కువగ కనిపించు దశ, కర్తవ్యనిర్వాహణమును మించిన కష్టానుభవములు గలుగు దశ. మీరు ఒక్కసంగతిని గుర్తింప వలెను. అట్టిదశ ఒకదోషము అని నేను అనను. అనుటకు మనకు హక్కు లేనే లేదు. ఏల యన, ఈ పతనము లేకున్న, దీనికి అత్యనంతరకాలముననే క్రైస్తు వైభవ రూప మైన ఉచ్ఛ్రియము గలిగి ఉండదు. ఫారసీలలోను సద్దుసీలలోను దంభము ఎంతైన ఉండి ఉండ నిండు. వారు చేసిన వెల్ల అకార్యములే అగు గాక! వారు ధూర్తావతంసులే కానిండు! అట్టి వారు ఉన్నందుల ఫలితమే దివ్యసందేశ హారి యవతారము, ఒకవంక వీరు గల్గించిన ఉరవడియే వేఱొక వంక నాజరత్ నివాసి యైన యేసుదేవుని మహిష్ఠ మైన ప్రతిభను వెలార్చినది.

(సశేషము)

## ప్రకటన

మదరాసు మైలాపూరు ఆంధ్రమహిళాసభవారు తమ విద్యాలయ ముద్రణాలయ పారిశ్రామిక కేంద్రాలలో యోగ్యులైన మహిళలకు కొందఱికి హాస్టలువసతులు ఉచితముగ ఏర్పాటు చేయుదురు. దరఖాస్తులు 4 అణాల పోస్టుబిళ్లలతో జనవరి 25 వ తారీఖులోగా సభ సెక్రిటరికి అందవలెను.

# ప్రజ్ఞాపారమితాపిండార్థము

డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఎం. ఏ., ఎం. లిట్., పిఎచ్. డి.

మహాయానబౌద్ధులకు ప్రామాణికము లైన సూత్రములలో ప్రధాన మైనవి ప్రజ్ఞాపారమితలు. విజ్ఞానవాదులకు, శూన్యవాదులకు గూడ నివి ముఖ్య మైనవి. ప్రజ్ఞాశబ్దమునకు అద్వయజ్ఞాన మని అర్థము. ఈ జ్ఞానముయొక్క లోతును పొందుట అని ప్రజ్ఞాపారమితాశబ్దమున కర్థము. జ్ఞానముయొక్క లోతును పొందుట అనగా జ్ఞానముతో ఏక మగుట యని భావము. ఈ జ్ఞానైక్యమును సాధ్యముగా గ్రహించిన బౌద్ధులలో తుచ్ఛ మైన అభావమును పరమార్థ మని ప్రతిపాదించువా రుండ వీలు లేదు. అన్ని పారమితాగ్రంథములకు ఆధారభూత మైనది అష్టసాహస్రికా ప్రజ్ఞాపారమిత. మిగిలినవి దీనినే విస్తరించినవి. అష్టసాహస్రికలోని ప్రధానవిషయములను సంగ్రహముగా ఆచార్య దిఙ్నాగుడు తన ప్రజ్ఞాపారమితాపిండార్థసంగ్రహమున చెప్పినాడు. ఈ చిన్న గ్రంథము ననుసరించితి మేని పారమితలలోని ప్రధాన విషయములు మన కవగతములు కాగలవు. దీనిలో 58 కారికలు మాత్రమే గలవు.

## ప్రజ్ఞాపారమితా పిండార్థ సంగ్రహః

నమః ప్రజ్ఞాపారమితాయై

1. ప్రజ్ఞాపారమితా జ్ఞాన మద్వయం; సా తథాగతః
సాధ్యా; తాదర్థ్యయోగేన తాచ్ఛబ్ద్యం గ్రంథమార్గయోః.

2. ఆశ్రయ శ్చాధికార శ్చ, కర్మ, భావనయా సహ,
ప్రభేదో, లింగ మాప చ్చ సానుశంస ముదాహృతమ్.

3. శ్రద్ధావతాం ప్రవృత్త్యంగం శాస్తా, పర్ష చ్చ సాక్షిణీ,
దేశకాలౌ చ, నిర్దిష్టౌ స్వప్రామాణ్యప్రసిద్ధయే.

4. సంగీతి కర్తా లోకే హి దేశకా లోపలక్షితమ్
ససాక్షికం వద న్ వక్తా ప్రామాణ్య మధిగచ్ఛతి.

5. సర్వం చైతం నిపాతాత్మశ్రవణాదేః ప్రకీర్తనమ్
ప్రాసంగికం తు ఏ వారా; ముఖ్యా ద్వాత్రింశ దేవ హి.

6. ప్రభేదః షోడశాకారః శూన్యతాయా యథాక్రమమ్
నిర్దిష్టో ఽష్టసహస్ర్యాం స విజ్ఞేయో ఽన్యాపదేశతః.
7. ఇత్థ మష్టసహస్రీయ మన్యూనార్థై ర్యథోదితైః
గ్రంథసంక్షేప ఇష్టో ఽత్ర త ఏ వార్థా యథోదితాః.
8. బోధిసత్త్వం న పశ్యా మీ త్యుక్తవాం స్తత్త్వతో మునిః
భో క్త్రాధ్యాత్మికవస్తూనాం కథితా తేన శూన్యతా.
9. రూపం రూపస్వభావేన శూన్య మి త్యుక్తితః పునః
బాహ్యా న్యాయతనా నీహ భోగ్యాని ప్రతిషిద్ధవాన్.
10. రూపా ద్యభావే త ద్దేహ, ప్రతిష్ఠా, లక్షణక్షతిః
గతార్థా యేన త ద్దృష్టం త దాధ్యాత్మిక మి త్యసత్.
11. ఆధ్యాత్మికానాం శూన్యత్వే ప్రకృతే రపి శూన్యతా
విజ్ఞానరూపం గోత్రం హి కృపాప్రజ్ఞాత్మకంమతమ్.
12. నోత్పన్నో న నిరుద్ధో వా సత్త్వ ఇ త్యాదినా స్ఫుటమ్
త్వసంసారయోః కామం దర్శితా తేన శూన్యతా.
13. బుద్ధధర్మాం స్తథా బోధిసత్త్వధర్మా న్న పశ్యతి
ఇ త్యాదినా వినిర్దిష్టా శూన్యా దశబలాదయః.
14. ప్రతి ప్రతి యతో ధర్మాః కల్పితా ఇతి కీర్తితమ్
తతో న పరమార్థో ఽస్తి ధర్మాణా మితి చోక్తవాన్.
15. ఆ త్మాది దృష్టే రుచ్ఛేదం మహాత్మా ప్రకరోతి యత్
తతః పుద్గల నైరాత్మ్యం భగవాన్ సర్వథా జగౌ.
16. సర్వధర్మా అనుత్పన్నా ఇతి కీర్తయతా తథా
కథితం ధర్మనైరాత్మ్యం సర్వథా తత్త్వవేదినా.
17. సావద్యనిరవద్యానా మవృద్ధిపరిహానితః
సంస్కృతాసంస్కృతానాం చ కుశలానాం నిరాకృతిః.
18. కుశలానాం చ శూన్యత్వే తద్గతా ఽక్షతా తథా
కల్పి తై వేతి భేదానాం శూన్యతాయాః స సంగ్రహః.
19. దశభి శ్చిత్తవిక్షేపై శ్చిత్తం విక్షి ప్త మన్యతః
యోగ్యం భవతి బాలానాం నాద్వయ జ్ఞాన సాధనే.

20. తా నపాకర్తు మన్యోన్యం విపక్ష ప్రతిపక్షతః
ప్రజ్ఞాపారమితా గ్రంథః; తే చ సంపిండ్యదర్శితాః.

21. య దాహ బోధిసత్త్వః స న్నిత్యభావప్రకల్పనా
విక్షేపం విక్షిపన్ శాస్తా సాంవృత స్కంధ దర్శనాత్.

22. ఏతే నాష్టసహస్ర్యాదా వాదివాక్యా త్ప్రభృ త్యపి
ఆసమాప్తే ర్నిషేద్ధవ్యా విధినా ఽభావ కల్పనా.

23. హేతువాక్యాని నైతాని, కృత్యమాత్రం తు సూచ్యతే;
బ్రహ్మజా లాది సూత్రేషు జ్ఞేయాః సర్వత్ర యుక్తయః.

24. బోధిసత్త్వం న పశ్యామి అహ మి త్యాది విస్తరైః
నిరాకరోతి భగవాన్ భావసంకల్పవిభ్రమమ్.

25. య న్న పశ్యతి నామాపి న గోచరం క్రియాం తథా
స్కంధాం శ్చ సర్వత స్తేన బోధిసత్త్వం న పశ్యతి.

26. కల్పితస్య నిషేధో ఽయ మితి సంగ్రహదర్శనమ్
సర్వో జ్ఞేయతయా రూఢి ఆకారః కల్పితో మతౌ.

27. ప్రజ్ఞాపారమితాయాం హి త్రీన్ సమాశ్రిత్య దేశనా
కల్పితం, పరతంత్రం చ, పరినిష్పన్న మేవ చ.

28. నా స్తీ త్యాది పదైః సర్వం కల్పితం వినివార్యతే
మా యోప మాది దృష్టాంతైః పరతంత్రస్య దేశనా.

29. చతుర్ధా వ్యవదానేన పరినిష్పన్న కీర్తనమ్
ప్రజ్ఞాపారమితాయాం హి నాన్యా బుద్ధస్య దేశనా.

30. దశ సంకల్ప విక్షేప విపక్షే దేశనా క్రమే
త్రయాణా మిహ బోద్ధవ్యం సమస్త వ్యస్త కీర్తనమ్.

31. య థాది వాక్యే నిష్పన్న పరతంత్ర పరికల్పితైః
అభావకల్పనారూప విక్షేప వినివారణమ్.

32. తేన బుద్ధం తథా బోధిం న పశ్యా మీతి వాచకైః
ఆసమాప్తే రిహ జ్ఞేయా కల్పితానాం నిరాకృతిః.

33. శూన్యే రూపే స్వభావేన సమారోపః క్వ కేన వా
ఇ త్యన్యే ష్వపి వాక్యేషు బోద్ధవ్యం త న్నివారణమ్.

34. న హి శూన్యతయా శూన్య మితి వాక్యం వినిర్దిశన్
అపవాద వికల్పానాం నిరాసం సర్వ థోక్తవాన్.

35. మాయోపమ స్తథా బుద్ధః స స్వప్నోపమ ఇత్యపి
అయ మేవ క్రమో జ్ఞేయో విజ్ఞై ర్వ్యాఖ్యాంతరే ష్వపి.

36. సామానాధికరణ్యేన ప్రోక్తో మాయోపమో జినః
మాయోప మాది శబ్దై శ్చ పరతంత్రో నిగద్యతే.

37. పృథగ్జనానాం యజ్ జ్ఞానం ప్రకృతివ్యవదానికమ్
ఉక్తం త ద్బుద్ధ శబ్దేన; బోధిసత్త్వో యథా జినః.

38. నిజం స్వరూపం ప్రచ్ఛాద్య త దవిద్యావశీకృతమ్
మాయావ దన్యథా భాతి ఫలం స్వప్న ఇ వోజ్ఝతి.

39. అద్వయ స్యాన్యథా ఖ్యాతౌ ఫలే వా ప్యపవాదినామ్
అపవాదవికల్పానా మపవాదో ఒయ ముచ్యతే.

40. న రూపం శూన్యతా యుక్తా పరస్పరవిరోధతః
నీరూపా శూన్యతా, నామ, రూప మాకారసంగతమ్.

41. ఇ త్యేకత్వ వికల్పస్య బాధా నానాత్వకల్పనమ్
రుణద్ధి; నాన్య త్త ద్రూపం శూన్యతాయాః కథంచన.

42. అస దేవ యతః ఖ్యాతి త దవిద్యా వినిర్మితమ్
అస త్ఖ్యాపనశ క్త్యైవ సా ఒవి ద్యేతి నిగద్యతే.

43. ఇద మే వోచ్యతే రూపం ప్రజ్ఞాపారమి తేతి చ
అద్వయం ద్వయ మే వైత ద్వికల్పద్వయ బాధనమ్.

44. యుక్తిం చాహ విశుద్ధత్వా త్తథా చానుపలంభతః
భా వాభావ విరోధా చ్చ నానాత్వ మపి పశ్యతి.

45. నామ మాత్ర మిదం రూపం తత్త్వతో హ్యస్వభావకమ్
త త్స్వభావవికల్పానా మవకాశం నిరస్యతి.

46. రూపం రూపస్వభావేన శూన్యం య త్ప్రథ మోదితమ్
త త్స్వభావ సమారోప సంకల్ప ప్రతిషేధనమ్.

47. నోత్పాదం న నిరోధం చ ధర్మాణాం పశ్య తీతి యత్
భగవా నాహ త ద్వ్యస్తా త ద్విశేషస్య కల్పనా,

48. కృత్రిమం నామ, వాచ్యా శ్చ ధర్మా స్తే కల్పితా యతః
శబ్దార్థయో ర్న సంబంధ స్తేన స్వాభావికో మతః.

49. బా హ్యా ర్థాభినివేశ స్తు భ్రాంత్యా బాలస్య జృంభతే
త థైవ వ్యవహారో ఽయం న త్వ ర్థో ఽస్తి కశ్చన.

50. అత్ర తేన యథా నామ కల్ప్యతే న త థాస్తి తత్
వాచ్యం వస్తు తతో నిష్ఠా యథా నా మార్థ కల్పనా.

51. ప్రజ్ఞాపారమితా, బుద్ధో, బోధిసత్త్వో ఽపి వా తథా
నామమాత్ర మితి ప్రాహ వ్యసన్ సత్యార్థకల్పనమ్.

52. శ బ్దార్థ ప్రతిషేధో ఽయం, న వస్తు వినివార్యతే
ఏవ మన్యే ష్వపి జ్ఞేయో వాక్యే ష్వర్థవినిశ్చయః.

53. నై వోపలభతే సమ్య క్సర్వ నామాని తత్త్వవిత్
యథార్థత్వేన తే నేదం న ధ్వనే ర్వినివారణమ్.

54. సుభూతి స్తు ద్వయం వ్యసన్ శబ్దం శబ్దార్థ మేవ చ
బోధిసత్త్వస్య నో నామ పశ్యా మీతి స ఉక్తవాన్.

55. ప్రజ్ఞాపారమితా వాక్యం నాస్తి య న్నేయతా గతమ్
ఊహ్యా స్తు కేవలం తే ఽర్థాః విదుషా సూక్ష్మయా ధియా.

56. ప్రక్రాం తార్థ తిరస్కారో యా చార్థాంతర కల్పనా
ప్రజ్ఞాపారమితాయాం హి ప్రోక్తా సా ప్రతివర్ణికా.

57. ఏతావా నర్థ సంక్షేపః ప్రజ్ఞాపారమి తాశ్రయః
ఆవర్త్యతే స ఏ వార్థః పున ర ర్థాంత రాశ్రితః.

58. ప్రజ్ఞాపారమితాం సమ్య క్సంగృ హ్యాష్టసహస్రికామ్
య త్పుణ్య మాప్తం తే నాస్తు ప్రజ్ఞాపారమితో జనః.

ఇ త్యాచార్య దిఙ్నాగపాదానాం ప్రజ్ఞాపారమితాపిండార్థసంగ్రహః సమాప్తః

## [ వివరణ ]

# ప్రజ్ఞాపారమితా పిండార్థసంగ్రహము

### ప్రజ్ఞాపారమితకు నమస్కారము

1. ప్రజ్ఞయొక్క లోతును చేరగా కలుగు జ్ఞానము గ్రాహ్యగ్రాహకముల కతీత మైన లోకోత్తర జ్ఞానము. ఇందు ప్రమాతృ ప్రమేయాది ద్వైత ప్రసక్తి లేదు గనుక నీ జ్ఞానము అద్వయము. ఈ అద్వయజ్ఞానమే తథాగత శబ్దవాచ్యము. బోధిసత్త్వు డీ జ్ఞానావగతిని సాధింప వలెను. ఈజ్ఞానమును వివరించు గ్రంథ పరముగను, నిర్వాణమార్గపరముగను కూడ ప్రజ్ఞాపారమిత యను శబ్దమున కర్థములను చెప్ప వలెను. నిర్విశేషము, అసంగము నగు జ్ఞానము తత్త్వము.

2. ఈజ్ఞానమునకు చెందిన ఆశ్రయము, అధికారి, కర్మ, భావన, విభేదములు, తార్కికమగు మననము, దోషములు, ఉపకరించు సన్నివేశములు అనున వన్నియు ప్రజ్ఞాపారమితలో చక్కగా వివరింపబడినవి.

3. శ్రద్ధగలవారిని దీనియందు ప్రవర్తింప జేయువాడు బుద్ధుడు, బౌద్ధపరిషత్తు దీనికిసాక్షి. స్వప్రామాణ్యప్రసిద్ధికై దేశకాలము లిచట నిర్దేశింపబడినవి.

4. సభలో జరిగిన విషయములను సరిగా వ్రాసియుంచువాడు, సంగీతికర్త. ఇతడు వ్రాయున దంతయు 'ఈరీతిగా వింటిని' అను మాటలతో నారంభ మగును గనుక ఆవ్రాతలు సాక్ష్యముపై ఆధారపడిన వని తెలియ నగును. కావుననే ఏస్థలమున, ఏకాలమున బుద్ధుడిట్లనెనో స్పష్టముగా ప్రతిఉపదేశమునందు చెప్పబడుచున్నది. తద్ద్వారా ఈరచనలు ప్రామాణికము లగుచున్నవి.

5. 'ఈరీతిగా వింటిని' అని మొదలుగా గల వాక్యములు ప్రాసంగికవాక్యములే గాని, ప్రధానములు గావు. ప్రజ్ఞాపారమితలలో చెప్పబడిన ముఖ్యోపదేశములు ముప్పదిరెండు మాత్రమే.

6. శూన్యత పదునారు విధముల గల దని వరుసగా వివరింపబడినది. ఇది స్పష్టముగా చెప్పబడక, ధ్వనింపబడియున్నది. దీనిని అష్టసాహస్రికాప్రజ్ఞాపారమితనుండి తెలిసికొన నగును.

7. అష్టసాహస్రికాప్రజ్ఞాపారమితలో సంక్షిప్తము కాకుండ చెప్పబడిన విషయములను సంక్షేపింపవలసియున్నది గనుక అందలి ముఖ్య విషయములను చెప్పబోవు చున్నాము.

8. ఈకారికనుంచి పదునెన్మిదవకారికవరకు పదునారు విధముల శూన్యతలు మొదట చెప్పబడుచున్నవి. 'బోధిసత్త్వుని నేను చూచుట లేదు' అని బుద్ధుడు తత్త్వమును చెప్పుచు అధ్యాత్మశూన్యతను పల్కినాడు. భోక్త, కర్త, ప్రమాత యగు జీవుడు పరమార్థసత్యము కాదని అష్టసాహస్రికలో గలదు (పుటలు 4, 25).

9. రూపములో, రూపస్వభావము లే దని అష్టసాహస్రిక (పుట 10). రూపములో రూపస్వభావ మున్నచో మనకు కన్పించు రూపమును రూప మని పిలువ రాదు. బాహ్యముగా భోగ్య వస్తువులుగా కన్పించు ఈ ఆయతనములు వస్తుతః లేవు గనుక ఇది బహిర్ధాశూన్యత.

10. రూపము మొదలైనవి లేనిచో వాని దేహము, అవి యుండు ప్రదేశము లేక ఆకాశము, గుణములు ఉండ జాలవు. వస్తువుయొక్క దేహము దాని ఆకారము. ఈశూన్యతను తెలిసికొనినవానికి తన ఆధ్యాత్మిక స్వరూపము కూడ అసద్వస్తువుగా భాసింప గలదు. కనుక దేహము, దేశము (=ఆకాశము), గుణములు, అధ్యాత్మము అను నాలుగును శూన్యములే కాగలవు.

11. ఆధ్యాత్మికవిషయములు శూన్యములైనపుడు ప్రకృతికూడ శూన్యమే కాగలదు మన మే ఆధ్యాత్మికవంశమునకు చెందినవారమో, ఆ వంశము విజ్ఞానరూపము. ఇది కరుణను, ప్రజ్ఞను తీసికొని వచ్చునది. ఈ వంశమే ప్రకృతి. ఇచట ప్రకృతిశూన్యత చెప్పబడినది.

12. ప్రాణులు పుట్టుట గాని చనిపోవుట గాని లేనే లే దని యనుట అత్యంతశూన్యత. సంసారమున కాద్యంతములు లే వని చెప్పుట అనవరాగ్రశూన్యత. సర్వధర్మములు అజాతములు, అనిర్జాతములు నని అష్టసాహస్రిక (పుట 11).

13. బుద్ధధర్మములు, బోధిసత్త్వధర్మములు కనిపించుట లేదు. దశబలములు మొదలైనవి కూడ నింతే యని సర్వధర్మశూన్యత చెప్పబడినది.

14. ప్రతిధర్మము కల్పిత మని చెప్పబడుటచే ధర్మములకు పరమార్థసత్యము లే దని పరమార్థశూన్యత చెప్పబడినది (పుట 15).

15. ఆత్మ ఉన్న దని ప్రతిపాదించు దర్శన సిద్ధాంతములు నిర్మూలింపబడుటచే భగవానుడు పుద్గలనైరాత్మ్యమును ప్రతిపాదించినాడు. ంచస్కంధములతో కూడి యున్న జీవిని పుద్గలు డందురు. ఈ పుద్గలనైరాత్మ్యమే అభావశూన్యత.

16. సర్వధర్మములు అనుత్పన్నము లని చెప్పుటచే తత్త్వవేత్త యగు బుద్ధుడు ధర్మనైరాత్మ్యమును ప్రతిపాదించినాడు. ఇది అభావస్వభావశూన్యత.

17. దోషసహితము లగు సంస్కృతధర్మములు, దోషరహితము లగు అసంస్కృతధర్మములు పెరుగవు, తరుగవు. ఈ రెండు విధముల కుశలధర్మములు లే వని భావము. దీనితో సంస్కృతశూన్యత, అసంస్కృతశూన్యత వచ్చుచున్నవి.

18. కుశలధర్మములు శూన్యములైనచో, నాశము లేని వని చెప్పబడునవి కూడ కల్పితములే కాగలవు. ఇది అనవకారశూన్యత. ఈ రీతిగా శూన్యతయొక్క విభేదములు చెప్పబడినవి.

19. మనస్సును విక్షిప్తముచేసి అనవసరమైన వానిపై త్రిప్పునవి విక్షేపములు. ఈ కారికనుండి చివరవరకు విక్షేపములు చెప్పబడుచున్నవి. ఇవి పది రకములు. అద్వయజ్ఞానమునుంచి చిత్తమును మరల్చునవి దశవిక్షేపములు. అద్వయజ్ఞానమును సాధించుట కీ విక్షేపములు ఉపయోగింపవు.

20. ఈ విక్షేపములను పారద్రోలుటకు వీనికంటె భిన్నమైన వానిని చిత్తము ముందుంచుటకు ఈ ప్రజ్ఞాపారమితాగ్రంథము బయలుదేరినది. ఈ విక్షేపములను సంక్షిప్తముగా చెప్పుచున్నాము.

21, 22, 23. ఈ మూడు కారికలలో అభావవిక్షేపము చెప్పబడినది.

21. వ్యావహారికజగత్తులో పంచస్కంధాలతో నున్న ప్రాణిని సద్వస్తువుగా వ్యవహరించుచున్నాము. బోధిసత్త్వుడు పారమార్థికముగా లేకున్నను, ఉన్నాడని అభావవస్తువు భావపదార్థముగా బుద్ధునిచే కల్పింపబడినది. వ్యావహారిక మైన స్కంధముల నాశ్రయించుకొని వచ్చిన దీ విక్షేపము.

22. అష్టసాహస్రికా ప్రజ్ఞాపారమితలో మొదటి వాక్యము మొదలుకొని చివరదాక, ఈ అభావకల్పనను విధిగా నిషేధింపవలెను.

23. ఇందలి వాక్యములు హేతువులను దెలుపు వాక్యములు కావు. చేయవలసిన పనిని మాత్రమే సూచించునవివి. బ్రహ్మజాలసూత్రము మొదలగు సూత్రములలో ప్రతిచోట ఈ యుక్తులను తెలియ నగును.

24 నుంచి 32 వ కారికవరకు రెండవది యగు భావవిక్షేపము చెప్పబడుచున్నది.

24. 'బోధిసత్త్వుని నేను చూచుట లేదు' అని అనేకపర్యాయములు భగవానుడు పల్కుచు బోధిసత్త్వు డున్నా డను భావవస్తువు తెచ్చు విభ్రమమును వారించినాడు.

25. పేరు, క్రియ, స్కంధములు అను నవి ఎచ్చటను కన్పింపకపోవుటచే బోధిసత్త్వుని భగవానుడు చూడజాలక పోయినాడు.

26. ఇది కల్పితమైన వస్తువును లే దని చెప్పుట. సమస్తవిషయజాతము తెలిసికొనబడునదిగా కల్పింపబడి చిత్తమున ఆరోపింపబడి యున్నది.

27. కల్పితము, పరతంత్రము, పరినిష్పన్నము అను మూడు ఆకారములను ఆశ్రయించి ప్రజ్ఞాపారమిత తత్త్వమునుపదేశింప ఆరంభించినది. ఈ మూటియొక్క స్వరూపస్వభావములను త్రిస్వభావనిర్దేశవివరణలో వెనుక చెప్పియున్నాము.

గ్రాహ్యగ్రాహకము లున్న వను బుద్ధినుంచి బయలుదేరి, బాహ్యముగా ఏ వస్తువు ఆరోపింపబడుచున్నదో అది కల్పితము. అజ్ఞానముచే ద్వైతజగత్తును భావించుటలో ఈ జగము పరతంత్ర మగుచున్నది. ఈ ద్వైతమును వదలగా కలుగు పరిశుద్ధ మైన జ్ఞానమే పరినిష్పన్నము

28. కల్పిత మైన సర్పమును తర్వాత నిషేధించుచు అది రజ్జు వని తెలసికొనుచున్నాము ఈ నిషేధమే కల్పితవస్తువు సత్యము దని చెప్పుచున్నది. మాయ, గంధర్వనగరము, ఎండమావి మొదలుగా గల దృష్టాంతముల ద్వారా వివేచింపబడు ద్వైతజగము పరతంత్ర మని చెప్పబడినది.

29. నాలుగు తెరగుల కన్పించు వ్యవదానము ద్వారా పరినిష్పన్నము చెప్పబడినది. ఇంతకంటె భిన్నమైన బుద్ధుని ఉపదేశము ప్రజ్ఞాపారమితలో కన్పింపదు. పరిశుభ్రపరచుటను వ్యవదాన మందురు. సకలప్రాణులు, ధర్మములు కూడ తథాగతునివలె స్వభావశూన్యము లని చెప్పుట ప్రకృతివ్యవదానము. విరుద్ధవిషయములను భావనజేయుచున్న యోగికి కలుగు అద్వయజ్ఞానమును వైమల్యవ్యవదాన మందురు. ప్రజ్ఞ యనబడు అద్వయజ్ఞానోపదేశమే ఆలంబనవ్యవదానము. సర్వధర్మములు తథత యను పరమార్థముతో సదృశ మైన వని తెలుపునది సాపక్ష్యవ్యవదానము.

30. సంకల్పవిక్షేపములకు విరుద్ధము లగు పదింటిని ఉపదేశించు సందర్భమున మూడింటియొక్క సమష్టిస్వరూపమును వ్యష్టిస్వరూపమును మాత్రమే తెలసికొనవలెను.

31. పరినిష్పన్న, పరతంత్ర, పరికల్పితము లను మూడువిధములు అభావకల్పనా రూపము లైన విక్షేపము లని, వీనిని నివారింప దలచి అష్టసాహస్రికలో మొదటి వాక్యము చెప్ప బడినది. ఈత్రిస్వభావములు ఉన్న వని పల్కు టచే అత్యంతాభావ మున్న దని చెప్పుట వీలుపడదు.

32. 'బుద్ధుని, బోధినికూడ నేను చూచుట లేదు' అను మాటల ద్వారా గ్రంథమంతయు కల్పితసత్యమును నిరాకరింప వచ్చినదని తెలియ నగును.

33. మూడవది అధ్యారోపవిక్షేపము. రూప స్వభావము లేనిదానియందు రూపము నెవరు, ఎక్కడ ఆరోపింపగలరు? ఇట్టి వాక్యములలో ఆరోపిత మైనది నివారింపబడినది. పరమార్థ దృష్ట్యా ఏదియు స్వస్వభావముతో లేదు గనుక పరికల్పితపరతంత్రములను నివారింప నక్కర లేదు. అందుచేతనే ఈనివారణలో శూన్యతయే ప్రస్ఫుటముగ తీసికొనిరాబడినది.

34 నుండి 39 వరకు. అధ్యారోప విక్షేప మైన తర్వాత వచ్చు అపవాదవిక్షేప మీాకారి కలలో చెప్పబడుచున్నది.

34. శూన్యత్వ మను లక్షణము కల్గియుండు టచే నేదియు శూన్య మగుట లేదని చెప్పుచు అపవాదవికల్పములను భగవానుడు నిరసించి నాడు.

35. బుద్ధుడు మాయవంటివాడు, స్వప్నము వంటివాడు అని చెప్పబడిన రీతిగనే ఇతరవాక్య ములను సహితము విజ్ఞుడు గ్రహింపవలెను. అద్వయజ్ఞానమే బుద్ధుడు. ఈజ్ఞానము ప్రతి ఆత్మయందు అవిద్యావృతమై యున్నది.

36. బుద్ధుడు అద్వయజ్ఞానమే యగుటచే మాయవంటివా డని చెప్పబడినది. మాయోప మాది శబ్దముల ద్వారా వివరింపబడునది పర తంత్రస్వభావము. సర్వము శూన్య మనిచెప్పుట సత్యము కాదు. అద్వయజ్ఞాన మైన బుద్ధుడే ప్రతి ప్రాణియందు గల ఆత్మ.

37. స్వతఃసిద్ధముగా శుద్ధ మైన ఏ జ్ఞానము సామాన్యజనులలో గలదో అదే బుద్ధు డను పేరుతో పిలువబడునది. బోధిసత్త్వుడు బుద్ధు డనియే తెలిసికొనబడుచున్నాడు గదా!

38. నిజస్వరూపము కప్పివేయబడగా ప్రతి ప్రాణియు అవిద్యకు వశమగుచున్నాడు. తద్ద్వారా మాయవలె అన్యథాభావము వచ్చు చున్నది. కలలో భాసించినది మేల్కొనగనే మనకు లభించుట లేదు. ఇట్లే ఆత్మస్వరూపము యథాతథముగా అవిద్యాదశలో గోచరింపక, వేరొక రీతిగా, మాంత్రికుని ఇంద్రజాలములోని ఫలపుష్పాదులవలె భాసించును. అప్పుడు గ్రా హ్యగ్రాహకాదిభేదములు బయలుదేరుచున్నవి. సత్య మైన జ్ఞానము కల్గినపుడు వ్యవహార మను నిద్రనుండి మేల్కొనుచున్నాము. అప్పుడీ నిద్రలో వచ్చిన కలలోని ద్వైతప్రసక్తి కన్పిం పనే కన్పింపదు.

39. అద్వయజ్ఞానమునకు అన్యథాభావము వ్యవహారదశలో నున్నది. ఈదశలో కన్పించు గ్రాహ్యగ్రాహకాది ద్వైతఫలము పరమార్థ స్థితిలో నిరుద్ధ మగు చున్నది. ఇది అపవాద వికల్పనిరాస యని పిలువబడును.

40. ఏకత్వవిక్షేపము ఐదవది. రూపమును శూన్యత యని చెప్పుటలో పరస్పరవిరోధ మున్నది. మన ఎదుట భాసించు రూపమును లేదన లేము. రూపము, శూన్యత అనునవి అభిన్నములు కాజాలవు. రూపరహిత మైనది శూన్యత. ఆకారము గల వస్తువు నామ రూపాత్మకము.

41 నుండి 44 వరకు. ఆరవది యగు నానాత్వవిక్షేప మీ కారికలలో చెప్పబడుచున్నది.

41. ఏకత్వవికల్పము కుదరదు గనుక నానాత్వమును కల్పించుటగూడ పొసగ జాలదు. ఏవిధముగా చూచినను శూన్యతకంటె రూపము విలక్షణ మని చెప్ప వీలు లేదు. ఈరెండు విలక్షణము లైనచో ద్వైతప్రసక్తి రాగలదు. కాని అద్వయమే తత్త్వ మగుటచే రూపము, శూన్యత అను నవి విలక్షణము లైనవి కాజాలవు.

42. అసద్వస్తువు అవిద్యావశముననే భాసించుచున్నది. అసద్వస్తువును భాసింపజేయు శక్తినే అవిద్య యని యందురు.

43. దీనినే రూపమని, ప్రజ్ఞాపారమిత యని కూడ పిలుతురు. ఈరెండును ఏకమే. వికల్పద్వయమునకు బాధ గొల్పున దీ అద్వయ తత్త్వము. ద్వైతముగా భాసించునది వాస్తవముగా అద్వైతమే.

44. అద్వయతత్త్వము విశుద్ధ మగుటచేతను, ప్రత్యక్షప్రతీతి కతీత మైన దగుటచేతను, భావాభావవిరోధమువలనను నానాత్వము వాస్తవముగా నుండ వీలు లేదని యుక్తి చెప్పబడినది. వికల్ప రహిత మైన జ్ఞానము విక్షేపములకు విరోధి. ఈజ్ఞానము ప్రకృతి ప్రభాస్వర మగుటచే శుద్ధ మైనది. ఏకత్వాదికము వస్తువు కాక పోవుటచే నిది ప్రత్యక్షప్రతీతికి అతీత మైనది.

45, 46. ఏడవది యగు స్వభావ విక్షేప మీ కారికలలో చెప్పబడినది.

45. నామ మాత్ర మైన ఈ రూపము స్వస్వభావరహితము. దీనికి స్వభావ మొకటి గల దను వికల్పమును పారమితలు నిరసించుచున్నవి. రూపము నాశ్రయించుకొని వచ్చు నామమున పరభావమే గాని, స్వస్వభావము లేదు.

46. రూపమున రూపస్వభావము శూన్య మని మొదటనే చెప్పబడినది. రూపస్వభావము నారోపించు కల్పనను పారమితలు నిషేధించుచున్నవి.

47. విశేషవిక్షేప మెనిమిదవది. ధర్మములకు ఉత్పాదనిరోధములు కన్పించుట లే దని భగవానుడు పల్కుటచే విశేషకల్పన నిరర్థక మని తెలుచున్నది. విశిష్టప్రతిభాసయే ఉండ వీలు లేదు.

48, 49, 50 ఈమూడుకారికలలో తొమ్మిదవది యగు యథానామార్థాభినివేశవిక్షేపము వివరింపబడుచున్నది. వస్తువులకు, వానిపేర్లకు గల సంబంధమును విచారించున దీ విక్షేపము.

48. మనచే కల్పింపబడి సృష్టింపబడినది పేరు. వాచ్యము లైన ధర్మములు కల్పితము లగుటచే, వానిపేర్లుకూడ కల్పితములే కాగలవు. కావున శబ్దార్థముల సంబంధము స్వాభావికసంబంధము కాజాలదు.

49. బాహ్యముగాగల వస్తువులపై మమత, వివేకము లేనివారికి భ్రాంతివశమున ఎక్కువగా నున్నది. వ్యావహారికజీవితముకూడ ఈ భ్రాంతి మూలకమే. బాహ్యముగా వస్తు వేమియు లేదు.

50. మన మెట్లు పేరును కల్పించుచున్నామో అట్లు వాచ్యమగు వస్తువే లేదు. ఇది యథానామార్థాభినివేశవిక్షేపము.

51 నుంచి 58 వరకు. ఈ కారికలలో పదియవ దగు యథార్థనామాభినివేశవిక్షేపము వివరింపబడుచున్నది.

51. ప్రజ్ఞాపారమిత, బుద్ధుడు, బోధిసత్త్వుడు అనున వన్నియు నామమాత్రములే యని భగవాను డనినాడు. ఈరీతిగా బాహ్యముగా సద్వస్తువు లున్న వను కల్పనను నిషేధించినాడు.

52. ఇది కేవలము శబ్దార్థప్రతిషేధమే. దీని వలన పరమార్థవస్తువు నివారింపబడుట లేదు. ఇట్లే ఇతరవాక్యములను గూడ యోజింపవలెను.

53. తత్త్వవేత్తకు చక్కగా సర్వనామములు యథార్థములుగా ఉపలబ్ధము లగుట లేదు. కావున ఇది కేవలము శబ్దములను నిషేధించుట గాదు. శబ్దములకు వ్యావహారికార్థము లుండవే లున్నది. ఈశబ్దములు సూచించు వస్తువుల అస్తిత్వమే ఇచట నిషిద్ధ మని తెలియనగును.

54. శబ్దమును, శబ్దార్థమును రెంటెని నిషేధించుచు బోధిసత్త్వుని పేరును నేను కాంచుట లేదని సుభూతి అష్టసాహస్రికలో (పుట 25) పల్కినాడు.

55. ఈ రీతిగా, ఈపద్ధతిలో అవగాహన చేసికొనబడజాలని వాక్య మేదియు ప్రజ్ఞాపారమితలో లేదు. సూక్ష్మబుద్ధి గల విద్వాంసులు ఆయాభిన్నార్థముల నీ రీతిగా గ్రహింపవలెను.

56. ప్రజ్ఞాపారమితలో చెప్పబడిన వాదములను తిరస్కరించి వేసినను, ఆవాక్యములకు భిన్నార్థములను కల్పించినను ప్రజ్ఞాపారమిత యొక్క నకలుమాత్రమే మనకు లభింపగలదు. దాని నిజస్వరూప మప్పు డవగతముకాజాలదు.

57. ఇంతవరకు చెప్పిన అర్థసంక్షేపము ప్రజ్ఞాపారమిత నాశ్రయించుకొని వచ్చినది. అర్థాంతరము నాశ్రయించుకొని వివేచించినను ఇదే అర్థము మరల రాగలదు.

58. అష్టసాహస్రికా ప్రజ్ఞాపారమితను చక్కగా గ్రహించినప్పుడు కలుగు పుణ్యము వలన ఆ మానవుడు ప్రజ్ఞయొక్క లోతును పొందు గాక !

ఇది ఆచార్య దిఙ్నాగుడు రచించిన ప్రజ్ఞాపారమితాపిండార్థ సంగ్రహము.

## అనుబంధము

ఈకారికలను షేషు అను నాతడు క్రీ. శ. 980 లో చీనాభాషలోని కనువదించినాడు. వసుబంధువుయొక్క శిష్యుడు, దిఙ్నాగుని స్నేహితుడు నగు త్రిరత్నదాసపండితు డీ కారికలను వ్యాఖ్యానించెను. ఇతడే జాతకమాలను రచించిన ఆర్యశూరు డని కొందరు భోటదేశీయులనినారు. మైత్రేయనాథుడు రచించిన మధ్యాంతవిభాగశాస్త్రము, దానిపై వసుబంధువు వ్రాసిన భాష్యము, ఈభాష్యముపై స్థిరమతి చెప్పిన టీక అను మూడుగ్రంథములను చాలవర కీ కారికలలో దిఙ్నాగు డనుసరించినాడు. దిఙ్నాగుని పదవకారికకు

'భోక్తృ భోజన తద్దేహ
ప్రతిష్ఠా వస్తు శూన్యతా'

అను మధ్యాంత విభాగమందలి పదునేడవకారిక ఆధారము. కాని దిఙ్నాగుడు అష్టసాహస్రికనే యథాక్రమముగా అనుసరించినాడు. దశవికల్ప విక్షేపములను వివరించు సందర్భమున అసంగుని మహాయానసూత్రాలంకారమును, మహాయాన సంగ్రహశాస్త్రమును దిఙ్నాగు డనుసరించినట్లు కన్పించుచున్నది.

# మహాప్రభు వల్లభాచార్యులు

## శ్రీ కర్ణ రాజశేషగిరిరావుగారు, ఎం.ఏ.

(నవంబరు సంచిక తరువాయి)

ఉపర్యుక్త వాక్యంబులను నమ్మి వల్లభాచార్యుడు బ్రహ్మసంబంధము - ఆత్మనివేదన ప్రణాళిక నేర్పఱచెను. నేటివఱకీ మూల సూత్రమే యాధారము. అజ్ఞాన వశంబున నెవ డైన దీనిని దురుపయోగ మొనరించిన వాడు వల్లభుని మతవిరుద్ధాచరణ మొనరించినవాడగును.

ఈ మార్గమున సర్వస్వము నర్పించు విధాన మున్నది; సాధకుడు నిజసర్వోత్తమ, సర్వ ప్రియ వస్తువును భగవచ్చరణంబులందు నర్పించుటకు వెనుకంజ వేయడు. అధికారి కృష్ణదాసుని సుందరి వేశ్యను శ్రీనాథుని కర్పించుట యందీ రహస్యమే దృగ్గోచర మగుచున్నది. ఈ యాచరణము సాధనమార్గమునందు సర్వోచ్చావస్థను బొందినపుడే సంభవము.

### సన్న్యాసవైరాగ్యములు

విష్ణుస్వామి, వల్లభాచార్యు లిరువురు నంతిమ సమయమందు సన్న్యాసమును స్వీకరించిరి. కాని వారి సన్న్యాసస్వరూపములందు భేదము కలదు. నివృత్తియును, జ్ఞానమార్గఅనుచరులందే వైరాగ్యము, సన్న్యాసము ప్రచలితమో దానికిని, పుష్టిమార్గీయసన్న్యాసమునకు భేద మున్నది. వల్లభాచార్యులు 'భక్తివర్ధినీ' సన్న్యాసనిర్ణయమునందు దీని వివేచనమును గావించిరి.

సన్న్యాసవిషయములగుఱించి భక్తివర్ధిని యందిట్లు వ్రాసిరి — ఇంటిలో నున్నప్పుడు గృహయజమాని సాధనాభక్తి ననుసరించి యాశ్రమధర్మపాలనమును తదుపరి యొనరింప వలెను. కాని తన, మన, ధనములతో ప్రభు సేవ నొనరించుట యత్యావశ్యకము. ఈ రీతి నభ్యసించుట వలన లౌకికవిషయములందు మనస్సు సంలగ్నము గాక, ఈశ్వరునిప్రేమ యందనురక్తి పెంపొందును. ప్రభులీన మైనపుడు లౌకికవిషయములు తనంతట తాను లుప్తమగును. సాధకుడు నిర్లిప్తావస్థయందు గృహత్యాగ మొనరించి సన్న్యాసమును గ్రహింప వలెను. సన్న్యసించినను సాధుసాంగత్యము, ప్రభుసేవయందు భక్తుడుండవలెను. 'సన్న్యాస నిర్ణయ' గ్రంథమునందు సన్న్యాసముయొక్క ఆవశ్యకతానావశ్యతలను గుఱించి వర్ణించిరి. వీరి మతానుసారము ప్రభుప్రేమప్రాప్తియందు పుత్రకళత్రాదిగృహబంధనములు బాధకము లైన నింటియందే సాధనములు లేనియప్పుడు సన్న్యసించుట యుక్తము. కాని సన్న్యసించి దండకమండలము, బాహ్యావేషధారణ మొన రింప వలసిన యగత్యము లేదు.

'అష్టఛాప' కవులందు విరక్తులు, గృహస్థులు కలరు. కాని వారు లౌకికవిషయములను గూర్చి నిర్లిప్తముగను, ననాసక్తభావముతో శ్రీనాథుని కీర్తనసేవ చేయుదురు. సూరదాసు ప్రారంభము

నుండి విరక్తుడు. పరమానందదాసు, కృష్ణదాసు జీవితపర్యంత మవివాహితులు. గోవిందస్వామి, ఛీతస్వామి, నందదాసు ప్రారంభిక జీవితమునందు గృహస్థులు; తదుపరి విరక్తులు. కుంభనదాసు, చతుర్భుజదాసు జీవితపర్యంతము గృహస్థులు. ఇవ్విధంబున 'అష్టఛాప' మహాకవులు వేషములను బరిపరి మార్పకుండ విరక్తి భావంబున సేవాభక్తి నొనరించుచుండిరి.

## పుష్టిసంప్రదాయగ్రంథములు

భారతీయధర్మాచార్యులు నిజనిజమతములకు ప్రస్థానత్రయంబును — ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, గీత — ఆధారముచేసికొనిరి. ఈ గ్రంథములందు సంసిద్ధమైన మతము ప్రామాణికము; అందువలన ప్రముఖధర్మాచార్యులు సిద్ధాంతసమర్థనమునకు ప్రోక్త గ్రంథముల భాష్యములను వ్రాయుచుండిరి. పుష్టిసంప్రదాయమునందు ప్రస్థానత్రయము మాన్యమైనది; కాని భాగవతగ్రంథమును గూడ నాధారముగ దీసికొనిరి. వాస్తవిక దృష్టితో నవలోకించిన నీ సంప్రదాయము భాగవతముపయి విశేషరూపంబున నాధారపడియున్నది. సంప్రదాయ నామకరణాదిప్రేరేపణము గూడ భాగవతముపై నాధారపడియున్నది. అన్యవైష్ణవాచార్యులవలె వల్లభాచార్యులు భాగవతమునకు విశేషస్థానము నిచ్చిరి. వారు దానిని భగవానుడు వేదవ్యాసుని 'సమాధిభాష' యని చెప్పుదురు. ఈ విధంబున పూర్వాచార్యమాన్యంబు లగు ప్రస్థానత్రయంబుతో భాగవతమును సమ్మిళితపఱచి ప్రస్థానచతుష్టయమందురు. ఈ ప్రస్థానచతుష్టయమే పుష్టిసంప్రదాయమునకు ప్రమాణగ్రంథములు.

మహాప్రభు వల్లభాచార్యుడు, పరవర్తి విద్వాంసులు ప్రస్థానచతుష్టయముపై భాష్యములను, టీకాటిప్పణులను రచించి పుష్టి సంప్రదాయసిద్ధాంతములను పుష్ట మొనరించిరి. వల్లభాచార్యకృత బ్రహ్మసూత్రములయొక్క 'అణుభాష్యము', భాగవతముయొక్క 'సుబోధినీ' టీక, వారి యన్యరచనలు పుష్టిసంప్రదాయమునందు ప్రమాణగ్రంథములు. గోస్వామివిఠలనాథకృత 'విద్వన్మండనము' సాంప్రదాయిక సిద్ధాంతములను స్పష్టించిన ప్రముఖగ్రంథము; దీని గూఢభావములను వ్యక్తపఱచుటకు గోస్వామి పురుషోత్తమాచార్యులు 'సువర్ణసూత్రము'లను రచించిరి.

గోస్వామివిఠలనాథుని చతుర్థపుత్రుడు గోకులనాథుడు, వారి పౌత్రుడు హరిరాయుడు — ఈసంప్రదాయమునందలి సుప్రసిద్ధవిద్వాంసులు. వారు నిజరచనలరూపంబున సంప్రదాయముయొక్క తాత్త్విక లౌకిక పక్ష స్పష్టీకరణను వివేచనము గావించిరి. వారి తరువాత సంప్రదాయ ప్రముఖవిద్వాంసులు శ్రీ గోపేశ్వరులు, శ్రీ పురుషోత్తములు నిజపాండిత్యపూర్ణగ్రంథముల భాష్యంబుల సాయంబున పుష్టిసంప్రదాయమున కనుపమ సేవ గావించిరి.

ఉపర్యుక్తగ్రంథము లన్నియును సంస్కృతభాషయం దున్నవి. గోస్వామి గోకులనాథకృత 'వ్రజభాషాగద్యవార్తా' పుస్తకములు మఱియు వారిమీద హరిరాయకృత 'భావప్రకాశ' నామక టిప్పణి పుష్టిసంప్రదాయమునకు ప్రమాణగ్రంథములు.

(సశేషము)

# అద్వైతమతము

విద్వాన్ చదలువాడ జయరామశాస్త్రిగారు

## 1. మోక్షము నిత్యము

ఈజగమునందుఁ గల మానవు లెల్లరేదే నొక ముఖ్యమగు పురుషార్థమును బొందుటకై ప్రయత్నించుచుందురు గదా. అవి ధర్మార్థ కామ మోక్షములను, నాలుగుమాత్రము పురుషార్థములై యున్నవి. వానియందు మోక్ష మొక్కటియే పరమపురుషార్థము. తక్కిన వనిత్యము లగుటవలన నట్టివి గావు, అర్థ కామములు రెండును అనిత్యము లగుట ప్రత్యక్షముగనే తెలియవచ్చుచున్నది. ధర్మము గూడ నట్టిదే "తద్యథేహ కర్మచితో లోకః క్షీయతే, ఏవ మేవాముత్ర పుణ్యచితో లోకఃక్షీయతే. (ఛాం. ౮. ౧. ౬) (కృషిలోనగు వానివలని ఫల మనుభవించుట ఇహలోకమున నెట్లుక్షీణించునో, అట్లే అగ్నిహోత్రాదులగు యజ్ఞయాగాదుల కర్మఫలోపభోగము, స్వర్గమున క్షీణించుచున్నది) మోక్ష మట్లు క్షీణించునది గాదు. నసపునరావర్తతే (ఛాం. ౮. ౧౫. ౧). మోక్షమునుబొందిన వారికిఁ బునర్జన్మము లేదు. అట్లే భగవద్గీతయందును.

"మా ముపేత్యతు కౌంతేయ
పునర్జన్మ నవిద్యతే". భ.గీ. ౮. ౧౬.

## 2. ఉపనిషత్తుల ఉద్దేశము

ప్రత్యక్షమునకు అగోచర మైన విషయమునందు వేదమే ప్రమాణము. దానియందలి బ్రాహ్మణాదులు యజ్ఞాదికర్మ లనుష్ఠించుటను విస్తారముగఁ బ్రతిపాదించుటవలన లోకులమతి యిట్లేర్పడినది. "యజ్ఞాది కర్మకృత్వా స్వర్గాది ఫలసంపాదనమేవ ముఖ్యః పురుషార్థః" (యజ్ఞాదికర్మ నాచరించి స్వర్గాదిఫలమును సంపాదించుటయేముఖ్యమగుపురుషార్థము) అని. ఈ యుద్దేశమును నిరసించుటకై శ్రుతియందు ఉపనిషత్తు లభివ్యక్తము లైనవి. ఉపనిషత్తులందుఁ గూడ లోకులకు బ్రహ్మజ్ఞానము యథాశక్తి విధిముఖమునను, నిషేధ ముఖమునను బ్రహ్మము వర్ణింపఁబడినది.

## 3. మీమాంసక మతోత్పత్తి

శ్రుతి మిగుల దురవబోధ మైనది. ఏలయన శ్రుతివాక్యము సంక్షిప్తము. విశేషవిషయములను బ్రదర్శించువాక్యములు దక్కువగనే యుండును. భాషయన్ననో అతి పురాతనమైనది. లోకులను జూతమా రానురాను మందప్రజ్ఞులు. శ్రుతి చూపిన మార్గమున శ్రద్ధాళువులు విశ్వాసముతోఁ బ్రవర్తించుచున్నను లోకు లితరుల ప్రవృత్తి జ్ఞానమార్గమునందును, కర్మమార్గమునందును సడలిపోయినది. ఈసమయమునందు నాస్తికులు ప్రబలిరి. అందువలన ఋషులు వేదార్థజ్ఞానమునకై తప మొనర్చిరి. తపఃప్రభావమునఁ దమకుఁ బ్రాపించిన సామర్థ్యమునవారు, ఐంద్రాది వ్యాకరణములను, నిరుక్తము, ప్రాతిశాఖ్యములు లోనగువానిని రచించిరి. అంతఁ గొంతకాలమునకు. పాణిని అష్టాధ్యాయి (వ్యాకరణశాస్త్రము) రచించెను. దానివలనఁ బదార్థజ్ఞాన మేర్పడెను, పదంపడి జైమిని ద్వాదశా (పూర్వమీమాంసాశాస్త్రము)

రచించెను. దానిచే వాక్యార్థజ్ఞానము గలిగెను. ఏలయన దానియందు వాక్యార్థసంయోజనమున కుపయోగించు న్యాయము లనేకములు సంగృహీతము లయ్యెను. వైయాకరణుఁడు పదార్థవేత్త. మీమాంసకుఁడు వాక్యార్థవేత్త. అంత లోకులకు వేదార్థజ్ఞాన మేర్పడినది. మఱి కర్మప్రవృత్తికి ఆదరము కలిగెను. రానురాను ఆ కర్మప్రవృత్తి పరాకాష్ఠను బొందినది. ఎంతకు వచ్చినదనఁగా, ఈ ఉపనిషద్భాగము శ్రుతిశిరోభూతముగాదు. మఱి యేమన ఇది జీవాత్మ అవినాశి యని ప్రతిపాదించుటచేతను, పారలౌకిక సుఖమునందు విశ్వాసము నుత్పాదించుటద్వారాను యజ్ఞాదులగు కర్మకాండ కుపోద్బలకమై దానికంగభూతమై యున్నది. ఈవిధమున లోకుల కభిప్రాయమేర్పడెను. అందువలన ఉపనిషత్తులు ప్రదర్శించిన మోక్షమార్గముగూడఁ గంటకానువిద్ధమై లోకుల కగమ్య మయ్యెను. నాస్తికులట్లు వేదాంతులుగూడ మీమాంసకుల తీక్ష్ణకటాక్షములకు గురియైరి. అట్లె ఈశ్లోకము.

మీమాంసకా హి వాక్యార్థ
విచారే ప్రస్తుతే సతి
లోకదృష్టీః ప్రతిఘ్నంతి
వచనవ్యక్త పాంసుభిః.

(మీమాంసకులు వాక్యార్థవిచారము సాగించుచుఁ దమవచన వ్యక్తములైన పాంసువులఁ (ధూళుల)చే లోకులదృష్టుల నరికట్టుదురు.

## 4. సూత్రకర్త ఉద్దేశము

ఈకాలముగూడ ఉపనిషత్తుల ప్రాదుర్భావము కాకుండుకాలమట్లు మరల నేర్పడినది. "యజ్ఞాది కర్మాచరణమున స్వర్గాదిఫలమును సంపాదించుటయే ముఖ్యపురుషార్థమని లోకులకీయభిప్రాయమునందు దృఢవిశ్వాసము కలిగినది. ఇట్టి లోకులవిశ్వాసమును నిరాకరించుచు మోక్షమార్గమునందు లోకులచిత్తమును బ్రవర్తింపఁజేయుచున్నవాఁడై బాదరాయణ భగవానుఁడు బ్రహ్మసూత్రములను రచించెను. జైమినిచేఁ బ్రతిపాదితములై వాక్యార్థమునం దుపయోగించున వైన న్యాయములన్నియు బాదరాయణునకు సమ్మతములైనవే. కాని ఉపనిషద్భాగము, కర్మకాండమున కంగభూతమను నీయంశము మాత్రము బాదరాయణున కసమ్మతము. బాదరాయణుఁడును జైమిని ప్రతిపాదితములైన న్యాయములచే నుపనిషదర్థమును బ్రతిపాదించి అది శ్రుతిశిరోభాగమని స్థిరపఱిచి మోక్షద్వార మప్రతిబంధము గావించెను. ఉపనిషత్ప్రదర్శితమైన మోక్షమార్గముగూడ నిష్కంటక మయ్యెను.

## నాసికోత్ర

ఇట్లు చాలకాలము గడచినంత మరల విషమకాలము సంప్రాప్తించెను. లోకులమనము నశ్రద్ధ అలముకొనెను. జ్ఞానులు, కర్మఠులు నామావశేషులైరి. మరల మున్పటియట్లు చార్వాకులను బేరుపొందిన నాస్తికు లుద్భవిల్లిరి. వారిట్లుచెప్పసాగిరి దేహముకంటె జీవుఁడను నన్యుఁడొక్కఁడు లేఁడు. మోక్షము లేదు, పరలోకము లేదు. శ్రుతి, ప్రమాణము గాదు, ఈశ్వరుఁడనుపేరి నియంత ఒక్కఁడును లేఁడు. స్వభావముగనే ఈజగము పుట్టుచున్నది, లయమగుచున్నది అని.

## 6. మీమాంసక మత ప్రచారము

చక్రభ్రమణన్యాయమున మరలఁ గాలమునకుఁ బరివర్తనముగలిగి కర్మమార్గానుయాయులకుఁ దాత్కాలికముగ రాజసాహాయ్యము కలిగెను. అందునంజేసి వారు చార్వాకమత

ప్రచారమును గూలద్రోసిరి. మీమాంసకులం దగ్రేసరుండైన మండనమిశ్రుఁడు లోనగువారు రాజసభలందు ప్రతిష్ఠనుగాంచి పండితంమన్యులై అప్పుడు నాస్తికులనువలె జ్ఞానమార్గీయులను గూడ మూర్ఖులనుగా గణింపఁజొచ్చిరి. ఉపనిషత్తులు వ్యక్తముగానికాలమట్లు సూత్రరచనమునకు మున్నటికాలమట్లును సర్వత్ర దృష్టిగోచరమయ్యెను.

## 7. శ్రీ శంకరాచార్యావతారము

ఈసమయమందు లోకుల నుద్ధరించుటకై భగవంతుఁడు శ్రీశంకరుఁడు శంకరాచార్యరూపమున నవతరించి బ్రహ్మసూత్రములకు వ్యాఖ్యారూపమైన శారీరకభాష్యమును రచించి సూత్రకారునివలె మరల మోక్షద్వారము నప్రతిబంధముఁ జేసెను. శ్రీశంకరాచార్యావతారము వేదాంతశాస్త్రమును బునరుద్ధరించుటకు మాత్రమే యని తెలియవలెను.

శ్లో. శ్రీశంకర జగత్పూజ్య పాదా
నిత్యం జయంతి తే
యే ప్రస్థానత్రయే భాష్యం
మాయావాదేన తేనిరే

ఇఁక సుఖబోధమునకై శాంకరదర్శనమును దెలిపెదము.

నిత్యం సర్వగుణావధూనన
పరా నైర్గుణ్యవాదాః శ్రుతౌ
గౌణార్థాః సగుణోక్తయః
శుభగుణారోపాత్పరే బ్రహ్మణి
అద్వైతశ్రుతయః సదర్థవిషయా
భేదోక్తి రౌపాధికీ
తత్సర్వశ్రుతిసంగతం విజయతే
శ్రీశాంకరం దర్శనమ్ ॥

## 8. ఆత్మరూపము ఒక్కటే తత్త్వము

ప్రత్యక్షాదిప్రమాణములందు శబ్దప్రమాణమే మొదట బ్రహ్మమును బోధింప ముఖ్యముగ సమర్థమైనది. దాని తర్వాత, దాని ననుసరించి ఇతరప్రమాణములు బ్రహ్మమును బోధింపఁ బ్రవర్తించుచున్నవి. శబ్దము=శ్రుతి, సదేవ సోమ్యేద మగ్ర ఆసీ దేకమే వాద్వితీయమ్ (ఛాం. ౬. ౨. ౧). (ఓ సౌమ్యుఁడా ఈజగమంతయు మొట్టమొదట అద్వితీయమైన యొక్కటే సద్వస్తువుగా నుండెను) ఇట్టిది ఉపనిషద్వాక్యము పరమాత్మరూప మొక్కటియే తత్త్వమని స్పష్టముగఁ జెప్పుచున్నది. ఆపరమాత్ముఁడన్నో దృశిరూపుఁడు. ద్రష్ట=చూచువాఁడు, దృశ్యమ్ = కనిపించునది. దృశి=చూడ సాధనమైనజ్ఞానము.—అను నీపదార్థత్రయము నాబాలవృద్ధ మసందిగ్ధముగ నెల్లరు దెలిసి యనుభవించుచున్నారు. అట్లున్నను. దృశికి (దర్శింపసాధనమైన జ్ఞానమునకు) ఆశ్రయుఁడై యున్న దృశికి విషయముగనున్న దృశ్యమును, అనఁగా ద్రష్టయు, దృశ్యము, అను నీ రెండును దృశి నపేక్షించుటవలనను, వానిస్వరూపము, దృశి నిరూపించుట కధీనమైన నిరూపణము గల దగుటవలనను దృశియొక్కటియే వాస్తవమగు తత్త్వమైయున్నది. ద్రష్టయు దృశ్యమును కల్పితములే అయి యున్నవి. దృశి అనఁగాజ్ఞానము, ఈ దృశి, నిరూపాధికము, సోపాధికము, అని ద్వివిధము. వానియందు నిరుపాధికమైన దృశి నిరాశ్రయము (ఒకదాని యాశ్రయములేనిది), నిర్విషయము (శబ్దాదివిషయములులేనిది), సన్మాత్రరూపము (సత్తామాత్రము = ఉనికి), అగు జ్ఞానము. ఈనిరుపాధికమైన దృశి స్వరూపలాభమందు మఱి దేని నపేక్షింపదు. ఈ దృశియే, బ్రహ్మ, పరమాత్మ, శబ్దములచేతఁ

జెప్పఁబడుచున్నది. సాశ్రయము, సవిషయ మునై - ఏది లౌకికమై ప్రమాణాదిజన్యమైన జ్ఞానముగలదో అదూపము సోపాధికమైన దృశి యగుచున్నది. ఈదృశి, ఆశ్రయము, విషయము అను రెండింటి నపేక్షించుచున్నది. కావున, ద్రష్ట, దృశ్యమువలె కల్పితమగుచున్నది. అట్లు కల్పితములైన అఖిలవస్తువులకు ఆశ్రయముగ నున్నదై కల్పనకు అధిష్ఠానమై యుండునది గనుకనే సర్వజగత్తునకు మూలమై యుండునది బ్రహ్మమని చెప్పుట. "యతోవా ఇమాని భూతాని జాయంతే" (తై. ౩. ౧. ౧). (దేని నుండి ఈభూతములు జనించుచున్నవో) అను శ్రుతియందును. "జన్మాద్యస్యయతః". (బ్రహ్మ సూత్ర. ౧. ౧. ౨.) అను సూత్రమందును. సర్వజగత్తునకు మూలకారణము బ్రహ్మమని బ్రహ్మలక్షణము ప్రతిపాదింపఁబడినది.

### 9. కారణము సూక్ష్మము వ్యాపి

కార్యము నపేక్షించి కారణము, సూక్ష్మము, వ్యాపకము నగుచున్నది. ఇట్లే ఉపదేశ సాహస్రియందు.

"సూక్ష్మతా వ్యాపితే జ్ఞేయే
గంధాదే రుత్తరోత్తరః
ప్రత్యగాత్మావసానేషు
పూర్వపూర్వ ప్రహాణతః॥ ౯. ౧.

ఇందు గంధమనఁగా పృథివి. గుణములు గుణుల కంటె వేఱుగఁ బొందరానివై యున్నందున గుణగుణుల యభేదమునే సిద్ధాంతము సం దంగీకరింతురు. ప్రత్యగాత్మావసానేషు=పరమాత్మ పర్యంతముండు వానియందు, ప్రహాణం=కార్య స్వరూపమును త్యజించుట పృథివి, జలము, తేజస్సు లోనగు వానిస్వరూపమైన కార్యము నుండి, ముందుదానినుండి దానిముందుండు దాని కడకు దానినుండి పైముందుదాని దగ్గఱకును. ఇట్లుత్తరోత్తరము పోను క్రిందివానికి పైవి కారణములగుచున్నవి. అట్లుకారణములై యుండు పరమాత్మపర్యంతముగల పదార్థములందు, కార్యరూపమైన ఆకారమును క్రమముగవీడుట ద్వారా వానికి సూక్ష్మత్వము, వ్యాపిత్వము గల్గునని తెలియవలెను. మఱి కార్యముకంటె నెప్పుడును గారణము సూక్ష్మమైనదిగదా. (అనఁగా పరిమాణమందు కార్యముకంటె కారణము సూక్ష్మమనుట) అట్టిచో కారణము కార్యమునందు ఎట్లు వ్యాపకమగును? కాదుగదా. అనిన, అట్లుగాదు ఏలయనఁ గార్యములందుఁ గారణస్వరూప ముండునదియైనను, కార్య స్వరూపమునందు దాగియుండున దగుటచేలి స్వరూపముతోఁ జక్కఁగ భాసింపదు. అని మాత్రమే ఇచ్చట సూక్ష్మమని చెప్పుటగాని న్యూనపరిమాణము వలనఁగాదు ఆప్రకారమున సకలవికారానుగతమైనదానికి ఉపాదాన కారణమగుటవలనఁ గార్యముకంటెఁ గారణము అధికదేశవర్తియగుట చేత కారణము కార్య వ్యాపక మగుచున్నది. పృథివి స్వకార్యమును బట్టి సూక్ష్మయు, వ్యాపకయునై సిద్ధించును. పృథివికంటె జలము సూక్ష్మము, వ్యాపక మగును. ఎట్లనఁగా శరీరమునందుఁ జెమ్మటయు పర్వతశిలాదులందును, భూగర్భమునందును ప్రవహించునదై కనుపట్టుటవలనను. జలము యొక్క అసాధారణమైన రసము పృథివియందు సర్వత్ర గనిపించుటవలనను పృథివియందు అచ్చటచ్చట అప్రతిబంధముగ జలప్రవేశము గనుపడుట సాధారణముగ నున్నందునను, పృథివికంటె జలము సూక్ష్మ మనుట దగును. అట్లె జలముకంటె తేజము (అగ్ని) సూక్ష్మము, వ్యాపకమగును, జలగర్భమున రవికిరణములు,

అగ్ని పరమాణువులు లోనఁబ్రవేశించుట గన్పించుటవలనను. జలముచే నగ్ని నాశమగుచున్నను. అగ్నియవయవములు ఉష్ణజలమునందుఁ బ్రవేశించినవై జలములచే నశింపనివై యున్నందునను, జలములకంటె నవి సూక్ష్మములని చెప్పుటకు హేతువైనది. తేజముకంటె వాయువు సూక్ష్మము వ్యాపకమగును. రవికిరణములు. యథావస్థితములై యున్నను వాయుసంచారము గన్పించుచున్నది. వాయువుకంటె ఆకాశము, సూక్ష్మము వ్యాపకమునై యున్నది. అట్లె కన్పించును. ఎట్లనగా పాషాణము పగులఁగొట్టునప్పుడు గన్పించుచున్నది. అవకాశమువినా పగులగొట్టుట సంభవముగాదు, ఇట్లు పరమాత్మపర్యంతముగల పదార్థములు పోను పోను. సూక్ష్మములు, వ్యాపకములై యుండునని తెలియవలెను.

## 10. ఆత్మ, నిర్విశేషము

కారణము వ్యాపకమగుటవలననే కార్యముకంటె సామాన్యముగ (సమానముగ) నుండుచున్నది. అనఁగా కార్యమునంటియున్న విశేషములులేనిదని యర్థము. ఘటము, శరావము (మూఁకుడు) లోనగుకార్యముల నంటియున్న ఘటత్వము, (ఘటస్వరూపగుణవర్ణాదులు) శరావత్వము, లోనగువిశేషములు. కారణావస్థయందు మృత్తునందుఁ గన్పింపనందువలన. దీనినిబట్టి సర్వకార్యములకు మూలకారణమై, బ్రహ్మము, సర్వవిశేషరహితమై యున్నది. బ్రహ్మముగూడ నేదేనొక విశేషముతోఁగూడి యున్నదని చెప్పినయెడల, అట్టివిశేషరహితమైనది బ్రహ్మమునకుఁ గూడ నొక మూలకారణమొకటి యితరము గావలసివచ్చును. మఱి దానికి మఱియొకటి మూలకారణమనుచుఁ బోయినయెడల ననవస్థాప్రసంగ మగును. కావున నట్టిదాని నిరసించుటకు మూలకారణము సర్వవిశేషరహితమని ముఖ్యముగవచింపఁదగెను. అదియే, మన బ్రహ్మమైయున్నది.

## 11. బ్రహ్మము భేదత్రయరహితము

విశేషరహితమైన దనినంతనే దానియందెట్లు చూచినను, సజాతీయమువలనఁగాని విజాతీయమువలనఁగాని స్వగతమువలనగాని భేదము సంభవింపదు. సవిశేషమే భేదాధికరణముగలది. అందుచేత బ్రహ్మజాతీయమగు చేతనముగాని బ్రహ్మవిజాతీయమగు అచేతనముగాని, బ్రహ్మగతమగు ధర్మముగాని యేయొక్కటియు అన్యమగువస్తువులేదు. కాఁబట్టి పూర్తిగా. శుద్ధము అద్వితీయము, భేదత్రయరహితము. నిర్విశేషమునగు బ్రహ్మము సిద్ధించుచున్నది.

> "తదేవ నిష్కళం బ్రహ్మ
> నిర్వికల్పం నిరంజనమ్.
> నిర్వికల్ప మనంతంచ
> హేతుదృష్టాంతవర్జితమ్॥ బ్ర.వి.౮.౯.

అని శ్రుతియందు నిర్వికల్పశబ్దముచే బ్రహ్మము నిర్విశేషమని స్పష్టముగా చెప్పఁబడియున్నది. మఱి సవిశేషము బ్రహ్మమన్నచో ఆవిశేషమును పురస్కరించుకొని యిట్టిది అట్టిది యని యిట్లు శబ్దములచేఁ బ్రతిపాదింపవలసియుండును. అట్లగుచో "యతో వాచో నివర్తంతే (తై. ౨. ౯.) అను శ్రుతియు. "అగోచరం వచసామ్ (వి. పు. ౬. ౭. ౫౩.) అనుస్మృతియు విరుద్ధములగును.

(సశేషము)

# శ్రీ విశుద్ధానందవాణి

[తే 29-12-1956 ది సాయంకాలము 5-30 గంటలకు శ్రీరామకృష్ణమఠ ధర్మవైద్యశాలలో మాతృశ్రీ శతతమవార్షికోత్సవస్మారకమైన నూత్నభవనమును ఆవిష్కరించుచు శ్రీరామకృష్ణమఠసేవాసంఘముల కేంద్రోపాధ్యక్షులైన శ్రీమత్స్వామివిశుద్ధానందులు ఉపన్యసించినది.]

మిత్రులారా,

ధర్మవైద్యశాలకు చేరినదై మాతృశ్రీ శతతమవార్షికోత్సవ స్మారకము అను పేర బరగనున్న యీ నూత్నభవనమును ఆవిష్కరించు ఈ సందర్భమున మన సంస్థకు గల లక్ష్యములను గూర్చి ఒకటి రెండు మాటలు చెప్ప గోరుచున్నాను.

సుగృహీతనామధేయులైన శ్రీరామకృష్ణ గురుదేవుని బోధనలచే ఉత్సాహము పొంది, శ్రీవివేకానందస్వామి ఆత్మమోక్షార్థమును జగద్ధితమునకును పాటుపడు కర్మవీరుల సంఘమును ఒకదానిని 1897 వ సంవత్సరమున ఏర్పఱచెను. రహస్యముగ శిష్యులకు ఉపదేశించుట, ఏకాంతముగ తపస్సు చేయుట అనునవి మన దేశమున అనాదికాలముగ ఉండగా, వానికి తోడుగ భగవదర్పితముగా లోకసేవ చేయుట అను నూతన సాధనావిధానమును శ్రీస్వామిజి చేర్చెను. 'సర్వం ఖల్విదం బ్రహ్మ' ఇదంతయును బ్రహ్మమే కదా. జాతి మత విభేదము లేక సకలప్రజలను పరతత్త్వమైన బ్రహ్మము దాల్చిన ప్రత్యక్షరూపములుగ గణించి వారి అక్కఱలకు తగినట్లు భౌతిక వైజ్ఞానికాధ్యాత్మిక సాహాయ్యమును వారికి ఒసంగవలెను.

''మనకు మరణము తప్పదు, ఉత్కృష్ట ప్రయోజనసిద్ధికై మన ప్రాణములను అర్పింతము గాక, 'మన ప్రవర్తన అంతయు మనలో స్వార్థత్యాగమును వర్ధిల్ల జేయును గాక'' అన్నారు స్వామిజి — భౌతిక వైజ్ఞానికాధ్యాత్మిక సేవలో ఈ వైరాగ్యాదర్శమునకు గల్గు సిద్ధిచే పారమార్థికముగ ఒక పునర్జన్మమే సిద్ధింప గలుగును, చేయు ప్రతికార్యమును ప్రతిసేవను ఆరాధనాబుద్ధితో చేయవలెను. దేవుని విగ్రహాలకు తీర్థప్రసాదాలను పూలను అర్పించుటకు బదులు, ఆరాధకుడు దేవుని సజీవ ప్రతికృతులైన మానవులకు అర్హములైన వస్తువులను అర్పింపవలెను. ఆర్జవాదరములతో చేయుదుమేని కర్మము భగవదారాధనముగ రూపొందును. శ్రీరామకృష్ణసేవాసంఘసభ్యులలో సాధువులకును గృహస్థులకునే గాక లోకమంతటికిని గూడ స్వామిజి ప్రదర్శించిన లక్ష్యము ఇదియే. శ్రీరామకృష్ణసంస్థ ప్రచురముగ పారమార్థికపరమైన ఒక సంఘము. భగవదర్పితముగ క్రియమాణమగు ప్రజాసేవ దాని సాధనలలో ఒక అంగమై ఉన్నది. ఇందుకే ఇట్టి సేవను అన్వర్థముగ నరనారాయణసేవ అని పేర్కొన్నారు.

సాధకుడు మానవరూపి యైన దేవుని తన యిష్టదేవతనుగా భజించు ఈ ఉత్సాహము స్వామిజికి సూటిగ ఆయన గురుదేవునొద్దనుండి సంక్రమించినదే. శ్రీరామకృష్ణుడు స్వామిజికి ''యత్ర జీవస్ తత్ర శివః'' ''సర్వభూతే నారాయణః'' అను మంత్రములను ఉపదేశించిన సందర్భమును స్వామిజీ

ఎంతమెలకువతక్కువగా చదివినవారును గుర్తించియే యుందురు. మానవులందే కాక సకల ప్రాణులందును గల సర్వేశ్వరుని ఆరాధించుటే అందలి భావము. ఇందుచేతనే సంఘసేవారంగమున స్వామిజి ఒక విప్లవమును తేగల్గెను. అందఱికిని తెలియ దేమో కాని, 'సకల జీవులందును గల హరి నారాధింపు' మనెడి యీ పాఠమునే 1884వ సంవత్సరము డిసంబరు తే 6 ది శ్రీరామకృష్ణుడు పందొమ్మిదవశతాబ్ది ద్వితీయార్ధమున వంగదేశమున నున్న మహా పండితులలో ఒక డైన శ్రీబంకించంద్రఛాటర్జీకి ఉపదేశించెను. ఈ ఐతిహ్యమును శ్రీరామకృష్ణుని సూక్తిరూపముననే తెల్పెదను —

శ్రీరామకృష్ణుడు — "పంచవటికి క్రింది వైపు గంగగట్టులో కూర్చుండి నేను 'రూపాయయే బంకమట్టి, బంకమట్టియే రూపాయ' అని పలుకుచుంటిని. తర్వాత ఆ రెంటిని గంగలో పాఱవేసితిని."

అందులకు ఆశ్చర్యపడి బంకించంద్రుడు ఇట్లు అనెను — "ఔనా? రూపాయి బంకమట్టియేనా? మహాశయా, మీచేత నాలుగు కాసులున్న మీరు పేదలకు సాయము చేయ గల్గి ఉందురు కదా. డబ్బు మట్టియే అగుచో మానవుడు దానధర్మములు చేయ లేడే."

శ్రీరామకృష్ణుడు — దాన మట! ధర్మమట! 'ఇతరులకు మేలు నేను చేయుదు' నని చెప్పుటకు నీ వెట్లు సాహసించితివి? మానవుడు చేయున దెల్ల ఆర్భాటమే. దయాగుణ మేమో భగవంతుని కే సొంతము. నిస్సంగబుద్ధితో ధర్మముచేయు నాతడు నిజమునకు తనకే మేలు చేసికొనుచున్నాడు, ఇతరులకు కాదు — సకల జీవులలోను ఉండునది ఆ హరియే. అట్టి నిస్స్వార్థకర్మచే కర్త తనకే మేలొనగూర్చుకొనును. మానవుడు తోడిమానవులందే కాక సకలప్రాణులందును ఉన్న దేవుని ఆరాధించునేని, పేరు ప్రతిష్ఠలు గాని స్వర్గఫలమును గాని కోరడేని, తాను సేవించువారియొద్దనుండి ఎట్టి ప్రతిఫలమును కోరకుండు నేని, ఇట్టి చిత్తవృత్తితో అతడు తన సేవాకార్యమును నిర్వర్తించుకొనునేని, అప్పు డతనిది నిస్స్వార్థకర్మ మగును, నిస్సంగకర్మ మగును. దానికే కర్మయోగ మని పేరు. ('నిష్కామకర్మ' – గీత.) దేవుని బడయుటకు ఇదియును ఒక దారియే. కావున నే జెప్పున దేమనగా నిస్సంగబుద్ధితో పాటుపడుచు, దయాళువుగను దానపరుడుగను ఉండు నాతడు, అట్టి ప్రవర్తనచే తానే లాభపడుచున్నాడు. ఇతరులకు తోడ్పడుట, మేలు చేయుట అనునవి దేవుని పనులు.

ఈ యుద్రేకమునకు మొదటి ఆకరము మన ఉపనిషత్తులే. భారతీయాధ్యాత్మిక జీవితమునకు నిత్యప్రభవములు ఉపనిషత్తులే కదా! చరిత్రకు అందని ఆదికాలములో భారతీయాస్తిక్యచైతన్యము ఏనాడు ఉదయించెనో అప్పటినుండి అవిరతముగ వచ్చుచున్న జ్ఞానవాహినిలో శ్రీరామకృష్ణుని జీవిత మొక భాగమే కదా. సేవామహిమను దెలుపు సూక్తులను మనమత వాఙ్మయమునుండియే కాక విదేశీయమతవాఙ్మయమునుండికూడ ఉదాహరింప వచ్చును. పుణ్యపురుషుల చరితమును పరికించితి మేని, సన్న్యాసులజీవితమునకు లోకసేవయే ఉదాత్త లక్షణ మని స్పష్టపడును. ప్రపంచమున ఎందైనను చూడుడు. యతులకును యోగులకును సకలప్రాణులయెడనుండిన ప్రేమయే వారిచరిత్రలలోని సారతమాంశము. ఉన్నతజ్ఞానప్రభావమున ప్రేమయే సేవగా రూ పొందును. స్వార్థపరమైన బ్రతుకును ఆధ్యాత్మిక మైన

మరణము నొక్కటే. కావుననే సనాతనమైన యీ ప్రేమకారుణ్యాదర్శము, మన నిత్యనైమిత్తికకర్మలద్వారాను ఉత్సవములద్వారాను తరతరముగ అవిచ్ఛిన్నముగ వచ్చుచున్నది. ఆ కర్మలలోను ఉత్సవాలలోను ధర్మకార్యము (=సేవ) ప్రధానాంగముగ నున్నది. దేశమున నలుగడలను, మూలమూలలోను ముఖ్యముగ యాత్రాస్థలములందును నెలకొల్పబడిఉన్న పెక్కుసత్రములకును ధర్మశాలలకును మూలము ఈ లక్ష్యమే. మనవ్యక్తిజీవితములం దేమి సంఘజీవితమం దేమి ఈనాడుకూడ ఈ లక్ష్యమునకు ఎంతో ప్రాముఖ్య మున్నది.

హిందువు లందఱకును శాస్త్రవిహితము లైన పంచమహాయజ్ఞములలో నృయజ్ఞ మొకటి కదా, అందుల కార్యరూపమే ఈ భౌతిక వైజ్ఞానికాధ్యాత్మిక ప్రజాసేవ.

ఇందులకు ప్రమాణము లైన కొన్ని శ్రుతివాక్యముల నుదాహరింతును. "శ్రద్ధయా దేయమ్. అశ్రద్ధయా ఽదేయమ్, శ్రియా దేయమ్, హ్రియా దేయమ్, భియా దేయమ్, సంవిదా దేయమ్" "శ్రద్ధతో ఇమ్ము, అశ్రద్ధతో ఈయకుము, సమృద్ధముగ ఇమ్ము, వినయముతో ఇమ్ము, భయానుశయములతో ఇమ్ము". "మాతృదేవో భవ, పితృదేవో భవ, ఆచార్యదేవో భవ, అతిథిదేవో భవ" "నీ తల్లి నీకు దైవ మగు గాక, నీ తండ్రి నీకు దైవ మగు గాక, నీ గురువు నీకు దైవ మగు గాక, నీ అతిథి నీకు దైవ మగును గాక". వీనికి స్వామిజి చేర్చిన సూక్తులు — "దరిద్రదేవో భవ, మూర్ఖదేవో భవ, రోగిదేవో భవ" "దరిద్రులే నీకు దైవ మగుదురు గాక, మూర్ఖులే నీకు దైవ మగుదురు గాక, రోగులే నీకు దైవము అగుదురు గాక." ప్రహ్లాదుడు

న త్వహం కామయే రాజ్యం
స్వర్గం నాపునర్భవమ్।
కామయే దుఃఖతప్తానాం
ప్రాణినా మార్తినాశనమ్॥

"దేవా, నాకు రాజ్య మక్కఱ లేదు, స్వర్గ మక్కఱ లేదు, జన్మరాహిత్యము అక్కఱ లేదు. సంసారదుఃఖపీడితు లైన సకలప్రాణుల ఆర్తియు నశింప వలె ననుటే నేను కోరు వరము." "పరోపకారః పుణ్యాయ, పాపాయ పరపీడనమ్" "ఒరులకు చేయు మేలు పున్నెము, ఒరులకు గలించు హింస పాపము".

ఈ ప్రసంగమును ముగించుటకు ముందు స్వామిజి ఉపదేశించిన నూత్నమంత్రమును స్మరింతము గాక — "దరిద్రులు, నిరక్షరులు, అజ్ఞానులు, అధివ్యాధిగ్రస్తులు — వీరే నీకు దైవ మగుదురు గాక". ఈ యుగమున ఇట్టి సేవయే ఆస్తిక్యపరాకాష్ఠ అని ఆచరించి తెలిసికొందము గాక. 'కర్మయే ఆరాధన' మను ఈ సూత్రము స్వామిజి దేశదేశములందును శ్రోతల చిత్తములకు ఎక్కించుటలో ఇదే ఉద్దేశము.

ధర్మవైద్యశాలకు మాతృశ్రీశతతమవార్షికోత్సవస్మారకముగ చేరిన యీ నూతనభవన నిర్మితిలో పాల్గొన్న వదాన్యులు, సంస్థలు, మహాజనులు, వాస్తుశిల్పులు, గుత్తదారులు, బేల్దారులు, కూలివాండ్రు, వైద్యులు, కంపౌండర్లు, మిత్రులు, అనుమోదకులు మొద లైన అందఱను భగవంతు డనుగ్రహించును గాక.

ఈ శుభసందర్భమున మానవసేవయే మాధవసేవ అను ఉదాత్తలక్ష్యము అందఱకును సిద్ధింప వలె ననియు ఈ భువి దివి కావలె ననియు నేను సర్వేశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఓం శాన్తి శ్శాన్తి శ్శాన్తిః

# వార్తలు, విశేషాలు

## శ్రీరామకృష్ణమఠ ధర్మవైద్యశాలలో మాతృశ్రీ శతతమజయంతి స్మారక నూతనభవనమునకు ఆవిష్కరణ మహోత్సవము

### శనివారము తే 29-12-1956 ది నివేదిక

మిత్రులారా,

ఈ ఆవిష్కరణమహోత్సవమును జరుపుటకై బేలూరుమఠమునుండి దయతో విచ్చేసిన మన కేంద్రోపాధ్యక్షు లగు శ్రీమత్ స్వామి విశుద్ధానందజీమహారాజువారు తమ ఉపన్యాసములో శ్రీరామకృష్ణసంస్థకు ఉన్న భావాలను లక్ష్యాలను ఇప్పుడే వివరించి చెప్పినారు.

ఈ వైద్యశాల పుట్టుపూర్వాలు మీకు తెలియుటకై దీని చరిత్రమును సంక్షేపించి తెలుపుకొనుచున్నాము.

మఠావరణములో ఒకగుడిసెలో ఈ వైద్యశాలను తే 27-9-1925 ది ప్రారంభించినాము. రోగులను ఆర్తులను ఉపచరించుటే భగవదారాధన అను ఆదర్శముచేతను వైరాగ్యలక్ష్యముచేతను అత్యుత్సాహము వహించిన కీర్తిశేషులు డాక్టరు B. రాఘవేంద్రరావుగారే అప్పుడు మాకు సాయపడినవారు. వారు సర్కారు ఉద్యోగముచేసి విరామము పొందినవారు. వారు ఇచ్చట వైద్యము చేయుటే కాక మందులకును జరూరుపరికరములకును అగు ఖర్చు నంతయు తామే భరించుచు వచ్చిరి. రోగుల కిచట లభించు సాదరమైన అవేక్షణముచే, ఈ వైద్యశాల జనప్రీతిని చూ॥ మైలాపూరునుండియే కాక సైదాపేట మున్నగు దూర ప్రాంతాలనుండి కూడ రోగులు వైద్యమునకై ఇచటికి రా సాగిరి. 1925 వ సంవత్సరములో వైద్యసాహాయ్యముపొందినవారిసంఖ్య 970. 1928 వ సంవత్సర మప్పటికి వారి సంఖ్య 18,222 కు పెరిగినది. 1928 వ సంవత్సరము మార్చి నెలనుండి ఈ మఠబ్రహ్మచారివర్గములో ఒకరు వైద్యశాలపనులలో శాశ్వతము గ పాల్గొనుచుండుట ప్రారంభ మయ్యెను

1930 వ సంవత్సరములో వైద్యసాహాయ్యార్థులసంఖ్య 54,000 కు పెరిగినది వైద్యశాలలో చోటు చాల దాయెను. అందుకై ప్రాతగుడిసెప్రక్కనే క్రొత్తగుడిసెను ఒకదానిని వేసినాము. అప్పటికి మాచేత ఉన్న ఐవీజులో మేము చేయగలిగినది అంతే. 1933 లో చోటు-ఇబ్బంది కొంతవఱకు తీఱినది. మన మఠసేవా సంఘముల శ్రేయోభిలాషులైన భక్తవతంసులలో ఒక రగు పి. డబ్ల్యు. డి. సూపరింటెండింగ్ ఇంజినీరుపదవినుండి విరామమునొందిన రావుబహదూరు S. భాస్కరయ్యరుగారి ప్రేరణచే, డాక్టరు T. రామచంద్రన్ (తిరుచిరాపల్లి) గారు వైద్యశాలకొరకు భవనమును కొనుటకై 16,000/- రూ

మొసగిరి. ఇది కాక మా భవననిర్మాణనిధిలో రూ. 2,500/- లు ఉండినవి. ఈ పైకముతో పొరుగింటిని కొన్నాము. జారూరైన కొంత మరమ్మత్తును చేయించిన పిదప తే17-1-1934ది నాడు వైద్యశాలను ఆ భవనములోనికి మార్చినాము. 1935 వ సంవత్సర మప్పటికి ఈ వైద్యశాలలో వైద్యసాహాయ్యార్థుల సంఖ్య 60,000 ఐనది. మందులు మొదలైన ఆవశ్యకవస్తువులలో కొన్ని ఉచితముగా లభించెడివి కాని చాలవఱకు పైకమిచ్చి కొనవలసియే ఉండెడిది. కావలసిన ధనము ప్రోగుచేయుట ఎంతో కష్టముగ నుండినది. మనసేవాసంఘమునకు పరమాప్తులై శ్రీమత్స్వామిరామకృష్ణానందుల కటాక్షభాగ్య మందిన కీర్తిశేషులు వి. సి. రంగస్వామయ్యంగారి సహధర్మిణి శ్రీమతి సౌందరమ్మగారు 1936 వ సంవత్సరమున మందులకై వైద్యశాలకు రూ. 6,000/- లు విరాళమిచ్చినారు. 1938 వ సంవత్సరమున పబ్లిక్ ఇన్‌స్ట్రక్షన్ డైరెక్టరు కీర్తిశేషులు డాక్టరు S. R. W. సపూరు గారి ఉదార సాహాయ్యముతో హోమియోపతిక్ వైద్యవిధానమును కూడ ఇచ్చట ప్రారంభించినాము. వైద్యసాహాయ్యార్థుల సంఖ్య నానాటికి హెచ్చుచు పోయినది. 1954లో 1,07,000 గురును 1955 లో 1,10,000 గురును ఇక్కడ వైద్యోపచారమును పొందినారు.

రోగులకు చోటు చాలక, ఇప్పటికి కొంత కాలము మునుపటినుండి ఇబ్బంది పడుచుంటిమి. ఒక్కొక్కదినము దాదాపు 600 మంది రోగులు వచ్చుచుండినారు. వారిలో మగవారున్నారు, మగువలుఉన్నారు, శిశువులున్నారు. ముందున్న వసారలో వారు క్రిక్కిఱిసి ఉండెడి [illegible] దంతవైద్యశాఖను ఒక లాబొరేటరీని ఇటీవల చేర్చినాము కాబట్టి చాలినచోటు వసతిని ఏవిధముచేతనైనను ఏర్పఱచి తీఱవలెనని మఠాధికారులు రెండేండ్లనాడు నిశ్చయించుకొన్నారు. మఠావరణములో క్రొత్తకట్టడము కట్టుటకు చోటు చాలదు. కాబట్టి దక్షిణముగ ఉన్న ఖాలీస్థలమును కొని దానిమీద భవనమును నిర్మింపవలెనే కాని వేఱు దారి లేదు. ఆ ఖాళీస్థలమునకు సొంతదారులు శ్రీకపాలీశ్వర దేవస్థానమువారు. వారితో రాయబారమును సుదీర్ఘకాలము నడపినాము. అది మాత్రు శ్రీశతతమజయన్తి సంవత్సరము. రోగులన్నను ఆర్తులన్నను కరిగిపోయెడి హృదయము కదా అమ్మది, కావున క్రొత్తకట్టడమును ఆమె శతతమజయని స్మారకముగ చేయుదమని తదుత్సవనిర్వాహకవర్గమువారు తీర్మానించుకొనిరి. దేవస్థానము వారికి చెల్లించిన మొత్తము రూ. 81,000/- తే 31-12-55 దినాడు స్థలము మా స్వాధీనమైనది. ఆ నేల చాల పల్లము. పల్లమును పూడ్చి సమపఱచుటకు ఎంతో ధనము పట్టినది. కట్టడమునకు అంచనలు ప్లాన్లు సిద్ధపడినవి. ధనసాహాయ్యమునకై ప్రభుత్వమువారికి కూడ దరఖాస్తు పెట్టుకొన్నాము. మెడికల్ సర్వీసస్ డైరక్టరు సిఫారసు చేసిన మీదట, సర్కారువారు కట్టడమునకు పట్టు లక్షరూపాయలలో రూ. 46,500/- లు తాము ఒసగిరి. ఆ డైరెక్టరుగారికిని సర్కారువారికిని ఈమఠీయులు కృతజ్ఞులు. శ్రీశారదా శ్రీరామకృష్ణుల దయచేతను భక్తమిత్రులతోడ్పాటుచేతను భవననిర్మాణము పూర్తి ఐనది. దీనిచే ప్రాతకట్టడపు ఇరుకటము తీఱుటే కాక, నేత్ర-శ్రోత్ర-ఘ్రాణ-కంఠవైద్యశాఖలను శస్త్రవైద్యశాఖను ఏర్పఱచుటకు కూడ



శ్రీ రామకృష్ణమఠ ధర్మవైద్యశాలలో మాతృశ్రీ శతతమజయన్తి స్మారకమైన నూత్నభవనమునకు జరిగిన అవిష్కరణమహోత్సవమప్పుడు అభ్యార్చితములైన పటములు.



శ్రీ రామకృష్ణమఠ ధర్మవైద్యశాలలో మాతృశ్రీ శతతమజయన్తి స్మారక నూత్నభవన ముఖద్వారము.



మాతృభవనావిష్కర్తలైన శ్రీమత్స్వామి విశుద్ధానందులు ఉపన్యసించుచున్నారు; వేదికపైని సభాధ్యక్షులు పూజ్యశ్రీ సుబ్రహ్మణ్యంగారు; మఠాధ్యక్షులు శ్రీమత్స్వామి కైలాసానందులు; మానేజరుమహారాజు శ్రీ శుద్ధసత్త్వానందస్వాములు మున్నగువారు కలరు.



శ్రీ రామకృష్ణమఠ ధర్మవైద్యశాల మాతృశ్రీ శతతమ జయంతి స్మారకమైన మాతృభవనమునకు జరిగిన ఆవిష్కరణ సభా సమావేశము.

వైద్యశాల ప్రారంభదశలో డాక్టరు బి. రాఘవేంద్రరావుగారు చేయుచుండిన గొప్ప సాహాయ్యమును ఈవఱకే పేర్కొని ఉన్నాము. ఈ వైద్యశాలకు అమూల్యసేవ చేసిన వైద్యులు మఱికొందఱు కూడ ఉన్నారు. వారి పేర్లు డాక్టరు G. S. కత్రే, డా. M. S. కృష్ణమూర్తి, డాక్టరు P. దామోదరన్, డాక్టరు P. శేష గిరిరావుగారు ప్రేమతో చేసిన సేవను మహా నందముతో కీర్తించుచున్నాము. వారు ఈ వైద్యశాలలో ప్రవేశించి 25 సంవత్సరాలు నిండుచున్నవి. కాబట్టి వారి సేవ కిది రజతోత్స వము. వారికి మా హృదయపూర్వకము లగు అభినందనములు. కాప్టన్ N. శేషాద్రినాథన్, డా. B. శంకరరావు, డా. P. N. V. గిరి (దంతవైద్యులు), డా. జార్జ్ అడైక్కలం, డా. P. శేషగిరిరావు (కడపటి ఇరువురు హోమియో వైద్యులు) — వీరి సేవకు అత్యం తము కృతజ్ఞులము. వారి సభక్తిక సేవకు గురు మహారాజు వారికి సర్వమంగళములను ప్రసా దించును గాక. ఇక్పుడు ఇక్కడ ప్రారంభము కానున్న కంఠ-ఘ్రాణ-శ్రోత్రవైద్యశాఖలో డా. M. N. ప్రభువుగారును నేత్రవైద్యశాఖలో డా. R. నారాయణరావుగారును పనిచేయ దయతో అంగీకరించినారు. ఆ వార్తను ఈ శుభసమయమున అందఱకును తెలుపుకొను చున్నాము. ఇంకను పని హెచ్చు కొలది వైద్యులసాయము వలసి యుండును. తోడ్పడ ముందంజ వేయవలసిన దని ప్రేమోదార వైద్య మహాశయులను ప్రార్థించుచున్నాము. ఇక ఈ వైద్యశాలకు ధనమును వస్తువులను విరాళ మిచ్చి తోడ్పడ్డ మహాజనుల కందఱకు మా హార్ద కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాము.

నూత్నభవనములో రెండు గదుల నిర్మితికి చాలునట్లుగ శ్రీ K. జంబులింగము (మదరాసు) గారు రూ. 4,000/- లు విరాళ మిచ్చిరి. ఈ క్రింద పేర్కొనబడినవారు ఒక్కొక్కగది కట్టుబడికి చాలియుండునంతగా ఒక్కొక్కరును రెండువేల కెక్కుడు రూపాయలు విరాళ మిచ్చిరి.

1. శ్రీరామకృష్ణకృపాఆమెచ్యార్సు, మైలాపూరు.

2. ఒక మిత్రుడు, త్యాగరాయనగర్.

3. శ్రీ P. లక్ష్మీపతినాయుడు, కీల్పాక్కము.

4. శ్రీ B. నాగిరెడ్డి, కోడంబాక్కము.

5. శ్రీ G. H. నటరాజన్, మైలాపూరు.

6, శ్రీ కిషిన్‌చంద్ అలీంచంద్ సదరంగని, చేపాకము.

7. శ్రీ సేట్ బేగ్‌రాజ్ రావుసాహేబు సవల్దాస్, వెల్లూరు.

8. శ్రీ శంకరలాల్ జజోదియ, త్యాగరాయనగర్.

9. మెసర్స్ పొన్నలూరి బ్రదర్స్, త్యాగరాయనగర్.

10. శ్రీమతి P. S. రత్నాబాయి, ఎగ్మూరు.

మఱి కొందఱు వదాన్యులను ఈ క్రింద పేర్కొనుచున్నాము —

| | రూ. |
|---|---|
| 1. మాతృశ్రీశతతమజయన్త్యుత్సవ నిధి, మదరాసు | 10,674 |
| 2. శ్రీ T. N. కృష్ణస్వామి, మైలాపూరు | 1,100 |
| 3. రాజా సర్ ముత్తయ్యచెట్టియార్, అడయార్ | 1,000 |
| 4. మెసర్స్ యడలం అండ్ కో, జార్జ్‌టౌను | 800 |

5. మిస్ ఇ. జె. కుక్, ఆస్ట్రేలియా 545
6. శ్రీ కొండారెడ్డి, జార్జిటౌన్ 501
7. శ్రీ M. పరాశ్మల్ చోర్డియా, జార్జిటౌన్ 500
8. శ్రీమద్రంగనాథానందస్వామి, న్యూఢిల్లీ 500
9. శ్రీ K. రామస్వామిగౌండర్, పొల్లాచ్చి 500
10. మదరాస్ ఎనామెల్ వర్క్సు, లిమిటెడ్, ఎనామెల్‌వస్తు రూపాన 400
11. శ్రీ C. శ్రీనివాసన్ 10,000 ఇటికలు.

వీరికిని, వీరి కన్న కొంత తక్కువగా ధన మిచ్చిన తక్కిన మిత్రులకును, ఇతర విధముల సాయపడిన వారికిని, విద్యుద్దీపముల అమరికను చాలచౌకగా చేసియిచ్చుటే కాక, నేటి దీపపు ఏర్పాట్లను ఉచితముగా చేసిన శ్రీ P. ఉమాపతిగారికిని మా కృతజ్ఞతను దెలుపుకొను చున్నాము.

భగవత్సేవగా భావించి యీ కట్టడపు పని మొదటినుండి తుదవఱకు మిక్కిలి శ్రద్ధతో జరిపించిన శ్రీ S. R. గోపాలయ్యర్ (సూపరింటెండింగ్ ఇంజనీర్, రిటైర్డు, P. W. D.) శ్రీ V. అరుణాచలయ్యర్ (ఎక్సెక్యూటివ్ ఇంజనీరు) అను నిరువుర పట్ల మా కృతజ్ఞత ఇంత అంత అన లేము. ఈ పనికి గుత్తదారు లైన కింగ్ అండ్ కో వారికిని, బేల్దారులకును వడ్రంగుల కును తక్కిన పనివాండ్రకును గూడ మా హృదయపూర్వక ధన్యవాదములు.

పేద రోగులకు వైద్యసాహాయ్యము చేయు ఈ దరుచైద్యశాలకు ఉదారమహాజనుల విరాళములే మూలాధారములు. 1953 వ సంవత్సరము వఱకును పాతికేండ్ల కాలము శ్రీ H. B. శంకరరావుగారు ఇంటింటి కేగి ధనము యాచించి తెచ్చి అర్పించుచుండిరి. వారికి మా ఆశీస్సులు అభినందనములు. క్రిందటి తూతి సంవత్సర మొకటికి మాకు ఐన వ్యయము రూ. 13,000. అందులో రూ. 3,000 లను సర్కారువారు ఒసంగిరి. క్రొంగ్రొత్త శాఖలు పని చేయు కొలది, వ్యయము హెచ్చుచుండును గదా. సమృద్ధిగ విరాళము లిచ్చి ఈ యుత్తమ ధర్మకార్యమునకు తోడ్పడుదురు గావుత మని వదాన్య శేఖరులను అర్థించుచున్నాము.

ఈ ధర్మవైద్యశాల చరిత్రమున నే డొక మహోజ్జ్వలదినము. "ప్రజాశ్రేయమునకై నేను నా ప్రాణములను అర్పింప ఒనగూడు శుభ దినము ఏనాటికి వచ్చునో" అను స్వామిజి సుప్రసిద్ధ సూక్తిని స్మరింపక ఉండ లేము.

ఈ పవిత్రసేవలో అన్వయించినవారి కెల్ల శ్రీశారదారామకృష్ణుల పరమానుగ్రహము కొంగుబంగార మగుగాత!!

## శ్రీరామకృష్ణసేవాసమాజము, తెనాలి

తే 23-12-56 ది శ్రీశారదాదేవి 104 వ జన్మదినోత్సవము విభవోత్తరముగ జరిగినది. శ్రీ ఆలూరి సుందరరావుగా రింట నాటి పగలు తిథిపూజయు, రాత్రి శారదాచరిత్రమును గూర్చిన ములుకుట సదాశివశాస్త్రుల హరికథయు, మఱునాడు శ్రీవాసవీకన్యకాపరమేశ్వరీదేవ్యాలయమున బహిరంగసభయు జరిగినవి. బహిరంగసభాకార్యక్రమమున మహో

పాధ్యాయ జమ్ములమడక మాధవరాయశర్మ గారు, ఉభయభాషాప్రవీణ శ్రీమతి ఊటుకూరి లక్ష్మీకాంతమ్మగారు మున్నగువారు పాల్గొనిరి. శ్రీరామశరణ్ కుందుర్తి వేంకటనరసయ్యగారు, శక్తీశ్వరరావుగారు సమాజమునకు ధన వస్తువిరాళా లిచ్చి ధన్యులైరి.

మట్టిగుంట వీరభద్రరావు,
కార్యదర్శి.

శ్రీగీతాప్రేమసమాజము, తుని

జగన్మంగళమునకై రాజయోగి శ్రీ దేవత రంగనాథరావుగారి ఆధిపత్యమున శ్రీమన్నారాయణాష్టాక్షరీ మహామంత్రకోటి జపయజ్ఞము తే 9-2-1957 ది లగాయతు 47 దినములు జరుగును. జరుగవలసిన అన్నదానాదులకు వదాన్య భక్తవతంసులు అన్నివిధములుగను తోడ్పడి పాల్గొన ప్రార్థితులు. ఆ సిసు లందఱకును ఈ తరుణము అపూర్వము.



# గ్రంథసమీక్ష

"దాసబోధ"

[మూలము : శ్రీ సమర్థ రామదాసస్వామి. అనువాదము : శ్రీ కొణకంచి చక్రధరరావు. ప్రాప్తిస్థానము : శ్రీ వ్యాసాశ్రమము, ఏర్పేడు పోస్టు, చిత్తూరుజిల్లా. మూల్యము: రు. 8-0-0.]

భవతారకనాముడైన శ్రీరామునికి ప్రత్యక్ష భక్తుడై హనుమదవతారముగ జన్మించి, తరించు మార్గము నుపదేశించి జాతిని తరింపచేసిన శ్రీసమర్థరామదాసస్వామి మహారాష్ట్రభాషలో రచించిన భక్తిజ్ఞానకర్మబోధల కిది ఆంధ్రానువాదము. నిజమున కిది లౌకిక మగు తత్వగ్రంథము. భగవద్గీతోపనిషత్తులలో చివరి దగు యోగమార్గమును విడిచి శ్రీస్వామి ఆనుషంగికముగా బోధించిన భక్తిజ్ఞానకర్మలప్రాశస్త్యమును, తదాచరణవిధానమును, తత్ఫలమును వివరించు గ్రంథముగా దీనికి దాసబోధ యని నామముంచెను.

లౌకికవ్యావృత్తికి భిన్నము కాని విధమున తత్వము నెఱింగి ఋషులకుగూడ వాదోపవాదములలో మధ్యవర్తిగా నిలిచి పరతత్వమార్గమున విహరించి తరించిన జనకరాజర్షికి శ్రీ సమర్థరామదాసస్వామి ఆత్మీయుడా అను శంక ఈగ్రంథపఠనానంతరమునఁ గలుగక మానదు.

లోకోద్ధరణమునకు ఆవశ్యకములగు ఉపాయములు మూడు. అవి:

నీతిస్థాపనము, ధర్మస్థాపనము, రాజ్యస్థాపనము. వీనిని స్వామి సద్వర్తనము, హరికథానిరూపణము, రాజకారణము, అని పేర్లు పెట్టి ఒక్కొక్కటి సంఘజీవికి ఎట్లు పరబ్రహ్మ సాన్నిధ్యమును కలిగించు నుపాయ మగు చున్నదో, వివరించియున్నారు. నాల్గవ దగు యోగమును విడుచుటలో స్వామి యుద్దేశము సమంజసమై యున్నది. యోగమునకు నిర్వ్యాతము, శాంతము నగు ప్రదేశము కావలెను. మతము,

సాత్త్వికము నగు భోజన మవసరము. మౌనము, శాంతవృత్తి ప్రధానాంగములు. ఇవి యలవడనిచో యోగము కుదురదు. ఇది గృహస్థులకు అందుబాటులో నుండని ఉపాయము. ఈరహస్యమును గుర్తించి స్వామి ఈబోధలో యోగోపదేశమునకు గాని, తద్వివరణమునకు గాని ప్రవేశ మీయ లేదు.

దాసబోధలో విశిష్టత నీ క్రింద దిఙ్మాత్రముగా పొందుపరచుచున్నాను.

'భవాచ్యాభయేకాయభీతో సిలండీ
ధరీరే మవాధీరధాకాసి పాండీ'—

''ఓపిరికిపందా, నీవు ఈభవభయమువలన నేల భీతి నొందుచున్నాడవు? ధైర్యమనస్కుడవు కమ్ము. భయమును త్యజించి వేయుము.– ''ఓమానవుడా, నామాటలు శ్రద్ధగా వినుము. తనువు, మనస్సు, వాక్కు పత్రము, పుష్పము, ఫలము, జలము — మొదలగు వానిలో నీ కేది లభించునో దానిని పరమాత్మునికి సంతుష్టి కలిగించుటకై సమర్పించి నీ జీవితమును సార్థకము గావించుకొనుము. ఈలోకమున నీవు జనించినందులకు ఫలము ధర్మకర్మము లొనరించుచు భగవంతుని యనుగ్రహము సంపాదించుకొనుటయే! అట్టి సత్కర్మముల గావింపకుండు వేని వ్యర్థముగా నీభూదేవికి భారము గూర్చిన వాడ వయ్యెదవు.

''బాగుగా యోజించి చూడుము. ఈ శరీరమే నీది కాదు. అట్టి యెడ నెట్టి సంబంధము లేని వారి నందరను నావారు, నావారు అని పూసికొందు వేల? ఇప్పటి కైనను నీయొక్కయు, నీవు ప్రేమించుజనులయొక్కయు నస్థిరత్వము గ్రహించి భక్తిభావముతో పరమాత్మని నమ్ముకొనుము.

''సద్గురుని వచనమే వేదాంతము, సద్గురుని వచనమే సిద్ధాంతము, సద్గురునివచనమే ప్రత్యక్షమగు నాత్మానుభవము.—

కావున సద్గురూపదేశమును బడసి సమస్త కర్మములను గావించి (నిశ్చేష్టుడుగను, మొద్దుగను బడియుండక) సాయుజ్యముక్తిని బొందవచ్చును''— ఈలాటి సమర్థుడైన గురువు లభించినందుననే శివాజి ఛత్రపతియై ఏకచ్ఛత్రముగ భరతసామ్రాజ్యమును స్థాపించి పాలింపగలిగినాడు. అట్టిమహనీయుని బోధలు గల ఈ గ్రంథము సర్వవేదవేదాంతవిషయరత్నాకరమై యున్నది.

అనువాదకుల శైలి మూలకారుని హృదయమును పుడికి పుచ్చుకొన్న ట్లున్నది. గహనమైన విషయమును భాషాంతరమున నింత లలితముగా వివరించుటలో శ్రీచక్రధరరావు కృతకృత్యులై రనుట కావంతయు సందేహము లేదు. అక్షరాస్యు లెల్లరును బఠింపఁదగిన ఉత్తమ గ్రంథము.

-స్వామి,

# ప్రబోధ రత్నాకరము

(శ్రీ వివేకానంద ప్రవచనము)

అనువాదకులు : శ్రీ చిరంతనానందస్వామి

;నువాదకులు : మహాకవి విశ్వనాథ సత్యనారాయణ, కవికోకిల జి. జాషువ

227 పుటలు (ద్వితీయ ముద్రణము) వెల : రూ. 2-4-0

# శ్రీ రామకృష్ణ ఉవాచ
# శ్రీ శారదా సూక్తి నవనీతము
# శ్రీ వివేకానంద శంఖారావము

శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి — వీరు ముగ్గురును లోకమున కొసగిన సందేశమునందలి ముఖ్యాంశములు ఏర్చి కూర్చి విడివిడిగా సులభశైలియందు ముద్రింపబడియున్నవి. ఈ గ్రంథములలో జీవితమునందలి వివిధఘట్టములకు, వివిధవిషయములకు సంబంధించిన ఉపదేశములు గలవు. అందఱును చదివి తరింపగల చిన్న చిన్న పుస్తకములు.

పాకెట్టు సైజు (ప్రజ్వలముద్రణము) ఒక్కొక్కదాని వెల : అ. 0-6-0

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ లీలామృతము

(లేక శ్రీరామకృష్ణ జీవిత చరిత్ర)

అనువాదకులు :

కీ. శే. వెదురుమూడి కృష్ణరావుపంతులుగారు, బి. ఏ; శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

ప్రశస్తమైన వస్తువు, అకలంకమైన జీవితము, లోకోత్తరమైన సందేశము. దేహమును పులకరింపజేయు ఆధ్యాత్మికానుభవములు—శైలి సరళము, మధురము. భాష నిర్దుష్టము.—సర్వవిధముల నమూల్యమైన గ్రంథరాజము.

—శ్రీ పా. వే. రాజమన్నారుగారు, గౌ॥ ప్రధాన న్యాయమూర్తి, మద్రాసు.

* * * ఈ గ్రంథము విషయానురూపమై సుబోధమైన శైలిలో రచింపబడినదనుటకు ఎట్టి సందియమును లేదు. * * *

—శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు.

* * * ఆధునిక కాలములో వెలువడిన కొలది మహాగ్రంథములలో, అన్నివిధముల నిది యొకటి. * * *

—శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

196 పుటలు (ద్వితీయ ముద్రణము) వెల: రూ. 5

---

# శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకు పూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదరశిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీ స్వాములవారి సంపూర్ణ చరిత్ర!

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

438 పుటలు (సప్తమ ముద్రణము) వెల : { సాదా ప్రతి రూ. 3-0-0 / అట్ట బైండు రూ. 3-8-0 }

---

# శ్రీ శారదాదేవి చరిత్ర

(మూడవ కూర్పు)

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

ప్రతి స్త్రీయును పురుషుడును...చదువవలసిన గ్రంథ మిది...అమృతకలశము!... అనన్యసామాన్య నీతిమంజరి...తియ్యని తెలుగు...పాలవంటి శైలి... —ఆంధ్రప్రభ

246 పుటలు వెల : రూ. 2-0-0

---

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౩ ౧౯౫౭, ఫెబ్రువరి—దుర్ముఖి, పుష్యము సంచిక ౮

## విషయసూచిక

అమ్బాస్తోత్రమ్—[శ్రీ వివేకానందస్వామి] ౨౫౭
ఆత్మ—[శ్రీ వివేకానందస్వామి] ౨౫౮
శ్రీమత్స్వామి వివేకానందులు – భారతదేశపునరుద్ధరణము—[సంపాదకీయము] .. ౨౫౯
విగ్రహ వ్యావర్తని—డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు,
ఎం.ఏ., ఎం.లిట్., పిఎచ్.డి. ... ... ... ౨౬౫
మహాప్రభు వల్లభాచార్యులు—శ్రీ కర్ణ రాజశేషగిరిరావుగారు, ఎం. ఏ. ... ... ౨౭౫
అద్వైతమతము—విద్వాన్ చదలువాడ జయరామశాస్త్రిగారు ... ... ౨౭౮
త్యాగము—శ్రీగురుభక్త పెద్దభొట్ల కృష్ణశాస్త్రిగారు ... ... ... ౨౮౦
వార్తలు, విశేషాలు ... ... ... ౨౮౪
గ్రంథసమీక్ష ... ... .. ౨౮౮



"సర్వేశ్వరుని శరణు జొరుము, అతని కృప నీ యనుభవమునకు అప్పుడు వచ్చును."

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౩ { ౧౯౫౭ - ఫెబ్రువరి : : దుర్ముఖి - పుష్యము { సంచిక ౮

## అమ్బాస్తోత్ర

[ శ్రీ వివేకానందస్వామి ]

కా త్వం ? శుభే, శివకరే, సుఖదుఃఖహస్తే,
ఆఘూర్ణితం భవజలం ప్రబలోర్మిభఙ్గైః,
శాన్తిం విధాతు మిహ కిం బహుధా విభగ్నాం
మాతః, ప్రయత్నపర మాసి స దైవ విశ్వే ? ౧

అమ్మా, నీవు ఎవతెవు? మంగళరూపిణివి, శివకరివి, ఉభయహస్తముల సుఖదుఃఖముల నిర్వహించుచున్నదానవు, సంసారసముద్రమును సుడియజేయుచున్నావు, పెనుకెరటాల లేపుచున్నావు, బహుధా విభగ్నమైన శాంతిని మరల నెలకొల్పుటకేనా, నీవు సదా పడుచున్న పాట్లు అన్నియు?

సమ్పాదయ త్యవిరతం త్వవిరామవృత్తా
యా వై స్థితా కృతఫలం, త్వకృతస్య నేత్రీ,
సా మే భవ త్వనుదినం వరదా భవానీ
జానా మ్యహం ధ్రువ మిదం ధృతకర్మపాశా ॥ ౨

ఎడతెంపు లేక పాటుపడుచు, ప్రారబ్ధకర్మలకు ఫల మిచ్చుచు, భవిష్యత్కర్మలకు దారి జూపుచు నున్న భవానియే కర్మపాశముల తనచేత దాల్చి యున్న దనుట ధ్రువము, నే నెఱుగుదును, అట్టి ఆమె నాకు ప్రతిదినమును వరప్రదాయిని అగును గాక.

[సశేషము]

# ఆత్మ

## [ శ్రీ వివేకానందస్వామి ]

౧. నేను ఇట నిలుచుండి నా కన్నులు మూసికొని నా ఉనికిని భావనలోనికి తెచ్చికొన ప్రయత్నించుచున్నాను. 'నేను' 'నేను' 'నేను' అన్నప్పుడు నా తలంపునకు వచ్చునది ఏది? దేహమే. మఱి నేను వట్టి ప్రకృతివస్తువుల కలయికనేనా? కానే కాను అనియు, నేను దేహమును అధివసించి ఉన్న ఆత్మను అనియు — వేదములు తెలుపుచున్నవి. నేను దేహమును గాను, వినాశము దేహమునకు కలదు, నాకు లేదు. ప్రస్తుతము నేను ఈ శరీరమున ఉన్నాను. ఈ శరీరము పడిపోవును. నా జీవిత మేమో అవిచ్ఛిన్నముగనే సాగుచుండును.

౨. స్వాతంత్ర్యపారతంత్ర్యములును స్వేచ్ఛాదాస్యములును కలిసియే ఈ జగత్తుగ రూపొందిన వట, స్వతంత్రమును నిత్యమును స్వచ్ఛమును పరిపూర్ణమును పవిత్రమును ఐన ఆత్మయే ఈ యన్నిటి గుండ వెలుగొందుచున్న దట — అట్లని వేదములు చెప్పుచున్నవి. మరణము అనగా ఒక మార్పే, అది కొన్ని కారణాల మీద ఆధారపడి ఉండును. కాబట్టి స్వాతంత్ర్యమున్న చోట మరణము అసంభవము. అట్లే లోపముల కలిమియు నొక్క దశాభేదమే, కారణసాపేక్షమే, కావున స్వాతంత్ర్య మున్న చోట (లోపమును అసంభవమే.) పరిపూర్ణత ఉండక తప్పదు. నిత్యమును పరిపూర్ణము నైన స్వరూపము గల యీ యాత్మయే పరాత్పరునందును గలదు అల్పిష్ఠ మానవునందును గలదు. ఒక్కటే ఆత్మ ఒక్కొక్కరిగుండ ఒక్కొక్కంతగ ఆవిష్కృత మగు చుండు ననుట ఒక్కటే భేదము.

౩. ద్వంద్వజగత్తులో ప్రతిదానిసద్భావమును ప్రతిబింబితసద్భావమే కావున, వేఱొక చోటి నుండి ఆనందమును ఎరవు తెచ్చుకొన్న దేదో దానినే ఆనందవంతము అన దగి యుండును, వేఱొక చోటినుండి జ్ఞానమును అధిగమించిన దేదో దానినే జ్ఞానవంతము అన దగి యుండును. ఆత్మ జ్ఞానవంతము అగుట పొసగదు. జ్ఞానమే ఆత్మ. ఆత్మ ఆనందవంతము అగుట పొసగదు. ఆనందమే ఆత్మ.

౪. హిందువుల నమ్మకము ఏ మనగా — ప్రతి ఆత్మయు ఒక గోళము. దానికి పరిధి లేదు, కాని కేంద్రము ఉన్నది. ఆ కేంద్రము దేహములో నెలకొని ఉన్నది. మరణము అనగా ఆ కేంద్రము ఒకయొడలినుండి వేఱొక యొడలికి మార్పొందుటే. ఆత్మకు ప్రకృతిపరిస్థితులవలని పరిచ్ఛేదము సైతము లేదు. స్వేచ్ఛయు అపరిచ్ఛేదమును పవిత్రతయు స్వచ్ఛతయు పరిపూర్ణతయునే ఆత్మ స్వరూప సారాంశములు ఎట్లో చెప్ప లేము కాని, ఆత్మ ప్రకృతికి కట్టువడి తాను ప్రకృతియే అని భ్రమించుచుండును.

౫. దేవునకు మానవత్వము ఆపాదింప జేసెడి యీ తలంపు హిందువులకు సంతృప్తికరముగ లేదు, ఏల యన వారు దైవాన్వేషకులు, వారి దృష్టికి ఇది కేవలము మానవోచితము. కావున వారు తుదకు బాహ్య మైన ప్రకృతిరంగమునందును ఇంద్రియగోచర మైన జగత్తునందును

దేవుని వెదకుటను మానుకొని తమ దృష్టిని అంతర్జగమువైపు మరల్చికొనిరి. అంతర్జగము అను నదొకటి కలదా? అది ఏది? అదే ఆత్మ. అదొక్కటే ప్రతివ్యక్తియు 'నిజము' అని నమ్మదగినది. ప్రతివ్యక్తియు తన్నెఱింగిననే, లోకము నెఱుంగ గలడు, వే ఱొక రీతి నెఱుంగ లేడు.

౬. 'నేను'ను లేదు 'నీవు'ను లేదు. అంతయు ఒక్కటే. అంతయు 'నేనే'; లేదా అంతయు 'నీవే'. ద్వైతభావన కేవలము మిథ్య. మనము సాధారణముగ నెఱిగియుండునట్టి యీ జగము పూర్వోక్త భ్రాంతి విలసితమే. వివేకోదయమై, ఉన్న దెల్ల ఒక్కటే, రెండు కాదు అని తెలియనైనప్పుడు మానవుడు తనకును విశ్వమునకును ఉన్నట్టి అభేదమును గుర్తించును.

౭. పైపైకి విరుద్ధములువోలెను ఒండొకదానిని ఖండించుకొనువానివలెను కనిపించు వర్గములకు జెందిన వారు సమష్టిగ అంగీకరించు సిద్ధాంతము ఏదేని ఒకటి ఉండు నేని అది ఇదే — సకలమహిమయు సర్వశక్తియు సమస్త పవిత్రతయు ఆత్మలో సహజముగనే ఉన్నవి. ఆత్మకు అప్పు డప్పుడు సంకోచవికాసములు గలుగుచుండు ననుట రామానుజమతము, ఆత్మకు మాయచే మఱుగుపాటు గలుగుచుండు ననుట శంకరుని మతము. ఈ భేదముల కేమిగాని, శక్తి గూఢముగనో ప్రకటముగనో ఆత్మలోనే ఉన్న దనెడి సత్యమును అందఱును ఒప్పికొందురు. అందు నమ్మకము ఎంత త్వరగా గలిగిన నీకు అంత శ్రేయము.

౮. మనలను ఆవేశించి యున్న స్వతంత్రభావమే, మనలో మనశ్శరీరాలకంటె వేఱైన దొకటి కలదు అనుటకు నిరూపకము. లోపల నుండి ఏలుచున్న ఆత్మ స్వతంత్రము, ఆ యాత్మయే స్వాతంత్ర్యాభిలాషను గలిగించుచున్నది.

[సశేషము]



# శ్రీమత్స్వామి వివేకానందులు - భారతదేశపునరుద్ధరణము

## [సంపాదకీయము]

వృద్ధిక్షయాలు ప్రకృతిధర్మాలే కదా! మన భారతదేశము కూడ, ప్రాచీనకాలమున తాను అందుకొన్న ఉన్నతులనుండి పతనము చెంది ఉండి, ఇటీవలనే మరల తల ఎత్తుటకు ఆరంభించినది. మనము దిగులు చెంద వలసిన అవకాశము లేనే లేదు. విశ్వ మానవపరిషత్ ప్రణాళికలలో భారతీయులు న్యాయరీతి పాల్గొని తీఱుదురు. భారతదేశము తన సొంత స్థాయిని మరల అధిరోహించును, నిర్వికల్ప మైన విధినిర్ణయమును అనుసరించి, విశ్వాభివృద్ధిలో భారతమాత మిక్కిలి ప్రముఖ మైన పాత్రను తప్పక నిర్వహింప నున్నది, పాశ్చాత్యప్రపంచమందలి విపన్నాత్ములకు భారతమాత సంజీవకరణిగా తోడ్పడ నున్నది, భగవ దన్వేషకులకు అసంఖ్యాకులకు ఆశ్రయము ఒసగనున్నది.

ధ్యాత్మిక జీవితమును, భారతమాత తాను విచారించుకొనుచున్నది. కావుననే రాజ్యాంగ శాస్త్రము సంఘశాస్త్రము మున్నగు వాని పట్ల పాశ్చాత్యులు ఆసక్తి చూపుచుండ, మతాస్తిక్యాదులు భారతీయులకు హృదయంగమములై అత్యంతప్రియములై ఉన్నవి. ఆస్తికతకు సంబంధింపనిది ఏది ఐనను సరే, భారతీయుల చిత్తవృత్తికి నచ్చదు, వారు దానిని త్యజించుచుందురు. ఆస్తికతకు సంబంధించిన విషయములైననే భారతీయులకు ఆసక్తి గొలుపును. సంఘధర్మాలను గాని, రాజకీయబాధ్యతలను గాని, ఇంకను అట్టి యితర విషయాలను గాని భారతీయుల హృదయాలకు ఎక్కింప వలెననినచో, మతము పేర ఐననే అది సిద్ధించును, పరమార్థము పేర ఐననే అది సిద్ధించును, ప్రకృత్యతీత తత్త్వము పేర ఐననే అది సిద్ధించును. ఆస్తిక్యస్పర్శ లేకున్నచో, ఏదియును భారతీయుల చిత్తములను మరులుకొలుపలేదు. శ్రీవివేకానందస్వామిజీ ఒక చోట ఈలాగు సెలవిచ్చారు — ఆంగ్లదేశమునకు గాని అమెరికాఖండమునకు గాని పోయి అచట ఏపనివానినైనను పిలిచి ''మతమును గూర్చి నీకు ఏమి తెలియు నోయి'' అని అడిగి చూడుడు. మీరు నిరీక్షించిన జవాబు అతని నోట రాదు. ప్రతి భానువారమును చర్చికి పోవుట తప్ప, అతని ఆస్తికతలో అంతకు పై మెట్టు లేదు. ఆ పోవుట ఐనను ఏ లాకో అతనికి అక్కఱ లేదు. తన నాయన చర్చికి పోవుచుండినాడు, కావున తానును పోవుచున్నాడు. ఆవిషయములో అతనికి అక్కఱ అంతే, వానినే ఏదైన రాజకీయవిషయమును గూర్చి ప్రశ్నింపుడు, ప్రభుత్వములను గూర్చియు పాలకపరిషత్తులను గూర్చియు అతడు గంటల కొలది ఉపన్యాసము దంచును. పత్రికల వార్తలు అతడు బాగుగ జీర్ణించుకొని యుండును. భారతదేశపు పల్లెవాసిని దరిసి విచారింతమా, అంతయు ఇందులకు వ్యతిరిక్తముగ ఉండును. దేవునిగూర్చి, కర్మమునుగూర్చి, జ్ఞానమునుగూర్చి, భక్తిని గూర్చి, అవతారములనుగూర్చి, ఇంకను అట్టి తక్కిన విషయాలనుగూర్చి అతడు మీకు ఎంతో చెప్పగలడు కాని, దేశరాజకీయవిషయాలనుగూర్చి అతనియెఱుక అల్పాల్పమే. మతమే మన దేశమునకు ప్రాణవాయువు, వేదాంతమే మననాళాలలో ప్రవహించుచుండు నెత్తురు, కావున మన దేశమున పునరుద్ధరణము గలుగ వలెనన్న, అందులకు మూలమును మతమే, ఆధారమును మతమే, అది మన దేశమునకు నైజము.'' కావున భారతదేశ సనాతినాస్తిక్య మహిమనుస్మరించినప్పుడు ఒక ఉత్సాహము పొంగి పొరలునుగదా, అదే ఉత్సాహము ఈ నూత్న పునరుద్ధరణోద్యమ ప్రవర్తకులలో పరిపూర్ణముగ ఉన్నది.

భారతదేశ పునరుద్ధరణోద్యమ ప్రవక్తలలో అగ్రగణ్యులకు శ్రీవివేకానందస్వామికి ఉన్నంత అర్హత వేఱు ఎవ్వరికిని లేదు అనిన అతిశయోక్తి కాజాలదు. ఆయన సన్న్యాసి, వేదాంతి, యత్రసాయంగృహుడైన పరివ్రాజకుడు, అస్ఖలితబ్రహ్మచారి. ఆస్తిక్యప్రవణములైన మన దేశీయుల డెందములలో ఆయన సందేశముపట్ల పరమాదరము గలిగినది. సర్వేశ్వరునికై తమ సర్వస్వమును పరిత్యజించిన మహనీయులను ఆదర్శులుగ ఉంచుకొని అనుసరించుట మన దేశమున ఎల్లప్పుడును వాడుకలో ఉన్నదే.

స్వామిజి అవతరించిన కాలము మిక్కిలి అనుకూలమైనది. మనదేశచరిత్రలో అది

చాల విషమయుగము. భారతీయులు అంధులై ఐహికపరత అను అడుసులో దిగబడిపోవుచుండిరి. యువకులెల్లరును నూత్న నాగరక విధానాలపై వింత వ్యామోహము గలిగియుండిరి. ఈ పరిస్థితిని చక్కపఱుప ఎవరును పూనుకొనకున్న, మన జీవితమే ఉక్కిరి బిక్కిరియై, మన ప్రాముఖ్యము రూపు మాసి పోయి యుండెడిది. కాని లోకోద్ధారకుడు అవతరింపక తప్పడు. సామ్రాజ్య మహానగరాలలో రెండవది అనిపించుకొన్న కల్కత్తాకు సమీపాన ఒక పరమహంస అవతరించినాడు. ఆయన యుపదేశములు అసంఖ్యాకులకు వెలుగు నొసంగినవి. ఆయనచేత ఆకృష్టుడై శ్రీవివేకానంద స్వామి ఆధ్యాత్మికజీవితామృతమును గ్రోలి పరిపూర్ణత జెందెను. అనంతరము ఆయన ఏకాంత సాధనలచే సిద్ధుల నొంద గోరి హిమాలయముల కేగెను. విధి నిర్ణయానుసారము లోకములో తాను నిర్వహింప వలసిన కర్తవ్యాలను ఆయన చక్కగా గుర్తెఱిగియుండెను.

భారతప్రతిభను సాగరాంతరిత భూభాగాలలో పర్వించి అచటివారిచే తలలు ఊపించుటకును, మన వేదాంతమందును వాఙ్మయమందును విదేశీయులకు ఆసక్తిని గలిగించుటకును శ్రీస్వామిజీ ఎంతో పాటుపడెను. హిందూసిద్ధాంత మహిమను, దాని సనాతనత్వమును, మన సంప్రదాయములోని ఉదాత్తతను, మన పూర్వులు మనకు సంక్రమింజేసిన సర్వస్వములో ఉన్న విలువను — స్వామిజి పాశ్చాత్యులకు విస్పష్టముగ తెలియ జేసెను. విషణ్ణ విశ్వమునకు జ్యోతిఃప్రదాయిని కాగలది భారతమాతయే అని ఆయన చూపెను. ఆయన వేదాంత సిద్ధాంతమును చక్కగా చూపి, అన్ని మతములును ఒక్కటే అను తన గురునాథుని వాణిని ఉపపత్తులతో దెసల ప్రతిధ్వనింప జేసెను. పాశ్చాత్యులకు కుతూహలమును అభిరుచియు గలిగి, వారిలో అనేక పండితులు మన మతవాఙ్మయమందు తలస్పర్శముగ అవగాహన చేసి, జీవితసమస్యలకు పరిష్కారములను పొంద గలిగిరి.

స్వామిజికి ఉండిన మాతృదేశభక్తి నిరతిశయమైనది. భారతమాత ఆయనకు కాళీమాతృ రూపాంతరమే. మనకు అపేక్షణీయములైన వానిలో ప్రప్రథమగణ్యము మన దేశక్షేమమే అనుట ఆయన అభిప్రాయము. దేశీయులు అందఱును ఆయనకు సొంత తోబుట్టువులు. ఆయన ప్రత్యేకముగ ఒక వర్గమునకో శాఖకో కక్షకో చేరినవాడు కాడు. మాతృదేశపు మట్టి సైతము ఆయనకు పరమపవిత్రము. మాతృదేశమునకు తొంటి ఉన్నతిని మరల గలిగించుటకై ఆయన పాటువడెను. నిద్రాణులమై ఉన్న మనలను ఆయన మేల్కొల్పి లేపి 'గంతవ్యమును చేరునందాక ఆగకుడు' అని కఱపినాడు. ఫలితాలను ఆయన ఎన్నడును లక్ష్యపెట్టలేదు. సేవ చేయుట ఆయనకు ఏకైక లక్ష్యము. అజ్ఞానాంధకారమున పడి యున్న ప్రజాకోటి యోగక్షేమ నిర్వహణమును ఆయన తన తలందాల్చెను. "ఈ దరిద్రనారాయణుల ఆరాధింపుడు, వీరి ఆరాధనమే దైవారాధనము" అనెడి యీ వక్కణమే ఆయన జీవితపరిభాష. సంఘసేవ చేయుటకును అధఃపతితులను ఉద్ధరించుటకును ఆయన యావనోత్సాహ పూరితులైన సాధువులను ఒక సంఘముగ కూర్చినాడు. నిస్స్వార్థ సేవా సక్తులదైన యీ సంఘము [మిషను] నాటినుండి నేటివఱకును విద్యా సాంఘిక రంగాలలో మహోజ్జ్వల ప్రణాళికలను నిర్వహించుచు వచ్చుచున్నది. విద్యావ్యాప్తి

కావలె నని స్వామిజీ ఘోషించెను. "విద్య గఱపుట అనగా వే ఱేమియును గాదు, మానవుని సహజ పరిపూర్ణతను ఆవిష్కరించుటే" అని ఆయన నిర్వచించినాడు. దారిద్ర్యపీడితులై ఉన్న ప్రజలు విద్యను తమ అందుబాటులోనికి తెచ్చుకో లేకున్న, అదే వారి అందుబాటులోనికి వచ్చి తీఱ వలెను. అవిద్యయే సర్వ దుఃఖములకును మూలము. మన దారిద్ర్యమున కేమి, పారతంత్ర్యమున కేమి, ఇతర దేశీయులకంటె మనము అన్ని విషయములలోను వెనుకబడియుండుట కేమి, — కారణము ప్రజల విద్యావిహీనతయే. దీనిని దీనిదుష్ఫలితాలను తొలగించుటకై చేయ దగిన వాని నెల్ల స్వామిజీ చేసినారు.

దరిద్రులను నిమ్నులను అధఃకృతులను జూచినప్పుడు కడుపు తఱుగుకొనిపోవు ఆర్ద్రహృదయము శ్రీస్వామిజీది. యథార్థ మైన విశ్వప్రేమతోను దూరదృష్టితోను "అస్పృశ్యతను అణచి వేయ కున్న, మన దేశమునకు సుగతి కలుగదు" అని ఆయన తెలిసికొన్నాడు "పతితులను ప్రేమతోను ఆత్మీయభావముతోను కౌగిలించుకొనుడు. నిమ్నులు ఉన్నతులు అను రెండు తరగతులు ఉండరాదు. ఆ రెంటి నడిమి అంతరమును తగ్గించుటకును అందఱు ఒక్కటి అగుటకును పాటువడు" డని స్వామిజీ దేశీయులకు ప్రబోధించినాడు, పేదల యింటింటను ప్రేమయు వెలుగును ఒద్దికయు నెలకొన వలె నని ఆయన ఘోషించినాడు, వారికి విద్య గఱపుడు, వారికి నాగరకతను అలవఱుపుడు, భారతదేశమున ఆర్థికదుఃస్థితి తీఱిపోవును — అని ఆయన మాటిమాటికిని తెలుపుచుండినాడు, మనప్రభుత్వమువారు అస్పృశ్యతను నిషేధించు చట్టమును ఈనాటికి ఏర్పఱుపర్పణమును స్వామిజి అర్ధశతాబ్దికి ముందే చేసియుండెను.

హిందువులలో ఐకమత్యము కావలె నని అభిలషించుటే కాక, దేశభక్తు డైన యీ ప్రవక్త హిందూమహమ్మదీయుల మైత్రి ఎంత ఆవశ్యకమో, దానిని సైతము గుర్తింపక పోలేదు. ఆ ఉభయ వర్గ మహాజనులకు మైత్రి కుదిరిననే దేశమునకు అభ్యుదయము గల్గు నని ఆయన స్పష్టముగ గ్రహించెను. భారతదేశ ప్రజానీకమునకు వేదాంతము ఆత్మగను మహమ్మదీయమతము శరీరముగను, అట్లు ఉభయమునకును శరీరశరీరిభావ కల్ప మైన పొత్తు కుదిరిన యెడల అఖండభారతము రూపుదాల్చు నని ఆయన కలలు గాంచుచుండెను. ప్రవేశించిన ప్రతిసంప్రదాయమును తమలో కలుపుకొనుట అనాదికాలముగ భారతీయుల ఆచారము, కావున భారతదేశోన్నతిసాధనలో దేశమందలి ప్రతిమతమును తన వంతును తప్పక నిర్వహించిన దని స్వామిజి చక్కగా గుర్తించెను. కావున ఈ అన్నిటని తనలో ఇముడ్చుకొను అఖండసంస్కృతిని గొనివచ్చుటకే, ఆయన తన గురుదేవుడు నేర్పిన "అన్ని మతాలు సత్యములే" అను పాఠమునకు ఆచరణప్రచారాలు కూర్ప పాటు వడెను. మతకలహములు అన్నియు వ్యర్థోన్మాదప్రకోపములే అని ఆయన నిరూపించెను. హిందూతత్త్వము విశాల మైన దనియు, ఉదార మైన దనియు, దాని ఆశ్రయమున సకలేతరమతాలవారును హాయిగా ఉండ గలిగి రనియు ఆయన ఎత్తి చూపినారు, మతాంతరుల హింసించు ఆచారము ఈ దేశమున ఎన్నడును లేదు. చికాగో సదస్సున స్వామిజి అవిస్మరణీయముగ అనుగ్రహించిన ఉపన్యాసానంతరము న్యూయార్కులోని ఒక

విజ్ఞానమహిత మైన ఆ దేశమునకు మతప్రచార కులను పంపుచున్న మనము ఎంత అవివేకులమో స్పష్టపడినది'' అని వ్రాసినది. చూచితిరా దృక్పథములో ఎంతటి మార్పు గలిగినదో!!

సంఘమును సంస్కరింప వలె అను ఉబలాటము గల వారిలో కూడ స్వామిజీ అగ్రగణ్యుడే. మహిళలను ఉపేక్షించితిమేని భారత ప్రజానీకములో ఒక్కసగభాగమునకు అభివృద్ధులు లేకుండ జేసిన వారము అగుదుము, కావున మహిళలను ఉద్ధరించి తీఱవలెను అనుట స్వామిజి యభిప్రాయము. మహిళలకు అత్యున్నతలక్ష్యము పాశ్చాత్యుల దృక్పథమున గృహిణీపదము, భారతీయుల దృక్పథమున మాతృపదము. ఈ విశేషమును ఆయన గుర్తించెను. హిందూసంఘమున మగువల స్థానమును గూర్చి యేర్పడి యుండిన అపోహలను ఆయన ఖండించి 'హిందూకుటుంబాలలో ధర్మపత్నికి గల స్థానము స్పృహణీయము' అని నిరూపించెను. ప్రతిమహిళయు లోకమాతృ ప్రత్యక్షరూపము అనియే ఆయనభావము. మహిళలకు విద్య గఱప వలె నని ఆయన వాదించెను. కాని మన సనాతనాచారములనే అనుసరింప వలెను. మన సనాతనలక్ష్యములకు బాధకములుగ పరిణమించెడి పాశ్చాత్యాదర్శములను అనుసరింప రాదు అని ఆయనచిత్తము. మన మహిళలకు ఆయన కావించిన బోధ— ''మఱువకుడు, సీత, సావిత్రి, దమయంతి మున్నగు వారి సంతతివారలు మీరు. వారినడవడిని బోలిన నడవడిని అలవఱచుకొనుట మీలో ఒక్కొక్కరికిని కర్తవ్యము. మీరు అందఱును వీరమాతలు అగుదురు గాక. మన దేశభవిష్యత్తు మీపైనే ఆధారపడి ఉన్నది.'' స్వామిజీవిశ్వాసమును చూఱగొన్న కార్యనిర్వాహకులలో ప్రాచ్య పాశ్చాత్య మహిళలు ఎందఱో కలరు. వారిలో మిస్ మార్గరెట్ నోబల్ (సోదరి నివేదిత) సుప్రసిద్ధురాలు.

మహిళలకు ఎట్లో అట్లే యువకులకును స్వామిజి అందజేసిన సందేశము కలదు. యువకులలో విశాలదృక్పథమును సహనమును దేశభక్తిని ప్రజా సేవా దీక్షను గలిగించినది ఆయనయే. వారిని ఆయన 'విదేశములందు పర్యటించి పాశ్చాత్యవిజ్ఞానములోని ఉత్తమాంశములను అన్నిటిని స్వీకరింపుడు' అని పంచినాడు. ఆయన కార్యరంగమునకు ఉరుకుటకు మునుపు, స్వదేశీయమైనట్టి ప్రతిదానిని కంటగించుకొను నొక పెనురోగము ప్రజలలో పొటకరించి యుండెను. ఆరోగమును నిర్మూలించిన భిషజ్మణి స్వామిజి. ఆయన మన యువకులకు ''మేము భారతీయులము అని సగర్వముగ చెప్పుకొనుడు, విశ్వాసముతోను ధైర్యముతోను ప్రతిభారతీయుడును మా సోదరుడె అని ఘోషింపుడు. తల్లికై సర్వస్వ పరిత్యాగము చేయుడు. మన పురాణవీరులను ఆదర్శులుగ ఉంచుకొని మీరు అందఱును మీ జీవితాలను దిద్దుకొనుడు. 'నన్ను ఒక మానవునిగ జేయు' మని మీరు, ఒక్కొక్కరును, దేవుని ప్రార్థింపుడు'' అని ఉపదేశించెను. కర్మలను త్యజించి పాఱిపోయినచో ప్రయోజనము లేదు అని చూపి స్వామిజి కర్మయోగిలక్ష్యమును ప్రదర్శించెను. ''నాసోదరులలో ఏ ఒక్కనికైనను సరే స్వర్గములోనికి ప్రవేశము లభింపకుండునంతవఱకు నేను అందు అడుగు ఇడను'' అన్నారు. వేదాంతసిద్ధాంతము నిత్యజీవితములో ఆచరణసాధ్యమే అని ఆయన చూపినాడు. మానవునిలోని దివ్యత్వమును జూపి, మానవుని వృద్ధి గాని పతనము గాని

అతని చేతిలోనే ఉన్న దని ఆయన తెలిపినాడు. మానవునకు అసాధ్య మైనది లేనే లేదు. 'మనము పాపులము'' అను వారికి వివేకము లేదు.

స్వామిజి తమ కార్యనిర్వహణప్రజ్ఞను ఇతర మార్గాలలో కూడ ప్రదర్శించినాడు. ప్రాక్పశ్చిమములు పరస్పరము సాపేక్షు లే కాని విరుద్ధములు కావు అనియు రెంటి మేళనము సర్వార్థసాధక మనియు ఆయన వాక్రుచ్చినాడు. భారతమాత మతాల తల్లి. పాశ్చాత్యులు భారతీయుల ఆశ్రయించి ఆధ్యాత్మికతను తాము అలవఱచుకొందురు కాక, అలవఱచుకొని, భారతీయులకు తాము ఐహికాభివృద్ధిని ఆర్థిక క్షేమమును సంపాదించుకొను రీతులను నేర్పుదురుగాక. భారతమాత దీర్ఘనిద్రనుండి మేల్కొని లోకమునకు వెలుగు నిచ్చు భూమికను మరల నిర్వహింప వలయు నని స్వామిజి ఆదేశము.

సంస్కృతభాషను పెంపొందింప వలెను. ప్రాచ్యదేశాల చరిత్రాదిపరిశోధనల సాగింప వలెను——ఇది స్వామిజి మఱియొక ప్రతిపాదన. ఆధ్యాత్మికముగ మనకు సంక్రమించిన పితృధనమును సారస్వత రంగమున మనకు సంక్రమించిన పితృధనమును మన సొంతము అనుకో గలిగి ఉండవలయును అనిన సంస్కృతభాషాధ్యయన మొక్కటే అందులకు మార్గము. ఉపనిషత్తుల మహిమను ఆయన నొక్కి చెప్పి ఇందనుక మనము ఉపేక్షించుచుండిన నిధులను త్రవ్వికొంచ మను తీవ్ర మైన కోరికను మనకు కలిగించినాడు.

తన జీవితకాలమున ఆయన క్షణ మైనను విశ్రాంతి ఎఱుగడు. విశ్వశ్రేయస్సాధన యనెడి మహిష్ఠ లక్ష్యమునకై ఆయన తన ఆరోగ్యమును జీవితమును అర్పణము కావించినాడు. ఆయన నిజముగ మహాబలుడు, భీమబలుడు, పత్రికలకు వ్యాసములు వ్రాయుట, ఉపన్యాసములు చేయుట, శిష్యులను కూర్చుండ బెట్టుకొని మత విషయిక పాఠాలను గఱపుట మొదలయిన పనులు గాక, ప్లేగు వ్యాపించిన ప్రాంతాల వారి సాయమునకై స్వయముగ తానే ఏగుచుండెను. ఆ మహత్కార్యాలలో మహారాజులును విదేశీయులును ఆయనకు తోడ్పడిరి. ఆయన వ్యక్తిమహిమయు ఉపన్యాసధాటియు వేలకొలదిగ ప్రజలను ఆకర్షించినవి. తాను నిర్వరింప వలసిన పని ముగిసిన దని తెలిసికొన్న వెంటనే ఆయన అవతారమును ఉపసంహరించుకొన్నాడు. కాని ఆయన వెలిగించిన జ్యోతి ఆఱిపోవను లేదు, అది ఆఱిపోవునది కాదు, ఆయన ఎత్తిన ధ్వజపటము ఎప్పటికిని రెపరెపలాడుచునే ఉండును. మనము మన తర్వాతివారికి మహద్ధనములుగ ఒసంగ వలసిన వానిలో ఆ మహనీయుని దివ్యనామమును భవ్యాదర్శమును ప్రథమ గణ్యములు. ఆ మన నాయకుని పేరును కీర్తించుచు లేచి, ఆయన చూపిన మార్గమున పురోగమింతము గాక——



# విగ్రహ వ్యావర్తని

డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఎం. ఏ., ఎం. లిట్., పిఎచ్. డి.

ఆచార్యనాగార్జునుడు మధ్యమక కారికలను రచించి మధ్యమక వాద మగు శూన్యవాద మును ప్రపంచించినాడు. ఈ వాదము నంగీక రింప జాలని వా రా కాలముననే బయలుదేరి నారు. నాగార్జునుని సమకాలికు డగు వాత్స్యా యనుడు ఈకారికలను తీవ్రముగా ఖండింప బయలుదేరినట్లు కన్పించుచున్నది. ఆఖండనకు సమాధానముగా విగ్రహవ్యావర్తని అను పేరుతో 72 కారికలను నాగార్జునుడు చెప్పి నాడు. వివాదమును పారద్రోలునది విగ్రహ వ్యావర్తని. దీనిపై వచ్చిన విమర్శనకు సమా ధానముగా నీ కారికలపై ఒక వృత్తిని కూడ నాగార్జునుడు చెప్పినాడు. వాత్స్యాయనుని న్యాయభాష్యములోని పంక్తు లీ కారికలలో గల పూర్వపక్షగ్రంథమున స్పష్టముగా కన్పిం చుచున్నవి. వృత్తిలో సిద్ధాంతభాగపుపంక్తులు కొన్ని న్యాయభాష్యమున నుండుటచే వీ రిద్దరు సమకాలికు లని, ఒకరి రచన లింకొకరికి పరి చితములే అని చెప్ప వీ లున్నది.

ఈ కారికలలో శూన్యత యన నేమో స్పష్టతరముగా వివరింపబడినది. అద్వైతులపై తర్వాతిద్వైతులు మొద లగు వారు గావించిన ఆక్షేపములవంటివే శూన్యవాదముపై వాత్స్యా యనాదుల ఆక్షేపములు. నాగార్జునుని సమా ధానమున శూన్యత యనునది అద్వైతుల అని ర్వచనీయత వంటి దని, మాయవంటి దని స్పష్టము కాగలదు. మధ్యమకులు సహితము జగత్తు ఏమియు లే దని ఎప్పుడు చెప్ప లేదు. అద్వైతులుకూడ జగదభావమును చెప్ప లేదు. ఈ కారికలను సవృత్తికముగా గమనించుట అవసరము.

## విగ్రహవ్యావర్తనీ

### పూర్వపక్షః

1. సర్వేషాం భావానాం సర్వత్ర న విద్యతే స్వభావ శ్చేత్  
త్వ ద్వచన మస్వభావం న నివర్తయితుం స్వభావ మలమ్.

2. అథ స స్వభావ మేత ద్వాక్యం పూర్వాహతా ప్రతిజ్ఞా తే  
వైషమికత్వం తస్మిన్; విశేష హేతు శ్చ వక్తవ్యః.

3. మా శబ్దవ దిత్యేతత్ స్యాత్తే బుద్ధి ర్న చైత దుపపన్నమ్  
శబ్దే నాత్ర సతా భవిష్యతో వారణం తస్య.

4. ప్రతిషేధః ప్రతిషేధ్యో ప్యేవ మితి మతం భవే త్త దస దేవ,  
ఏవం తవ ప్రతిజ్ఞా లక్షణతో దూష్యతే న మమ.

5. ప్రత్యక్షేణ హి తావ ద్య ద్యుపలభ్య వినివర్తయసి భావాన్
త న్నా_స్తి ప్రత్యక్షం భావా యే నోపలభ్యంతే.

6. అనుమానం ప్రత్యు_క్తం ప్రత్యక్షే ణాగ మోపమానే చ
అనుమా నాగమ సాధ్యాయే ఽర్థా దృష్టాంతసాధ్యా శ్చ.

7. కుశలానాం ధర్మాణాం ధర్మావస్థా విద శ్చ మన్యంతే
కుశలం జనస్వభావం శేషే ష్వ ప్యేష వినియోగః.

8. నైర్యాణిక స్వభావో ధర్మో నైర్యాణికా శ్చ యే తేషామ్
ధ ర్మావ స్థోక్తానా మేవ చ నైర్యాణికాదీనామ్.

9. యది చ న భవేత్ స్వభావో భావానాం న నిఃస్వభావ ఇ త్యేవమ్
నా మాపి భవే దేవం నామ హి నిర్వస్తుకం నాస్తి.

10. అథ విద్యతే స్వభావః స చ ధర్మాణాం న విద్యతే తస్మాత్
ధర్మై ర్వినా స్వభావః స య స్యా_స్తి త ద్యు_క్త ముప దేష్టుమ్.

11. సత ఏవ ప్రతిషేధో నాస్తి ఘటో గేహ ఇ త్యయం యస్మాత్
దృష్టః ప్రతిషేధో ఽయం సతః స్వభావస్య తే తస్మాత్.

12. అథ నాస్తి స స్వభావః కిం ను ప్రతిషిధ్యతే త్వయా ఽనేన
వచనేన ర్తే వచనా త్ప్రతిషేధః సిధ్యతే హ్యాసతః.

13. బాలానా మివ మిథ్యా మృగతృష్ణాయాం యథా జలగ్రాహః
ఏవం మిథ్యాగ్రాహః స్యా త్తే ప్రతిషిధ్యతో హ్యాసతః.

14. న న్వేవం స త్య_స్తి గ్రాహో గ్రాహ్యం చ త ద్గృహీతం చ
ప్రతిషేధః ప్రతిషేధ్యం ప్రతిషేద్ధా చేతి షట్కం తత్.

15. అథ నై వా_స్తి గ్రాహో న చ గ్రాహ్యం న చ గ్రహీతారః
ప్రతిషేధః ప్రతిషేధ్యం ప్రతిషేద్ధారో ఽస్య తు న సంతి.

16. ప్రతిషేధః ప్రతిషేధ్యం ప్రతిషేద్ధార శ్చ య ద్యుత న సంతి
సిద్ధా హి సర్వ భావా యేషా మేవం స్వభావ శ్చ.

17. హేతో శ్చ తే న సిద్ధిః నైఃస్వాభావ్యా త్కుతో హి తే హేతుః
నిర్హేతుకస్య సిద్ధి ర్న చోపప న్నాస్య తే ఽర్థస్య.

18. యది చాహేతోః సిద్ధిః స్వభావ వినివర్తనస్య తే భవతి
స్వాభావ్య స్యా_స్తి త్వం మ మాపి నిర్హేతుకం సిద్ధమ్.

19. అథ హేతో ర స్తిత్వం భావ నైఃస్వాభావ్య మి త్యనుపపన్నమ్
లోకే నైఃస్వాభావ్యా న్న హి కశ్చన విద్యతే భావః.

20. పూర్వం చే త్ప్రతిషేధః పశ్చా త్ప్రతిషేధ్య మి త్యనుపపన్నమ్
పశ్చా చ్చానుపపన్నో యుగప చ్చ యతః స్వభావో ఽసన్.

## సి ద్ధా ం తః

21. హేతుప్రత్యయసామగ్ర్యాం పృథగ్భావే ఽపి మ ద్వచో న యది
నను శూన్యత్వం సిద్ధం భావానా మస్వభావత్వాత్.

22. య శ్చ ప్రతీత్యభావో భావానాం శూన్య తేతి సా హ్యుక్తా
ప్రతీత్య య శ్చ భావో భవతి హి త స్యాస్వభావత్వమ్.

23. నిర్మితకో నిర్మితకం మాయాపురుషః స్వమాయయా సృష్టమ్
ప్రతిషేధయతే యద్వ త్ప్రతిషేధో ఽయం త థైవ స్యాత్.

24. న స్వాభావిక మేత ద్వాక్యం తస్మా న్న వాదహాని ర్మే
నాస్తి చ వైషమికత్వం విశేషహేతు శ్చ నిగాద్యః.

25. మాశబ్దవ దితి నాయం దృష్టాంతో య స్త్వయా స మారబ్ధః
శబ్దేన హ్యత్ర సతా భవిష్యతో వారణం తస్య.

26. నైఃస్వాభావ్యానాం చే న్నైఃస్వాభావ్యేన వారణం యది హి
నైఃస్వాభావ్య నివృత్తే స్వాభావ్యం హి ప్రసిద్ధం స్యాత్.

27. అథ వా నిర్మితకాయాం యథా స్త్రియాం స్త్రియ మి త్యసంగ్రాహమ్
నిర్మితకః ప్రతిహన్యా త్కస్యచి దేవం భవే దేతత్.

28. అథవా సాధ్యసమో ఽయం హేతు ర్న హి విద్యతే ధ్వనేః సత్తా
సంవ్యవహారం చ వయం నానభ్యుపగమ్య కథయామః.

29. యది కాచన ప్రతిజ్ఞా స్యా న్మే తత ఏవ మే భవే ద్దోషః
నాస్తి చ మమ ప్రతిజ్ఞా తస్మా న్నై వాస్తి మే దోషః.

30. యది కించి దుపలభేయం ప్రవర్తయేయం నివర్తయేయం వా
ప్రత్యక్షాదిభి రర్థైః త దభావా న్మే ఽనుపాలంభః.

31. యది చ ప్రమాణత స్తేషాం ప్రసిద్ధి రర్థానామ్
ం పునః ప్రసిద్ధిం బ్రూహి కథం తేషాం తే ప్రమాణానామ్.

32. అన్యై ర్యది ప్రమాణైః ప్రమాణసిద్ధి ర్భవ త్యనవస్థా
నాదేః సిద్ధి స్తత్రాస్తి నైవ మధ్యస్య నాంతస్య

33. తేషా మథ ప్రమాణై ర్వినా ప్రసిద్ధిః విహీయతే వాదః
వైషమికత్వం తస్మిన్ విశేషహేతు శ్చ వక్తవ్యః.

34. ద్యోతయతి స్వాత్మానం యథా హుతాశః తథా పరాత్మానమ్
స్వపరాత్మానా వేవం ప్రసాధయంతి ప్రమాణాని.

35. విష మోపన్యాసో ఽయం న హ్యాత్మానం ప్రకాశయ త్యగ్నిః
న హి త స్యానుపలబ్ధిః దృష్టా తమ సీవ కుంభస్య.

36. యది స్వాత్మాన మయం త్వ ద్వచనేన ప్రకాశయ త్యగ్నిః
పర మివ న త్వాత్మానం పరిధక్ష్య త్యపి హుతాశః.

37. యది చ స్వపరాత్మానౌ త్వద్వచనేన ప్రకాశయ త్యగ్నిః
ప్రచ్ఛాదయిష్యతి తమః స్వపరాత్మానౌ హుతాశ ఇవ.

38. నాస్తి తమ శ్చ జ్వలనే యత్ర చ తిష్ఠతి స దాత్మని జ్వలనః
కురుతే కథం ప్రకాశం స హి ప్రకాశో ఽంధకారవధః.

39. ఉత్పద్యమాన ఏవ ప్రకాశయ త్యగ్ని రి త్యస ద్వాదః
ఉత్పద్యమాన ఏవ ప్రాప్నోతి తమో న హి హుతాశః.

40. అప్రాప్తో ఽపి జ్వలనో యది వా పున రంధకార ముపహన్యాత్
సర్వేషు లోకధాతుషు తమో ఽయ మిహ సంస్థిత ఉపహన్యాత్.

41. యది చ న స్వతః ప్రమాణసిద్ధి రనపేక్ష్య తే ప్రమేయాణి
భవతి ప్రమాణసిద్ధిః న పరాపే క్షాత్మసిద్ధి రితి.

42. అనపేక్ష్య హి ప్రమేయా నర్థాన్ యది తే ప్రమాణసిద్ధి ర్భవతి
న భవంతి కస్యచి దేవ హీమాని ప్రమాణాని.

43. అథ మత మపేక్ష్య సిద్ధిః తేషా మి త్యత్ర కో దోషః
సిద్ధస్య సాధనం స్యా న్నాసిద్ధో ఽపేక్షతే హ్యన్యత్.

44. సిధ్యంతి హి ప్రమేయా ణ్యపేక్ష్య యది సర్వథా ప్రమాణాని
భవతి ప్రమేయసిద్ధి రనపే క్ష్యైవ ప్రమాణాని.

45. యది చ ప్రమేయసిద్ధి రనపే క్ష్యైవ భవతి ప్రమాణాని
కిం తే ప్రమాణసిద్ధ్యా తాని య దర్థం ప్రసిద్ధం తత్.

46. అథ తు ప్రమాణసిద్ధి ర్భవ త్యపే __ వ తే ప్రమేయాణి
వ్యత్యయ ఏవం సతి తే ధ్రువం ప్రమాణప్రమేయాణామ్.

47. అథ తే ప్రమాణసిద్ధ్యా ప్రమేయసిద్ధిః, ప్రమేయసిద్ధ్యా చ
భవతి ప్రమాణసిద్ధిః, నా స్త్యుభయ స్యాపి తే సిద్ధిః.

48. సిద్ధ్యంతి హి ప్రమాణై ర్యది ప్రమేయాణి తాని తై రేవ
సాధ్యాని చ ప్రమేయై స్తాని, కథం సాధయిష్యంతి.

49. సిద్ధ్యంతి చ ప్రమేయై ర్యది ప్రమాణాని తాని తై రేవ
సాధ్యాని చ ప్రమేయైః తాని, కథం సాధయిష్యంతి.

50. పిత్రా య ద్యుత్పాద్యః పుత్రో యది తేన చైవ పుత్రేణ
ఉత్పాద్యః స యది పితా వద త త్రోత్పాదయతి కం కః.

51. క శ్చ పితా కః పుత్రః, తత్ర త్వం బ్రూహి కథం తా వుభా వపి చ
పితాపుత్రలక్షణధరౌ తతో నో ఽత్ర సందేహః

52. నైవ స్వతః ప్రసిద్ధి ర్న పరస్పరతో ఽన్యప్రమాణై ర్వా
భవతి న చ ప్రమేయైః న చాప్యకారణం భవతి.

53. కుశలానాం ధర్మాణాం ధర్మావస్థావిదో బ్రువతే యత్
కుశలస్వభావ మేవం ప్రవిభాగే నాభిధేయః స్యాత్.

54. యది చ ప్రతీత్య కుశలః స్వభావ ఉత్పద్యతే స కుశలానాం
ధర్మాణాం పరభావః స్వభావ ఏవ కథం భవతి.

55. అథ ప్రతీత్య కించి త్స్వభావ ఉత్పద్యతే స కుశలానాం
ధర్మాణా మేవం స్యా ద్వా సో న బ్రహ్మచరస్య.

56. నాధర్మో ధర్మో వా సంవ్యవహారా శ్చ లౌకికా న స్యుః
నిత్యా శ్చ సర్వభావాః స్యుః నిత్యత్వా దహేతుమతః.

57. ఏష చాకుశలే ష్వవ్యాకృతేషు నైర్యాణాదిషు చ దోషః
తస్మా త్సర్వం సంస్కృత మసంస్కృతం తే భవ త్యేవమ్.

58. యః సద్భూతం నామ బ్రూయా త్సస్వభావ ఇ త్యేవమ్
భవతా ప్రతివక్తవ్యో, నామ బ్రూమశ్చ న వయం సత్.

59. నామా స దితి చ య దిదం త త్కిం ను సతో భవ త్యు తాసతః
యది హి సతో య ద్యసతో ద్విధాపి తే హీయతే వాదః.

60. సర్వేషాం భావానాం శూన్యత్వం చోపపాదితం పూర్వమ్
స ఉపాలంభః తస్మా ద్భవ త్యయం చాప్రతిజ్ఞాయాః.

61. అథ విద్యతే స్వభావః స చ ధర్మాణాం న విద్యత ఇతి
ఇద మాశంకితం య దుక్తం భవ త్యనాశంకితం త చ్చ.

62. సత ఏవ ప్రతిషేధో యది శూన్యత్వం నను ప్రతిషిద్ధ మిదమ్
ప్రతిషేధయతే హి భవా౯ భావానాం నిఃస్వభావత్వమ్.

63. ప్రతిషేధయసే ఽథ త్వం శూన్యత్వం త చ్చ నాస్తి శూన్యత్వమ్
ప్రతిషేధః సత ఇతి తే నను స హీయతే వాదః.

64. ప్రతిషేధయామి నాహం కించి త్ప్రతిషేధ్య మస్తి న చ కించిత్
తస్మా త్ప్రతిషేధయ సీ త్యధిలయ ఏవ త్వయా క్రియతే.

65. య చ్చాహం తే ఽవచనా దసతః ప్రతిషేధవచనసిద్ధి రితి
అత్ర జ్ఞాపయతే వా గస దితి త న్న ప్రతినిహంతి.

66. మృగతృష్ణా దృష్టాంతే యః పునరుక్తం త్వయా మహాం శ్చర్చః
త త్రాపి నిర్ణయం శృణు యథా స దృష్టాంత ఉపపన్నః.

67. స యది స్వభావతః స్యా ద్గ్రాహో న స్యా త్ప్రతీత్య సముద్భూతః
య శ్చ ప్రతీత్య భవతి గ్రాహో నను శూన్యతా సైవ.

68. యది చ స్వభావతః స్యా ద్గ్రాహః క స్తం వినివర్తయే ద్గ్రాహమ్
శేషే ష్వ ప్యేష విధిః తస్మా ద్దో షానుపాలంభః.

69. ఏతేన హేత్వభావః ప్రత్యుక్తః పూర్వ మేవ స సమత్వాత్
మృగతృష్ణా దృష్టాంత వ్యావృత్తి విధేయ ఉక్తః ప్రాక్.

70. య స్త్రైకాల్యే హేతుః ప్రత్యుక్తః పూర్వ మేవ స సమత్వాత్
త్రైకాల్య ప్రతిహేతు శ్చ శూన్యతా వాదినాం ప్రాప్తః.

71. ప్రభవతి చ శూన్య తేయం యస్య ప్రభవంతి తస్య స ర్వార్థాః
ప్రభవతి న తస్య కించి న్న భవతి శూన్యతా య స్యేతి.

72. యః శూన్యతాం ప్రతీత్య సముత్పాదం మధ్యమాం ప్రతిపద మే కార్థాం
నిజగాద ప్రణమామి త మప్రతిమ సంబుద్ధ మితి

ఇతి శ్రీ బోధిస త్వాచార్య నాగార్జునపాదానాం విగ్రహవ్యావర్తనీ కారికా సమాప్తా.

## [వివరణ]

ఈ కారికలలో మొదటి ఇరువది కారికలు పూర్వపక్షమునకు చెందినవి. ఈ పూర్వపక్షమున నైయాయిక, మీమాంసక, సర్వాస్తివాదు లున్నారు. మిగిలిన కారికలు సిద్ధాంత ప్రతిపాదకములు.

1. భావముల కన్నింటికి వానివాని స్వభావము కన్పింపనిచో నీ వాక్యముకూడ భావములనబడు ధర్మములలోనిదే గనుక స్వభావరహితము కావలెను. స్వభావరహిత మైనది శూన్యమగుటచే మాట లనునవి ఉండ జాలవు కాబట్టి ధర్మములకు స్వభావ ముండ జాల దని ఎట్లు వాదింపగలవు?

ఈ ప్రపంచమున గల ప్రతిభావము హేతు ప్రత్యయములనుండి బయలుదేరినచో, ఆ భావముయొక్క స్వభావము అన్యధర్మముల నాశ్రయించుకొని వచ్చినది. సహజ మైన స్వీయస్వభావము దానికి లేదు. భావములు లేక ధర్మము లనబడు వానితో నున్న దీ జగము. స్వీయస్వభావములేనిది శూన్యము. మొక్కకు విత్తనము కారణ మని మనము చెప్పుచున్నను విత్తనములో మొక్క కన్పింపదు. మట్టి, నీరు, ఎండ, గాలి అను వానిలో నెక్కడను మొక్క కన్పడదు. వీనిని అన్నిటిని కల్పినను మొక్క కన్పింపదు. ఈ హేతుప్రత్యయములను వదలి ఇతరత్ర గమనించినను మొక్క ఎచ్చటను లేదు. ఇట్లు స్వభావశూన్య మైన మొక్క శూన్యము. ఇట్లే సర్వభావములు స్వభావ శూన్యము లగుటచే శూన్యము లగుచున్నవి. ఇది మధ్యమక వాదము.

ఈ వాదము నంగీకరించితి మేని 'సర్వభావ శూన్యమే కావలెను, ఈ వాక్యముకూడ హేతుప్రత్యయములనుండి బయలుదేరినదే. ఆ హేతుప్రత్యయములలో నెచ్చటను ఈ వాక్యము కన్పింపదు. గొంతు, తాలువు మొదలైన వానిలో గాని, ఇతరత్ర గాని ఇది కన్పడదు. కావున ఈ వాక్యము స్వభావశూన్యము, అందుచేత శూన్యము కూడ. కాబట్టి భావములకు వాని వాని స్వభావము లే దని చెప్పుటకు వీలు లేదు. వాక్యములే లేనప్పుడు, వాక్యములతో ఒకవస్తువు లే దనుట కుదురదు. అసద్వస్తువును నిప్పు కాల్ప లేదు గదా! లేని గొడ్డలితో చెట్టును నరుక లేము గదా! లేని నీళ్లతో స్నానము చేయలేము గదా! ఇట్లే లేని మాటలతో సర్వభావప్రతిషేధము కుదరదు.

2. 'సర్వభావములు శూన్యములు' అను వాక్యములోని మాటలకు వాని వాని స్వీయ స్వభావము లున్నచో, ఈ సిద్ధాంతవాక్యము నిర్మూల మగును. అప్పుడు ప్రతిజ్ఞాహాని యను దోషము వాటిల్ల గలదు. కాబట్టి దీని ఇతర విశిష్టహేతువును చెప్పవలసి యున్నది.

ఈ ప్రతిజ్ఞావాక్యమునకు స్వభావ మున్నది కనుక శూన్యము కా దని, అందుచే సర్వభావ శూన్యతను నిశ్చయింప వచ్చు నని మధ్యమకుడనినచో ప్రతిజ్ఞాహాని యను దోషము రా గలదు. నిర్ధారణ చేయ నెంచిన సిద్ధాంతవాక్యమును ప్రతిజ్ఞ యందురు. ఈ ప్రతిజ్ఞావాక్యమునకు స్వభావ మున్నచో సర్వభావములు స్వభావ శూన్యములు కా లేవు. దీనికి స్వభావము లేనిచో దీనివలన ఏ భావముమ ప్రతిపాదింప వీలు లేదు. సర్వభావములలో అంతర్గత మైన దీ వాక్యము.

స్వభావ మున్నచో సర్వభావశూన్యత సిద్ధింపదు. శూన్యము లగు మాటలతో ఏ ధర్మమును ప్రతిషేధింప వీలు పడదు. కాగా ఈ ప్రతిజ్ఞావాక్యముయొక్క యాథార్థ్యమును ఆరు విధముల విమర్శింప వీ లున్నది. (1) సర్వధర్మములు శూన్యము లైన, వీనిలో జేరిన మాటలు కూడ శూన్యములే. శూన్యము లైన మాటలు దేనిని ప్రతిషేధింప జాలవు. (2) సర్వభావప్రతిషేధము ఉపపన్న మైనచో, మాటలుకూడ శూన్యము లగుటచే సర్వభావశూన్యత కూడ ప్రతిషిద్ధము కాగలదు. (3) మాటలు శూన్యములు కాకున్నచో కొన్ని భావములు మాత్రమే శూన్యములు కావలెను గనుక ఈ ప్రతిజ్ఞావాక్యమున దృష్టాంతవిరోధ మను దోష మున్నది. (4) అన్ని భావములు శూన్యము లైనచో, మాటలుకూడ శూన్యములే కాగలవు గనుక దేనిని ప్రతిషేధింప వీలు లేదు. (5) శూన్యము లైన మాటలతో భావములను ప్రతిషేధింప వీ లున్నచో, ఈ శూన్యము కార్యక్రియాసమర్థము కాగలదు. అప్పుడు శూన్యత భావవస్తువు కావలెను. (6) శూన్యము కార్యక్రియాసమర్థము కా దనినచో, శూన్య మగు వాక్యము దేనిని ప్రతిషేధించుటకు శక్తి కలిగి యుండ జాలదు.

ఈ ప్రతిజ్ఞావాక్యమున విషమహేతువున్నది. ఈవాక్యమువంటి ధర్మములు కొన్ని శూన్యములు కా వని, మిగిలిన ధర్మములు శూన్యము లని చెప్పుచున్నట్లు అవగతము కాగలదు. కావున సర్వధర్మశూన్యతను ప్రతిపాదించుటకు వే రొక హేతువును గ్రహింపవలసి యున్నది. ఇట్టిహేతువును మధ్యమకు లెచ్చటను చెప్ప లేదు.

3. ''ఒక డింకొకరిని 'శబ్దముచేయ వద్దు' అని శబ్దముచేయుచు చెప్పునట్లు ధర్మస్వభావమును నిరాకరించుటకు మాటలను మే ముపయోగించు చున్నాము'' అని వాదించుటకూడ పొసగదు. శబ్ద మనునది యొకటి ఉన్నప్పుడే శబ్దము చేయ వద్దు అను శబ్దములు ఇతరశబ్దములను నివారింప గలవు. శబ్దమే లేనిచో ఒక శబ్ద మింకొకశబ్దము నెట్లు నివారింప గలదు?

ఇట్లే మాటలు శూన్యము లైనచో అవి ధర్మముల స్వభావములను ప్రతిషేధింప లేవు. మాటలు, ధర్మములు కూడ శూన్యము లైన 'శబ్దము చేయ వద్దు' అను సాదృశ్యవాక్యము విష మోపన్యాసము.

4. ''మేము ప్రతిపాదించు ధర్మస్వభావప్రతిషేధమును ప్రతిషేధించు నీ వాదము సరియైనది కాదు'' అని మధ్యమకు లన వచ్చును. కాని ఇట్టి వాదములో దోష మున్నది గాని మా ప్రతిపాదనలో నే దోషమును లేదు.

''మా మాటలు ధర్మస్వభావములను ప్రతిషేధింప జాలిన వని యెంచుట సరి కాదు'' అని మధ్యమకు లన వచ్చును. కాని ఇది దోషసహిత మైన వాదము. సర్వధర్మములు శూన్యము లైనచో, మాటలు శూన్యములు కాకుండ నుండగలవా? శూన్య మగు వాక్యము ధర్మస్వభావశూన్యతను ప్రతిపాదింప జాలదు. ఒకవేళ అట్లు ప్రతిపాదింప గల్గినచో మాటలకు శూన్యత లే దన వలెను. అది స్వవచనవ్యాఘాతము. కావున ధర్మస్వభావప్రతిషేధవాక్యము ప్రతిషిద్ధ మగుచున్నది.

5. ప్రత్యక్షప్రతీతి యనునది యున్నచో ధర్మస్వభావముల నెట్లు నిరాకరింప గలవు? ఈ ప్రత్యక్షప్రతీతికూడ శూన్య మైనచో, భావ

ముల స్వభావములు శూన్యము లని ఎట్లు నిశ్చయింపగలవు?

ప్రత్యక్షముగా భావములను (ధర్మములను) పరిశీలించి, సర్వధర్మములు శూన్యము లని నిర్ధారణ చేయ వీలు లేదు. సర్వధర్మములలో ప్రత్యక్షప్రమాణము కూడ ఒక ధర్మము కావలెను గనుక ఈ ప్రమాణముకూడ శూన్యమే యగును. శూన్య మగు ప్రమాణముద్వారా భావోపలబ్ధి గాని, భావస్వభావ నిరాస గాని కుదుర జాలవు. అనుమానప్రమాణము ప్రత్యక్షము నాశ్రయించుకొని బయలు దేరునదిగనుక, ప్రత్యక్షము శూన్య మైన, అనుమానముగూడ శూన్యమే యగును. అప్పుడు సర్వభావస్వభావ ప్రతిషేధవాక్యము ప్రమాణముల ద్వారా వచ్చిన సిద్ధాంతము కానేరదు. ఇది ప్రమాణజనిత మైనచో ప్రమాణములు శూన్యములు కానేరవు.

''అనుమానము, ఆగమము, ఉపమానము అను ప్రమాణములద్వారా సర్వభావములను గమనించి, ఆ భావములు స్వభావశూన్యము లని, వానికి మనమే ఆ యా స్వభావముల నారోపించుచుంటి మని తెలిసికొనుచున్నాము'' అని మధ్యమకు లన వచ్చును. దీనికి సమాధానముగా తర్వాతి కారికను న్యాయదార్శనికుడు చెప్పుచున్నాడు.

6. ప్రత్యక్షము శూన్య మైన అనుమానము కూడ శూన్యమే. ఈ రెండుప్రమాణములు శూన్యము లైనపుడు ఉపమానము, ఆగమము అను ప్రమాణములు కూడ శూన్యములే కాగలవు. అనుమానము, ఆగమము, ఉపమానము అను ప్రమాణములు సాధించు విషయములు (ధర్మములు) ప్రత్యక్షము సాధించువిషయములవలె నుండునవే.

సర్వభావములు శూన్యము లైన, ఈ ప్రమాణములు సాధించు విషయములు కూడ శూన్యములే కావలెను. వీనిద్వారా విషయముల ప్రతీతి గల ప్రమాత కూడ శూన్యుడే యగును. అప్పుడు భావోపలబ్ధియే కుదరదు. అనుపలబ్ధము లగు విషయముల స్వభావములను ప్రతిషేధింప వీలు లేదు.

7. ధర్మావస్థలను తెలిసికొనిన విజ్ఞుడు కుశల ధర్మములకు స్వస్వభావములు గల వనుచున్నాడు. లౌకికజనులు సహితము ఈ ధర్మములు స్వభావసహితము లని పల్కుదురు. మిగిలిన అకుశలాదిధర్మములు కూడ నిట్లే ఆయాస్వభావములు కలిగి యున్న వని భావింపవలెను.

కుశలధర్మముల నవగాహన చేసికొనిన వివేకి యగు బుద్ధుడు 119 కుశలధర్మములు గల వని, ఇవి చిత్తస్వభావము కలిగి యున్న వని చెప్పినాడు. విజ్ఞాన, వేదన, సంజ్ఞ, చేతన, స్పర్శ, మనసికార, ఛంద, అధిమోక్ష, వీర్య, స్మృతి, సమాధి, ప్రజ్ఞ, ఉపేక్ష, యోగ, సంయోగ, ప్రాప్తి, అధ్యాశయ, అప్రతిఘ, ప్రీతి, ప్రయత్న, వ్యాయామ, అమోఘ, ఔత్సుక్య, అవిఘాత, వశిత, ప్రతిఘ, అవిప్రతిసార, గ్రాహ, అగ్రాహ, ధృతి, స్థిర, అధ్యవసిత, అవ్యాయామ, అనౌత్సుక్య, ప్రావణ, ప్రణిధి, మద, నిర్విషయ, అనైర్యాణిక, ఉత్పత్తి, స్థితి, అనిత్య, సప్రీతి, పరితాప, అప్రీతి, వితర్క, తృష్ణా, ప్రసాద, ప్రతికూల, సంగ్రహ, అసమనుగ్రహ, విశారద, గౌరవ, మానన, భక్తి, అభక్తి, అనువిధాన, ఆదర, అనాదర, వాద, ప్రశ్రబ్ధి, వాక్య, ప్రమోక్ష, సిద్ధి, అశ్రద్ధ, అప్రశ్రబ్ధి, వికార, ధీరత, నిశ్చయ, విప్రతిసార, శోక, క్రోధ, మద, అసంగ్రహ, విచికిత్స, సంవరపరిమాణ, పరిశుద్ధి, ఆధ్యా

శయ, శ్రద్ధ, హ్రీ, ఆర్జవ, అవంచన, ఉపశమ, నిమిత్తప్రమాద, అప్రమాద, మైత్రీదృష్టి, ప్రతిసంఖ్యాన, ఉద్విగ్నమానస, అపరితాప, అమద, అలోభ, అద్వేష, అమోహ, సర్వజ్ఞత, అత్యాగ, విభవ, అపత్రాప్య, అమత్ష, కరుణ, చిత్తవిక్షేప, మైత్రీ, అవిషాద, అరణ, బుద్ధి, అనుపానహ, అనీర్ష్య, చిత్తాపరిద్రవ, క్షాంతి, విప్రహాణి, అనియమ, పరిభోగానుయూప, సంజ్ఞిత, అసంస్కృత, నైర్యాణికత, పుణ్య. అసంజ్ఞాసమాపత్తి, హాస, రూప, అప్రతినిఃసర్గ అని వీని పేర్లు.

ఇట్లే అకుశలధర్మములు, వానిస్వభావములు ఉన్నవి. అవ్యాకృతధర్మములు, వానిస్వభావములు గలవు. ఈ అవ్యాకృతములలో నివృతములు (=కప్పివేయబడినవి), అనివృతములు కూడ గలవు. కామలోక, రూపలోక, అపలోక, అనాస్రవధర్మములు, వానిస్వభావములు కూడ చెప్పబడినవి. ఈ రీతిగా అనేకము లగు ధర్మములు, ధర్మస్వభావములు కన్పించుచున్నపుడు సర్వభావములు నిఃస్వభావము లని, శూన్యము లని చెప్పుటకు వీలు లేదు.

8. నైర్యాణికధర్మములు, అనైర్యాణికధర్మములు, వీనిస్వభావములు కూడ బుద్ధునిచే చెప్పబడినవి.

ఈ ధర్మములు ఉన్న వనియే బుద్ధు డనినాడు. మోక్షమున కుపకరించునవి నైర్యాణికములు. అట్లుపయోగపడనివి అనైర్యాణికములు. దీనితోబాటు ముప్పదియేడు బోధిపక్షములను చెప్పినాడు. ఈ బోధిపక్షములలో ఏడు బోధ్యంగము లున్నవి. అబోధిపక్షములు, వాని స్వభావములుకూడ ప్రస్తుతింపబడినవి.

9. స్వభావసహితమైనదానికే పే రుండ గలదు. స్వభావశూన్యమైన దానికి పే రేమియు ఉండ జాలదు. భావములు స్వభావశూన్యములైనచో వీనిపేర్లు నిరర్థకములు కాగలవు. అప్పుడు నిర్వస్తుకము లగు పే ర్లుండ గలవు.

ఒక వస్తువు నిజముగా ఉన్నపుడే దానిపేరు గూడ ఉండ గలదు. లేనివస్తువును సూచించి, స్పష్టపరుపజాలిన పేరు ఉండ లేదు గనుక 'సర్వధర్మములు స్వభావశూన్యములు' అను మాటలలో 'స్వభావశూన్య' మను శబ్దము కూడ ఉండ వీలు లేదు. స్వభావశూన్య మను శబ్దము లేనపుడు స్వభావశబ్దము, ధర్మస్వభావములు ఉండి తీర గలవు.

10. ధర్మముకంటె విలక్షణముగా భిన్నముగా ఉన్న స్వభావము ఆ ధర్మములో లేదనుట కేవల మూహామాత్రము. ధర్మములలో లేకున్నను స్వభావము లున్న వనువాని ఊహావీధిలోని కల్పన ఇది.

ధర్మ మున్నది, పేరుకూడ ఉన్నది. ధర్మముకంటె భిన్నముగా పేరుఉన్నది. కాని వస్తువును సూచించునది దానిపేరు గనుక, వస్తువు లేనిపేరు లేదు. వస్తు వున్నపుడే దాని కొక పేరు ఉండ గలదు. కాబట్టి ధర్మముకంటె భిన్నముగా పే రున్న దని ఎట్లు వాదింప గలము? అట్లు విలక్షణముగా నున్న పేరు ఆ ధర్మమును సూచింపలేదు; ఆ ధర్మ మా పేరుద్వారా సూచింపబడలేదు కూడ. కావున ధర్మము, దానిపేరు అనునవి విలక్షణములై, భిన్నములుగా నున్న వను వాదము యుక్తియుతము కాదు.

11. ధర్మములకు స్వభావము లున్నపుడే ధర్మములు సద్వస్తువు లను వాదమును ప్రతిషేధింప వీ లున్నది. ధర్మములే లేనిచో, దేనిని ప్రతిషేధింపగలము? ఘట మను వస్తువొకటి ఉన్నపుడే ఈ గృహములో ఘటము లే

వాదించు వీ లున్నది. ఒక వస్తువు ఉన్న దను ప్రతీతి మనకు ఉన్నపుడే అది ఉన్నది, లేనిది విచారింపగలము. మనకు వస్తుప్రతీతి లేనిచో ఆ వస్తువు లే దని చెప్పజాలము.

ఉన్నవస్తువును లేదని వాదింపవచ్చును గాని, అసలు ఎప్పుడును లేని దానిని గూర్చి అది ఉన్నది, లేనిది నిశ్చయింపజాలము. అత్యంత శూన్యమైన ఘటమును నిషేధింపలేము గదా! ధర్మములకు స్వభావము లున్నపుడే అవి లేవని నిశ్చయింప వీలున్నది. ధర్మముల స్వభావములను ప్రతిషేధించుటకు ధర్మములుండితీరవలెను. ఆ ధర్మముల స్వభావములుకూడ ఉండవలెను.

12. ధర్మములకు స్వభావము లేవియు లేనిచో, దేనిని మాటలతో నిషేధింపగలవు? నిషేధింపతగిన ధర్మమే లేనిచో, మాటలతో ప్రసక్తి లేకయే నిషేధింపవచ్చును.

ధర్మములు స్వభావశూన్యము లైన, మాటలుకూడ స్వభావశూన్యములు కాగలవు. అప్పుడు మాటలతో ధర్మస్వభావముల నెట్లు ప్రతిషేధింపగలవు? ఈ నిషేధమే యుక్తమైనచో, మాట్లాడకయే ఆ ధర్మస్వభావములను నిషేధించు వీ లున్నది. అప్పుడు నిప్పు చల్లగా ఉన్నది, చన్నీరు మండుచున్నది అను వాక్యములలో నెట్టి దోష మున్నదో అదే దోషము నీ వాక్యములో సహితము కన్పడగలదు. (సశేషము)

---

# మహాప్రభు వల్లభాచార్యులు

శ్రీ కర్ణ రాజశేషగిరిరావుగారు, ఎం.ఏ.

(గతసంచిక తరువాయి)

## సంప్రదాయప్రచారము

వల్లభ పూర్వవర్తీ వైష్ణవాచార్యుల మూలంబున భారతదేశంబున వైష్ణవధర్మ వ్యాప్తి, విభిన్నసంప్రదాయములయొక్క ఉన్నతియు నొందెను. కాని దాని ప్రభావక్షేత్ర మధికతరముగ దక్షిణభారతమే. ఉత్తరభారతమునందు వైష్ణవధర్మమహత్వ మెక్కువ లేమిని అక్కడ అవైష్ణవశాంకరమతములకు పలుకుబడి పెంపొందెను.

'చౌరాసీవైష్ణవవార్త' యందు శ్రీహరిరాయని భావప్రకాశమునందు బాబా 'వేమ' వార్త లీయబడెను. దీని పర్యవసానమే మన వల్లభులసమయమునందు కాశీనుండి ప్రయాగవఱకు గ్రామంబులందు సర్వత్ర దేవీపూజలు జరుగుచుండెను. అచ్చట వైష్ణవదేవతల పేర్లను గూడ నెఱుంగరు. ఉత్తరభారతమున ప్రముఖ నగరములందు శైవ, శాక్త, శాంకర మతానుయాయుల ప్రాబల్య ముండెను. వల్లభాచార్యులకు వీరితో స్థానస్థానములందు శాస్త్రార్థవాగ్వివాదములు జరుగుచుండెడివి. వారు మూడుసారులు భారతయాత్రను గావించి అవైష్ణవ, మాయావాదులను, శాస్త్రార్థమునం దోడించి వైష్ణవధర్మప్రచారమును గావించిరి.

ఆచార్యులసమయమందు పూర్వప్రాంతమున — జగదీశపురిలో జగన్నాథుడు, పశ్చిమ ప్రాంతంబున — ద్వారకాపురమునందు 'రణఛోడజీ' ప్రముఖదేవులుగ నెన్నబడుచుండిరి. మధ్యభారతమందు — మథురాపురమందు కేశవదేవుని పూజించు చుండిరి. ఈ సుదూర స్థానములకు కష్టసాధ్య మగు యాత్రలు చేయుట

భక్తజనులు నిజభాగ్య మనుకొను చుండిరి. వల్లభాచార్యు లీ స్థానముల కనేక పర్యాయములు యాత్రలు గావించిరి. మఱియు నచ్చట మతప్రచారమును గావించిరి. వారు శ్రీకృష్ణ లీలాభూమిని — వ్రజాంతర్గతగోవర్ధనము నిజ సంప్రదాయ ప్రముఖకేంద్రముగను, శ్రీనాథుని ప్రధానదైవముగను నిర్ణయించిరి. పుష్టిసంప్రదాయకారణంబున గోవర్ధనము భారతీయ ప్రముఖస్థానముగ నెన్నబడుచుండెను. ఆచార్యుని సమయమందాస్తికజనమునందధికముగ మూఢవిశ్వాసములు పెంపొందెను. వృద్ధజనులు జగన్నాథుని రథచక్రముల క్రింద పడినను, గంగలో మునిగి చచ్చినను పుణ్య మనుకొను చుండిరి (చౌరాసీవైష్ణవవార్తా). వల్లభాచార్యులు నిజోపదేశంబుజేసి యజ్ఞానమును దూరము గావించిరి. వారు నిమ్నలిఖితసూత్రములందు నిజసంప్రదాయరూపరేఖలను దెలుపుచు సరళ సుగమ మతము వైపునకు ప్రజల నాకర్షింపజేసిరి.

ఏకం శాస్త్రం దేవకీపుత్రగీతం
ఏకో దేవో దేవకీపుత్ర ఏవ।
మంత్రోప్యేక స్తస్య నామాని యాని
కర్మాప్యేకం తస్య దేవస్య సేవా॥

వారి సిద్ధాంతగ్రంథము గీత; ఆరాధ్యదేవుడు శ్రీకృష్ణుడు; మంత్రరూపము కృష్ణనామము; కర్తవ్య కర్మ శ్రీకృష్ణసేవ యని దెల్పుచు ప్రజలందు కృష్ణభక్తిప్రచారమును గావించిరి. వారు కర్మ, జ్ఞాన, భక్తిమార్గములందు సామంజస్యము నేర్పఱచుచు ప్రమాణచతుష్టయ మాధారముగ ప్రేమలక్షణాభక్తిమహత్వమును దెలిపిరి. అహంమమతాపూరిత సంసార నివృత్తి, మాహాత్మ్యజ్ఞానపూర్వక భగవత్సాక్షాత్కారము, భగవల్లీలాప్రవేశము — ఇవే జీవుని విడిచి; దుర్గమమార్గము ననుసరించిన జీవునికి కళ్యాణము కలుగదు.

వల్లభుని అద్భుత వ్యక్తిత్వము, అపూర్వ పాండిత్యము, సుగమమతకారణంబున భారత ధార్మికజగత్తునం దొక విప్లవరేఖను లేచెను. వారు సరళ, రోచక, ఆకర్షక, యుక్తియుత మతమును జనసముదాయసమ్ముఖమునం దుంచిరి. రాజు – పేద, పండితుడు – మూర్ఖుడు. గుణి – నిర్గుణుడు, ఉచ్చుడు – నీచుడు, స్త్రీ – పురుషుడు అందఱ గణిత భ్రాంత వ్యక్తులలో వైష్ణవధర్మప్రచారమును గావించిరి. వారి దార్శనిక సిద్ధాంతము శుద్ధాద్వైతము; భగవదనుగ్రహంబుతో ప్రాప్తించిన ప్రేమలక్షణాభక్తిమీద నాధారపడి నిజసేవామార్గము పేరు పుష్టిసంప్రదాయ మని పెట్టెను. ఆచార్యుల సమయంబున నీ నవీన సంప్రదాయము యథేష్ట రూపంబున ప్రచార మాయెను.

మహాప్రభువల్లభాచార్యుని తర్వాత ఆయన పుత్రుడు గోస్వామి విఠలనాథుడు, పుష్టిసంప్రదాయవ్యాపనప్రచారములను గావించెను. అతడును తనతండ్రివలె ననేకయాత్రలు చేసి యగణితవ్యక్తులను భక్తబృందమునందు జేర్చుకొనెను, అనేకగ్రంథములను రచించి నిజసంప్రదాయదార్శనికపుష్టిని ఠాకూరుసేవామండనమందు యథోచితవ్యవస్థను ఆకర్షకము లగు నుత్సవములందు లౌకికపక్షమును సమున్నతమొనరించెను. ఆచార్యులు భగవచ్చర్చాస్వరూపంబున ఏ భాగవతకథాప్రచారమును గావించిరో, గోస్వామి దానియున్నతికి జేయూతనొసంగెను. కాని దీనితో సాంప్రదాయక సిద్ధాంతిక గ్రంథవ్యాఖ్యాక్రమము సాగెను; అతడు భావుకకవుల ధార్మికభావనను మేల్కొల్పి పుష్టిని గల్గించుటకు దోడ్పడెను. దీని

దిన మభివృద్ధి గాంచెను.

ఈ సంప్రదాయశిష్యుల 'విత్తజా' భక్తికారణంబున వ్యయ సాధ్య సేవా విధానము ప్రచలిత మాయెను. మఱియు మందిర వైభవము. ఉత్సవములు, గానవాద్యమాధుర్యము, భోగ శృంగారాదియాకర్షణలు — సాంప్రదాయిక ప్రచారమునకు ముఖ్యసాధనము లాయెను. కాని తదుపరి శిష్యులందు విషయవాసన లుత్తేజము గా ప్రారంభించెను. ఇది శోచనీయవిషయమే; ఇట్టి సంకల్ప మాచార్యులు కలయందు మను గాన లేరైరి.

గోస్వామి విఠలదాసు ఠాకూరుసేవావ్యవస్థోన్నతితో బాటు సాంప్రదాయికకవులను, గాయకులను, సంగీతజ్ఞులను, వాద్యవిశేషజ్ఞులను, చిత్రకారులను, పాకశాస్త్రీయులను, అన్యకళాకారులను సంఘటితపఱచెను. మఱియు వారి కళోన్నతికి, సాంప్రదాయప్రచారమునకు భక్తులు బద్ధకంకణు లైరి. ఈ విధంబున మానవజీవితమునందు 'సత్యం, శివం, సుందరం' భావనలను భగవంతుని కర్పణ మొనర్చి దాని సదుపయోగమార్గమును జూపించెను.

సాంప్రదాయికమందిరములందు నిత్య నైమిత్తికోత్సవ వ్యవస్థ నేర్పఱచి, భజనకీర్తనలను, పదముల గొప్పతనమును జూపించెను. వల్లభాచార్యుని సమయమందు సూరదాసు మొదలైన భక్తకవులు. ఈ ప్రకారపదసంరచన నారంభించి దానిసంకీర్తనము నొనరించుచు శ్రీనాథుని సేవించుచుండిరి. గోస్వామి విఠలనాథు డీ కార్యమును వ్యవస్థితరూపంబు నొనరించెను. వారు 'అష్టఛాప' కవులను సంఘటితపఱచి కవులను, కళాకారులను ప్రోత్సహించిరి. వీరే సాంప్రదాయికప్రచారమునకు మూలస్తంభములు.

అష్టఛాపకవుల కావ్యగీతములు వాస్తవం మనోహర గీతములు; కమనీయ కావ్యమాధుర్యము ప్రస్ఫుటించు భక్తిపదములు; హృదయంగమ భావసంపూరితములు; పీడితజనావళి నుల్లాసపఱచు మధురగేయములు. ఈ మనోహరపదగీతములు రసికులకు, భక్తులకు, సాహిత్యప్రేమికులకు నానందదాయకములు. పుష్టిసంప్రదాయము నం దారంభమునుండియు నష్టఛాపకవులకు మహత్వపూర్ణ స్థాన మున్నది. అంతియే కాదు, ప్రజాహృదయములను రంజింపజేసి, శాశ్వతానందమును జేకూర్చు వ్రజపదములు భారతీయ జీవితప్రతిబింబ స్వరూపములు.

## అష్టఛాప సంస్థాపకుడు—గోస్వామి విఠలనాథుడు

జన్మము :—

గోస్వామి విఠలనాథులు 1572 (1437) పుష్యమీ కృత్తికా నవమి శుక్రవారము కాశీ నికటస్థ 'చరణాట' నామక స్థానమునందు జన్మించిరి. వీరు మహాప్రభు వల్లభాచార్యుని ద్వితీయపుత్రులు; గోపీనాథుని కనిష్ఠసోదరులు. వీరి ప్రథమ వివాహము మహాప్రభువల్లభాచార్యుని దేహావసా నానంతరము వారిజ్యేష్ఠ సోదరులు గోపీనాథులు 1589 లో జరిపించిరి. వీరి పత్ని పేరు 'రుక్మిణి'; వీరివలన విఠలనాథునకు బదిమంది, ఆర్గురు పుత్రులును. నలుగురు పుత్రికలును గల్గిరి. 1616 నందు భార్యావియోగము కల్గినది. రాణీదుర్గావతియొక్క యాగ్రహంబున వారి రాజధాని 'గఢా'లో వారి ద్వితీయవివాహము సం॥ 1620 లో 'పద్మావతీ' యను కన్నియతో సుసంపన్న మాయెను. ఈమెవలన 1628 లో ఘనశ్యాము డను పుత్రుడు కలిగెను. ఈతీరున వీరి కేడ్గురు పుత్రులు— దీనికారణంబున పుష్టిసంప్రదాయ

# అద్వైతమతము

విద్వాన్ చదలువాడ జయరామశాస్త్రిగారు

(గతసంచిక తరువాయి)

## 12. బ్రహ్మము నిర్గుణము

"నిర్గుణమ్ (ఆత్మ. ౧. ౭. ౨.) అను శ్రుతి బ్రహ్మమునందు. శుభములు, హేయములు నగు గుణములను సామాన్యముగ (సమానముగ) నిషేధించుచున్నది. ఇదియుక్తముగూడ. బ్రహ్మము, సగుణమైన, ఆగుణముచే బ్రహ్మము సవిశేషమగుట అవశ్యము సంభవించుటచేత ఆబ్రహ్మము జగత్తునకు మూలకారణమగుట సంభవింపదు. "యఃసర్వజ్ఞః" (ముం.౧.౧.౯.) "సత్యకామః సత్యసంకల్పః" (ఛాం.౮. ౭.౧.) అను నిట్టివగు సగుణశ్రుతులన్నో ఆరోపితములైన గుణములను బ్రతిపాదించునవై యున్నవి. బ్రహ్మమునందు గుణములను సామాన్యముగ స్వీకరించి హేయగుణరహితమని చెప్పి నిర్గుణ శ్రుతుల సమర్థించునెడల బాహ్యేంద్రియములచే గ్రహింపఁదగిన రూపరసాది గుణరహితుఁడైన జీవుఁడు గూడ నిర్గుణపదవాచ్యుఁ డగుట సంభవించును. అట్లయిన "నిర్గుణమ్, (ఆత్మ. ౧. ౭. ౨.) అని శ్రుతిచెప్పు నిర్గుణపదమునకు ఏమి ఆధిక్యమును జెప్పినట్లు కాదు. కనుక పరబ్రహ్మమునందు గల్యాణకారకములైన గుణములుగూడ వాస్తవముగ లేవని తెలియవలెను. మఱియు. పరమాత్మనిష్ఠితములై అభిమతములై కల్యాణకారకములైన గుణములు జీవులకు జీవావస్థయందే యుపయుక్తములగుచున్నవి. ఆ యవస్థ అవిద్యాకల్పితము కావున ఆయవస్థయందుపయుక్తములైన పరమాత్మ గుణములు సైతము కల్పితములేయగుచున్నవి. స్వప్నావస్థయందుఁ గమనక్రియయం దుపయుక్తమైన రథముసైతము కల్పితమగుచున్నది.

## 13. ఆత్మ జ్ఞాన స్వరూపము

జ్ఞానముగూడ పరబ్రహ్మస్వరూపమగునుగాని పరబ్రహ్మగుణముగాదు. "విజ్ఞానఘనః" (బృహ. ౨. ౪. ౧౨). "సత్యం జ్ఞానమ్" (తై. ౨. ౧.) "విజ్ఞాన మానందం బ్రహ్మ". (బృహ. 3. ౯. ౨౮.) ఇవి లోనైన శ్రుతుల ననుసరించియు. "విజ్ఞాతారమరే". (బృహ. ౨. ౪. ౧౪.) అని, బ్రహ్మమును విజ్ఞాతగఁ బలుకు శ్రుతియొక్క వాక్కు ఔపచారికము, (ఆరోపితము – కల్పితము) అని తెలియవలెను. అద్వితీయమైన పరబ్రహ్మమునందు. భేదమూలకమైన ధర్మధర్మిభావ మసంభవమగును గాన ఆబ్రహ్మము వాస్తవముగ జ్ఞానాశ్రయమగుట సంభవింపదు. ఇట్లే భేదమూలకమైన విషయ విషయిభావము బ్రహ్మమునం దసంభవమైనందున వాస్తవముగ జ్ఞేయత్వము బ్రహ్మమునకు లేదు.

## 14. ఆత్మ నిత్యుడు

ఆపరమాత్మ నిత్యుఁడను విషయమున తఱచుగా నెల్లమతములవారి కైకమత్యమేర్పడి యున్నది. చార్వాకాదులు పరుఁడైన పరమాత్మనుగూర్చియే తలంపరు. ఇఁక ఆత్మ నిత్యుఁడనుమాట వారికి చాలదూరమనుట చెప్ప

వలెనా. శ్రుతియే ముఖ్యముగ శరణముగల వారికి అనఁగా శ్రుతిని ప్రమాణముగ నెంచు వారికి మాత్రము. "సవా ఏష మహా నజ ఆత్మాఽజరోఽమరోఽమృతో బ్రహ్మ" (బృ. ౪. ౪. ౨౫). "నిత్యో నిత్యానామ్" (శ్వే. ౬. ౧౩). ఇవి లోనగు శ్రుతులకు ఆత్మ నిత్యుఁడని చెప్పుట అభిమతమైయున్నది. అనుమాన ప్రమాణము సైతము ఇప్పుడు గ్రహింప నవసరమైనది. "బ్రహ్మము, నిత్యము, మూలకారణమగుటవలన. ఏది అనిత్యమో అదిమూల కారణము కానేరదు. ఘటాదులెట్లో అట్లు మూల కారణ మనిత్యమైన ఆకస్మికముగ (కారణ కార్యముల నియతిలేక) కార్యోత్పాద ప్రసంగ మేర్పడును. అది సంభవింపదని యిట్లిచ్చట అనుకూలమగు తర్కము. ఏవిధముగ సువర్ణము ఆయా ఆలంకార (ఆభరణము) రూపమునఁ బరిణమించుచున్నదయ్యు అలంకారమువలె నశింపదు. ఇఁకేమన అలంకారమును బట్టి చూచినచో సువర్ణము నిత్యమైయున్నది. అట్లు పరమాత్మ కాఁడు. 'నిష్కలం నిష్క్రియమ్" (శ్వే. ౬-౧౯) ఇదిలోనగు శ్రుతులందు బ్రహ్మమునకు వికారరాహిత్యము చెప్పుటచేత పరిణామము సంభవింపదు. మఱి మన బ్రహ్మము కూటస్థనిత్యము, ఒక్కరూపముననే సదా యుండునది కూటస్థనిత్యము,

## 15. అద్వైతము

ఈబ్రహ్మ మద్వితీయము. బ్రహ్మసంబద్ధము (కూడినది) తదసంబద్ధము (బ్రహ్మముతోఁగూడనిది) తచ్ఛరీరము (బ్రహ్మమునకు శరీరమైనది.) తదంశభూతము (బ్రహ్మాంశముగనుండునది) తద్ధర్మము (బ్రహ్మధర్మముగలది) నైన ఏవస్తువు గాని యితరమైనది లేదు. "సర్వం ఖల్విదం బ్రహ్మ" (ఛాం. 3. ౧౪. ౧). "ఇదం సర్వం యదయ మాత్మా" (బృ. ౨. ౪. ౫.) "ఐతదాత్మ్య మిదం సర్వమ్" (ఛాం. ౬. ౮. ౭.) ఇట్టివి లోనగు శ్రుతులు స్పష్టముగఁ జెప్పుట వలన బ్రహ్మాద్వైతమను ప్రసిద్ధి ఈ మతము నందు సమీచీనముగ సరిపడియున్నది. బ్రహ్మమునందు వాస్తవముగ నేప్రకారమునఁ జూచినను. ద్వైతమున కభావమే కన్పించుటవలననే అద్వైతమతమని చెప్పఁబడుచున్నది.

## 16 బ్రహ్మము సన్మాత్రము

బ్రహ్మము సన్మాత్రము. కలదని మాత్రము కేవలము చెప్పశక్యమైనది గాని యిట్టిది, అట్టిదని చెప్పుటకు సాధ్యముగానిది. ఇట్టిదట్టిదను మొదలైన విశేషణములను గ్రహించితిమేని, విశేషణ మెప్పుడు. విశేష్యమునకు భిన్నమై యుండున దను నియమమును బట్టి దేనికి వ్యావృత్తి (భిన్నత్వము) గలదో దానిచేత బ్రహ్మమునకు సద్వితీయత్వము ప్రాప్తించుచున్నది. అట్లగుట అద్వితీయ శ్రుతులకు విరోధ మేర్పడును. ఏలయన జ్ఞానస్వరూపము. బ్రహ్మము. సన్మాత్రరూపము. ఇందువలన జ్ఞానముగూడ. అసన్మాత్రమే యగుచున్నది.

## 17. సదనుభూతులకు ఐక్యము

సన్మాత్రమైన దానికచ్చట విషయభావము లేదు. లౌకికజ్ఞానమునకు వలె, సాశ్రయత్వము, సవిషయత్వము. (ఆశ్రయము, విషయము గలిగి యుండుట) గాని అజ్ఞానమున కేర్పడునేని ఇఁక నాజ్ఞానము సత్సామాన్యరూపముగా నుండుట ప్రాప్తింపదు కనుక జ్ఞానమునకు బ్రహ్మస్వరూపము. ప్రాప్తింపక పోవుచున్నది. అట్లగుచో "విజ్ఞానఘనః" (బృహ. ౨. ౪. ౧౨.) అను నిట్టి శ్రుతివిరోధము ఆయవస్థయందే యేర్పడును.

(సశేషము)

# త్యాగము

[శ్రీ గురుభక్త పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు]

ఇదివరకు మనము ఇచ్ఛాజ్ఞానశక్తులకు అనువగు యోగములను అనగా భక్తి జ్ఞానములను గూర్చి తెలిసికొంటిమి. ఇప్పుడు మనము క్రియాశక్తికి సంబంధించిన కర్మయోగమునుగూర్చి తెలిసికొందము.

భక్తియోగము జ్ఞానయోగము కాక మరొకయోగము కర్మపరముగా చేయబడిన కర్మ. దీనిని "యజ్ఞయోగము" అని కూడ పిలువవచ్చును. ఈ కర్మయోగములో చాల కష్టములున్నవి.

కర్మను సరిగా అర్థము చేసికొనుటయే ఒక గొప్ప కష్టము, "కర్మయననేమి? వికర్మ యననేమి? అకర్మయన నేమి? దీనిని విద్వాంసులు కూడ నిశ్చయింపజాలకున్నారు. అందుచే నేను నీకు కర్మస్వరూపమును తెలియబరచుచున్నాను. దీనిని తెలిసికొని నీవు చెడుగునుండి విముక్తుడవగుదువు. విహిత ధర్మాచరణ రూపంబైన కర్మయొక్కయు, నిషిద్ధ ధర్మాచరణ రూపంబగు వికర్మయొక్కయు, నిర్వ్యాపారత్వ రూపంబగు అకర్మయొక్కయు నిజస్థితిని తెలియుట ఆవశ్యకము. కర్మమార్గమును తెలిసికొనుట చాల కష్టము. కర్మమునందు అకర్మమును, అకర్మమునందు కర్మమును, చూచువాడు మానవులలో ధీమంతుడు. ఆతడే యోగియు సర్వకర్మములు చేసినవాడును, అగును. (5 అ. 16, 18 శ్లో).

ఇవి 'కర్త'కు ప్రారంభములో సంభవించు కష్టములు. ఆతడు చేయవలసిన కర్మకును, చేయరాని కర్మకును, భేదము గుర్తింపవలయును. ఒప్పునకు తప్పునకు భేదము నెరుంగవలయును. కర్త జ్ఞాపకముంచుకొనవలసిన ముఖ్య విషయమిది. "కర్మ నాచరించుటే నీ పనిగాని, దానిఫలములతో నీకు సంబంధము లేదు." (2 అ. 47 శ్లో). యజ్ఞపరముగా కర్మ చేయబడినపుడు దాని ఫలములు ప్రభువునకే చెందును. అందుచే నీకు "కర్మ నాచరించుటకు మాత్రమే అధికారము కలదు." దీనిని గురించి మానవుడు సరిగా కర్మ నాచరింపవలయును. "కనుక నీవు ఫలము నాశింపక స్వధర్మకార్యమును ఎల్లప్పుడును చేయుచుండుము." (3 అ. 19 శ్లో).

స్వధర్మమనగా నేమి? సరియగు కర్మ యననేమి? కర్మమార్గమును సరిగా ననుసరింపవలెనన్నచో పై రెండు ప్రశ్నలకును సమాధానము తెలిసికొనవలయును. సరియగు కర్మనుగూర్చి ప్రభువిట్లు చెప్పెను. అదేమన "నా యిచ్ఛకనుగుణముగా నాచరించుటయే". సరియగు కర్మ నాచరించుటకు ముందు నీవు దైవేచ్ఛను తెలిసికొనవలయును. కాని నీకు స్పష్టముగా తెలిసికొను శక్తి గలుగువరకు కొన్ని సూత్ర

ముల ననుసరింప వచ్చును. వ్యక్తిగతములైనను కుటుంబమునకు సంబంధించిన వైనను సంఘమునకు సంబంధించిన వైనను నీమార్గములోవచ్చు కార్యముల నన్నిటి నాచరింపుము. అవి భగవంతునిచే విధింపబడిన కార్యములు. సరియగు కర్త కార్యములకొఱకు వెదకుకొనడు. ఆతడు సహజముగా తనమార్గములో వచ్చు కార్యములను జేయ మొదలిడును. వాటిని సంపూర్ణముగా నాచరించుటకు ప్రయత్నించును. ఆతడు అన్ని కార్యములను భగవంతుడే చేయుచున్నాడనుకొని చేయును. తాను కర్తనని యనుకొనడు. ఇట్లు స్వధర్మమును, స్వధర్మము కాని దానిని తెలిసికొనుటకు ప్రయత్నించుటలో ఆతని జ్ఞానము వృద్ధిపొందును.

మరొక ముఖ్యసూత్రమేమన నీమార్గములో వచ్చు కార్యములలో కూడ నీవు చేయగలిగిన వాటిని మాత్రమే చేయుము. నీ శక్తికి మించిన కార్యములను తలపెట్టకుము. అన్ని కార్యములు నీ ధర్మములుగానే కనపడవచ్చును. కాని శక్తి లేనిదే, కాలము చాలనిదే, వాని నాచరించు టెట్లు? అందుచే నీ శక్తినిబట్టి నీకు గల కాలమును బట్టి, నీ ధర్మముల కొకపరిమితి ఏర్పడును. నీ శక్తికి మించిన కార్యములను తలపెట్టినచో నీవు ఏకార్యమును సరిగా చేయజాలవు. అందుచే నీవు చేయుటకు వీలులేని కార్యములు ఇతరులవని నీవు గుర్తింపవలయును. "ఇతరుల ధర్మముల నాచరించుట అపాయకరము." తన శక్తికి మించిన కార్యములను కాని, తనకు కాలము చాలని కార్యములను కాని, చేయ మొదలిడినచో కర్త అపాయములలో చిక్కుకొనును. "నేను చేయవలసిన కార్యము లనేకములున్న" వని నీ వనవచ్చును. నిజమే. కాని కార్యములను చేయగల సమర్థత నీకొక్కడికే లేదు. ప్రపంచమును నడిపించు శక్తి యంతయు నీ కొక్కడికే ఈయబడలేదు. నీ చిన్న చేయి దూర్పనిదే అన్ని కార్యములు జరుగక పోవు. ఇట్లాలోచించుటయే మనలో చాలమంది చేయుచున్న పొరపాటు. కర్మమార్గము ననుసరించు వారు ఈ పొరపాటునుండి తప్పించుకొన వలయును. ఏపని చేయుటకు మనకు కాలము చాలదో అది మన ధర్మము కాదు. ఆకార్యమును మనము చేయ మొదలిడినచో, మరియొక మానవుని వాని ధర్మమునకు దూరముగానుంచి, బలవంతముగా సోమరిని చేయుచున్నామన్న మాట. ఇట్లు ధర్మమును సరిగా అర్థముచేసికొన లేక పోవుటవలన గలుగు ఫలితము ఒక మానవుడు పెక్కు కార్యములను మొదలిడి, కొన్నిటిని సంపూర్ణముగా చేయలేక పోవుట. ఏలన ఆతనికి కాలము చాలదు. మరియొకడు పనిలేక సోమరిగానుండుట. ఏలన మొదటి మానవుడు అత్యాశతో అన్ని కార్యములను తీసికొనెను. ఇట్టి కార్యములు ధర్మము లనిపించుకొనవు. ఏలన కాలము భగవంతునియొక్క రూపమే. కాలపరిమితులు భగవంతుడు మన కేర్పరచిన పరిమితులన్న మాట. చేయవలసిన కార్యములు చేయుటకు నీకు కాలము చాలనిచో, ఆకార్యముల నాచరించుటకు భగవంతుడు మరియొకరిని తప్పక నియమించి యుండునని తెలిసికొనుము. ఆతని చేతిలో నీవంటివారనేకులున్నారు. అతి చురుకుగా పనిచేయుచుండువారి కిదియొక పాఠము. ఇట్టి వారి వలననే ఇతరులకు సోమరితన మలవడుచున్నది. అతి చురుకుగా పనిచేయుట ప్రాపంచిక మార్గముగాని, కర్మమార్గము కాదు.

మితిమీరిన చురుకుదనముతో పనిచేయు మానవుడు ఈ పాఠమును నేర్చుకొనుట ఎట్లు? ''నేను కర్తను కాను'', అను సత్యమును గుర్తించుటవలననే ఈపాఠము బోధపడును. ''అహంకారముచేత మూఢాత్ముడు 'నేనే ఈ కర్మము చేసితిని' '' అని భ్రమించును. (3 అ. 27 శ్లో). ''వస్తుతత్వము తెలిసిన యోగయుక్తుడు చూచుచు, వినుచు, ముట్టుచు, ఆఘ్రాణించుచు, భుజించుచు, కదలుచు, నిద్రించుచు, శ్వాస విడుచుచు, మాట్లాడుచు, ఇచ్చుచు, పుచ్చుకొనుచు, కండ్లు తెరచుచు, కండ్లు మూయుచు 'నేను ఏదియును చేయువాడనుగాను. ఆయా ఇంద్రియములు వానివాని పనులయందు ప్రవర్తించుచున్నవి'. అని మాత్ర మూహించుచుండును. అదే కర్మమునందు అకర్మము (5 అ. 8–9 శ్లో). తన ప్రభువువలెనే తాను కూడ గుణాతీతుడై గుణములచే పనులను చేయించు చున్నట్లుండును. ''నేను ఏ పనిని చేయుటలేదు''. అని గుర్తించినచో అన్ని పనులు వానంతటవే సక్రమముగా జరుగుచుండును. ''నేను కర్తనుకాను'' అనునదే కర్త నేర్చుకొనవలసిన ముఖ్యపాఠము. అన్నిటికిని కర్త ఒక్కడే. ఆతడే ప్రభువు, మానవులందరు ఆతని చేతులు. చేతులపని కార్యములను సరిగా చేయుటయేగాని, ఎన్నియో కార్యములను గూర్చి ఆలోచించుట కాదు. నీవు చిత్రములను వ్రాయవలెనన్నచో, నీచేతిలో కుంచె, కలము, పెన్సిలు, నాగలి, సుత్తి, గొడ్డలి మొదలగున వన్నియు పట్టుకొననక్కరలేదు. రంగు పూయుటకు చేతిలో నొక కుంచె చాలును. నేలను దున్నవలెనన్న చేతిలో నాగలిని ధరింపవలయును. వ్రాయవలె నన్న ఒక్క కలము చాలును. ''ఒకసారి ఒక్క పని ముట్టును మాత్రమే ధరించుట''యే కర్మ నాచరించుటలోని జ్ఞానము. కాని మొదలిడిన పనిని మాత్రము సంపూర్ణముగా చేయుము. ఏలన నీ పనిలో నీవు ప్రభువు యొక్క పరిపూర్ణతను ప్రతిబింబింప చేయవలయును. నూరు పనులను అసంపూర్ణముగా చేయుటకంటె ఒక పనిని పూర్ణముగాచేయుట మేలు. అందుచే మానవుడు కర్మఫలముతో సంబంధము పెట్టుకొనక పోవుటయేగాక కర్మను యజ్ఞార్థము చేయవలయును. విశ్వాధారమైన యజ్ఞధర్మము సక్రమముగా కర్మ నాచరించు మానవునిలోనే మూర్తీభవించును. నాల్గవ అధ్యాయములో, మానవు లాచరించు అనేక విధములగు యజ్ఞములనుగూర్చి ప్రభువు చెప్పినాడు.

ఈ యజ్ఞధర్మము అనగా నేమి? ఇతరులు జీవము త్యాగము చేయుటవలననే అన్ని జీవులును జీవించుచున్నవి. అందుచే ఆత్మజ్ఞాన మెరిగిన ప్రతిజీవియు తాను చేసిన జీవ ఋణమును, త్యాగరూపములో తీర్చుటకు సిద్ధముగా నుండవలయును. ఈ న్యాయము మానవుల లోనే కాదు రాళ్ళలోను, చెట్లలోను, జంతువులలోను కూడ వ్యాపించియున్నది. వృక్షములకు ఆహారముగా ఖనిజములు నాశనమైపోవును. జంతువులకు ఆహారముగా వృక్షములు నశించును. పెద్ద జంతువులు చిన్న జంతువులను ఆహారముగా చేసికొనును. జంతువులు మానవులకొఱకు నశించును. మానవులే మానవులను అనేకవిధములుగా ఉపయోగించుకొందురు. ఈ విధముగా యజ్ఞధర్మము ప్రకృతి యందంతటను వ్యాపించియున్నది. ఏలన ప్రభువు యజ్ఞప్రభువు. ఆతని ఆత్మ త్యాగము వలననే విశ్వము జన్మించినది. మానవుడు ఈ

ధర్మమును క్రమముగా గుర్తింప వలయును. పరిణామ మెందుకొరకో మానవు డిట్లనుకొన వలయును.

"ఖనిజములు, వృక్షములు, జంతువులు నాకొఱకు నాశనమై పోవుచున్నవి. అనేక జీవుల త్యాగము వలననే నేను జీవించు చున్నాను. అందుచే ఈఋణమును ఆత్మత్యాగ రూపములో నేను తీర్చుకోవలసియున్నది" ఇది ఆతని కర్మమార్గములో నున్నది. ఆతడు నిర్మించుచున్న ఇల్లు మానవులు నివసించుటకు యోగ్యముగా తయారైన నాతనికేమి? లేక భావిలో నిర్మింపబడు గొప్ప భవనమునకు పునాదిగా తయారైన నాతనికేమి? కొన్ని భవనముల శిథిలములతోనే మరికొన్ని భవనములకు పునాదులు తయారగును. భగవంతుని కొఱకు పనిచేయువారి ప్రస్తుత అపజయములు భావిలో నిర్మింపబడు గొప్ప దేవాలయములకు పునాదులు. అందుచే నిజమగు కర్తకు జయాపజయములతో గాని, కర్మఫలముతోగాని సంబంధము లేదు. ఆతడు బాహ్యప్రపంచముతో సంబంధము లేకుండ భగవంతుని ప్రతిమాటను వినగల్గును.

కర్మమార్గములో యజ్ఞయోగము, వలన ఆతడు స్వేచ్ఛను పొందును.

"ఓ అర్జునా నీవు ఏది చేసినను, ఏది భక్షించినను, యే యాగము చేసినను, యేది యిచ్చినను, ఏ తపముచేసినను వాని నన్నిటిని ఈశ్వరుడనగు నాకు సమర్పింపుము. ఈ విధముగా గావించుటవేని శుభ ఫలముల నిచ్చును. తరువాత మానవుడు ఇతర జీవులుచేయు త్యాగమును చాల తక్కువగా తనకొఱకు ఉపయోగించుకొన నారంభించును. క్రమముగా "యజ్ఞ ధర్మమే" ఆతని జీవిత ధర్మము అగును. తాను చేయు ప్రతి కర్మలోను ఆతడీ ధర్మము ననుసరించుచుండును. ప్రవృత్తి మార్గములో చేసిన ఋణములను నివృత్తి మార్గములో తీర్చివేయ నారంభించును. కర్మఫలముల నన్నిటిని త్యాగముచేయుచు పరిపూర్ణుడగును. ఏలన ఫలమున కాశింపని మానవుడే కర్మను పూర్ణముగా చేయగలడు. నిజమగు కర్త "తాను భగవంతుని శక్తి ప్రవహించుట కొక మార్గ" మని మాత్రమే యనుకొనును. అట్టిమానవుడు జయాపజయములను లెక్కచేయడు. 'జయము' అనగా ఆతని యుద్దేశము భగవంతుని ఇచ్ఛకనుగుణముగా వర్తించుటయే. అపజయమనగా ఆతని ఇచ్ఛకు వ్యతిరేకముగా ప్రవర్తించుటయే. జయాపజయములనుగూర్చి ప్రపంచముయొక్క యుద్దేశముతో ఆతనికి సంబంధములేదు. రెండును కర్మబంధముల నుండి విడిపించునవే". (9 అ. 27-28 శ్లో). ఈ విధముగా కర్మ ముక్తిని లేక భగవంతునితో ఐక్యమును ప్రసాదించును.

మన భక్తికి పాత్రుడైనవాడు ఒక్కడే ప్రభువు. మన జ్ఞానమున కాధారము ఒక్కడే ప్రభువు. మన కర్మలకు మూలము ఒక్కడే ప్రభువు. ఒక్కడే ప్రభువు.

అందుచే ఒక్కటే మానవజాతి. ఒకే ప్రభువు, ఒకే జీవము, ఒకే సౌభ్రాతృత్వము.

ఇదే గీతాసారము. జ్ఞానులు తమ జ్ఞానముతోను, కర్మిష్ఠులు తమ కర్మతోను, భక్తులు తమ భక్తితోను కలిసి ఒకే ఒక ప్రభువు శరీరమును తయారుచేయుదురు. విశ్వముయొక్కపని పూర్తియైన తరువాత భగవంతుని

శరీరశోభ అనేకవిధములుగా ప్రకాశించును. అప్పుడు ఈ శరీరములోనుండి మరొక విశ్వ ప్రభువు ఉదయించును. ఆతని శరీరములో భాగముల మైన మనము క్రొత్త ఉత్సాహముతో పనిచేయుదుము. ఈ విధముగా విశ్వము తరువాత విశ్వము పుట్టుచుండును. ఆ ఏకత్వమును గుర్తించిన తరువాత ఇక మాయ, దుఃఖము అనునవి ఎక్కడ ఉండును ?



# వారలు, విశేషాలు

## కీర్తిశేషులు రావుబహదూరు 'సి' రామానుజాచార్యులవారు

వీరు పంకజమ్మ తాతాచార్యులు అనెడి పుణ్యదంపతులకు మదరాసు సమీపాన ఉండే కళత్తూరు గ్రామంలో 1875 వ సంవత్సరంలో జన్మించారు. వీరి పసితనంలోనే, వీరి కుటుంబం మదరాసుకు వచ్చి చేరిపోయింది. వీరు ఇక్కణ్ణే నరసింహయ్యరుమిడిల్ స్కూలులోను నేటివ్ హైస్కూలులోను ప్రెసిడెన్సికాలేజిలోను చదువుకొని బి. ఏ. పట్టం పొంది, సెక్రెటరైటులో గుమాస్తాగా ప్రవేశించి, మెట్టుమెట్టుగ పైకెక్కి, అండర్ సెక్రెటరీపదవిని అధిష్ఠించి, ప్రశంసార్హముగ సేవ చేసి విరామము పొందినారు. దక్షిణభారతదేశంలో శ్రీరామకృష్ణోద్యమ పురోగతికై మిక్కిలి పాటుపడ్డవాళ్లలో అగ్రగణ్యులు వీరున్నూ వీరి జ్యేష్ఠజ్ఞాతులు కీర్తిశేషులు రావుసాహేబు 'సి' రామస్వామయ్యంగారున్నూ. శ్రీరామకృష్ణుని అగ్రశిష్యవరేణ్యులైన శ్రీవివేకానందస్వామి శ్రీబ్రహ్మానంద స్వామి శ్రీరామకృష్ణానందస్వామి అను వారి కటాక్షభాగ్యం కన్న వారు ఈ ధన్య సోదరులు. వీరిలో రామానుజాచార్యులవారు యథావిధిగ శ్రీబ్రహ్మానందస్వాముల చరణసమాశ్రయణం చేసి ఉపదేశం పొందారు. సకలజీవులను భగవంతుని ప్రత్యక్షరూపాలుగా భావించి సేవ చేయవలె అనే శ్రీరామకృష్ణుల నిత్య నూతన సందేశాన్ని తమ దైనందినానుష్ఠానంలో నిర్వహించడానికి తమ జీవితాన్ని అంకితంచేసికొన్న వారు వీరు. యాచనలచేత నేమి నాటకప్రదర్శనలచేత నేమి పాటకచ్చేరీలచేత నేమి ఏడెనిమిది లక్షలకు పైగా ధనం గడించి, శ్రీరామకృష్ణ మిషను విద్యార్థివసతినిర్మాణాన్ని సాధించారు. 1932 లో శ్రీరామస్వామయ్యంగారు పరమపదించిన వెంటనే, అప్పుడే నౌకరీనుండి విరామం పొందిన శ్రీరామానుజాచార్యులు విద్యార్థి వసతిగృహ కార్యదర్శి పదవిని అధిష్ఠించి, తన జీవితశేషమును తదుద్గతికి వినియోగించారు. శ్రీవివేకానందకళాశాల నిర్వాహకవర్గంలో ధనావేక్షకులుగ ఉండినారు. త్యాగరాజకీర్తనావళిని సోపోద్ఘాతంగాను సానువాదంగాను ప్రకటించారు. అన్నామలై విశ్వవిద్యాలయంలో సంగీతకళాభివృద్ధికై పరిశ్రమించి ఒకసంగీత కళాశాలను ప్రారంభం చేయించారు. వసతి

గృహవిద్యార్థులపైని వారి 'పితృప్రేమ' నిరుపమానం. వారు తే 4-11-1956 ది జీవితం చాలించడం శ్రీరామకృష్ణసామ్రాజ్యంలో ఒక మహోజ్జ్వల తార రాలిపోవడమే. ఐనా దీని వెలుగు పెక్కేండ్లవరకు మాసిపోదు. వారి ఆత్మకు శాంతి కలుగు గాక.



## శ్రీమత్స్వామి అవినాశానందుల నిర్యాణం

పూర్వాశ్రమంలో వీరి పేరు శివరామయ్యారు. వీరి స్వగ్రామం కుంభకోణం. మదరాసు కళాశాలలలో ఒకదానిలో చదువుకొని ఫిలాసఫిలో ఎమ్. ఏ. పట్టం పొంది, వీరు హిందూపత్రికకు కొంతకాలం సహాయ సంపాదకులుగా ఉండి, అనంతరం మైలాపూరు మఠంలో ప్రవేశించారు. శ్రీబ్రహ్మానందస్వాములు వీరికి 1926 లో సన్న్యాసదీక్షను అనుగ్రహించారు. వీరు మాయావటిలో కొంతకాలం పని చేశారు. తర్వాత సింహళంలో స్కూళ్ల మేనేజరుగాను మిషనుకుఉపాధ్యక్షులుగాను ఉండినారు. ఫిజి దీవులలో ఈ మిషనుకు అంకురార్పణం చేసిన వారు వీరే. శ్రీరామకృష్ణులయు శ్రీశారదా మాతృశ్రీయొక్కయు శతతమ జయన్తిమహోత్సవాలప్పుడున్నూ, కల్చురల్ హెరిటేజ్ ఆఫ్ ఇన్డియా, గ్రేట్ విమెన్ ఆఫ్ ఇన్డియా అను ఉద్గ్రంథాల ప్రకటనలప్పుడున్నూ వీరు చేసిన సేవ అపారం. తెలుగులోని 'బోధామృతం' వంటిది తమిళంలోని 'తిరుఅరుళ్ మొళి' అది వీరి కూర్పే, తుది దినాలలో వీరు విశాఖపట్న ంద్రానికి సెక్రెటరిగా ఉండినారు. వీరు బహు భాషావేత్తల్లు బహుభాషలలో వక్తలు. వీరు తమ 70వ ఏట తే 16-12-1956ది దివ్యధామం అలంకరించారు. శ్రీరామకృష్ణసంస్థ వీరిని కోల్పోవడం అంటే ఒక బహుముఖప్రజ్ఞానిధిని కోల్పోవడమే. వీరి ఆత్మకు శాంతి.

## శ్రీరామకృష్ణమఠం, మదరాసు

### వైద్యశాలలో మాతృశ్రీ శతతమ జయన్తి స్మారక నూత్న భవనావిష్కారం

ఈ నూతన భవనాన్ని ఆవిష్కరించడానికై మాతృశ్రీ ప్రియశిష్యులున్నూ ప్రస్తుతం కేంద్రోపాధ్యక్షులున్నూ ఐన శ్రీమత్స్వామి విశుద్ధానందులు మదరాసుకు విజయంచేశారు. నిర్ణీత దినం ఆదివారం తే 29-12-1956 ది. ప్రార్థనానంతరం శ్రీమత్కైలాసానందస్వామి సదస్సునకు స్వాగతం పలికి, శ్రీవిశుద్ధానందస్వాములను కొనియాడి, నూత్నభవననిర్మితికి తోడ్పడ్డ సర్కారువారికిన్నీ ఉదారమహాజనులకున్నూ తమ కృతజ్ఞతను తెలిపారు. సభాధ్యక్షులు నిధిమంత్రులైన పూజ్యశ్రీ సుబ్రహ్మణ్యంగారు. వారు 32 ఏండ్ల క్రితం కూనూరులో తమకు గలిగిన శ్రీవిశుద్ధానందస్వాముల పరిచయ భాగ్యాన్ని ప్రస్తుతించి, ఈ సంస్థస్వాములు నిర్వహించు లోకసేవోద్యమాలకు చంద్రునికి నూలుపోగు అన్న రీతిగా యథాశక్తి సాహాయ్యాన్ని తాను ప్రభుత్వంచేత పీలైనప్పుడంతయు చేయిస్తుండడాన్ని చెప్పి, వారి నిస్స్వార్థ సేవానిష్ఠను పొగడి అదే సభ్యులకున్నూ ఆదర్శం కావాలె అన్నారు. మేనేజరు మహారాజులు శ్రీమచ్ఛుద్ధసత్త్వానందస్వాములు నూత్నభవననిర్మాణానికి శ్రమించిన ఇంజనీర్లను కంట్రాక్టర్లను పనివాండ్రను అభినందించి, వారికి కేంద్రోపాధ్యక్షులచే లాంఛనబహూకృతులను ప్రసాదింపించారు; ప్రముఖులు అంపిన సందేశాలను వైద్యశాలనుగూర్చిన విపుల నివే

దికను చదివి వినిపించారు. డాక్టరు కాప్టర్ శేషాద్రినాథనుగారు ఉపన్యసిస్తూ భౌతికశాస్త్రాదులవల్ల ఒనగూడనట్టి నిర్వృతి ఆధ్యాత్మికపరతచేత ఒనగూడుతుంది అన్నారు. తర్వాత శ్రీ డాక్టరు సి. పి. రామస్వామిఅయ్యరు ప్రసంగిస్తూ, శ్రీరామకృష్ణసంస్థవారు విశ్వమంతటా నిర్వహిస్తుండే నిస్స్వార్థ లోకసేవా కార్యక్రమాన్ని సముచితసూక్తుల కొనియాడారు. సభాధ్యక్షులైన మంత్రి సుబ్రహ్మణ్యంగారు తమ మలిపలుకులో వైద్యశాలలోని క్రొత్త భవనంలో తే 1-1-1957 ది పని ప్రారంభమౌతుం దని ప్రకటించారు. శ్రీ M. సుబ్బరాయయ్యరుగారు సదస్సుకు వందనోపచారం చేశారు.

## మాతృశ్రీ శారదాదేవిజయన్తి

తే 23-12-1956 ది జయంతి తిథిపూజ, భజన, దేవీమాహాత్మ్యపఠనం, హోమం, 1,400 భక్తులకు 1,300 దరిద్రనారాయణులకు ప్రసాదవినిమయం, వైద్యశాలలో శతతమజయంతి స్మారకంగా నిర్మితమైన నూత్నభవనంలో పూజా రామనామసంకీర్తనలు జరిగాయి. బహిరంగసభ తే 30-12-1956 ది ఆదివారం నాడు శ్రీశారదా ట్రెయినింగుస్కూలు విద్యార్థినులు ప్రార్థనగీతాలు పాడినారు. సోదరి సుబ్బులక్ష్మిగారు సదస్సుకు స్వాగతం పలికారు. శ్రీమతి సావిత్రిరాజను బి. ఏ. గారు అధ్యక్ష్యం వహించారు. వారు తమ ఉపన్యాసంలో మాతృశ్రీజీవితసందేశప్రాముఖ్యాన్ని వివరించారు. తర్వాత శ్రీమతి సుశీలాఅచ్యుతరామనుగారు దేవీమాహాత్మ్య మధుర శ్లోకాలను కొన్నింటిని కర్ణపేయంగా గానం చేశారు. శ్రీమతి సరస్వతిచెన్నకేశవన్‌గారు ఆంగ్లంలో ఉపన్యసిస్తూ ప్రాచీనుల గొప్పతనాన్ని చెప్తూ ఉంటూ మనం సోదరులంగా ఉండిపోవడం తగదని చెప్పి, శారదాదర్శము భారతమహిళలకు సర్వథానుసార్యం అన్నారు. తమిళంలో శ్రీమతి లీలావతిరామసుబ్రహ్మణ్యముగారున్నూ తెలుగులో శ్రీమతి పి. వి. రుక్మిణిగారున్ను మాతృశ్రీజీవితసారతరఘట్టాలను తమఉపన్యాసాలలో ఉద్ఘాటించారు. శారదావిద్యాలయ జంత్రసమ్మేళనంవారు జంత్రసంగీతం వినిపించారు కాసేపు. వల్లించే పోటీలలో గెలుపొందినవారు ఇద్దఱు తాము కంఠపాఠముచేసిన గ్రంథభాగాలను వల్లించారు. సభాధ్యక్షురాలు గెలుపొందినవారికి బహుమానా లిచ్చారు. సోదరి సుబ్బులక్ష్మమ్మగారు సదస్సుకు వందనోపచారం చేశారు. దానితో నాటి కార్యక్రమం ముగిసింది.



తే 24-12-1956 ది మఠంలో ప్రత్యేకపూజ, భజన, బైబిలుపఠనం అనే కార్యక్రమాలతో క్రైస్తుజయంతి జరిగింది. సాధారణంగా బహిరంగసభ మఱుభానువారం జరిగేది. ఈ సంవత్సరం ఆ భానువారంనాడు మాతృశ్రీ జయంతి బహిరంగసభ నిర్ణీతం ఐనందువల్ల క్రైస్తుజయంతి బహిరంగసభ తే 24 దినాడే జరిగింది. సాయం ఆరాత్రికం ఐన పిదప భక్తులు చావడిలో సమావేశ మయ్యారు. బైబిలులో ఏసుదేవుని జీవితఘట్టాలు చదివి వినిపింపబడ్డాయి. వివేకానందకళాశాల ఫిలాసఫీశాఖకు అధ్యక్షులైన శ్రీశంకరనారాయణనుగారు

క్రైస్తుసందేశాన్ని వివరిస్తూ దానికి హిందూ సిద్ధాంతంతో ఉండే పోలికలను కనబరుస్తూ దివ్యంగా ఉపన్యసించారు. సదస్సుకు వందనోపచారం మఠాధ్యక్షులు శ్రీమత్కైలాసానందులు నిర్వర్తించారు.

## పంచెన్‌లామాగారి ఆగమనం

టిబెట్టుదేశంలో మతరంగంలోను లౌకిక రంగంలోను సర్వాధికారులు లామాలు. వారు ఇటీవల మదరాసుకు వచ్చి ఉండి తే 18–2–56 ది శ్రీరామకృష్ణమఠమును చూడడానికికూడా వస్తామని తెలిపారు. డాలైలామాకు ఆరోగ్యం బాగులేనందువల్ల పంచెన్‌లామామాత్రమే అరుదెంచారు. మఠస్వాములు వారిని గౌరవించి మఠంలోని వైద్యశాల గ్రంథశాల మున్నగు వాని నన్నిటినీ చూపి గాస్పెల్ ఆఫ్ శ్రీరామకృష్ణ అను గ్రంథాన్ని బహూకరించారు. లామా గారును వైద్యశాల కని రూ. 200/- లు విరాళం ఇచ్చారు



## మాతృశ్రీ శతతమ జయంతి

1953 వ సంవత్సరం డిసెంబరులో ఆరంభమైన ఈ ఉత్సవాలు మఱు సంవత్సరంవఱకు భారత దేశ మంతటా జరిగి, 'నివేదిక ప్రకటన'తో పరిసమాప్తి చెందాయి.

శతతమజయంతి ఉత్సవ నిర్వాహకవర్గం వారు దక్షిణేశ్వర మండలి శ్రీశారదామఠానికి గాను (1) తాము అంగ్లంలో ప్రచురించిన 'గ్రేట్ విమెన్ ఆఫ్ ఇన్డియా', వంగ భాష లో ప్రచురించిన 'శ్రీమాశారదదేవి' అనే గ్రంథాల కాపీరైటునున్నూ (2) బంకూరాజిల్లా జయరామవాటిలో శారదగుడిని పెంపొందించడానికని, జయన్తిఉత్సవనిధిలో శేషించిన రూ. 20,100/- లున్నూ బేలూరుమఠట్రస్టీలకు అర్పించారు.

"అమ్మా, నేను నిన్ను శరణు జొచ్చితిని. ఏమి చేయ వలెనో ఏమి చెప్ప వలెనో నీవే నాకు బోధింపుము. ఏవిషయములో నైనను సరే, నీ సంకల్పమే, అన్నిటికిని మీదిది. నీ బిడ్డలకు శ్రేయస్కరము ఐనదియు అదే. నా తలంపులను నీసంకల్పములో లీన మొనర్చుకొని నన్ను ఒకపనిముట్టుగ ఉపయోగించుకొనుము."

"అమ్మా, బ్రహ్మజ్ఞానమును ఒసంగి తక్కినదానిని ఎల్ల మఱచునట్లు చేయకుము. నాకు బ్రహ్మజ్ఞానము అక్కఱ లేదు. తల్లీ, నేను నీ బిడ్డను కానా? కాబట్టి సహజముగనే పిఱికివాడను. నాకు మాఅమ్మ తప్పక ఉండ వలెను. బ్రహ్మజ్ఞానమునకు ఒక పదిలక్షల నమస్కారములు. అది ఎవరికి కావలెనో వారికి ఇమ్ము."

—శ్రీరామకృష్ణుడు



# గ్రంథసమీక్ష

## 'ఆంధ్రవాణి"

సాంఘిక విద్యావిషయిక సచిత్ర మాసపత్రిక

ఎడిటర్ : శ్రీ ఎన్. శ్రీకంఠంగారు; ప్రాప్తి స్థానము : మేనేజరు, ''ఆంధ్రవాణి'', కోయిల కుంట్ల, కర్నూలుజిల్లా; పుటలు : 58; వెల : అర్థరూపాయ; సంవత్సరచందా : ఆరు రూపాయలు.

మానవుడు, మానవునివలె మన గలుగవలె నన్న, ఒక్కనాగిరికతయే గాక, విజ్ఞానమును గూడ సముపార్జించుకొనవలయును. విద్యను ఆర్జించుకొని, దుర్లభ మైన ఈ మానవ జన్మను ఉత్కృష్టము గావించుకొనుట, సంఘజీవియై తానుకూడ లోకమునకు ఉపకారి యగుట, లోకకల్యాణములో తానును పాలు పంచుకొనుట - మున్నగునవి మానవుని సామాన్యధర్మములై యున్నవి. ''యశమునందనురక్తియు, విద్యయందు వాంఛాపరివృద్ధియు ప్రకృతిసిద్ధగుణంబులు సజ్జనాళికిన్.''

కాని, — అదేమి పాపమో, మన ఆంధ్రమందున్నంత నిరక్షరాస్యత, దక్షిణహిందూదేశమున వేరెందును గాన రాదు. అట్టి అవిద్యాంధకారమును పొలగించి, విద్యాజ్యోతిని వెలిగించి, ఆంధ్రమునందంతటను వాణీస్వైరవిహారమునకై చక్కని రాచబాటను నిర్మింప కొందఱు మహాత్ములు కంకణము కట్టుకొన్నారు. ''మానవసేవయే మాధవసేవ'' గా గల ఇట్టి సంఘోద్ధారకులచే ప్రారంభింపబడిన పత్రిక ఈ ''ఆంధ్రవాణి''. ఇట్టి పత్రికలే ఆంధ్ర వయోజన ప్రాసాదరాజనిర్మాణమునకు పునాదులునాదగును. పౌరశిక్షణకు, సంఘపురోభివృద్ధికి, దేశశ్రేయస్సునకు ఇట్టివి పట్టుగొమ్మ లనుట అతిశయోక్తి కానేరదు.

తేనె లొలుకు పలుకులతో, తేటతెల్ల మగు మాటలతో, నానాటి, సాంఘిక - రాజకీయ - వ్యావసాయిక - పారిశ్రామిక విషయము లనేకములు, సామాన్యప్రజల కుపయోగపడునటుగా, వయోజనులకు శిరోధార్య మగునట్లుగా, ఈ ''ఆంధ్రవాణి'' యందు ఏర్చి, కూర్చి, కేర్చి దిద్దబడినవి. అంతే గాక మన రాజ్యాంగచట్టములోని — పంచవర్ష ప్రణాళిక లోని విషయములు గొన్ని సువిశదముగ బోధపఱుపబడియున్నవి. సుప్రసిద్ధ ప్రముఖులను గూర్చియు, నీతిజ్ఞులను గూర్చియు — వారి సూకులును — నందందు అందంబుగ బొందుపఱుపబడియున్నవి. వయోజనవిద్యాబోధకులకు చక్కని సలహా లొసంగబడినవి. —

ఇట్టి ''ఆంధ్రవాణీ'' ప్రసాదమే ఆంధ్రవయోజనులకు వాణీప్రసాద మనుట ఎంతమాత్రమును అతిశయోక్తి గానేరదు.

ఇట్టివయోజనుల అమృతపత్రికకు మా హృదయపూర్వకాభివందనములతోడి స్వాగతము.

—అఖండం గోపాలకృష్ణ.

# శ్రీ రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యములను శ్రీ రాజాజీగారు మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను అమర్చి, తమిళభాషలో రచించియున్నారు. అందు వారి సూక్తివైచిత్రియు ప్రత్యక్షర చమత్కారమును ఎంతటి గంభీరవిషయమునైనను సర్వసుగ్రహము చేయగల నైపుణియు తలపోలమంటినవి. ఆ గ్రంథముయొక్క యనువాదములు ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, హిందీభాషలలో ఇప్పటికే అపారవ్యాప్తి నొందినవి. దాని కిది చక్కని తెలిగింపు.

128 పుటలు వెల: రూ. 1-4-0

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు శ్రీరామకృష్ణుని జీవిత సంగ్రహమును 1121 మహోపదేశములును గలవు.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, తార్కికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, దేవుడు, జ్ఞానము : భక్తి : కర్మము, బ్రహ్మతత్త్వము మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసి బిడ్డల కయిన అవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

నీతికథలును సూక్తులును మకరంద పేశలములు, నిర్వృతికరములు.

... ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూక్ష్మాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్వలమగు పంచమ ముద్రణము ! వెల : రూ. 3-8-0

# హిందూమతము

రచయిత : శ్రీ వివేకానందస్వామి

అనువాదకులు : శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

హిందూమతి నామమును పరస్పరభిన్నభావభూయిష్ఠములగు అనేక మతసంప్రదాయ ములు వహించి యుండుటచే, తత్స్వరూప నిర్వచనమునకు ఇందు శ్రీ వివేకానంద స్వాములవారు పూనుకొని ఆ మతము వేదసంహితాకాలమునుండి ఎట్లు క్రమ పరిణామ మందెనో, అందు సర్వసమ్మతమూలభావము లెవ్వియో, అది చేయు బోధ యెట్టిదో, ఇన్ని భిన్నమతాంతరము లెట్లు కలిగెనో, ఈ కలగూరగంపకు హిందూమత నామ మెట్లు లేర్పడెనో విశదీకరించియున్నారు. జిజ్ఞాసువుల కత్యంతోపయుక్తమగు గ్రంథము.

... తెనుగువాఙ్మయములో వేదాంతచర్చలపై ... ప్రకటింపబడిన గ్రంథములలో ఇది ఉత్తమోత్తమ మైనదని శిరసాగ్గి చెప్పవలసియున్నది. ... —భారతజ్యోతి 12-4-1956.

168 పుటలు వెల : రూ. 1-4-0

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు – 4

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౩ ౧౯౫౭, మార్చి—దుర్ముఖి, మాఘము సంచిక ౯

## విషయసూచిక

శ్రీరామకృష్ణ ఆరతి గేయము—[శ్రీ వివేకానందస్వామి] ౨౮౯
శ్రీరామకృష్ణ సూక్తి కతిపయము ౨౯౧
శ్రీరామకృష్ణ ప్రశస్తి ... ... ౨౯౨
పరమహంస శ్రీరామకృష్ణుఁడు—శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు, ఎమ్.ఏ. ౨౯౩
ఆధునిక దేశ కాల పరిస్థితులలో శ్రీరామకృష్ణుని జీవితోపదేశాల ఆవశ్యకత-
[సంపాదకీయము] ... ... ౨౯౭
విగ్రహ వ్యావర్తని—డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు,
ఎం.ఏ., ఎం.లిట్., పిఎచ్.డి. ... ... ౩౦౩
మహాప్రభు వల్లభాచార్యులు—శ్రీ కర్ణ రాజశేషగిరిరావుగారు, ఎం. ఏ. ... ౩౦౭
పరమావధి—శ్రీ గురుభక్త పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు. ... ... ౩౧౧
వార్తలు, విశేషాలు ... ... ౩౧౮
గ్రంథసమీక్ష ... ... ౩౧౯



"సర్వేశ్వరుని శరణు జొరుము, ఆతని కృప నీ యనుభవమునకు అప్పుడు వచ్చును."

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౩ ౧౯౫౭ – మార్చి : : దుర్ముఖి – మాఘము సంచిక

## రామకృష్ణ ఆరతి గేయము

[ శ్రీ వివేకానందస్వామి ]

ఖణ్డన భవబన్ధన, జగవన్దన వన్ది తోమాయ్
నిరఞ్జన, నరరూపధర, నిర్గుణ గుణమయ్ ॥

సంసారబంధాలను ఖండించువాడా, లోకవందితా, నిను మేము ఆరాధింతుము. నరరూపమును ధరించి యున్నావు కాని నీవు నిష్కళంకుడవు, గుణరహితుడవు, గుణమయుడవు.

మోచన అఘదూషణ, జగభూషణ, చిద్ఘనకాయ్,
జ్ఞానాఞ్జన విమల నయన వీక్షణే మోహ యాయ్ ॥

దోషములనుండియు పాపములనుండియు ముక్తినొసగువాడా, లోకాలంకారా, చిద్రూపీ, జ్ఞానాంజనముచే విమలమైన నీ చూపు ఒక్కటి చాలును, మోహమును పోగొట్టుటకు.

భాస్వర భావసాగర చిరఉన్మద ప్రేమపాథార్
భక్తార్జన యుగళచరణ, తారణ భవపార్ ॥

ఉజ్జ్వలభావసముద్రుడా, ప్రేమసాగరచిరోన్మత్తుడా, నీ చరణయుగళమును ప్రాపించిన భక్తులు భవసాగరమును దాటి గట్టెక్కుదురు.

జృమ్భిత – యుగ – ఈశ్వర జగదీశ్వర యోగ సహాయ్
నిరోధన, సమాహితమన నిరఖి తవ కృపాయ్ ॥

యోగ సహాయుడవైన ఓ లోకేశ్వరా, ఈయుగస్వామివిగ అవతరించితివి, నిరుద్ధమై సమాధిలో నిమగ్నమై యున్న నీ మనస్సును నీకృపచేతనే చూచుచున్నాము.

భఞ్జన దుఃఖగఞ్జన కరుణాఘన కర్మకఠోర్
ప్రాణార్పణ జగతతారణ కృన్తన కలి డోర్ ॥

దుఃఖవ్యథల భంజించువాడా, కరుణాస్వరూపీ, దుష్కర కార్యనిర్వాహకా, లోకరక్షకా, నీ ప్రాణ మిచ్చి కలిబంధముల ఛేదింతువు.

వఞ్చన కామ కాఞ్చన, అతి నిన్దిత ఇన్ద్రియ రాగ్
త్యాగీశ్వర, హే నరవర, దేహ పదే అనురాగ్ ॥

కామకాంచనసక్తియు అతినిందిత మయిన యింద్రియరాగమును లేని వాడా, విరక్త చక్రవర్తీ, పురుషోత్తమా, నాకు నీ చరణములందు భక్తి నొసంగుము.

నిర్భయ, గతసంశయ, దృఢ నిశ్చయ మానసవాన్
నిష్కారణ, భకతశరణ త్యజి జాతికులమాన్ ॥

భయ సంశయరహితుడా, దృఢనిశ్చయ మనస్కుడా, నీవు భక్తుల జాతి కులాదులను పాటింపక వారికి అవ్యాజ శరణమ వగుదువు.

సమ్పద తవ శ్రీపద, భవ గోష్పద వారి యథాయ్
ప్రేమార్పణ సమదరశన జగజన దుఃఖ యాయ్ ॥

నీ శ్రీపాదమే మా సంపద, ఆ పాదమున ఈ సంసారము గోష్పదవారిపాటిదే. ఓ ప్రేమార్పణా, సమదర్శనా, నీచే జగజ్జనముల దుఃఖము రూపుమాయును.

నమో నమో ప్రభు వాక్య మ నాతీత మనో వచ నైక ధార్
జ్యోతిర జ్యోతి ఉజల హృది కన్దర తుమి తమ భఞ్జన హార్ ॥ ప్రభు ॥

ఓ ప్రభూ, 'మనములం జర్చించి భాషావళిం బలుకరాని' వాడా, వాఙ్మనసైకభూమీ, పరంజ్యోతీ, హృదయ కుహ రాంధకార భంజనా, నీకు వందనములు.

ధే ధే ధే లఙ్గ రఙ్గ భఙ్గ, బాజే అఙ్గ సఙ్గ మృదఙ్గ
గాఇఛే ఛన్ద భకతవృన్ద, ఆరతి తోమార్ ॥

ధే ధే ధే లంగ రంగ భంగ ధ్వనులతో సమ్మిశ్ర మైన మృదంగ ధ్వానముతో నీ భక్తులు సాయంపూజాగీతమును పాడుచున్నారు.



# శ్రీరామకృష్ణ సూక్తి కతిపయము

౧. తామర లేచిన చోట గోకిన కొలదియు దురద హెచ్చు చుండును, ఎంత గోకిన అంత సుఖముగా నుండును. భగవద్గుణానుకీర్తనమున భక్తు లెన్నడును తృప్తిచెందరు.

౨. భగవన్నామము చెవిని బడినంతనే ఎవ్వనికి పులకాంకుర మగునో. ఎవ్వని కన్నుల నుండి ఆనందబాష్పములు ప్రవహించునో- అట్టి వానికి ఇదియే తుది జన్మము.

3. పడవ నీటిలో ఉండ వచ్చును గాని నీరు పడవలో నుండ రాదు. సాధకుడు సంసారములో నుండ వచ్చును, కాని సంసారము వానిలో నెలకొన రాదు.

౪. వివేక వైరాగ్యములును వీనితోఁబాటు దృఢ మైన భగవద్భక్తియు ఉన్న యెడల సంసారములో ఉన్నను బాధ లేదు.

౫. తండ్రివలనఁ గలుగునది మొదటి జన్మము, ఉపనయనముచే నేర్పడునది ద్వితీయ జన్మము, సన్న్యాసమో మూడవ జన్మము.

౬. కొండంత దూది యైనను నలుసంత నిప్పు దానిపై బడినంతనే తగులబడి బూడిద యై పోవు రీతిని పావన భగవన్నామమును భక్తితో కీర్తించిన మాత్రాన నీపాపరాసు లన్నియు పటాపంచలై పోవును.

౭. శరీరగృహమున నున్నందులకు (జీవుడు) చెల్లింప వలసిన అద్దెయే వ్యాధి.

౮. ఆత్మప్రభావమును ప్రకటించు గర్వము గర్వము కాదు, ఆత్మగౌరవము నణచి వేయు వినయము వినయము కాదు.

౯. కారుణ్యమున క్రైస్తవునివలెను, బాహ్యాచారములందు పట్టుదల చూపుచో మహమ్మదీయునివలెను, సర్వభూతహిత మొనర్చునెడ హిందువువలెను వర్తించుట పాడి.

౧౦. ఎవ్వనికి నమ్మిక కలదో వానికి అన్నియు నున్నట్లే; ఎవ్వనికి నమ్మిక లేదో వానికి అన్నియు లోటే.

౧౧. జీవుడ నని భావించు వాడు జీవుడు గనే యుండును, దేవుడ నని భావించు వాడు దేవుడే యగును. మనము ఎట్లు భావింతుమో అట్లు అగుదుము.

౧౨. మలయమారుతమే వీచు నపుడు విసనకఱ్ఱ యెందులకు? భగవత్కృపయే లభించునపుడు జపతపము లెందులకు?

# శ్రీ రామకృష్ణ ప్రశస్తి

## ప్రతాపచంద్ర మజుందారు

దేశీయ మతముల కొక్కొక్కదానికి వేదాంతమే శాస్త్రీయమైన వెన్నముక వంటిది. ప్రతి హిందువునకును అతనికి తెలియకయే అతని వాతావరణమునుండి కొంత వేదాంతము అబ్బును, శ్రీరామకృష్ణుడును ఆపాటి వేదాంతియే కాని అంత కెక్కుడు గాడు. ఆయనకు సంస్కృతభాష రానే రాదు. బెంగాలి భాషయైనను చాలినంతగ వచ్చునో రాదో. కాని ఆయనకు ఆధ్యాత్మిక జ్ఞానము ఎట్లు గలిగిన దనగా స్వప్రతిభచేతను సాక్షాదనుభవముచేతను. [మాక్సుమూలరుకు వ్రాసిన లేఖనుండి].

## డిగ్బి

గడచిన శతాబ్దిలో ఆంగ దేశాన వెలసిన మేధానిధులలో అగ్రగణ్యులు రాబెర్టుబ్రౌనింగును జార్జిరస్కినును. మఱి యెట్టిసంస్కారమును లేని నిరక్షరకుక్షి యనందగిన వంగదేశీయ రామకృష్ణునితో ఆ ప్రజ్ఞానిధులను బోల్చి చూడుడు, వారలెల్లరు అంధకారములో దేవులాడుచున్నవారే. 'చదువు' 'చదువు' అని మనము దేని ననుకొందుమో దానిని రామకృష్ణుడు ఎఱుగనే ఎఱుగడు. కాని ఆయన వాక్కుం బోని వాక్కు ఆ యుగమున వేఱెవరికిని లేదు, శ్రాంతాత్ములకు ఆయన దేవుని ప్రత్యక్షముగ జూపెడివాడు. [ప్రాస్పరస్ బ్రిటిషిండియా. పు 99].

## అరవిందుడు

భారతదేశాత్మ ప్రప్రథమాన ఆస్తిక్యరంగమందే మేలుకొన్నది, గెలుపొందినది. దీనిని మున్ముందుగ చెప్పిన మహాపురుషులును గలరు, దీనికి సూచనలును గలవు గాని, ఏనాడు కలకత్తాలోని విద్యావంతులలో తిలకప్రాయులు ఒక నిరక్షర హిందూసన్న్యాసి పాదములకు ప్రణమిల్లిరో ఆనాడు గదా విజయము సిద్ధించినది. ఆ యోగి స్వతః ప్రాప్త ప్రబోధుడు, ఆత్మానుభవానందపరవశుడు, రహస్యమతపరుడు (మిస్టిక్), విదేశవిద్యయు భావాలును ఆయనలో జాడగానైన లేవు. అఖండవిశ్వమును తన రెండుచేతులలో ఇముడ్చుకొని మార్పగల, మార్పనున్న వీరుడని, ఆయన వివేకానందుని గుర్తించెను. వివేకానందుని విజయపర్యటనము 'భారతదేశము జీవించి ఉండుటే కాదు, మేలుకొని ఉండుటే కాదు, దేశాంతరములను గెలువ గలదు' అని మొదటిసారి ప్రత్యక్షముగ జూపినది. [కర్మయోగి' అను గ్రంథమున]

## గాంధిమహాత్ముడు

పరమహంస శ్రీరామకృష్ణుని జీవితచరిత్రము, ఆస్తిక్యము నిత్యానుష్ఠానములో ఉన్న చరిత్రము. ఆయన చరిత్రమును జదివితిమేని దేవుని ప్రత్యక్షముగ జూడగలము. దానిని చదివిన వారికి ఎవరికి గాని దేవుడొక్కడే నిజమనియు తక్కిన దెల్ల మాయ అనియు నమ్మకము కలుగక మానదు. దైవ

పరత శ్రీరామకృష్ణునిలో ప్రత్యక్షరూపమును దాల్చినది. ఆయన సూక్తులు వట్టి పండితుల సుద్దులు గావు, అవి జీవిత మనెడి గ్రంథమందలి పుటలే, స్వానుభవ ప్రకాశకములు, కావున వానిని జదివిన వారికి అవి అనివార్యముగ చిత్తములందు హత్తుకొనును. ఈ యవిశ్వాస మయ యుగమున శ్రీరామకృష్ణుడు ప్రాణవంతమును ఉజ్జ్వలమును అగు నమ్మకమునకు లక్ష్యము. పెక్కండ్రకు ఆ నమ్మకము నిర్వృతికరముగ నున్నది. అది లేకున్నచో వారికి ఆధ్యాత్మిక జ్యోతి ప్రాప్తించియే యుండదు. శ్రీరామకృష్ణుని జీవితము అహింసాధర్మప్రతిపాదక మైన పాఠము. ఆయన ప్రేమకు దిగ్దేశాదిగ అవధులు లేవు, ఆయన దివ్య ప్రేమ ఎల్లరకును ఉత్సాహప్రదముగ వెలయుంగాత. [శ్రీరామకృష్ణజీవిత గ్రంథోపోద్ఘాతము 1924.]

### జవహర్‌లాల్ నెహ్రూ

శ్రీరామకృష్ణ పరమహంస సామాన్య మానవుల జీవితగతికి పూర్తిగ ఎడసినవాడు అనుట స్పష్టము. ఆయన యుగయుగమునను మన భారతదేశమున అవతరించి, మన దృష్టిని ఆధ్యాత్మికరంగమునకును ఉన్నతవిషయముల వంకకును మరల్చిన మహర్షుల సంప్రదాయమునకు చెందినవాడే అని గుర్తింప వచ్చును.

[శ్రీరామకృష్ణ వివేకానందులు 1949. పు 2–4.]



# పరమహంస శ్రీరామకృష్ణుఁడు

శ్రీ వేదము వేంకటరాయ శాస్త్రి గారు, ఎమ్. ఏ.

[తే 10–3–57 ది జయంతిసభలో ఉపన్యస్తము]

భగవాన్ శ్రీరామకృష్ణ పరమహంస 122–వ జన్మ దినోత్సవ మైన యిది శ్రీభగవన్నామ సంకీర్తనార్థము ఉద్దిష్టము. పరమహంస మహత్త్వము జగత్ ప్రసిద్ధము ఎల్లరెఱింగినదే. ఐనను—

తథాపి వాచాలతయాయునక్తి మాం
మిథస్త్వ దాభాషణలోలుపం మనః

అన్నట్లు ఆ మహత్త్వ ప్రస్తుతిపరము లైన ఒకటి రెండు మాటలను చప్పరించి నా చాపల్యమును తీర్చుకొందును.

ఈ మహనీయుఁడు మనదేశమందు జన్మించుట మన భాగ్యము. మహానుభావులకు జన్మభూమి భరతఖండము. అందు భారతవర్షము ఇంకనుమిన్న. 'ఎందఱో మహానుభావులు, అందఱకు వందనము' అని గదా త్యాగరాజస్వామి వచించెను. ఈవిషయమునే బమ్మెరపోతరాజు చక్కఁగా తన భాగవతములో పద్యరూపమున వచించినాఁడు —

భారత వర్ష జంతువుల
భాగ్యము లే మని చెప్ప వచ్చు? నీ

భారతవర్షమందు హరి
పల్మఱుఁ బుట్టుచు జీవకోటికిఁ
ధీరతతోడఁ దత్త్వము
దేశము సేయుచుఁ జెల్మి సేయుచుఁ
ఆరయ బాంధవాకృతిఁ గృ
తార్థులఁ జేయుచునుండు నెంతయుఁ.

[భాగ. V. ii-54]

మహానుభావుల యవతారభూమి. పాశ్చాత్య దేశములలో మహానుభావు లవతరించిరి గా? వా రందఱును యుద్ధవీరులు, ఐహికచింతగల వారు, మనవారో ఆధ్యాత్మికచింతగలవారు. వారి విజయములు తాత్కాలికములు, మన విజయములు శాశ్వతములు. భరతఖండపు మతములే కదా వారికి శరణ్యములు.

దశావతారములలో శ్రీకృష్ణావతారము సంపూర్ణావతార మని పెద్దల యభిప్రాయము. భగవద్గీతయే మనకు నేఁటికిని తారకము. దీని కన్నను ఒకమెట్టు పైదిగా నేర్పడినది శ్రీరామ కృష్ణావతారము. పరమహంస శ్రీ రామ కృష్ణులే తాను 'రామ' 'కృష్ణుల' యుభయుల యవతార మని వచించినారు. ఇది యెంతయు వాస్తవము. ఆ మహానుభావుల గుణములు ఈయనయందుమేళవించి నూతనమూర్తిని భార తీయులకు ప్రసాదించినవి.—

పుత్ర సఙ్క్రాన్త లక్ష్మీకైర్
యద్ వృద్ధేక్ష్వాకుభిర్ ధృతమ్
ధృతమ్ బాల్యే త దార్యేణ
కష్ట మారణ్యకం వ్రతమ్ ॥

సంపదను పుత్రులకు సంక్రమింపఁ జేసి వృద్ధేక్ష్వా కువులు ధరించిన యారణ్యకవ్రతమును అన్న గారు బాల్యమందే ధరించిరి, కష్టా, అని రాములవారిం గూర్చి లక్ష్మణుఁడు పలికినట్లుగా భవభూతి వాక్కు.

బాల్యము నుండియునే వైరాగ్యచిహ్న ములు మహాత్ములలో కనంబడుట మనదేశ మందు సాధారణము. అట్టి భారతదేశములో భక్తిపారవశ్యమునకు పేరు గన్న వంగదేశ ములో వీరు జన్మించినారు. వంగదేశము చైతన్యమహాప్రభువు ప్రభవించిన చోటు. స్వాభావికముగ వంగీయుల చిత్తములు మైత్రీ కోమలములు. వారిచిత్తమాధుర్యము వర్ణనా తీతము. భక్త్యుద్రేకమునకు వారు పెట్టినదిపేరు. అట్టి పవిత్రభూమిలో జనన మందిన శ్రీరామ కృష్ణులకు ఆఱవ సంవత్సరమందే, అతి బాల్య మందే, భక్తిపారవశ్యతామూర్ఛనాదులు కలి గినవి. అదే చిత్తశుద్ధి. అదే భగవద్ధ్యానమున లక్ష్యశుద్ధి.

'ప్రాణాస్ తృణాగ్ర జల బిన్దు సమా నరా ణామ్' అన్న విషయము వీరికి వీరి యేడవ యేటనే తెలిసిపోయినది. వీరికి ఆ సంవత్సరమే పితృవియోగ మేర్పడినది. గొప్ప చిత్తవికార మున కిది కారణ మైనది.

వీరికి తొమ్మి దవ యేట ఉపనయనము జరిగిన సందర్భమున వీ రొక శూద్రస్త్రీ చేతి యన్నమును భుజించుట ఒక విశేషము; తర్వాతి మానసిక దృష్టి కిది సూచిక. జాతిభేదములను పాటింపని మైత్రికోమల హృదయము. చెప్పె దురు కదా.—

యస్ సారస్వత వైభవమ్
గురు కృపా పీయూష పాకోద్భవస్
తల్ లబ్ధం కవి నైవ,
నైవ హఠతః పాఠ ప్రతిష్ఠా జుషా

కాసారే దివసం వస న్నపి
పయఃపూరం పరం పఙ్కిలం కుర్వాణః
కమలాకరస్య లభతే కిం
సౌరభం సైరిభః?

మడుగులోనే పడియుండు దున్నపోతునకు పద్మ పరిమళము తెలియనటు పరంపరాగతు లైన పండితులు వేదాంతతత్త్వమును గ్రహింపఁగోరి ఎంత కృషి చేసియు ఇట్టి మానసిక పరిణామమును వృద్ధాప్యమున సైతము పొంద లేక యుండగా బాల్యమందే వీరి ఈ చిత పరిపాకము విశేషము—

కేవలము ఐహికముగా రిగా గాక ఆముష్మిక చింతతోనే ఈమహాత్ముఁడు జనించెనా, అవతరించెనా? అవతార మనుటకు సందేహము లేదు గాని, 'దైవం మానుషరూపేణ'. మానవుఁడే. మన వలె ఉప్పు, కారము, పులుసు—ఔత్తరాహుఁడు (=ఉత్తరదేశీయుఁడు) కావున — తీపును తిను వాఁడే. కాని అతిత్వరగా మానసిక పరిణామముల వల్ల వయోవృద్ధు గాక మును జ్ఞానవృద్ధుఁ డాయెను. ఐహిక వాంఛలలో మునిఁగి తేలు నట్టి మనకు పరమహంస జీవితమునుండి గ్రహింపఁ దగిన గుణపాఠములు పెక్కులు. ఈపాఠములు అనితరసులభములు. ఆమహానుభావుని జీవితములోని సన్నివేశములును అనుభవములును సాధనమును ఒక్కొక్క మానవునికిని తన జీవితములో ఏదో యొక సందర్భమున వచ్చినవి గానే యుండును. ఆ యా మానవునికి అందు నేర్చుకో దగిన పాఠమొకటి యుండును.

బాల్యములో చదువుకొన లేదు. చదువుకొమ్మని, అన్న కోపము చేయగా 'సామాన్య విద్య యెందుల కన్నా? పరతత్త్వమును దెలుపు విద్య కావలె నన్నా' అని బదులు చెప్పినారు త్యాగరాయస్వాముల వారికిని జపేశ్వరులవారికిని ఎంత అంతరమో రామకుమార—రామకృష్ణులకు అంత ఉండె నేమో! తాను చదువలేదఁట కాని చదివినవారి వలన విన్నాఁడఁట. తనది శ్రుతపాండిత్యము. కాని బహుశ్రుతుఁడు.

ఉత్తమ నటుఁడు — గ్రామములో శివరాత్రి — తన సొంత నాటక బృందము — 'శివ' పాత్రమును 'రాధా' 'కృష్ణ' పాత్రలను ధరించువాఁడు—ఈయనవలెనే చైతన్యస్వామి కూడ రుక్మిణీపాత్రను ధరించెను. అప్పుడు తల్లియే గుర్తింప జాలక పోయిన దఁట. పురుషులు ఏల స్త్రీపాత్రలను ధరింపరాదు? సారూప్యసిద్ధి. ఈశ్వరుడు మహానటుఁడు. దాక్షిణాత్య శిల్పములో ఆయనమూర్తి మనకు సుపరిచితమే. ఆ యంశము శ్రీరామకృష్ణునిలో ప్రత్యక్షము. ఆఱు నెలలు స్త్రీవేషమే ధరించి గోపికాభాసమున స్త్రైణముచే భగవద్ధ్యాన మొనరించి సాధన మొనర్చిన ఊర్ధ్వరేతస్కుఁడు ఆయన స్త్రీ స్త్రీయుండు నాటకము చూడ రాదు, చూచినను పురుషుఁడు స్త్రీపాత్ర ధరింపఁగా చూడ రాదు, ఇత్యాది నిషేధములు తెలిసినవే. ఏల? ఇంద్రియచలన భయమేగదా. స్త్రీపాత్రధారణమును ఇంద్రియనిగ్రహ సాధనా విశేషముగ ప్రాచీనులు ఉద్దేశించి రేమో.

వివాహ మొనర్చుకొన్నాఁడు, కాని ఎట్టి వివాహము! ఎట్టి దాంపత్యము! 'మాతృవత్ పరదారేషు' అని పెద్దలు చెప్పిరి కాని పరమహంస తనదారనే తల్లివలె చూచిన లోకాతీతుఁడు.

శక్త్యుపాసకుఁడు — సాధారణముగ పూజకులు అనర్థముల పాలగుచుందురు. ఈయన

సిద్ధి నందినాఁడు. సకలమతములను సంపూర్ణముగఁ జూచినవాఁడు. బ్రాహ్మణి మూలముగ తాంత్రిక వైష్ణవ పూజామార్గములను సాధించినాడు. అనాహతశబ్దమును విన్నవాఁడు. చేఁ కందిన అష్టసిద్ధులను తృణీకరించినవాఁడు. జటాధారి ఆరాధించు చుండిన రామలాలా శ్రీరామకృష్ణుని పూజ లందుకొన మోజుపడి ఆయన యొద్దనుండి ఈయనయొద్దకు మాఱినాఁడు.

శ్రీరామకృష్ణునకు అద్వైతవేదాంతమును కఱపు భాగ్యము గాంచిన గురువు తోతాపురి. ఆ కాలముననే శ్రీరామకృష్ణుఁడు సన్న్యసించి పరమహంసపరివ్రాజకుఁడై పరివ్రాజకాచార్యుఁ డాయెను. తోతాపురి నలువ దేండ్లలో సాధించిన దానిని ఈయన ఒకదినములో సాధించినాఁడు.

మహమ్మదీయ మతోక్త సాధన ననుసరించి సిద్ధి గాంచినాఁడు, క్రైస్తవ మతోక్త సాధన ననుసరించి సిద్ధిగాంచినాఁడు, బౌద్ధ జైనుల మన్నించినాఁడు, సిక్కుగురువులను గౌరవించినాఁడు. ద్వైతము విశిష్టాద్వైతము అద్వైతము అను మూఁడును సోపానములు అన్నాఁడు. తుదకు అన్ని మతముల సారమైన భక్తిని బోధించినాఁడు. 'జలం' అన్నను 'పానీ' అన్నను వాటర్ ... తణ్ణి ... నీళ్లు ... ఏమన్నను వస్తు వొక్కటే కదా అని బోధించినాఁడు. లోకోపకారము చేయ వలసినదే కాని భగవద్ధ్యానము మాన రాదు :

ర థ్యా న్త శ్చరతస్ తథా ధృత జరత్
కన్థా లవ స్యాధ్వగైస్
సత్రాస శ్చ సకౌతుక శ్చ సదయం
దృష్టస్య తైర్ నాగరైః
నిర్వ్యాజీకృత చి త్సుధా రస ముదా
నిద్రాయమాణస్య మే
నిశ్శఙ్కః కరటః కదా కరపుటీ
భిక్షాం విలుణ్ఠిష్యతి

"పెద్దవీధిలో నడచుచు ప్రాఁతబొంత పేలికను దాల్చినవాఁడనై నాగరులు అధ్వగులు దయా భయ కౌతుకములతోఁ గనుచుండ నిర్వ్యాజీకృతమైన నాజ్ఞానామృత రసానందమున తూఁగులాడుచు నే నుండఁగా ఎప్పుడు కాకి నా పుడిసిలి దొన్నెలోని భిక్షను జంకు లేక హరించునో" — అని మహాయోగీంద్రులు వాంఛించు దశను శ్రీరామకృష్ణుఁడు సాక్షాత్తుగ అనుభవించినాఁడు. ఈయనమతము సర్వజనసమ్మతమై సమాచరణీయముగ నున్నది. ఈయనను 'సకల సిద్ధాంత సరిత్సాగరము' అన వచ్చును.

గ్రుడ్డు వచ్చి పిల్ల గోరడా లాడిన విధముగా నెఱుఁగక వెఱ్ఱి జనులు
జ్ఞానులైన వారి గర్వాంతు రూరక, విశ్వ దాభిరామ వినుర వేమ ॥

ఋషు లెఱుంగ నట్టి విషయంబు భువి లేదు, వారు సెప్పినంత వరుస నగును,
తెలియ కనెదు వారు దేబెలు నిజ మయా, విశ్వ దాభిరామ వినుర వేమ ॥



# ఆధునిక దేశ కాల పరిస్థితులలో శ్రీరామకృష్ణుని జీవితోపదేశాల ఆవశ్యకత*

## [సంపాదకీయము]

ప్రపంచ మతాలలో గొప్పవి నాలుగు — హైందవము, బౌద్ధము, క్రైస్తవము, మహమ్మదీయము. వీనిలో మహమ్మదీయమతమునకు స్థాపకుఁడు మహమ్మదు, క్రైస్తవమతమునకు స్థాపకుఁడు క్రైస్తు, బౌద్ధమతమునకు స్థాపకుఁడు బుద్ధదేవుఁడు; హిందుమతమునకు స్థాపకుఁడు ఎవరు? ఫలానా అని ఒక్కరి పేరు చెప్పుటకు అవకాశము లేదు. అంతే కాక, సునిశితముగఁ జూచినప్పుడు హిందుమతము ఏకైకమతముగఁ గూడఁ గనిపింపదు. ఎన్నో సిద్ధాంతాలు ఎన్నో పూజావిధానాలు ఎన్నో మతభావాలు ఒక గుమిగాఁ గూడి 'హిందూమత' మను పేరఁ బరఁగుచున్నట్లు మనము గుర్తింతుము. మఱి ఇన్నింటిని ఒకటిగాఁ గలిపి స్థిరముగ నిలఁబెట్టుటకు ఐక్యబంధము ఏదైన ఉండవలయును గదా, మనకు ఉన్న ఐక్యబంధము ఏది అనిన వేదాంతసిద్ధాంతమే. ఇతరమతాలకంటె హిందూమతమునకు ఉన్నట్టి ప్రత్యేకత ఇదే అని సగర్వముగాఁ జెప్పుకొనువారును గలరు. కాని హిందూమతము అను పేర ఒక గుమిగాఁ గూడి ఉన్నట్టి వివిధ సిద్ధాంతాలకును రకరకాల పూజావిధానాలకును కేంద్రగతుఁడై ఒక మహావ్యక్తి వెలసిన యెడల వీని యేకత మఱింత దృఢముగా ఉండు ననియు, అటువంటి మహాపురుషు నవతారము ఆవశ్యకము అనియు నమ్మకము సార్వత్రికముగ ఏర్పడినది. ఆ నమ్మకమును శ్రీవివేకానందస్వాములవారు తమ రచనలు కొన్నింటిలో వెలిబుచ్చి ఉన్నారు — "భారతవాఙ్మయములో నిత్యసత్యాలు పదిలపడి ఉన్నవి, అన్య దేశాల వారు భారతమాతృ పాదాలను ఆశ్రయించి ఆ సత్యాలను నేర్చుకోవలె. లోకములో హిందువులది గురుస్థానము. ఈమాట మీకు అచ్చెరువుగొలుపవచ్చును కాని ఇది చారిత్రక సత్యము. దీనిని మీరు గుర్తింపవలె. కాఁబట్టి పారమార్థికత మన వెన్నెముక వంటిది అన్న జ్ఞాపకము మనకు సదా ఉండవలె; ఉండవలె అనిన మనకు దారిచూపునట్టివాఁడు ఒకఁడు కావలె. [కంప్లీట్వర్క్సు III పుటలు 443-4.] నమ్మకము గల వారే నాయకులు కాఁగలరు. లోకమును వశపఱచుకొను శక్తి గురుభక్తికి ఉన్నది ... శక్తి గురువుగారి యొద్ద నుండి శిష్యునికిని శిష్యునొద్దనుండి ప్రశిష్యునికిని — ఈ రీతిగా సంక్రమించుచుండవలె. ఇట్టి శిష్యపరంపర లేనిదే ఏదియు సాధ్యము కాదు. నాయకుఁడుగ ఉండుటకు హృదయస్థానీయుఁడుగ ఉండుటకు ఆదర్శశీలవంతుఁడు ఆదర్శజీవి అవతారపురుషుఁడు ఒకఁడు కావలె. తక్కినవి అన్నియు అతనిని బరివేష్టించి నిలుచును. ... పరిపూర్ణతలో శ్రీరామకృష్ణునిశీలమునకు సాటి లేనే లేదు.

* 1956 వ సం॥ నవంబరు 'వేదాంత కేసరి' పత్రికలోని శ్రీ విమలానందస్వాముల వ్యాసము దీనికి మూలము.

ఆయనకు మునుపు అవతారమూర్తులు వెలయక పోలేదు. కాని వార అందఱునే ఒక్కటి అయి శ్రీరామకృష్ణుఁడుగ రూపొందినారు. భారత దేశోద్ధతికి శ్రీరామకృష్ణుని చరణ కమలముల ఆశ్రయించుట ఒక్కటే ఉపాయము. యుగ యుగాలుగ హిందువులు తలంచినతలంపు లన్నిటి యాథార్థ్యమునకును ఆయన జీవితము పట్టుఁగొమ్మ. అన్ని దేశాల వేదాలకును ఆయన జీవితము ప్రత్యక్షవ్యాఖ్యానము [లేఖలనుండి పరికలితము], ప్రజలు శ్రీరామకృష్ణునివంకకు ఏలాగు ఆకృష్టు లగుదురు? ఆయన నామము వారికి ఏలాగు ఉద్దీపకము కాఁగలదు? శ్రీరామకృష్ణుని యథార్థస్వరూపమును దెలిసికొన్న వారికే స్వస్వరూపసిద్ధి నిజముగఁ జేకుఱును. అట్టివారు ఉందు రేని, మనదేశమునుండి కలువులు మున్నగువానిని తఱిమివేయుటకు ఎంత కాలము పట్టును? కాఁబట్టి ప్రజలు మున్ముందు స్వార్థపరతను విడువ నేర్చుకో వలెను, అందులకు శ్రీరామకృష్ణునే లక్ష్యముగ ఉంచుకో వలెను, ఆయన యథార్థస్వరూపమును తెలిసికోవలె. అప్పటికిఁ గాని, మాటిమాటికి దాపరించుచున్న కాటకాలను అరికట్టుటకు నిజమైన ప్రయత్నాలు పురోగమింపవు [కంప్లీట్వర్క్సు V పుటలు 266–7]. దేశోన్నతికి ఉదాత్తక్ష్య మొకటి అవసరము. నిర్గుణబ్రహ్మమే ఆలక్ష్యము. నిర్గుణలక్ష్యముచే అందఱును ఉద్రిక్తులు కాలేరు. కాబట్టి మీకు సగుణలక్ష్యము ఒకటి ఉండి తీఱ వలెను. శ్రీరామకృష్ణుఁడే ఆసగుణలక్ష్యము. అందుచేత ప్రస్తుతము మీరు ఆయననే ప్రధానీకరింపవలె. ... ఆయన మరల ఒకసారి మన నడుమ అవతరింతు నని చెప్పి ఉన్నాఁడు, అటు పిమ్మట విదేహముక్తి నొందు నేమో! మీరు సాధనచేయఁగోరుదు రేని అట్టి ఒక యిష్టదేవత ఉండి తీఱవలె" [కంప్లీట్వర్క్సు VII పుటలు 400].

పై ఉద్ధారములను బట్టి చూచిన క్రైస్తవుల చర్చిని బోలిన మత సంస్థయు, ఆ సంస్థకు హృదయస్థానీయుఁడుగ క్రైస్తునో మఱియొక మహాయోగినో పోలిన మహాపురుషుఁ డొకఁడును స్వామిజి దృక్పథమున నుండినట్లు తెలియ నగును. ఏతదనుగుణముగనే శ్రీరామకృష్ణుని యాదర్శమును ఉపదేశములును ఇప్పటికి డెబ్బదేండ్లుగ సాగు చున్న రామకృష్ణోద్యమమునకు హృదయముగ ఉన్నవి.

శ్రీరామకృష్ణుని జీవితకాలము ఏఁబ దేండ్లు ఆఱు నెలలు మాత్రమే: తే 18-2-1836 ది నాఁడు అవతారము; తే 16-8-1886 ది నాఁడు నిర్యాణము. మానవదృష్టితోఁ జూచిన ఈ యాయుస్సు ఏ మంత దీర్ఘ మైనది కాదు. ఆయన భౌతిక శరీరము పంచత్వ మొంది దాదాపు డెబ్బ దేం డ్లైనవి. కాని ఆయన వ్యక్తిత్వము దినదినాభివృద్ధిని గాంచుచు శ్రీరామకృష్ణీయ తత్త్వ ప్రతిపాదిత రామకృష్ణ మూర్తిగ రూపొందుచున్నది. క్రైస్తునకు ఉన్నట్లే శ్రీరామకృష్ణునకును విశ్వరూపము ఒకటి ఉన్నది. దక్షిణేశ్వరాలయ క్షేత్రము నుండి వెలువడిన ప్రభావము నలు వైపుల వికసించి జగత్తును తన వలయములో ఇముడ్చుకొనుచున్నది. శ్రీరామకృష్ణోపాసకుల నమ్మకములు ఇవి — (1) శ్రీరామకృష్ణుఁడు అవతారవరిష్ఠుఁడు (2) తదుపాసనా సాధకులలో గాఢభక్తితో త్రికరణశుద్ధితో భజించిన వారికి ఆయన ప్రత్యక్షదర్శనము నేఁడును సుసాధ్యమే. (3) శ్రీరామకృష్ణోపాసనా కేంద్రాలలో శ్రీరామకృష్ణుఁడు సూక్ష్మరూపిగ సన్నిధి చేసి విశుద్ధహృదయు లగు భక్తులు అర్పించు

పూజలను కానుకలను స్వీకరించుచున్నాఁడు. (4) శ్రీరామకృష్ణుఁడు పరమపురుషుఁడు. ఆయన మహిషి శ్రీ శారద పరమప్రకృతి. (5) మఱి ఇన్నూఱేండ్లకు పిమ్మట మానవకల్యాణ సంపాదనకై శ్రీరామకృష్ణుఁడు మరల అవతరింపనున్నాఁడు. (6) ప్రస్తుతము శ్రీరామకృష్ణుఁడు రామకృష్ణ సంఘ రూపమున ఉన్నాఁడు. బౌద్ధసంఘరూపమున బుద్ధుఁడున్నాఁడని కొందఱు బౌద్ధుల నమ్మకము; క్రైస్తవ సంఘరూపాన క్రైస్తు ఉన్నాఁడని క్రైస్తవుల నమ్మకము. ఈ నమ్మకాలచే తమజీవితాలలో ఉత్సాహమును శాంతిని గన్నవారి సంఖ్య ఇంతంత కాదు. మన దేశమునందేమి విదేశములందేమి ఎప్పటికప్పుడు శ్రీరామకృష్ణునకు గుడులు నిర్మితములగుచున్నవి. కాఁబట్టి ఈ ఉపాసనయు ఈసుద్దులును గాంచుచున్న వ్యాప్తియును చూఱఁగొనుచున్న జనప్రీతియు స్పష్టముగఁ దెలియనగుచున్నవి.

ఇట్టి తలంపులు శ్రీవివేకానందస్వామికే ఉండినవనుటకు పూర్వోద్ధారాల ప్రమాణములు. కాని వేదాంతప్రభవమైన వివేకము చక్కఁగా అలవడి ఉన్నందున స్వామిజి ఒక యెచ్చరికను గూడఁ జేసి ఉన్నారు. "అన్ని మతాలవారి యెడలను మీరు సానుభూతి ప్రకటింపవలె. ఒకరికి శ్రీరామకృష్ణునందు నమ్మకము ఉండనీ, లేకపోనీ, మీరు వారిని సానుభూతితోఁ జేరఁదీయవలసినదే" (ఒక లేఖనుండి)... నా జీవితమునకేమో ఆ మహాత్మునుత్సాహమే మార్గదర్శకము. కాని ఈ వైఖరిలోఁ దాము ఏకీభవించుటకుఁ గాని ఏకీభవింపకుండుటకుఁ గాని స్వేచ్ఛ, ఇతరులకున్నది. ఒకఁడు ఎంత మహాత్ముఁడైనఁ గావచ్చును కాని లోకములోని కంతటికిని సంక్రమింపవలసిన ఉత్సాహమునకు అతఁడు తాను ఒక్కఁడు మాత్రమే దారి కాలేఁడు. ప్రతితరమువారికిని ఉత్సాహము క్రొంగ్రొత్తగఁ గలుగవలెను. మనము అందఱమును భగవత్స్వరూపులమే కదా!" [కంప్లీట్వర్క్స్ V పు. 157].

"మహాత్ముల యెడ గ్రుడ్డిదియు మితిమీఱినదియు నగు భక్తి గల శిష్యులు, వ్యక్తిని ప్రధానీకరించి, తత్త్వమును అణచివేయుదురు. వ్యక్తిపూజనే విధించుచు ఆ మహాపురుషుల జీవితముల నిజమైన యర్థమును అయథార్థముగఁ జాటుదురు. భక్తికై యు, పూజకై యు, సత్యమును బలియిత్తురు [కంప్లీట్వర్క్స్ IV పు. 368].

క్రైస్తవ మతసంస్థను అందు క్రైస్తునకు ఉన్న స్థానమును గాంచినప్పుడు మతరంగమున ఐక్యము గలుగుటకు సగుణలక్ష్యము ఆవశ్యకమని స్వామిజికిఁ దోఁచియుండవచ్చును గాని మతసంస్థల నిర్మితిలోను వ్యక్తిపూజలోను సహజముగ ఉన్న దురభిమానాసహనాది లోపాలను ఆయన ఉపేక్షింపలేదు —

"నాజరన్నివాసి జీసను బోధించుచున్నప్పుడు ఒక శ్రోత "స్వామి, మీ బోధన బాగున్నది. ఈదారి ననుసరించిన, పరిపూర్ణత సిద్ధించునను నమ్మకము నాకున్నది. అనుసరించుటకు నేను తయారుగనే ఉన్నాను కాని మీరు ఒక్కరే అవతారపురుషులరను భావనతో ఆరాధించు శ్రద్ధ నాకు లేదు" అని చెప్పననుకొనుఁడు. నాజరన్నివాసి జీసను ఏమి బదులు చెప్పును? — "సరియే, సోదరా, లక్ష్యమును ముందుంచుకొని నీ దారినే అనుసరింపుము. ఈలక్ష్యమునకై నీవు చూపు గౌరవాగౌరవములతో నాకు అక్కఱ లేదు. నేను

అంగడి పెట్టి యుండ లేదు. ఆస్తిక్యము నాకొక వర్తకపు సరకు కాదు. సత్యమును బోధించుట మాత్రమే నా పని. సత్యము ఒకరి సొమ్ము కాదు. ఎవరును దానిని దమకు 'కాణాచి'గాఁ జేసికో లేరు; సత్యమును దైవమును ఒక్కటే. ముందుకు పద'' — అనును. మఱి నేఁటి క్రైస్తవులో — ''బోధించినదానిని నీవు అనుష్ఠించినను సరే, అనుష్ఠింప కున్నను సరే, వ్యక్తిని గౌరవించుచున్నావా? గురుదేవుని ఆరాధించిన మీకు ముక్తి. ఆరాధింప కున్న మీకు ముక్తి లేదు'' అని చెప్పుచున్నారు. జగడములును పోరాటములును అన్నియు వ్యక్తిని గుఱించే, గురుదేవుని బోధన లన్నియు అడుగునఁ బడిపోయినవి.'' [కంప్లీట్వర్క్సు]

వ్యక్తికై తత్త్వమును గోల్పోవుట ఒక చెడుగు; సగుణలక్ష్యమే లేక ఆస్తిక్యమును కేవలము ఊహామాత్రముగ జేయుట ఒక చెడుగు. ఈ రెంటికిని లోను కాకుండుటకై స్వామిజి వివిధసందర్భాలలో వాని వాసిని ప్రదర్శించి ఉన్నారు.

శ్రీరామకృష్ణునిజీవితకాలము ఏఁబదేండ్లే ఐనను దినదినమునకును ఆయన ప్రభావము వ్యాప్తిని గాంచుచున్నది. మతాచార్యు లందఱ విషయమున నుండు క్రమమే ఇది. వారి నిర్యాణానంతరము వారి మహిమను మానవులు నానాఁటికిని హెచ్చుగ గ్రహింతురు. శ్రీకృష్ణుఁడు ఈలోకమును వీడి ఏగు నప్పుడు మూఁడు విషయాలను మనకు మిగిల్చి పోయినాఁ డఁట. (1) ఆయన దివ్యమంగళరూపము, భౌతిక పారమార్థిక వ్యక్తిత్వము (2) ఉపదేశములు (3) లోకమునకు ఆదర్శము కాఁగల నడవడి. శ్రీరామకృష్ణుఁడు పిట్టకథలద్వారాను తన చేఁతలద్వారాను లోకమునకు ఉపాదేయాంశములను బోధించినాఁడు. మహాత్ముల పనులలో ఏ యొక్కదానిని సునిశితముగఁ బరిశీలించినను ఎంతో ప్రాముఖ్యము వెలువడును. ఒకసారి శరచ్చంద్రచక్రవర్తితో శ్రీవివేకానందస్వామిజి ఇట్లు చెప్పినారఁట — ''శ్రీరామకృష్ణుని గూర్చి నీ యభిప్రాయ మేమైన నగును గాక, ఆయనను నీవు యోగి అనుము, బ్రహ్మజ్ఞాని అనుము, ఏమైన అనుము. కాని ఆయనంతటి పరిపూర్ణత గల వ్యక్తి ఇంతవఱకు భువిపై అవతరింప లేదు అని నే నంటు నేని, అంగీకరింపుము. జగమున నిండుకొన్న గాఢాంధకారమున ఈ మహాపురుషుఁడు ఈ యుగపు దీపస్తంభము. శ్రీరామకృష్ణజ్యోతిచేతనే మానవులు సంసారమునుతరింతురు'' [కంప్లీట్వర్క్సు VI పు.435.]

శ్రీరామకృష్ణుని జీవితములో మొదటి 16 సంవత్సరములును కలకత్తాకు 80 మైళ్లదూరాన ఉన్న ఒకపల్లెలోఁ గడచినవి. శైశవమునుండియే ఆయనకు గాఢ ధ్యాన ప్రావీణ్యా ముండెను. పదునాఱవ యేఁట శ్రీరామకృష్ణుఁడు కలకత్తాకు వచ్చి అచ్చట ఒక సంస్కృతపాఠశాలను నడపు చున్న అన్నగారికి మూఁడేండ్ల పాటు తోడ్పడుచుండెను. రాణిరాస్మణి దక్షిణేశ్వరాలయమును నిర్మించెను. అప్పటికి శ్రీరామకృష్ణుని వయస్సు 19 సంవత్సరములు. మథుర్‌బాబు విష్ణ్వాల యార్చక పదవికి శ్రీరామకృష్ణుని వరించెను. తర్వాత ఆయన కాళి గుడిలో పూజారి అయ్యెను. నాలు గేండ్ల కాలము ఆయన నడచుకొన్న రీతి గుడి పూజారులకెల్ల ఆదర్శము కాఁదగినది. దేవాలయములో మన పూజ లందుకొను చున్నది వట్టి రాయియా? గుడిపూజలలోఁ గల అంతరార్థమేమి? దేవుఁడు సత్యమేని, ఆయనను ఆవా

హానచేయఁ గల మేని, సన్నిహిత ప్రియ బంధువులతో మెలఁగిన రీతిగా ఆయనతో మెలఁగ నగునా? ఆస్తిక్య యాథార్థ్య జ్ఞాన తృష్ణ గురుదేవుని వశపఱచుకొన్నది. ఆ దశయే, ఆయన జీవితచరిత్రమున దైవోన్మత్తదశ యని వ్యవహృతమై ఉన్నది. 23-వ యేట ఆయన ఆ తేండ్ల కన్యను పెండ్లాడెను, 28-వ యేట, వేదాంతసాధనను తొడంగెను. పిమ్మట రెండేండ్ల కాలము వివిధసాధనలలో, వైష్ణవ క్రైస్తవ మహమ్మదీయ సాధనలలో, గడచినది. 30-వ సంవత్సరమునుండి 34-వ సంవత్సరము వఱకు ఆయన యాత్రలు చేసెను. ఆ కాలపు సంభవాలలో ఒక్కటి మాత్రము మిగుల విలువ గలది. ఆయన వైద్యనాథము నొద్ద నుండెను. తీర్థయాత్రలను జరిపించుచుండి నతఁడు మథుర్ బాబు. అక్కడి ప్రజలు మహాదారిద్ర్య పీడితులై ఉండిరి. వారి దుఃస్థితిని దీర్ప కున్న తానొక్క యడు గైనను ముందునకు రా నని శ్రీరామకృష్ణుఁడు మొండిపట్టు పట్టెను. మథుర్ బాబు కలకత్తానుండి ఆహారమును వస్త్రములను దెప్పించి బీదలకు పంచిపెట్టుటకు కొన్నాళ్లు పట్టినవి. అన్నాళ్లును వారు అచ్చట ఉండిరి. శ్రీరామకృష్ణమిషనువారి సాహాయ్య కార్యక్రమాలకు అదే నాంది. 39-వ యేటినుండి 50-వ యేటి వఱకును గడచిన పండ్రెండేండ్ల కాలము జిజ్ఞాసు సంతర్పణయుగము. ఆయన తనంతట వికసించిన పూవుం బోని వాఁడయ్యెను; దానితేనె నాని ఉజ్జీవింపఁ దుమ్మెదలు దానిని జుట్టుకొన్నవి. ఆకాలము ముగియు నప్పటికి తన్ను పరివేష్టించి యున్న యువశిష్య బృందమునకు ఆయన తన యాదర్శముచేతను ఉపదేశాలచేతను రూపు దిద్దెను. వారే శ్రీరామకృష్ణోద్యమ ప్రవర్తకు లైరి.

శ్రీరామకృష్ణుని ముఖ్యోపదేశాలలో నేఁటి ప్రపంచమున సార్థకత కలవి ఏ వేవి ? అన్ని మతాల సారమును ఆయన జీవితమున పునర్నిర్వ్యాఖ్య మయ్యె ననుటయు ప్రాచీన మహర్షుల బోధనల ప్రాముఖ్యము నాయన చూపె ననుటయు మొదటి విషయము. కడచిన రెండు మూఁడు వేల సంవత్సరాలలో ప్రస్తుత శతాబ్ది యందే భౌతికాది శాస్త్రాలు హెచ్చుగ పెంపొందినవి. అయినను సమస్యలును చిక్కులును మానవుని ఎదుర్కొనుచునే ఉన్నవి. మన సాంఘి కార్థిక రాజకీయ సమస్యలను మనము శాస్త్రరీతిని పరిష్కరించుకొందుమేని సుఖపడుదు మని కొంద ఱందురు. కాని ఈశాస్త్రాలు ఎన్ని రీతుల ఎంతవృద్ధి నొందినను, శాంతి సౌఖ్య సామ్రాజ్యాలు వశపడుచున్న జాడలు అంతగా కనిపింపవు. సంఘర్షణ, ఒత్తిడి, చాల నితనము అను చిక్కులను మనము ఇంకను సరిపెట్టుకో లేదు. ఈ చిక్కులలో పెక్కింటిని సరిపఱచుకొనుటకు దారి శ్రీరామకృష్ణుని సందేశమున ఏ దేని కలదా ? ప్రపంచములో గొప్ప మతాచార్యులు ఎందఱో ఉండిరి. వారి జీవితోపదేశాల కంటె శ్రీరామకృష్ణ జీవితోపదేశాలు భిన్నములు కావు. కాని ఆయన మన కొసంగిన వేవనఁగా సమన్వయముతోఁ గూడిన సమగ్రత, స్పష్టోజ్జ్వల మైన యాదర్శము, నూత్నోత్సాహము. పూర్ణతర జీవితమునకు అందిచ్చు మెట్టుగా ఈ జీవితమును గొని, సర్వకార్యములను భగవదర్పితములుగా నిర్వహింపవలె నని ఆయన నొక్కి చెప్పినాఁడు. స్వార్థపరుఁడు తాను సుఖపడ లేఁడు, ఒరులను సుఖపఱుప లేఁడు, స్వభావ నిర్దిష్ట మార్గముననే చెల్లింపఁబడుచున్న మన బ్రతుకు దుఃఖపర్యవసాయి అగుచున్నది. ఏమానవునిలోను స్వతః

పరిపూర్ణత లేదు. జీవితదుఃఖముల నడుమ చిత్తశాంతి గోరు నాతనికి మనోనైశ్శాల్యప్రద మును, పవిత్రీకరణసమర్థమును, అవ్యయమును నిత్యము నైన అవలంబ మొకటి కావలెను.

ఐహికమున ప్రతిదియు క్షణికమే, అసమ గ్రమే. ఐహికవిషయములనే అనన్యభావముతో ఆశ్రయించినవారి నీతికి నిలుకడ చెడును. ముడి పదార్థములనుండి యంత్రములు చక్కని వస్తు వులను తయారుచేయును గాని, యంత్రచాలకు లైన మానవుల ప్రకృతిలోని ఉదాత్తత చెడి పోవును. వారును యంత్రములను బోలిన వారుగ తయారగుదురు. నవ్యసాంఘిక శాస్త్ర ములలో ఐహికాద్వైతము హెచ్చి వ్యక్తిప్రత్యే కత నణచివేసి, అతనిని పరిస్థితులకు పరతం త్రునిగ జేసినది. మానవుల యీ యంత్రవ త్త్వాపాదనము కర్తవ్యాల యీ పంపకము ఆత్మోజ్జీవన సాధకములు కానే కావు. మాన వుడు మర్త్యుడుగ కానిపించును గాని నిజము నకు అతడు నిత్యాత్మ. ఇంద్రియవశులును భోగాన్వేషులునగు సామాన్యులకంటె పైమెట్టు వారు ఉన్నారు, అంతకన్న పైమెట్టు వారగు ప్రతిభానిధు లున్నారు. పైనుండి మనకు దారి చూపునట్టియు మనతో కూడి సంచరించు నట్టియు దివ్యాత్ములును ఉన్నారు.

తృప్తిని అలవఱచుకొనవలె, ఆత్మనిగ్రహ మును అలవఱచుకొనవలె, సావధికమైన యిహ లోక జీవితము నతిక్రమించినట్టి లక్ష్య మొ కటి సదా మన యెదుట ఉండవలెను. ఆలాగు మనము జీవితమును గడపగలమేని, ఎల్లర శాంతిభద్రతలకును పునాది వేసినవారము కావచ్చును. నేటి సమస్యల కెల్ల శ్రీరామ కృష్ణుడు చెప్పిన పరిష్కార మొక్కటే మన జీవితాలను భగవత్పరములుగ జేసి కొనుట. ఆశయు లొందరయు నిండుకొన్న నేటి ప్రపంచమున పవిత్రములైనవానిపట్ల ఆదరము సన్నగిల్లి యున్నది, ఆయాదరమును అలవఱుకొన్నచో మనము మనకును ఇతరుల కును శాంతిని చేకూర్పగలము. శ్రీరామకృష్ణు నుపదేశసారము ఇదే — ప్రతివ్యక్తిలో నిగూ ఢమై యున్న యంతస్తత్త్వమునకు మన మభి ముఖముల కావలె. గమనమును వెలుపటి నుండి లోనికి మార్చుకొనవలె. ఈ సందేశము పరమనిర్వృతిప్రదమైనది.

గురుదేవుని యాశీస్సులచే మన యాత్మలకు వెలుగును జీవితములకు పవిత్రతయును గలు గును గాక. ఈయాధ్యాత్మిక పునస్సంజీవన సందేశము నేటిమానవతతికి ప్రత్యేకముగ ఆవశ్యకము.



కారు కారు గురులు కాగుణితముఁ జెప్ప, శాస్త్రపాఠములను జదివి చెప్ప,
ముక్తిదారిఁ జూపు మూలము గురుఁడు రా, విశ్వదాభిరామ వినుర వేమ॥

చుట్టుకొని యున్న మాయను జెట్టుము, గురుభక్తి మీఱి నియ తాత్ముఁడవై
ముట్టుము తత్పరతను మన మట్టిటును జెందనీక మాన్యత వేమా॥



# విగ్రహవ్యావర్తని

డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఎం. ఏ., ఎం. లిట్., పిఎచ్. డి.

(గతసంచిక తరువాయి)

13. అవివేకి యొకడు ఎండమావిని జూచి భ్రమలోపడి అది జలమయమైన సరస్సు అని గ్రహింపగా నీవీ భ్రమ జ్ఞానమును నిషేధింప దలచి వాదింపవచ్చును. అక్కడ వస్తుతః లేని నీటినే నీవు నిషేధించుచున్నావు. ఇట్లే లేని ధర్మస్వభావము ఉన్నట్లుగా భాసింపగా, మేము దానిని నిషేధించుచున్నాము అని మధ్యమకులు సమాధానము నొసగవచ్చును.

"ధర్మములకు స్వభావమున్నదనునది మిథ్యాజ్ఞానము. దీనిని నివారించుటకు సర్వభావములు నిఃస్వభావములని చెప్పుచుంటిమి" అని వీరివాదము. దీనికి తర్వాతి కారికలు ప్రత్యుత్తరము నొసగుచున్నవి.

14. విషయము, విషయమును చూచు ప్రమాత, విషయమునుచూచుట యనుప్రతీతి, ప్రతిషేధించువాడు, ప్రతిషేధింపబడు విషయము, ప్రతిషేధము అను ఆరు ధర్మములు సద్వస్తువులుగా నున్నవి.

మిథ్యాజ్ఞానము కలుగువేళ ఇది సరస్సు అను జ్ఞానము, తెలిసికొనబడిన విషయము, తెలిసికొనువాడు అను మూడు సద్వస్తువులుండి తీరవలెను. ఈ మిథ్యాజ్ఞానమును తర్వాత ప్రతిషేధించువాడు, ప్రతిషేధింపబడు విషయము, ప్రతిషేధము అను మూడు సద్వస్తువులుకూడ నుండక తప్పదు. ఈ ఆరును ఉన్నచో సర్వభావములు శూన్యములెట్లుకాగలవు?

15. ప్రత్యక్షప్రతీతి, గ్రాహ్యమైన వస్తువు, ప్రతీతిగల ప్రమాత అనునవి తాత్త్వికముగా లేనిచో ప్రతిషేధము, ప్రతిషేధింపబడువస్తువు, ప్రతిషేధించువాడు అనునవికూడ ఉండజాలవు.

గ్రహింపబడు వస్తువు లేనియెడల సర్వభావములు స్వభావశూన్యములు అనుగ్రాహ్యవస్తు ప్రతిషేధము కుదరదు.

16. ప్రతిషేధము, ప్రతిషేధింపబడు వస్తువు, ప్రతిషేధించువాడు అనునవి లేనిచో సర్వభావములు, వానిస్వభావములు సత్పదార్థములుగా సిద్ధింపగలవు.

అప్రతిషిద్ధమైన భావము శూన్యము కాజాలదు. రజ్జుసర్పభ్రాంతిలో ప్రతిషేధింపబడు సర్పము శూన్యముకావచ్చునుగాని రజ్జువును రజ్జువని తెలిసికొనునపుడు ఈరజ్జుజ్ఞానము నిషిద్ధమగుటలేదు. నిషేధింపబడని రజ్జువు శూన్యము కాజాలదు.

17. కావున మధ్యమకుని వాదములో అసిద్ధహేతువను దోషమున్నది. నిఃస్వభావత్వమును ప్రతిపాదించు వాదమున నేది హేతువు కాగలదు? హేతుశూన్యమైన ధర్మమెట్లు సిద్ధింపగలదు?

సర్వభావములు స్వభావశూన్యములను వాదమున హేతువు అసిద్ధమైనది. ఈ భావములు శూన్యములైన హేతు వెచ్చటను కన్పింప

జాలదు. హేతుశూన్యమైన సిద్ధాంతము యథార్థము కాలేదు.

18. హేతువులేకయే సర్వభావముల స్వభావములను ప్రతిషేధింప వీలున్నచో, నేనుకూడ హేతువును గ్రహింపకయే ఈ స్వభావములన్నియు ఉన్నవని వాదింపగలను.

19. హేతువున్నదికాని ధర్మస్వభావములు లేవని వాదించితివేని ఇది అసంబద్ధమైనవాదము కాగలదు. స్వభావశూన్యమైన భావ మీలోకమున ఉన్నవస్తువుగా వ్యవహరింప బడజాలదు.

నిఃస్వభావమైన భావముండజాలదు.

20. ప్రతిషేధముముందు వచ్చునదని, ఆ తర్వాత వచ్చునది ప్రతిషేధింపబడు వస్తువని కూడ వాదించుట అసంగతము. ప్రతిషేధింపబడు వస్తువు ఉన్నతర్వాత ప్రతిషేధము వచ్చుననిగాని, ఈ రెండును ఏకకాలమున బయలుదేరునవనిగాని యెంచితివేని భావములు స్వభావసహితములని నీ వంగీకరించినట్లగును.

రజ్జువును జూచి సర్పమని భావించితి మనుకొనుము. ఇది సర్పముకాదు అను ప్రతిషేధవాక్యము వచ్చినతర్వాత సర్పప్రతీతి కలుగుచున్నదనుట అసంబద్ధము. సర్పమే కన్పింపనిచో నేది ప్రతిషేధింపబడుచున్నది? ముందు సర్పప్రతీతి యున్నది, తర్వాత ఈ సర్పము ప్రతిషిద్ధమగుచున్నదనికూడ అన వీలులేదు. ఉన్నవస్తువును ప్రతిషేధింపవలసిన అవసరముగాని, అవకాశముగానిలేదు. సర్పప్రతీతి, సర్పప్రతిషేధము ఏకకాలమున నున్నవని వాదించినచో, ఈ రెంటికిని పరస్పర సంబంధమేమియు నుండజాలదు. ఒకదానిని ఆశ్రయించుకొని రెండవది యున్నదని చెప్ప వీలుండదు. ఒకే ఒకసారి ఉత్పన్నములైన దూడయొక్క రెండు కొమ్ములలో ఒకకొమ్ము రెండవకొమ్మును ఆశ్రయించుకొని వచ్చునది కాదుగదా! కావున ధర్మములు స్వభావశూన్యములని చెప్పుట యుక్తియుతము కాజాలదు.

ఈ పూర్వపక్షమునకు ఇరువది యొకటవ కారికనుంచి సమాధాన మొసగబడుచున్నది. మొదటి కారికలో నిచ్చిన ఆక్షేపమునకు 21, 22, 23 కారికలు ప్రత్యుత్తరము నొసగుచున్నవి.

21. హేతుప్రత్యయములలోగాని, వీని సముదాయమునగాని, ఇతరత్రగాని, మాటలు లేనిచో సర్వభావములు శూన్యములని, నిఃస్వభావములని నేను చేసిన వాదము స్థిరపడగలదు.

తమతమ హేతువులలోగాని, మహాభూతములలోగాని, వీనిలో ప్రతియొక్కదానియందుగాని, వీని సముదాయమునగాని ప్రతిజ్ఞావాక్యములోని మాటలు కన్పింపవు. ఈ హేతుప్రత్యయములకంటె భిన్నమైన ధర్మమేమియు లేదు గనుక ప్రతిజ్ఞావాక్యములోని మాటలు సహితము స్వభావశూన్యములు. అప్పుడు సర్వభావములు నిఃస్వభావములను వాదము స్థిరపడగలదు. మాటలవలె సర్వభావములు స్వభావరహితములు, అందుచే శూన్యములునని తేలుచున్నది గనుక శూన్యములైనమాటలతో ధర్మశూన్యతను ప్రతిపాదింప వీలులేదను వాదము పొసగదు.

22. హేతుప్రత్యయముల నాశ్రయించుకొని ఉత్పన్నమగు వస్తువును ప్రతీత్యసముత్పన్నమందురు. ప్రతీత్యసముత్పన్నములైన భావములన్నియు శూన్యములని చెప్పబడినవి. ప్రతీత్య

సముత్పన్నమగునది అన్యాశ్రితమగుటచే స్వస్వభావరహిత మగుచున్నది.

శూన్యతయను శబ్దమునకుగల అర్థమును సరిగా తెలిసికొనకపోయినచో మధ్యమక వాదము బోధపడదు ; అప్పుడీ వాద మసంగత మని వాదించుటయే అసంగతమగును.

స్వభావరహితము లగుటచే శూన్యములైన శబ్దములు ధర్మములను నిషేధింపలేవను ఆక్షేపము చేయబడినది. ధర్మములు ప్రతీత్యసముత్పన్నములగుటచే స్వభావరహితములని, అందుచే శూన్యములని చెప్పుట యుక్తియుతము. ధర్మములన్నియు హేతు ప్రత్యయములనుండి జన్మించునవైన వానికి స్వస్వభావము లుండజాలవు. ఆయాహేతు ప్రత్యయముల నాశ్రయించుకొనివచ్చిన భావములకు వాని స్వంత స్వభావములుండవు. ప్రతి ధర్మమునకు స్వస్వభావమున్నచో, ఇది హేతుప్రత్యయ జనితము కాజాలదు గనుక హేతుప్రత్యయము లనవసరములు కాగలవు. హేతుప్రత్యయములు లేని ధర్మములకు అస్తిత్వములేదు. హేతుప్రత్యయములున్న ధర్మములకు స్వస్వభావములుండవు గనుక, అవి శూన్యములగుచున్నవి. ఇదేరీతిగా మన ముపయోగించు మాటలుకూడ హేతు ప్రత్యయములనుండి ఉత్పన్నములగునవి గనుక స్వభావరహితములు, శూన్యములు నగుచున్నవి. కావున సర్వధర్మముల నిజమైన స్వభావము శూన్యతయే, రథము, వస్త్రము, ఘటము మొదలగు ధర్మములను వివేచించితిమేని ఇవన్నియు కారణసామగ్రి నుండి జన్మించినవని తేలగలదు. అప్పుడు వీటికి స్వంతభావము లుండవు. మట్టినుండి వచ్చు ఘటమునకు మట్టియొక్క స్వభావమే ఉండగలదు కాని వేరొక క్రొత్త స్వభావముండదు. ఇట్లే మాటలుకూడ స్వభావశూన్యములగుటచే సర్వధర్మములు శూన్యములను ప్రతిజ్ఞావాక్యము సుప్రతిష్ఠితమగుచున్నది. స్వభావశూన్యములై ఘటపటాదు లెట్లుపయోగపడుచున్నవో, అట్లే నిఃస్వభావములైన మాటలుకూడ వాదమునకుపకరింపగలవు. కాబట్టి శబ్దములద్వారా శూన్యతను ప్రతిపాదింప వీలులేదను ఆక్షేపము చెల్ల నేరదు.

23. ఇంద్రజాలవశమున నిద్దరు పురుషులు నిర్మింపబడిరనుకొనుము. లేక మాయద్వారా వచ్చిన పురుషు లిద్దరున్నారనుకొనుము. వీరిలో నొక డింకొకరిని ఏదేని పనినుంచి అడ్డగింపగోరి ప్రతిషేధించుచుండెనని యెంచుము. ప్రతిషేధింపబడు వస్తువునకు, ప్రతిషేధమునకుగల సంబంధ మిట్టిదే.

మాయద్వారా నిర్మింపబడిన పురుషుడు మరియొక మాయానిర్మితుని ప్రవృత్తిపరునిగా వ్యాపృతుడైనట్లు గమనించి, అతనిని ప్రతిషేధింపజూచుననుకొనుము. వీరిలో ప్రతిషేధించు మాయాపురుషుడు శూన్యమైన, ప్రతిషిద్ధుడగు మాయాపురుషుడుకూడ శూన్యమే. ప్రతిషిద్ధుడగు మాయాపురుషుడు శూన్యుడైన ప్రతిషేధించువాడు సహితము శూన్యుడే. ఇదేవిధముగా శూన్యములగు మాటలతో సర్వభావములు స్వభావశూన్యములని చెప్పబడునపుడు ఆ భావముల స్వభావములు ప్రతిషేధింపబడుచున్నవి. ఆరు తెరగులుగా ఇచ్చిన ఆక్షేపమీ సమాధానముతో పరాస్తమగుచున్నది. కావున ప్రతిజ్ఞావాక్యములోని మాటలు సర్వభావాంతర్గతమైనవి కావు. కాని ఈ మాటలు, ఆ ధర్మములు అన్నియు శూన్యములే. అందుచేత సర్వభావములు శూన్యములు కావని చెప్పుటకు వీలులేదు.

24. రెండవ కారికలో చేయబడిన ఆక్షేపమున కీ కారికలో సమాధానమీయబడుచున్నది.

మాటలు స్వభావశూన్యములు. మాటలు దేనిని చెప్పుచున్నవో అదికూడ స్వభావశూన్యమే. కావున మధ్యమకవాదమున దోషము లేదు. అందుచేత విశేషహేతువును నిర్వచింపవలసిన అవసరము మధ్యమకులకు లేదు.

స్వస్వభావముగలది అనుత్పన్నమైనది. హేతుప్రత్యయములనుండి ఉత్పన్నములగునవన్నియు స్వభావశూన్యములగుటచే మాటలుకూడ నిఃస్వభావములగుచున్నవి. మాటలు, ధర్మములుకూడ శూన్యములగుటచే మధ్యమకవాదమున విషమహేతుప్రసక్తిలేదు. మాటలు శూన్యములు కావని, ధర్మములు మాత్రమే శూన్యములని చెప్పినచో వైషమికదోషము వాటిల్లగలదు. అప్పుడు విశిష్టహేతువును విడిగా చెప్పవలసివచ్చును. కాని ఇట్టి వైషమ్యమీ మధ్యమకవాదమున లేదు.

మూడవ కారికలోని ఆక్షేపమునకు 25, 26, 27, 28 కారికలలో ప్రత్యుత్తరమీయబడుచున్నది,

25. ఒకడు శబ్దముల నుపయోగించుచు 'శబ్దముచేయకుము' అని ఇతరుని వారించునట్లు మధ్యమకుడు ధర్మస్వభావములను ప్రతిషేధించుచున్నాడని ఆక్షేపింపబడినది. కాని ఈ దృష్టాంతము మధ్యమకులకు సమ్మతముకాదు. ఒకశబ్దమును మరియొక శబ్దముతో ప్రతిషేధింపగలమని మధ్యమకు లంగీకరింపరు.

మధ్యమకసంప్రదాయమున శబ్దము అశూన్యముకాదు. కాని మాటలు శూన్యములు, మాటలు ప్రతిషేధించు ధర్మములుకూడ శూన్యములే. ఒకశబ్దము వేరొకశబ్దముయొక్క అస్తిత్వమును ప్రతిషేధింపలేదు, దానిస్వభావమునుకూడ త్రోసివేయలేదు.

26. స్వభావశూన్యములగు మాటలు నిఃస్వభావతను ప్రతిషేధింపగల్గినచో సర్వధర్మములుస్వభావసహితములను తాత్పర్యము సిద్ధింపగలదు.

'మాట్లాడవద్దు' అను శబ్దముతో ఇతరులుచ్చరింపబోవు శబ్దములను నివర్తింపజేయగల్గినట్లే నిఃస్వభావములగు మాటలతో నిఃస్వభావములగు ధర్మములకు వ్యావృత్తి కలుగుచున్నయెడల ఆక్షేపమున కన్పించు దృష్టాంతముపపన్నముకాగలదు. కాని స్వభావశూన్యములగు మాటలద్వారా ప్రతిషేధింపబడునది ధర్మముల స్వభావమే కాని, వాని నిఃస్వభావము కాదు. నిఃస్వభావములగు మాటలద్వారా నిఃస్వభావములైన ధర్మముల స్వభావశూన్యత ప్రతిషేధింపబడినచో ఆ ధర్మములు స్వభావసహితములని ఋజువుకాగలదు. స్వస్వభావసహితములైన ధర్మములు శూన్యములు కాలేవు. కాని ధర్మములన్నియు శూన్యములని మధ్యమకులు ప్రతిపాదించుటచేత ఆక్షేపములో కన్పించు దృష్టాంతము సరియైనది కాదని స్పష్టమగుచున్నది.

(సశేషము)

# మహాప్రభు వల్లభాచార్యులు

శ్రీ కర్ల రాజశేషగిరిరావుగారు, ఎం.ఏ.

(గతసంచిక తరువాయి)

1607 వ సంవత్సరమున విఠలనాథుడు సంప్రదాయానుసారము పుష్టిసంప్రదాయాచార్యుడాయెను. అప్పటినుండి ఆయన సంప్రదాయోన్నతి, గ్రంథనిర్మాణకార్యమునందు నిమగ్నుడయ్యెను.

సాంప్రదాయికవ్యవస్థ :—

మొట్టమొదట పుష్టిమార్గసంప్రదాయమునందు సాంగోపాంగముగ జర్చించి యొక నూతన వ్యవస్థ నేర్పఱచెను. మహాప్రభు తిరోధాన సమయంబున విఠలనాథునికి పదునైదేండ్లు; అందువలన పుష్టిసంప్రదాయమున కను వగు సేవాభావనాయథార్థరహస్యమును గనుగొను నవకాశము కలుగక పోయెను. వల్లభాచార్యుడు దామోదరహరసానికి సాంప్రదాయిక రహస్యమును దెల్పెను. ఈతడు వల్లభుని ప్రియశిష్యుడాంతరంగికుడును. విఠలనాథుడు దామోదర హరసానియొద్ద పుష్టిమార్గీయసేవావిధి యథార్థజ్ఞానమును సంపాదించెను. వల్లభుని రెండవ శిష్యు డగు ప్రచ్యుతదాసు పుష్టిమార్గరీతులను, లీలాభావములను విఠలనాథునకు దెల్పెను.

పుష్టిమార్గీయసేవాభావమునందు క్రియాత్మకరూపంబును విస్తరింపజేయవలె నను సంకల్పమువిఠలనాథునకుగల్గెను. అందువలన ఈయన శ్రీనాథసేవాంతర్గతశృంగార, భోగ, రాగ, విసార యోజనమును గల్పించెను. వల్లభుని సమయమందు శ్రీనాథునిసేవ సామాన్యవిధిని జరుగుచుండెను. అందువలన ఆయనసేవ 'ఫాగ్' తోను 'ముకుటము' తోడను జరుగుచుండెను. కాని విఠలనాథుడు వానిని విస్తరింపజేసి నిమ్నలిఖితాష్టవిధుల నేర్పఱచెను.

(1) ఫాగు (2) పేంటా (3) దుమాలా (4) పగా (5) కుల్హే (6) సేహరా (7) టిపారా (8) ముకుట. ఉక్తశృంగారముతో నానావిధ వస్త్రభూషణవ్యవస్థను గావించెను; అనేకోత్సవములను జేయించెను; వివిధరీతుల 'ఠాకూరు' లీలలను జేయించు చుండెను.

భోగవిస్తారమును గావించి, యష్టసమయములందు ఋత్వనుసారము బాలభావకప్రదర్శక భోజ్యసామగ్రిని బ్రస్తుతింపజేసెను. ఆయన 'అన్నకూటము', 'ఛప్పనము' భోగములరీతి యుత్సవములను బ్రచలింపజేసెను. ఠాకూరునకు నానాప్రకార వ్యంజనములను సమర్పించు నియమమేర్పఱచెను.

ఠాకూరునం దనురాగవ్యాప్తిని దృష్టియందుంచుకొని, 'అష్టఝాంకి'లతో ఋతుసమయానుసారము కీర్తన వ్యవస్థను గావించెను. దీనికొఱ కష్ట ఛాపస్థాపన మొనరించెను.

అష్టఛాపసంస్థాపన :—

ఠాకూరుయొక్క 'అష్టఝాంకీ' సంకీర్తనమునందు ఋతుసమయము ననుసరించి విభిన్న రాగములందు పాడు పద్ధతి యుండెను. దీని

కొఱకు పరమోచ్చకవిత్వముతోబాటు గాయన వాదన కళల యథార్థజ్ఞాన మత్యావశ్యక మాయెను. వల్లభాచార్యుని సమయమందు కుంభనదా సవకాశము ననుసరించి, సూరదాసు పరమానందదాసుని నియమితరూపంబున విభిన్న పదంబులను బాడుచు శ్రీనాథుని సంకీర్తన మొనరించెడివాడు. అధికారికృష్ణదాసుగూడ ఈసంబంధమందు యథావకాశముగ సహాయ మొనరించెడివాడు.

విఠలదాసు 'అష్టయ్యాంకీ'లను నియమిత కీర్తనకొఱకు కావ్య, సంగీతకళావిశారదు లగు 'అష్టకీర్తనకారుల' యావశ్యక మున్న దని గ్రహించెను. ఇందుకు తండ్రిగారి సేవయం దున్న నలుగురు సేవకులను — కుంభనదాసు, పరమానందదాసు, సూరదాసు, కృష్ణదాసులతోను, తనకావ్యసంగీతకళాకోవిదు లగు నల్గురుశిష్యులు — గోవిందస్వామి, ఛీతస్వామి, చతుర్భుజస్వామి, నందదాసును సమ్మిళితపఱచి యొక మండలిని స్థాపించెను. అది 'అష్టఛాప' మను పేరుతో బ్రసిద్ధి నొందెను.

శ్రీనాథుని సమ్ముఖంబున కీర్తనకొఱకు ఆ సమయంబున కీర్తనకారులు సుకవులు, సంగీతజ్ఞులగుటయే గాక శ్రీనాథుని యాంతరంగికలీలల నెఱుంగుటయు నత్యావశ్యక మని తోచెడిని. అప్పుడే కవి తన్మయుడై భగవల్లీలలను, యథార్థరూపంబున కీర్తింప గలడు. అష్టమహానుభావులు శ్రీనాథుమూలలీలాస్థిత — అర్జున, కృష్ణ, తోక, ఋషభ, శ్రీదామ, సుబల, విశాల, భోజనామకాష్టసఖు లని నమ్మెడివారు. వీరు క్రమంబున కుంభనదాసు, సూరదాసు, పరమానందదాసు, కృష్ణదాసు, గోవిందస్వామి, ఛీతస్వామి, చతుర్భుజదాసు, నందదాసురూపంబున శ్రీనాథునితో వారిసేవకు భూమిపయి నవతరించిరి. అందువలన నష్టఛాపకవులకు సంప్రదాయము నందు 'అష్టసఖులని'యు విఖ్యాతి గలదు.

హేకృష్ణ స్తోక హే అంశో, శ్రీదామన్ సుబ లార్జున।
విశా లర్ష భ తేజస్విన్ దేవప్రస్థ వరూథప॥
శ్రీమద్భాగవత దశమస్కంధపూర్వార్థము అ.22.
శ్రీకృష్ణు డేకాదశసఖులను సంబోధించెను.

సూరదాస సోతాకృష్ణ, తోక పరమానంజానో।
కృష్ణదాస సోఋషభ ఛీతస్వామి సబల బఖానో।
అర్జున కుంభనదాస, చతుర్భుజదాస విసాలా।
విష్ణుదాస సోభోజ, స్వామిగోవింద శ్రీదామాలా।
అష్టఛాప ఆఠోంసఖా, శ్రీద్వార కేసపరమాన।
జిన కేకృతగుణగానకరి, నిజజనహోతసుధాన॥
(సూరనిర్ణయ్, పృ 90)

ఇవ్విధంబున నష్టకవుల నేర్పఱచి, ఋతుసమయలీలాభావన లనుసరించి, సమయానుకూలంబుగ పదంబులను బాడుచుండిరి. వారే పుష్టిసంప్రదాయ వ్రజభాషాసాహిత్యమునం దమూల్యనిధులు. వీరివలన సాహిత్యోన్నతియు, సంప్రదాయోన్నతియును కల్గెను.

అష్టఛాప మహానుభావుల శరణాగతి కాలము, వారిమూల లీక్రిందివిధముగ నుండును.

| కవి | శరణాగతి కాలము | మూలనామము |
|---|---|---|
| కుంభనదాసు. | 1556. | అర్జున సఖుడు. |
| సూరదాసు. | 1567. | కృష్ణ సఖుడు. |
| కృష్ణదాసు. | 1568. | ఋషభ సఖుడు. |
| పరమానందదాసు. | 1577. | తోక సఖుడు. |
| గోవిందస్వామి. | 1592. | శ్రీదామా సఖుడు. |
| ఛీతస్వామి. | 1592. | సుబల సఖుడు. |
| చతుర్భుజదాసు. | 1598. | విశాల సఖుడు. |
| నందదాసు. | 1607. | భోజ సఖుడు. |

వీరికిసహాయంబుగ ర్తనకారు లుండిరి. వారు వీరికీ ర్తనలను లిపిబద్ధ మొనరించుచుండిరి. వీరు ఆశుకవులు, సమయానుకూలముగ లీలాభావనలు హృదయానుభూతి ననుసరించి గాయన మొనరించుచుండిరి.

1638 యందు విఠలనాథుని కాలంబున పీఠ సేవ్యభగవన్మూర్తులకు సప్తస్వరూపంబులు గలవు. వీనికి సప్తనిధుల రూపంబున సేవ్యమానసంపత్తి యాయెను. గోస్వామి సప్తభగవద్రూపంబులను సప్తపుత్రుల కిచ్చెను, దానితో వివిధపూజలు ప్రారంభ మాయెను. వీనిని 'సప్త గృహములు' లేక 'సప్త పీఠము' లందురు.

| పుత్రుని పేరు | స్వరూపము | స్థలము |
|---|---|---|
| గిరిధరజీ. | శ్రీమథురేశజీ. | కోటా |
| గోవిందరాయజీ. | శ్రీవిఠలనాథజీ. | నాథద్వారా |
| బాలకృష్ణజీ. | శ్రీద్వారకాధీశజీ. | కాంకరౌలీ. |
| గోకులనాథజీ. | శ్రీగోకులనాథజీ. | గోకుల.. |
| రఘునాథజీ. | శ్రీగోపాలచంద్రమాజీ. | కామవనము. |
| యదునాథజీ. | శ్రీబాలకృష్ణజీ. | సూరతు. |
| ఘనశ్యామజీ. | శ్రీమదనమోహనజీ. | కామవనము. |

వేద శాస్త్ర పురాణేతిహాసాధ్యయనము గావించినట్లు రచించిన గ్రంథములను బట్టి ఋజువగుచున్నది. దాదాపు 50 గ్రంథములను రచించెను. గోస్వామికృతస్వతంత్రగ్రంథములందు 'విద్వన్మండనము' ముఖ్యమైనది; దీనియందు ఆయన అపూర్వపాండిత్యమును జూపెట్టెను.

ప్రముఖగ్రంథములు:—

(1) అణుభాష్యమంతిమాధ్యాయము (2) సుబోధిని (పూర్తిటీక) (3) షోడశగ్రంథటీక (4) నిబంధప్రకాశటీక (5) విద్వన్మండనము (6) భక్తిహంస (7) భక్తిహేతు (8) భక్తినిర్ణయము (9) విజ్ఞప్తి (10) శృంగారరసమండనము (11) స్వామినీస్తోత్రము (12) అన్యస్తోత్రములు.

తిరోధానము:-

గోవర్ధనగోకులపురజతీపురనామస్థానమునందు తిరోధానమయ్యెను. శ్రీనాథుని రాజభోగానంతరము మధ్యాహ్నకాలమందు ఆయన లీలాప్రవేశమును గావించెను. గిరిరాజపర్వతకందరమందు ప్రవేశించి, ఆయన గోవర్ధననాథునియందు సదేహముగ లీనమయ్యెనట! ఆయన తిరోధానము 1642 ఫాలున కృ కా పమియం దాయెను.

మహత్వము:—

శుద్ధాద్వైతసిద్ధాంతోన్నాయకుడు, పుష్టిసంప్రదాయప్రవర్తకుడు మహాప్రభువల్లభుడైనను, దీనికి నుచిత వ్యవస్థను గల్పించి, వాస్తవికోన్నతికిబాటుపడినది శ్రీవిఠలనాథుడే. ఈయన మహాప్రభునివలె ననేకయాత్రలను గావించెను. మఱియు నిజధార్మికసిద్ధాంతవ్యాపకప్రచారమును గావించెను. ఆయన యలౌకిక వ్యక్తిత్వ - ప్రకాండపాండిత్య - ఉదారధార్మికసిద్ధాంత — ములవైపున కగణితవ్యక్తు లాకర్షింపబడిరి; మఱియు ననేకు లతని శిష్యులైరి. ఈయనసేవామండలియందు రాజమహారాజులు, విద్వాంసులు, పండితులు, గాయకులు, కళాకారులు, భగవద్భక్తులు మొదలగు సర్వశ్రేణులకు జెందిన వ్యక్తు లుండిరి. ఈయన భక్తిమార్గము

నందు జాతిభేదములను, ఉచ్చనీచతత్వములను పాటించెడివాడు కాడు. అస్పృశ్యులకు, మహమ్మదీయులకు భక్తిమార్గము నుపదేశించెను. మోహాను డస్పృశ్యుడు; తానసేను, రసఖాను, ఘనానందు మహమ్మదీయులు.

ఈయనసుప్రసిద్ధధర్మాచార్యుడేగాక ప్రకాండ విద్వాంసుడు; కళాకారుడు; కావ్యసంగీతమర్మజ్ఞుడు; చిత్రకారుడు; వ్రజభాషామహాపోషకుడు. అష్టఛాపమహాకవులవలన వ్రజభాష యనుపమోన్నతినిగాంచినది. ఆయనచే నిర్మింపబడిన 'బాలకృష్ణ' చిత్రమే చిత్రకళాజ్ఞానమును వెల్లడిచును. గోస్వామివిఠలనాథుని మహత్తర కార్యములే భారతీయధర్మపీఠమునందు ప్రముఖ సోపానము లైనవి. మధ్యకాలమునం దుత్తర భారతమునందు వ్యాపించియున్న నిరాశ, స్పృహను బోగొట్టి ప్రజాహృదయములందాశారేఖలను మొలకలెత్తించిన ధర్మాచార్యుడు, లోకనాయకుడును, యుగపురుషుడును. ప్రజాహృదయము శ్రీకృష్ణలీలామృతమును గ్రోలుచు జీవితమునం దొక పరిపూర్ణవిశ్వాసమును నెలకొల్పుకొనగల్గినది, దానికి కారణము మహాప్రభువల్లభాచార్యస్థాపిత పుష్టిమార్గప్రచారకుడగు గోస్వామినాథుడే. హృదయవీణియను మీటి శ్రీకృష్ణునిలీలావిశేషములను పదరూపంబున హత్తుకొనునట్లు రచించి చైతన్యమును గల్గించిన సూరదాసు మహాకవి యుగపరిమాణమును ద్రిప్పిన శాంతిమూత. భక్తమాలయందు గోస్వామియొక్క సేవాప్రణాళి భక్తిభావనను ప్రశంసించుచు కలియుగమునందు బుట్టిన ద్వాపరయుగపురుషు డని చెప్పబడినది.

రాగభోగనిత వివిధ రహత పరిచర్యాతిల్పర్ ।
సజ్యాభూషణవసనరుచిరరచనా అపనేకర్ ।
వహ్ గోకుల వహానంద సవనదీక్షిత కోసాహై ।
ప్రగటవిభౌజహు పోష దేఖి సురపతి మన
మోహై ॥

వల్లభసుత బల భజకే ।
కలియుగమే ద్వాపరజహై ।
విఠల వ్రజరాజ జసౌ ।
లాలలడాయకై సన్నిని హై ।

గోస్వామికి నేడ్గురు పుత్రులును, పదునార్గురు పౌత్రులును, ఆరుపుత్రిక లుండిరని 'సంప్రదాయకల్ప' మందు వ్రాయబడినది. అట్టి పరివారమును, లౌకికకీర్తినిబొంది, ఉన్నత సంప్రదాయము నేర్పఱచి లీలాప్రవేశము గావించెను.



యోగాగ్ని దగ్ధ కర్ములు యోగీశ్వరు లే మహాత్ము నొం డెఱుంగక స
ద్యోగ విభాసిత మనముల బాగుగ నీక్షింతు రట్టి పరము భజింతున్ ॥
విశ్వకరు విశ్వదూరుని విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వ నవిశ్వున్
శాశ్వతు నజు బ్రహ్మప్రభు నీశ్వరునిం బరమపురుషు నే సేవింతున్ ॥

—గజరాజు మోక్షం - పోతరాజు.

# పరమావధి

## [శ్రీ గురుభక్త పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు]

మనుష్యుని పరిణామము ఏడు మెట్లుగల నిచ్చెనవలె నున్నది. దిగువ మూడుమెట్లలోను త్రిదేహస్వరూపుడైన పురుషుడు ప్రకృతిబద్ధుడై ప్రకృతియే తాననుకొని వ్యవహరించెను. అప్పుడు పురుషుని ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తులను ప్రకృతి తనస్వార్థమునకు పలువిధములుగ దుర్వినియోగము చేసినందున మితిలేని దుఃఖముల పాలై జన్మజన్మలలో ననుభవమునుపొంది తుదకు ప్రస్తుతస్థితిలోనికివచ్చి వృద్ధిలేక ఆగి పోయియున్నాడు. ఇట్టియనుభవమువలన మనకు కలిగిన లాభము ''అహంకారము'' మమకారము బలమైనవి. అందుచేత మనము తెలిసికొనిన పాఠములు ఏవన:-

1. ఇహమందు నిజమైన సుఖము లేదు.

2. ఇహసంబంధసుఖములన్నియు తుదకు దుఃఖభూయిష్ఠములే.

3. నేను దేహప్రపంచమునకు రాజును.

4. దేహములనునవి నాకు సేవకులు లేక పనిముట్లు.

5. భగవంతుని యిచ్ఛాప్రకారము వాని మహాసంకల్పమును నెరవేర్చుటలో నేను తోడై పనిచేయుటకే యీ దేహమున్నది. ఇవి నాకు సహకారులుగా పనిచేయుటకు ద్దేశింపబడినవి.

6. కనుక ఇంతవరకు చలాయించుచున్న దేహరాజ్యమును ప్రకృతినుండి నేను తీసికొన వలెను అని దృఢసంకల్పము బుద్ధి నాకు కలుగుచున్నవి.

7. దేహరాజ్యమును ప్రకృతినుండి పురుషుడు తీసికొనుటలో చేయవలసినది యుద్ధమై యున్నది. ఇదియే కురుక్షేత్ర యుద్ధము.

ఇట్టి యుద్ధమునకు ముఖ్యముగా కావలసిన బలము స్థూలబలము కాదు. ఇచ్ఛా జ్ఞాన క్రియా శక్తులయొక్క ఆధ్యాత్మికబలమై యున్నది.

కనుక ఇట్టి బలమును సంపాదించుటకుగాను మనపురాణములు మొదలగు మహామతగ్రంథములు అనగా శ్రుతి, స్మృతీతిహాసాదులను చదువుట, వినుట వానియందుండు అంతరార్థములను తెలిసికొనుట యవసరము. తెలిసికొనుట తెలిసికొనినదానిని ఆచరణలోపెట్టుట కూడ ముఖ్యమైనవి.

కనుక జీవితమున కనుకూలమగు అంతరార్థములను కొన్నిముఖ్యఘట్టములను చెప్పదలచితిని.

కనుక వానియందుండు స్వారస్యమును గ్రహించి అందరకు వెల్లడిచేసి సరియైన జీవితములోనికి తెచ్చుటకు తగినప్రయత్నములు చేసి దేశోద్ధరణ చేయుదురుగాక.

అంతరార్థమును తెలిసికొనుటకు ముందుగా మనము ''పురాణములనగా నేమి? ఇవి ఎట్టివారు వ్రాసిరి? ఇవి ఏమి తెలియజేయును? ఎట్టి యర్థముల నిచ్చును? ఆయా రాజుల చరిత్రములు నిజమేనా? అని యోచింపవలయును. ప్రాచీనగ్రంథమునకు పురాణమని పేరు. ప్రాచీనమైనను నవీనముగా కల్పించు కథ. పురాణములు దివ్యదృష్టి కలవారు వ్రాసినారు. ఇవి

సృష్టి ఎట్లు జరిగినదో యా చరిత్రమును తెలియ జేయును.

1. విగ్రహములు, 2. కథ, 3. నీతి. 4. తత్త్వము, 5. మోక్షము, ఈ అయిదువిధ ములుగా నీ పురాణము లుపయోగించును.

పిల్లలు విగ్రహములనుచూచి వానిచరిత్ర ములు తెలిసికొని యానందించెదరు. అంతకన్న పెద్దవారు చరిత్రలను జదివి దానిలోని కథలు జదివి గ్రహించి యా కథలనే చూచి ఆనం దించెదరు. అంతకంటె పెద్దవారనగా పరిణామ స్థితిలో పెద్దవారు చరిత్రములలో నుండెడి నీతు లను విడదీసి గ్రహించి యానందించెదరు. అంత కంటె పరిణామములో వృద్ధియైనవారు బాహ్య చరిత్రములోని యంతరార్థమును తెలిసికొని దానితత్త్వమును విమర్శించి యానందించెదరు. ఇంకను తుదకు జ్ఞానులు దానితత్త్వమును నిధి ధ్యాసచేసి తపస్సుచే సమాధిలోనికి వెళ్లి తుదకు ముక్తిని పొందెదరు. ఆ రోజులలో దైవప్రేరి తులైన రాజులు ఋషులు నుండెడివారు. ఇవి వ్రాసినప్పుడు కథలు నీతులు బాగుగా ముందు కాలమున తెలిసికొనుటకు వ్రాయబడినవి. ఇహ సంబంధమైన ప్రజలు కామమోహితులై జ్ఞాన ము మరుగుపడి తత్త్వార్థము బోధకానందున అంతరార్థముగల కథలతోను నీతులతోను వీనిని పూర్వులు వ్రాసినారు. అంతరార్థము అప్పటి లోనే వ్రాసియున్నయెడల ప్రపంచమే లేదు. జ్ఞానము సృష్టితోనే వచ్చినచో, సృష్టియొక్క పరిణామమే లేదు. సృష్టియే లేదు

నీతి బాగుగా తెలిసిన పిమ్మట ఆ నీతి యస్థి కలకు బాగుగా పట్టిన పిమ్మట తత్త్వబోధ బాగు గా తెలియును. 'తత్' అనగా 'ఆపరమాత్మ'. త్వం' అనగా 'నీవే' అని యర్థము. పరమాత్మ పెద్దమంట అనుకొందము. దానిలోని విస్ఫులిం గములు అనగా నెరసులు జీవాత్మలవంటివి. జీవాత్మ ప్రయాణమునకుముందు ప్రవృత్తి యాత్రచేసి పిమ్మట నివృత్తియాత్రచేసి తుదకు తన పరమాత్మస్థానమునకు చేరును.

పరిణామస్థితిని సర్వమును భాగవతము చెప్పును. ఇది ముఖ్యముగా భక్తియోగము చెప్పును. ఇతరగ్రంథములు జ్ఞానయోగమును కర్మయోగమును చెప్పును. గీతలు బ్రహ్మ సూత్రములు కర్మయోగము, శుద్ధజ్ఞానయోగ మును చెప్పును. ఉపనిషత్తులు శుద్ధజ్ఞానయోగ మును చెప్పును. "అన్ని జ్ఞానయోగములు చెప్పి నారు. భక్తియోగమును చెప్పు"డని నారదు డడుగగా వేదవ్యాసునిచే భాగవతము భక్తిని గూర్చి చెప్పబడినది. ఇందు అంతమాత్రము చేత నితరయోగములు లేవని కాదు.

శ్రీశుకులు జీవన్ముక్తులు. పుట్టుకయు చావు నులేనివారు. దేశమునకు అనేకవిధములుగా సా హాయ్యము చేయుచుందురు. కనుకనే అనుభవ మున్నవా రనుభవము కలుగజేయుటకు చెప్ప వలెను. పరీక్షిన్మహారాజునకు పాము కఱచి చచ్చునని శాపమువచ్చినప్పుడు శ్రీశుకులు జీవన్ముక్తులు గాన పరీక్షిత్తు జీవన్ముక్తుడగుటకు తగినస్థితిలోనున్నవాడుగనుక వానికి జీవన్ముక్తిని గురించి చెప్పవలసివచ్చినది. సూర్య చంద్ర వంశపురాజుల చరిత్రము మనుష్యుని ప్రవృత్తి నివృత్తిమార్గములను తెలుపుడుచేయును. దాని లో యుద్ధములు చేయుట రాజ్యములు సంపా దించుట పౌరుషమును చూపించుట దుష్టులను శిక్షించుట శిష్టులను రక్షించుట పుత్రులను బడయుట రాజ్యమేలి ప్రజలను సుఖపెట్టేయుట మొదలగునవన్నియు నిహసంబంధమైన పనులు. ఇంద్రియసుఖములను కోరి చేయుపని ప్రవృత్తి.

దీనియందు తీర్ణతను అనగా జయమును పొందిన పిమ్మటనే ప్రయాణికుడు నివృత్తియాత్రచేయుటకు సన్నద్ధుడు కావలెను.

ఇంతవరకు సూర్యవంశపురాజులు వారి పరాక్రమము వారిరాజ్యము ప్రవృత్తివిశేషములు చరిత్ర మొదలైనవానిని శ్రీశుకులు పరీక్షిత్తునకు చెప్పినారు.

పిమ్మట నివృత్తి జీవయాత్రను గురించి ప్రారంభించి చెప్పుచు చంద్రవంశము నెత్తుకొని శ్రీశుకులు పరీక్షిన్మహారాజునకు తత్త్వబోధ చేయుచున్నారు. చంద్రవంశములో వివేకము బయలుదేరినది. బుధుడు కలిగెను. అపరిశుద్ధ మనస్సును వదలివేసి బుధుడు రాజ్యమును భార్యను పిల్లలను వదలివేసి దుఃఖము దాని పుట్టుక దాని యుపయోగము దానిని జయించుట ప్రపంచమునకు బోధజేసి ముక్తిచెందెను. చంద్రవంశములో చెప్పబడిన రాజఋషులు యతులు జ్ఞానులు బయలుదేరి యీ స్థూల రాజ్యమును వారిమంత్రులకు వదలివేసి నివృత్తి యాత్రజేసి మోక్షము చెందిరి అని చెప్పుచు వచ్చెను. చంద్రవంశములో రాజులుగానున్న జీవులు ఇహసుఖములను వదలి అరణ్యములోనికిపోయి పరమాత్మనుగూర్చి జపించి మోక్షమును పొందిరి.

పరమాత్మ నుద్దేశించి జీవాత్మ నిమిత్తమై చేయు ఫలరహితమైన సుకర్మ యావత్తు నివృత్తి అనబడును.

ఇది ఇంతటితో సూర్యవంశము అంతమై చంద్రవంశము ప్రారంభమైనదని చెప్పు నితిహాసమై యున్నది.

దేవి నామముఁ బలుకుచు దివికిఁ జనఁగఁ గందు నేనియు, నా కేల కాశియాత్ర?
గంగకును గయకు మఱియుఁ గంచి కైనఁ బతిత పావన ప్రథిత ప్రభాసమునకు
నేని బోవఁగా నేల నా కింకఁ? జెపుమ — మూఁడు సంధెలను మిగులఁ బూని తోడ
మాతృ నామ జపంబును మాన కున్న మానవున కేల నిఁకఁ గర్మలను నొనర్ప?
భక్తిసాధనలకు మాన వచ్చుఁ గూడఁ; గర్మ లొండొండ వెన్నంటఁ గలవె కాని
యతని మీఱంగ వానికి నైతి కాదు. దానధర్మంబులును వ్రతతతియుఁ దాము
మదికి నింపును గూర్పవు మదనునకును. దేవి ఆనందమయి గౌరి దివ్య పాద
పద్మమే అతఁ డాసించు వరము; మఱియు దానిఁ గోరియె చేయును త్యాగమును.
దేవదేవుఁడు మృడుఁడుఁ దా దీక్షతోడ దేవి మహిమల నుతియంచె దేల్చఁ దనదు
వదనములను నైదింటిఁ దత్పరత ననఁగ, అంబ నామ శక్తి అది ఇంత అనుచుఁ
దెలియఁగ ఎవరికిఁ దర మగును? అరయు మోయి.

—శ్రీరామకృష్ణసూక్తిసుధ, పుట 111-2.



# వార్తలు, విశేషాలు

## వేదారణ్యంలో రామకృష్ణమిషను వారు కట్టించిన వలస

ఇటీవలి తుపానులో చాల దెబ్బ తిన్న 200 హరిజనకుటుంబాలవారికై మదరాసు రామకృష్ణమిషనువారు కట్టించిన 'వలస' పేరు రామకృష్ణపురము. మదరాసు గవర్నరు శ్రీ 'జాన్' గారు దానిని గడచిన ఫెబ్రువరి తే 10 ది ఆదివారంనాడు ఆవిష్కరించారు. ఆనాడు వేదారణ్యంలో ముఖ్యంగా రామకృష్ణపురంలో ఉత్సవోత్సాహాలు పోటెక్కినాయి. ఇండ్లదానం పుచ్చుకొన్నవారు తమతమ యిండ్లను బాగా అలంకరించారు. ఊరంతా సింగారింపబడ్డది. మధుర నాగస్వర సంగీతంతో దినం ప్రారంభం ఐంది. తర్వాత వేదపారాయణాన్ని వాసు పూజను నవగ్రహహోమాన్ని ఊరిపురోహితులు జరిపారు. శ్రీ భవానందస్వాములు ప్రత్యేకపూజాహోమాలతో ఆరతితో శ్రీరామకృష్ణభగవంతుని విగ్రహానికి ప్రతిష్ఠ చేశారు. శ్రీ శారదేశానందస్వాములు సక్రమంగా సమగ్రంగా 'చండీ'పారాయణం కావించారు. మదరాసు రామకృష్ణ 'మఠ' 'మిషను'ల అధ్యక్షులు శ్రీ కైలాసానందస్వాములు ఇంటింటికి పోయి గంగాజలం ప్రోక్షించి 'లక్ష్మీ' 'శ్రీరామకృష్ణు'ల పటముల నెలకొల్పి ఆరతి జరపడమే కాక ఆ కుటుంబాల వారి కందఱికిన్ని బట్టలు చాపలు వగైరాలను పంచి పెట్టారు. మధ్యాహ్నం 12 గంట లప్పుడు పెద్ద పందిరిలో రామకృష్ణపురవాసులకు, వారిబంధువులకు మదరాసునుండి వచ్చిన భక్తులకు, సాధువులకు, — దాదాపు వేయిమందికి విందు జరిగింది. 2-30 గంట లప్పుడు శ్రీ రామస్వామిభాగవతులు శ్రీరామకృష్ణచరిత్రమును హరికథగా చెప్పినారు.

గవర్నరు శ్రీ ఎ. జె. జాన్‌గారును వారి సతీమణియు తంజావూరు కలెక్టరుగారును జిల్లా పెద్దఉద్యోగులున్నూ సరిగా 4-10 గంటలకు విచ్చేశారు. శ్రీమత్ కైలాసానంద – శుద్ధసత్త్వానందస్వాములు వారికి స్వాగతోపచారం చేసి, తక్కిన స్వాములనున్నూ పరిచయం చేశారు.

గవర్నరు 'వలస'ను తెఱచారు. వారి సతీమణి ఒకగదిలో దీపం వెలిగించారు. కట్టడాలను ఏర్పాట్లను చూచిన తర్వాత గవర్నరు ప్రభృతులు సభావేదికయొద్దకు వెళ్లినారు. అక్కడ అసంఖ్యాక ప్రజలు సమావేశమై ఉండినారు. వారిలో ఆ వలసలోని యిండ్లను ప్రతిగ్రహించినవాళ్లున్నూ ఉన్నారు.

గురుకులబాలికలు శాంతిమంత్రం చదవడంతో సభాకార్యక్రమం ప్రారంభ మైంది. శ్రీమత్కైలాసానందస్వాములు సదస్సుకు స్వాగతం పలికారు. కలెక్టరుగారు తమ కార్యనివేదికను చదివారు. శ్రీమచ్ఛుద్ధసత్త్వానందస్వాములు, ప్రముఖులు పంపిన సందేశాలను 'మిషన్' కార్య నివేదికను చదివారు. తుపాను వల్ల కలిగిన కష్టనష్టాలు తంజావూరురామనాథ

జిల్లాలలో 'మిషను'వారు అన్న వస్త్ర గృహ పరిక రాదులను అందజేసి చేసిన సేవ — నివేదికలో వర్ణింపబడ్డది.

"తాత్కాలికంగా చేయ వలసిన సాహాయ్యం ముగిసిన తర్వాత, నష్టపడ్డ ప్రజలకు వారి పరిసరాలలోనే నిలువ నిలుకడైన నీడను ఏర్పఱచే పనికి పూనుకొన్నాం. వెడకత్తలై అనే గ్రామం సముద్రతీరంలో ఉన్నందున 1952 లో వీచిన తుపానుకూడ అక్కణ్ణే ఎక్కువ నష్టాలు కలిగించింది. మొన్నటి తుపానులో అక్కడి ప్రజలకు కలిగినంత ఆపద మ రెక్కడి వారికిన్నీ కలుగ లేదు. 19 కుటుంబాలు గుర్తే లేకుండా అంతరించాయి. ఆ యేకైక గ్రామంలో మరణించినవారి సంఖ్య 172 కంటె ఎక్కువ. ఇకను 200 హరిజన కుటుంబాల వారికి ఆ ప్రళయంలో సర్వస్వమున్నూ కొట్టుకు పోయి వాళ్లు మిగిలారు.

"కాబట్టి తే 17–12–55 ది సెంటుజార్జికోటలో ప్రభుత్వంవారు సమావేశపఱచిన సదస్సులో మిషన్‌స్వాములు 'నిలువ నీడ బొత్తుగ కోల్పోయిన వారికి వలసవిడుదులు కట్టించి యియ్య వచ్చును' అని ప్రతిపాదించారు. సర్కారువారు అభినందిస్తూ అంగీకరించి, 10 ఎకరాల భూమిని కొని మిషనువారి పరం చేయడమే కాక, వారి ప్లానును ఎస్టిమేటును ఒప్పుకొన్నారు.

"200 కుటుంబాలవారికై 200 పక్కాయిండ్లను కట్టడానికి మూడు లక్షల ధనం ఔతుం దని అంచన కుదిరింది. అందు సర్కారువారు 1½ లక్షలను ఇస్తామని వాగ్దానం చేశారు. శేషించిన 1½ లక్షలకు మిషన్‌వారికి తమ 'సహాయనిధి'యే ఆధారం. 200 ఇండ్లలో 128 ఇప్పటికి పూర్తి ఐనాయి. వాటికే నేటి ఆవిష్కరణోత్సవం. వాటినే కాక మిషనువారు తమ సొంత ధనం వ్యయించి ఒక ప్రార్థనమందిరాన్ని గుడిని పిల్లలతోటను కట్టించి ఒక రేడియోను నెలకొల్పారు, ఒక పాఠశాలాగృహాన్ని కట్టింతా మన్న సంకల్పం కూడా వారికి ఉంది. వీటిలో తుది మూడు ఐటములకు అయ్యే ఖర్చులో సగం తాము భరిస్తా మని వేదారణ్యాం 'బ్లాక్డెవలప్మెంట్' ఆఫీసరుగారు దయతో అంగీకరించారు.

"ఈ వలసవిడిదిని ఆదర్శప్రాయంగా చేయవలె అని మేము మాచేతనైనంత వఱకు ప్రయత్నించాం. కాబట్టి జరూరైన వసతుల నన్నిటి ఏర్పఱుప నిశ్చయించాం. వేదారణ్యాం మాడవీధినుండి వలసకొసవఱకు 6½ ఫర్లాంగుల గట్టి రస్తా వేయించాం. అందు కైన ఖర్చులో సగాన్ని సర్కారువారున్నూ బ్లాక్డెవలప్మెంటు ఆఫీసరున్నూ కలిసి భరించారు.

"విద్యుచ్ఛక్తిని వీధి దీపాలను మిషనువారు సరఫరా చేశారు. వేదారణ్యాం పంచాయతీ సంస్థ వారు వాటికి ఇక ఏ ఏట అయ్యే ఖర్చు తాము భరిస్తా మని దయతో సమ్మతించారు. ఈ వలసలో పది ట్యూబ్ బావులను కూడా త్రవ్వించ బోతున్నాం.

"ఇంకను 72 ఇండ్లను కట్ట వలసి ఉంది. వానల వల్లను పరికరాలు ఖర్చుపడిపోయినందువల్లను పని ఆగి పోయింది, త్వరలో పునః ప్రారంభం ఔతుంది. ఆరు నెలలలో పూర్తి ఔతుంది.

"ఈ మారుమూల చోటికి కట్టుబడి వస్తువులు అందడం మహాకష్టం. అందజేయడానికి యథాశక్తి కష్టపడ్డాం. నేటికి సిద్ధమైన కట్టడాలు పూర్తి కావడానికి 8 నెలలు పట్టిం దంటే, అది అంత దీర్ఘ కాలం కాదు.

"రాష్ట్రాధిపతిమహాశయా, ఈ వలసవిడిదికి రామకృష్ణపురం అని పేరు పెట్టి తమకు అప్ప గిస్తున్నాం. తమప్రభుత్వంవారు తగిన సానుభూతితో దీన్ని రక్షిస్తా రని నమ్ముతున్నాము.

"సర్కారువారి యేర్పాట్లకు బద్ధులై ఉన్నంతవఱకు ఈ కుటుంబాల వారికిన్నీ వీరి సంతతి వారికిన్నీ ఈ యిండ్లలో నివసించేందుకు అనుమతి ఉండ వలె అని మా కోరిక."

సేవలో మిషనువారికి తోడ్పడ్డవారి కంద ఱికీ ధన్యవాదాలు అర్పిస్తూ శ్రీశుద్ధసత్త్వానంద స్వాములు ముఖ్యంగా నిధిమంత్రిని ప్రభుత్వోద్యోగులను వేదారణ్యనివాసు లైన సర్దారు వేదరత్నం శ్రీ సుబ్బయ్యపిళ్ళై మహాశయులను కొనియాడారు; తమ రెండులక్షల ఎనభై వేల సహాయనిధిని పూర్తిగా ఒసంగిన దినమణి పత్రికాధిపతులకున్నూ, నలభై యొక్క వేలు విరాళం ఇచ్చిన మదరాసు ఆర్టిస్టుల అసోసియేషనుకున్నూ మిషనువారి కృతజ్ఞతను తెలిపారు. మదరాసునుండి ఇంత దయతో ఇంత దూరం విచ్చేసిన గవర్నరుగారికి తమ ధన్యతను ప్రకటించారు. గవర్నరుగారు మొదట కొన్ని లాంఛన బహుమానాలను ఇచ్చి, వెంటనే ఉపన్యాసం చేశారు. అది చక్కగా ఆలోచించుకొని చేసిన ఉపన్యాసం. పంచాయితీ సంస్థ వారి స్వాగతపత్రిక, రా నున్న ఎన్నికలు, తుపానుబాధితులకు ప్రభుత్వంవారుచేసిన సాహాయ్యము — ఈవిషయాలను ప్రస్తావించి, గవర్నరుగారు నాటిఉత్సవాన్ని గుఱించి ఈలా అన్నారు—

తుపానువల్ల నష్టపడ్డ కొందఱి ఉపయోగార్థం నిర్మిత మైన యీ వలసను ఆవిష్కరించేందుకు వచ్చాను. అది నా ప్రధాన కర్తవ్యం. మానవు డేమో అగపడ్డ సామగ్రి నంతా తన ఉపయోగార్థమున్నూ తన జీవితాన్ని సుఖవంతంగా చేసికోవడానికిన్నీ చేర్చిపెట్టుకొందామని తన శక్తికొద్దీ ప్రయత్నిస్తాడు. పంచభూతాలను తన వశంలోకి తన యేలుబడిలోకి తెచ్చుకొందా మని పట్టుదలతో పాటుపడతాడు. కాని తలవనితలంపుగా నిస్సహాయదశలో ఇరుక్కొంటాడు. వఱదో కాటకమో ముంచుకు వస్తుంది. ఇదంతా మానవుడికి అతని బుద్ధిబలం ఎంత పరిమితమో అతని తాహతు ఎంత కుఱుచో జ్ఞప్తి చేయుకే కాబోలు! అంతే కాదు, అంతకంటె అతని మర్త్యత్వాన్ని అతని జ్ఞప్తికి తెచ్చేందుకు. నవంబరు తే 30 ది నాడు మన రాష్ట్రంలో నాల్గు చక్కని జిల్లాలను దారుణాపదల పాలు చేసిన తుపానువఱదలు అటువంటివి. ప్రాణినష్టం, జంతునష్టం అపారం. పల్లెలు మాయమై పోయినవి. కొంపలు కూలాయి, గుడిసెలు రూపుమాసినాయి, పొలాలు వెల్లువలో మునిగాయి, పైరు కొట్టుకు పోయాయి, చెరువులు తెగాయి, వంతెనలు రస్తాలు ఉపయోగానికి సాధ్యపడకుండా చెడిపోయాయి. ఐతే ఆలాంటి ఆపద వచ్చి నప్పుడు ఎదుర్కొనేందుకున్నూ ఆదుకునేందుకున్నూ మానవులకు ప్రతిభ ఉన్న దని కూడా అప్పుడే రుజువైంది.

శ్రీరామకృష్ణమిషనులాంటి సంఘసేవాసంస్థలు ఆపదకు గుఱి యైనచోట్లకు పోయి భక్త్యుత్సాహదీక్షలతో తోడ్పడ్డాయి. అన్నవస్త్రాలు, గృహపరికరాలు, కృషికి సంచిమొదలు, గుడిసెలకు వలసిన సామాన్లు పనిముట్లు నిష్పక్షపాతశ్రద్ధతో అందజేయబడ్డాయి. ప్రాంతీయ ప్రజలును ధైర్యం వదల కుండినారు. గట్టిమనస్సుతో ఆపదను ఎదుర్కొన్నారు. వారికి మన ప్రభుత్వమందున్నూ ఉద్యోగులందున్నూ సంఘ



రామకృష్ణపురము (వేదారణ్యము) న శ్రీరామకృష్ణ మిషనువారు నిర్మించిన ప్రార్థనామందిరము, గుడి.

ఎడమవైపునుండి కుడివైపునకు:—తంజావూరు కలెక్టరు; గవర్నరుగారి 'ఎ. డి. సి.'; 'జాన్' సతీమణి; గవర్నరు శ్రీ ఎ. జె. జాన్‌గారు; మదరాసు శ్రీ రామకృష్ణ మఠాధ్యక్షులు శ్రీ కైలాసానందస్వాములు; శ్రీరామకృష్ణ మిషను సాహాయ్యకార్యక్రమనిర్వాహకాధ్యక్షులు శ్రీ శుద్ధసత్త్వానందస్వాములు.



శ్రీ రామకృష్ణపురములోని గుడి



చెన్నపురి శ్రీ రామకృష్ణ 'మఠ' 'సేవాసం' మాధ్యక్షులు, శ్రీ కైలాసానందస్వాములు వేదారణ్యపు వలసలో ప్రతిగ్రహీతలకు క్రొత్త బట్టలు పంచి పెడుతున్నారు.

సేవాసంస్థలందును విశ్వాసం కద్దు. వారి ధైర్య స్థైర్యాలను నేను అభినందిస్తున్నాను.

శ్రీరామకృష్ణమిషనుస్వాములున్నూ కలెక్టరుగారున్నూ ఇప్పుడే చదివిన నివేదికలలో వివరా లన్ని స్పష్టంచేయబడ్డాయి. బడ్జెట్టు ఉపన్యాసంలో మన నిధిమంత్రిగారు అన్నట్లు అపార సేవాకార్యక్రమాన్ని నిర్వర్తించిన ప్రభుత్వేతర సంస్థలలో శ్రీరామకృష్ణమిషను స్థానం అగ్రగణ్యం. ఆపదలో ఉండే ప్రతివాణ్ణి శ్రద్ధతో విచారించడం, మూలమూలకు సరుగు లెత్తడం, ఓదార్పు ఊరడింపులు ఒకచోట, గృహపరికరాల పంపకం ఒకచోట, పడిపోయిన కట్టడాల క్రిందనుండి ప్రాణావశిష్టులను కాపాడడం ఒకచోట—ఈ పనులను ఇట్టిపనులను విసుగుపుట్టించేవాటిని ఓర్పుతో నెగ్గించడం సులభం కాదు. శ్రీరామకృష్ణసంస్థస్వాముల నిస్స్వార్థ సేవా నిష్ఠకు నా జోహారులు. వారున్నూ ప్రభుత్వోద్యోగులున్నూ చచ్చిపోయిన వాళ్లను బ్రతికించడం తప్ప తక్కిన సేవల నన్నిటిని చేశారు.

శ్రీరామకృష్ణసేవాసంఘాన్ని లోకానికి పరిచయపరచపలసిన జరూరు లేదు. వారి సాహాయ్యకార్యప్రణాళికలను ఇంతకు ముందే కృతజ్ఞతతో ప్రస్తుతించి ఉన్నాను. తాత్కాలిక సాహాయ్యం చేయడమేకాక నిలువనీడలేని వారికి నిలుకడైన నీడను ఏర్పరచడానికి శ్రీరామకృష్ణసంఘంవారుపూనుకొన్నారు. మానవ సేవమాధనసేవఅనే దృఢవిశ్వాసం వారికి ఉంది. శ్రీరామకృష్ణవివేకానందులు కలిపిన త్యాగ సేవాదర్శాల సాధనకై ఈమిషనువారు ఇప్పటికి యాభైయేండ్లుగా పాటుపడుతున్నారు. వీరి లక్ష్యాలకు విదేశాలలో ఖండాంతరాలలో కూడా ప్రసిద్ధి గల్గి ఉన్నది. వీరు వేదాంతమును పునరుద్ధరించడమే కాక శాస్త్రాలను కళలను పరిశ్రమలను విద్యావ్యాప్తిని, ఆరోగ్య సంరక్షణాన్ని ధర్మకార్యాలను పెంపొందజేయడానికికూడా శ్రమిస్తున్నారు. కాబట్టి ప్రభుత్వంయొద్ద నేమి ప్రజలయొద్దనేమి విరాళాలు సంపాదించి వీరు ఈవలసను ఆదర్శప్రాయంగా నిర్మింపబూనుకొన్నారు...... 200 యిండ్లకు ఇప్పటికి 128 పూర్తి అయ్యాయి. వానిని నేనీ దినం మహానందంతో ఆవిష్కరిస్తున్నాను. శ్రీరామకృష్ణమిషనువారి భక్తి ధర్మకార్యాలు అవిచ్ఛిన్నంగా సాగా లని సంఘాలు వ్యక్తులు ఇట్టి సేవాప్రణాళికలను ఇతోధికంగా నిర్వహించి ఆర్తత్రాణపరాయణులై వెలుగొందాలని నా ఆశయం.''

సర్దారు వేదరత్నముగారు గవర్నరుగారికిని తదితరులకున్నూ కృతజ్ఞత తెలుపుకొన్నారు. గురుకుల విద్యార్థుల 'జనగణమన' పాటతో కార్యక్రమం ముగిసింది.

సాయంకాలం ఆరతిభజనలకుతర్వాత ఆస్ట్రియా మహిళ వెర్‌స్టినను చూపిన ప్రదర్శనాన్ని వేలాదిప్రజలు చూచి ఆనందించారు.

సంగీత భజనలతో శ్రీరామకృష్ణుల అలంకృత చిత్రానికి చేసిన ఊరేగింపు — ఉత్సవ ప్రణాళికకు పరిసమాప్తి మంగళం.

## శ్రీ వివేకానందస్వామి జయంతి
## శ్రీరామకృష్ణమఠం - మదరాసు

1957 వ సం॥ జనవరి తే22 ది నాడు స్వామిజి జయంతి. ఉదయం ప్రదక్షిణసంకీర్తన, తర్వాత ప్రత్యేక పూజ, భజన, హోమం, సంతర్పణ — సాయంకాలం కామార్పుకురునకున్నూ హిమాలయయాత్రకున్నూ సంబంధిం

చిన డాక్యుమెంటరి చిత్రాల ప్రదర్శనం — జరిగాయి.

జనవరి తే 26 ది శనివారం, ఉదయం స్వామిజి జీవితగ్రంథపారాయణం త ప్రచిత వివిధ గ్రంథాల పారాయణం 11 గంటలవరకు సాగింది. నూఱుగురు భక్తులు పాల్గొన్నారు తర్వాత మఠసాధువులు ఉపన్యసించారు. మధ్యాహ్నానంతరం 3 గంటలనుండి 5–30 గంటలవఱకు మలబారు రామన్‌నాయరు మన వీధినాటకాల వంటి ఓట్టంతుళ్లల్ అనే మలయాళ వీధినాటక ప్రదర్శన్ని చేశారు. తర్వాత బహిరంగ సమావేశము. మహాధ్యక్షులు శ్రీమత్ కైలాసానందస్వాములు స్వాగతవాక్కు అనుగ్రహించారు. ఢిల్లీ కేంద్రాధిపులైన శ్రీమద్రంగనాథానందస్వాములు అధ్యక్ష్యం వహించారు. శ్రీ నే. భక్తవత్సలము ఎమ్.ఏ., శ్రీ కె. వాసుదేవన్ ఎమ్.ఏ., శ్రీ కె. చంద్రశేఖరన్ ఎమ్.ఏ., బి.ఎల్. గార్లు వరుసగా తెలుగులో ఆంగ్లంలో తమిళంలో ఉపన్యసించారు. వెల్లూరి ఉర్హీస్ కళాశాలా పండితులు శ్రీ పి. వి. వరదరాజశర్మ ఎమ్.ఏ. గారు సంస్కృతంలో మధురంగా ప్రసంగించారు. అనంతరం సభాధ్యక్షుల అనర్గళ మధుర వాగమృత ఝరి శ్రోతలకు ఆనందపారవశ్యం ఆపాదించింది. శ్రీ కే. బాలసుబ్రహ్మణ్యయ్యరు గారు కృతజ్ఞతాభివందనోపచారం చేసారు. ఆ నాడు ఏకాదశి కాబట్టి శ్రీరామనామసంకీర్తనముతో కార్యక్రమం పూర్తి ఐంది.

# గ్రంథసమీక్ష

## శ్రీభగవన్నామమహిమగానామృతము

రచయిత : శ్రీ గాదిరెడ్డి వెంకటసుబ్బయ్య; ప్రాప్తిస్థానము: రచయితపేరు, కరేడు, నెల్లూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్; వెల : రూ. 1–8–0; పుటలు : 100.

శంకరుఁడు చెప్పినట్లు సాంసారిక భోగియై ''అహంబ్రహ్మాస్మి'' అను వాదముతో కాలక్షేపము చేయువాడు, అటువైపు కర్మజ్ఞానియు గాక, ఇటువైపు బ్రహ్మజ్ఞానియు గాక, అజ్ఞానియై రెంటికీ చెడ్డ రేవడై ఉభయభ్రష్టుఁడగుచున్నాఁడు.

పోనిండు. అట్టి ''అహంబ్రహ్మాస్మి'' అనెడి నిర్గుణోపాసనకుఁ గూడ, సగుణోపాసనమే మొదటి మెట్టు. ఏలనగా, కన్నులకు కానవచ్చుచుండెడి విగ్రహస్వరూపమునందే సరిగా నిలువని మనస్సు, అరూపమునందు (బట్టబయలునందు) ఎట్లు నిలువ గలదు? అందులకే గీతాచార్యుఁడు గూడ

ప్రకృతే ర్గుణసమ్మూఢాః
సజ్జంతే గుణకర్మసు
తా నకృత్స్నవిదో మందా
న్కృత్స్నవి న్న విచాలయేత్.

(అ. 3; శ్లో. 29)

అని కర్మను ప్రబోధించుచున్నాడు.

"తాపత్రయాది ఆశాపవనములకు లోనైన మనము మేము ఆత్మస్వరూపులము అని ఘోషించుటకు తగము" అన్నాడు వివేకానందుడు. అంతేగాదు

"పుంఖానుపుంఖ విష
యేక్షణ తత్త్వ రూపిణామ్"

అను స్మృతిరీతిగా, మానవులకు ఒక్కక్షణములో, అలలవలె, ఒకదాని వెనుక నొకటి పెక్కు తలంపులు పుట్టుచున్నవి. ఆ మనస్సును ఊరకుండు మన్న ఊరకుండదు. అట్లూరకుండుటయే బట్టబయలు. ఆ బట్టబయలు మనస్సునకు పట్టుపడదు గనుక పెక్కు తలంపులు గల మనస్సును ఒక్కతలంపు గల దానినిగా చేయవలయును. అందులకే భగవన్నామ స్మరణ చేయవలయును. అదియే భగవంతుని చేరుటకు నిర్మాణాత్మక మైన కృషి. అంతేగాదు

"తైలధారా మివాచ్ఛిన్నం
దీర్ఘ ఘంటా నినాద వత్
ఉపాస్యం ప్రణవ స్యాగ్రం
య స్తం వేద స వేదవిత్."
ధ్యానబిందూపనిషత్.

అనెడి వాక్యరీతిగా, తైలధారరీతిగాను – ఘంటానాదమురీతిగాను – సదా – ఎడతెగని ప్రవాహమువలెను, క్షణముమాత్రము నిలుపక, భగవన్నామమును గానము చేసినచో, అది అమర గానమై, అశాంతినిఁ బోగొట్టి, శాశ్వత శాంతినిఁ గలిగించి మానవుని మరపించి అమానవునిగా (దేవునిగా) చేయును.

ఈ పైతత్త్వమునే విపులీకరించి, ఈ గ్రంథకర్త "భగవన్నామజపము —విగ్రహారాధన— సగుణసాకారబ్రహ్మములగు భగవదవతార మూర్తులసేవ" — మున్నగు విషయముల శ్రేష్ఠత్వమును, మహాత్ముల ఉపదేశములతో నిరూపించినారు.

"చెట్టుపై కాకులను" హూష్ కాకి యని చప్పట్లు చరచి, బెదరించి పారద్రోలి, చెట్టు క్రింద హాయిగా కూర్చొను పెద్దమనుష్యులవలె బుద్ధిమంతు లగు వారలు, కరతాళధ్వనులతో శ్రీహరినామమును, బిగ్గరగ కీర్తించి, తమలో దాగి యున్న అరిషడ్వర్గములు అను చోరులను పారద్రోలుకొని సుఖమును అనుభవింతురు.

కబీరుదాసు మున్నగు వారల ఉపదేశములతో ఈ గ్రంథము ఒప్పి యున్నది.

శ్రీకుసుమహరనాథ పూజావిధానము ఇందు వర్ణింపఁబడియున్నది.

కాని ఈ గ్రంథకర్త, సగుణోపాసనయందు గల ఆసక్తిచే "రసహీనము – ఆనందరహితము నగు పరబ్రహ్మమునం దైక్యము" మున్నగు వివాదగ్రస్తములై నట్టివియు, ఆనందింప లేనివియు నగు పదములను ప్రయోగించినారు.

అయినను, ఈ గ్రంథము, కుసుమహరనాథ భక్తులకు అవశ్యపఠనీయ మైనట్టిది.

## రామాయణోపదేశాలు

రచయిత: కేశవతీర్థస్వామి. ప్రాప్తిస్థానము, శ్రీరామతీర్థసేవాశ్రమం, పిడుగురాల, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్. పుటలు: 80. వెల: 4 అణాలు.

"శ్రీమద్రామాయణపారాయణంలో మనస్సులో నినదించిన కొన్ని భావాలను ఇందు

నివేదిస్తున్నాను'' అని గ్రంథకర్తయే ఉపోద్ఘాతములో చెప్పుకొన్నారు.

ఈ చిన్నపుస్తకములో రామాయణములోని - ''రామతపోవనాది గమనం - హత్వా మృగం కాంచనం - వైదేహీహరణం - జటాయుమరణం - సుగ్రీవసంభాషణం - వాలీ నిగ్రహణం - సముద్రతరణం - లంకాపురీదాహనం- రావణకుంభకర్ణనిధనం—'' మున్నగు ఘట్టములలోని అంతర్లీనమైన సత్యవిషయములను ద్రాక్షాపాకమైన శైలిలో, ఈ గ్రంథకర్త, బాల - అయోధ్య - ఆరణ్య - కిష్కింధ - సుందర - యుద్ధ - కాండలుగ విభజించి, వ్రాసి, మనము చదువుచున్నపుడు ''సకల ఉపనిషత్తుల సారము ఇందు పొందుపరుపబడియున్నదా!'' అనిపించునట్లు, వ్రాసియున్నారు.

అఖండం గోపాలకృష్ణ



## SRI RAMAKRISHNA PRABHA

Statement about ownership and other particulars about newspaper (*Sri Ramakrishna Prabha*) to be published in the first issue every year after the last day of February.

FORM IV

(*See Rule* 8)

| | |
|---|---|
| 1. Place of Publication: | Madras. |
| 2. Periodicity of its publication: | Monthly. |
| 3. Printer's Name: | K. S. S. Rajan. |
| Nationality: | Indian. |
| Address: | The Jupiter Press Private Ltd., 109-C, Mount Road, Madras-18. |
| 4. Publisher's Name: | Swami Suddhasatwananda. |
| Nationality: | Indian. |
| Address: | Sri Ramakrishna Math, Madras-4. |
| 5. Editors' Names: | Swami Suddhasatwananda and Prof. N. Bhaktavatsalam. |
| Nationality: | Indian. |
| Address: | Sri Ramakrishna Math, Madras-4. |
| 6. Names and addresses of individuals who own the newspaper and partners or shareholders holding more than one per cent of the total. | Sri Ramakrishna Math, Mylapore, Madras-4. |

I, Swami Suddhasatwananda, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Date: 19-2-57

Signature of Publisher:
(Sd.) SWAMI SUDDHASATWANANDA

# శ్రీ రామకృష్ణోపనిష

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యములను శ్రీ రాజాజిగారు మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను అమర్చి, తమిళభాషలో రచించియున్నారు. అందు వారి సూక్తివైచిత్రియు ప్రత్యక్షర చమత్కారమును ఎంతటి గంభీరవిషయమునైనను సర్వసుగ్రహము చేయగల నైపుణియు తలపోలమంటినవి. ఆ గ్రంథముయొక్క యనువాదములు ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, హిందీభాషలలో ఇప్పటికే అపారవ్యాప్తి నొందినవి. దాని కిది చక్కని తెలిగింపు.

128 పుటలు వెల: రూ. 1-4-0

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు శ్రీరామకృష్ణుని జీవిత సంగ్రహమును 1121 మహోపదేశములును గలవు.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, తాకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు . వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, దేవుడు, జ్ఞానము : భక్తి : కర్మము, బ్రహ్మతత్త్వము మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసి బిడ్డల కయిన అవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

నీతికథలును సూక్తులును మకరంద పేశలములు, నిర్వృతికరములు.

... ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూక్ష్మాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్జ్వలమగు పంచమ ముద్రణము ! వెల : రూ. 3-8-0

# హిందూమతము

రచయిత : శ్రీ వివేకానందస్వామి

అనువాదకులు : శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

హిందూమత నామమును పరస్పరభిన్నభావభూయిష్ఠములగు అనేక మతసంప్రదాయ ములు వహించి యుండుటచే, తత్స్వరూప నిర్వచనమునకు ఇందు శ్రీ వివేకానంద స్వాములవారు పూనుకొని ఆ మతము వేదసంహితాకాలమునుండి ఎట్లు క్రమ పరిణామ మందెనో, అందు సర్వసమ్మతమూలభావము లెవ్వియో, అది చేయు బోధ యెట్టిదో, ఇన్ని భిన్నమతాంతరము లెట్లు కలిగెనో, ఈ కలగూరగంపకు హిందూమత నామ మెట్టు లేర్పడెనో విశదీకరించియున్నారు. జిజ్ఞాసువుల కత్యంతోపయుక్తమగు గ్రంథము.

... తెలుగువాఙ్మయములో వేదాంతచర్చలపై ... ప్రకటింపబడిన గ్రంథములలో ఇది ఉత్తమోత్తమ మైనదని శిరసొగ్గి చెప్పవలసియున్నది. -భారతజ్యోతి 12-4-1956.

168 పుటలు వెల : రూ. 1-4-0

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు – 4

# దేవీ మాహాత్మ్యము

(శ్రీ దుర్గాసప్తశతి)

అనువాదకులు: శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

ఇందు మూలశ్లోకములు, వానికి ధారాళమయిన ఆంధ్రానువాదమును పొందుపఱుప బడియున్నవి. అందందు ముఖ్యములును నిగూఢములును అగు శబ్దములకు పాదదీపికలందు వివరణములు చేర్పబడియున్నవి. దేవీనవరాత్రములందును, ఇతర పవిత్రావసరములందును నిత్యపారాయణమొనర్పవలసిన ఉత్తమగ్రంథము. ఈ గ్రంథప్రాశస్త్యము పూర్తిగా వివరించు పీఠికయు చేర్పబడియున్నది.

(170 + 16) పుటలు  ప్రజ్జ్వలమగు ప్రథమ ముద్రణము  వెల : రూ. 2/-

# శ్రీ వివేకానంద లేఖావళి

(రెండు భాగములు)

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

భారతదేశమున ఇంటింటను ఉండవలసిన పుస్తకములలో నిది యొకటి; బాలికా బాలకు లెల్లరును శ్రద్ధతో పదేపదే చదువవలసిన పుస్తకములలో నిది యొకటి.

ఈ లేఖలయందు దైవభక్తి, మానవరక్తి, కార్యాసక్తి—ఇవి నిరంతరసంయోగము దాల్చి జీవితాంధకారమును దొలగింపజేయు జ్యోతిగ నుండుట స్పష్టము.

-కట్టమంచి రామలింగారెడ్డి

మొదటి భాగము : 256 పుటలు
రెండవ భాగము : 226 పుటలు

ఒక్కొక్క భాగము వెల: రూ. 1-50

# రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౩ ౧౯౫౭, ఏప్రిల్; ధుర్ముఖి-ఫాల్గుణము, హేవిళంబి-చైత్రము సంచిక ౧౦

## విషయసూచిక

శ్రీ కృష్ణాష్టకమ్ ... ... ... ౩౨౧
మాలదాసరి – భగవత్సంకీర్తనఫలము—[సంపాదకీయము] ... ... ౩౨౩
నిగ్రహ వ్యావర్తని—డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు,
ఎం.ఏ., ఎం.లిట్., పిఎచ్.డి. ౩౩౦
బౌద్ధకాలములోని భారతీయ శ్వవిద్యాలయములు—కుమారి సరళాదేవి ౩౩౭
శ్రీమద్భగవద్గీతాంతర్గత భక్తియోగము—శ్రీ శ్రీ శ్రీ నిత్యానందస్వాములవారు ౩౪౦
అద్వైతమతము—విద్వాన్ చదలువాడ జయరామశాస్త్రిగారు ... ౩౪౨
క్రైస్తు – దివ్య సందేశ హారి—శ్రీ వివేకానందస్వామి ... ౩౪౫
సుభాషితములు—'ఉభయభాషా' 'సాహిత్యవిద్యా' ప్రవీణ:
శ్రీ అఖండం సీతారామశాస్త్రిగారు, పి. ఓ. ఎల్. ... ౩౪౬
వార్తలు, విశేషాలు ... ... ౩౪౯
గ్రంథ పరీక్ష ౩౫౧

# శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

(తృతీయ ముద్రణము)

శ్రీరామకృష్ణుని గృహస్థశిష్యులలో ఉత్తమగణ్యుడు నాగమహాశయుడు. గృహస్థ జీవనమును శాస్త్రీయముగా గడుపుచు పారమార్థికమార్గమున పురోవృద్ధిగాంచుట ఎట్లో యను విషయమును ఈయన చరిత్రము మనకు నిరూపింపగలదు.

ఆబాలగోపాలము అందఱకును అర్థముకాగల సులభశైలి. చక్కని ముద్రణము!

132 పుటలు వెల: రూ. 1-25

# అనుష్ఠాన వేదాంతము

(శ్రీ వివేకానందస్వామి ప్రవచనము)

వేదాంతమనగా విశ్వశరణ్యమగు మతసిద్ధాంతము. ఆబాలగోపాలము సమస్త దేశీయులకును సమస్తమతావలంబులకును సర్వకాల సర్వావస్థలయందును ఆ వేదాంతము ఎటుల అనుష్ఠానయోగ్యమో కన్నులకు కట్టినటుల శ్రీస్వాములవా రిందు స్పష్టీకరించి యున్నారు.

130 పుటలు (దివ్యమగు ద్వితీయ ముద్రణము) వెల: రూ. 1-25

అడ్రెసు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4



'సర్వేశ్వరుని శరణు జొరుము, అతని కృప నీ యనుభవమునకు అప్పుడు వచ్చును.'

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౩ } ౧౯౫౭-ఏప్రిల్ : దుర్ముఖి-ఫాల్గుణము, హేవిళంబి-చైత్రము { సంచిక ౧౦

ఓమ్

## శ్రీకృష్ణాష్టకమ్

వసుదేవసుతం దేవం కంసచాణూరమర్దనమ్
దేవకీపరమానన్దం కృష్ణం వన్దే జగద్గురుమ్॥ ౧

వసుదేవసుతుడును, దేవకీపరమానందుడును, కంసచాణూరుల గీటడంచినవాడును, లోకగురువు నగు, శ్రీకృష్ణదేవునకు ప్రణమిల్లుచున్నాను.

అతసీపుష్పసఙ్కాశం హారనూపురశోభితమ్
రత్నకఙ్కణకేయూరం కృషం వన్దే జగద్గురుమ్॥ ౨

అగిసె పూల వన్నె గల వాడును, ముత్యాలపేరులచేతను అందెలచేతను వెలుగొందెడు వాడును, రత్నాల చేసరములును బాహుపురులును గల వాడును లోకగురువు నగు శ్రీకృష్ణునకు మ్రొక్కుచున్నాను.

కుటిలాలకసంయుక్తం పూర్ణచన్ద్రనిభాననమ్
విలసత్కుణ్డలధరం కృష్ణం వన్దే జగద్గురుమ్॥ ౩

వంపుల ముంగురులు గల వాడును, నిండు చందురు బోలు మోమొప్పు వాడును, పళపళని కుండలాల దాల్చిన వాడును, లోకగురువు నైన శ్రీకృష్ణునకు నమస్కరించుచున్నాను.

మన్దారగన్ధసంయుక్తం చారుహాసం చతుర్భుజమ్
బర్హిపిఞ్ఛావచూడాఙ్గం కృష్ణం వన్దే జగద్గురుమ్॥ ४

పారిజాతపరిమళమును, మనోహర మైన చిఱునవ్వును, నెమలిపురితురాయియు దాల్చు చతుర్భుజునకు, లోకగురు వైన శ్రీకృష్ణునకు ఎరగుచున్నాను.

ఉత్ఫుల్లపద్మపత్రాక్షం నీలజీమూతసన్నిభమ్
యాదవానాం శిరోరత్నం కృష్ణం వన్దే జగద్గురుమ్॥ ౫

నీలమేఘశ్యాముడై యాదవుల తలమానికమై నిండార విచ్చిన తమ్మిరేకల బురణించు నేత్రాలు గల్గిన లోకగురువునకు శ్రీకృష్ణునకు దండ మిడుచున్నాను.

రుక్మిణీకేళిసంయుక్తం పీతామ్బరసుశోభితమ్
అవాప్తతులసీగన్ధం కృష్ణం వన్దే జగద్గురుమ్॥ ౬

తులసి ఘుమఘుమలతో, పచ్చ పట్టు పచ్చడపు నిగనిగలతో రుక్మిణీదేవినిగూడి క్రీడలు దేలు లోకగురునకు శ్రీకృష్ణునకు నమస్కృతు లర్పించుచున్నాను.

గోపికానాం కుచ ద్వన్ద్వ కుఙ్కుమాఙ్కిత వక్షసమ్
శ్రీనికేతం మహేష్వాసం కృష్ణం వన్దే జగద్గురుమ్॥ ౭

శ్రీలక్ష్మీదేవికి నిత్య నివాసమైన తన వక్షమున గొల్ల చెలువల కుచయుగ్మ కుంకుమము అంటియుండ మేటివిలుకాడును లోకగురువు నగు శ్రీకృష్ణునకు వందన మిడుచున్నాను.

శ్రీవత్సాఙ్కం మహోరస్కం వనమాలావిరాజితమ్
శఙ్ఖచక్రధరం దేవం కృష్ణం వన్దే జగద్గురుమ్॥ ౮

తన విశాల వక్షమును శ్రీవత్స మనెడి మచ్చయు వనమాలయు వెలుగొందించుచుండ, శంఖచక్రముల ధరించిన వాడై లోకగురువు నగు శ్రీకృష్ణదేవునకు నమోవాకము.

కృష్ణాష్టక మిదం పుణ్యం ప్రాత రుత్థాయ యః పఠేత్
కోటిజన్మకృతం పాపం స్మరణేన వినశ్యతి॥ ౯

శ్రీకృష్ణుంగూర్చిన యీ పవిత్రశ్లోకములను ఎనిమిదింటిని వేకువను లేచి పఠించి నాతనికి కోటిజన్మముల పాపములు స్మరణమాత్రముచే నశించును.



# మాలదాసరి - భగవత్సంకీర్తనఫలము

[సంపాదకీయము]

## I. మాలదాసరి దినచర్య

విష్ణుభక్తుఁ డొక మాలదాసరి యుండెను. వామనమూర్తి పూర్వ ముండిన పుణ్యాశ్రమము నకు (కురుంగుడికి) మూఁడామడల దూరమున నున్న యొకగ్రామమున అతఁడు వసించియుండెను. ప్రతిదినమును బ్రాహ్మముహూర్తమునఁ గురుంగుడికి వచ్చి విష్ణుదేవుని స్తోత్రములను మంగళకైశికిరాగమునఁ బాడుట అతని నియమము. పుట్టుకచేతఁ జండాలుఁ డైనను ఉత్తమోత్తముల యాచారమం దుండెడివాఁడు అనుట. మసిపాఁతలోఁ గట్టియుంచిన మాణిక్యమునకు నలుపు అంటనట్లు, చండాలదేహమం దున్నను. అతని శుద్ధహృదయమునకుఁ బాపము సోఁక లేదు.

కురుంగుడికిఁ బోవు నప్పుడు అతని పరికరములు — నల్లదేహమునకు ఎఱ్ఱని కన్నులకుఁ దోడు పట్టెనామములు, చమురైన తోలు చొక్కా, చమురైన టోపి, శంఖప్రతిమతో ఒకటియు చక్రప్రతిమతో ఒకటియుంగా ఇత్తడితో చేయఁబడిన చెవికమ్మలు, దివెదారికొమ్ము అను నాయుధము, తోలుతిత్తి, పసుపుపొడి గల తోలుసంచి, చేయమ్ము, మొగలాకు గొడుగు, స్వామిపాదుక, పొడుగైన గుఱ్ఱపు వెండ్రుకలతోఁ గుట్టినట్టి చీలిన చిన్న కిన్నెర, చిటితాళములు, పెద్ద పెద్ద తులసి పూసల కంఠహారము, చంకలో నొక బుట్ట.

కురుంగుడి దేవాలయమునకు సమీపమున అతఁడు తనబరువుల నన్నిటిని దింపుకొనెడివాఁడు. ఎండను గాలిని ఆఁకలిని లక్ష్యపెట్టక మధ్యాహ్నమువఱకు స్వామిప్రసాదము పంపక మునువఱకు శరీర మంతయు గగుర్పాటును చుండఁగా భగవత్ స్తోత్రములను పాడి భక్త్యుద్రేకముతోఁ దాండవ మాడుచుండును. అగ్రవర్ణములవారు కంటఁబడి రేని దూరముగఁ దొలఁగుచుండును. స్వామికి సాష్టాంగముగ మ్రొక్కును. గర్భగృహమును గడిగిన ముఱికి నీరు లోపలి తూముగొట్టి నిండి వెలికిఁ బాఱుచుండును. ఆ నీటిని శూద్రుఁడు తెచ్చి యీయఁగా మాలదాసరి దానిని ద్రాగును. అచటి శూద్రులితని దైవభక్తికి మెచ్చి తాము తెచ్చుకొన్న తీర్థప్రసాదములలోఁ గొంత యితని కిత్తురు. ఇతఁడు భక్తితోఁ దన కిన్నెరనుజాఁచి దానిపై ఆ తీర్థప్రసాదములను బెట్టించుకొని స్వీకరించి వారికి మ్రొక్కును. ప్రేక్షకులందఱును ఇంతటి యుత్తమశీలునకు మాల పుట్టుక గలిగెనే అని జాలిగొనుచుందురు.

## II. మాలదాసరి బ్రహ్మరాక్షసుని సంధించుట

ఒకనాఁడు సగమురాత్రియప్పుడు ఆ సమీపమున ఒకయింటఁ బిల్లి చొరఁబడెను. దానిని జూచి భయపడి కోళ్లు కూసినవి. తెల్లవాఱెనని భ్రమపడి మాలదాసరి కురుంగుడిస్వామి కీర్తనలు పాడుటకై, వెంటనే లేచి బయలు దేఱెను. దారిలో అతఁడు మరులుమాతంగి యను దీఁగను ద్రొక్కినాఁడు కాఁబోలు, దానిని ద్రొక్కినవారు దారి దప్పుదురు కదా. ఆ

కటికచీఁకటిరాత్రి అతఁడు దారి దప్పి ఎన్నో చోట్లు తిరిగి తిరిగి తూర్పు తెల్లవాఱు నప్పటికి ఒకనిర్జనారణ్యమును సమీపించి అందుఁ బోఁదొడంగెను.

అది యొక పాడువడిన చోటు. ద్వార పార్శ్వములు కూలిపోయి, ఆ చోట పొట్టి రేఁగులు, కసివెందలు, కోరిందలు పొదలుగా బలిసి యుండినవి. గాదెలు పడిపోయి యుండినవి, వాని క్రింది బొక్కలలో ఆఁకలిచే నకనకం బడుచున్న పందికొక్కులు అప్పటి కప్పుడు కాఁపుర ముండినవి. బావులును పాఁత గోతులును దుమ్ము పడి సగము పూడిపోయి యుండినవి. వాని నోళ్లకు మూఁతగా చిగిరింత పెరిఁగి యుండినది. చీమలు గుసుకువరిగింజలను ఈడ్చుకొని పోవునప్పుడు దారిలో సారము చచ్చిన యా కంచెలలో అవి పడి మొలచి వెన్నులు పెరిగి పండి ఎండి రాలి అణఁగిపోయి యుండినవి. పెంటల మీఁద పెరిఁగిన దొగ్గలి చెట్లలో ముసలిపిల్లులు ఆఁకలిచేత నొగిలి కడు పంటుకొని పోయి మీసాలను సైతము కదల్పక పడి యుండినవి. పొలము లుండిన తావులలో గాదము (కసవు) పెరిఁగినది. మళ్లలో ఔరు దుబ్బులు మెండుకొన్నవి. ఏతాలు నాశమై అవి యుండిన తావులందు వాని రాడులు మాత్రము మిగిలి ఒరిగి యుండినవి.

అట్టి పాడుప్రదేశమున మాలదాసరి పోవుచుండెను. దారిలో తప్పి నడచుచున్నందున ఉత్తరేని కాయలు పల్లేరు కాయలు అతని కాళ్లకు గ్రుచ్చుకొనుచుండినవి. వాని నతఁడు ఉపాయముతో తుడిచి తొలఁగించుకొనుచుం బోవుచుండెను.

ఎదుట అతనికి పెద్దమఱ్ఱిచెట్టొకటి కానిపించెను. దానికి రెండేసి క్రోసులు నిడివి గల యూడలు దిగి యుండెను. వాని పైభాగముల నుండి కొమ్మలు మొలచి యుండినవి. ఆకొమ్మల నుండియు కొమ్మలు మొలచి యుండినవి. ఆ మహాసముదాయములో గాలి చరించుచుండినది. గాలివేగముచేత ఆకులు ఎగిరిపోయి దూరమున వచ్చుచున్న బాటసారుల యెదుటఁ బడుచుండును. ఆ యాకులలో పురుగులు తొలఁచిన గీఱలు అక్షరపంక్తులవలె గానవచ్చుచుండును. ఆగీఱలతోడి యాకులు "అయ్యా, మీరు నాకడకు రావలదు. నాయందు బ్రహ్మరాక్షసుఁ డొకఁ డున్నాఁడు, చెంతకువచ్చితి రేని వాఁడు మిమ్ము చంపి భక్షించును" అని బాటసారులకు మఱ్ఱిచెట్టు వ్రాసిపంపిన హెచ్చరిక జాబులు కాఁబోలు నని తలంపఁదగి యుండెను. ఆ జాబులను జదువుకొనియే కాఁబోలు అని తలంపఁ దగినట్లు బాటసారులు ఆ చెట్టును సమీపింపక దూరమునుండియే తొలఁగిపోవుచుందురు. అట్లు హెచ్చరించి రానీయకుండ ఆఁపి బాటసారుల ప్రాణములను గాపాడుట మహాపుణ్యము కదా ఆ పుణ్యముచేతఁ గలిగిన ఫలములే కాఁబోలు ఇవి అని తలంపఁదగినట్లుగా ఆ చెట్టునిండ లెక్కలేనన్ని ఫలములు (=పండ్లు) ఒప్పుచుండినవి.

మాలదాసరికి ఆ మఱ్ఱిచెట్టు అగపడుట కాదు, దానియొద్దకుఁ జేర్పు కాలిబాటయు ఒకటి అగపడినది. ఆ పాడుసీమలో దారి దొరకుటే మహాలాభముకదా, కావున అతఁడు వేగముగ ఆసుర్గంధపు దారిలో మఱ్ఱిచెట్టును సమీపించెను.

అచ్చట మొద దంతెయు జూటి పాఱవైచిన పుట్టెలు మెండుగఁ బడి యుండినవి, అవి ఎల నీటిని త్రాఁగి మూఁగడవంటి లేఁతకొబ్బెరను గీఁకి గీఁకి తిని పాఱవైచిన టెంకాయ బొండ్ల

ములవలె నుండెను. అట్లే పండ్లతో మాంసమును నిశ్శేషముగా గీఱి గీఱి తినఁగా ఏర్పడిన జీరలు గలిగి ఇంకను పచ్చి యంతయు ఆఱని యెముకలు పడి యుండినవి. ఈఁగలతుట్టెలు నొనదొన యని క్రమ్ముకొని క్రిక్కిఱిసి యున్నం దున స్వరూపమే కంటి కగపడని పచ్చితోళ్లు కంపల మీఁద వ్రేలుచుండినవి. భక్షితులైన నరుల తలవెండ్రుకలు తిప్పలుగ పేఱి యుండినవి. ధూళి నిండుటచే ఆవెండ్రుకలు ధూమ్రవర్ణముగలవై గాలికి రేఁగుచు ఆడుచుండినవి. అది ఎట్లుండె ననఁగా మంగలవాండ్రు గొఱిగిన తలవెండ్రుకలను ఒక్కొక్కచోట తిప్పలుగా వేసిన, అవి గాలికి రేఁగిన ఎట్లుండునో అట్లుండెను. అక్కడక్కడ నరుల యవయవములు తెగి పడియుండినవి. వానిని కఱచుకొని పోవుచున్న ఘాతుక మృగములు ఒకదానితో నొకటి పెనఁగులాడు చుండినవి. వాని కాళ్ల త్రొక్కిళ్లచేత దారి నలిగి కంపు దుస్సహమగుచుండెను. అవి కాక గ్రద్దలును గుంపులు గుంపులుగ నుండినవి.

ఎముకలను కఱచుకొని పాఱిపోవుచున్న ఆడుఁగుక్కలు మఱ్ఱిచెట్టుమీఁదికి దొంగచూపులను సఱపుచుండినవి. మాంసఖండముల తోరణములను లాగుకొని పోవు గ్రద్దలను ఆ చెట్టుకొమ్మలే ప్రహరించుచుండినవి, ఆ దెబ్బలకు గ్రద్దలు రొద పెట్టుచుండినవి. కొమ్మలమీఁద ఇటు నటు తిరుగాడుచున్న కోఁతులును ఎవరివో అఱచేతి దెబ్బలు తిని నడుములు పట్టుకొని యేడ్చుచుండినవి. ఉన్నట్లే ఉండి చెట్టున కొన్నిచోట్లు మాయ మగుటయు మఱల అగపడుట యుగా ఏవో మాయావ్యాపారములు జరుగుచుండినవి. వీని నెల్ల పరికించి ఆ దాసరి తన మనస్సులో ''ఈ చెట్టుమీఁద ఎవఁడో ఒకఁడున్నాఁడు, ఇది కట్టెల కనియు ఆకుల కనియు మనుష్యులు వచ్చు వేళ కాదు. కాఁబట్టి వాఁడు మనుష్యుఁడు కాఁడు, అదిగాక మాంసపుగాలి వీచుచున్నది. నేను చాలదూరము వచ్చితి నే'' అని భయసంశయవ్యాకులుఁడయ్యెను.

చూచుసరికి ఆ దాసరికి చెట్టుమీఁద ఒక బ్రహ్మరాక్షసుఁ డగపడెను. అతఁడు ఒక నరశవమును గోఁచిగా కట్టుకొని యుండెను. పొడుగు చాలియుండ జాలని యా పీనుఁగును లాఁగి బిగించుకొనుటలో బొడ్డుమీఁదికిని మొలత్రాటిమీఁదికిని నెత్తురు చిలి యుండెను. ఎఱ్ఱని దుప్పటి కప్పుకొన్న యతని నల్లని శరీరము ఎఱ్ఱచీమలచే దట్టముగ క్రమ్ముకొనబడిన వంపు గింజల జీడిచెట్టువలె నుండెను. వాని మొగము తలక్రిందులుచేసిన యేనుఁగుతలవలె నుండెను. వ్రేలు గడ్డమును మీసములును అంతయు ఒకటిగా నిలువుగా తిరిగి కందురీగల నిడుద తుట్టెవలె గోరోజనపు వన్నె గలిగి యుండెను. అంచు చొంగచే మఱుఁగువడిన భాగము కొంత తెలుపుగ నుండెను. ఆఁకలి కుండ లేక ఆహారమున కని యతఁడు ఉబలాటపడుచుండెను. ఎవఁడైన బాటసారి దారి తప్పి ఆచెట్టుకడకు వచ్చుచున్నాఁడో చూత మని అతఁడు పైకొమ్మల కెక్కుచుండెను. తన వ్రేవుల జందెము మాటిమాటికిని జాఱి పడిపోవుచుండ, కోపముతోను విసుగుతోను దానిని భుజములమీఁది కెక్కించుకొనుచుండెను. అతనికి వేలు బొజ్జయు, బూరకాలును చెంబుతలయు నుండెను పెడతలయందలి గుంటలో కొంచెము జుట్టు మొలచి యుండెను. కన్నులలో కండలు యుండినవి. అతఁడు ఆఁకలికి ఓర్వ లేక పిశాచికలను బండతిట్లు తిట్టుచుండెను. కొండంత

బరువు వాఁడు, పేరు కుంభజానుఁడు, పేరికి తగినట్లు అతని మోకాళ్లు కుండలవలె నుండెను.

## III. రక్షశ్శ్వపాకుల పోరు

మాలదాసరిని జూచి బ్రహ్మరాక్షసుఁడు "నాకంటఁ బడితివి, ఇఁక నీవు తప్పించుకొని పోలేవు, నిలు" మనుచు చెట్టునుండి దూఁకెను. దూఁకిన వేగమునకు చెట్టుకొమ్మలు ఎన్నియో పొడిపొడి యైనవి. మాలదాసరియు పరాక్రమమునకు ప్రసిద్ధుఁడును శూరుఁడును గావున నిల్చి తనచేత నున్న బాణమును బ్రహ్మరాక్షసునిపై విసరెను. రాక్షసుఁడు దానిని ఖండించి వేసెను. అంత ఇరువురకును బాహుయుద్ధము జరిగినది—

రాక్షసుఁడు దాసరిని లాఁగినాఁడు. దాసరి తాను తావునుండి చలింపక రాక్షసుని బొమ్మపై ప్రహరించి ఆవలికిలంఘించెను. రాక్షసుఁడు దాసరిని ప్రహరించెను. ఆ దెబ్బను ఉపాయముచేత తప్పించుకొని దాసరి రాక్షసుని వెనుకవైపునకుఁ జేరుకొని అతని తరువాతి యెత్తులను కనుపెట్టి యుండెను. రాక్షసుఁడు దాసరిపైఁ బడెను. దాసరి రాక్షసుని చనుమరలపై పిడికిటి పోట్లను గుప్పించి లోఁబడక నిలిచెను. రాక్షసుఁడు దాసరి బొమ్మమీఁదికి ఆక్రమింపఁజూచెను. కాని దాసరి వంగి తప్పించుకొని పిడికిటి పోట్లు పొడుచుచు రాక్షసుని సమీపమునకు రానీయలేదు. రాతినోరప్పనో అందుకొనిదానితో దాసరిని తెగటార్త మని రాక్షసుఁడు వెదకుచుండెను. దాసరి వానిని పిడికిటితో ఒక్కపోటుపు పొడిచి తన్ని, అతఁడు తనమీఁదికి తిరుగునప్పటికి సిద్ధముగ నుండి, సందు చూచుకొని వీపుమీఁదను నడుముమీఁదను కొట్టి దేవుని స్మరించుచు పాఱిపోఁజూచెను. రాక్షసుఁడు తన స్త్రీజనమును పిలిచి తోడ్పఱచుకొని ఎట్టకేలకు మాలదాసరిని పట్టుకొనెను.

పట్టుకొన్నను ఆ దాసరి బలీయుఁడగుట చేత రక్కసుని కాళ్లతోఁ దన్నుచు మోచేతులతో ఇరువైపులం బొడుచుచు పెనఁగులాడుచునే యుండెను. అయినను రాక్షసుఁ డతనిని బట్టుకొని మఱ్ఱిచెట్టుక్రిందికిఁ దెచ్చి ఇట్లనెను.

## IV. రక్షశ్శ్వపాకుల సంవాదము

రాక్షసుఁడు — ఓరీ, నీవు క్రొవ్వి యున్నావు. నీ తలను కత్తితో మెడనుండి ఖండించి, నీ మొండెమునుండి దుమికెడు రక్తమును వేఁడి ఆఱనీయకయే నా దప్పి తీఱునట్లును పంచప్రాణములును తనియునట్లును, బలే రుచితో త్రాగెదను. నీ మాంసములను కఱకఱట్లుగాఁ గాల్చి నా భార్య పిశాచి నాకుఁ దెచ్చి యిచ్చును. వానిని నంజుకొనుచు ఇక్కడి పుట్టల నిండ నున్న తాటి కల్లును త్రాగెదను. అదియుఁగాక నీవు నన్ను ఇంతగా శ్రమపఱచితివి గావున నిన్ను తిన్నఁగాఁ జంపను, చిత్రవధ చేసెదను [అనుచు, అఱచుచు, బుసకొట్టుచు, దప్పి చేత గొంతు అస్పష్ట మగుచుండ, కత్తిని రక్తమును పట్టుటకు పాత్రమును దెమ్మని అనుచరులం బంపి, పసరమును కట్టి త్రోయునట్లు మాలదాసరిని కట్టి త్రోసెను. దాసరి ఆ చెట్టుమీఁదికి ఒరిగి నిర్భయముగ ధర్మమును దెలుపుచు ఇట్లనెను:—]

మాలదాసరి — రాక్షసుఁడా, ఒక మాట వినుము, త్వరపడకుము, నిన్ను జయించుటకు దేవతలకైనను శక్యము కాదు, నీకుఁ జిక్కిన నేను ఇఁకఁ దప్పించుకొని పోలేను.

మఱి, కొంతసే పైనను నీతో ఎదిరించి యెందులకుఁ బోరాడితి వనఁగా — చంప వచ్చు వానిని తన శక్తి కొలఁది యెదిరింపక లోఁబడి చచ్చువానికి ఆత్మహత్యాదోషము గలుగును గావున. అందుకై పోరాడితిని. అంతమాత్రమునకు నీవు కోపపడకుము. నాకు శరీరము మీఁద ఆశ లేదు. శరీరము నకు వినాశము తప్పదు గదా. రోగము, దయ్యము, తేలు, విషము, గొప్ప మనో వ్యథ, జలము, బందిపోటు, ఘాతుక మృగ ములు, కారుచిచ్చు, ఘోరవ్యసనము, పుండు, త్రాచు, పిడుగు — మొదలయిన వీనిలో ఏయొక్కటి యైనను ఉన్నఁ జాలును, శరీరత్యాగము ఘటిల్లును, అట్టి శరీరమును ఆఁకలి గొన్న యొకని కాహార ముగ అర్పించి సార్థకపఱచుట ఎంతో మేలు గదా. నాదేహమును నీకు ఆహార ముగ ఒసంగుటచేత నాకు ఎంత మేలో చూడుము — ఈ చండాలజన్మము తొలఁ గును, ఒక ప్రాణి ఆహారము దిని సంతో షించును, నాకు మోక్షము గలుగును. ఈ సందర్భమున శిబిచక్రవర్తి మనకు ఉత్త మోత్తమోదాహరణము. ఆయన పావుర మునకు బదులుగా తన దేహమును కోసి కోసి డేఁగకు అర్పించినవాఁడు గదా.

అది యట్లుండ నిమ్ము — మఱొక మాట వినుము. ఇది ప్రాణిహితము కోరి చెప్పు మాటయే కాని నేను ప్రాణముతో దప్పిం చుకొని పోవుటకు చెప్పు మాట కా దను టకు అంతరాత్మయే సాక్షి. కరణ కళేబర ములును వివేకమును మానవులకువలె మీకును ఉండులే కాదు, కరణకళేబరాది పాటవము మానవులమగు మాకంటె మీకు ఎక్కువగఁ గూడ నుండును. స్థావరముల కంటె కీటాదులకును, వానికంటె మృగాదు లకును, వానికంటె మఱి పశుపతంగాదుల కును, వానికంటె మానవులకును, మాన వులకంటె రాక్షసులకును కరణకళేబరాది పాటవమును విజ్ఞానమును హెచ్చు. అట్టి నీవు ప్రాణిహింసను జీవనాధారముగఁ జేసి కొనుట తగదు. అట్టి బ్రతుకు ఘాతుక మృగములకు మాత్రము తగినదై యుండును. హింస పాతకము, అది పరలోకమున తప్పక బాధించును, పరలోకప్రాప్తి రాక్షసుల కైనను తప్పదు గదా. వారు మానవుల కంటె అతిదీర్ఘకాల మెక్కువగ జీవింతు రనియే కాని ఏనాఁటి కైనను మరణము తప్పించుకోలేరు. రాక్షసులును దేవతలును భ్రాత లయినను వారికి తైజస మగు తార తమ్య మున్నది. రాక్షసులు తమఃప్రధా నులు. దేవతలు సత్త్వప్రధానులు. రాక్ష సులు అపవిత్రాహారులు, దేవతలు పవిత్రా హారులు. కావున దేవతలు రాక్షసుల కంటెం గూడ ఎక్కువకాలము జీవింతురు. బ్రతికినన్నాళ్లు దేవతలను బీడించిన రాక్ష సులు తాము ముందుగాఁ జచ్చి తమచేత అందనుక పీడింపఁబడుచుండిన యముని చేతికే చిక్కుదురు. దేవతలకుఁ గల పవి త్రతచేతనే చంద్రుఁడు తన యమృత మయ శరీరమును వారి కర్పించుచున్నాఁడు. దీని నెల్ల యోచించి నీకుఁ దోఁచినట్లు నడచు కొనుము,

రాక్షసుఁడు — [కహ కహ నవ్వి] నేనును శాస్త్రములు చదివిన వాఁడనే. నేనును వేదములు వల్లించిన వాఁడనే, అవన్నియు నాకు నచ్చ లేదు. నీవు ఆ దేవతలను బాగ

డితివి, వారు బ్రహ్మాంశ సంభూతు లంటివి, మమ్ము వారి భ్రాత లంటివి, వారు అమృతాహారులు గాని మావలె అపవిత్రభోజనులు గా రంటివి. చంద్రకళలను భక్షించుటలో మొదటివంతువాఁ డయిన యగ్ని సర్వభక్షకుఁడు గదా, మేము అతని యాచారమునే అవలంబించితిమి. కావున ఇందు దోష మేమియు లేదు. ఎవరికి ఏ యన్నమైనను జాత్యన్నముతో సమానము కాదు. గొప్పవాఁడైన గరుత్మంతుఁడు ఉత్తమాన్నమయిన యమృతము నిచ్చివేసి, బదులుగా పాములను ఆహారముగఁ గోరుకొన లేదా. నిద్రాహారములు మాని నేను జదివిన చదువంతయు వ్యర్థమే. అందులోని వన్నియు ఉదాహరణార్థ మయిన మిథ్యాకల్పనలే. ఎవఁడు దీనిని విని మోసపోవును? నీ చదువును బ్రకటించుకొందు వేని, నిను జంపి వండి తిను నప్పుడు 'ఈ చదివిన కూర చాల రుచిగా నున్న' దను మెప్పును గాంతువు. అది తప్ప వే ఱొక మెప్పు నీకుఁ గలుగదు.

మాలదాసరి — [తనలో] నాస్తికమతమును అవలంబించి ఇతఁడు నా మాటను గేలిసేయుచున్నాఁడు. ఇంకను జర్చించిన ఇంతకంటె వినరాని మాటలను ఏమే మాడునో, మీఁద కార్యము గల నాకు ఇతనితో వాదింప వలసిన యక్కఱ లేదు. [అనుకొని, ఇచ్చకముల చేతనే గాని మూర్ఖుఁడు లోఁబడఁడు గావున హృదయమున వాసుదేవు నిడుకొని — అతనితో:—] నీవు సర్వజ్ఞుఁడవు, నేను నరుఁడను, హీనకులుఁడను, శాస్త్రముల నభ్యసించిన వాఁడఁ గాను. నీకు బదులు చెప్పు సామర్థ్యము నాకు లేదు. నామాటలలో ఏ దేని తప్పున్న క్షమించి నా ప్రార్థనమును నెఱవేర్పుము. రాక్షసులలో నీకు ఇప్పటికే ఎంతో కీర్తి ఉన్నది. నీ కీర్తి ఇంకను హెచ్చునట్లు నేను చేసెదను. నీకు నా దేహమును తప్పక అర్పింతును. నేను నిత్యమును తప్పక ఆచరించునట్టి వ్రత మొకటి గలదు. అది ఈ దినము జరుగునట్లు నీవు సాయపడుము. ఏడు మాటలు ఆడిన వారికి చెలిమి కలుగు నన్న సుద్ది ప్రకారము మనకుఁ జెలిమి కలిగినది. ఆ చెలిమిని స్మరించి నా కోరికను నెఱవేర్పుము. నా ప్రతిదిన నియమము ప్ర ఈ సమీపపు కుఱుంగుడికి పోయి అందలి నారాయణునకు స్తోత్రములు పాడి ఆ సేవ ముగిసిన తర్వాత వచ్చి నీకు ఆహారమ నయ్యెదను. ఆహారము నగుట తప్పదు.

రాక్షసుఁడు — [చిఱునవ్వుతో అతని చెంపపై గొట్టి] బలే మోసము చేసితివిరా, శక్తి గ లంత కాలము దారిదోపిళ్లు చేసి ఈ నాఁటికి ఇది సులభ జీవన మని లేని వైరాగ్యమును నటించుచు, దాసరివేషము వేసికొంటివి. మోసము చేయుటకు మంచి పొందికగా మాటలు కల్పించితివి. నేనా మోసపోవువాడను? ఎవఁడుగాని నోటి ముందటి కబళమును వదలుమన్న వినఁడు. ఎవఁడును తన ప్రతిజ్ఞను నెఱవేర్చుకొనుటకై శరీర మర్పింత మని మఱలి రాఁడు. పోయితి వేని నీవు రావు. నిన్ను నేను పోనీయను. ఇవి రెండును నిశ్చితములే. పెక్కు మాటలు, విచారములు, దుఃఖములు ఎందులకు?

## V. విష్ణుపారమ్యప్రభావము – దాసరిసత్యనిష్ఠ

రక్కసుఁ డన్న మాటకుఁ జెవులు మూసి కొని, ఆ దురాలాపములు వినిన పాపము పోవుటకై నారాయణ నామోచ్చారణము చేసి, ఆ దాసరి, "ఊరక నన్ను నమ్మకున్న ఒట్టు పెట్టెదను నమ్ముము" అనెను. ఒట్టుపెట్టుకొనుటకు రాక్షసుఁడు ఒప్పుకొనెను గాని, వేనవేలు ప్రమాణములు చేసినను వశపడ లేదు. కడకు దాసరి ఇట్లనెను — "నేను ఏ విధాన నైనను ఈదినము మఱల నీకడకు రాకపోయితినా, సృష్టి స్థితి లయకారుఁ డైన విష్ణువుతో వేఱొక వేల్పును సాటి చేసిన పాపానం బోదును". ఈ శపథమునకు రక్కసుఁడు ఒప్పుకొని అతని కట్లను ఊడ్చి వైచెను. ఇందు విష్ణువునకు మఱియే వేల్పును సాటి కాఁ డను వైష్ణవ సిద్ధాంతమును, సాటి ఒకఁ డున్నాఁ డని తలంచుటయు పాప మనెడి విశేషమును, విష్ణుపారమ్యమును స్మరించినంత మాత్రముచేతనే దాఁట రాని యడ్డంకులు తొలఁగి పోవు నను రహస్యమును స్పష్టపడు చున్నవి. ఆ దాసరికి ఏ పాప లేశము శేషించి యుండెనో దాని ఫలమే రాక్షసునిచేత చిక్కుకొనుట. ఫల మనుభవించి నంతనే ఆ పాపలేశము ఱిఱి విష్ణుపరత్వస్మరణముచేత బంధ విముక్తి గల్గెను. అంత నాతఁడు కురుంగుడికి పోయి విష్ణుదేవుని కీర్తనలను ఆయన మెచ్చుకొను నట్లు పాడి, అసత్యదోషము తన కెక్కడ గల్గునో అని దిగుల్పడుచు వేవేగ రక్కసు నొద్దకు వచ్చి తన వ్రతము పూర్తి యైన సంతోషముచేత వానితో ఇట్లు వక్కాణించెను — "నావ్రతము నెఱవేఱినది, నాకు మోక్షానుభూతి చేకూడినది, ఇఁక నాకు బంధ భీతి లేదు. నేను నిన్ను మోసగింప లేదు. పంపు నప్పుడు నా యవయవములు ఎట్లుండినవో ఇప్పుడును అట్లే ఉన్నవి చూచుకొమ్ము" అని.

(సశేషము)



మఱవకో మానసంబ, సదా స్మరింపు, నిజపుఁజుట్టము లేఁడు నీ కొక్కఁ డైన;
ఈ జగంబున నీదు త్రిప్పట వృథయె; మాయజాలములో నిమగ్న మా నీవు
మఱువ కండుము లోకమాతృ నామమును. భూమిలోని నరులు పూజింతురు నిను
స్వామి యంచుఁ, దమదు పాలకుఁడ వని; మూఁడు నాళ్లె యగు నా ముచ్చట లెల్ల,
కాలదేవత నినుఁ గట్టి యీడ్చినను; ఇపు గౌరవముల నింత గాంచెడిది
నీ మేను విడువక నీవుఁ దప్పెదునె? బ్రతికి నన్నాళ్లు నీ భామకై నీవు
ఎంత గాసిలి యున్న నే మాను తుదకు? నీ వెంట రా దామె; నీ మేని నామె
ఎల్లరం బోలి తా నేవగించుకొని విడిచి యేగును నిను వీడ్కోలు పొంది.

—శ్రీరామకృష్ణసూక్తిసుధ VIII.



# విగ్రహవ్యావర్తని

డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఎం. ఏ., ఎం. లిట్., పిఎచ్. డి.

(గతసంచిక తరువాయి)

27. మాయానిర్మిత మైన స్త్రీయొక్క స్వరూపమును గమనించి, ఆమె నిజముగా నున్న స్త్రీయే అని భావించి, ఆమెపై మోహము కల్గినవాడెట్టి వాడో అట్టి స్థితికిచెందిన వాడే ధర్మములు స్వభావసహితములని గ్రహించుచున్నాడు.

మాయావశమున నిర్మింపబడిన స్త్రీని స్వభావశూన్య మైన స్త్రీ యని తెలియనగును. ఇట్టి స్త్రీని వాస్తవ మైన స్త్రీగా గ్రహింపగా ఆమెపై అనురాగ ముదయింప గలదు. ఇట్లే అవిద్యావశమున ధర్మములు స్వభావసహితములుగా గోచరించుచున్నవి, వస్తుతఃఅవి మాయాస్త్రీవంటివి. ఈ భ్రమను నివారింప దలచి తథాగతులు, బోధిసత్త్వులు, శ్రావకులు బయలుదేరి మాయాపురుషులను, స్త్రీలను సృష్టింతురు. ఈ మాయాస్త్రీవలె శూన్యము లైనవి మాటలు. ఈ నిర్మితక స్త్రీ సదృశము లైనవి నిఃస్వభావము లైన సకల భావములు. ఈ భావములు స్వభావసహితములైనట్లు గోచరించుటచే, ఈ భ్రమజ్ఞానమును నివారించుటకు మాటల నుపయోగించుచున్నాము. కావున నిర్మితక దృష్టాంతము శూన్యతను మాత్రమే సాధించునదని స్పష్ట మగు చున్నది.

28. ఆక్షేపవాక్యములో చెప్పిన హేతువు సాధ్య సమ మగుటచే సరియైనది కాజాలదని కూడ మధ్యమకులు వ్యావహారికసత్యత నంగీకరించి చెప్ప వీ లున్నది.

'శబ్దము చేయకుము' అని ఒకడింకొకరి శబ్దమును వారించుచున్నాడను వాదమున సాధ్యసమ మగు హేతువు గలదు. ఏ సిద్ధాంతమును ప్రతిపాదింపబోవుచుంటిమో దానితో సమ మైన హేతువు సాధ్యసమము. సర్వభావస్వభావప్రతిషేధవాద మీ శబ్దప్రతిషేధవాదముతో తుల్య మైన దనుటలో సాధ్యసమదోష మున్నది. ధర్మముల నిఃస్వభావత కంటె విలక్షణ మైన హేతు విచట లేదు. ఈ హేతువు కూడ హేతుప్రత్యయ జనిత మగుటచే స్వభావశూన్యమే యగును. అది స్వభావశూన్య మైనను శబ్దము వాస్తవముగా నున్న దని, ఒక శబ్దము మరియొక శబ్దమును త్రోసివేయ గలదని వాదించుటలో స్వవచనవిరోధనము కన్పుః గలదు. మధ్యమకుల వాదము మాత్రము వ్యావహారిక సత్యమును త్రోసివేయునదిగాని, దానికి విరుద్ధ మైనది కాని కాదు. వ్యావహారికసత్యత నంగీకరించువారే సర్వధర్మస్వభావశూన్యతను ప్రపంచింప గలరు. వ్యావహారికసత్యతను ఒప్పుకొనక పోయినచో తత్త్వోపదేశమే కుదరదు గనుక

'వ్యవహార మనాశ్రిత్య
పరమార్థో న దేశ్యతే

పరమార్థ మనాగమ్య
నిర్వాణం నాధిగమ్యతే'

అని మధ్యమక కారికలలో (24-10) చెప్పబడినది. వ్యావహారిక సత్యము నాశ్రయింపక పోయినచో పరమార్థమును తెలుప వీలులేదు; పరమార్థసత్య మవగతము కానిచో నిర్వాణ మనుభూతము కా జాల దని ఈ కారిక తెల్పుచున్నది. కావున సర్వభావములు శూన్యము లని, సర్వభావములు నిఃస్వభావము లని చెప్పు వాదములు రెండును అభిన్నములే.

29. నాల్గవకారికలోని ఆక్షేపమున కిచట సమాధానము చెప్పబడుచున్నది.

మధ్యమకుని ప్రతిజ్ఞా వాక్యము వాస్తవముగా నున్న ధర్మ మైనచో నతని వాదము దోష సహితము కా గలదు. కాని ఆప్రతిజ్ఞా వాక్యము వాస్తవముగాశూన్యమైనది గనుక అం దే దోషమును లేదు.

ప్రతిజ్ఞావాక్యమనునది సత్పదార్థమైనచో దానికి ప్రతిజ్ఞాలక్షణముండగలదు. అప్పుడది స్వభావసహితమగును. కాని అట్టి వాస్తవమైన ప్రతిజ్ఞావాక్యమనున దేదియు మధ్యమకులకు లేదు. సర్వభావములు శూన్యములైనపుడు ప్రతిజ్ఞావాక్యమనునది మాత్రము శూన్యము కాకుండ ఎట్లుండగలదు?

30 నుంచి 52 వరకుగల కారికలలో 5, 6 కారికలలోని ఆక్షేపములకు ప్రత్యుత్తరము లీయబడినవి.

30. ఏదేని ఒకటి ప్రమాణములద్వారా ఉన్నదనిగాని, లేదనిగాని చెప్పగల అవకాశ మున్నదని అంగీకరించినప్పుడే ప్రత్యక్షాది ప్రమాణములను స్వీకరింపవలసియుండును. అప్పుడు సిద్ధాంతమున దోషములుండుటకు వీలుండగలదు. కాని ప్రమాణములద్వారా ప్రతీయమానమగునది లేదని వాదించు మధ్యమకుల వాదమున నెట్టి దోషముండగలదు?

కొన్నిధర్మములుగాని, వస్తువులుగాని ఉన్నవని అంగీకరించినపుడే వీనిని తెలిసికొనుటకు ప్రత్యక్షము, అనుమానము, ఉపమానము, ఆగమము అను ప్రమాణములను గ్రహింపవలసి యుండును. ఈ నాలుగు ప్రమాణములు సద్వస్తువులైనపుడు, విధినిషేధవాక్యములనుప్రతిపాదింప వీలున్నదని అంగీకరించినపుడు మధ్యమకవాదము దోషభూయిష్ఠముకాగలదు. కాని ఏ ధర్మమునుగూర్చియైనను అది ఉన్నదనికాని, లేదనికాని చెప్ప వీలులేదని మధ్యమకవాదము. విధినిషేధములు రెండును కుదరవని మధ్యమకులు పల్కినపుడు వారివాద మసంగత మనుటయే అసంగతము కాగలదు. ప్రత్యక్షాది ప్రమాణములుకాని, అవి తెలుపు వస్తువులుగాని లేవనినపుడెట్టి దోషము మధ్యమకున కాపాదింపబడజాలదు.

31. ధర్మములున్నవని ప్రమాణములు ఋజువుచేయగలవని, ఆధర్మములు ప్రమాణముల ద్వారామాత్రమే సత్యములని స్థాపింపబడగల వని దార్శనికులు కొందరందురు. కాని ఈ ప్రమాణములు సత్యములని ఋజువుచేయగల ప్రమాణ మెక్కడ లభింపగలదో ఈదార్శనికులు చెప్పవలసియున్నది.

తెలిసికొనబడు విషయమును ప్రమేయ మందురు. ఏసాధనముద్వారా తెలిసికొనుచున్నామో ఆ సాధనమును ప్రమాణమందురు. ప్రమాణములద్వారా ప్రమేయములు తెలియబడుచున్నవని యనినచో ఈ ప్రమాణములను గూర్చిన జ్ఞానము మనకెట్లు కలుగుచున్నదో చెప్పవలెను. ప్రత్యక్షము, అనుమానము ఉప

మానము అనునవి ప్రమాణములని, ఈప్రమాణములున్నవని గాని, ఇవి సత్యములనిగాని తెలుపు సాధనమేదైనగలదా? అట్టి సాధనము లేనియెడల ఈ ప్రమాణములకు ప్రామాణ్యము లేదనవలెను. అప్రామాణికములైన ప్రమాణములు ప్రామాణికమగు జ్ఞానము నీయగలవనుటలో స్వవచనవిరోధమున్నది. నిష్ప్రామాణికములగు ప్రమాణములు యథార్థజ్ఞానము నీయగల్గినవనుటకుదురదు. ప్రమాణముల ప్రాదుర్భావమే ప్రామాణికముకానిచో, ప్రమాణములుగాని, అవి తెలుపు ప్రమేయములను గూర్చిన జ్ఞానముకాని కుదురదు.

32. ఒక ప్రమాణముయొక్క ప్రామాణ్యము మరియొక ప్రమాణముపై ఆధారపడియున్నదనినచో అనవస్థాదోషము వాటిల్లగలదు. అనవస్థాదోషమువలన ఆదిప్రమాణముకాని, మధ్యలోగల ప్రమాణములుకాని, అంత్యస్థితికాని సిద్ధముకాజాలదు.

ప్రమేయములను స్థాపింపగల ప్రమాణమును మరియొక ప్రమాణము స్థాపింపగల్గినచో, దీని ప్రామాణ్యము మరియొకదానిపైన, దాని యాథార్థ్యమింకొకదానిపైన ఆధారపడియుండగలదు. ఈ రీతిగా ఒకదానియాథార్థ్యము నింకొకటి స్థాపింపగలదేకాని స్వతః సిద్ధమైనదేదియు నుండదు. అప్పుడు ఈ ప్రమాణపరంపర అనవస్థాదోషమునకు గురికాగలదు. అప్పుడు ప్రమాణముల కన్నిటికిని ఆధారభూతమైన మొదటి ప్రమాణముగాని, ఈ ఆశ్రితములైన ప్రమాణములుగాని, వీనివలనకలుగు విషయజ్ఞానముగాని సిద్ధింపవు. ఆధారమైన మొదటి ప్రమాణము లేనప్పుడు మధ్యప్రమాణములుగాని, చివరవిగానినుండజాలవు. మొదలు లేని వస్తువు అత్యంతము శూన్యమే కదా!

కావున ఒక ప్రమాణముయొక్క ప్రామాణ్యము అన్యాశ్రితమని చెప్పు పరతః ప్రామాణ్యవాదము సర్వథా అనుపపన్నము.

విజ్ఞానవాద బౌద్ధులు, నా[illegible]లు పరతః ప్రామాణ్యవాదులు.

33. అన్యప్రమాణముల నపేక్షింపకయే ఒక ప్రమాణము ప్రామాణికమని చెప్పినచో పూర్వపక్షవాదము నిర్మూలముకాగలదు. అప్పుడు ప్రతిజ్ఞాభంగము వాటిల్లగలదు గనుక వేరొకహేతువును తీసికొనవలసిన అవసరమున్నది.

పూర్వపక్షవాదము న్యాయభాష్యకారుడగు వాత్స్యాయనునిది. న్యాయదార్శనికులు పరతః ప్రామాణ్యవాదులేగాని, స్వతః ప్రామాణ్యవాదులుకారు. స్వతఃప్రామాణ్యమును సాంఖ్యులు, పూర్వమీమాంసకులు, వ్యావహారిక సత్య విషయమున అద్వైతవేదాంతులు అంగీకరింతురు.

అన్యప్రమాణాపేక్షలేకయే ప్రమాణసిద్ధి గలదని తద్ద్వారా ప్రమేయసిద్ధిగలదని వాదించుట స్వతః ప్రామాణ్యవాదము. దీనిని నైయాయికు లంగీకరించిరేని కొన్ని ప్రమేయములకు పరతః ప్రామాణ్యము, కొన్నిటికి స్వతఃప్రామాణ్యము గలదని వీ రంగీకరించినట్లగును. ఈ వైషమ్యమునకుగల విశిష్టహేతువును వీరు చెప్పవలసియున్నది. వీరిట్లు చెప్పకపోవుటచే ఈ వాదమును వీరంగీకరింప వీలులేదు.

34. అగ్ని తన్నుతాను ప్రకాశింపజేసికొనుచు, తన ప్రకాశముతో ఇతరవస్తువులను గూడ ప్రకాశింపజేయుచున్నది. ఇట్లే ప్రమాణములు వస్తువులను తెలియబరచుచు, తమ్ము తామే ప్రకాశింపజేసికొనుచున్నవి. ఈప్రమా

ములు వస్తువుల యాథార్థ్యమును తెలుపుటయే కాక, తమయొక్క ప్రామాణ్యమును కూడ తెలుపుచున్నవని స్వతః ప్రామాణ్యవాదు లందురు.

ఈ వాదమున కిక సమాధాన మీయబడు చున్నది.

35. దోషసహిత మీవాదము. అగ్ని తన్ను తాను ప్రకాశింపజేసికొనుట లేదు. చీకటిలో నున్న కుండవలె అగ్ని కన్పింపక పోవుట యను నది మన అనుభవములో లేదు గదా!

అగ్నిచే ప్రకాశింపబడక చీకటిలో ఉన్న కుండ మనకు ఉపలబ్ధమగుట లేదు. అగ్నిచే ప్రకాశింపబడినతర్వాతనే ఆకుండ మనకు కన్పించుచున్నది. ఇదేవిధమైన స్థితి అగ్నికి కూడ ఉండవలెను. తన్నుతానే అగ్ని ప్రకాశింపజేసికొనుటయే నిజమైన, చీకటిలోనున్న కుండ మొదట ఎట్లు కన్పించుటలేదో, అట్లే ప్రకాశింపబడకముందు అగ్నికూడ చీకటిలో దాగియుండవలెను. అప్పుడే ఆ దాగిన అగ్ని ప్రకాశింపబడగలదు. కావున అగ్ని తన్నుతానే ప్రకాశింపజేసికొనగలదను వాదము అనుపపన్నమగుచున్నది.

36. అగ్నితన్నుతాను ప్రకాశింపజేసికొనుచు ఇతర వస్తువులనుకూడ ప్రకాశింపచేయుచున్నచో, ఇతరవస్తువులను దహించుచున్నట్లు తన్నుతానే అగ్ని ఎందుకు దహించుకొనుట లేదు?

అగ్ని తన్నుతానే దహించుకొనుట లేదని చకు అవగతమే.

37. అగ్నికి స్వప్రకాశముతోబాటు పరప్రకాశశక్తికూడ నున్నచో చీకటి వస్తువులను కప్పివేయునట్లు తన్నుతానే కప్పివేసికొను శక్తి గూడ కలిగియుండవలసి వచ్చును.

అగ్నికి చీకటి ప్రతిపక్షమువంటిది. అగ్నికి స్వపరప్రకాశశక్తిగలదని స్వతః ప్రమాణవాదు లంగీకరింతురు. కాని అంధకారమునకు స్వతః ప్రచ్ఛాదనశక్తిగలదని వీ రంగీకరింపజాలరు.

38. స్వయంప్రకాశమానమగు అగ్నిలో చీకటిలేదు, ఎక్కడ అగ్ని యుండునో అక్కడ చీకటిలేదు. చీకటి లేనిచో అగ్ని ఎట్లు వస్తువులను ప్రకాశింపజేయగలదు? అంధకారవధయే ప్రకాశముగదా!

అగ్నికి చీకటికి ఎట్టి పరస్పరసంబంధము లేనప్పుడు అగ్ని ఎట్లు అంధకారమును పోగొట్టగలదు? చీకటిని పాఱద్రోలజాలనిచో అగ్ని తన్ను, ఇతరవస్తువులను ఎట్లు ప్రకాశింపజేయగలదు? స్వప్రకాశము, పరప్రకాశము అను శక్తులు అగ్నికి ఉండజాలవని స్పష్టమగుచున్నది. కాని అగ్ని ఏ క్షణమున ఉత్పన్నమగుచున్నదో అదేక్షణమున తన్ను తానే ప్రకాశింపజేసికొనుచు, అన్యవిషయములనుకూడ ప్రకాశింపజేయుటలేదా యను ఆశంక కలుగవచ్చును. ఈ యాశంకకు సమాధానముగా తర్వాతి కారిక చెప్పబడుచున్నది.

39. తాను ఉత్పన్నమగు క్షణముననే అగ్ని అన్యవస్తువులను ప్రకాశింపజేయుననుట అసద్వాదము. తాను పుట్టుచున్న క్షణముననే అగ్ని అంధకారమును సమీపించుటలేదుగదా!

అంధకారమును సమీపింపని అగ్ని ఆ చీకటిని నశింపజేయలేదు. అంధకారము నశింపనిచో అగ్నికి ప్రకాశమున్నదని చెప్పుటకూడ కుదురదు.

40. అంధకారమును సమీపింపకపోయినప్పటికిని అగ్ని ఆ చీకటిని నశింపజేయగలదని చెప్పినచో, ఈ ప్రదేశములో మాత్రమే ఉన్న అగ్ని సమస్త లోకములలో గల అంధకారమును నిర్మూలింపవలసివచ్చును.

ఒక్కచోట ఉన్న అగ్ని ప్రపంచమందలి తమస్సును పూర్తిగా నిర్మూలించుట అనుభవ విరోధము. అంధకారమును సమీపించినను, సమీపింపకపోయినను అగ్ని దానిని నాశము చేయజాలదని స్పష్టమగుచున్నది.

41. ప్రమేయముల నపేక్షింపకయే ప్రమాణములు స్వతఃప్రామాణ్యము కల్గియున్నచో, అట్టి ప్రమాణములు పరాపేక్ష లేకయే సిద్ధింపవలెను.

స్వతఃసిద్ధమైనది అన్యవస్తువుపై ఆధారపడియుండజాలదు. అన్యాశ్రితమైయున్నది స్వతఃసిద్ధము కాలేదు.

ప్రమేయములగు విషయముల నపేక్షింపకపోవుటలో దోషమున్నదా యను ఆశంకకు ప్రత్యుత్తరముగా తర్వాతి కారిక చెప్పబడుచున్నది.

42. ప్రమేయాపేక్ష లేకయే ప్రమాణమునకు ప్రామాణ్యము సిద్ధమగుచో, ఇట్టి ప్రమాణము ఎవరికిని ఉపకరించునది కాజాలదు.

ప్రమేయాపేక్ష లేని ప్రమాణమును ప్రమాణమనియే పిలువలేము. అట్టి ప్రమాణ మే ప్రతీతికిని సాధనము కాలేదు. విషయములనుగూర్చిన జ్ఞానమునకే ప్రమాణము లుపకరింపజాలవు.

43. ప్రమేయాపేక్ష గలిగినప్పుడే ప్రమాణములు సిద్ధింపగలవని చెప్పుటలో దోషమేమియున్నదని యడుగవచ్చును. దీనిని సిద్ధసాధనతాదోషమందురు. అసిద్ధమైనదానికి అన్యాపేక్ష లేదు.

ప్రమేయములతో సంబంధ మున్నప్పుడే ప్రమాణములు సిద్ధింపగలవని యనుటలో సిద్ధసాధనతాదోషమున్నది. సిద్ధమైయున్నదానిని సాధించుట సిద్ధసాధనత. స్వతఃప్రామాణ్యము గల ప్రమాణములు సిద్ధవస్తువులు. ప్రమేయాపేక్షవలన స్వతఃసిద్ధములైన ప్రమాణములు మరల ఎట్లు సిద్ధములు కాగలవు? సిద్ధముకాని వస్తువునకు అన్యాపేక్ష ఉండదు. సిద్ధముకాక, అనగా వస్తుతః లేనే లేని దేవదత్తుడే వస్తువు నపేక్షింపగలడు? చేసినదానిని మరల చేయుట ఎంత దోషమో సిద్ధించినదానిని సాధించుట కూడ అంతే. కావున స్వతఃసిద్ధములైన ప్రమాణములకు ప్రమేయాపేక్ష ఉండ వీలులేదు.

44. ప్రమాణముల నపేక్షించియుండుటచే ప్రమేయములు సిద్ధించుచున్నచో, ప్రమాణాపేక్ష లేకయే ప్రమేయసిద్ధి కలుగగలదు,

ప్రమేయములు ప్రమాణాధీనములై సిద్ధించునవైనచో ప్రమాణములు మాత్రము ప్రమేయముల నపేక్షించి సిద్ధించునవని చెప్పరాదు. సాధనముద్వారా ఒక సాధ్యవస్తువును సాధింపగలము కాని సాధ్యముద్వారా సాధనమును సాధింపలేముగదా! సాధ్యవస్తువులు ప్రమేయములు. వీనిని సాధించుటకు మనము గ్రహించు సాధనములు ప్రమాణములు. కాబట్టి ప్రమేయాపేక్షద్వారా ప్రమాణసిద్ధి కలుగదు.

45. ప్రమాణముల నపేక్షింపకయే ప్రమేయములు సిద్ధించిన యెడల ప్రమాణసిద్ధికొరకు తాపత్రయ మెందులకు? ఈ ప్రమాణములు దేనిని సాధింపగలవు?

ప్రమాణములతో సంబంధము లేకయే ప్రమేయములు సిద్ధించినచో ప్రమాణముల కేమి ప్రయోజన ముండగలదు?

46. ప్రమేయముల నపేక్షించియే ప్రమాణ సిద్ధి కలుగగలదనినచో, ప్రమాణ ప్రమేయము లకు పరస్పరభేద ముండ వీలు లేదు.

అప్పుడు ప్రమేయములద్వారా సాధింపబడు ప్రమాణములే ప్రమేయములు కాగలవు. ప్రమాణములను సాధించునవగుటచే ప్రమే యము లప్పుడు ప్రమాణములు కాగలవు.

47. ప్రమాణసిద్ధివలన ప్రమేయసిద్ధి, ప్రమేయసిద్ధి ద్వారా ప్రమాణసిద్ధి కలుగునని వాదించినచో నీ రెండును సిద్ధించుట లేదని స్పష్టము కాగలదు.

అన్యోన్యాశ్రయదోషమున్న స్థలములలో ఈ సంబంధముగల రెండును సిద్ధింపజాలవు. విత్తు ముందు వచ్చినదా, లేక మొక్క ముందు వచ్చినదా యను వాదములో విత్తనమును కాని, మొక్కనుగాని సాధింప లేము.

48. ప్రమాణములు ప్రమేయములను, ప్రమేయములు ప్రమాణములను సాధించున వైనచో ప్రమేయసిద్ధి అనునదెట్లు కుదుర గలదు?

ప్రమాణములు ప్రమేయములను సాధించు వేళ, ప్రమాణములు అసిద్ధవస్తువులు. జ్ఞాన కారణమైన ప్రమాణము స్వతఃసిద్ధముకానిచో ప్రమేయసిద్ధిని ఎట్లు సాధింపగలదు?

49. ప్రమేయములు ప్రమాణములను, ప్రమాణములు ప్రమేయములను సాధించున వైనచో ప్రమాణసిద్ధి అనునదెట్లుకుదురగలదు?

ప్రమేయములు ప్రమాణములను సాధించు వేళ ప్రమేయములు అసిద్ధవస్తువులు. ఈ అసిద్ధ ములైన వస్తువులు ప్రమాణముల నెట్లు సాధింప గలవు.

50. ఈ తండ్రివలన ఆ కుమారుడు పుట్టు చున్నాడు; ఆ పుత్రునివలన ఈయన తండ్రిగా జన్మించుచున్నాడు — అను వాక్యములను గమ నించినచో ఎవరెవరి పుట్టుకకు హేతువగును?

తనకు పుత్రు డెప్పుడు జన్మించునో అప్పటి నుంచియే ఆ వ్యక్తి తండ్రి యగుచున్నాడు. పుత్రజన్మవలన తండ్రి యను వ్య బయలు దేరుచున్నాడు. కాని తండ్రి యని తర్వాత పిలువబడు వ్యక్తివలన ఆయనకు పుత్రుడు జన్మించుచున్నాడు; ఈ పితాపుత్రులలో ఎవ రెవరికి హేతువు కాగలరు? ఇట్లే ప్రమాణ ములకు,ప్రమేయములకు అన్యోన్యాశ్రయముండి, ఒకదానివలన మరియొకటి సాధింపబడుచున్న చో ఏది దేనిని సాధించుచున్నదో తెలియ వలసియున్నది.

51. ఎవరు తండ్రి? ఎవరు పుత్రుడు? తండ్రిని తండ్రిగను, పుత్రునిగను పరిగణింప వీలున్నది. పుత్రునిగూడ ఇట్లే రెండువిధముల పరిగణింప వీలున్నది. వీరిద్దరకు ఈ ఉభయధర్మములు సంక్రమించుటచే మాకీ సందేహము కలుగు చున్నది.

పుత్రుడు జన్మించుటవలన ఆ వ్యక్తి తండ్రి యగుటచే, తండ్రి పుట్టువొందినవాడగును. అప్పుడు తండ్రికి పుత్రలక్షణము సంక్రమించు చున్నది. ఇట్లే ఒకవ్యక్తిని తండ్రిగా జన్మింప జేసిన పుత్రునకు పితృలక్షణము సంప్రాప్తమగు చున్నది. ఉత్పాదకధర్మములు గల వీరిద్దరు పితృలక్షణధరులు. ఉత్పాద్యధర్మములు వీరికి గలవు గనుక వీరిరువురు పుత్రలక్షణధరులు.

కావున వీరిలో నెవరు పుత్రుడు, ఎవరు తండ్రి యను సందేహము కలుగుచున్నది. ఇట్లే ఒక దాని నొకటి సాధించుననని చెప్పు ప్రమాణ ప్రమేయములలో నేవి సాధనములు, ఏవి సాధ్యములు? ప్రమాణసిద్ధిలో ప్రమేయము సాధనమగుచుండగా, ప్రమాణము సాధ్యవిషయమగుచున్నది. ప్రమేయసిద్ధిలో ప్రమేయము సాధ్యవస్తువు, ప్రమాణము సాధనము నగుచున్నవి. కావున ప్రమాణము లేవి, ప్రమేయము లేవి? అను సందేహము కలుగుచున్నది.

52. ప్రమాణము స్వతఃసిద్ధము కాదు; ఒక ప్రమాణ మింకొక ప్రమాణముద్వారాగాని, అన్యప్రమాణములద్వారాగాని సిద్ధమగుట లేదు. ప్రమేయములవలనగూడ ప్రమాణసిద్ధి కన్పింపదు. కారణరహితమైనకూడ ప్రమాణములు సిద్ధింపవు.

ఒక ప్రమాణము తన్ను తానే ప్రామాణికముగా మార్చ లేదు. ప్రత్యక్ష ప్రమాణముచే ఆ ప్రత్యక్షము, అనుమాన ప్రమాణముచే ఆ అనుమానము, ఉపమాన ప్రమాణముచే ఉపమానము, ఆగమ ప్రమాణముచే ఆగమము ప్రామాణికములు కాజాలవు. అనుమానోపమానాగమములచే ప్రత్యక్షము, ప్రత్యక్షోపమానాగమములచే అనుమానము, ప్రత్యక్షానుమానాగమములచే ఉపమానము, ప్రత్యక్షానుమానోపమానములచే ఆగమము ప్రామాణికములు కాజాలవు. వీనిలో మొదటిది స్వతః ప్రామాణ్యవాదము, రెండవది పరతఃప్రామాణ్యవాదము. ఈ రెండువాదములు అసంగతములని వివరించితిమి.

ఒక ప్రత్యక్ష మింకొక ప్రత్యక్షముచేత గాని, ఒక అనుమాన మింకొక అనుమానము ద్వారాగాని, ఒక ఉపమాన మింకొక ఉపమానమువలనగాని, ఒక ఆగమము మరియొక ఆగమముద్వారాగాని ప్రామాణికములు కాజాలవు. ఇదికూడ పరతఃప్రామాణ్యవాదమే. ఒక ప్రమాణమునకు చెందిన ప్రమేయముల వలనగాని, ఇతర ప్రమాణములకు చెందిన ప్రమేయములవలనగాని ఈ ప్రమాణము ప్రామాణికము కాజాలదు. కారణరహితమై తనంతటతానే ప్రామాణికము కాలేదు.

కావున ప్రమాణ మనునది ఉన్నది గనుక ప్రమేయములున్నవని, ప్రమాణ ప్రమేయములున్నవి గనుక ధర్మస్వభావములున్నవని చెప్పు వాదము అనుపపన్నమని తేలుచున్నది.

(సశేషము)

"మన పల్లెప్రాంతాలలో రైతులు తమ పంటపొలాలకు నీరు తెచ్చుచుందురు. నేను చూచి యున్నాను. నీటిని వెలికి పాఱి పోనీయక అడ్డుటకు పొలాల చుట్టును పొట్టి గుట్టలు ఉన్నవి. కాని అవి మట్టిగుట్టలే. వానిలో రంధ్రాలు తఱచు. రైతులు తమ ఊపిరి పోవునంతగా కష్టపడి నీరు తెత్తురు, కాని, ఆ నీరు గుట్టలలోని చిల్లులగుండ కాఱి పోవును. కోరికలే రంధ్రాలు. నీవు జపతపాదులను తప్పక చేయుచునే ఉందువు. కాని అవి నిలువక నీ కోరిక లనెడి రంధ్రాలగుండ వెలికి పోవుచున్నవి. కోరికలు లేవన్నచో, నీ మనసు సహజముగనే దైవోన్ముఖ మగును."

—శ్రీరామకృష్ణుడు

# బౌద్ధకాలములోని భారతీయ విశ్వవిద్యాలయములు

[కుమారి సరళాదేవి]

బౌద్ధ కాలమును మూడుభాగములుగ విభజింప వచ్చును. మొదటిభాగము గౌతమబుద్ధుని జీవిత కాలమునుండి ఐదుఆరు శతాబ్దములవరకు. ఈ కాలమున బౌద్ధులు సాధు చరిత్రులుగను, నిజ మైన త్యాగశీలురుగను, ఉండిరి. రెండవ భాగము క్రీస్తుశకము మొదటి నుండి ఆరవ శతాబ్దమువరకు. ఈ యుగమందు బౌద్ధులు, పూర్వీకుల గుణగణములలోవలెనే శిల్పకళయందుగూడ ఉన్నతి గాంచిరి. క్రీ. శ. ఏడవశతాబ్దము మొదలుకొని మూడవభాగము ప్రారంభమగును. దీనినే తాంత్రికయుగము అని అందురు. ఇందు బౌద్ధమతాధిపతుల త్యాగబుద్ధి, శీలము, సడలినది కాని ఆయుర్వేద రసాయనికశాస్త్రములలో వారు ప్రఖ్యాతి గాంచిరి. ప్రతి యుగ విశిష్టతయు ఆయాసమయముల లోని విశ్వవిద్యాలయములలో అంకిత మై యున్నది.

## I. తక్షశిలా విశ్వవిద్యాలయము :—

మొదటియుగమునకు జెందిన విశ్వవిద్యాలయము తక్షశిలానగరమం దుండెను. 'సుత్త', 'వినయపీఠిక' మున్నగు ప్రాచీన బౌద్ధగ్రంథములలో దీని ప్రాముఖ్యము లిఖింపబడియున్నది. ఎరిగిన్, స్ట్రాబో, ప్లినీ మున్నగు ప్రాచీనలేఖకులు ఈనగరప్రాముఖ్యము, వైభవసంపదలను గూర్చి గొప్పగా పొగడిరి. అశోకుని రాజ్యకాలమందు కూడ ఒక రాజప్రతినిధి అచటనుండెడివాడు. ఈ విశ్వవిద్యాలయము బుద్ధుని కన్న పూర్వమే స్థాపింపబడినది. అందు, వేదవేదాంగములకు బదులు ఆయుర్వేదము, శిల్పము, గృహనిర్మాణము, చిత్రకళ మున్నగునవి బోధింపబడుచుండెను. ఇవియే గాక విజ్ఞాన, కళా కౌశలము మున్నగు పదునెనిమిది విషయములు బోధింపబడుచుండెను. వానికై వేరు వేరు విద్యాలయము లుండెడివి. వేరు వేరు అధ్యాపకు లుండిరి. జగత్ ప్రసిద్ధిగాంచిన సంస్కృత వ్యాకరణకర్త యగు పాణినియు, సుప్రసిద్ధ రాజనీతిశిరోమణి యగు చాణక్యుడును, ఇందే విద్య గడించిరి. ఆత్రేయుడు ఇచ్చట వైద్య శాస్త్రోపాధ్యాయుడు. బింబిసారుని ఆస్థాన వైద్యుడును, బుద్ధుని ప్రియమిత్రుడును, అనుచరుడు అగు "వైద్యరాజ జీవకుడు" ఇచ్చటి విద్యార్థియే.

మొదట తక్షశిలా విశ్వవిద్యాలయము వేద మతావలంబులకే కేంద్రస్థానముగ నుండెను. తరువాత బౌద్ధులుగూడ రా సాగిరి. పెక్కురు సుప్రసిద్ధ బౌద్ధులు ఈ విద్యాలయమునందే విద్యనభ్యసించిరి. బౌద్ధమతములో సౌతాంత్రిక సాంప్రదాయప్రవక్త కుమారలబ్ధుడు ఇచటి విద్యార్థియే. ఆ కాలమున పూర్వపు అశ్వఘోషుడు, దక్షిణమున దేవుడు, పశ్చిమమున నాగార్జునుడు, (నేడు విశాలాంధ్రలో నిర్మింపబడు చున్న నాగార్జునసాగర్ ప్రాజక్టు వీరి జ్ఞాపకార్థమే) ఉత్తరమున కుమారలబ్ధుడును ప్రసిద్ధి గాంచి వెలొందినట్టి విద్వాంసులు. వీరు దేశ

మునకు నలువైపులను నిలచినట్టి నలుగురు సూర్యు లని ప్రఖ్యాతి గాంచిరి. తక్షశిలలో వేదమతప్రచారసమయమున ముఖ్యముగ గమనింప దగిన విషయములు మూడు గలవు.

(1) ఇచ్చట విద్యానిబంధనలు నియమబద్ధ విశ్వవిద్యాలయముల లోని ప్రణాళికలవలె కాదు. కాని నేటి కాశీవిద్యాలయమును దీనితో పోల్ప వచ్చును. బౌద్ధవిహారముల లోని నిబంధనలు వీనికి వ్యతిరేక మయినవి. (2) బౌద్ధవిహారములలో కేవలము సన్న్యాసులకే బోధింపబడుచుండెను. కాని ఇచట అట్లు గాక గురువులు, అంతేవాసులుగూడ గృహస్థులే. (3) ఈ విద్యాలయములో కేవలము బ్రాహ్మణ, క్షత్రియులకే ప్రవేశ ముండెడిది.

## II. నలందా విశ్వవిద్యాలయము :

ద్వితీయయుగమునకు జెందినది నలందా విశ్వవిద్యాలయము. అది రాజగృహమునకు ఉత్తరమున ఐదుమైళ్ళదూరములోను, పాటలీపుత్రమునకు 34 మైళ్ళు దక్షిణముగను ఉండెను. ఇపు డా ప్రదేశముననే 'బాగ్‌గాంట్' (గయజిల్లా) కలదు. నేటికిని కొన్ని శిథిలములు అచట కాన నగును. ఇతర దేశములనుండి పెక్కురు యాత్రికులు వీనిని చూచుటకువచ్చెడివారు. ఈవిద్యాలయరమణీయత వర్ణనాతీత మయినది. నాలుగు వైపుల పెద్ద విహారములు, నాలుగు వైపుల మఠములు, మధ్య సభావేదిక, విద్యాలయము మధ్య మధ్య ఆలయములు, సమాధులు, ఎత్తయిన స్థూపములు, విద్యార్థులకును, ఉపాధ్యాయులకును వసతిగృహములును మున్నగువానితో కలకలలాడుచుండెను. భవనములు చిత్రవిచిత్రము లయిన రంగులతోడను, పెద్దగోపురములతోడను విరాజిలుచుండెను. ఈవిద్యాలయప్రణాళికలన్నియు, నేటి ఆక్స్‌ఫోర్డ్ యూనివర్సిటీకి పోల్ప దగును. ప్రపంచములోని కెల్ల పెద్దపుస్తకభాండాగారము ఇచట నుండెను. పదివేల విద్యార్థుల తోడను, నూటయేబంది ఉపాధ్యాయుల తోడను ఈవిద్యాలయము కలకలలాడుచుండెను. నేటివిద్యాలయములలో వలె ఇచట జీతము పుచ్చుకొనుపద్ధతి లేదు. విద్యార్థులకు ఉచితముగా విద్య చెప్పించుటయే గాక మీదు మిక్కిలి భోజనాది వసతులన్నియు విద్యాలయమే నిర్వహించెడిది. మహాజనులు హృదయపూర్వముగ విరాళము లిచ్చెడి వారు. అందుచే విద్యార్థులు నిత్యజీవనమునకై ఇతరులపై ఆధారపడక నిశ్చింతగ విద్యను అర్జించెడివారు. మరొకవిషయము ముఖ్యముగ గమనింప నగును. నేడు విశ్వవిద్యాలయములలో తరచు జరుగు పరీక్షలు ఇచట లేవు. యోగ్యతాయోగ్యతలను శాస్త్రార్థములతోడను వాగ్వాదములతోడను, ప్రత్యక్షప్రమాణముల తోడను, నిర్ణయించెడి వారు. మొదట విశ్వవిద్యాలయములో చేర్చుకొన్నప్పుడే బుద్ధిమంతులును, విద్వాంసులును, గుణవంతులును, సత్ప్రవర్తకులును, కుశాగ్రబుద్ధులును, యోగ్యులు అగు వారినే బాగుగ పరీక్షించి చేర్చుకొనెడివారు. అందుచేతనే ఈవిద్యాలయము నుండి బయల్వెడిన విద్యార్థులు జగత్ప్రఖ్యాతి నొందుటయే గాక జగత్పూజ్యులుగను గణుతి కెక్కిరి. మొట్టమొదట ఈ విశ్వవిద్యాలయము పారమార్థికబోధనకే స్థాపింప బడినది. ఉపాధ్యాయవర్గము శిష్యవర్గముకూడ ధార్మికజీవనము గడపుచుండెడివారు. అందుచేతనే దీనికి 'ధర్మగంజి' అని పేరు వచ్చెను. క్రమేణ ధర్మ, దర్శనశాస్త్రముల తోపాటు వ్యాకరణము,

జ్యోతిషము, వైద్యము మొదలగు జీవనోపాధిక విద్యలను గూడ నేర్ప సాగిరి.

## III. ధాన్యకటక విశ్వవిద్యాలయము:—

ఇదియు రెండవయుగమునకు చెందినదే. ఇది కృష్ణానదియొడ్డున, అమరావతికి సమీపమున నిర్మింపబడెను. బౌద్ధధర్మ మహాయాన సాంప్రదాయమునకు చెందిన, పదునాల్గవ సుప్రఖ్యాత రసాయనిక వేత్తయు వైద్యచికిత్స వేత్తయు అగు నాగార్జునాచార్యుని ప్రావీణ్యము దేశదేశాంతరములందు ప్రఖ్యాతి బడసెను. ఇచట వైదిక, మత గ్రంథములను, బౌద్ధమత గ్రంథములను గూడ బోధించు చుండిరి. ఇతర నిబంధన లన్నియు నలందా విశ్వవిద్యాలయములోనివాని వంటివే. టిబెట్టురాజధాని యగు "లాసా" వద్ద "డాయగ్" విశ్వవిదాలయము దీని నమూనాయే.

## IV. ఓదంతపురీ – విక్రమ శిలా విశ్వవిద్యాలయములు :—

మూడవయుగమునకు జెందినవి ఒకటి ఓదంతపుర మందును, రెండవది విక్రమశిలలోను నుండినవి. ఈ రెండును బిహారురాష్ట్రమునందే యుండినవి ఈకాలమున వైజ్ఞానిక పరిశోధనలు హెచ్చెను. తాంత్రికబౌద్ధమతప్రచారము బెంగాలు, బిహారులందు విరివిగా నుండెను. ఈ కాలముననే టిబెట్టునకు బౌద్ధమతము ప్రసరించెను. పాలవంశరాజులు, గొప్పవిద్యారసికులును, కవిపోషకులును అగుటచే ఓదంతపురిలో గొప్ప విహారమును గూడ గట్టించిరి. అందు చేతనే ఈప్రాంతమునకు బిహారు అని పేరు వచ్చెను. పాలవంశపురాజులు ఈవిద్యాలయముల నిర్వహించు చుండిరి. వీరి రాజ్యపాలనమున ఈ విశ్వవిద్యాలయమునందు ఐదు వేల హీనయానమహంతులును, పదివేల మంది మహాయానమహంతులును ఉండిరి. టిబెట్టులో 'శాక్య' అను విశ్వవిద్యాలయము దీని ననుసరించి నిర్మింపబడెను. విక్రమశిల విశ్వవిద్యాలయము భాగల్పూర్ జిల్లాలో సుల్తాన్ గంజ్ వద్ద గంగఒడ్డున కొండపై నిర్మింపబడెను. నూటఎనిమిది భవనములతో విరాజిల్లుచుండెను. దీని అధీనములో ఆరుమహావిద్యాలయము లుండెను. దీనినిగూడ పాలవంశరాజులే పోషించుచుండిరి.

విద్యార్థులకై మరికొన్ని ధర్మసత్రములు నిర్మించిరి. ఇచట బౌద్ధవైదికగ్రంథములతో బాటు వ్యాకరణము అభిధర్మము, దర్శన శాస్త్రము, విజ్ఞానము, వైద్యము మున్నగునవి ప్రత్యేక విషయములుగ బోధించుచుండిరి. ఈ విద్యాలయములో ఉత్తీర్ణ లయిన విద్యార్థులకు 'పండిత' బిరుదు ఇచ్చుచుండిరి. క్రీ. శ. 11–వ శతాబ్దరాజగు ధర్మపాలుని సమయమున 'శ్రీదివాకర' ఈవిశ్వవిద్యాలయాధ్యక్షులుగ నుండిరి. ఈకాలముననే 'టిబెట్టు లామా' ఇచట పండితుల సహాయమున సంస్కృతగ్రంథముల పెక్కింటిని టిబెట్టుభాషలోనికి అనువదింపించెను.

బహు వన పాద పాబ్ధి కులపర్వత పూర్ణ సర స్సరస్వతీ
సహిత మహా మహీ భర మజస్ర సహస్ర ఫణాళిఁ దాల్చి, దు
స్సహతర మూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్యయైన య
య్యహిపతి దుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ డయ్యెడున్

—నన్నయ

ఓమ్ నమోభగవతే వాసుదేవాయ

శ్రీ భగవద్గీతా ప్రబోధము

# శ్రీమద్భగవద్గీతాంతర్గత భక్తియోగము

శ్రీ శ్రీ శ్రీ నిత్యానందస్వాములవారు

శ్లో॥ వంశీవిభూషితకరాన్ నవనీరదాభాత్ ।
పీతాంబరా దరుణ బింబ ఫ లాధ రోష్టాత్ ।
పూర్ణేందు సుందర ముఖా దరవింద నేత్రాత్ ।
కృష్ణాత్పరం కి మపి తత్త్వ మహం న జానే॥

''మోక్షసాధనసామగ్ర్యాం భక్తి రేవ గరీయసీ'' అనగా మోక్షసామ్రాజ్యమును జేర్చు మార్గములలో భక్తిమార్గమే అగ్రస్థానము వహించిన దని చెప్పు ప్రపన్నభక్తులు శ్రీభగవద్గీతాబోధమును అన్వయించుక్రమమును వినుడు. అర్జునుడు మొదటినుండియు శ్రీకృష్ణునకు సఖుడై యుండి యుద్ధప్రారంభమున ధర్మసమ్మూఢచేతస్కుడై గురు, బంధు, వధాది మహాపాపభీరుడై, కర్తవ్యమును స్వయముగ నిర్ణయించు సామర్థ్యము లేక, బంధువును, సఖుడును, అగు శ్రీకృష్ణభగవానునే గురునిగ స్వీకరించుచు ''శిష్య స్తే హం శాధి మాం త్వాం ప్రపన్నం'' నేను నీకు శిష్యుడను, అనన్యగతికుడను, మఱియు ప్రపన్నుడనై నీ శరణు జొచ్చినాడను. ఇత్తఱి ఉత్తమోపదేశముచే నన్ననుగ్రహింపుము, అని దీనుడై ప్రార్థించుటచే భగవానుడు గీతాప్రబోధమును ప్రారంభించెను గదా! ఇట, బోధము నంద వలసిన యర్జునుడు ఎట్టి యధికారి? ఈత డాత్మజ్ఞానము నభిలషించెనా? సఖ్యభావముతో ప్రపన్నుడు గదా అయ్యెను; తనభావమును ''త్వాం ప్రపన్నం'' అని స్పష్టముగా వెల్లడించెనే? ఇట్టి ప్రపన్నభక్తునికి బోధించిన మార్గము పరమేశ్వరునియందు సమస్తభరన్యాసము చేసి అతనిచేతియందలి కీల్బొమ్మవలె అతని యాజ్ఞానురూప మగు స్వధర్మానుష్ఠానమును చేయు ప్రపత్తిమార్గము గాక, వేఱొంకు మార్గ మెట్లగును? కావున సర్వజ్ఞు డగు శ్రీకృష్ణభగవానుడు ప్రపన్ను డగు అర్జునుని నిమిత్తముగా గొని, గీతాముఖమున లోకమునకు భక్తిప్రపత్తిమార్గమునే ప్రధాన మైనదిగా బోధించె నని భక్తిమార్గీయులు చెప్పెదరు. మఱియు మానవులెల్లరు దేహమే నేను, అను దేహాత్మభావము కల వారగుటచే, షడ్భావవికారములు (పుట్టుట, పెరుగుట, వృద్ధినొందుట, క్షీణించుట, నశించుట, చచ్చుట) గల్గి దేశకాలములకు కట్టుబడిన పాంచభౌతిక మగు ఈ దేహముకంటె భిన్న మైన జ్ఞానానందాది లక్షణయుక్త మగు ఆత్మయే తన యథార్థస్వరూప మను ఆత్మజ్ఞానము సాంఖ్యయోగముద్వారా

బోధించి. పిమ్మట ఆ జ్ఞానప్రాప్తికి ఉపాయ భూత మగు భక్తిప్రపత్తిమార్గమును బోధింప నారంభించి అ. 4, శ్లో. 5 "బహూని మే వ్యతీతాని జన్మాని తవ చార్జున" అర్జునా, నాకును, నీకును, పెక్కుజన్మములు గడచినవి. సర్వజ్ఞుడ నగుటచే నా కన్నియు తెలియును. కించిద్జ్ఞుడవగుటచే నీకు తెలియ దనియు, అ.5, శ్లో. 9 "భోక్తారం యజ్ఞతపసాం సర్వలోక మహేశ్వరం, సుహృదం సర్వభూతానాం జ్ఞాత్వా మాం శాన్తి మృచ్ఛతి" యజ్ఞాది సత్కర్మానుష్ఠానములకు భోక్తను, సర్వలోక మహేశ్వరుడను, సర్వభూతసుహృదుడను అగు నన్ను తెలిసికొని శాశ్వతశాంతిని మనుజుడు పొందుచున్నా డనియు, అ. 7, శ్లో. 3 "యత తా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః" మోక్షప్రాప్తికొఱకు యత్నించి సిద్ధులైన వారిలో గూడ ఒకానొకడు యథార్థముగా నన్ను లేక నాతత్త్వమును తెలియుచున్నా డనియు, అ. 7, శ్లో. 7 "మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ, మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ" ఓ అర్జునా, నాకంటె వేఱైనదియు, శ్రేష్ఠమైన దియు నగు వస్తువు మఱొకటి లేదు. భూ మ్యాది అష్టవిధము లగు అపరాప్రకృతియు, జీవభూత మగు పరాప్రకృతియు, ఈ రెండు విధము లగు చేత నాచేతన ప్రపంచ మంతయు సూత్రమునందలి మణులవలె నాయందు దోత ప్రోతభావమున నున్న దనియు, అ. 7, శ్లో. 10 "బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనా తనం" ఓ అర్జునా, సర్వభూతములకు కారణ మైన సనాతన బీజమను నేనే యనియు, అ. 7, శ్లో. 13 "త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్, మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయం" ఈ జగత్తంతయు అనగా జీవకోట్లు త్రిగుణాత్మకప్రకృతిభావము లచే మోహింపబడుటచే ప్రకృతికంటె పరమై యుండు అవ్యయుడ నగు నన్ను తెలియ జాల కున్న దనియు, అ. 7, శ్లో. 21 "తస్య తస్యా చలాంశ్రద్ధాం తా మేవ విదధా మ్యహం" ఎవ రెవరు ఏ యే మూర్తిని భక్తిశ్రద్ధలతో ఉపా సించెదరో వారివారికి అట్టి దృఢమైన భక్తి శ్రద్ధలను నేనే కలిగించుచున్నా ననియు, అ. 10, శ్లో. 3 "యో మా మజ మనాదిం చ వేత్తి లోకమహేశ్వరం" ఎవడు నన్ను అజుని గను, అనాది యగు సర్వలోకమహేశ్వరుని గను తెలియుచున్నాడో యనియు, అ. 10, శ్లో. 39 "య చ్చాపి సర్వభూతానాం బీజం త దహ మర్జున" సర్వభూతములకు ఏది బీజ మో అదే నే ననియు, అ. 10. శ్లో. 40 "నాంతో ఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరంతప" దివ్యము లగు నా విభూతులకు అం తము లే దనియు, అ. 10, శ్లో. 41 "య ద్య ద్విభూతిమ త్సత్త్వం" ఏ యే భూతములందు నా సంబంధము లగు ఐశ్వర్య, వీర్య, కాంతి, అభివృద్ధి, జ్ఞానాదులు అతిశయముగ కాన్పించు చున్నవో ఆభూతము లన్నియు నా యంశము వలన పుట్టినవని తెలిసికొమ్ము అనియు, అ.10, శ్లో. 42 "ఏ కాంశేన స్థితో జగత్" నేనే ఈ సమస్తజగత్తును ఒక్క అంశముచేత ధరించి యున్నా ననియు అ. 7, శ్లో. 14 "మా మేవ యే ప్రపద్యంతే మాయా మేతాం తరంతి తే" ఎవరు నన్నే శరణుపొందుదురో అట్టివారే నా మాయను దాటుదు రనియు, అ. 7, శ్లో. 17 "తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే" ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అను నాలుగు విధము లగు భక్తులలో సదా నాయందే మన

స్సుంచి, ఇతరప్రయోజనములు లేనందున జ్ఞాని యను భక్తుడే శ్రేష్ఠుడనియు, అ. 7, శ్లో. 19 "బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" అనేకజన్మముల సాధనాఫలితముగ సర్వము వాసుదేవమయ మను ప్రపత్తి చేయుచున్నాడనియు, ఎల్లప్పుడు నన్నే కీర్తించుచు, నన్ను గూర్చియే భక్తితో ప్రణమిల్లుచు, అనన్యగతికులై నన్నే ఎవరు ప్రపత్తి చేయుచున్నారో అనగా శరణుపొందుచున్నారో అటివారి యోగక్షేమములను నేనే వహించుచున్నా ననియు, అ. 9, శ్లో. 27 "యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్" ఏది చేసినను, ఏది తిన్నను, ఏది హోమము చేసినను, ఏది యిచ్చినను, ఏది తపస్సుచేసినను, వాని నన్నిటిని నా కర్పణము చేయవలె ననియు, అ. 9, శ్లో. 32 "మాం హి పార్థ వ్యపాశ్రిత్య" నన్ను ఆశ్రయించినవారు స్త్రీలు గాని, ఏజాతివారలు గాని, కడకు పాపకర్ములు గాని అందఱును శుద్ధాత్ములై నన్నే పొందుచున్నా రనియు, అ. 18, శ్లో. 66 "సర్వధర్మాన్ పరిత్యజ్య మా మేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥"

తా॥ సమస్తధర్మములను విడిచి నన్నొక్కనిమాత్రము శరణుపొందుము. నేను నిన్ను సమస్త పాపములనుండి విముక్తుని జేసెదను. దుఃఖింపకుము (సందేహపడకు) సర్వధర్మము లనగా, బుద్ధ్యాదీంద్రియములు వాని వ్యాపారములు విడిచి తురీయావస్థలో నిలుచుట. అచ్చట దుఃఖకారణములు లేవు శోకింపకు మని అర్థాంతరము. ఈచరమశ్లోకమును శ్రీశంకర, రామానుజ, మధ్వాచార్యులు విపులముగా ప్రబోధించియున్నారు. గ్రంథవిస్తరణభీతిచే ఇంతటితో విరమించుచున్నాను.

భక్తినిష్ఠకు బర్యవసాన మగు ప్రపత్తినిష్ఠ లేక చరమోపదేశమును భగవానుడు చేసె ననియు, సమస్తకర్మసన్న్యాసపూర్వకప్రపత్తినిష్ఠామార్గమే శ్రీ గీతాచార్యుని నిశ్చితాభిప్రాయ మని భక్తిమార్గీయులు ఘంటాపథముగ వక్కాణింతురు.

---

# అద్వైతమతము

## విద్వాన్ చదలువాడ జయరామశాస్త్రిగారు

(ఫెబ్రువరి సంచిక తరువాయి)

### 18. సత్త్వము లేక సత్యము లేక సత్త త్రివిధము

అట్లయిన బ్రహ్మాద్వైతమునందు "ఈశో విశు ద్ధాచి త్తథా జీవేశయో ర్భిదా అవిద్యా తచ్చితే ర్యోగః షడస్మాక మనాదయః" అనునిటి పెదలమాటకు విరోధమేర్పడుచున్నది గదా. ఇందు 1. జీవుడు, 2. ఈశ్వరుడు, 3. బ్రహ్మము, 4. జీవేశ్వరులభేదము, 5. అవిద్య, 6. బ్రహ్మమునకు అవిద్యాసంబంధము. అను సయాఱును అనాదులన చెప్పుటచేత ద్వైతము స్పష్టముగ ప్రాప్తించుచున్నది గదా అనిశంకింతురేని చెప్పెదము. సత్త, పారమార్థిక

వ్యావహారికి, ప్రాతిభాసికి అని త్రివిధము. వాని యందు పారమార్థికిమైన సత్త బ్రహ్మమునకే గాని యితరమగు నే యొకదానికిని లేదు. ఆ బహ్మమెప్పుడు గూడ అబాధ్యమానమై (ఒకే విధముగ) ఉండుటవలన వ్యావహారికిమైన సత్త భూతభౌతికమైన జగమునకుఁగలదు. ఈసత్తకు మోక్షదశయందు బాధ (లేమి) సంభవించుచుండినను వ్యవహారదశయందిది బాధకులోను గానిదై యున్నది. ప్రాతిభాసికి సత్త శుక్తిలోనగు వానియందు భాసించు రజతాదులకుఁ గలిగియుండును. దానికి వ్యవహారదశయందు సైతము బాధయేర్పడుచున్నది. ప్రతిభాసించు కాలమునందే దానికి ఉనికి.

శ్లో. కాలత్రయే, జ్ఞాతృకాలే, ప్రతీతిసమయే తథా.
బాధాభావా త్పదార్థానాం సత్త్వత్రైవిధ్యముచ్యతే
తాత్త్వికం బ్రహ్మణః సత్యం. వ్యోమాదే ర్వ్యావహారికమ్.
రూప్యాదే రర్థజాతస్య ప్రాతిభాసిక మిష్యతే॥
లౌకికేన ప్రమాణేన యద్బాధ్యం లౌకికేఽవధౌ.
తత్ప్రాతిభాసికం సత్త్వం బాధ్యం సత్యేవ మాతరి॥
వైదికేన ప్రమాణేన యద్బాధ్యం వైదికేఽవధౌ.
తద్వ్యావహారికం సత్త్వం బాధ్యం మాత్రాసదైవహి॥

తా. మూఁడు కాలములందును, జ్ఞాత (తెలిసికొనువాఁడు) (వ్యవహారదశ) సమయమందును, ప్రతీతి (తోఁచు) సమయమందును, బాధ (లేకపోవుట) లేమివలన, సత్త్వము (ఉనికి, సత్త, సత్యము) మూఁడువిధములగుచున్నది. బ్రహ్మముయొక్క సత్త్వము తాత్త్వికము. ఇదియ పరమార్థసత్యము. ఆకాశాదుల సత్త్వము, వ్యావహారికము. శుక్తిలోనగు వానియందు రజతాదులుభాసించుట ప్రాతిభాసిక సత్త్వము.

లౌకికప్రమాణముచే నేది బాధింపఁబడునో అది ప్రాతిభాసిక సత్త్వము. ఎట్లనఁగా దూరమునుండి చూచునప్పుడు రజతముగాఁ గనఁబడినది సమీపమున శుక్తిగఁ గన్పడుచున్నది. కాఁబట్టి యింద్రియాదికములగు లౌకిక ప్రమాణములచే నిది బాధింపఁబడుటయనఁగానిదియే.

వైదికప్రమాణముచే బాధింపఁబడునది వ్యావహారికసత్త. పృథివ్యాదిపంచభూతములచేనైన జగత్తు మిథ్యయని వేదముచెప్పుచున్నది. ప్రళయమునందు దీని నామరూపక్రియలన్నియు మాయమగును. కావున వ్యావహారికసత్త్వము వైదికప్రమాణముచే బాధింపఁ బడుచున్నది.

[illegible] ఉక్తి పారమార్థికమైన సత్తను గూర్చిన అభిప్రాయముతోఁ జెప్పినదని తెలియవలెను.

జీవుఁడు, ఈశుఁడు, అని చెప్పునట్టి శ్లోకమునందు, విశుద్ధమగు చిత్తు అని చెప్పఁబడినది పరబ్రహ్మము. బ్రహ్మమునకు అతిరిక్తము(భిన్నము) లైన జీవాదులు ఏదును పారమార్థికములగు సత్త్వములు గావు. అవి వ్యావహారిక సత్త్వములు మాత్రమే. అనాదులను సామ్యముచే, ఆయాఱింటిని ఒక్కచోటగణించుట, పారమార్థికమగు బ్రహ్మము, అనాది అనంతము. అనఁగా త్రికాలాబాధ్యమనుట. అన్యములగు జీవాదు లనాదులైనను అనంతములు గావు. వానికి సంసారమెంతపర్యంతము స్థిరముగానుండినను మోక్షదశయందు వినాశమును బొందుచున్నది గదా. వానియందుఁ గూడ, జీవేశ్వర భేదము, అవిద్య, బ్రహ్మమునకు అవిద్యాసంబంధము. అను ఈమూఁడును స్వరూపముతోనే నశించునవి. కాని జీవేశ్వరులకు అట్లుగాదు. మఱేమనఁగా. జీవునికి, ఈశ్వరునికి, గల ఉపాధి మాత్రమే వినాశముపొందుచున్నది. ఇట్లను

టచే, జీవునికిఁగల వ్యావహారికసత్త్వము వ్యవహారమున కతీతమైన మోక్షావస్థయందు లేనిదై జీవునికి నాశము తప్పక సంభవించుటవలన మోక్షప్రాప్తికి ఎవఁడును ప్రయత్నింపఁడు అనుట సరాస్తమైనది.

## 19. జీవుఁడు, జీవత్వము, ఈశ్వరుఁడు, ఈశ్వరత్వము, ఉపాధి

జీవునికి, ఈశ్వరునికిఁ, బ్రాప్తమైన ఉపాధి ఏదిగలదో, అది, భావరూపమై, త్రిగుణాత్మకమై సత్తు, అసత్తు, అని నిర్వచించుటకు శక్యముగానిదై, అనాదియైన అజ్ఞానము. ఆ యజ్ఞానము మాయ, అవిద్య, అని రెండుభేదములు గలది. శుద్ధసత్త్వప్రధానము, మాయాపద వాచ్యము. మలినసత్త్వప్రధానము, అవిద్యాపద వాచ్యము. మాయోపహిత చైతన్యము, ఈశ్వరుఁడు, అవిద్యోపహితచైతన్యము, జీవుఁడు.

## 20. అజ్ఞానముయొక్క శక్తిద్వయము

మఱియును, అజ్ఞానము స్వరూపమును బట్టి ఏకరూపమే. మఱి ఆ యజ్ఞానశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి, అని రెండువిధములగును. రజస్తమస్సుల నంటని, సత్త్వము జ్ఞానశక్తి "సత్త్వాత్సంజాయతే జ్ఞానమ్. (భ.గీ. ౧౪.౧౭.) అను స్మృతినిబట్టి, అజ్ఞానశక్తి శబ్దాదులగు విషయముల జ్ఞానమునకు హేతువైనది. క్రియాశక్తి, ఆవరణశక్తి, విక్షేపశక్తి, అని రెండువిధములు, రజస్సత్త్వముల సంబంధములేని తమస్సు ఆవరణశక్తి. అది, 'ఘటములేదు, ప్రకాశింపలేదు' అను నిట్టి వ్యవహారమునకు హేతువైనది. తమస్సత్త్వములతోఁ గలియని రజస్సు విక్షేపశక్తి. ఇది ఆకాశాదిప్రపంచమున కుత్పత్తి హేతువు. విక్షేపశక్తిమంతమైన అజ్ఞానోపహిత స్వరూపము చేతనే ఈశ్వరుఁడు జగదుపాదానమగుట సంభవించినది. "యథోర్ణనాభిః సృజతే గృహ్ణతేచ" (ముం. ౧. ౭.) ఇట్టి శ్రుతి ఇచ్చో ప్రమాణము. (ఊర్ణనాభి=సాలెపురుగు) జ్ఞానశక్తిమంతమగు అజ్ఞానోపహిత స్వరూపముతో ఈశ్వరుఁడు జగమునకు కర్తయని చెప్పఁబడుచున్నాఁడు. ఈ మతమునందు ఆవరణశక్తి ప్రధానమైన అజ్ఞానము అవిద్యయనియు, విక్షేపశక్తి ప్రధానమగు అజ్ఞానము మాయయనియుఁ జెప్పఁబడును. జీవేశ్వరుల ఉపాధి పూర్వము చెప్పినట్లె తెలియవలెను. మఱియు నిట్లు చెప్పఁదగును. మాయ అవిద్య, అనుశబ్దములు రెండును. సామాన్యవాచకములై పర్యాయములగుచున్నవి. అవిద్యోపహితమైన బింబచైతన్యము ఈశ్వరుఁడు. అవిద్యాప్రతిబింబితమై ప్రతిబింబముగా నున్న చైతన్యము జీవుఁడు. అని జీవేశ్వరులభేదము తెలియఁదగినది.

(సశేషము)

"మనమున వేరమిఁదలఁపమియును, సత్యముచిత్తుఁడగుటయును, గుణములు కైకొని దోషంబులు విడుచుటయును నుత్తముఁ డయిన పురుషు నుత్తమగుణముల్."

[నన్నయ]

# క్రైస్తు - దివ్య సందేశహారి

## శ్రీ వివేకానందస్వామి

[ జాన్యువరి సంచిక తరువాయి ]

వ్యవస్థలందును నియమావళియందును నిత్యానుష్ఠానవితరణలందును కర్మకాండయందును చూపు శ్రద్ధను ఎప్పుడేని పరిహసింపవచ్చును కాని, బలము ఉండునది వానిలోనే. ముందునకు పోవు ఉరవడిలో ఎంతో బలమును మనము తఱచు కోల్పోవుచుందుము. సహనశీలునిలో ఉన్నంతకంటె ఎక్కువబలము దురభిమానిలో ఉండు ననుట నిక్కము. కావున దురభిమానిలో సైతము ఒక గొప్ప గుణము ఉన్నది, బలమును, అపరిమితబలమును, అతడు పదిలపఱచుకొనుచున్నాడు. వ్యక్తివలెనే జాతియు పదిలపఱచుటకై బలమును ప్రోగుచేసికొనును. యూదులను శత్రువులు అన్నివైపులను క్రమ్ముకొనుచుండిరి, రోమనులు వారిని ఒక కేంద్రమున సంక్షుభవించునట్లు తరుముచుండిరి, విజ్ఞానరంగమున యవనాభిరుచులును పారశీకమునుండియు భరతఖండమునుండియు అలెక్సాండ్రియానుండియు కల్లోలములు వారిని చుట్టుకొనుచుండినవి. ఇట్లు శారీరకముగను మానసికముగను నైతికముగను ముట్టళ్లకు లోనైన ఆ జాతిలో గూఢమై పదిలమైన ఘోరబలము ఉండినది. ఆ బలమును వారిసంతతివారు నేటికిని నిలుపుకొని ఉన్నారు. వారు తమబలమును పూర్తిగను తప్పనిసరిగను జెరుసేలముపైని తమమతముపైని కేంద్రీకరింపవలసి వచ్చెను. ప్రోగువడిన బలము గడ్డకట్టుకొని ఉండిపోజాలదు. దానికి వ్యాప్తియు నిర్గమనమును తప్పక ఉండును. ఏ శక్తిని కాని ఒక మూలలో చిరకాలము నిర్బంధించి ఉంప లేము. అభివ్యాప్తిని పిమ్మటికి నెట్టివేసి ఆ బలమును చిరకాలము అదిమి పెట్ట లేము.

యూదులజాతిలో ఇట్లు ప్రోగువడిన శక్తియే, దీనికి అనంతర యుగమున క్రైస్తవమతోదయరూపమున ప్రకటమైనది. కూడిన వాగులు అన్నియు ఒక్క ప్రవాహముగ నైనవి. క్రమక్రమముగ చుట్టి ప్రవాహములన్నియు నొక్కటిగ నైనవి. మిన్నొరయ లేచిన యా యలపైని నాజరత్ జీససు వెలుగొందుచున్నాడు. ఇట్లే ప్రతియుగమును ప్రతిజాతియును తన ప్రవక్తను సృజించుకొనును. ఆ ప్రవక్త భవిష్యత్తును తాను సృజించును. ఏది ఇప్పుడు 'కారణము'గ ఉన్నదో, గతకాలమునకు అదే 'కార్యము'. భవిష్యత్తునకు అదే కారణము. దివ్యసందేశహారి స్థానమును అట్టిదే. యూదుల జాతిలో ఏది అత్యున్నతమో ఏది అత్యుదాత్తమో, ఏ యర్థమునకై ఎట్టి జీవితమునకై ఆ జాతి తరతరాలుగ శ్రమపడెనో అది అంతయు దివ్యసందేశహారిలో రూపుదాల్చినది. ఇకను తన జాతి భవిష్యమునకే గాక లోకములో ఇతరానేక జాతుల భవిష్యమునకు కూడ ఉత్సాహప్రదాత ఆయనయే.

మనము మఱి యొక విషయమును గూడ మఱవ కుండ వలయును. నాజరత్ ప్రవక్త యైన క్రైస్తును నేను ప్రాచ్యదృక్పథముతో జూతును. అసలు ఆయన అప్పటముగ ప్రాచ్యుడు అను సంగతిని మీరు తఱచు మఱచిపోవుచుందురు. ఆయనకురులకు పసుపు వన్నెను కన్నులకు ఊదారంగును వేసి మీరు ఆయనను వర్ణింప బూనుకొన్నను, ఆయన ప్రాచ్యుడే. బైబిలులో గృహీతము లైన ఉపమానములును కావింపబడిన కల్పనలును — దృశ్యములును స్థానములును, వైఖరులును, సమూహములును, కవితయు, చిహ్నములును—ప్రాచ్య దేశమునే మీకు వర్ణించి చెప్పుచున్నవి. ప్రజ్వలమైన నభము, వేడిమి, సూర్యుడు, ఎడారులు, తృష్ణార్తు లైన మానవులును ఇతరప్రాణులును, నీరు చేదుకొను బిందెల తలలపై మోచుచు బావుల కడకు వచ్చు మగవారును మగువలును, పశుతతులు, కర్షకులు, నలు వైపుల సాగుచుండు వ్యవసాయము, జలయంత్రములు, చక్రములు, యంత్రముల నడపుటకై నిలవరము చేయబడిన నీ రుండు గుంటలు, తిరగళ్లు — ఇవి యన్నియు ఆసియాలో ఈనాడు గూడ కాన నగు చుండును.

లోకమునకు ఆసియా ఘోషించునది దేనిని అనగా ఆస్తిక్యమును, ఐరోపా ఘోషించునది దేనిని అనగా రాజకీయవిషయాలను. ఆసియా యూరపులు ఒక్కొక్కటియు తన తన రంగములో గొప్పదే. ప్రాచీనగ్రీసు దేశము దేనిని ఘోషించినదో యూరపు ఘోషించునదియు దానినే. గ్రీకుచిత్తమునకు తన పరిసరసంఘమే సర్వస్వము. పరిసరములకు వెలుపలి ప్రాంతమెల్ల మోటుతనముతో కూడినదే. జీవించి యుండు అధికారము గ్రీకులకు తప్ప వే ఱెవ్వరికిని లేదు. గ్రీకులు ఏమి చేసినను అది ఒప్పే, మంచిదే. లోకములో తక్కినవి ఏవి ఉన్నను అవి ఒప్పులు కావు, మంచివి కావు, వాని నుండనీయ రాదు. గ్రీకుల సానుభూతిలో మానవ సంబంధము అతిమాత్రముగ ఉన్నది, స్వాభావికత అతిమాత్రముగ ఉన్నది, కావుననే దానిలో కళయు అతిమాత్రముగనే ఉన్నది. గ్రీకు పూర్తిగా ఇహలోకపరుడు. కలలు గనుచుండు ఓపిక అతనికి లేదు. అతని కవిత్వము కూడ వాస్తవపరమైనదే. అతని వేల్పులును దేవేరులును మానవు లగుటే కాదు, వారిలో మానవత్వము గాఢముగ ఉన్నది; మానవులలో ఉన్నట్టి భావములును వాని ఉద్రేకములును ఆ వేల్పులలోను గలవు. సౌందర్యముపై గ్రీకులకు ప్రీతి, కాని అది సదా బాహ్యప్రకృతి మాత్రమే అనుటను మీరు గుర్తింతురు గాత. కొండల-మంచురాసుల-పూల-చక్కదనము, రూపముల బొమ్మల చక్కదనము, మానవ రూపమున, మానవుని మోమున ఉన్న చక్కదనము — ఇదే గ్రీకులకు నచ్చినది. యూరపు సంప్రదాయమునకు గ్రీసుది గురుస్థానము కావున యూరపునకు గ్రీసు ఏమి నేర్పినదో లోకమునకు యూరపు అదే నేర్పినది.

ఆసియాలో వేఱొక రీతి కూడ కలదు. ఆ ఖండమును మీ తలంపునకు తెచ్చుకొని చూడుడు, అది బ్రహ్మాండ మైనది. అచట కొండల యెత్తు మేఘమండలము నతిక్రమించి ఆకసమును ఒరయు చుండును. ఎడారులా, నూర్ల కొలది మైళ్ల వైశాల్యము గలిగి యుండును. ఎడారులలో ఒక్క చుక్క యేని నీరు కనబడదు, ఒక్క పోచ పచ్చిక యైనను మొలవదు. ఇక అడవులను చూడుడు. వానికి అంతు ఉండదు. మహానదులా, సాగరసన్నిభ

ములై మహావేగముతో ఉరవడించుచు సముద్రమున గలియు చుండును. ఈ పరిసరముల నడుమ ఉన్నందున ప్రాచ్యులకు సౌందర్యములందును ఉదాత్తతయందును గల రుచి ప్రత్యేక మార్గమున పెంపొందినది. వారికి బాహ్యదృష్టి పట్టువడక, లోచూపు అలవడినది. ప్రకృతితృష్ణ అక్కడను ఉన్నది, అధికారవాంఛ అక్కడను ఉన్నది, ఇతరులను మించవలె నను ఉబలాటము అక్కడను ఉన్నది. గ్రీకులకు అగ్రీకులకు ఉన్న భావాలు అన్నియు అక్కడివారికిని ఉన్నవి. కాని ఈ భావాలకన్నిటికిని తక్కిన చోట్లకంటె అక్కడ ఎక్కువ విశాలత చేకూరినది. ఆసియాలో ఈనాటికి కూడ జాతినిర్ణయము పుట్టుకపైని గాని, మేని వన్నెపైని గాని, భాషపైని గాని ఆధారపడదు, మతముపైనే ఆధారపడి యుండును. అక్కడ క్రైస్తవులు ఒకజాతి, మహమ్మదీయులు ఒకజాతి, హిందువులు ఒకజాతి, బౌద్ధులు ఒకజాతి. బౌద్ధులు చైనానుండి రానీ, పర్షియా నుండి రానీ, తాము సోదరుల మని వారు అనుకొందురు. ఏల యన తమ అందఱ మతము బౌద్ధమే. మానవులకు ఐక్యబంధము మతము. ప్రాచ్యులకు ఆచరణ కందని ఊహలను చేయుటయు కలలు గాంచుటయు సహజ మగుట కూడ ఇందు చేతనే. జలపాతములలోని కెరటములు, పక్షుల పాటలు, చంద్రార్క తారాగణములయు నిఖిలభూమండలముయొక్కయు సొంపులు — వీనివలన ఆహ్లాదము చాలినంతగనే కలుగును కాని ప్రాచ్యుల చిత్తవృత్తికి తనివి గలిగించుటకివి చాలవు. ఈ కలలకంటె పెద్ద కలలను కనగోరువారు వారు, వర్తమానమును అతిక్రమింపగోరు వారు వారు. వర్తమానము వారికి ఒక లెక్కలోనిది కాదు. ప్రాచ్యభూములు యుగయుగములుగా మానవతతికి నివాసములై ఉన్నవి. అక్కడ అనుభవమునకు రాని భాగ్యవిపర్యాసాలు లేవు. రాజ్యముల పిమ్మట రాజ్యములు, సామ్రాజ్యముల పిమ్మట సామ్రాజ్యములు వెలసినవి. మానవుల శక్తియు మహిమయు సంపదలును అచ్చట వెల్లివిరిసినవి. శక్తియు సామ్రాజ్యములును విద్యయు పూడి యున్న నెలవు ప్రాచ్యము. కావున ప్రాచ్యుల చిత్తమునకు ఐహికవస్తువులపై విరక్తి పుట్టుట సహజమే. మార్పు లేని దానికై వినాశము లేని దానికై, దుఃఖ మరణాక్రాంత మైన యీ జగత్తులో అమృతముగను నిత్యముగను ఆనందమయముగను ఉండుదానికై, వారు ఉవ్విళ్లూరుటయు సహజమే. ప్రాచ్యప్రవక్తలు విసుగు విరామము లేక ఈ లక్ష్యములనే నొక్కి చెప్పుచుందురు. మీరు జ్ఞప్తి ఉంచుకోవలసిన విషయము ఏమనగా దివ్యసందేశహారు లైన ప్రవక్తలు అందఱును ప్రాచ్యులే, ప్రాచ్యుడు కాని ప్రవక్త ఒక్కడైనను లేడు.



"మీ జ్ఞానము రవంత మేలుకాంచినంతమాత్రమున మీరు సోమరులుగా ఉండ వలదు. పురోగమింపుడు, గంధపు చెట్ల తోపున కావల ఇంకను విలువ గల వేఱు వస్తువులు, వెండి గనులు, బంగారు గనులు, మున్నగు నవి ఉన్నవి."

—శ్రీరామకృష్ణుడు

# సుభాషితములు

'ఉభయభాషా' 'సాహిత్యవిద్యా' ప్రవీణ :

శ్రీ అఖండం సీతారామశాస్త్రిగారు, పి. ఓ. ఎల్.

రత్నగర్భను గల నీతిరత్నములను, జ్ఞానధనమును వెలబోసి సంతరించి,
ప్రాణమిత్రము లగు సుహృద్రత్నములకు వాని నర్పించి, ఋణమును బాపుకొందు.

నీతిరత్నాలహారంబు ప్రీతితోడ కంఠమందున ధరియింప కాంతి గలుగు,
ప్రతిభయును ప్రజ్ఞయును గల్గు, ప్రబల మైన కీర్తిసంచయమును గల్గు, నార్తి దొలగు

చందన మొసంగు జనులకు జల్లదనము, చందురుడు గలిగించును జల్లదనము,
ఇందు చందనములకంటె నెక్కువగను సాధుసంగతి యొసగును జల్లదనము ॥ ౧

సూర్యచంద్రులు నదులును సుజనవరులు ఆవులును మేఘములు గూడ నవనియందు
పరుల కుపకార మొనరింప వలయు నంచు తలచి దైవంబు సృజియించె తథ్యముగను! ౨

గార్దభారోహణంబున కన్న భువిని సింహపాదాహతియె మఱి శ్రేయము కద,
అరయ మూర్ఖునితోడి స్నేహమ్ము కన్న పండితునితోడి వైరమ్ము బహుగుణంబు ॥ ౩

పశువు దా నూతిలోపల బడెన యేని, కొట్టుకొనుచుండు నెంతయు గట్టు జేర;
మనుజపశు వార సంసారవనధి బడియు, తీరముఁ జేర దైవంబు గోరడు గద ॥ ౪

అస్త్రశస్త్రంబు లశ్వంబు లంగనలును మంచిమాటలు వీణయు మహిని జూడ
గొప్పపురుషుని జేరిన గొప్ప వగును, నీచునిం జేర నన్నియు నీచము లగు ॥ ౫

సజ్జనులమైత్రి యెప్పుడు సౌఖ్య మిచ్చు, గొప్పపదవిని గూర్చును, గోర్కె లిచ్చు,
వీధులను బోవు నీరంబు విష్ణుపదిని చేరి, దైవతపూజ్యమై చెలగు గాదె ॥ ౬

ఖలులకును కంటకంబుల కిలను రెండు తెఱగులఁ దండనంబులు బఱగుచుండు
చెప్పునఁ గొట్టు టొక్కటి, చేతబట్టి దూరదూరంబునకు పారద్రోచు టొకటి ॥ ౭

వైద్యరాజున కొనరింతు వందనంబు యమునిసోదరు డత డంచు నాత్మలోన ;
యముడు ప్రాణాల మాత్రమె యపహరించు ప్రాణధనముల గొంపోవు వైద్యరాజు ॥ ౮

అశనవసనాల కించుక వసతి యున్న, ఖలుడు ధనదుని గవ్వకు గొన డదేమొ!
అక్షరంబుల నాల్గింటి నభ్యసించి, శివునికే విద్య జెప్పగ సిద్ధపడును ॥ ౯

దుర్జనుడు శిక్షితుం డయ్యు దుర్జనుండె, సజ్జనుండుగ మారడు చక్కబడడు,
గంగ నిడ కేశములు కుశగతిని గనునె? సహజగుణ మది మారదు చచ్చువఱకు ॥ ౧౦

(సశేషము)



# వార్తలు, విశేషాలు

## శ్రీరామకృష్ణజయంతి

### శ్రీ రామకృష్ణమఠము, మద్రాసు.

తే 3–3–1957 ది శ్రీరామకృష్ణుని నూట యిరవై రెండో జయంతి. ఉదయం ఐదు గంటలకు మంగళహారతి, తర్వాత ప్రదక్షిణభజన; 7 గంటలనుండి 8 గంటలవఱకు శ్రీరామకృష్ణ మిషను స్టూడెంట్సుహోమ్ విద్యార్థుల వేద పారాయణం; 8 గంటలనుండి 12-30 గంటల వఱకు ప్రత్యేకపూజ; తర్వాత హోమము; వేయిమంది భక్తులకున్నూ తొమ్మన్నూఱు దరిద్రనారాయణులకున్నూ విందు — ఇది ఆ నాటి పూర్వభాగమున జరిగిన కార్యక్రమం. జయంతి దినాల మామూలు ప్రకారం సాయం తనసేవకు అనంతరం గోష్ఠిలో శ్రీశుద్ధసత్త్వానందస్వాములు శ్రీరామకృష్ణుని గాస్పెలు (=సూక్తిసుధ) నుండి కొన్ని పుటలు చదివి వినిపించారు. మఠాధ్యక్షులు శ్రీమత్కైలాసానందస్వాములు ఉపన్యసించారు.

బహిరంగోత్సవం తే 10-3-1957 ది — ఉదయం 8 గంటలకున్నూ 10 గంటలకున్నూ నడుమ సుమాఱు ఎనభైమంది భక్తులు పూనుకొని 'ది గ్రేట్ మాస్టర్' 'గాస్పెల్' అను గ్రంథాలను రెండింటిని పూర్తి పారాయణంచేశారు. తర్వాత మఠసాధువులలో కొందఱు పెద్దల సంగ్రహోపన్యాసాలు జరిగాయి. మధ్యాహ్నానంతరం 3 గంటలనుండి 5 గంటలవఱకున్నూ మన్నార్గుడి సాంబశివయ్యర్ వర్గంవారు సుప్రసిద్ధ రామగేయవిరచిత మైన శ్రీత్యాగరాజస్వామి గారి చరిత్రసంకీర్తనం చేసి సదస్యులను ఆనంద పఱిచారు. అనంతరం బహిరంగసభ. శ్రీమత్కైలాసానందులు సదస్సుకు స్వాగతమంగళాశాసనం అనుగ్రహించారు. మాజి భారత సర్వసేనాధ్యక్షులు శ్రీ K. M. కరియప్పగారు అధ్యక్షపీఠం అలంకరించారు. కొందఱు బాల బాలికలు శ్రీ వివేకానందస్వాముల గ్రంథ భాగాలను కొన్నింటిని వల్లించారు. ప్రొఫెస్సరు వేదం వేంకటరాయశాస్త్రి ఎమ్.ఏ. గారు తెలుగులో ఉపన్యసిస్తూ శ్రీరాముని శ్రీకృష్ణుని గుణాలను తనలో మేళవింపచేసికొన్న నవ్య యుగావతారమూర్తి శ్రీరామకృష్ణు డనిన్నీ, పుట్టిన క్షణంనుండి పుష్పంలో పరిమళం హెచ్చేటట్లు శ్రీరామకృష్ణునిలో అవతరించిన క్షణం నుండియే భగవద్భక్తి పెంపొందింది అనిన్నీ అన్నారు. తిరువనంతపుర శ్రీరామకృష్ణసేవా సంఘాధ్యక్షులు శ్రీ తపస్యానందస్వాములు ఆంగ్లంలో ఉపన్యసించారు, దేశవైజ్ఞానికచరిత్రలో మతప్రవక్తకు గల స్థానం సాటిలేని దని అగ్గించారు, ఒక్కొక్క ప్రవక్తయున్నూ తన కొంచెపాటి జీవితకాలంలోనే దేశవిజ్ఞానాన్ని సమగ్రంగా జ్ఞప్తికి తెస్తా డన్నారు, 'ఈ కాలంలో విదేశాలకు మన దేశంలో నుంచి వైజ్ఞానికసందేశహారులు వెళ్తున్నారుకాని, నృత్యాది లలితకళలు మాత్రమే విజ్ఞానం కాతుం దని, వారి అభిప్రాయం. అంతకంటె ముఖ్యములున్నూ శాశ్వతములున్నూ ఐన విజ్ఞానవిశేషాలను వాళ్లు గణించడం లేదు. ఈ పరిస్థితి శోచనీయం'

అన్నారు. సాధకులు తప్పక అనుసరింపవలసిన శ్రీరామకృష్ణుని ఉదాత్తబోధనలను తెలుపుతూ అందులో నాల్గింటిని చాల నొక్కి-చెప్పారు — (1) బ్రహ్మచర్యం, (2) తపస్సు, (3) భక్తి, (4) జ్ఞానం. తర్వాత శ్రీ మార్క్ K. పంజాబకేశన్ M.A., L.T. గారు తమిళంలో ప్రసంగించారు, శ్రీవివేకానందస్వాములు అనుగ్రహించిన ప్రణామమంత్రాన్ని ప్రతిపదస్వారస్యోద్ఘాటనపూర్వకంగా వివరించి, అవతారపురుషులలో శ్రీరామకృష్ణునకు సాటి లేదని సోపపత్తికంగా సిద్ధాంతించారు. సభాధ్యక్షులు శ్రీకరియప్పగారు తమిళంలో మాటాడే సామర్థ్యం తమకు లేనందుకు విచారాన్ని 'తమిళం'లో వెళ్లబుచ్చి, ఆంగ్లంలో ఉపన్యసించారు. ఆ ఉపన్యాసానువాదాన్ని తర్వాతి సంచికలో ప్రత్యేకవ్యాసంగా ప్రచురిస్తాం. జయంతిమహోత్సవ సందర్భంలో వివిధనగర పాఠశాలలవారు జరిపిన పోటీలలో నెగ్గిన విద్యార్థులకు సభాధ్యక్షులు బహుమతులిచ్చిన పిమ్మట ప్రొఫెసరు P. శంకరనారాయణనుగారు ఉపన్యాసకులకు అధ్యక్షులకు సదస్యులకు సహకారులకు కృతజ్ఞతాభివందనసమర్పణం చేశారు. ఆరతి—ప్రసాద వినిమయాలతో నాటి కార్యక్రమం ముగిసింది.

### శ్రీమత్స్వామి బ్రహ్మానందజీ మహారాజు జయంతి, భువనేశ్వరము (ఒరిస్సా).

ఒరిస్సా రాష్ట్ర రాజధాని యైన భువనేశ్వరంలోని రామకృష్ణమఠాన్ని సలభై యేండ్ల క్రితం నెలకొల్పినవారు 'మఠ' 'మిషను' ల ప్రథమసర్వాధ్యక్షులైన శ్రీమద్బ్రహ్మానంద స్వాములు. ఆ మఠంలో, వారి తొంభైనాలుగో జయంతి మహోత్సవం తే 1-2-1957 ది వైభవోపేతంగా జరిగింది. భజనలు, ప్రత్యేకపూజ, హోమం, సుమారు రెండువేలమందికి సమృద్ధమైన విందు, బహిరంగసభ — అనేవి నాటి కార్యక్రమాలు. ఒరిస్సా ప్రధానమంత్రులైన పూజ్యశ్రీ డాక్టరు హరేకృష్ణమెహతాబుగారు ఆధ్యక్ష్యం వహించారు. వారు తమ ఉపన్యాసంలో శ్రీబ్రహ్మానందస్వాములతో తమకు గల్గిన సమాగమసల్లాపాలను పేర్కొని అంతర్దేశీయమై విశ్వవ్యాప్తమైన శ్రీరామకృష్ణసంస్థ నిర్వహిస్తున్న మానవసేవాకార్యవిశేషాలను కీర్తించారు. శ్రీ అసంగానందస్వాములు శ్రీబ్రహ్మానందస్వాములకు గలిగినసిద్ధుల విలక్షణతను, శ్రీరామకృష్ణసంస్థను వారు పెంపొందజేసిన రీతిని కొనియాడారు. మ్యూసియం క్యూరేటర్ శ్రీ కేదారనాథమహాపాత్రులు తమ ప్రసంగంలో భారతదేశమునకు లభించిన రాజకీయ స్వాతంత్ర్యమును, నైతికాధ్యాత్మికపురోగతికి శ్రీరామకృష్ణసంస్థవారు సల్పుచున్న కృషిని ప్రస్తుతించారు. శ్రీరామేశ్వరానందస్వాములు తమ పట్ల శ్రీబ్రహ్మానందుల అనుగ్రహానికిన్నీ వారి దయాదాక్షిణ్యాది గుణగణాలకున్నూ జోహారులు అర్పించారు. సదస్సుకు కృతజ్ఞతాభివందనాన్ని శ్రీజ్ఞానస్వరూపానందస్వాములు చెల్లించారు. మలి సమావేశంలో శ్రీప్రణవాత్మానందస్వాములు

శ్రీరామకృష్ణ వివేకానందోద్యమవిషయికంగా ఉపన్యసించారు.

### శ్రీ రామకృష్ణసేవాసమాజము, తెనాలి

జనవరి 22, 27 తేదులలో ఈ సమాజం వారి ఆధ్వర్యాన శ్రీవివేకానందస్వామివారి 95–వ జన్మదినోత్సవం, వేదపారాయణం, భజన, దరిద్రనారాయణసంతర్పణ, అడిషనల్ సబ్జడ్జ్‌గా రైన శ్రీవేటూరి కామేశ్వరరావు ప్రభృతుల ఉపన్యాసాలు, శ్రీ పన్నాల రామ శేషగిరిశాస్త్రిబృందమువారి 'భక్తరామదాస బుఱ్ఱకథ' అనే కార్యక్రమాలతో అత్యంత వైభవోపేతంగా జరిగింది. సదస్యులకు ప్రారంభ మంగళాభివందనాన్ని శ్రీ మతుకుపల్లి వేంకట లక్ష్మీనరసింహారావుగారున్ను పరిసమాప్తి మంగళాభివందనోపచారాన్ని శ్రీ మట్టిగుంట వీరభద్రరావుగారును నిర్వర్తించారు.

### శ్రీ రామకృష్ణజయంతి మహోత్సవ యువజనసంఘం
### శ్రీదత్తక్షేత్రం, కొ్రకచేరు గ్రామం

తే 3-3-1957 ది శ్రీరామకృష్ణజయంతి మహోత్సవాన్ని ఈసంఘంవారు శ్రీమత్స్వామి వైరాగ్యానందజీగారి యాజమాన్యమున మహా నందవైభవసనాథంగా జరిపారు. ఉదయం భేరీనగరసంకీర్తన, ధ్వజస్థాపన, కలశస్థాపన, పూజ, హోమం, సంతర్పణ అనే కార్యక్రమా లున్నూ, మధ్యాహ్నం 3 గంటలనుంచి శ్రీ విద్వాన్ సాధు నరసింహశాస్త్రులు; అడ్వకేటు శ్రీ సంజీవరావుగారు, సభాధ్యక్షులైన శ్రీ పూజ్యపాద స్వాములవారున్నూ శ్రీగురుమహా రాజజన్మలీలాది విశేషాలను గూర్చి చేసిన ఉపన్యాసాలతోడి బహిరంగసమావేశమున్నూ, తర్వాత నగరోత్సవమున్నూ జరిగాయి.

# గ్రంథసమీక్ష

### విమెన్ సెయింట్స్ ఆఫ్ ఈస్ట్ అండ్ వెస్ట్
(ఆంగ్లమున)

శ్రీమతి పండిత విజయలక్ష్మిగారి మున్నుడి, కెన్నెత్ వాకర్‌గారి ఉపోద్ఘాతము. పుటలు 274, ప్రథమముద్రణము 1955, వెల 10 రూపాయలు, ప్రాప్తిస్థానము రామకృష్ణ వేదాంతసెంటర్, లండన్.

ఈ గ్రంథము శారదామాతృశ్రీశతతమ జయంతిపుష్పముగా ప్రకటింపబడినది. ఇందులో హైందవ క్రైస్తవ యోగినులే కాక, బౌద్ధ జైన – యూద – సూఫీ మతాల యోగి నులును వారి జీవితకథా – భక్తిగేయ – ప్రశంసా పూర్వకముగా ప్రస్తుతింపబడి ఉన్నారు. ఒక్కొక్క యోగినిని గుఱించిన్నీ వ్రాయ గల నిష్ణాతయే వ్రాసి యున్నాడు, శ్రీఘనానందస్వాములు ఇందలి పీఠికలో హిందూ మహిళల ఆధ్యాత్మిక సంప్రదాయా లనుగూర్చి అపూర్వవిషయాలను తెలిపి ఉన్నారు. ఈ నూత్న గ్రంథ రాజమునకు మా అభినందనం.

—ప్రభాకర్.

## మహాత్ముని మాటలు

అను : శ్రీ దిగవల్లి శేషగిరిరావు; ప్రచురణ : శ్రీరామతీర్థసేవాశ్రమం, పిడుగురాల; 10 + 186 పుటలు; వెల : 12 అ.

'దస్ స్పేక్ మహాత్మా' అను నాంగ్లమూలమునకు ఆంధ్రీకరణముగ దీనిని ప్రచురించుట మిక్కిలి ముదావహము. ఇందు భగవంతుడు, ప్రార్థన, రామనామము ఇత్యాది భగవద్విషయములును, చరఖా, ఖాదీ వంటి లౌకికవిషయములును, మరియు నితరములు నగు 36 విషయములపై గాంధీమహాత్ముని ప్రవచనములు గ్రథితము లైనవి. అస్పృశ్యతను గురించిన బాపూజీ పల్కు లివి: ''అస్పృశ్యత హిందూమతములో నొక భాగమే యగుచో నేను హిందువుడ నని చెప్పుకొనుటకు నిరాకరింతును. అంతే గాక, నా ఉన్నతాశయములకు అవకాశము గల ఏ ఇతరమతము నైన స్వీకరింతును. అదృష్టవశాన నా ఉద్దేశము ననుసరించి అస్పృశ్యత హిందూమతమునందలి భాగము కాదు. ఇది హిందూమతమునకు ఒక కళంకము గాన ప్రతి హిందూమతాభిమానియు ఈ కళంకమును తొలగించుకొనుటకై తన్ను త్యాగ మొనర్చుకొన వలసి యున్నది.''

ఈ సూక్తిమౌక్తికములు వ్యక్తిత్వ మాసించు ధీరులకును, బాధ్యత తెలిసి మెలగు సామాన్య పౌరులకును అవశ్యాచరణీయములు. మహాత్మునికి ప్రాణాధికము లైన సత్యాహింసలు, స్వార్థరాహిత్యము, విశ్వప్రేమయు, విశ్వశాంతికి, వ్యష్టిశాంతికి రాచబాటలు గదా.

ఈ నూత్న ప్రచురణకు 'శ్రీరామకృష్ణప్రభ' శుభాశీస్సులు.

—శారదాశరణ్.

''దేవునివంకకు, అందఱును ఆకృష్టులు కానే లేరు. కొందఱు విశిష్టాత్ములు మాత్రమే, ఆలాగు ఆకృష్టు లగుదురు. ఆజన్మము సత్ప్రవణతలు గల వారికి మాత్రమే, భగవంతునందు ప్రేమ గలుగును.''

''భగవత్ప్రాప్తి గలుగ వలయు నన్న, మంచి పూర్వవాసన ఉండ వలయును. ఈ జన్మములోను, వేఱొక జన్మములోను, ఏదో ఒక విధమైన తపస్సును, దేని నైనను, చేసి ఉండ వలయును.''

''దేవునకు సంతోషము గూర్పుము. ఎల్లరును సంతోషింతురు. దేవుడు ప్రీతు డైనచో, విశ్వ మెల్ల ప్రీత మగును.''

—శ్రీరామకృష్ణుడు.

పూజితుల తృప్తు లగుదురు భూజను లారు; లచ్యుతుండు పూజితుఁ డగుడుం,
దేజమున జగత్త్రితయముఁ బూజిత మయి తృప్తిఁ బొందుఁ బుణ్యసమృద్ధిన్ ॥

—భీష్ముడు. భార. II-ii-28.



# నారద భక్తి సూత్రములు

అనువాదకులు : శ్రీ దొడ్ల వేంకటరామరెడ్డిగారు

శ్రీ త్యాగీశానందస్వాములవారి ఆంగ్ల గ్రంథమున కిది తెనిగింపు. భక్తిని గూర్చిన సమస్త విషయములును ఇందు విపులముగ నున్నవి. భాష సులభము, సరళము.

310 పుటలు వెల : రూ. 3/-

---

# శ్రీ శారదా ప్రసంగములు

అనువాదకులు : కీ॥ శే॥ వెదురుమూడి వేంకట కృష్ణరావుగారు

శ్రీ రామకృష్ణ పరమహంస సహధర్మచారిణియు, ఆదర్శసతి, ఆదర్శయోగిని, ఆదర్శమాతయు నగు శ్రీ శారదాదేవి భక్తులతో నొనర్చిన దివ్యసంభాషణలు.

"...ఈ గ్రంథము ఆంధ్రదేశమున అక్షరాస్యలగు స్త్రీలెల్లరు జదువదగినది..." —త్రిలిఙ్గ

312 పుటలు (ప్రథమ ముద్రణము) వెల : రూ. 2-50

# కులము, సంస్కృతి, సామ్యవాదము

అనువాదకులు : శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

హైందవ సంస్కృతిని ఎన్నో శతాబ్దములుగా పోషించి యభివృద్ధినొందించిన గుణకర్మ విభాగమూలమగు చాతుర్వర్ణ్యవ్యవస్థ మతాచార్యకైతవముచే మార్పబడి, భ్రంశమొంది, దేశపతనకారియయ్యెననియు దేశాభ్యుదయమును ఇప్పుడు మరల సాధించుటకు హరిజనులు మొదలు సర్వనిమ్నజాతులకు సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక, పారమార్థిక ఉన్నతిని కలిగించి సర్వతోముఖసామ్యమును కల్పింపవలెననియు శ్రీ వివేకానందస్వామి ఈ గ్రంథమున ఉద్ఘాటించియున్నాడు. దేశాభ్యుదయమును అభిలషించువారందఱికిని అవశ్యపఠనీయమగు గ్రంథము.

116 పుటలు అందమైన కూర్పు వెల : రూ. 1/-

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# బ్రహ్మానందబోధనలు

(శ్రీ బ్రహ్మానందస్వామి జీవితోపదేశములు)

శ్రీ చిరంతనానందస్వామి

"శ్రీ రామకృష్ణదేవునియొక్క పారమార్థిక పుత్త్రుడు" అని పేరొందీ, శ్రీ వివేకానంద స్వామితో ఇంచుమించు సమానౌన్నత్యము నొందిన భక్తిజ్ఞానసిద్ధుడగు మహాపురుషుని సవిస్తర జీవితమును, దివ్యోపదేశములును గల యీ గ్రంథము జిజ్ఞాసువుల కందఱకు అవశ్య పఠనీయము, మహోపకారకము.

త్రివర్ణముఖచిత్రము, శ్రీ రామకృష్ణునియొక్కయు, శ్రీ బ్రహ్మానందస్వామియొక్కయు ఛాయాచిత్రములు గలవు.

344 పుటలు (ప్రథమ ముద్రణము) వెల: రూ. 3-50

---

# శ్రీ శారదాదేవి

రచయిత: శ్రీ నండూరి బంగారయ్యగారు, బి. ఏ., బి. ఎల్.

శ్రీ శారదాదేవి దివ్యజీవితము ఇందు వివరముగ, మనోహరభావలో చిత్రింపబడి యున్నది. ఆమె హృదయము నెఱుంగగోరు భక్తులీ గ్రంథమును జదివి తీరవలయును! క్రొత్తవిషయ మెంతో సేకరించి కూర్చబడిన యద్భుత గ్రంథము.

144 పుటలు వెల: రూ. 1-25

---

# పవహారిబాబా

(శ్రీ వివేకానందస్వామి ప్రణీతము)

అనువాదకులు:

శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

ఇది కాశికి చేరువ గాజీపూరులో నుండిన యొక గొప్ప ఋషీశ్వరుని అత్యద్భుత జీవిత చరిత్ర! శ్రీ వివేకానందస్వామి ఈ మహనీయునియెడ అత్యంత భక్తిప్రపత్తులు గలిగి ఈయనకు శిష్యుడు కాగోరె నన్నచో ఈయన గొప్పతన మిట్టిదని వివరింప నవసరములేదు.

30 పుటలు వెల: 25 న. పై.

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యములను శ్రీ రాజాజీగారు మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను అమర్చి, తమిళభాషలో రచించియున్నారు. అందు వారి సూక్తివైచిత్రియు ప్రత్యక్షర చమత్కారమును ఎంతటి గంభీరవిషయమునైనను సర్వసుగ్రహము చేయగల నైపుణియు తలపోలమంటినవి. ఆ గ్రంథముయొక్క యనువాదములు ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, హిందీభాషలలో ఇప్పటికే అపారవ్యాప్తి నొందినవి. దాని కిది చక్కని తెలిగింపు.

128 పుటలు — వెల: రూ. 1-

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు శ్రీరామకృష్ణుని జీవిత సంగ్రహమును 1121 మహోపదేశములును గలవు.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, దేవుడు, జ్ఞానము : భక్తి : కర్మము, బ్రహ్మతత్త్వము మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డల కయిన అవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

నీతికథలును సూక్తులును మకరందపేశలములు, నిర్వృతికరములు.

... ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూక్ష్మాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్వలమగు పంచమ ముద్రణము వెల : రూ. 3-50

# హిందూమతము

రచయిత : శ్రీ వివేకానందస్వామి

అనువాదకులు: శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

హిందూమత నామమును పరస్పరభిన్నభావభూయిష్ఠములగు అనేక మతసంప్రదాయములు వహించి యుండుటచే, తత్ స్వరూప నిర్వచనమునకు ఇందు శ్రీ వివేకానంద స్వాములవారు పూనుకొని ఆ మతము వేదసంహితాకాలమునుండి ఎట్లు క్రమ పరిణామమందెనో, అందు సర్వసమ్మతమూలభావము లెవ్వియో, అది చేయు బోధ యెట్టిదో, ఇన్ని భిన్నమతాంతరము లెట్లు కలిగెనో, ఈ కలగూరగంపకు హిందూమత నామ మెట్టు లేర్పడెనో విశదీకరించియున్నారు. జిజ్ఞాసువుల కత్యంతోపయుక్తమగు గ్రంథము.

... తెనుగువాఙ్మయములో వేదాంతచర్చలపై ... ప్రకటింపబడిన గ్రంథములలో ఇది ఉత్తమోత్తమమైనదని శిరసాగ్గి చెప్పవలసియున్నది. ... —భారతజ్యోతి 12-4-1956.

168 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమతము, మైలాపూరు, మద్రాసు – 4

# శ్రీ రామకృష్ణ లీలామృతము

(లేక శ్రీరామకృష్ణ జీవిత చరిత్ర)

**అనువాదకులు :**

కీ. శే. వెదురుమూడి కృష్ణరావుపంతులుగారు, బి. ఏ; శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

ప్రశస్తమైన వస్తువు, అకలంకమైన జీవితము, లోకోత్తరమైన సందేశము. దేహమును పులకరింపజేయు ఆధ్యాత్మికానుభవములు—శైలి సరళము, మధురము. భాష నిర్దుష్టము.—సర్వవిధముల నమూల్యమైన గ్రంథరాజము.

—శ్రీ పా. వే. రాజమన్నారుగారు, గౌ॥ ప్రధాన న్యాయమూర్తి, మద్రాసు.

* * * ఈ గ్రంథము విషయానురూపమై సుబోధమైన శైలిలో రచింపబడినదనుటకు ఎట్టి సందియమును లేదు. * * *

—శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు.

* * * ఆధునిక కాలములో వెలువడిన కొలది మహాగ్రంథములలో, అన్నివిధముల నిది యొకటి. * * *

—శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

496 పుటలు (ద్వితీయ ముద్రణము) వెల : రూ. 5/-

---

# శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకు పూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదరశిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీ స్వాములవారి సంపూర్ణ చరిత్ర!

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

438 పుటలు (సప్తమ ముద్రణము) వెల : { సాదా ప్రతి రూ. 3/-<br>అట్ట బైండు రూ. 3-50 }

---

# శ్రీ శారదాదేవి చరిత్ర

(మూడవ కూర్పు)

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

ప్రతి స్త్రీయును పురుషుడును...చదువవలసిన గ్రంథ మిది...అమృతకలశము!... అనన్యసామాన్య నీతిమంజరి...తియ్యని తెలుగు...పాలవంటి శైలి... —ఆంధ్రప్రభ

246 పుటలు వెల : రూ. 2/-

---

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౩     ౧౯౫౭, మే; హేవిళంబి – వైశాఖము     సంచిక ౧౧

## విషయసూచిక


| | |
|---|---|
| నిర్వాణషట్కమ్—శ్రీశంకరభగవత్పాదులు ... ... ... | ౩౫౩ |
| మాలదాసరి – భగవత్సంకీర్తనఫలము ... ... | ౩౫౫ |
| మానవునికి దేవుడొసగిన జన్మహక్కు—[సంపాదకీయము] ... ... | ౩౬౩ |
| అవధూత గీత—శ్రీమత్ కిళాంబి రంగాచార్యులు ... ... ... | ౩౬౪ |
| అద్వైతమతము—విద్వాన్ శ్రీ చదలువాడ జయరామశాస్త్రిగారు ... ... | ౩౬౭ |
| విగ్రహ వ్యావర్తనీ డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఎం.ఏ., ఎం.లిట్., పిఎచ్.డి. ... ... | ౩౭౨ |
| బాలకృష్ణుని పూజ—శ్రీ గురుభక్త పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు ... ... | ౩౭౫ |
| ఘనె జోరుగరమ్—శ్రీమతి హెచ్. కనకలక్ష్మమ్మగారు ... ... | ౩౭౭ |
| సుభాషితములు—'ఉభయభాషా' 'సాహిత్యవిద్యా' ప్రవీణ: శ్రీ అఖండం సీతారామశాస్త్రిగారు, బి. ఓ. ఎల్. ... ... | ౩౭౯ |
| వార్తలు, విశేషాలు ... ... ... | ౩౮౦ |
| గ్రంథసమీక్ష ... ... ... | ౩౮౨ |

# శ్రీ నాగమహాశయుని జీవిత చరిత్ర

(తృతీయ ముద్రణము)

శ్రీరామకృష్ణుని గృహస్థశిష్యులలో ఉత్తమగణ్యుడు నాగమహాశయుడు. గృహస్థ జీవనమును శాస్త్రీయముగా గడుపుచు పారమార్థికమార్గమున పురోవృద్ధిగాంచుట ఎట్లా యను విషయమును ఈయన చరిత్రము మనకు నిరూపింపగలదు.

ఆబాలగోపాలము అందఱకును అర్థముకాగల సులభశైలి. చక్కని ముద్రణము!

132 పుటలు వెల: రూ. 1-25

# అనుష్ఠాన వేదాంతము

(శ్రీ వివేకానందస్వామి ప్రవచనము)

వేదాంతమనగా విశ్వశరణ్యమగు మతసిద్ధాంతము. ఆబాలగోపాలము సమస్త దేశీయులకును సమస్తమతావలంబులకును సర్వకాల సర్వావస్థలయందును ఆ వేదాంతము ఎటుల అనుష్ఠానయోగ్యమో కన్నులకు కట్టినటుల శ్రీస్వాములవారిందు స్పష్టీకరించి యున్నారు.

130 పుటలు (దివ్యమగు ద్వితీయ ముద్రణము) వెల: రూ. 1-25

అడ్రెసు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4




'సర్వేశ్వరుని శరణు జొరుము, ఆతని కృప నీ యనుభవమునకు అస్వాదము వచ్చును.''

—శ్రీ శారదామణి.



# శ్రీరామకృష్ణ ప్రభ



సంపుటము ౧౩ } ౧౯౫౭ – మే :: హేవిళంబి – వైశాఖము సంచిక ౧౧

## నిర్వాణషట్కమ్

### శ్రీ శంకరభగవత్పాదులు

[అనువాదము సంపాదకీయము]

మనో బుద్ధ్యహఙ్కార చిత్తాని నాహం,
న చ శ్రోత్రజిహ్వే, న చ ఘ్రాణనేత్రే,
న చ వ్యోమ, భూమిర్, న తేజో న వాయుశ్,
చిదానన్ద రూప, శ్శివో ౽హం, శివో ౽హమ్ ॥ ౧

కాను నే బుద్ధిని, కాను నే మనము, కా నహంకారమగా, గాను చిత్తమను,
కాను శ్రోత్రంబను, కాను జిహ్వాయును, కాను ఘ్రాణంబను, కాను నేత్రమను,
కాను గా మన్ను నేఁ, గాను గా మిన్ను, కా నయూ వాయువఁ, గా నయూ తేజు,
సచ్చిదానందుండ, శంభుండ, శివుఁడ ॥

న చ ప్రాణ సంజ్ఞో, న వై పఞ్చ వాయుర్.
న వా సప్త ధాతుర్, న వా పఞ్చ కోశః,
న వాక్ పాణి పాదం, న చోపస్థపాయూ,
చిదానన్ద రూప, ౽హం, శివో ౽హమ్ ॥ ౨

కాను నేఁ బ్రాణంబఁ; గా నైదుసురులఁ; గాను ధాతువు లేడుఁ; గాను కోశము లయిదుఁ; గాను పాణియు పద పాయువులును, కా నుపస్థయు, వాక్కుఁ గా నయూ నేను,
సచ్చిదానందుండ, శంభుండ, శివుఁడ ॥ ౨

న మే ద్వేషరాగౌ, న మే లోభమోహౌ,
మదో నైవ మే, నైవ మాత్సర్యభావః,
న ధర్మో, న చార్థో, న కామో, న మోక్షశ్,
చిదానన్ద రూప, శ్శివో ఽహం, శివో ఽహమ్ ॥ ౩

లేదు ద్వేషంబును, లేదు రాగంబు, లేదు లోభంబును, లేదు మోహంబు,
లేదు మదంబును, లేదు మచ్చరము, లేదు ధర్మము నాకు, లే దర్థవితతి,
కామముఁ లేదు, మోక్షంబునుఁ లేదు; సచ్చిదానందుండ, శంభుండ, శివుఁడ ॥ ౩

న పుణ్యం, న పాపం, న సౌఖ్యం, న దుఃఖమ్,
న మన్త్రో, న తీర్థం, న వేదా, న యజ్ఞాః.
అహం భోజనం నైవ, భోజ్యం, న భోక్తా
చిదానన్ద రూప, శ్శివో ఽహం, శివో ఽహమ్ ॥ ౪

కాను నేఁ బుణ్యంబుఁ, గాను పాపమను, కాను నే సౌఖ్యంబుఁ, గాను దుఃఖమను,
కాను నే మంత్రంబుఁ, గాను తీర్థమను, కాను వేదంబ, నేఁ గాను యజ్ఞములు,
కాను భోజనమను, గాను భోజ్యంబుఁ, కాను నే భోక్తను కాను కా నయ్య,
సచ్చిదానందుండ, శంభుండ, శివుఁడ ॥ ౪

న మృత్యుర్, న శఙ్కా, న మే జాతిభేదః,
పితా నైవ మే, నైవ మాతా, న జన్మ,
న బన్ధుర్, న మిత్రం, గురుర్ నైవ శిష్యశ్,
చిదానన్ద రూప, శ్శివో ఽహం, శివో ఽహమ్ ॥ ౫

లేదు మృత్యువు నాకు, లే దెట్టి భీతి, లే దెంచఁగా జాతిభేదంబు నాకు,
లేరు తల్లియుఁ దండ్రి, లేదు జన్మంబు, లేరు బంధులు నాకు, లేరు మిత్రములు,
లేఁడు గురు వొకండు, లేఁడు శిష్యుండు, సచ్చిదానందుండ, శంభుండ, శివుఁడ ॥ ౫

అహం నిర్వికల్పో, నిరాకారరూపో,
విభూత్వా చ్చ సర్వత్ర సర్వేన్ద్రియాణాం
న చాసఙ్గతం, నైవ ముక్తిర్, న మేయశ్,
చిదానన్ద రూప, శ్శివో ఽహం, శివో ఽహమ్ ॥ ౬

నిర్వికల్పుండను, నెఱి నిరాకార రూపుండ, విశ్వ స్వరూపుండ, నేను;
సకలేంద్రి యాతిగ సరణిని నుందు, జ్ఞేయుఁడం గాను, మోక్షితుఁడఁ గాఁబోను,
సచ్చిదానందుండ, శంభుండ, శివుఁడ ॥ ౬

# మాలదాసరి - భగవత్సంకీర్తనఫలము

(గత సంచిక తరువాయి)

## VI. బ్రహ్మరాక్షసునిలో పరివర్తనము

దాసరి అట్లు చెప్పఁగా, అతనిసత్యమునకు ఆ బ్రహ్మరాక్షసుఁడు ఆనందబాష్పములు గురియుచు, ఒడలెల్ల గగుర్పొడిచి, తన పెద్ద బట్ట తలపై మధ్యాహ్నపు మిడియెండ మెఱయుచుండ, ఆ దాసరిని కలిసికొనుటకై పరుగున వచ్చెను; కొండ తిరిగినట్లుగా ఆ దాసరికిభక్తితోఁ బ్రదక్షిణము సేసెను. పాకలవ్యాధితోఁ గూడిన యేనుఁగు ఏ విధముగా తన కట్టు కంబ మయిన చెట్టుచుట్టును దిరిగి తిరిగి, కొండలు మాఱుమ్రోగునట్లు రొద వెట్టుచు ఆ చెట్టువేరులకు తన నొసలు తగులునట్లు వ్రాలునో, ఆవిధముగ దాసరిపాదములకుఁ దననొసలు తగులునట్లుగాను కొండలు మాఱుమ్రోఁగునట్లు అతనిని స్తుతించుచును వ్రాలి కోఱలతో అతని పాదముల నెత్తి ఒక టొక్కటిగా తన శిరముం జేర్చి ఇట్లనెను.

## VII. హృదయపరివర్తనానంతరము బ్రహ్మరాక్షసునకు మాలదాసరితో నైన సంవాదము

రాక్షసుఁడు — ఈ లోకములో దేవతలును రాక్షసులును రాజులును మునులును చిల్లర పనులందుఁ దమ మాటనిజమును నిలఁబెట్టుకొన్నవారు ఉన్నారు. కాని నీవలె అతి దారుణ మైన శరీర దాన ప్రతిజ్ఞను నెఱవేర్చిన వా రెవ్వరును లేరు. నేను ఎంతో వృద్ధుఁడను. నేను చక్కఁగా ఎఱుఁగుదును. నీ వంటి ప్రతిజ్ఞానిర్వాహకులు జగత్తులో లేరని ప్రతిజ్ఞ చేయుచున్నాను. దివ్యనాదములీనుచు తుంబి కట్టిన నీ వీణెయనెడి తెప్పచేత నీవు మధుర మయిన హరిస్తోత్ర మనెడి సముద్రంపుటలలను దాఁటుచున్నావు. కుఱుంగుడి స్వామి కరుణ నీకుఁ బట్టుగొమ్మగా నున్నది. అట్టి నీకు ఈధైర్యమందును, ఈ జ్ఞప్తియందును, ఈ మాట నిలుకడయందును, శ్రీహరిసేవనమే పరాయణ మైన యీ బుద్ధియందును—సాటి యెవ్వరును లేరు.

మాలదాసరి — [రాక్షసుని కౌఁగిలించుకొని] ఓరాక్షసశ్రేష్ఠుఁడా, ఈ దినము నావ్రతమును పుణ్యాత్ముఁడ వైన నీవు కదా నెఱవేర్పించితివి? నీ యత్యంత దయాపూర్ణ కటాక్ష వీక్షణముచేత నాపని నెఱవేఱినది. ప్రతిజ్ఞలను నమ్మ వచ్చునా? ఆపదయందుండు వాఁడు ప్రాణమును దక్కించుకొనుటకై లక్షప్రమాణము లైనను జేయును. ఆ ప్రమాణములను నమ్మి, శ్రమచే దొరకిన యన్నమును వదలుకొను గొడ్డువాఁడు కలఁడా? నీవు ఒక్కఁడవే అట్టి పుణ్యాత్ముఁడవు. పేరాఁకలి నీ కడుపు నొకవైపు మాడ్చుచున్నప్పుడు సైతము "హరిభజనము చేసి ధన్యుఁడవై రమ్ము" అని పంపితివే! బ్రాహ్మణవంశమందు జనించిన యో మహాత్మా, పుణ్యజను లని రాక్షసులకుఁ గలిగిన పేరు నిజమునకు నీ యొక్కనిదే. నీ కులము

నకుఁ జేరినందున వారికిని అదే పేరైనది. మనుష్యులు రాక్షసులకు బ్రహ్మ నియమించిన యాహారము కావున నీవు నన్ను భక్షించుట యందు ఏ పాపమునుగలుగదు. అట్లు చేయక అందులకు విపరీతముగ ఇఁక నీ వేమి పలికినను, ఆలాగు పలుక వలదని ఒట్టిడు చున్నాను. నా మాటను నేను త్రికరణశుద్ధిగాఁ జెప్పినా ననుటకు భగవంతుఁడే సాక్షి. కావున నీవు నా దేహము నందు సమృద్ధముగ నున్న మెదడును క్రొవ్విన మాంసమును భక్షింపుము.

రాక్షసుఁడు—[దుఃఖముతో] అయ్యా, పుణ్యాత్ముఁడా, నీ వట్లు చెప్పఁగూడదు. నేను పుట్టినప్పటినుండి నరమాంసమునే ఈపొట్టకు పెట్టి దేహమును పెంచి మహాపాపము సంపాదించి, పిమ్మట అందులకు దుఃఖితుఁడనై, ఏ నాఁటికైనను ఒక మహామునియో వ్రతియో ఎవరో ఒక మహాపురుషుఁడు ఈ దారిని రాఁడా, అతని కరుణాకటాక్షములచేత ఈ జన్మమును దొలఁగించుకొందును గాక అని చిరకాలము ఆసతో వేచియుంటిని, నీవు వచ్చియు ఇట్లు అనుచున్నావే. మిముబోటి వైష్ణవులు కూడ మమ్ము పవిత్రులనుగాఁ జేయ కున్న ఇఁక మాకు గతి వేఱే మున్నది? కావున వెనుకటి నా నీచ వృత్తిని గణింపక దయతోఁ జూడుము. యజ్ఞ పరికరమైన క్షురము నైనను సరే బ్రహ్మహత్య చేసిన కత్తి నైనను సరే పరుసవేది సమానముగానే బంగారు చేయును. అట్లే మీ కృపయు ఎట్టి వాని నైనను సరే, నావంటి పరమ పాపుల నైనను కడతేర్పఁ గలదు.

మాలదాసరి — నా దేహము నిచ్చెద నన్న వల దని దుఃఖముతో నివారించుచున్నావు. మఱి నీకు కావలసిన దేమి?

రాక్షసుఁడు — నాయందు నీవు దయ చూపవలయును. దయచూపుట యనఁగా నాకు నీ దేహము నర్పించుట కాదు, మఱి ఏమన నా పాపమును దొలఁగించి నన్ను శుద్ధుని జేయుటే. నే నేమి ఘంటాకర్ణుని కన్న ఎక్కువ పాపము చేసితినా? ఆతని యా పాపమును దొలఁగించి విష్ణుదేవుఁ డతనికి మోక్షసామ్రాజ్యము నీయ లేదా? విష్ణుభక్తులు విష్ణుదేవునకంటె హెచ్చుగా ఈయఁ గలరు కావున ఆ యధిక శ్రేయస్సును నీవు నా కొసంగుము. ఏ ప్రాణిని సంతోషపెట్టినను, అది విష్ణుపూజనమే యగును. కావున నాకు మేలుచేసినను స్వామి సంతసించును.

మాలదాసరి — నేను ఏమి చేయ వలె నని నీ కోరిక?

రాక్షసుఁడు— నే నొక బ్రహ్మరాక్షసుఁడను. నా పేరు కుంభజానుఁడు. ఈ మఱ్ఱిచెట్టుపై వసించుచు, ఘోర కార్యములు, చేయుచు మానవులను మోసగించి, చంపి, తినుచుంటిని. నేను నీ దయకు అర్హుఁడనే. ఏలయన పూర్వజన్మమున నే నొక బ్రాహ్మణుఁడను. అప్పటి నా పేరు సోమశర్మ. ఒకానొక పాపముచే నే నిట్లైతిని. ఈదినము నీవు దేవుం గూర్చి పాడిన పాట ఫలమును నాకు ధారాదత్తము చేసితి వేని, నిందకును రోఁతకును పాత్ర మైన యీ జన్మము తుద ముట్టును. ఆర్తునిరక్షించినపున్నెము నీకును గలుగును, ధర్మసాధన మైన నీ దేహము నీకును దక్కును.

మాలదాసరి — నాకు దేహముపైఁ బ్రీతి లేదు. ఇంత కన్న నుత్తమజన్మములను అధమ

జన్మములను ఎన్నింటినో ఇప్పటికి ఎత్తి నాను. ఆవరుసలో ఇదియు నొక జన్మము. నశ్వర మైన దేహమునకై అనశ్వరమయిన హరినామ కీర్తన ఫలము నిచ్చుటయా? ఒక నాఁటి ఫలమును గాదు కదా, ఒక్క త్రుటి ఫలము నైనను ఈయను. ఈసంసార చక్రములో విష్ణుభక్తిరహితము లైనయల్ప పుణ్యములచే ఉత్తమజన్మములును పాప ములచే అధమజన్మములును గలుగుచుం డును. విష్ణుభక్తి యున్న, మోక్షసామ్రా జ్యము గలుగును. ఊతనీరును, సాలెనేత లోఁ గట్టిన బూరుగుదూదియు ఎంతయస్థిర ములో, దేహ మంత యస్థిరము. కొయ్యలో పురుగు తొలఁచిన తొఱ్ఱ, అక్షరము కా కున్నను, అక్షరమువలె కన్పట్టును. ఎండలో పసుపు, వన్నె తగ్గినను, హెచ్చినట్లు కనఁ బడును. అట్లే ఈ దేహముకూడ బూట కము. దేహమును నిల్పుకొనుటకై పుణ్య మమ్ముట, ఉప్పునకై కర్పూరము నిచ్చుట వంటిది.

రాక్షసుఁడు —ఓయీ, దాసరీ, చేఁప ఒక గ్రుక్కెఁడు నీరు మ్రింగినంతమాత్రముచేత సముద్రమున కేమి తక్కువ? ఈ దినము నీవు పాడిన పాట ఫలములో ఒక్కసగము నా కిమ్ము. అందుచేత నీ యపార హరి నామ కీర్తన ఫలము తగ్గదు.

మాలదాసరి — దేహమును గైకొనక వేఱే దేనినో అడిగి నన్నెందులకు పీడింతువు? నీకు దేహము నిత్తు నని నేను మాట యిచ్చితిని, గాని ఫల మిత్తు నని మాట యీయ లేదు. కాఁబట్టి లోఁతు ప్రశ్నలు మాని, నా దేహమును పుచ్చు కొమ్ము. రక్కసుఁడవు కావున ఇతరులను వంచించుట నీకు అలవాటు. నన్ను వంచించి గీతఫలమును ఇప్పించుకొంద మనుకొను చున్నావా? నీ యుక్తి ఫలింపదు. బావి త్రవ్వఁగా భూతము వెలువడిన ట్లగును.

రాక్షసుఁడు — విష్ణుభక్తులకు తప్పక దయ యుండ వలెను. (i) గీతా చరమ శ్లోకార్థ మెఱిఁగిన వారి కెల్ల మోక్షము గలుగును. ఆశ్లోకార్థమును మహాపూర్ణులవారు రామా నుజుల కుపదేశించి "అర్హత లేని వారికి దీని నుపదేశింపకు" మని కట్టడ చేసిరి. గురుని యాజ్ఞ మీఱుటచే తనకు నరకము ప్రాప్తించినను గీతా చరమ శ్లోకార్థము నెఱుఁగుటచే లోక మెల్ల మోక్ష మొందు నని భావించి అపారకరుణచే రామానుజుల వారు శ్రీరంగగోపురముపై నుండి ఆ రహ స్యార్థమును వెల్లడించినారు. ఆ రామాను జులే తన శిష్యబృందమునకు అనుదినమును వెల పుచ్చుకొనక పాలు పెరుగు నేయి లో నగు వానిని అర్పించుచుండిన గొల్లదంపతు లకు మోక్షమిచ్చినాఁడు. (ii) సకల జనుల కును మోక్షమునందు రుచి గల్గించుటకై ఆ రామానుజులే మరల సుందరజామాత యను మునిగా అవతరించి అర్చిరాది గతిని విశదీకరించినారు. (iii) ఆ రామానుజులే మరల తిరునారాయణపురమున శఠకోప మునిగా అవతరించి, అహోబల నృసింహ స్వామినుండి సన్న్యాసదీక్ష గైకొని, ఆం ధ్రాదిదేశములందు పాషండప్రాబల్యము నణంచి, విశిష్టాద్వైతసిద్ధాంతమును వ్యా పింపఁ జేసి, అక్కడి వారి నందఱను ఉజ్జీ వింపఁ జేయ నున్నారు. (iv) మఱియొక పండితుఁడు, వేదాంత దేశికులవారు, హయ గ్రీవోపాసకులు, శిలోంఛవృత్తులతో జీవి

తము గడపుచు విష్ణుమత ప్రతిపాదక గ్రంథములను నూర్లకొలఁదిగ రచించి తపఃకాలమున తనకు ముదు రాకుల కూర సర్పించిన యగిసెచెట్టునకు మోక్ష మొసంగనున్నాఁడు. జరిగిన జరుగ నున్న యీ విషయములను దివ్యజ్ఞానముచే నేను తెలిసికొనియున్నాను. త్రికాలజ్ఞాన మున్నప్పుడు ఈ శరీరమును విడువ నేల అందు వేమో! ఈ జ్ఞానము రాక్షసజన్మముచేతఁ గలిగినదే కాని, తపస్సత్య శమ దమాదుల వలనఁ గలిగినది కాదు. ఎఱుకత భవిష్యత్తును దెలుపుచుండును. గుడ్లగూబ మున్నగు కొన్ని పక్షులు సైతము భవిష్యత్తును సూచించుచుండును. అవి తపస్వులా? వానికి పవిత్రత గలదా? మా విజ్ఞానమును అట్టిదే. మేము నాస్తికులము. శాస్త్రములను నేర్చుకొన్నాము, అర్థము చేసికొన్నాము. అంతే. వానిని ఆచరించుటగాని ప్రచారము చేయుట గాని మేము చేయలేదు. కావున ధర్మము మాకు దూరమైనది. కాఁబట్టి మా విజ్ఞానము సంసారమును దాఁటించు నట్టిది కాదు. పాపరహిత మయిన దేహము లేనిదే మేలు చేకూరదు. కాఁబట్టి దయ చేసి నాకు ఈ బ్రహ్మరాక్షసత్వమును తొలఁగించి కృతార్థుని జేయుము. లేకున్న నీ పాదములను విడువను. నీ పాటలో పాతిక పాలైననిమ్ము.

మాలదాసరి — అదియును ఈయ లేను.

రాక్షసుఁడు — నీవు ఈ ప్రభాతసమయమునఁ బాడిన కడపటి పాట ఫలిత మైన నిమ్ము. నిన్ను శరణు జొచ్చిన నా యాపదను బాపుము.

మాలదాసరి — అట్లే కానిమ్ము. నీకు ఈజన్మ మెట్లు గలైనో, సవి స్తరముగఁ జెప్పుము.

# VIII. బ్రహ్మరాక్షసుని వృత్తాంతము

బ్రహ్మరాక్షసుఁడు మాలదాసరికిఁ జెప్పిన రీతిలో అతని పూర్వచరిత్ర మిట్లు తెలియ నగుచున్నది —

బ్రహ్మరాక్షసుఁడు పూర్వజన్మములో ఒక బ్రాహ్మణుఁడు. అతని పేరు సోమశర్మ. చోళదేశమున ఒక యూరు అతని స్వగ్రామము. పదునాలుగు విద్యలందును గొంత చొరవ గడించి, మాటనేర్పు చేత తార్కికులను జయించుచుండెను. వైదిక క్రియలను జేయించు వారి పొరపాట్లను బయట పెట్టు చుండెను. స్మార్త కర్మ ప్రయోక్తలు ఖండకారికల పుస్తకములను విప్పఁగానే పరిహాసము చేయుచుండెను. జల్ప మనెడి యుక్తిని ఆశ్రయించి విద్వాంసుల గ్రంథపాండిత్యమును అవమానపఱచుచుండెను. కొంచెపాటి చదువునకే మదపుటేనుఁగువలెఁ గన్ను గానక, ఆ చదువునే చాలగొప్పగ తలఁచి, పెద్దలతో వాదములు పెట్టుకొని, ఓడిపోయి నప్పుడు సరితూఁగితి ననియు, సరితూఁగి నప్పుడు గెల్చితి ననియు, అసత్యప్రచారములు గావించు చుండెను. ఇందులకు చిల్లరప్రభువులు మోసపోవు చుండిరి.

యజ్ఞములు చేయఁ బూనుకొన్న వారిం జూడఁగా సోమశర్మకును యజ్ఞము చేయ వలెనను కోరిక పుట్టినది. యజ్ఞమునకై ధనము సంపాదించుట కని యతఁడు మధురాపట్టణమునకుఁ బోయెను.

* కులములో నుండి వెలి వేయఁబడిన బ్రాహ్మణులకు లఘుప్రాయశ్చిత్తములను ఉపదేశించి, వా రిచ్చు ధనమున కాశపడి వారి పంక్తిలో భుజించుట; వైశ్యులయిండ్ల పురోహితులతో కలిసి వారితోఁ గలహించి బియ్యము నెక్కువగ

సంపాదించుట; ధనికుల యిండ్లలో ధనమునకై చంద్రసూర్యగ్రహణము లప్పుడు జపాదులు పారాయణములు చేయుట; జింకల - గేదెల - ఆవుల తోళ్లతోఁ గుట్టిన పాదరక్షల దానమును ఊరిలో ఎవడు ఇచ్చినను తన కొక్కనికే ఇచ్చునట్లు గుత్త ఏర్పఱచుకొనుట; నిమంత్రణము దొరకిన నాఁడు శ్రాద్ధభోజనము, నిమంత్రణము తనకు దొరకని నాఁడు శ్రాద్ధకర్తల యింట పితృశేష భోజనము, అదియు దొరకని నాఁడు వీథులలో అమ్మలక్కలను గూర్చించి చాలియుఁ జాలని యన్నమును గుడుచుట, వీని కన్నిటికంటె అధమ మైన తులాభారదానమును గ్రహించుట —— ఇట్లు సోమశర్మ నానా ప్రకారములుగ ధనము నార్జించి ఆ ధనమును ఒకకోమటియొద్ద వడ్డి కిచ్చెను.

తర్వాత తనపల్లెకు పోద మని సిద్ధపడి కోమటియొద్ద నుంచిన ధనమును మరల పుచ్చుకొనెను. పుచ్చుకొనుటలో వరహాలను నాలు గేసిగా విభజించి పెట్టుకొనెను. వడ్డి లెక్క చూచుకొను నప్పుడు ద్రవ్యరూపముగా తా నతని కిచ్చిన దానికి కోమటి ఏర్పఱచిన రొక్కపు ధర తక్కువ యని అతనితో జగడ మాడెను. ఇతఁడు చేయు అల్లరికి కోమటి కోపించి "నీవు చెప్పినట్లే ఇచ్చెద" నని యొకసారియు, ఈయనని యొకసారియు, నిలుకడ లేక పలుకుచుండెను. సోమశర్మ కోమటిమీఁద రచ్చచావడిలో మొఱ యిడుచు పోరాడుచుండెను. దీని నెల్ల కాకశ్మశ్రుఁ డను నొక మాలవాఁడు కనుపెట్టు చుండెను.

అంతట సోమశర్మ మాదిగవాడలో క్రొత్త చెప్పులను కొని, తోలు మెత్త నగుటకై వానికి నూనె పట్టించి తంగేడాకు కట్టెను. పెరిగి యుండిన మీసగడ్డములను గొరిగించుకొనెను. వెలకు వేన్నీళ్లిచ్చి అభ్యంగన స్నానము చేయించెడి యంగడిలో తలంటుస్నానమును నింపాదిగఁ జేసెను. వంటపూటింటికి ఎప్పుడును పంపెడు నంత కంటె ఎక్కువగ పాలు పెరుగు నేయి కూరగాయలను పంపెను. సంచిని దులిపి దానిలో తమ్ములపాకులను వక్కలను నింపుకొనెను. ఎసటిపోఁతలుగా దంచిన బియ్యమును తనశిష్యుఁ డైన బ్రహ్మచారి భుజము మీఁది సంచి నిండ నుంచుకొనెను. భార్యకై మంచి చీరలను కొనెను. అగపడిన బాటసారుల నెల్ల 'మీ పయన మెప్పుడు, మీ పయన మెప్పుడు' అని యడుగుచుండెను. ఈ సంతోషోత్సాహములను వేగిరపాటును సరంజామును పరికించి కాకశ్మశ్రుఁడు సోమశర్మని ప్రయాణమును తెలిసికొనెను.

అతఁడు తన వారిని కొందఱను దారి నడ్డగించుటకై ముందుగఁ బంపి, తానును ఒక బాటసారిగ చేతిలో సంచి నుంచుకొని బాటసారుల స్తోమములోఁ జేరి పయనించి, వారితోఁ గూడి పరుండి రాత్రి వేగుటకు కొంత ముందుగా లేచి "ఉత్తరము, ఉత్తరము, మనము ఉత్తరముగాఁ బోవలయు" నని పలుకుచు నడవ సాగెను. బాటసారులును అతని ననుగమించిరి. వాఁడు వారికి దారి చూపుచు ఒక యడవిలోనికి నడిపించెను. అచ్చట నొక సెలయేఱుండెను. దానిని దాటుద మని బాటసారులు అందులోనికి దిగిరి. దిగఁగానే కాకశ్మశ్రుఁడు ఈల వేచెను.

ముందుగా పథిక సమూహముపై బాణ మొకటి వచ్చి పడెను. అంతటితో ఆ బిడారు ముందునకు అడుగు వెట్టక ఆఁగిపోయెను. వెంటనే వారిపై రాళ్లు వచ్చి పడ సాగినవి. ముందునకుఁ బోవుటకు వారికి దారి అగపడనం

దున వారు ఉన్నచోటనే త్రొక్కటపడఁ జొచ్చిరి. అప్పుడు రక్కసుల దండును మించిన దొంగల దం డొకటి వేగముగ వచ్చి వారిని చుట్టవేసికొనెను. ప్రళయకాలమందు పేరాఁక లితోఁ బ్రాణికోటులను భక్షించుటకై వేగిర పడుచు మహోత్పాతములతో పరమశివుని పార్శ్వమున దుముకులాడు ప్రమథగణములు ఎంత బలవంతులుగ ఉందురో ఆ దొంగలు అంతబలవంతులుగ ఉండిరి. వారి యాయుధ ముల కాంతులు కాలకూటపు కాంతులను బోలి యుండినవి. ఆ కాంతుల వరుసలం జూచి రాహువు లని భ్రమించి సూర్యుఁడు తొలఁగి పోవుచున్న ట్లుండెను. విండ్లు వంచుకొని ముంచు కొని వచ్చుచున్న యా దొంగలం జూచి బాట సారులు హల్లకల్లోల మైరి.

(i) వారిలో కొందఱు తోడివారిని 'ఓరి పాపులారా, ఏల బెదరి పరుగిడుచున్నారు? ఈ దొంగదండు ఏ మంత పస గలది కాదు, వీరిని కొట్టి తఱుమ వచ్చును' అని హెచ్చ రించి మరల్చి దొంగలమీఁదికి రాలు రప్పలు కొయ్యలు కొణతలు విసర సాగిరి. (ii) కొందఱు తమ బుజములమీఁదను నెత్తిమీఁదను ఉన్న బరువులను దింపుకొని, కత్తులు దూసి, నిలబడి, ''రండోయి, రండి'' అని దొంగలకు తిరుగ బడిరి. (iii) దొంగలు బాటసారులలో ఆయుధ పాణులుగ ఉన్న వారి జోలికి పోక నిరాయు ధులై యెదుర్పడినవారిని తత్తఱపడునట్లు వడి వడిగాఁ బొడిచిరి. (iv) సొమ్ముల నీయక పెనఁగు లాడు లోభులను మిక్కిలి హింసింపక గాయ పఱచి అంతమాత్రకు దొరకినదానిని గైకొనిరి. (v) కొందఱు బాటసారులు తర్వాత వచ్చి వెదకి తీసికొంద మనుచు తమయొద్ద నున్న ముల్లె ముట్ర గుడ్డలోఁ గట్టి చెట్లజేబులో పాఱ వైచి, పైపంచెలను గూడ వెనుకకు వైచి పాఱిపోవుచుండిరి. దొంగలు వారిని దుడ్డు కఱ్ఱలతో మోదిరి. (vi) ఏటు కందక పాఱి పోయినవారిని దఱుమక పో నిచ్చిరి, (vii) కొందఱు ''ఓరీ, ఇది దేవతార్చనమూట, ఈ వస్త్రమును మీరు తీసికొనుఁడు. విగ్రహ ములను మాత్రము విడిచి పెట్టుఁడు. ఏల యన అవి పోయిన మేము పస్తుండవలెను'' అని దొంగలను బతిమాలుకొనుచుండిరి. (viii) కొందఱు ''అయ్యా, మా గుంపులో ఉన్న దంతయు మీకు మే మిప్పించెదము. ఒక్క మాట మాత్రము వినుఁడు, స్త్రీజనమును మీ రు తాఁకఁ గూ డ దు'' అ ని త మ గుంపులో తమకుఁ గల మాటచెల్లుబడిని పరు వును ప్రకటించుకొనుచు దొంగలకు కొల్ల ఇచ్చిరి. (ix) పొదలలో దాఁగి యున్న వారిని దొంగలు ఈఁటెపోటులతో వెడలించి వారి వస్త్రములను దోఁచుకొని ప్రాఁతగుడ్డలను గోఁచులకై యిచ్చిరి. (x) ధనమును పైకి చూపుకొన కుండినట్టి బలిష్ఠులను చాటునకంపి వారి చెప్పుల యట్టనే కాక జుట్టులను సైతము విప్పించి సోదా చూచిరి. ఇట్లు దొంగలు ప్రయాణికులయొద్ద నున్న నానా విధము లయిన సొమ్ములను హరించుకొనిరి.

అప్పుడు సోమశర్మ తన శిష్యుని 'వాని గతి వానిది', అని విడిచిపెట్టి పాఱిపోవఁ జూచెను. పొట్టబరువుచేతను వరహాలసంచిబరువుచేతను అతఁడు ఎక్కువ వేగముగఁ బరుగిడ లే కుండెను. మొదటినుండియు అతని మీఁదఁ గన్నుంచి యుండిన కాకశ్మశ్రుఁడు అతని వెంట నంటెను. అతడు నిడు పైన నల్లని దట్టిని పిఱు దులు మొదలు చనుమరల వఱకు గట్టిగ చుట్టి కొని యుండెను. గడ్డము పిల్లిగడ్డమువలె

రుండెను. మీసాలు దానిని దాటి గుండ్రని కడుపుమీఁద ఉయ్యాల లూఁగుచుండెను. మొగము బూడిదలో మఱుఁగువడి యుండెను. చెంపలు మూఁతపడునట్లుగా అతఁడు తలకు రుమాలు కట్టుకొని యుండెను. అది మైనపు మడ్డి పూసిన టోపివలె నుండెను. తళతళ లాడుచు అతనిచేత నొక సురెకత్తి యుండెను. ఆ కత్తితో నతఁడు సోమశర్మని మడమలపై కొంకులనునఱికెను. సోమశర్మ నేల బడిపోయెను. ఆ చోరుఁడు అతని పొట్టమీఁది దోవతిని లాఁగెను. లాగినప్పుడు మొలకు కట్టియున్న త్రాళ్లు తెగి వరహాలసంచిమాత్రము చోరుని చేతికి చిక్కకొనెను. సోమశర్మ ఒకటోపిని తలకు తొడుగుకొని దాని దారములను గడ్డము క్రిందికి ముడివేసికొని యుండెను. ఆ టోపిని గొదకట్టును దొంగ లాగుకొనుటలో శర్మకు చెవులు రెండును రంధ్రములవఱకు తెగినవి. ఉన్న ధనము నిట్లు అపహరించుకొని దొంగ పోవుచుండెను.

సమీపమున చూచి నప్పుడు ఆ దొంగ తన పొరుగూరివాఁడే అని సోమశర్మ గుర్తించెను. గుర్తించినవాఁడు ఊర కుండక; నోట శని యుండుటచే, "ఓరీ, నిన్ను గుర్తించితినిలే, పొరుగూరివాఁడవే కదా, ఈ ధనము నీకు దక్కునా? చూడుము, ని న్నేమి చేయించె దనో" అని బెదరించెను. రాజుతోను రెడ్డితోను చెప్పి త న్నితఁడు పట్టించు నని యూహించు కొని చోరుఁడు ఇతనిని జంపుటే మంచి పని అని ఆలోచించుకొని అందుకై వెనుకకు మఱలెను. కాని ఇంతలో పైనుండి బాటసారుల తండ మొకటి సమీపించెను. కావున ఆ దొంగ దండు పాఱిపోవలసి వచ్చెను. కాకశర్మ్రశుఁడు సోమశర్మను త్వరత్వరగ చేతికి వచ్చినట్లు పొడిచి పాఱిపోయెను.

సోమశర్మ ఆస్థితిలో పడి యుండఁగా వెను కనుండి వచ్చిన బాటసారుల గుంపులో అతని యిల్లాలి తోఁబుట్టు వొకఁ ఁడుండెను. అతఁడు సోమశర్మను గుర్తించి, అతని యవివేకమునకు చీవాట్లు పెట్టి, అతని నొక కావడిబుట్టలో పెట్టు కొని మోసికొని పోవుచుండెను.

దోపుడుచే ధనము గోల్పోయిన బాటసారు లలో కొందఱు దొంగల కత్తి వ్రేటులకు చీలిన తమ భుజములను అంట గుట్టించుకొనుటకై వైద్యుల వెదకు చుండిరి. మఱి కొందఱు దొంగలచేతి గుదియ దెబ్బలకు పగిలిన తమ తలల పగుళ్లకు గుడ్డలం గాల్చి మసి గ్రుక్కు కొని సమీప గృహస్థుల యొద్ద యాచించి అంబలియు గంజియు త్రాగి ప్రాణముల నిల్పు కొనిరి. కొందఱు బాటసారులు తాము పడ్డ పాట్లం చెప్పుకోగా విన్న వారు కనికరించి గుడ్డల నిచ్చిన, వారిని దీవించిరి. కొందఱు మోస గాండ్రు ఈ దోపుడు సాకు జేసికొని తమయొద్ద ఎంతో ధన ముండి నష్ట మయ్యె నని కల్ల లాడి చుట్టాల యిండ్లమీఁద బడి భుజించుచు హాయిగ నుండిరి. ఇట్టి బాటసారులు నిండు కొన్న పల్లెల మీఁదుగా సోమశర్మను అతని యిల్లాలి తోఁబుట్టు మోసికొని పోవుచుండెను.

దారిలో ఒక పెద్ద మఱ్ఱి చెట్టుండెను. ఆ యిల్లాలితోఁబుట్టువు సోమశర్మ యున్న కావడిని ఆ చెట్టుక్రింద దింపుకొని తాను నీరు ద్రాఁగు టకై నది కేఁగెను. అతఁడు వచ్చు నంతలో సోమశర్మప్రాణములు పోయినవి. మరణసమ యమున ఏ రూపమును భావించుచుఁ జచ్చిన వానికి మఱుజన్మమున ఆ రూపము గలుగు నని

శాస్త్రము. తన్ను తఱిమి తఱిమి నఱికి నటు వంటి కాకశ్మశ్రుని భయంకర రూపమును స్మరించుచునే మరణించినందున సోమశర్మకు బ్రహ్మరాక్షస రూపము ప్రాప్తించినది.

## IX. బ్రహ్మరాక్షసునకు ఉత్తమ వైష్ణవత్వము గలుగుట

కైశికీ గాన ఫల మిచ్చి తనకు ఆ ఘోర రూపమును మాన్పు మని బ్రహ్మరాక్షసుఁడు మాలదాసరిని బతిమాలెను. మాలదాసరి "ప్రపన్నులు ఆజ్ఞాకైంకర్యములను అనుజ్ఞా కైంకర్యములను చేయునప్పుడు కోరు ఫలము భగవంతుని ముఖోల్లాస మొక్కటే. సంసార బంధకము లయిన వేఱు ఫలములు వారికి అపేక్షితములు కావు. కాఁబట్టి ఫలము మొత్తము ఇంత, అందులో కొంత నీ కిత్తును అని చెప్ప లేను. దేవుఁడు నిన్ను తప్పక రక్షించును, ఊరడిల్లు" మనెను. అతఁడు చెప్పిన తత్క్షణమే అతని యాశీస్సు అమోఘముగను అవిలంబిత ముగను ఫలించినది. సోమశర్మ వైష్ణవుఁడుగ మాఱి, పొగమొత్తమునుండి అగ్నిజ్వాల వెలువడినట్లు రాక్షసదేహమునుండి వెలువడెను.

శిరమున మూఁడు పాళ్లు గొరుగఁబడి ఒక పాలు జుట్టుండెను. మంచువలె తెల్లగ ప్రకాశించు జందెము, పండ్రెండు తావుల పవిత్రము లయిన నిలువుబొట్లు, తామరపూసల తులసి పూసల దండలు, అతని దేహమున వెలుగొందు చుండినవి; గోఁచియు మొలత్రాడును రెండు కాషాయవస్త్రములు నుండినవి. జల కుండికలో తీర్థోదక ముండెను. చేత నాలుగు వేల గేయములు గల తమిళ దివ్య ప్రబంధ సంపుట ముండినది. అతఁడు ద్వయ మంత్రోత్తర వాక్యమును అనుసంధించుచుండెను. బంగారు వన్నెఁ గల దేహమునకును బ్రహ్మ వర్చస్సునకును వైష్ణవతేజము పెంపుగూర్చు చుండెను. మట్టిలో ఉప్పు రాలిన ఆ మట్టియు ఉప్పగుట ప్రసిద్ధము. అట్లే భాగవతసంసర్గ ముచే సోమశర్మకు బ్రాహ్మణత్వమే కాక భాగవతసంపదయు గలిగినది. అతఁడు దాసరి నిటు నుతించెను.

"జనన మరణ రూప మయిన యీ సంసారము దాఁట రానిది. దీనిలో నీవు, తామరాకు పైని నీటి వలె, అంటినట్లు కనఁబడినను అంట కున్నావు. హరిసంకీర్తనపరులలో నీవే చక్రవర్తివి. ఆ పాటల తియ్యదన మెంతో నీ నాలుకకే తెలియును— నీ యనుగ్రహము తత్త్వ విషయిక సంశయములకు గొడ్డలిపెట్టువంటిది. మాలపుట్టుక అను తెర మఱుఁగున అపార మహిమను దాచుకొని నీవు లోకులను మోసగించుచున్నావు. భగవంతుని ప్రాపుకంటెఁ గూడ మేలైన దగు గురుచరణాశ్రయము గల వాఁడవు. హరిభక్తుల పాదపద్మములను ఆశ్రయించిన తుమ్మెదవు నీవు. సత్యమునకై దేహమును గడ్డిపఱకం బోలె త్యజింప నెంచిన వాఁడవు గదా నీవు. సకల విధులను భగవదాజ్ఞలనుగా భావించి చేయుచు, సకల ప్రాణులందును సమదృష్టియు, దయయుఁ గల వాఁడవు. అన్యదేవతలం గూర్చిన శాస్త్రములను చెవిం జొర నీయని యేకాంతిక విష్ణుభక్తుఁడవు. ఎనిమిది విధము లయిన భక్తిలక్షణములు నీయందు పొందుపడి యున్నవి."

ఇట్లు కొనియాడి ప్రదక్షిణము చేసి సోమశర్మ సర్వసంగములు వీడి సర్వవిష్ణుక్షేత్రములను సేవించి మోక్షమును చూఱగొనెను.

# మానవునికి దేవు డొసగిన జన్మహక్కు

## [సంపాదకీయము]

మానవులకు తమ జన్మహక్కులను కాపాడు కోవలెె, నిలుపుకోవలెె, అను పట్టుదల ఉండును. విషయసుఖానుభవపరుడై, ఐహికపరుడైన మానవుడు 'ఈ యిల్లు నాది, ఈ సొత్తు నాది, వీరు నా వారు' అని వానిని తన జన్మహక్కులనుగా భావించి వానికై నీదమోదములకు గుఱి అగుచుండును. అది అంతయును మహామాయా ప్రభావము, భ్రాంతిహేతుకము, అవిద్యామూలకము. 'నేను' అనగా 'ఈ దేహమే' అని అనుకొన్న వారి తిప్పట్లు ఆలాగు ఉండును. ఆలాగు అనుకొనువారి సంఖ్య ఇంతంత కాదు. ఇంచుమించు అందఱునే అట్లు తలంతురు. కోటికొకని తీరు మఱి యొక రీతి నుండును. అతడు దైవసాక్షాత్కార మొందినవాడు. ఏకమును అద్వితీయము నైన ఆత్మయే సర్వగతమై ఉన్నది అనుట అతనికి ప్రత్యక్షము. అన్ని భేదాలకును మఱుగున ఉన్న అభిన్నాత్మ స్వరూపమును అతడు సాక్షాత్కరించుకొన్నాడు. ఆత్మ ఒక్కటే తథ్యము, తక్కిన దెల్ల మిథ్య, ఆత్మ యొక్కటే నిత్యము, తక్కిన దెల్ల క్షణికము. ఈ సాక్షాత్కృతి అతనికి గల్గినది.

భగవత్ప్రాప్తి ఒక్కటే మానవుని జన్మ హక్కు. సకల ప్రాణికోటిలోను ఈ జన్మ హక్కు మానవకోటికి మాత్రమే కలదు. ఇది మన జన్మహక్కు అనుటను మఱచిన మనము దేనిదేనినో మన జన్మహక్కు అని భ్రాంతిపాలై వ్యర్థ శ్రమ చెందుచుందుము. ఈ జన్మహక్కును మానవునకు జ్ఞప్తిపఱచుటకై అపారకరుణా సముద్రు డైన సర్వేశ్వరుడు మానవరూపమున అవతరించుచుండును. అట్టి అవతారాలలో మిక్కిలి యిటీవలది, ఈ యుగమునకే యే గల్గినది, శ్రీరామకృష్ణావతారము. శ్రీరామకృష్ణుడు 1886-వ సంవత్సరమున మహాసమాధి నొందెను. ఇది 1957-వ సంవత్సరము. 71 సంవత్సరాలు గడచినవి పరమహంస అవతారమును చాలించి. కాని కామార్పుకురులో అవతరించిన శ్రీరామకృష్ణుని పేరు ఈ నాడు విశ్వవ్యాప్తమై "ఆయన మావాడు, మనవాడు" అని అనుసంధించుకొనుట ప్రజలకు గర్వకారణమై ఉన్నది. అదొక్కటే చాలును, ఆయన దివ్యావతారమూర్తి అనుటకు ప్రమాణముగ. ప్రాక్పశ్చిమప్రముఖులయొద్దనుండి యోగ్యతా పత్రికలు అక్కఱ లేదు.

శ్రీరామకృష్ణుడు తన ఉపదేశాలచేత నేమి, అంతకంటె హెచ్చుగ తన నిత్యానుష్ఠానముచేత నేమి బ్రహ్మప్రాప్తియే మానవజీవిత లక్ష్యమని మానవుని జన్మహక్కని లోకానకు బోధించినాడు. ఆయన బోధనా పద్ధతి అవిస్మరణీయము. సర్వేతర విలక్షణము. నిదర్శనార్థముగ జెప్పిన కథలలో ఒకటి—ఒకడు అమ్మ జూపిన రత్నమునకు దాని వెల తెలియని వంకాయల వర్తకుడు తొమ్మిది వీశెల వంకాయ లిత్తు ననెనట. గుడ్డల వర్తకుడు తొమ్మిది వందల రూపాయ లిత్తు ననె నట. దాని విలువను చక్కగ నెఱిగిన రత్నవర్తకుడు — దాని కొక లక్ష రూపాయ లిచ్చుటే కాక దానిని తిరుగ నిచ్చివేయ ననెను. స్వరూపజ్ఞానశూన్యు లందఱును కథలోని 'వంకాయల' 'గుడ్డల' వర్తకులం బోలిన వారు. స్వరూపయాథార్థ్యవేత్తలు, రత్నాలవర్తకుని బోలినవారు.

# అవధూత గీత

## శ్రీమత్ కిళాంబి రంగాచార్యులు

జిజ్ఞాసువు:—యమనియమములన నేమి?

అవధూత:—1. అహింస, 2. సత్యము, 3. అస్తేయము, 4. అసంగమము, 5. హ్రీ, 6. అసఞ్చయము, 7. ఆస్తిక్యము, 8. బ్రహ్మచర్యము, 9. మౌనము, 10. స్థైర్యము, 11. క్షమ, 12. అభయము, 13. దయ, 14. శౌచము. 15. జపము, 16. తపము, 17. హోమము, 18. శ్రద్ధ, 19. ఆతిథ్యము, 20. భగవదర్చనము, 21. తీర్థాటనము, 22. పరార్థేహము, 23. తుష్టి, 24. ఆచార్యసేవనము—ఈ 24 ను యమనియమములు.

జిజ్ఞాసువు:—శమము, దమము, తితిక్ష, ధృతి, దానము—ఇత్యాదులు చెప్పుదురు. అవి యేవియో వివరముగా సెలవీయరా స్వామీ?

అవధూత:— భగవన్నిష్ఠితబుద్ధిగలిగియుండుటయే ''శమము'',

ఇంద్రియసంయమము గలిగియుండుట ''దమము''.

దుఃఖసమ్మర్షయే ''తితిక్ష''.

జిహ్వోపస్థజయమే ''ధృతి''.

దణ్డన్యాసమే ఉత్కృష్ట ''దానము''.

కామత్యాగమే ''తపము''.

స్వభావవిజయమే (అనగా ప్రకృతిసంబంధమైన స్వాభావికమును జయించుటయే) ''శౌర్యము''.

సమదర్శనమే ''సత్యము''.

సత్యావాక్కే ''ఋతము''.

కర్మలయందు ఫలాపేక్ష లేకుండుటయే ''శౌచము''.

సన్న్యాసమే ''త్యాగము''.

ధర్మమే మనుష్యులకు ఇష్టమైన ''ధనము''.

భగవంతుడే ''యజ్ఞము''.

జ్ఞానసందేశమే ''దక్షిణ''.

ప్రాణాయామమే పురుషులకు ''బలము''.

దైవసంబంధమైన ఐశ్వర్యభావమే ''భగము''.

భగవద్భక్తిగలిగియుండుటే ''లాభము''.

ఆత్మను దెలిసికొనుటయే ''విద్య''.

అకార్యకరణమందు సిగ్గుపడుటయే ''హ్రీ''.

నైరపేక్ష్యాదిగుణములే ''శ్రీ''.

సుఖదుఃఖములనువిడుచుటయే ''సుఖము''.

కామసుఖాపేక్షయే ''దుఃఖము''.

ప్రకృతిబంధమునుండి విడివడినవాడే ''పండితుడు''.

ఈ దేహమే జీవుడు (అహం) అను బుద్ధి కలిగియుండువాడే ''మూర్ఖుడు''.

భగవంతునిజేరు ఉపాయమును జెప్పు శాస్త్రమే ''పంథ''.

సత్త్వగుణోదయమే ''స్వర్గము''.

తమోగుణమే ''నరకము''.

ఆ పరమాత్మయే ''బంధువు, గురుడు, సఖుడు''.

ఈ మనుష్యశరీరమే ''గృహము''.

గుణాఢ్యుడే ''ఆఢ్యుడు''.
అసంతుష్టుడే ''దరిద్రుడు'
అజితేంద్రియుడే ''కృపణుడు''.
ప్రకృతిసంబంధమైన త్రిగుణములు (సత్త్వ రజ స్తమోగుణములు మూడును) లేని వాడే ''నిర్గుణుడు''.

జిజ్ఞాసువు:—చరాచరవస్తుజాలమునుండి మానవులు నేర్చుకొనవలసిన విశేష ధర్మము లెవ్వియో వివరింపరా?

అవధూత:—

(1) మనకు దైవనిర్మితమై లభ్యమగు గ్రాసము రుచిగనున్నను అరుచిగ నున్నను ''అజగరము'' వలె మ్రింగ వలెను.

(2) ప్రసన్నగమ్భీరుడును, దుర్విగాహ్యుడును, దురత్యయుడును, అనంతపారుడును, అక్షోభ్యుడునునై స్థిమితోదకములుగల ''సముద్రము'' వలె ముని యైనవాడుండును.

(3) ఏమియు లేకపోయినను సమృద్ధకాముడుగాను నారాయణపరుడునునైన ముని ''సాగరజలముల''వలె పొంగిపొర్లడు, శుష్కింపను శుష్కింపడు.

(4) దేవమాయానిర్మితమైన కాంతాకాంచనములందు ప్రలోభితాత్ముడైన ముని అగ్నియందుపడు ''మిడుతల'' గతి నొందును.

(5) గాలములోనుండు ఎరకు జిహ్వాచాపల్యముచే పట్టువడి మృతి నొందు ''మీనము'' గతి చాపల్యముగలవానికి సంప్రాప్తించును.

(6) సమస్తపుష్పములలోనుండు మధువును ''తుమ్మెద'' ఎటుల సంగ్రహించునో అటులే సూక్ష్మబుద్ధిగల నరుడు చిన్నవైనను పెద్దవైనను సమస్తశాస్త్రము లందుగల సారమును మాత్రమే సంగ్రహించును.

(7) ''తేనెటీగ'' ఆహారమును కూడబెట్టి ఆహారసహితము దాను నశించును. అటులగాక భిక్షుకుడైనవాడు ఆ పూటకు సరిపడు ఆహారము మాత్రమే మాధుకరవృత్తిచే సంపాదించి మిగుల్పకుండ దినివేయవలెను.

(8) ''చీమ'' వలె ఆహారమును గూడబెట్టరాదు. కడుపునకు సరిపడు భిక్షను మాత్రమే చేయవలయును. కూడబెట్టిన ద్రవ్యము చోరులపాలో భూమిాశుల పాలో అగుట ప్రత్యక్షప్రమాణము.

(9) ''గజము'' అంగసంగమాశచే ఎటుల బంధింపబడునో భిక్షువుకూడ ఆ గతిని నొందునుగాన దారవిమైనను యువతిని కాలితోనైనను స్పృశింపరాదు.

(10) ''హరిణ'' మెటుల శ్రవణలోలత్వముచే బట్టువడునో అటులనే ముని కూడ గ్రామ్యగీతములు వినుటచే బంధితుడు కాగలడు.

(11) వారస్త్రీల నృత్యవాదిత్రగీతములచే ఋష్యశృంగు డెటులవశ్యుడయ్యెనో అటులనే అవధూతయైనవాడు కూడ శ్రవణనయనచాపల్య మున్న వశ్యుడగును.

(12) ''తృణజలూకము'' (పచ్చని ఆకులపై సంచరించు పురుగు) ముందు ఆధారము

జూచుకొనని దే స్వస్థానమును విడువదు. ఆ ప్రకారము ప్రతి మనుజుడును సంచరింపకున్నచో, మేఘములు వర్షించును గదా యని హస్తమందుగల జలమును లను పారబోయు మూఢునిగతియగును.

(13) గూడుకట్టుకొని అందు ప్రవేశించిన ''కీటము''నకు—సదాధ్యానముచే పూర్వరూపముబోవురీతినే స్నేహముచేగాని ద్వేషభయాదులచేగాని ఏరూపముగానైనను దేనిని సదా స్మరించునాతడు తత్సామ్యరూపము నొందును. గానమానవుడెపుడును దైవచింతనముగలిగి యుండుట శ్రేయము.

(14) గృహారమ్భోఽతి దుఃఖాయ
విఫల శ్చాధ్రువాత్మనః।
సర్పః పరకృతం వేశ్మ
ప్రవిశ్య సుఖమేధతే॥

ఇల్లు కట్టు ప్రారంభమే అతిదుఃఖము. అందునను స్థిరచిత్తములేనివారు విఫలులు అయ్యెదరు. ఇతరులు కట్టిన గృహమందు ''సర్పము'' ప్రవేశించి సుఖముగా వసించును. ''చీమలుపెట్టిన పుట్టలు పాములకిరవైనయట్లు'' అను పద్యము ప్రసిద్ధము. శాస్త్రము అపారమైనది ఆయువన్నదో అల్పము. శాస్త్రచర్చలచే మనోవైకల్యము నొందక మహాపురుషు లేర్పఱచిన సౌధమునందు (ధర్మమందు) ప్రవేశించి సుఖించుట ఉత్తమము.

(15) ''ఆశాహి పరమందుఃఖం నైరాశ్యం పరమంసుఖమ్'' ''ఆశ'' యనునదే విస్తారదుఃఖము. ''ఆశలేమి''(సంతుష్టి) మిగుల సుఖము.

జిజ్ఞాసువు:—స్వామీ! నేడు సుదినము. చాలసేపు మిమ్ములశ్రమపెట్టితిని. క్షమింపుడు. ఈ పూట మాగృహమునకు బిక్షకు దయచేయరా?

అవధూత:—ఇక్కడ ప్రాప్తమగు దానితో దృప్తిచెందెద.

జిజ్ఞాసువు: ఈ ఆలయమండప ప్రదేశముననే ఫలాహారము దెచ్చెద.

(నిష్క్రమించును)

నీ మోమిదే చూపి నా మనోవ్యథను
బూర్తిగాఁ బోకార్చి ప్రోచితి దేవ.
ఇంద్రజాలము నాఁగ నించు నీ సౌరు
మంత్రమై కాదె నా మదిని హరించె!
అంతమే లేని దుఃఖాబ్ధి నున్నట్టి
భువనంబు లేదు నిక్క బొడగాంచి వెతను
మఱచెడి ననఁగ, నే మఱచుట యరుదె?
అగతికుఁడం జూవె, అల్పుఁడం జూవె.

శ్రీరామకృష్ణసూక్తిసుధ IX.

# అద్వైతమతము

విద్వాన్ శ్రీ చదలువాడ జయరామశాస్త్రిగారు

(గతసంచిక తరువాయి)

## 21. జీవస్వరూపము

ఇచ్చట నిదియిట్లు తెలియఁదగినది. జీవేశ్వరుల స్వరూపవిషయమున అవచ్ఛేదవాదము, ఆభాసవాదము, ప్రతిబింబవాదము అని అనేక పక్షములు సంభవించియున్నవి.

"వాచస్పతే రవచ్ఛిన్న ఆభాసో
వార్త్తికస్యచ
సంక్షేపశారీర కృతః ప్రతిబింబ
స్తథేష్యతే॥"

అవచ్ఛేదమనఁగా అంతఃప్రవేశము. దానితోఁ గూడినది అవచ్ఛిన్నము. జలమునందు లోపలఁ బ్రవేశించిన ఆకాశము జలావచ్ఛిన్నమని చెప్పఁబడును. అన్యసంబంధముచే నన్యమునందు భాసమానమగు అర్థము ఆభాసమనఁబడును. ఎట్లనఁగా జపాకుసుమ సాన్నిధ్యము వలన స్ఫటికమునందు భాసమానమగు రక్తిమ. ఇదియే ఉపహితమని చెప్పఁబడును. ప్రతిబింబము ప్రసిద్ధము (ఘటమందున్న జలమునందు ఆకాశము ప్రతిబింబించుట).

అవచ్ఛేదవాదులగు వాచస్పతిమిశ్రుల మతమునందు అజ్ఞానమును (మాయ + అవిద్య) విషయముగాఁ జేసికొన్న (అజ్ఞానవిషయీకృత) చైతన్యము, ఈశ్వరుఁడు. అజ్ఞానమును ఆశ్రయముగాఁజేసికొన్న (అజ్ఞానాశ్రయీభూత) చైతన్యము జీవుఁడు. ఆభాసవాదులైన వార్త్తికకారుల మతమునందు అజ్ఞానోపహితమై అజ్ఞాన తాదాత్మ్యాపన్నమైన చైతన్యము ఈశ్వరుఁడు, అవిద్యా కార్యభూతమై, బుద్ధ్యుపహితమైన బుద్ధి తాదాత్మ్యాపన్నమైన చైతన్యము జీవుఁడు. కొందఱీ ఆభాసవాదమునే స్వీకరించి అజ్ఞానసమిష్ట్యుపహిత చైతన్యము ఈశ్వరుఁడు, అజ్ఞానవ్యష్ట్యుపహిత చైతన్యము జీవుఁడు అనియు అజ్ఞానమన్నదో స్వరూపముగనే నానాభూతమై (పెక్కై) యుండునని చెప్పుదురు.

ప్రతిబింబవాదులైన సంక్షేపశారీరకారుల మతమునందు అజ్ఞానప్రతిబింబితమగు చైతన్యము ఈశ్వరుఁడు బుద్ధిప్రతిబింబితమైన చైతన్యము జీవుఁడు. వివరణకారులు మాత్రము ఈశ్వరవిషయమున ఆభాసవాదమును, జీవవిషయమునఁ బ్రతిబింబవాదమును సమ్మతించువారై అజ్ఞానోపహితమైన బింబచైతన్యము ఈశ్వరుఁడు. అంతఃకరణము తత్సంస్కారావచ్ఛిన్నమునగు. అజ్ఞానప్రతిబింబితమైన చైతన్యము జీవుఁడని యిట్లు చెప్పుదురు. ఈవివరణకారులమతమునందు ధర్మియైన ప్రతిబింబమునకు అధ్యాసలేదు. మఱేమన. అజ్ఞానప్రతిబింబితుఁడై అనధ్యస్తుఁడై, ధర్మియైన జీవునియందు బ్రహ్మాభేదరూపమైన ధర్మమునకే అధ్యాస. అట్లయిన ప్రతిబింబభూతమైన జీవస్వరూపమునకు, ధర్మికి అధ్యాస సంభవింపనిపక్షమున జీవునికి సత్యత్వము చేకూరుచున్నది. అందుచే మాయిష్టము సిద్ధించునని పూర్వపక్షముచేయు

దు లేని. సమాధానము. నిజమేమనఁగా అసత్యత్వము బింబరూపముతోనే కాని ప్రతిబింబరూపముతోఁ గాదు. ప్రతిబింబమునకు బింబవ్యతిరిక్తమైన రూపముచే సత్యత్వము గన్పట్టుట లేదు. ఎట్లనఁగా ఘటమునకు ఘటరూపముచే సత్యత్వము లేదు. మఱియెట్లన మృత్తుయొక్క రూపముచేతనే సత్యత్వము. అట్లె ఇచ్చటను భారతీతీర్థులు మాత్రము అజ్ఞానమునందు ధర్మియైన ప్రతిబింబమునకే ధ్యాసయనియు బ్రహ్మముతో నుండుభేదాదికమంతయు అచ్చట అధ్యస్తమే, యనియు నందురు. ఇట్లు జీవస్వరూపమునకు మిథ్యాత్వమును చెప్పుదురు.

## 22. జీవుఁడొక్కఁడా జీవులు పెక్కండ్రా అను విచారము

ఇచ్చో నెవరిమతమునందు అవిద్యాసంయుక్తమైన చైతన్యము జీవుఁడగునో ఆజీవుఁడు అవిద్యావచ్ఛిన్నుఁడు అవిద్యోపహితుఁడు అవిద్యాప్రతిబింబితుఁడుగా నైయున్నాఁడు. వారిమతమునందు, జీవావస్థయందు సైతము జీవుఁడొక్కఁడే ఏలయన అవిద్యయొక్కటియే యగుటవలన. ఇది ఏకజీవవాదము. ఉపాధిభేదమ్మువలన సుఖదుఃఖాదివైచిత్ర్యము గలుగుచున్నది. మఱి ఇఁక నెవరిమతమునందు, వ్యష్టియగు నవిద్యచే, అవిద్యాకారభూతమైన బుద్ధితోఁ గూడిన చైతన్యము జీవుఁడో, ఆజీవుఁడా బుద్ధ్యవచ్ఛిన్నుఁడు, ఉపహితుఁడు, ప్రతిబింబితుఁడైనను వారిమతమునందు జీవులనేకులు. ఇది జీవనానాత్వవాదము. ఇందు వాచస్పతిమిశ్రుల మతమునందు జీవైకత్వము (ఏకజీవవాదము జీవుఁడొక్కఁడే); వార్తికకారులు, వివరణకారులు, సంక్షేప శారీరక కారులు అనువారల మతమునందు జీవనానాత్వము అని తెలియఁదగు.

## 23. ఏకజీవవాదము

ఇందు, తత్త్వమిది. ఏకజీవవాదమే సిద్ధాంతిసమ్మతము. అనేకజీవవాదమునందు, ఎవని అవిద్య ప్రపంచరూపమునఁ బరిణమించినది? దేవదత్తుని అవిద్య అందురా, యజ్ఞదత్తుని దృష్టిచే ప్రపంచాభావ ప్రసంగ మేర్పడును. అనేకతంతువులచే నేర్పడిన పటము (వస్త్రము) వలె అనేకములైన అవిద్యలు కలిసికొని ప్రపంచరూపమునఁ బరిణమించినవని చెప్పఁదగదు. కొన్ని తంతువులు పటమునుండి లాఁగివేయఁబడుచుండఁగా ఆ పటము న్యూనతను బొందునట్లు శుకవామదేవాదులు కొందఱు ముక్తులగుచుండఁగా వారి వారి అవిద్యలు నిష్క్రాన్తములు (తొలఁగిపోయినవి) కాఁగా, ప్రపంచమునకు న్యూనత ప్రాప్తించుచున్నది. మఱియు జీవుఁడు, విభుఁడై (సర్వవ్యాపకుఁడై) యుండువాఁడు. అట్లుగానిచో దేవదత్తుని అదృష్టముచే, దేశాంతరమునందు దేవదత్తుని భోగ్యవస్తువు, ఉత్పత్తికాకపోవుచున్నది. జీవుఁడణుస్వరూపుఁడైనచో దేశాంతరమునందు వ్యాప్తిలేక పోవుటచేత, అతని అదృష్టమునకు సైతము కార్యోత్పత్తియగు దేశమునందు కార్యోత్పత్తికాలమునందు సన్నిధానాభావము సంభవించుచున్నది. మఱి ఇంకొకటి. కాయవ్యూహమునందు, ఒక్కటే కాయమునందనుభూతమగు సుఖమునకుఁగాని దుఃఖమునకుఁగాని కాయాంతర మనుసంధానముగాదు. ఒక్కజీవుఁడే స్వతపోబలముచేఁగాని యోగసామర్థ్యముచేఁ గాని ఒక్కకాలమునందే ధరించిన పెక్కుశరీరములను కాయవ్యూహమందురు. అది పురాణాదులందుఁ బ్రసిద్ధము. మఱి జీవుఁడణువైన శరీరమునందు వ్యాపించు సుఖాదులపొందని ప్రసంగమేర్పడును. శరీర పరిమాణముననుసరించి జీవుఁడు పరిణ

మించుననిన యెడల శరీరమునకు, బాల్య యౌవనాదులగు నవస్థాభేదముచేతను, పిపీలికము, మనుష్యుఁడు, హస్తి, లోనగు వాని భేదముచేతను, అనియత పరిమాణము కలుగుట ప్రాప్తించుటచేత, వికారాదిదోష ప్రసంగముచేత, అనిత్యత్వము, సంప్రాప్తమగుచున్నది. అందువలన జీవునకు విభుత్వము అనుట సమంజసము, ఆప్రకారమున అనేకజీవవాదమునందు విభువులైన జీవులకు సర్వవ్యాపులకు సర్వులకు. సర్వాదృష్టములచేతను, సర్వకర్మలచేతను, సర్వశరీరములతో సంబంధము ఆవర్జనీయ (ఆకర్షింపఁదగినది) మగుటచేత, ఈ జీవునిది, ఇది అదృష్టము, ఇది కర్మ ఇదిశరీరము, అను నియమమునకు హేతువులేకపోవుటచే. సుఖదుఃఖాదివైచిత్ర్యమునకు అనుపపత్తి (పొసఁగమి) యను అవస్థయేర్పడును. ఈరీతిని గమనించినచో ఏకజీవివాదమే సులభభంగిని స్థిరపడుచున్నది. సుఖదుఃఖాది వైచిత్ర్యమన్నను శరీరాదుల ఉపాధిభేదము ననుసరించి వ్యాపించుచున్నది. ఆవిధమును బట్టి జీవనానాత్వవాదులైన వార్తికకారులు, వివరణకారులు, సంక్షేపశారీరకకారులు బదులువడసిన వారైరి.

## 24. జీవుఁడు అనాది

మఱియు వార్తికకారులమతముననుసరించి, అవిద్యాకార్యముగ నున్న బుద్ధ్యుపహితచైతన్యము, జీవుఁడగుటయు, సంక్షేపశారీరకకారులమతము ననుసరించి బుద్ధిప్రతిబింబితచైతన్యము జీవుఁడగుటయు సంభవించుచో జీవ + ఈశ అని మొదట చెప్పినట్టి జీవుఁడు అనాది అను మాటకు విరోధమువచ్చును. ఆబుద్ధి అవిద్యాకార్యమగుట చేతను, బుద్ధికి అనాదిత్వము లేక పోవుటచేతను, ఆబుద్ధికి నుపహితమైనను, బుద్ధిప్రతిబింబితుఁడైనను జీవునికి అనాదిత్వము సంభవింపదు. మఱి వివరణకారుల మతము ననుసరించి, అంతఃకరణము తత్సంస్కారావచ్ఛిన్నమైన అజ్ఞానమునందుఁ బ్రతిబింబితమైన చైతన్యమునకు జీవత్వము సంభవించినను ఇట్లే ఊహింపఁదగినది. జీవునికి అనాదిత్వము యుక్తమైయున్నది. సుషుప్త్యవస్థయందు జీవుఁడు పరమాత్మను బ్రాపించువాఁడైనను జీవాత్మప్రాపకమైన ఉపాధి నశింపకపోవుటవలన జాగృతి (జాగ్రదవస్థ) యందు మరల మరల నాజీవుఁడే మేల్కొనుచున్నాఁడు. "స ఏవతు" (బ్రహ్మసూ. ౩. ౨. ౯) అను సూత్రమునందుఁ జెప్పఁబడినది. అట్లే 'మోక్షావస్థకంటెఁ బూర్వము ప్రళయమునందును. జీవప్రాపకమైన ఉపాధిక వినాశము చెప్పవలెను. అట్లుగానిచోఁ బాత్రమునందలి జలమెట్లు పాత్రరహితమై జలరాశి ప్రక్షిప్తమైన యెడల మరల నాజలమునే యుద్ధరించుటకు అశక్యమో, అట్లే మరల సృష్టియందు, ఆజీవుఁడే లేచివచ్చుట అసంభవమగుటచేత ఎల్లరకు ముక్తిసులభమై పోవుచున్నది. జీవత్వమునకుఁ బ్రాపకమైన ఉపాధి, వినాశముకాక పోవుచుండుట ఎట్లనఁగా ఎట్లు మూఁతతో నుండు పాత్రములోని జలము పాత్రసహితమై జలరాశియందుఁ బ్రక్షిప్తమైనను మరలదానినే ఉద్ధరించుటకు శక్యమగునో, అట్లే ఆజీవునికి మరలసృష్టియం దుత్థానము సులభమగును. ఇదియు జీవునికి అనాదిత్వము సరిపోవుచున్నది. అవిద్యాకార్యమైన జీవోపాధి సాటమైనచో ప్రళయమునందు అవిద్యాకార్యము నాశమగుటచేత జీవోపాధియొక్కస్థితి అసంభవమగుటచేత, ఆజీవునికే పునరుత్థానమను నియమముకానేరదు.

## 25. ప్రతిబింబవాదము

వాచస్పతి మిశ్రుఁ లేకజీవవాదము నాశ్రయించిన వారైనను వారు అవచ్ఛేదవాదమును స్వీకరించిరి. దానింబట్టి చూచినచో జీవవిషయమునఁ బ్రతిబింబవాదమే శ్రేష్ఠతరముగనున్నది. ఏలయన, జీవులకు, అజ్ఞానము, అత్యంతమగు పారతంత్ర్యమును బ్రాపించుచున్నది. అది ప్రతిబింబవాదమునందే సమీచీనముగఁ బ్రాపించును, మఱి ఒకపాదము శృంఖలాబద్ధమై యుండి, మఱియొకపాద మట్లుగాకుండినను మనుష్యుఁడెట్లు ముక్తుఁడు(విడుదలగన్నవాఁడు) కానేరఁడో, అట్లే అవచ్ఛేదవాదమునందు ఎవనికి అవిద్యనశించునో వానికి బ్రహ్మముతో నైక్యమేర్పడుచుండినను అతనికే అవిద్యాంతరమగు అవచ్ఛిన్నాంశముచేత బద్ధత్వమును, తదవస్థయునుగలుగును. ప్రతిబింబవాదమునందు ఈదోషము లేదు. ఏలయన ప్రతిబింబగతములైన మాలిన్యాదులకు బింబమునందు స్పర్శగూడ లేదు. మఱియు అంతర్యామి బ్రాహ్మణమునందు "ఆత్మని తిష్ఠ౯ ఆత్మనాంఽతరో య ఆత్మాన మంతరో యమయతి. (బృహ. ౩. ౭. ౨౩) అను నిచ్చటనియమ్య నియామకులకు నొక్కచోటనే స్థితిచెప్పఁబడినది. అది ప్రతిబింబవాదమునందు సరిపోవుచున్నది. ఎట్లు ఒక్కచోటనే జలమునందు జలావచ్ఛిన్నమైన (జలములలోపల సూక్ష్మముగ ప్రవేశించియున్న) ఆకాశము జలమునందుఁబ్రతిబింబితమై ఆకాశమని, ఆకాశద్వయమేర్పడునో ఆ విధముగనే అవిద్యారూపమైన ఉపాధియందు చైతన్యద్వయము సంభవించుచున్నది. అచ్చట ప్రతిబింబచైతన్యము జీవుఁడుగానున్నదై నియమ్యమగుచున్నది. అవచ్ఛిన్నచైతన్యము ఈశ్వరరూపమై నియామక మగుచున్నది. ఘటావచ్ఛిన్నమైన ఆకాశమునకు మహాకాశము యొక్క అనంతత్వమట్లు, అవచ్ఛిన్నమైన చైతన్యమునకు బింబానన్యత్వము అని తెలియవలెను. ఈ ప్రకారము అజ్ఞానప్రతిబింబితమైన చైతన్యము జీవుఁడనియు, అజ్ఞానోపహితమైన, బింబచైతన్యము ఈశ్వరుఁడనియు, పూర్వము చెప్పినసిద్ధాంతమే నిల్చుచున్నది. శుద్ధమగు చైతన్యమును అజ్ఞానానుపహితమందురు.

## 26. అద్వైతము

ఈచెప్పిన అన్నిపక్షములందు బ్రహ్మాద్వైతము స్థిరమైయున్నది. అవచ్ఛిన్నమునకు, ఉపహితమునకు, ప్రతిబింబమునకుఁ గాని చైతన్యమునకు, శుద్ధచైతన్యముకంటె పృథగ్భావము యోగింపదు (సమకూడదు). జడవస్తువుచే బ్రహ్మమునందు ద్వైతమాపాదింపఁదగినది గాదు! జడమైన ఆకాశాదిసకలప్రపంచమునకు భావరూపమైన అజ్ఞానము ఉపాదానమగుటచేత మిథ్యాత్వము చెప్పుట.

## 27. అవిద్య

ఇది సత్తు, అసత్తు అని నిర్వచించుటకు వీలుగానిదై త్రిగుణాత్మకమై, భావరూపమై జ్ఞాననివర్త్యమై యుండునది అజ్ఞానము. ఇచ్చోప్రమాణము. నేను బ్రహ్మమునెఱుగను అను, అనుభవము.

"దేహాత్మశక్తిః స్వగుణై ర్నిగూఢాం।
భూయ శ్చాంతే విశ్వమాయానివృత్తిః।
పరాస్యశక్తి ర్వివిధైవ శ్రూయతే.
(శ్వే. ౬. ౮.)

ఇట్టి శ్రుతులును,

"తరత్యవిద్యాం వితతాం
హృది యస్మి న్నివేశితే.

యోగీ మాయా మమేయాత్మా
తస్మై విద్యాత్మనే నమః.
అజ్ఞానే నావృతం జ్ఞానం తేన
ముహ్యంతి జంతవః.
(భ. గీ. ౫. ౧౫.)

జ్ఞానేనతు తదజ్ఞానం యేషాం
నాశిత మాత్మనః.
(భ. గీ. ౫. ౧౬.)

ఇట్టి స్మృతులును. ఈ అజ్ఞాన పదవాచ్యమైన, అవిద్య ఎట్లు జనించినది? ఏకారణముచే బ్రహ్మముతో దీనికిసంబంధము కలిగినదని ప్రశ్న చేయరాదు. అవిద్యకు బ్రహ్మసంబంధము అనాది అని అంగీకరించియున్నందున. ఆసంబంధమెట్టిది? అన్నచో చెప్పెదము. ఎట్లు, అగ్ని తనకువిరోధియైన జలమునందు సాక్షాత్తుగఁ బ్రవేశించుటకు శక్తిగలది కాకపోయినను, సూక్ష్మరూపమున పాత్రాదులద్వారా జలమునందుఁ బ్రవేశించి ఆజలసంబంధమైన శీతగుణమును పోనడంచి దానియందు స్వకీయమైన ఉష్ణత్వమును దానిదిగనే ప్రదర్శించుచున్నదో, అట్లే ఈఅవిద్య సాక్షాత్తుగ బ్రహ్మమునందు ప్రవేశించుటకు శక్తిలేనిదైనను సూక్ష్మతరమైన స్వకీయమూలరూపముతో బ్రహ్మమునందుఁ బ్రవేశించి (ప్రవేశించినట్లు గన్పడి) బ్రహ్మసంబంధమైన నిర్విషయము, నిరాశ్రయము, సామాన్యపరాకాష్ఠమై (అన్ని పదార్థములందు సమానముగనుండువానిలో నత్యంత ముఖ్యమై అనుట) యున్న స్వరూపమునుగప్పి, స్వకీయమైన సాశ్రయత్వము, సవిషయత్వము అనురూపముగల విశేషరూపమును బ్రహ్మమునందుఁ గనుపఱచుచున్నది. అజ్ఞానశక్తి స్వయముగ సాశ్రయము స్వవిషయమునై యున్నది. దానియందు విషయము, ఈశ్వరుఁడు, ఆశ్రయుఁడు, జీవుఁడు వీరిరువురు, వీరిరువురికిఁ గల పరస్పరభేదము, అనాదియే. ఇదియే సాశ్రయత్వము, సవిషయత్వము. జ్ఞానరూపమైన బ్రహ్మమునందు తత్సంబంధమైన వానిగనే వీనిని గనపఱచుచున్నది.

## 28. సృష్ట్యారంభకాలికము అజ్ఞానకృత్యము

సాశ్రయము, సవిషయము, భాసమానమైయుండున దేజ్ఞానమో, అదియేమహత్తత్త్వము. ఇదిమొదలు సర్వము సాది యగుచున్నది. అనాది కాదు. అందువలన, ఏకమైనను జ్ఞానస్వరూపమైన బ్రహ్మము ధర్మధర్మిభావము చేతను, విషయవిషయి భావముచేతను, భిన్నమట్లుభాసిల్లుచున్నది. అనఁగా జ్ఞాత, జ్ఞేయము, అనురూపములచే ననుట. ఇందు జ్ఞాత, అహంకారము, జ్ఞేయము, శబ్దాదులగు తన్మాత్రలు, భాసమైన యిదియంతయు, అవిద్యానిమిత్తమున నైన పరిణామము. ఎట్లు క్షీరము, క్షీరమను వ్యవహారయోగ్యతను బరిత్యజించి దధియను వ్యవహారయోగ్యతను బ్రాపించుచున్నదో, (ఇది పరిణామమనుట) మఱి అట్లు పూర్వావస్థను పరిత్యజింపకయే అవస్థాంతరముగ బ్రకాశించుట వివర్తము. ఎట్లనఁగా. రజ్జువు స్వరూపముతోనే యుండుచున్నదయ్యు సర్పరూపమున బాసిల్లుట. తన్మాత్రపదముచే సూక్ష్మభూతములు చెప్పఁబడినవి. శబ్దతన్మాత్రము సూక్ష్మాకాశము. దానివలన నేర్పడునది స్పర్శతన్మాత్రము సూక్ష్మవాయువు. ఇట్లు క్రమముగా సూక్ష్మములైన పంచభూతముల ఉత్పత్తి గలుగుచున్నది. ఆయాభూతముల సూక్ష్మస్వరూపములనుండి ఆయాస్థూలభూతముల ఉత్పత్తి గలుగుచున్నది.

(సశేషము)

# విగ్రహవ్యావర్తని

డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఎం. ఏ., ఎం. లిట్., పిహెచ్. డి.

(గతసంచిక తరువాయి)

53. ఏడవకారికలోని ఆక్షేపమునకు 53, 54, 55, 56 కారికలలో సమాధానము చెప్పబడుచున్నది.

ధర్మవేత్తచే పలుకబడిన కుశలధర్మములు స్వభావసహితములైనచో ఈ స్వభావకుశలధర్మములను స్వభావములను ప్రత్యేకప్రత్యేకముగా వివరింపవలసియున్నది.

ఇది కుశలధర్మమని, అది ఈకుశలధర్మము యొక్క స్వభావమని ప్రత్యేకముగా, స్పష్టముగా చెప్పవలసియున్నది. కాని ఇట్లు చెప్పబడకపోవుటచే ఈ ధర్మస్వభావములు సత్పదార్థములని గ్రహింప వీలులేదు.

54. హేతుప్రత్యయముల నాశ్రయించుకొని కుశలధర్మముల స్వభావము లుత్పన్నములగుచున్నచో కుశలధర్మములు అన్యాశ్రితములు కాగలవు. అన్యాశ్రితములైనవానికి స్వస్వభావము లెట్లుండగలవు?

ఇదే అకుశలాదిధర్మములకుగూడ స్వస్వభావములుండ వీలులేదు.

55. హేతుప్రత్యయముల నాశ్రయించుకొని ఉత్పన్నములుకానివి కొన్ని కుశలధర్మములు గలవని పల్కినయెడల ఇట్టి కుశలధర్మములు నిత్యశుద్ధములై యుండుట అసంభవము.

కొన్ని కుశలధర్మములు హేతుప్రత్యయముల నాశ్రయించుకొనివచ్చుటలేదని, అకుశల ధర్మములు, ఈ అకుశలధర్మముల స్వభావములు, అవ్యాకృతధర్మములు, వానిస్వభావములుగూడ నిట్టివే యని వాదించినయెడల ధర్మములన్నియు నిత్యశుద్ధములై యుండగలవా? ధర్మములు నిత్యశుద్ధములై యున్నచో ప్రతీత్యసముత్పాదచక్రముగతి ఏమి కాగలదు? ధర్మములు నిత్యశుద్ధములు కానప్పుడే ప్రతీత్యసముత్పాదచక్రము ప్రవృత్తము కాగలదు. ప్రతీత్యసముత్పాదసూత్రము నంగీకరింపనిచో ద్వాదశహేతుప్రత్యయములను త్రోసివేసినట్లగును. ఈ సూత్రప్రత్యాఖ్యానమువలన ధర్మములకు వాస్తవమైన స్వభావములున్నవని చెప్ప వీలుపడదు; ధర్మదర్శనయే యుండదు. 'ప్రతీత్యసముత్పాదము నెవడు చూచుచున్నాడో అతడే ధర్మమును దర్శింపగలడు' అని బుద్ధభగవాను డనినాడు. ధర్మదర్శన లేనపుడు బ్రహ్మచర్యస్థితియే అసంభవమగును.

ప్రతీత్యసముత్పాదమును త్రోసివేసినవాడు దుఃఖసముదయమును ప్రత్యాఖ్యానించినవాడగును. దుఃఖసముదయము లేనిచో దుఃఖమే లేదు. ఉత్పత్తి ( = సముదయము) లేనప్పుడు దుఃఖమెచటినుంచి రాగలదు? దుఃఖసముదయము లేనిచో దుఃఖనిరోధముగూడ ఉండజాలదు. లేనిదుఃఖమునకు నిరోధ మెక్కడిది? దుఃఖనిరోధము లేనియెడల దుఃఖమును నిరోధింపజేయు మార్గ ముండజాలదు. ఈ రీతిగా

నాలుగు ఆర్యసత్యములు ఉండజాలవు గనుక శ్రామణ్యఫలమే ఉండ వీలులేదు. శ్రామణ్యఫలములేనిచో, బ్రహ్మచర్యవాసమే లేదనవలెను.

56. అప్పుడు ధర్మము, అధర్మము, లౌకికములగు వ్యావహారికధర్మములు అనునవేవియు నుండవు. ధర్మముల స్వభావములున్నయెడల అవి నిత్యవస్తువులు కాగలవు. అప్పుడు ఈ నిత్యవస్తువుల కెట్టి హేతుప్రత్యయములును ఉండజాలవు.

ధర్మాధర్మములు, లౌకికవిషయములు మొదలైనవన్నియు ప్రతీత్యసముత్పన్నములైనవగుటచే, ప్రతీత్యసముత్పాదసూత్రమును త్రోసివేసినప్పు డీ ధర్మాధర్మాదులన్నియు శూన్యములు కాగలవు. ధర్మస్వభావము ప్రతీత్యసముత్పన్నముకానిచో నిర్హేతుకమగును. హేతురహితమైనది నిత్యమగును. స్వభావములు ముళైన బ్రహ్మచర్యవాసము కుదురదు గనుక స్వసిద్ధాంతవిరోధము బౌద్ధులకు వాటిల్లగలదు. సర్వసంస్కారములు అనిత్యములని బుద్ధభగవాను డాదేశించినాడు.

57. ఎనిమిదవ కారికలోని పూర్వపక్షమునకు ప్రత్యుత్తర మిచట చెప్పబడుచున్నది.

అకుశలధర్మములు, అవ్యాకృతధర్మములు, నైర్యాణికధర్మములు మొదలగు ధర్మముల విషయమునగూడ కుశలధర్మవిషయమున నెట్టి దోషము గలదో అట్టి దోషమే కన్పింపగలదు. పూర్వపక్షమున స్వీకరింపబడిన వాదము ననుసరించితిమేని సంస్కృతధర్మములన్నియు అసంస్కృతధర్మములు కాగలవు.

హేతువు లేనిచో సృష్టిస్థితినాశములు సంభవింపజాలవు. ఈ ఉత్పాదస్థితిభంగములు లేనిచో దేనికిని సంస్కృతధర్మలక్షణము వర్తింప వీలులేదు. అప్పు డీ సంస్కృతధర్మములన్నియు అసంస్కృతధర్మములు కాగలవు. కావున కుశలధర్మములకు కుశలధర్మస్వభావమున్నది గనుక సర్వభావములు అశూన్యములను సిద్ధాంతము అసంగతమగుచున్నది.

58, 59, 60 కారికలలో తొమ్మిదవ కారికలోని ఆక్షేపమునకు సమాధాన మీయబడుచున్నది.

58. పేరు ఉన్నదని, పేర్లకు వాని సొంత స్వభావములు గలవని ఎవరె వాదించెదరేని వారి వాదమును తొమ్మిదవ కారికలోని ఆక్షేపము నిర్మూలింపగలదు. కాని పేర్లు సత్పదార్థములని మేము చెప్పుటలేదు.

పేర్లు వాస్తవముగానున్న సత్పదార్థములనినచో, వానిస్వభావములుగూడ సత్పదార్థములు కాగలవు. అసత్పదార్థమైన స్వభావమునకు సత్పదార్థమగు పేరునకు సంబంధముండజాలదు గదా! స్వభావరాహిత్యమునుచెప్పు మేము పేర్లుకూడ అసత్పదార్థములేయని, అందుచే శూన్యములని పల్కుచున్నాము. కావున నామవాచకమున్నది గనుక తత్స్వభావముకూడ ఉన్నదని వాదించుటకు వీలులేదు.

59. 'పేరు అసద్వస్తువు' అను వాక్యమునగల నామశబ్దము సద్వస్తువా, లేక అసద్వస్తువా? ఈ రెంటిలో నే సమాధానము నిచ్చినను వాదము దోషసహితమగును.

పేరు లేనేలేని వస్తువని పల్కునప్పుడు ఈ పేరు ఉన్నవస్తువా, లేక లేనివస్తువా? ఉన్నవస్తువైనచో, పేరు అసద్వస్తువను వాదము

స్వసిద్ధాంతవిరుద్ధము కాగలదు. వస్తువులేనిచో దానిపేరుకూడ లేని వస్తువే. 'పేరు అసద్వస్తువ'ను వాక్యము ఉన్నదానిని తెల్పినచో ఈ వాక్యమే నిర్మూలితమగును. ఉన్నదానిని లేదనలేముగదా! ఇది లేనిదానిని తెల్పునదైనచో, 'పేరుయొక్క స్వభావము సద్వస్తువు' అను ప్రతిజ్ఞావాక్యము నిర్మూలితము కాగలదు. వస్తువున్నప్పుడు దానికి పేరులేదనుట తగదుగదా! కావున స్వభావములు సద్వస్తువు లను వాదము నుపపన్నము.

60. సమస్తభావములకు శూన్యత్వమును పూర్వమే మధ్యమక కారికలలో ప్రతిపాదించితిమి. మా వాదమును వివరించు ప్రతిజ్ఞావాక్యముకూడ శూన్యమే. కావున మా వాదములో నెట్టిదోషమును కన్పింప వీలులేదు.

సమస్తభావములు, పేర్లుకూడ శూన్యములని మధ్యమక కారికలలో వివరింపబడినది. శూన్యములగు నామశబ్దములేదో ఉన్నవస్తువును తెలుపు శబ్దములని పూర్వపక్షమున గ్రహించుట అయుక్తము. ధర్మములన్నియు స్వభావశూన్యములైనపుడు పేర్లుకూడ స్వభావశూన్యములే యగుచున్నవి. కావున ప్రతిజ్ఞా దోషము పూర్వపక్షముననే కన్పింపగలదు కాని మా సిద్ధాంతమున కాదు.

61. పదవ కారికలోని ఆక్షేపమున కిట సమాధానము చెప్పబడుచున్నది.

స్వభావము ధర్మవినిర్ముక్తమై సత్పదార్థముగా కన్పించుచు, అది ధర్మములలో కన్పించుట లేదను కల్పనను త్రోసివేయుట అసంభవము.

స్వభావమనునది యొకటి గలదని మే మెప్పుడును అంగీకరింపకపోవుటచే ధర్మముల స్వభావమును మేము ప్రతిషేధించుటలేదు. ధర్మములకంటె విలక్షణముగా, బాహ్యముగా గోచరించున దేదియు లేదు. ధర్మప్రతీతియే లేదని మేము చెప్పునప్పుడు ధర్మముల నెట్లు ప్రతిషేధింపగలము? ఈ వాదమున దోషమేమియు లేదు.

ధర్మములకు స్వభావములున్నవని మే మనినచో మా వాదమును ఖండింప నెవరైన బయలుదేరవచ్చును. కాని మే మీ వాదము నెప్పుడును గ్రహింపలేము గనుక పూర్వపక్షములోని ఆక్షేప మసంగతమని తెలియనగును.

పదునొకటవ కారికలోని ఆక్షేపమునకు 62, 63, 64 కారికలు ఉత్తరము నొసగునవి.

62. ఉన్నదానినే ప్రతిషేధింప వీలున్నదనినచో శూన్యతాసిద్ధాంతము నెవ్వరును ప్రతిషేధింపలేరు. సర్వభావముల నిఃస్వభావతను ప్రతిషేధించువారే శూన్యతను అప్రతిషిద్ధమైనదానినిగా గ్రహించుచున్నారు.

ఉన్నదానినే ప్రతిషేధింపగలము. కాని పూర్వపక్షముచేయు నైయాయికాది దార్శనికులు శూన్యతను ప్రతిషేధించువారు. శూన్యత యనునది లేనేలేనియెడల ఈ శూన్యతను వీరు మాత్ర మెట్లు ప్రతిషేధింపగలరు? ఈ దార్శనికులదృష్టిలో శూన్యత సత్పదార్థమై తీరవలెను.

63. పూర్వపక్షమున శూన్యత్వము ప్రతిషేధింపబడుచున్నది ఆ శూన్యత్వము లేని వస్తువు గనుక, ఉన్నవస్తువునే ప్రతిషేధింపగలవను పూర్వపక్షవాదమున స్వవచనవిరోధము నను దోషమున్నది.

64. మేము ప్రతిషేధించుటలేదు. మాచే ప్రతిషేధింపబడు వస్తువుకూడ లేదు,

కావున మేము దేనినో ప్రతిషేధించుచున్నా మనుట తర్కరహితము, దుష్టమునగు వాక్యము.

ప్రతిషేధింపబడదగిన వస్తువేదియునులేదు గనుక దేనిని మధ్యమకులు ప్రతిషేధించుట లేదు. సర్వభావములు శూన్యములైనప్పుడు ప్రతిషేధ్యవిషయమే లేదు. అప్పుడు ప్రతిషేధ క్రియగూడ లేదు. మేము దేనినో ప్రతిషేధించు చున్నామనుట అసత్ప్రలాపము.

(సశేషము)

# బాలకృష్ణుని పూజ

## శ్రీ గురుభక్త పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు

శ్రీకృష్ణుడు బాలుడని చెప్పుటకు కారణము ''మనము పూజించువారము, ఆయన పూజింప బడువాడు'' అను ద్వైతబుద్ధియే. ఈ ద్వైత బుద్ధి యున్నంతకాల మట్లు తలచెడివారుకూడ శుద్ధబాలురే. అందుచే ద్వైతబుద్ధితో గ్రహిం చినంతకాలము వీ రుభయులును బాలురే. అనగా జీవాత్మ యజ్ఞాని. బుద్ధి బాలుడు లేక మైనరు. బుద్ధి ఆత్మను వికసింపజేయలేని వాడు.

కనుకనే మనము త్రిదేహరాజ్యములో నున్నాము. అప్పుడు అనంతముపోయి బుద్ధికి భేదము కలిగినది. భేదబుద్ధి యనగా శుద్ధ అజ్ఞా నమే. భగవంతునకు చిన్న పెద్ద భేదము లేనే లేదు. అతడు చిన్నలోను పెద్దలోను అంతట నిండియున్నాడు. రెండింటిలో సమానముగ నున్నాడు. అజ్ఞాని మబ్బుచేత కప్పబడిన సూర్యునివలె నున్నాడు. జ్ఞాని మబ్బునుండి పైకివచ్చిన సూర్యునివలె నున్నాడు. నిజమగు కితో తన్మయతను పొందినప్పుడు వీరే అద్వితీయులగుదురు. అప్పుడు జీవాత్మ పర మాత్మ యేకమై పోవును. అప్పు డనంతము గనుక బాలుడు పెద్దవా డను భేదమే లేదు.

శుచి యనగా స్వార్థరహితము. దేహా తీతము. భగవంతుడు దేహాతీతుడు. అజ్ఞానా తీతుడు. శుచియైనవాడు.

నేనే దేహ మని తలచుట యజ్ఞానమే. దేహమునకుండు యవలక్షణములన్నియు తనవే యనుకొని దేహముతో సమానముగ ననుభ వించుచున్నానని మానవుడు భ్రమించుచున్నా డు. ఇదియే యశుచి. ఇంతకంటె నశుచి కావ లెనా? ఇంతకంటె నంధకారమున్నదా? ఇంత కంటె నజ్ఞానమున్నదా?

ఆత్మకు దేహము సేవకుడు. సేవకునిలో నాత్మ మొట్టమొదట బుద్ధిపూర్వకముగ ప్రవే శించెను. ఈ సేవకుడు రాక్షసుడై ఆత్మను పట్టుకొని వానిని పైకి రానిచ్చుటలేదు, సరి కదా! ఆత్మకుండెడు రూపజానముః

గూడ పోగొట్టినాడు. దేహమే తా ననుకొను నట్లు చేసెను. దీనినే జీవుడందుము. అప్పుడు ఈ రాక్షసుడను నొకడున కనగా దేహమున కుండు నవలక్షణములన్నియు జీవునకు ప్రాప్తించినవి.

దేహమునకున్నది తృప్తిలేని వాంఛ యను లక్షణమే. తృప్తిలేమివలన కోరికలు హెచ్చుచున్నవి. కోరిక పుట్టగనే దేహమునకుండు ద్వంద్వములు వచ్చినవి. సుఖము, దుఃఖము; గౌరవము, అగౌరవము; చలి, వేడి; నీవు, నేను; నాది, నీది; ఐశ్వర్యము, దారిద్ర్యము; సంతోషము, విచారము; కీర్తి, అపకీర్తి; శక్తి, మాయ; పురుషుడు, స్త్రీ; ఏకత్వము, భిన్నత్వము; కుడి, ఎడమ; సవ్యము, అపసవ్యము; తెలుపు, నలుపు; నిలువు, అడ్డము; సత్, అసత్; పురుషుడు, ప్రకృతి; జయము, అపజయము; గొప్ప, కొద్ది; మొదలగున వన్నియు నిట్టి ద్వంద్వములే.

కోరికలు నెరవేర్చుకొనుటకై దేహముతో పాటు జీవుడుకూడ బాహ్యవిషయములు సంపాదించుకొనుటకు పరుగెత్తి యట్టి బాహ్యవిషయములవలన లభించెడు నింద్రియసుఖముల ననుభవించుటకు ప్రారంభించును. అట్లనుభవించుటలో మితిమీరగనే యింద్రియసుఖములు దుఃఖభూయిష్ఠములైనవి. కనుక దుఃఖమే సంప్రాప్తమైనది. కోరికలను సంతుష్టి పొందించుట నేయిపోసి యగ్నిహోత్రమును జల్లార్ప ప్రయత్నించుటవంటిది. కనుక కోరికలు తీర్చుచున్నకొలది వానిసంఖ్య వృద్ధియై అసంతృప్తి కలిగి జీవితమున కసౌఖ్యమే మిగిలినది. ఈ దుఃఖమువలన కొన్నిజన్మల కనుభవము కలిగినది. అనుభవమువలన జ్ఞానము జ్ఞానమువలన వివేకము వివేకమువలన వైరాగ్యము కలుగును. వైరాగ్యమువలన షట్సంపత్తి ముముక్షుత్వము కలుగును.

ముక్తుడన దేహాతీతుడైన భక్తుడు. స్వస్వరూపానుభవమున తన్మయత్వముపొంది భేదరహితుడయ్యెను. అద్వితీయుడయ్యెను. అప్పుడు బాలకృష్ణుడు లేనే లేడు. తానే కృష్ణుడైనాడు. కాబట్టి బాలకృష్ణుని పూజించుచున్నారనగా మనలోనున్న కృష్ణుడు లేక బుద్ధి యింకను బాలుడుగా నున్నాడన్నమాట. యుక్తాయుక్తములు తెలిసి వ్యవహరించుటలేదు. మనము చేయు పనులు, చదివిన చదువు, వినిన సంగతులు, పరిశోధనలేకుండగ చేయునంతకాలము అజ్ఞానదశయందే యుందుము. అనగా జ్ఞానము పైకి గోచరించుటలేదు. కనుక మనము బుద్ధిచే వివేకము తెచ్చుకొని వివేకముతో వ్యవహరించుటయే పూజ.



పచ్చిబయళ్ల నంబరమను గిరుల। నిత్యజాగృతి నేలు నీ పిడ్గు చూపె;
శంకరా, ధర్మరక్షక, దేవదేవ,। కాలవిధ్వంసకా, ఖస్వరూప, భవ,
దురితంబు లెల్లను దొలఁగించి ముక్తి। నొసఁగి నన్ మనుపవే యో లోకనాథ॥

-శ్రీరామకృష్ణసూక్తిసుధ IX.



ఓం తత్ సత్

# ఛనె జోరుగర

హెచ్. కనకలక్ష్మమ్మగారు

ధారణ యనగా జగద్ధారణయే. దేనిని ధరించునది? జగత్తును. ధ్యానధారణ లనిన జగ దుద్ధారణయే. తాను శుద్ధ పరబ్రహ్మము. ఇకను ధరించు ధారణ జగత్తు. జగదాత్మ యైన యాతడు జగత్తును ధారణజేయక వే రేమి ధరించుచున్నాడు? ఆతడు వచ్చిన దిందుకొఱకే. తనయందు లోకంబులు శాంతి నొందుచున్నవి. లోకంబులు తనయం దుండు నప్పుడు తాను వాని నంటడు. లోకంబు లందు తా నుండు నప్పుడును వాని నంటడు. ఒకప్పుడు లోకంబుల వెలి నిడును, మరియొకప్పుడు లోపలికిగొనును. ఇట్టి వాడు నిష్కళంకుడు గాక వే రెవ్వరు? ఇట్టి అకళంకుడు జగత్తును ధరించియున్నాడు. అట్లు ధరింపకపోయిన, లోకంబుల కాధారము లేదు. బట్టబయలగు తాను పంచభూతాత్మ శరీరమును ధరించి, వివేకజ్ఞాన మను శక్తిచే, మూడులోకముల నావరించి మించి వెల్గొందుచున్నాడు. ఈతడే రామకృష్ణపరమహంస!

తాను నిర్వికల్పసమాధిని బొందు తరి, లోకంబులు విహ్వలత బొంది, తన్ను విడచి యుండ నేరక తాము సమాధిని బొందెను. ఇట్లు సర్వులును, సమాధి ననుకరించుచున్న నిక తన లీలా జగత్తు లీనమై పోవు నను కారణమున సమాధులకు తాళము వైచి యెల్లరను ప్రవృత్తిపరుల జేసి, నిష్కామ్యారాధనము నందు ప్రవర్తింపజేసెను. లోకాతీతు డగు నాతనియం దెల్లరును, లయ మగుచో, నాటక సూత్రధారికి ప్రొద్దుపోవదు, గావున తాను తన నిర్వికల్ప మను మహాపదవియందుండియే, పలువుర సాధనాసంపత్తి ననుసరించి, వారివారి ప్రాప్తానుసారము, ఆయాలోకంబుల నివసింప జేయుచు, అనగా, గోలోక, సత్యలోక, మహాలోక, కైలాస, వైకుంఠము లందు నివసింప జేయుచు, సాలోక్య, సామీప్య, సారూప్య, మను మూడు ముక్తుల ప్రసాదించుచున్నవాడు. తనవలె, మహాసమాధిని, మెళకువ గల్గి ప్రవర్తింప నేర్చిన వారలను, మరియు వివేకవంతుల జేసి తనయం దైక్యమును జేసికొనుచున్నాడు. తానే వారై, వారలే తానై, యిక పెక్కు తరగతులు గల పాఠశాలలను, అనగా బ్రహ్మవిద్యా విశ్వవిద్యాలయమును, తన ఆధ్యాత్మికాత్మనిలయమందు సుప్రతిష్ఠిత మొనర్చెను. అందు వేనవేలు, ప్రజ లుద్ధరింపబడుచున్నారు. తత్వరూప మగు రత్నములను నిటుకలచే, మేలిమిబంగారమును గరగించి, సున్నమునుగ గట్టిన యా కళాశాల, శాశ్వతముగను, దృఢముగను మరమ్మత్తు లనునవి యెరుగనిదై, నిత్య నూతనమై వెల్గొందుచున్నది. అయ్యది బాహ్య నేత్రములకు గోచరముకాదు. అంతర్నేత్రము గల వారల కది గోచరమగును. ఆతని నిత్య సాంగత్య ప్రేమను బొందగోరు వారల కది తెలియబడును.

ఇహలోకంబున గల విశ్వవిద్యాలయము లందు ఎం తెంత ఔన్నత్య విద్యలయం దారి

తేరినను, తమ సంస్కారముచే, చిట్టచివరి జన్మమునం దీ బ్రహ్మవిద్యా విశ్వవిద్యాలయ మును వెదకుకొనుచు రాక తప్పదు. ఈ విద్యా లయమందు జదివి ఆరితేరిన వారలు కోటి కొక్కరుగ నుందురు. ఇది అంతటి సుదుర్లభ విద్యారాజము. ఇట్లు ఈ తత్త్వపాఠశాలయం దుత్తీర్ణులై, విద్యార్థిలోకము నతిక్రమించి, విద్యాలయముననే సుప్రతిష్ఠితు లగుచున్నారు. అది మోక్షపాఠశాల. ఇదియే గదా బ్రహ్మ విద్యకు ఫలము. సద్గురుదేవుడు, నేడు ఇంతటి మహావిద్యాలయమును స్థాపించి, విద్యావ్యాసం గమును గూర్చి తీవ్రతరప్రయత్నముల సల్పు చుండుట జూచిన, చకితుల మగుదుము. అద్వైత భూమిక యం దుండి, ఆతడు సల్పు బోధలు, ఆతని సద్విద్యా విధానము, ఆతని పాఠశాలను కన్నులుండియు, జూడ జాలక యున్నారు. ఆతడు అసత్యవాది కాడు. తాను మూడు వందల సంవత్సరములు, లోకమున మీవద్ద నుండియే, మి ముద్ధరింతు నను వా క్కును నేడు ముముక్షుద్ధులను పాలించు చున్నాడు. బ్రహ్మవిద్యను గోరు వారు, జ్ఞాన నేత్రమును దెఱచి, మీ దృష్టి నూర్ధ్వము నొందించి, సహస్రార, సముద్ర తీర మందే యుండక, అందు దుమికి, ఏకాగ్రతా విశ్వాస సహనములతో, భావభూమికల విశ్రమిం చుచు, మీ ప్రయాణమును సాగించుచో ఆతడు, నీలమేఘశ్యాముడు, మీ చెట్ట వట్టి ఆవలి తీర మగు పాఠశాలను జేర్చును. అట్లు గాక యీ యొడ్డుననే గూర్చుండి ఆలోచించు చుండిన ఫల మేమి?

అంతియ కాని మీ సంకుచిత బుద్ధిబలముచే నాతని పొడగాంచ జాలరు. మీరు విద్యార్థులై, యర్థించిననే గాని, ఆతడు కనికరింపడు. మేమే గురువుల మనుకొని, భీష్మించుకొని గూర్చుం డిన, ఆత డేమి చేయును? మీ మీ మానాభి మానములను, విడచి చేయెత్తి అల గోపీ కాంతల వలె, ప్రార్థించిన పక్ష మందు, ఆలేపు మీకు, సన్న్యాస మను కాషాయాంబరముల నందించును. ఆతడు జ్ఞాన మను పొన్న నధి ష్ఠించి యున్నాడు. వేగ పొండు, వేడుకొండు, ఆతని గండు, పొందు గొండు. నేటి మీ కాషా యములు నిజకాషాయములు కావు. ఆతని మధు రాతిమధుర మగు హస్తమునుండి, గైకొని గోపికలవలె సంతసింపుడు. అయ్యారే! సిగ్గేల? తన నాథుని చెంగట సిగ్గును బొందిన నిక బొంద గల్గు భాగ్య మేమి యున్నది? సిగ్గును విడువుడు. అహంకారమును విడువుడు. దాసాను దాసులు గండు. ఆతని వలచి వలపించుకొనుడు. ఇదియు తప్పా? పోనిండు. వాని దయ. మీ

ఓం శాంతిః శాంతిః శాంతిః

తత్త్వం బ్రువాణాని పరం పరస్మా, న్మధుక్షర న్తీవ సతాం ఫలాని,
ప్రావర్తయ ప్రాఞ్జలి రస్మి జిహ్వే, నామాని నారాయణగోచరాణి ॥

ఓనాలుకా, నీవు అంజలించుచున్నాడను, పరాత్పరమైన తత్త్వమును దెలుపుచు సజ్జనుల కనుభావ్యమైన మధురసమును గార్చు పండ్లంబోని భగవన్నామములను అనుసందింపుమా — శ్రీకులశేఖరులు.

# సుభాషితములు

'ఉభయభాషా' 'సాహిత్యవిద్యా' ప్రవీణ :

**శ్రీ అఖండం సీతారామశాస్త్రిగారు, పి. ఓ. ఎల్.**

(గతసంచిక తరువాయి)

యత్న మొనరింపగా నంత హాని లేదు, ఫల మ దెప్పుడు పిల్లికి వలెను గలుగు ;
పిల్లి యెప్పుడు గోవును బెంచ కుండ పాలు ద్రాగును తప్పక ప్రతిదినంబు ॥ ౧౧

పరుల యన్నంబు దినుటచే వదనము చెడు, దానమును దీసికొనుట హస్తములు చెడును,
మనసు చెడిపోవు నన్యభామలను దలప, నేల శాపంబు మనుజుల కింతకంటె? ॥ ౧౨

ధనికుడై యుండి యెవ్వడు దాత గాడొ, దీనుడై యుండి తలపడో దేవు నెవడు,
పెద్ద ఱాతిని గళమందు బిగియ గట్టి, యిద్దఱిని ద్రోయ వలయు నట్టేటిలోన ॥ ౧౩

సహజమౌ తెల్వి యించుక జరుగ కున్న, శాస్త్రపఠనంబు వానికి సాయపడదు,
గ్రుడ్డివారల కద్దంబు కొంచె మైన, నుపకరించునె యెప్పుడే నుర్వి మీద ॥ ౧౪

మంచి చెడ్డల నన్నిటి మరుగు లేక, ప్రేమగలవానితో జెప్పు ప్రీతితోడ,
కాని తల్లికి దండ్రికి కాంతకైన సోదరులకైన దెలుపడు, చోద్య మేమొ! ॥ ౧౫

పుణ్యధనమును వెలబోసి పురుషవర్య, దేహనౌకను గొంటి విదే తిరమ్మ?
దుఃఖవారిధి దాటగ దోచె నేని, తనువు పోకుండుటకు ముందె దాటు మయ్య ॥ ౧౬

బంధువుల కున్న ప్రేమయు, బాంధవంబు, స్వజనమిత్రుల కుండెడి సరసగుణము,
తనకు మదిలోన నున్నట్టి ధైర్యగుణము, నాపదయె గీటురాయౌచు నరయుగుణము ॥ ౧౭

కలుగబోయెడి యాపదకంటె, ముందు దాని వారింప జూచుట తగును సుండు,
కొంప లంటుకొనంగను కూపఖననమునకు యత్నింపనది లాభ మెనయ గలదె ॥ ౧౮

పరులసొత్తును దిగమ్రింగి బలిసియుండు కంటె, లేమిని చిక్కియేయుంట మేలు,
చిక్కి యున్నను దేహంబు చిక్కు లేదు, ఉబ్బురోగాన లావైన నున్నె బలము ॥ ౧౯

బలియు మిక్కిలి యొసగియె బద్ధుడయ్యె. యోధు డని మిగిలి చెడె దుర్యోధనుండు,
రక్తి మిక్కిలియై చచ్చె రావణుండు, కాన మిక్కిలి యెక్కడ గాని తగదు ॥ ౨౦

ఎవని కేమి రేప డెట్లు కానున్నదొ, ఎవ్వ డేని యెఱుగ డించుకైన,
కాన రేపటి కని కాలంబు గడపక, చేయ వలయు దాని చేయు నేడె ॥ ౨౧

[illegible]ం, సురాపాయి, గురుని కాంతగూడినవాడు, బంగారుదొంగ,
వారితో గూడిన దురాచారుడొకడు, పంచపాతకులన జెల్లు వసుధయందు. ౨౨

(సశేషము)

# వార్తలు, విశేషాలు

## మాతృశ్రీ శారదామణి శతతమ జయంతి మహోత్సవాల సంగ్రహ నివేదిక

బేలూరు రామకృష్ణ 'మఠ' 'మిషను'ల అధికారులు ఈ ఉత్సవాలను అర్హరీతిని నడపడానికై తాత్కాలిక నిర్వాహకపరిషత్తు [ఎక్సెక్యుటివ్ కమిటి]ను ఒకదానిని ఏర్పఱచిరి. ఆ పరిషత్తువారు 'భారతీయ మహిళా మతల్లులు' [గ్రేట్ విమెన్ ఆఫ్ ఇండియా] అను ఆంగ్ల గ్రంథ రాజమును, వంగాంగ్ల భాషలలో మాతృశ్రీ సంగ్రహ జీవిత చరిత్రలను ఉత్సవ స్మారకాలుగా ప్రకటింప బూనుకొన్నారు. జయరామవాటిలో మాతృశ్రీ నివసించియుండిన యింటిని ఈ పరిషత్తువారు రూ. 2,300/-లకు కొన్నారు. తే 1-4-1953 ది కూడిన సభలో జెనరల్ కమిటి ఒకటిన్నీ ఎక్సెక్యుటివు కమిటి ఒకటిన్నీ ఏర్పడ్డాయి. ఇవి కాక సబ్ కమిటీలు ఎన్నో ఏర్పడ్డాయి. వీని వివరాలు నివేదికలో ఉన్నవి.

తే 27-12-1953 ది ఉత్సవప్రారంభం. జనరల్ సెక్రెటరి శ్రీమన్మాధవానందస్వాములు అధ్యక్ష్యం వహించగా, కేంద్ర మఠాధిపతులు శ్రీమచ్ఛంకరానందస్వాములు మంగళసందేశమును జదివారు. కలకత్తాయూనివర్సిటీఇన్స్టిట్యూటులోగూడా భక్తగోష్ఠి తే30-12-1953ది జరిగింది. తే 3-1-1954 ది జరిగిన దక్షిణేశ్వర యాత్ర, ప్రారంభోత్సవకార్యక్రమాలలో తుది అంగం.

శతతమజయంతిమహోత్సవాలు మనదేశంలో వివిధప్రాంతాలలోను విదేశాలలో వివిధ ప్రాంతాలలోను ఉన్న శ్రీరామకృష్ణ 'మఠ' 'మిషన్'ల కేంద్రాలలోనేగాక ఈ సంస్థకు చెందని తావులలో కూడ పెక్కింట జరిగాయి.

ఈ ఉత్సవ జ్ఞాపకంగా మాతృశ్రీ శారద యొక్క చక్కని చలవరాతివిగ్రహమును జయరామవాటిలో ప్రతిష్ఠించడమే కాక, శ్రీశంకరానందస్వాములు దక్షిణేశ్వరమున మహిళలకై శారదామఠమను ఒక మఠమును స్థాపించారు. వారి ఆధ్యక్ష్యంలోనే కలకత్తాయూనివర్సిటీఇన్స్టిట్యూటుహాలులో అఖిల భారత మహిళలమహాసదస్సు నాలుగుదినాలు సమావేశ మైంది. మహిళలసంగీతమహాసదస్సు ఒకటిన్నీ వృత్తివిజ్ఞానకళావస్తుప్రదర్శనమొక్కటిన్నీ జరిగాయి. పోటీలలో ఇండియా పాకిస్థాన్ బర్మా సింహళం అనే నాలుగుదేశాల విద్యార్థినులు పాల్గొన్నారు. 1954 డిసంబరులో శతతమ జయంతి మహోత్సవాలు ముగిసినవి.

### 'శ్రీరామకృష్ణ' 'వివేకానందు'ల జయంతులు, డాకా

మొత్తం ఏడు దినాల కార్యక్రమం, మార్చి తే 3 ది నుండి తే 9 ది వఱకు. అనంతప్రజానీకం సమావేశమయ్యారు. శ్రీ ప్రణవాత్మానంద స్వాముల ఉపన్యాసాలు శ్రోతలకు మహాప్రీతిని

కలిగించాయి. వివిధ నాటకప్రదర్శనాలు ఎంతో వినోదం కూర్చాయి. తే 7 దినాటి విద్యార్థిసభకు తూర్పుపాకిస్థాన్ నిధిమంత్రి శ్రీ మనోరంజన ధార్ గారు ఆధ్యక్ష్యం వహించారు. కాజీ హుస్సేన్, ప్రొఫెస్సరు అజిత్గుహ, స్వామిసత్యకామానందులు చక్కగ మాటాడారు. తే 8 ది దరిద్రనారాయణసంతర్పణ - తుదినాటి మహాసదస్సులో తూర్పుపాకిస్థాన్ - అసెంబ్లీ - స్పీకరు జనాబ్ అబ్దుల్ హకీముగారు అధ్యక్షపీఠం అలంకరించారు. డాక్టరు గోవిందచంద్రదేవ్, శ్రీమతి ఆశాలతసేన్, శ్రీసంతోష్గుప్త, స్వామి ప్రణవాత్మానంద ప్రముఖులు ఉపన్యసించారు. బీగం సూఫియా కమాలును శ్రీ శివనారాయణ రాయియు తమ గేయాలను చదివారు.

## ఒక విన్నపము

ఆంధ్రప్రదేశమందును, అన్యరాష్ట్రములందును జన్మించిన 'ఆంధ్రమహాభక్తుల జీవితచరిత్ర' యింతవర కొక్కటి యైన లేదు. అజ్ఞాతముగా ఉన్న ఆంధ్రమహాభక్తులను గురించిన సంపుటము ఒకటి ప్రకటించినచో, స్వరాష్ట్రీయులకును, అన్యరాష్ట్రీయులకును ఎక్కువ ఉపయోగకరముగా ఉండగలదని ఆంధ్రసోదరులు పెక్కురు వెలిబుచ్చిన సూచనను ఆధారముగా గొని అట్టి సంపుటము నొకదానిని మేము ప్రకటింప నిశ్చయించితిమి. ఆంధ్రసోదరుల తోడ్పాటు లేనిదే యిట్టి మహాత్కార్యము నెఱవేటుట కడుంగడు కష్టము. ఆంధ్రసోదరులు మా యీ విన్నపమును మన్నించి, తమకు తెలిసిన ఆంధ్రులగు వివిధ దేవతాభక్తుల, గురుభక్తులచరిత్రలను వీలైనన్ని వివరములతో, లభించిన వారి చిత్రపటములతో సహా పంపి గాని, లేదా ఎచ్చట లభింపగలవో వివరములు తెలిపి గాని మా యీ ఉద్యమమునకు తోడ్పడగలందులకై ప్రార్థించుచున్నాము.

సజీవులచరిత్రలు పంపునపుడు వారి ప్రస్తుత విలాసము, పుట్టిన తేది మొదలగు వివరములు గూడ వీలైనచో సేకరించి పంపవలసినదిగా వేడుచున్నాము.

విధేయుడు,
దిగవల్లి శేషగిరిరావు,
సంపాదకుడు, ఆధ్యాత్మికగ్రంథమండలి,
విజయవాడ - 2.

## రామజయంతి

ఆలూరు తాలూకా చింతగుంటగ్రామమున శ్రీ గురుసేవాసంఘమువారు తే 8-4-57 దినాడు రామజయంతి మహోత్సవం విభవోత్తరంగా జరిపారు. శ్రీమత్స్వామి వైరాగ్యానందులు వివిధసేవలను భజనలను భక్తసంతర్పణను పురోత్సవమును జరిపించుటే కాక రామావతారప్రయోజనమును సకలజనహృదయంగమముగా ఉపన్యసించారు.

## శ్రీరామకృష్ణప్రార్థనామందిరము - పోలమూరు పశ్చిమ గోదావరి జిల్లా

తే 21-4-1957 దినాడు పార్లమెంటు సభ్యులైన కర్నల్ డాక్టరు శ్రీ డి. ఎస్. రాజుగారి ఆధిపత్యాన శ్రీ పోతాప్రగడ శ్రీరామారావు గారు B. A., B. L., శ్రీ పిలకా శ్రీకృష్ణమూర్తిగారు B. A., శ్రీ కె. రామమూర్తిగారు అను ప్రముఖుల ఉపన్యాసాలతో — ప్రస్తుతం పారిస్ రామకృష్ణమిషను కధిపతులుగా ఉన్న శ్రీ నిత్యబోధానందస్వాముల ఛాయాచిత్రావిష్కరణమహోత్సవం వైభవయుతంగా జరిగింది. కార్యదర్శులు యామజాల లక్ష్మీనరసింహమూర్తిగారు, కలిదిండి రామచంద్రరాజుగారు.

# గ్రంథసమీక్ష

## శ్రీ వసిష్ఠ గీత

శ్రీమహర్షి వాల్మీకి విరచితము, ప్రథమ భాగము; ఆంధ్రానువాదకులు : శ్రీవిద్యాప్రకాశానందగిరిస్వాములవారు; ప్రకాశకులు : శ్రీ శుకబ్రహ్మాశ్రమము, కాళహస్తి, చిత్తూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్; పుటలు : 308; వెల : రూ. 3/– లు.

వాల్మీకిముని 24 వేల శ్లోకములు గల శ్రీమద్రామాయణమును రచించినాడను నదే మనమందఱ మెఱిగిన విషయము, గాని 32 వేల శ్లోకములు గల వాసిష్ఠరామాయణమును రచించిన సంగతి మనలో చాలమంది యెఱుగము. అది కాంతాసమ్మితము, ఇది శ్రుతిసమ్మితము, అందు లౌకికజీవితము, ఇందు పారమార్థికజీవితము. దాని కధికారి భేదము లేదు, దీనికి కావలెను. అందు సాహిత్యగోష్ఠి, ఇం దాధ్యాత్మికవిచారణ. అది సుప్రసిద్ధము, ఇది అన్వేష్టవ్యము. ఈ వాసిష్ఠరామాయణమునకే యోగవాసిష్ఠ మనియు నామాంతరము గలదు.

కేవలజ్ఞాని కాని, కేవలాజ్ఞాని గాని యీ శాస్త్రమునం దధికారి కాడు. "న శాస్త్ర మద్రవ్యే ష్వర్థవత్" అని వామనుడు చెప్పినట్లు మూఢులయందు శాస్త్రము ప్రవర్తింపనేరదు. ఉదాహరణముగ "న కతకం పంక ప్రసాదనాయ" అనియు చెప్పెను. చిల్లగింజ మురికినీటిని నిర్మలముగ జేయగలదు, గాని బురదను తేటపరుప లేదు. అట్లే మూఢున శాస్త్రమువలని ప్రయోజనము లేదు. జ్ఞాని గూడ లోలోన్నతులవలె నుండును గాన నతని శాస్త్రము ప్రసక్తియే లేదు. అందుచే జిజ్ఞాసువు మాత్రమే దీని యం దధికారి.

ఈ గ్రంథమునందలి శ్రీరాముడు తీవ్రజిజ్ఞాసువు. షోడశవర్షప్రాయుడైన శ్రీరాముడు తీర్థయాత్రానంతరము వైరాగ్యము గలిగి, ప్రజాగరుడై, యన్నపానీయములు ముట్టక, తనయొక్కయు, దృశ్యప్రపంచముయొక్కయు స్వరూపస్వభావముల నెఱుంగుటకై పరితపించెను. తప్తమైన పాత్రమునందే కళాయిపూత బాగుగ నంటును, కళాయి పూసిన పాత్రయం దెట్టి పుల్లని పదార్థములు పోసినను చిలుమూరదు. అట్లే తపించిన మనస్సునకు వైరాగ్యమనెడి కళాయిపూత పూసినచో రాగద్వేషాదులు దాని కంటవు. శ్రీరాము డట్టి పరితపించిన యుత్తమాధికారి కాబట్టియే వసిష్ఠోక్తములగు బోధలు విని "నష్టో మోహః పదం ప్రాప్తం త్వత్ప్రసాదా న్మునీశ్వర స్థితో ఽస్మి గతసందేహః ...... కరిష్యే వచనం తవ" (వ. గీత – నిర్వాణప్రకరణము) అని పలికెను.

దశరథుని సభాభవనమున నించుమించుగ నీ బోధ యిరువదిదినములు నడచినది. ఆ బోధను ఆకాశమునుండి సిద్ధగంధర్వాదులు, భూలోకమున వ్యాసవాల్మీకినామదేవాదిబుధులును, నారదుడును వినిరి. బోధలు వినిన పిదప విశ్వామిత్రుడు "యేన గంగాసహస్రేణ స్నాతా ఇవ వయం స్థితాః" "వేలగంగానదులలో స్నానము చేసినట్లు మహాపవిత్రుల మైతిమి"

అని పలికెను. త్రిలోకసంచారి నారదుడు "య న్న శ్రుతం బ్రహ్మలోకే స్వర్గే భూమితలే తథా" "సత్య, స్వర్గ, మర్త్యలోకములలో నే నిట్టి బోధను వినియుండ లేదు. ఆ జ్ఞానమును విని నా చెవులు పవిత్ర మైనవి" అని పలికెను. సిద్ధులు "వ్యాఖ్యాతా శ్చ శ్రుతా శ్చాల మీదృశా స్తు న కేచన" "అనేక గ్రంథము లను విని వ్యాఖ్యానించితిమి కాని, వసిష్ఠుని యుత్తమ బోధల వంటి వేవియును కావు" అని పలికిరి. గ్రంథప్రాశస్త్యమును గూర్చి యొక్క శ్లోకములో "య దిహాస్తి త దన్యత్ర య న్నే హాస్తి న త త్క్వచిత్ । ఇమం సమస్త విజ్ఞాన శాస్త్ర కోశం విదు ర్బుధాః ॥ "ఈ శాస్త్రమం దున్న దే యితరశాస్త్రములందును గలదు. దీని యందు లేనిది మరి యొక చోట లేదు. పండితు లీ గ్రంథమును విజ్ఞానశాస్త్రకోశమునుగా దెలి పిరి" అని తెలుపబడినది.

సాధకునకు సగుణోపాసనమువలె నిర్గుణో పాసనము సులభము కాదు. అద్వైతమతమున నిర్గుణోపాసనకు ప్రాధాన్య మొసగబడినది. అన్ని మతములవారును ప్రపంచము సత్య మను చుండ, అద్వైతులు మిథ్య యనుచున్నారు. జీవేశ్వరాత్మలకు భేదమే లేదనుచున్నారు. ఈ ద్వైతభావన మనఃకల్పితమే కాని వాస్తవముగ లే దనుచున్నారు. చీకటిలో త్రాటిని జూచి పా మనుకొన్నట్లు, మాయచే నావృతమైన బ్రహ్మ మీ ప్రపంచమువలె తోచుచున్న దనిరి. ఇట్టి విరుద్ధవిషయములను శ్రుతిప్రమాణము లతో, యుక్తులతో, అనుభూతులతో సమన్వ యపరచి, సాధకుని మనస్సునకు నచ్చజెప్ప టకై, నైద్యుడు చేదుమాత్రలను చక్కెరలో పొదిగి రోగికి నోటిలో వేసినటుల, పలువిధము లగు నుపాఖ్యానము లీ గ్రంథమున జెప్పబడినవి.

32 వేల శ్లోకములు గల యోగవాసిష్ఠమును చదువుట సామాన్యజనులకు సాధ్యము కాదు. అందునను సంస్కృతభాషాపరిజ్ఞానము లేని వారికి దాని ప్రయోజనమే లేదు. దీనిని సర్వ జనోపయోగకరముగ జేయ నెంచి శ్రీవిద్యా ప్రకాశానందగిరిస్వాములవా రా గ్రంథము నుండి ముఖ్యము లగు 8 వేలశ్లోకములను గ్రహించి, అధ్యాయములుగ విభజించి, తెనుగు తాత్పర్యము వ్రాసి, యీ "వసిష్ఠగీత" యను గ్రంథముగ వెలువరించిరి. ఈగ్రంథము ప్రథమ భాగము మాత్రమే. ఇంకను మూడుభాగము లచ్చొత్తింప వలసి యున్నది. మూలమునందు వలెనే దీనియందును వైరాగ్య, ముము, క్షూత్పత్తి, స్థి, త్యుపశమ, నిర్వాణము లను నాలు ప్రకరణములు గలవు. ఈ గ్రంథమున మూడుప్రకరణములుమాత్రమే గలవు. ఒక్కొ క్క ప్రకరణము కొన్ని యధ్యాయములుగ విభ జింప బడినది.

శ్రీ స్వాములవారు మూలగ్రంథమునందలి ప్రధాన తత్త్వభాగములను విడువక, బాహు ళ్యమును సంగ్రహించి, విశేషాంశములను కుండ లీకరణములలో వివరించి, నాతిసంగ్రహముగ, నాతివిస్తరముగ, సరళమగు శైలిలో, నిర్దుష్ట మగు భాషతో వచనరచన సాగించిరి.

శాస్త్రజ్ఞానమునకుతోడు అనుభూతియు గల వా రగుటచే శ్రీ స్వాములవారు గూఢార్థ క్లిష్టా ర్థములను వివరించి, పఠితృజనమునకు కరతలా మలక మొనర్చిరి. అచ్చ టచ్చట వ్యాఖ్యాన విశేషములను గూడ పొందుపరచిరి. గ్రంథ ప్రశస్తిని గూర్చి యెంతయో వ్రాయ దగి యున్నను గ్రంథవిస్తరభీతిచే వ్రాయ జాల నైతి.

ముముక్షువులు మిగిలిన మూడుభాగముల నచ్చొత్తింప జేసి, నిష్కామ లగు శ్రీస్వాముల వారి యపారకృపకు పాత్రు లగుదురు గాక.

అత్యంతోపయుక్త మగు నిట్టి గ్రంథమును రచించి సాధకలోకమున కందజేసిన శ్రీస్వాముల వారు మనకెల్లరకును కరమువంద్యులు.

—అఖండం - సీతారామశాస్త్రి

## సుందరభారతయాత్ర

రచయిత: శ్రీ విద్వాన్ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు; ప్రకాశకులు: తెనాలి సాధనగ్రంథమండలివారు; మొత్తము పుటలు 748. రెండుభాగములుగ విభక్తము. వెల ఒక్కొక్కభాగమునకును రూ. 2-50.

భారతీయులకు ఆస్తిక్యమే ప్రాణము. ఆసేతు హిమాచలవ్యాప్తమై ఉన్న మన భారతదేశమున పుణ్యక్షేత్రములును పుణ్యతీర్థములును ఒక్కొక్కప్రాంతమున పెక్కులు గలవు. ఆరోగ్యాది శక్తి సంపన్నులకు పుణ్యక్షేత్ర తీర్థాలయాత్ర కర్తవ్యము. అట్టి శక్తి కొఱవడిన వారికి పుణ్యక్షేత్రతీర్థాల స్మరణయు యాత్రాఫలము నొసంగు ననుట పెద్దల ప్రమాణము. యాత్ర కేమి, స్మరణ కేమి, ఆ క్షేత్రతీర్థాల విశేషములను వివరములను తెలుపు గ్రంథాలు అన్ని ప్రాంతీయభాషలలోను ఆవశ్యకములు. తెలుగుభాషలో ఆ కొదువను ఈ గ్రంథకర్త గారు ప్రశంసార్హముగ తీర్చినారు. మొత్తము గ్రంథము యాత్రాఖండము, ద్వారకాఖండము, కాశీఖండము, జగన్నాథఖండము, మధ్యభారతము, రామేశ్వరఖండము, పరిశిష్టఖండము అని ఏడుఖండములుగ విభక్తమై యున్నది. ఒక్కొక్కఖండములోను తత్ప్రాంతీయ క్షేత్రాలను గూర్చిన సకలమును సంక్షేపసామగ్ర్యసంపన్న ఫక్కిని చిత్రపటములతో సహా పొందుపడియున్నది. కీర్తిశేషులు మహోపాధ్యాయ దుర్భా సుబ్రహ్మణ్యశర్మగారు వ్రాసిన పీఠికయు యాత్రావైభవము అను శీర్షిక క్రింద గ్రువ్వబడిన శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ - శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ - శ్రీ వఝల చినసీతారామశాస్త్రి - శ్రీ శతావధాని వేలూరి శివరామశాస్త్రి - శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి - శ్రీ దివాకర్ల వేంకటావధాని - శ్రీ దువ్వూరి వేంకటరమణశాస్త్రి - శ్రీ శతావధాని గడియారము వేంకటశేషశాస్త్రి - శ్రీ చింతా దీక్షితులు - శ్రీ జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి - గారల వ్యాసరాజము లును, గ్రంథపు విలువను పెక్కుమడుంగులు హెచ్చించినవి. ఈ యపూర్వ పుణ్యఫణితికి మా యభినందనములు.

—ప్రభాకర్

# శ్రీ రామకృష్ణోపనిషత్తు

తమిళ రచయితలు :

శ్రీ చక్రవర్తి రాజగోపాలాచార్యులుగారు

ఆంధ్రానువాదకులు :

గౌ॥ న్యాయమూర్తి శ్రీ ప్రత్తిపాటి సత్యనారాయణరావుగారు

శ్రీరామకృష్ణదేవుని దివ్యోపదేశవాక్యములను శ్రీ రాజాజీగారు మనోహరకథారూపముగను, సంభాషణరూపముగను అమర్చి, తమిళభాషలో రచించియున్నారు. అందు వారి సూక్తివైచిత్రియు ప్రత్యక్షర చమత్కారమును ఎంతటి గంభీరవిషయమునైనను సర్వసుగ్రహము చేయగల నైపుణియు తలపాలమంటినవి. ఆ గ్రంథముయొక్క యనువాదములు ఇంగ్లీషు, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, హిందీభాషలలో ఇప్పటికే అపారవ్యాప్తి నొందినవి. దాని కిది చక్కని తెలిగింపు.

128 పుటలు    వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

## OUR NEW PUBLICATIONS

**CHĀNDOGYA UPANISHAD**

With Sanskrit text, word for word meaning, translation and Notes according to Sri Sankara's Commentary.



*Translated by*
SWĀMĪ SWĀHĀNANDA
*with an introduction by*
SWĀMĪ VIMALĀNANDA

Neat Printing and Beautiful Set up

**Price Rs. 8.    Postage Rs. 1.50.**

**THE MAHANARAYANOPANISHAD OF THE KRISHNA YAJUR VEDA**

(*Text with Svara marks*)

Introduction, English Translation, Word-meaning, Simple Sanskrit Explanation and Elaborate Critical and Explanatory Notes Tracing the source, back-ground Significance and Religious Application of the Mantras and Formulas.

*By*
SWĀMĪ VIMALĀNANDA

**Price Rs. 5.    Postage Rs. 1.25.**

**SRI RAMAKRISHNA MATH, MYLAPORE, MADRAS-4.**

# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు శ్రీరామకృష్ణుని జీవిత సంగ్రహమును 1121 మహోపదేశములును గలవు.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బోధగురువులు : బోధ గురువులు, లౌకికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి; సాధకులు . వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సనుపాయములు, సర్వమత సామరస్యము, దేవుడు, జ్ఞానము : భక్తి : కర్మము, బ్రహ్మతత్త్వము మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసి బిడ్డల కయిన అవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

నీతికథలును సూక్తులును మకరంద పేశలములు, నిర్వృతికరములు.

ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూక్ష్మాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పం డొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్వలమగు పంచమ ముద్రణము ! వెల : రూ. 3-50

# హిందూమతము

రచయిత : శ్రీ వివేకానందస్వామి

అనువాదకులు : శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

హిందూమత నామమును పరస్పరభిన్న భావభూయిష్ఠములగు అనేక మతసంప్రదాయములు వహించి యుండుటచే, తత్ స్వరూప నిర్వచనమునకు ఇందు శ్రీ వివేకానంద స్వాములవారు పూనుకొని ఆ మతము వేదసంహితాకాలమునుండి ఎట్లు క్రమ పరిణామ మందెనో, అందు సర్వసమ్మతమూలభావము లెవ్వియో, అది చేయు బోధ యెట్టిదో, ఇన్ని భిన్నమతాంతరము లెట్లు కలిగెనో, ఈ కలగూరగంపకు హిందూమత నామ మెట్టు లేర్పడెనో విశదీకరించియున్నారు. జిజ్ఞాసువుల కత్యంతోపయుక్తమగు గ్రంథము.

... తెనుగువాఙ్మయములో వేదాంతచర్చలపై ... ప్రకటింపబడిన గ్రంథములలో ఇది ఉత్తమోత్తమ మైనదని శిరసొగ్గి చెప్పవలసియున్నది. ... —భారతజ్యోతి 12-4-1956.

168 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# దక్షిణ రైల్వే

## దక్షిణ - ఇండియాకు వచ్చి దర్శించండి వీనిని—

| | |
|---|---|
| బాదామి | క్రీ॥ శ॥ 6–వ శతాబ్దినాటి జైనుల బిలములకున్నూ గుహాలయాల కున్నూ ప్రసిద్ధం. |
| బిజాపూర్ | లోకంలోని గోపురాలలో ద్వితీయస్థానం అధిష్ఠించిందిన్నీ అద్భుత ప్రతిధ్వననపు ఏర్పాట్లు గలదిన్నీ అయిన "గోల్ గుంబజ్" ఉన్న ఊరు. |
| చిదంబరము | నటరాజాలయం ఉండే సుప్రసిద్ధ శివక్షేత్రం. |
| కోర్టల్లం [తెన్కాశిమీదుగ] | జలపాతాలకు ప్రసిద్ధం, స్నానఘట్టం, ఆరోగ్య కేంద్రం. |
| హంపి [విజయనగరం] | హిందువుల అవిస్మరణీయ సామ్రాజ్యానికి ముఖ్యపట్టణంగా ఉండిన విజయనగరంయొక్క శిథిలాలు అద్భుతకరాలు. |
| కొడైక్కనాల్ | మధుర సమీపంలో రమ్యమైన కొండవిడిది. |
| మధుర | ప్రాచీన పాండ్యరాజుల రాజధాని, మీనాక్షీదేవ్యాలయానికి ప్రసిద్ధం. |
| మైసూరు | దీపోజ్జ్వలమైన నగరం; మనోహరాలైన బృందావనంపుతోటలు మైసూరికి పదిమైళ్ళ దూరంలోనే ఉన్నాయి. |
| ఉదకమండలం | భారతదేశంలో కొండవిడుదులు అన్నిటిలోను ఇది ప్రథమగణ్యం. |
| రామేశ్వరం | సేతుస్నానానికీ రామలింగేశ్వరస్వామి సేవకూ ప్రసిద్ధం. |
| తిరుపతి | ఇక్కడి శ్రీ వేంకటేశ్వరస్వామి [బాలాజి] గుడిలో ప్రతిదినమున్నూ ఒక ఉత్సవదినమే. |
| తిరుచిరాపల్లి | శ్రీరంగంలోని తిరువానైక్కావల్‌లోని దేవాలయాలకు ప్రసిద్ధమైన మండలం. |
| ట్రివేన్డ్రమ్ [తిరువనంతపురం] | ఇక్కడి వింతవస్తుశాల (మ్యూసియమ్), కళానిలయం (ఆర్టుగ్యాలరి), జంతునిలయం (జూ)—ప్రసిద్ధాలు. |

మదరాసు. చీఫ్ కమ్మర్షల్ సూపరింటెండెంట్.

# రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౪ ౧౯౫౭, జూలై; హేవిళంబి – ఆషాఢము సంచిక ౧

## విషయసూచిక

షట్పదీస్తోత్రమ్ ... ... ... ౧
ఈశానునకు శ్రీరామకృష్ణు నుపదేశము—[సంపాదకీయము] ... ... ౪
విశ్వమతమహాసభోపన్యాసములు—శ్రీ వివేకానందస్వామి ... ... ౧౦
శ్రీరామకృష్ణుని సందేశము—శ్రీ కే. ఎం. కరియప్పగారు ... ... ౧౧
మాతృశ్రీ శారదాదేవి—[శ్రీమద్గంభీరానందవాణి] ... ... ౧౩
వివేకానందస్వామినిగూర్చి జ్ఞప్తికివచ్చు కొన్నివిషయములు ... ... ౨౦
—శ్రీ సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు
వంటయింట భగవానులు—శ్రీ గుఱ్ఱము వేంకటసుబ్బరామయ్యగారు, ఎమ్. ఏ. (ఆనర్సు) ... ౩౫
మహాత్మా తులసీదాసు—శ్రీమతి కుమారి సరళాదేవి ... ... ... ౩౭
శ్రీకృష్ణదేవరాయలు – సంగీతప్రయోజనము—శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు, ఎమ్.ఏ. ౪౨
వార్తలు, విశేషాలు ... ... ... ౪౫
గ్రంథసమీక్ష ... ... ... ౪౭



"సర్వేశ్వరుని శరణు జొరుము, అతని కృప నీ యనుభవమునకు అప్పుడు వచ్చును.'

-శ్రీ శారదామణి.



# శ్రీరామకృష్ణ ప్రభ



సంపుటము ౧౪ } ౧౯౫౭ - జూలై :: హేవిళంబి - ఆషాఢము { సంచిక ౧

ఓమ్

## షట్పదీ స్తోత్రమ్

### శ్రీమచ్ఛంకర భగవత్పాదులు

అవినయ మపనయ, విష్ణో, దమయ మనః, శమయ విషయమృగతృష్ణామ్,
భూతదయాం విస్తారయ, తారయ సంసారసాగరతః ॥ ౧

టీక॥ (హే) విష్ణో=(ఓ) విష్ణూ, అవినయం=అడకువలేనితనమును, అపనయ=పోగొట్టుము; మనః = మనస్సును, దమయ = వశమున ఉంపుము; విషయమృగతృష్ణాం = ఇంద్రియసుఖములనెడి యెండమావులను, శమయ = అణంపుము; భూతదయాం = ప్రాణులయెడ మమకారరహితమైన ప్రేమను, విస్తారయ = విస్తరిల్లజేయుము; సంసారసాగరతః = సంసారసముద్రమునుండి తారయ = దాటింపుము.

తా॥ సర్వవ్యాపకుడవైన యో దేవా, నాలో గర్వమును పోగొట్టుము, మనస్సును నా వశమున పెట్టుము, ఎండమావులవలె ఎలయించి కష్టపఱచెడి యింద్రియ లక్ష్యాలను అణచివేయుము, మమకారరహితమైన ప్రేమను నాకు సకలప్రాణులయెడను వర్ధిల్లజేయుము, నను సంసారసముద్రమును దాటింపుము.

దివ్యధునీ మకరన్దే, పరిమళ పరిభోగ సచ్చిదానన్దే,
శ్రీపతిపదారవిన్దే, భవభయఖేదచ్ఛిదే, - వన్దే ॥ ౨

టీక॥ దివ్యధునీ మకరన్దే = దేవనది అనెడి పూదేనె గలదియు, పరిమళపరిభోగ సచ్చిదానన్దే = సువాసనాతిశయముగ సచ్చిదానందము గలదియు, భవభయఖేదచ్ఛిదే = సంసారము

వలని వెఱపును దుఃఖమును ఛేదించునదియు — అగు, శ్రీపతిపదారవిన్దే = లక్ష్మీనాయకుని అడుగుదామరల (జంట)ను గూర్చి, వన్దే = మ్రొక్కుచున్నాను.

తా॥ లక్ష్మీనాయకుని అడుగుదామరలజంటకు మ్రొక్కుచున్నాను. ఆ జంటయే సంసార భయమునకును సంసారదుఃఖమునకును గొడ్డలిపెట్టు. దివ్యగంగానదియే ఆ అడుగుదామరలనుండి స్రవించిన తేనె, సచ్చిదానందమే దాని పరిమళాతిశయము.

సత్యపి భేదాపగమే, నాథ, తవాహం, న మామకీనస్ త్వమ్,
సాముద్రో హి తరఙ్గః, క్వచన సముద్రో న తారఙ్గః ॥ ౩

టీక॥ నాథ = ఓ స్వామీ, భేద + అపగమే సతి + అపి = (నీకును నాకును) భేదము లేక పోయినను, అహం = నేను, తవ = నీ (కు చెందిన) వాడ (నగుదు) నే కాని, త్వం = నీవు, న మామకీనః = నా (కు చెందిన) వాడవు కావు, హి = అది సరియే కదా, తరఙ్గః = అల, సాముద్రః = సముద్రము (నకు చెందిన) దగునే కాని, క్వచన = ఎక్కడను, సముద్రః = సముద్రము, న తారఙ్గః = అల (కు చెందిన) ది కాదు.

తా॥ స్వామీ, నీవు సముద్రమవు, అందు నే నొక కెరటమును, సముద్రమునకును కెరటమునకును లేనట్లే నీకును నాకును గూడ వస్తుభేదము లేదు కాని, సముద్రము అంగి, అల అంగము, నీవు అంగివి, నేను అంగమును.

ఉద్ధృతనగ, నగభిదనుజ, దనుజకులామిత్ర, మిత్రశశిదృష్టే,
దృష్టే భవతి ప్రభవతి, న భవతి కిం భవతిరస్కారః? ॥ ౪

టీక॥ ఉద్ధృతనగ = కొండ నెత్తిన వాడా, నగభిద్ + అనుజ = కొండలను ప్రక్కలించు దేవేంద్రుని తమ్ముడా, దనుజకుల + అమిత్ర = రాక్షసవర్గమునకు శత్రుడా, మిత్రశశిదృష్టే = సూర్యచంద్రులు కన్నులుగా గల వాడా, ప్రభవతి = ఈశ్వరుడ వైన, భవతి = నీవు, దృష్టే (సతి) = సాక్షాత్కృతుడవు కాగా, (నీదర్శనము లభించునేని యనుట), భవతిరస్కారః = సంసారమును త్రోసివేయుట, సంసారవిముక్తి, కిం న భవతి = సిద్ధింపక పోవునా? తప్పక సిద్ధించు ననుట.

తా॥ కూర్మావతారమున మంథరపర్వతమును శ్రీకృష్ణావతారమున గోవర్ధనపర్వతమును మోచిన ఓ స్వామీ, ఉపేంద్రా, రాక్షసకులాంతకా, సూర్యుడు నీ కుడి కన్ను, చంద్రుడు నీ యెడమ కన్ను, నీవు సర్వశక్తివి, నీ దర్శనము లభించిన చాలును, సంసారవిముక్తి తప్పకగల్గును.

మత్స్యాదిభి రవతారై రవతారవతా, ఽవతా సదా వసుధామ్,
పరమేశ్వర, పరిపాల్యో భవతా భవతాపభీతో ఽహమ్ ॥ ౫

టీక॥ పరమేశ్వర = ఓ సర్వస్వామీ, మత్స్య + ఆదిభిః = మత్స్యము మొదలైన రూపములతోడి, అవతారైః = అవతారములచే, అవతారవతా = అవతరించుటలు గల వాడవును, వసుధాం = పుడమిని, సదా = ఎల్లప్పుడును, అవతా = రక్షించువాడవును [ఐన], భవతా =

నీచేత, భవ తాప భీతః = సంసార తాపమునకు భయపడ్డవాడ నగు, అహం = నేను, పరిపాల్యః కాపాడబడదగినవాడను.

తా॥ ఓ సర్వస్వామీ, 'అజాయమానో బహుధా విజాయతే' అన్నట్లు పుట్టుక లేనివాడ వయ్యు నీవు మత్స్యాదిరూపముల పుట్టు చుందువు, ఎందులకు? రక్షించుటకు. భూమికి సదా రక్షకుడవు నీవే. నేనో, సంసార తాపమునకు భయపడ్డవాడను, కావున నీచే రక్షణ మొందు టకు అర్హుడను.

దామోదర, గుణమన్దిర, సున్దరవదనారవిన్ద, గోవిన్ద,
భవజలధిమథనమన్దర, పరమం దర మపనయ, త్వం మే॥ ౬

టీక॥ దామోదర=(కృష్ణావతారమున యశోదచే) త్రాటి (కట్టు) నొందిన ఉదరము గల వాడా, గుణమన్దిర = శుభగుణాలకు సొంత నెల వైన వాడా, సుందరవదన + అరవిన్ద = అంద మైన మోముదామర గల వాడా, గోవిన్ద = పశువులకును భువనములకును పాలకుడా, భవ జలధి = సంసారసాగరమును, మథన = చిలుకు నట్టి, మందర = కవ్వపు కొండ యైనవాడా, త్వం = నీవు, మే = నాకు, పరమం దరం = ఆత్యంతిక భీతిని, అపనయ = పోగొట్టుము.

తా॥ స్వామీ నీవు, కృష్ణావతారమున తల్లి చే కట్టువడిన ఆశ్రితపరతంత్రుడవు, కల్యాణ గుణములకు నిత్యస్థానమవు, సంసారసముద్రమును చిలుకు కవ్వమవు, గోపాలకుడవు, నీమోము దామరయందు ప్రేక్షకులకు దృష్టిచిత్తాపహారక మైన చక్కదనము వెలసియున్నది, మిక్కుట మైన నా వెఱపును పోగొట్టుమా.

'నారాయణ, కరుణామయ, శరణం కరవాణి, తావకౌ చరణౌ,'
ఇతి షట్పదీ మదీయే వదనసరోజే సదా వసతు॥ ౭

టీక॥ కరుణామయ = (౧) దయాప్రపూర్ణుడ వగు, నారాయణ = (౨) వాసుదేవా, తావకౌ చరణౌ = (3) నీ (౪) యడుగులజంటను, శరణం కరవాణి = (౫) శరణు (౬) జొచ్చు చున్నాను, ఇతి = అను, షట్పదీ = ఆఱుపదాలసముదాయ మనెడి తుమ్మెద [పైనున్న ఆఱు శ్లోకాల సముదాయ మనెడి తుమ్మెద], మదీయే = నా దైన, వదనసరోజే = మోముదామర యందు, సదా = ఎల్లప్పుడును, వసతు = ఉండును గాక.

తా॥ తుమ్మెద సదా పద్మమం దుండు నటుల, '(i) నారాయణ (ii) దయామయ (iii) నీయొక్క (iv) పాదములను (v) శరణముగా (vi) ఆశ్రయించుచున్నాను' అనెడి పద షట్కము (లేదా, పూర్వోక్త శ్లోకషట్కము) సదా నా నోట ఉండును గాక.

# ఈశానునకు శ్రీరామకృష్ణు నుపదేశము

## (సంపాదకీయము)

11-10-1884.

అది మఃమాపువేళ, సంజవెలుగు పంచవటి పైని గోడలపైని ఏటిపైని నెలకొనియుండెను. వివిధదేవాలయాలలో సాయంపూజ ప్రారంభమైనది. శ్రీరామకృష్ణుడు తన గదిలో నున్న వేల్పుల పటములకు ప్రణమిల్లెను, ధ్యానినిమగ్నుడై తన చిఱుమంచముపై గూర్చుండియుండెను. కొందఱుభక్తులు నేలపైని గూర్చుండిరి. గది నిశ్శబ్దముగ ఉండెను.

ఒక గంట గడచినది. ఈశానుడును కిశోరియు గదిలోనికి వచ్చి శ్రీరామకృష్ణునికి మ్రొక్కి నేలపై గూర్చుండిరి. ఈశానుడు గొప్ప కర్మపరుడు, శాస్త్రవిహితము లైన వివిధ క్రియల ననుష్ఠించుటయందు శ్రద్ధ గలవాడు. గురుదేవుడు సంభాషణను ప్రారంభించెను.

గురుదేవుడు:— 'దేవు' డను మాటను మాటిమాటికి చెప్పుచున్నంతమాత్రాన నొకడు భగవద్జ్ఞానమును సంపాదింప గలడా? అట్టి జ్ఞానమునకు రెండు సూచనలు గలవు. మొదటిది ఉబలాటము, అనగా దేవునందు ప్రేమ. నీవు యుక్తివాదము చేయవచ్చును, చర్చలు సాగింపవచ్చును గాని, నీకు ప్రేమ గాని తహతహ కాని లేకున్న, అంతయు వ్యర్థమే. రెండవది కుండలినీ ప్రబోధము. కుండలినిశక్తి నిద్రాణమై యున్నంత వఱకును, నీవు భగవద్జ్ఞానప్రాప్తి లేని వాడవే. నీవు గంటలకొలదిగ గ్రంథపారాయణము చేసినను శాస్త్రచర్చ సాగించినను, భగవంతునికై ఉబలాటము నీలో లేనంతవఱకును, భగవంతుని గూర్చిన జ్ఞానము నీకు ఉండదు.

కుండలిని ఎప్పుడు మేలుకాంచునో, అప్పుడు సాధకునిలో భావకదశయు, భక్తియు, భగవత్ప్రేమయు పెంపొందును. అదే భక్తియోగము.

కర్మయోగము* మిక్కిలి దుర్గమము. దానిచే సాధకునకు కొన్ని శక్తులు గలుగును, అనగా కొన్ని సిద్ధులు ఏర్పడును.

ఈశానుడు:— నేను పోయి హాజ్రాను చూచి వత్తును.

శ్రీరామకృష్ణుడు మౌనముతో గూర్చుండెను. కొంతసేపటికి హాజ్రాను వెంట నిడుకొని ఈశానుడు గదికి మరలి వచ్చెను. గురుదేవుడు అప్పటికిని మౌనముగనే యుండెను. కొన్ని నిమిషములు గడచిన పిమ్మట హాజ్రా ఈశానుని చెవిలో "ధ్యానము చేసికొనునేమో, కావున ఆయనను ఏకాంతముగ ఉండనీ, మనము పోదము" అనెను. ఇరువురును గదినుండి వెడలి పోయిరి.

శ్రీరామకృష్ణుడు ఇంకను మౌనముగనే ఉండెను. కొంతసేపటికి ఆయన నిజముగ ధ్యాననిమగ్ను డయ్యె నని భక్తులు గుర్తించిరి. పిమ్మట ఆయన జపము చేసెను. ఆయన తన కుడిచేతిని తలపై, నొసటిపై, కంఠముపై,

* క్రతుక్రియానుష్ఠానము.

హృదయముపై, కట్టకడపట నాభిపైని ఇడు కొనెను. దేహమందలి ఆధారము లాటింటను కుండలినిని ధ్యానించుటయా అది?

ఈశానుడును హాజ్రాయు కాళిగుడికి పోయిరి. శ్రీరామకృష్ణుడు గాఢ ధ్యాన నిమగ్నుడై యుండెను. ఇంతలో ఆధారుడు వచ్చెను. అప్పటికి ఏడు నఱ గంట లైనవి.

కొంత సేపైన పిదప గురుదేవుడు కాళిగుడి కేగెను. అమ్మవారి విగ్రహమును దర్శించి, ఆమె పాదముల కడ నున్న పవిత్రపుష్పములను కొన్నింటిని గైకొని తన తలపై నిడుకొనెను. జననికి సాష్టాంగముగ నమస్కరించి, ప్రదక్షిణము చేసెను, చామరము వీచెను, దైవావేశముచే భక్తిపరవశదశలో నున్నట్లు కనిపించెను. వెలుపలికి వచ్చి చూచు సరికి ఈశానుడు అగపడెను. ఈశానుడు క్రతుక్రియారూపారాధనను జేయుచుండెను.

గురుదేవుడు:— [ఈశానునితో] ఏమి? నీవు ఇంకను ఇక్కడనే ఉన్నావా? పూజ ముగియ లేదా? ఒక పాటను వినుము —

దేవి నామముఁ బలుకుచు దివికిఁ జనఁగఁ
గందు నేనియు, నా కేల కాశియాత్ర?
గంగకును, గయకు, మఱియుఁ గంచి కైనఁ
బఱిత పావన ప్రథిత ప్రభాసమునకు
నేని పోవఁగా నేల నా కింకఁ జెపుమ—
మూఁడు సందెలను బుగులఁ బూన్కితోడ
మాతృ నామ జపంబును మాన కున్న
మానవున కేల నింకఁ గర్మలను నొనర్ప?
భక్తిసాధనలఁ మాన వచ్చుఁ గూడ;
కర్మ లొండొండ వెన్నంటఁ గలవె కాని
యతని మీఱంగ వానికి నైతి కాదు.
దానధర్మంబులును వ్రతతతియుఁ దాము
మదికి నింపును గూర్పవు మదనుసకును.
దేవి ఆనందమయి గౌరి దివ్య పాద
పద్మమే అతఁ డాశించు వరము; మఱియుఁ
దానిఁ గోరియె చేయును త్యాగములను ॥

యథావిధిపూజలను మానవుడు ఎంత కాలము సాగింపవలెను? అతనిలో భగవచ్చరణారవిందప్రేమ పెంపొందనంతవఱకు, భగవన్నామమును పేర్కొన్నంతనే అతనిలో అశ్రురోమాంచములు గలుగనంతవఱకును సాగింపవలెను.

పూవ ఎదుగగనే, పువ్వు రాలి పోవును. సాధకునిలో భగవత్ప్రేమ పెంపొంది భగవత్సాక్షాత్కార మెప్పుడు గలుగునో, అప్పుడు అతడు కర్మానుష్ఠానమును విడిచి పెట్టును.

అంత మెల్లగ పురోగమింతు వేని, నీవు దేనిని గాని సాధింపలేవు. అప్రకంప్య మైన త్యాగము కావలెను. సంవత్సరమునకు పదునైదు నెలల చొప్పున గణింతు వేని, నీవు ఏమైనను సాధింపగలవా? నీలో బలము గాని చుఱుకు గాని అగపడుట లేదే? పాలలో నానిన అటుకులవలె మెత్తగ నున్నావు. లెమ్ము పూనిక వహింపుము, నడుము కట్టుకొనుము.

ఈ పాట నాకు నచ్చదు—

సోదరా, ప్రీతితో, దేవు సూటిగాను
నాశ్రయింపుము, అట్టుల యైన యెడల
నొక్క నాఁటికి దేవుని నొంద వచ్చు.

'అట్టుల యైన యెడల నొక్క నాఁటికి దేవుని నొంద వచ్చు' అను వాక్యమును నేను గణింపనే గణింపను. నీకు అప్రకంప్య మైన త్యాగము కావలెను. హాజ్రాకును నా సలహా

దృఢ మైన త్యాగము నీకు ఏల అలవడ లేదు అని అడుగుదువు. అలవడకపోవుటకు కారణము ఉన్నది. నీలో నిగూఢప్రవణతలును కోరికలును గలవు. హాజ్రాలోను అవి గలవు. మన పల్లెప్రాంతాలలో రైతులు తమ పంట పొలాలకు నీరు తెచ్చుచుందురు. నేను చూచి యున్నాను. నీటిని వెలికి పాఱి పోనీక అడ్డుటకు పొలాలచుట్టును పొట్టి గుట్టలు ఉన్నవి. కాని అవి మట్టిగుట్టలే. వానిలో అట నట రంధ్రము లుండుట తెలుచు. రైతులు తమ ఊపిరి పోవు నంతగా కష్టపడి నీరు తెత్తురు, కాని, ఆ నీరు గుట్టలలోని రంధ్రాలగుండ కాఱిపోవును. కోరికలే రంధ్రాలు. నీవు జప తప ఆదులను తప్పక చేయుచునే ఉందువు, కాని అవి నిలువక నీ కోరిక లనెడి రంధ్రాలగుండ వెలికి పోవుచున్నవి. కోరికలు లేకున్నచో, నీ మనసు సహజముగనే దైవోన్ముఖ మగును. ఆ సంగతి ఎట్టిదో నీకు తెలియునా? అది త్రాసులోని ముండ్లను బోలినది. కామినీకాంచనాలబరువుచే ముండ్లు రెండును ఒండొక దాని నుండి ఎడసి పోవును. యోగమార్గమునుండి మానవుని తప్పించునవి కామినీకాంచనాలే. దీపజ్వాలను నీవు చూడ లేదా? పిల్లగాలి యైనను సరే, ఆ జ్వాలను అల్లల నాడించును *నివాత దీపకళికను బోలినది యోగదశ.

మనస్సు చెదరి ఉన్నది అందులో కొంత ఢాకాకును, కొంత ఢిల్లీ! కొంత కూచ్బిహారునకును పోయి ఉన్నది. ఆ మనస్సు నొక్కటిగ కూర్చుకో వలెను, ఒక్క లక్ష్యముపై కేంద్రీకరింపవలెను. నీకు పదునాఱణాల గుడ్డలు కావలసి ఉన్న, నీవు అంగడివానికి పదునాఱణాలను పూర్తిగా ఇచ్చుకో వలెను. ఎంత చిన్న అడ్డంకి ఉన్నను యోగము సాధ్యము కాదు. తంతి రవంత తెగినను, వార్త నందింప సాధ్యము కాదు.

నీవు లోకమున ఉన్నా వనుట నిజమే. ఉన్న నేమి? కర్మఫలమును భగవదర్పణము చేయవలెను. సొంతమున కెట్టి ఫలమును నీవు కోరరాదు. కాని ఒక్క విషయమును గుర్తింపుము. భక్తి కావలయు నను కోరికను కోరిక అన లేము. నీవు భక్తిని కోరవచ్చును. అందులకై ప్రార్థన చేయవచ్చును. భక్తితపస్సు నలవఱచుకొని, నీ కోరికను తప్పక తీర్చునట్లు లోకమాతను బలవంతపెట్టుము.

దైవము నీకు సొంతతల్లి, ఆపె సవతితల్లియా? ఆ చుట్టఱికము కృత్రిమ మైనదా? కోరిక దీర్పుమని నీవు సొంతతల్లిని నిర్బంధింప లేకున్న, వే ఱెవరిని నిర్బంధింప గలవు? ఆమెతో నీవు ఇట్లనుము —

అమ్మ, †ఎన్మిది మాసాల యర్భకుఁడనె
నీకు? నీదయిన యెఱుపు నేత్రములు న
ను నడలఁగఁ జేయఁ జాలవు, నొక్కి యనెద.

దైవము నీకు సొంతతల్లి. కోరిక దీర్పు మని నీవు బలవంత పెట్టుము. ఏ వస్తువులో నీవొక భాగమో, దాని యాకర్షణ నీకు దెలియుచునే ఉండును. లోకమాత్రంశము నాలో ఉన్నందువనే నే నామెచే ఆకృష్టుడ నగుచున్నాను.

లౌకిక కర్తవ్యాలను చూచుకోవలసిన జరూరు నీ కిప్పుడు లేదు. కొన్నాళ్లు దైవధ్యానములో

* గాలి లేని చోట దీపజ్వాల.

\+ నవమాసాలు నిండక మునుపే పుట్టిన బిడ్డకు బలహీనతయు భయమును గలిగి యుండుట మామూలు.

గడపుము. లోకమున కేమియు లే దనుట నీకు తెలిసిన విషయమే.

గురుదేవు డిట్లు పాడెను:—

మఱువ కో మానసంబ, సదా స్మరింపు,
నిజపుఁజుట్టము లేఁడు నీకొక్కఁ డైన;
ఈ భువి నీ త్రిప్పు లెల్లను వృథయె;
మాయ జాలములో నిమగ్న మా నీవు
మఱువ కుండుము లోకమాతృనామమును.
భూమి లోని నరులు పూజింతురు నిను
స్వామి వంచుఁ, దమదు పాలకుఁడ వని;
మూఁడు నాళ్లే యగు నా ముచ్చట లెల్ల,
కాలదేవత నినుఁ గట్టి యీడ్చినను;
ఇపు గౌరవముల నిరత గాంచెడిది
నీ మేను విడువక నీకుఁ దప్పెడునె?
బ్రతికి నన్నాళ్లు నీ భామకై నీవు
ఎంత గాసిలి యున్న నే మౌను తుదకు?
నీ వెంట రా దామె; నీ మేని నామె
ఎల్లరం బోలి తా నేవగించుకొని
విడిచి యేగును నిను వీడ్కోలు పొంది.

గురుదేవుడు ఇంకను ఇట్లనెను — మాధ్యస్థ్యాలు చేయుట, నాయకత్వము వహించుట మొదలగు పనులను తీఱుబాటు లేక నిర్వహించుచుందువే, ఎందులకు అవి? ప్రజల తగాదాలను నీవు పరిష్కరింతు వట. వారు నిన్ను మధ్యస్థునిగ జేసికొందు రట. ఇట్టి పనులు నీవు చాల కాలముగ జేయుచున్నావు. ఇట్టి పనులలో అక్కఱ గల వారిని వీనిని చేయ నిమ్ము. ఇప్పుడు నీ మనస్సును మాత్రము భగవచ్చరణారవింద సమాశ్రయణమునకే అలవఱుపుము.

శంభువుకూడ వైద్యశాలలను ఔషధశాలలను నిర్మింతు ననుచుండెను. అతడు భగవద్భక్తుడే. "దేవుడు ప్రత్యక్షమైనప్పుడు ఆసుపత్రులను మందుగిడ్డంగులను ప్రసాదింపు మని కోరుదువా" అని నే నడిగితిని.

"దేవుడు నా కెందులకు అగపడ" డని కేశవ సేను న న్నడిగెను. నేను "పేరు, ప్రతిష్ఠ, పాండిత్యము — మొదలైన విషయాలకే నీ కాల మంతయు వినియుక్తమగు చున్నందున, నీకు దేవుడు కనబడుట లేదు" అంటిని. బిడ్డ, గిలకను, ఎఱ్ఱగిలకను, నోట చప్పరించుచున్నంతవఱకును తల్లి రాదు. కొన్ని నిమిషములకు తర్వాత గిలకను పాఱవేసి బిడ్డ ఏడ్చునప్పుడు, తల్లి కుంపటిపై ఉడుకుచున్న అన్నపు తపెలను దింపివేసి పరుగున వచ్చును.

నీవు వివాదపరిష్కారాలలో ఆసక్తుడవై యున్నావు. "నా బిడ్డ వివాదపరిష్కార కార్యములో వ్యగ్రుడై హాయిగా ఉన్నాడు. ఉండనీ" అని లోకమాత తనలో అనుకొనును.

ఇంతలో ఈశానుడు శ్రీరామకృష్ణుని చరణములను తన చేతులతో కొంతసేపు పట్టుకొని వినయముతో "నేను ఈ పనులను చేయవలెననుట నా సంకల్పము కాదు" అనెను.

గురుదేవుడు:— ఆ సంగతి నే నెఱుగుదును. ఇది లోకజనని లీల. ఆమె విశ్వమోహిని. ఇందఱు ఐహికబంధమున తగుల్కొని యుండవలెననుట ఆమెసంకల్పము దీనిస్వరూపము నీకు తెలిసినదా?

ఓ మనంబ, చెపుమ యీ మహి యనెడి
యబ్ధిఁ దేలెడి నావ లవి యెన్ని కలవో?
మున్గు నావల సంఖ్య మొత్త మ దెంతో?

అంతె కాదు —

గాలిపటములు లక్ష యెగురు చుండఁ
ద్రాడు తెగి విడు పొందఁ గలవి యొకటో

రెండో; లోకజననీ, లేగి చేతులను
దట్టి హసింతువు దాని గాంచుచును.

లక్షకొక్కనికి మాత్రము ముక్తి గల్గును. ఇతరులు లోకజనని సంకల్పానుసారము బద్ధులై యే యుందురు.

దాగుడుమూతలాట నీవు చూడలేదా? ఆట సాగుచునే ఉండనిమ్మని తల్లి సంకల్పము. అందఱును తల్లిని తాకి విడుదపొందుదురేని, ఆట ఆగిపోవును. కాబట్టి అందఱును తన్ను తాకవలె ననుట ఆమె సంకల్పము కాదు.

నేను లోకమాతను ఇట్లు ప్రార్థించితిని — ''అమ్మా, నాకు పేరుప్రతిష్ఠలు అక్కఱ లేదు, అష్టసిద్ధులు నాకు అక్కఱ లేదు; నూఱు సిద్ధులైనను నాకు అక్కఱ లేదు. అమ్మా, నాకు జీవితభోగానుభవాపేక్ష లేదు. నీ పాదపద్మములందు నాకు స్వచ్ఛమైన భక్తిని ప్రసాదింపుము. తల్లీ, అదే నేను కోరు వరము''.

భక్తులు మంత్రముగ్ధులు వోలె శ్రీరామకృష్ణుని మాటలను ఆలకించిరి. ఆయన ఉడుకు మాటలు వారి ఆత్మలలో చొచ్చుకొని వారిని వైరాగ్యమార్గమున త్వరగొల్పినవి.

అంతట ఆయన ఈశానునితో తీవ్రకంఠమున సంభాషించెను,

గురుదేవుడు:— ముఖస్తుతిపరుల పొగడ్త పల్కులను విని నిన్ను నీవు మఱువకుము. ముఖస్తుతిపాఠకులు లౌకికమానవుని చుట్టును మూగుదురు. గ్రద్దలు ఆవుపీనుగుచుట్టును మూగును.

లౌకికమానవులకు అంతస్సారము లేదు. స్తుతిపాఠకులు వారి దాపున జేరి 'అయ్యా, మీ యౌదార్యము అతిమాత్రము, మీ బుద్ధి అపారము, మీ భక్తి నిరతిశయము'' అని పల్కుదురు. ఇవి వట్టి మాటలు గావు, మొనలు గలిగి వారిపై రువ్వబడిన వెదుళ్లు. రేయనక పగలనక లౌకిక బ్రాహ్మణ పండితతతిచే పరివేష్టితులై వారి స్తుతివాక్యాలకు వీను లొగ్గుచుండుట ఎంత యవివేకము!

లౌకికమానవుల బానిసతనము మూడు తావుల స్పష్టము — వారు తమయిల్లాండ్రకు బానిసలు, తమ ధనమునకు తాము బానిసలు. తమ ప్రభువులకు తాము బానిసలు. వారిలో అంతస్సారము ఇంచుకేని ఉండగలదా?

మాధ్యస్థ్యాలు, నాయకత్వాలు! ఇవి ఎంత అల్పములు! ఇక పరోపకారాది ధర్మకార్యాలా, ఇప్పటికి నీవు చేసినవి చాలును, ఇట్టి పనులలో ఆసక్తి వహింపవలసినవారి వర్గము వేఱు. నీమట్టుకు నీవు నీ చిత్తమును భగవత్పాదపద్మములందు నెలకొల్పుకొనుటకు అర్హమైన కాలము వచ్చినది. దేవుని ప్రాపింతువేని తక్కిన అన్నింటిని గూడ ప్రాపింతువు. భగవత్ప్రాప్తి మొదటిది, ధర్మకార్యాలు పరోపకారాలు జగద్ధితాలు ప్రజోద్ధరణాలు — ఇవి తరువాతివి. వీని చింత నీకు ఏమిటికి?

అదే నీతో గూడిన చిక్కు, సర్వసంగములు విడిచిన సాధుపుంగవుడెవడైన నీకు కొంత జ్ఞానోపదేశము చేసిన చాల బాగుండును. లౌకికుల సలహాలు సరిగా ఉండవు, వారు బ్రాహ్మణపండితులు గాని, వేఱొకరు గాని.

ఉన్మత్తుడవు కమ్ము, భగవత్ప్రేమోన్మత్తుడవు కమ్ము. 'ఈశానునకు వెఱ్ఱెత్తినది, లౌకికకార్యాలను ఇక నతడు నిర్వహింపలేడు' అని ప్రజలు తెలిసికొననీ. తెలిసికొన్న పిమ్మట

మధ్యస్థునిగ జేసికొనుటకు గాని, నాయకునిగ జేసికొనుటకు గాని వారు నీ కడకు రారు. ఈ పూజాద్రవ్యాలను పాఱవేసి ఈశాను* డను నీ నామమును సార్థకపఱచుకొమ్ము.

ఈశానుడు ఈ క్రింది పద్యము చదివెను —

భక్త హృద్ధారిణీ, వరకృపానిలయ,
జ్ఞానము నా కేల? చటుల వివేక
మైనను నా కేల? అమ్మ, నీ పైని
ప్రేమచే వెఱ్ఱిని పెంపు నాలోన

గురుదేవుడు:— వెఱ్ఱి! అదే కావలసినది. శివనాథు డొకసారి 'దేవునిగూర్చి మితి మీఱి ధ్యానించిన బుఱ్ఱ చెడిపోవు' నన్నాడు. "ఏమి! చైతన్యస్మరణచే చైతన్యహాని పొసగునా? దేవుడు నిత్యుడు, పవిత్రుడు, చిత్స్వరూపి. భగవంతు నెఱిగిన వాడు సర్వము నెఱిగిన వాడు, భగవద్జ్ఞానముచే నిఖిలమును జ్ఞానమయముగ భాసించును" అని నే నంటిని.

ఈశానుడు శ్రీరామకృష్ణుని పాదసేవ చేయుచు ఆయన మాటల నాలకించుచు కూర్చుండి యుండెను. అప్పు డప్పుడు అతడు గుడిలో అమ్మవారిశిలావిగ్రహముపై నొక చూపును బఱపుచుండెను. దీపపు వెలుగున కాళి నవ్వుచున్నట్లు కనిపించెను. దేవి సాక్షాత్తుగ ఆ విగ్రహరూపిణిగ అగపడి వేదవాక్యములవలె పవిత్రము లైన గురుదేవుని వాక్యములను విని ఆనందించుచున్న ట్లుండెను.

ఈశానుడు:— [విగ్రహమును జూపుచు] పవిత్ర మైన మీ నోట వెలువడుచున్న యీ మాటలు నిజముగ అక్కడ ఉద్భవిల్లినవే.

గురుదేవుడు:— నేను యంత్రమును, ఆమె యంత్రచాలకురాలు. ఆమె ఎట్లు ఊపిన నే నట్లు ఊగుదును. నాగుండ ఆమె ఏ మాట లాడిన, ఆ మాటలనే నే నాడుచుందును. ఈ కలియుగమున శిశుముఖముననో ఉన్మత్తునిముఖముననో అట్టి వే ఱొకని ద్వారానో కాక, దైవవాక్కును విన లే మట.

గురుదేవుడు లేచెను, గుడి కెదుట నున్న వేదిక నెక్కి, క్షోణితలము నెన్నుదురు సోకు నట్లు, అమ్మకు మ్రొక్కెను. భక్తులు వేగముగ చుట్టును మూగి, ఆయన పాదముల వ్రాలిరి, అనుగ్రహింప వేడిరి.

* ఇది త్యాగవైరాగ్యఖని యైన శివుని పేరు.

ఇదం శరీరం పరిణామపేశలం పత త్యవశ్యం శ్లథసన్ధిజర్ఘరమ్।
కిమౌషధైః క్లిశ్యసి మూఢ, దుర్మతే, నిరామయం కృష్ణరసాయనం పిబ॥

ఈ మేను మార్పులకు లోనౌ స్వభావము కలది, సంధులు సడలి ఇది శిథిలావస్థలో ఉన్నది, దీనికి పతనము తప్పదు. ఓరి మూఢా, దుర్మతీ, ఉత్తి ఔషధాలచే దీనిని క్లేశపెట్టుచున్నావే, సర్వరోగహార మైన కృష్ణరసాయనమును గ్రోల వోయి.
—(శ్రీ కులశేఖరులు)

# విశ్వమత మహాసభోపన్యాసములు

## శ్రీ వివేకానందస్వామి

### మన మతభేదములకు కారణము

19-9-1863

మీ కొక చిన్న కథను చెప్పెదను. అనర్గళ ధాటితో మాటాడి ఇప్పుడే ఉపన్యాసము చాలించిన వారు, కడపట "ఇక నైన మనము ఒకరి నొకరు దూషించుకొన కుందుము గాక" అని అన్నారు. మనలో ఇంతటి మతభేదాలు ఉన్నందులకు ఆయన చాల నొచ్చుకొన్నారు.

మఱి నేను మీ కొక కథను చెప్ప వలె ననుకొనుచున్నాను. ఆ కథ మతభేదాల కారణమును రుజువుచేయును. ఒకానొక కప్ప ఒక బావిలో వసించి యుండెను. ఎంతో కాలముగ అది అక్కడ వసించి యుండినది. అది పుట్టినది అక్కడె, పెరిగినది అక్కడే. కప్ప ఏమో చాల చిన్నది. ఆ కప్పకు కన్నులు ఉన్నవో పోయినవో చెప్పుటకు పరిణామవాదులు (ఎవల్యూషనిస్టులు) అచట లేరు లెండి! మన కథకు సంబంధించినంతవఱకును ఆ కప్పకు కన్నులు ఉండిన వని అనుకోవలె. అది ప్రతిదినమును నీటిలోని క్రిములను జీవాణువులను మ్రింగి నీటిని శుద్ధపఱచుచుండినది. ఆ యుత్సాహము మన క్రిమిశాస్త్రవాదుల (బాక్టీరియాలజిస్టు)ల కైన ఎంతో కీర్తికరముగ ఉండెడిది. ఈలాగు కాలము గడపుచు కప్ప చేవ పట్టి బలిసినది. ఒకనాడు సముద్రములో వసించెడి కప్ప యొకటి వచ్చి ఆ బావిలో పడినది.

"ఎక్కడనుండి వచ్చు చున్నావు?"

"సముద్రమునుండి వచ్చుచున్నాను".

"సముద్రమునుండి! అది ఎంత పెద్దది? ఈ బావియంత ఉండునా?" అనుచు అదిబావిలో ఒకమూలనుండి ఇంకొక మూలకు ఒకదాటు దాటెను.

'మిత్రమా, సముద్రమును ఈచిన్న బావితో ఎట్లు సాటి చేయుదువోయి' అనెను కడలికప్ప.

మొదటి కప్ప బావిలో మఱి యొక దాటు దాటి "ఇంత పెద్దగా ఉండునా మీ సముద్రము?" అని అడిగెను.

"ఏమి వెఱ్ఱి ప్రసంగము! సముద్రమును నీ బావితో పోల్చుట!"

"మఱి, సరే, నా బావికంటె ఏదియు పెద్దది కా నేరదు. దీనికంటె పెద్ద దొకటి ఉండుట పొసగనే పొసగదు. వీడు అసత్యవాది. తఱుము గొట్టుడు వీనిని ఇక్కడనుండి" అన్నది బావి లోని కప్ప.

సదా ఉన్న చిక్కు ఇదే.

నే నొక హిందువను. నేను నా చిన్న బావిలో కూర్చుండి, అఖండవిశ్వము ఈ చిన్న బావియే అనుకొనుచున్నాను. క్రైస్తవుడు తన చిన్న బావిలో కూర్చుండి అఖండ విశ్వము తన బావియే అనుకొనును. మహమ్మదీయుడు తన చిన్న బావిలో కూర్చుండి అఖండ విశ్వము తన బావియే అనుకొనును. మన చిఱుత లోకపు సరిహద్దులను తొలగింప ప్రయత్నించు చున్నందులకు అమెరికా వారగు మీకు నేను ధన్యవాదము లర్పింపక తప్పదు. ముందు ముందు మీ సంకల్ప మీడేఱునట్లు సర్వేశ్వరుడు మీకు తోడ్పడు నని నేను నమ్ముచున్నాను".

# శ్రీరామకృష్ణుని సందేశము*

శ్రీ కే. ఎం. కరియప్పగారు

మన భారతదేశపు మహాపురుషు డగు శ్రీ రామకృష్ణుడు కేవలము యాభై సంవత్సరములు మాత్రము బ్రతికి యుండుట యీ ప్రపంచము యొక్క దురదృష్టమే యగును. ఆయన 1836 లో పుట్టెను; 1886 లో మనలను అకాలమున విడిచి, దివి కేగెను. అయినప్పటికి ఆయన మనకు తన మహోపదేశములను అనుగ్రహించి యున్నాడు; మన ఇండియాకు మాత్రమే గాక, ప్రపంచ మంతటికిని. ఈప్రపంచములో మన మందరము పరమేశ్వరుని యందు లీనము కావలయు నని, అనగా మోక్షము నొంద వలయు నని, ప్రయత్నించుచున్నా మని నమ్మెదను; అట్టిచో ఆనందమును, శాంతిని ఈప్రపంచములో మనము పొంద వలయు ననిన, శ్రీరామకృష్ణుని బోధలను సరియగు విధమున నవగాహనము జేసికొని, వానిని క్రమముగ ననుష్ఠానమున నుంచుట మన కర్తవ్యము.

తనశిష్యులకు శ్రీరామకృష్ణుని సందేశము బహుసుగ్రాహ్యమైనది. ఆయన చెప్పెను: "అన్నిమతములును సత్యమైనవే; మతముల నడుమ పరస్పర కలహమున కవసరమే లేదు". ఇది బహు సులభమైన సిద్ధాంతము. అతడు వట్టి వ్రాయసగాండ్రవలె గాక, అధికారముగల ప్రవక్తవలెనే ఎల్లప్పుడును బోధించెను. ఆయన మతనియమములను గాని, సిద్ధాంతములను గాని ఆమోదింపలేదు; ఏలన అవి ఆకలిగొన్న వారికి రాళ్లిచ్చినట్లు నిరర్థకము లనియు, భేదములను గల్పించి, తన్మూలముగ కలహములకు దారి జూపు ననియు, ఆయన తలచెను. ఇట్టి సంఘర్షణలు మతమునెడలనే వెగటును గల్పించె నని ఆయన చెప్పెను. అంతర్జాతీయ మత సౌహార్ద్రమే ఆవశ్యక మనియు, దీనిని సాధించుటకు, మన మతము లన్నియు ప్రధానవిషయములలో భేదరహితము లని మనము గ్రహింప వలయు ననియు గూడ ఆయన బోధించెను. పరస్పరము భేదించు హిందూ, క్రైస్తవ, ఇస్లాము సాధన నియమావళుల మూలముగనే శ్రీరామకృష్ణుడు ఎల్లప్పుడును, పరమేశ్వ రానుభవమనెడి ఏకైకలక్ష్యమును అందుకొనగలిగెను. దైవాజ్ఞలకు ఆయన సులభరీతిని అర్థము చెప్పుచు, కేవల మొక సందేశహారుడుగ వెలసెను. ఆయనయొక్క యీ సులభత్వమే, అన్ని వర్గములవారిని, స్త్రీపురుషులను, ఆబాల గోపాలము ఆకర్షించెను. ఆయన మానవప్రేమకు జాతి మత భేదములు లేవు; తన హితవును గాని, ఆశీర్వచనములను గాని ఎవరు కోరి వచ్చినను, నిష్పాక్షికముగనే అతిగా ఆయన ప్రదర్శించెను. ఆయన చెప్పెను: "ప్రతిమనుష్యుడును తన మతము ప్రకారమే దేవుని పూజించుట యుచితము. క్రైస్తవులు క్రీస్తు చూపిన మార్గమును, ముస్లిములు, మహమ్మదు ప్రవక్త చూపిన మార్గమును, హిందువులు

* తెలిగించినవారు శ్రీ సరస్వతుల చంద్రశేఖరశాస్త్రి గారు.

ఋషులు బోధించిన మార్గమును అనుసరించుట ఉత్తమము. ఏమతము నైనను యథార్థముగ నమ్మెడివారు, ఇతరమతావలంబకులను, అతి వినయముతో గౌరవింతురు. అన్ని మతము లును మనలను పరబ్రహ్మమును జేర్చును''. శ్రీరామకృష్ణుడు సత్యమార్గమున, నిర్దుష్టమగు సాంసారిక జీవితమును గడపెను ; ఈ కాలపు వారము ఊరక ఒక యాదర్శముగ మాత్రమే, అట్టిజీవితమును గూర్చి భాషించెదము. 1866 వ సంవత్సరాంతమున ఆయన ఇస్లాము మత నియ మావళి నభ్యసింప తొడగెను, ముస్లిమువలె, అల్లా నామ జపము జేయుచు. మహమ్మదు సాక్షాత్కారము అన్వేషించి, పొందుటకై, ఆయన తన ముస్లిము మౌల్వీ (గురువు) పర్య వేక్షణక్రింద, ఇస్లాము పద్ధతుల ప్రకారము ప్రార్థనల సలుపుచు, సంచరించుచుండెను. ఇది అతనికి సిద్ధించెను.

పిమ్మట ఆయన బ్రహ్మానుభూతిని బొందెను. ఎనిమిది సంవత్సరములకు పిమ్మట, 1874 సం॥ నవంబరులో, క్రైస్తవమతముయొక్క సత్య మును దెలిసికొనుటకై గల్గిన బలవత్తర మగు కోరికచే ఆయన బైబిలు ప్రవచనములను తఱచు వినుచు, జీసస్సుక్రైస్తుయొక్క జీవితము చేతను, బోధనలచేతను ఎక్కుడుగ నాకర్షింప బడెను. చివర కాయన క్రైస్తుసాక్షాత్కార మునుగూడ పొందెను. జైనమతమునెడలను, సిక్కు ''గురువులు'' పదుగుర యెడలను ఆయన కెక్కుడగు గౌరవము గలదు. హిందూమత సిద్ధాంతముల కతీత మగు వానిని అనుసరించు నవసరము ఆయనకు లేదు. ఆయనలో బల వత్తరముగ నుండిన దైవప్రేమ, అన్ని విభేద ములను నిర్మూలింప నాయన కుపకరించెను.

శ్రీరామకృష్ణునిగూర్చి ముచ్చటించు నపుడు, ఆయన శిష్యులలో నుత్తములలో నొక రగు వివేకానందస్వాముల అవతరణమునుగూర్చి సంస్మరింపక తప్పదు; ఈయనయు భారతమాత పుత్రరత్నములలో నొకరే. వివేకానందుని రెండవ బుద్ధు డనియే చెప్ప వచ్చు నేమో! ఈయన శ్రీరామకృష్ణునిపనిని కొనసాగించుచు, మతముల సమన్వయమనెడి ఆయన మహోప దేశమును ప్రపంచ మంతటను వ్యాపింపజేసెను. పలుమతములచే, పలుమార్గముల పూజింపబడు దైవము ఒక్కడే యను నమ్మిక, తనగురువున కున్నట్లే ఈయనకును గలదు. ప్రతిమతమును ఈ క్రిందిసందేశమును జాటవలయునని ఈయన యుద్ఘాటించెను : ''సహకారము, సంఘర్షణ కాదు. సమన్వయము, వినాశము కాదు. పొం దిక, శాంతి; విభేదము కాదు''. ఈయనవలన, శ్రీరామకృష్ణునిబోధలు, ఈ విశాలప్రపంచము నందు మారుమూలలనుగూడ వ్యాప్తినొంది నవి. వీనివలన, నేటి సంక్షుభిత, మార్గహీన మగు ప్రపంచములో, అలజడిచెంది, క్షోభించు మనుజుల కెందరికో శాంతియు, నెమ్మదియు నేర్పడి యున్నవి.

ఎవరి విశాలదృక్పథమువలన, నేడు మన దేశమునం దంతటను, ప్రపంచమునందు పలు భాగము లందును, రామకృష్ణమతప్రచార సంస్థలు (మిషన్స్) ఏర్పడి యున్నవో, అట్టి శ్రీరామకృష్ణశిష్య, ప్రశిష్యులకు మనము (ప్రజానీకము) కృతజ్ఞులము. శ్రీరామకృష్ణుడు నిర్వచించినట్లును ఆయన జీవితమందే ప్రత్యక్ష మొనరింపబడిన విధముననను వేదాంతమును, తత్సిద్ధాంతములను బోధించి, పెంపొందించుట, యీ సంస్థయొక్క ప్రధానలక్ష్యములలో

నొకటి; పలుమతములలో గల సిద్ధాంతములను పరీక్షించి, అతి విశాల మగు పద్ధతిని సాదృశ్యముల నన్వేషించుట (కంపేరెటివ్ థియాలజీ) యు రామకృష్ణమిషన్‌వారి ఆదర్శములలో నొకటి. శ్రీరామకృష్ణుని యుపదేశములను ప్రచార మొనరించురీతిగా మానవాళికి ఈ సంస్థలు చేయు మహత్సేవలో, సాధ్య మగు నెల్ల విధముల సాహాయ్య మొనరించుట మన ధర్మము.

మన, మన. మతసిద్ధాంతముల ప్రకారమే మోక్షమును సాధింపజాలము, సిద్ధాంతమాత్రోద్ఘోషణముతో ఆగ కుందుము గాక; మన మతమే అన్నింటిలోను నత్యుత్తము మనియు నెంచకుందుము గాక. ఈ పర్వదినమున, మన మతము లన్నియు నొక్కటియే యనియు, మన ప్రజ లందరు నొక్క సమూహమే అనియు బోధించిన, మన మహాత్ము డగు శ్రీరామకృష్ణుని యుపదేశములను, భావమునందును, అర్థమునందును 'తు'. 'చ'. తప్పకుండ అనుష్ఠించుటకు దయచేసి ఎల్లరును దీక్ష గైకొనుడు; మాతృదేశ సేవలో, మానవకోటి సేవలో, మిక్కిలి వెగటును గల్గించున దగు నా "జాతితత్వము"ను విడనాడుటకును తీర్మానింపుడు. ఒక మహోన్నతకుటుంబమునకు — దేవుని బిడ్డలచే నేర్పడిన కుటుంబమునకు — చెందిన వ్యక్తులవలె, మానవాళికి సేవ జేయుటలో, ఏగొప్పవ్యక్తి (మహాత్ముని) యొక్క అవతార దినోత్సవమును మనము నేడుజరుపు చున్నామో, అట్టి రామకృష్ణుని బోధలు మనకు శక్తి నొసంగి, మార్గసూచకములుగ నుండు గాక.



# మాతృశ్రీ శారదాదేవి*

[ శ్రీమద్గంభీరానందవాణి ]

## పూర్వరంగము

సాంఘి కాధ్యాత్మిక పునరుద్ధరణమును కొనసాగింప వలె నన పరాశక్తితో కూడి యున్న భగవంతుడే [సగుణబ్రహ్మమే] అందులకు సమర్థుడు. శక్తితోడి యోగము లేని బ్రహ్మము నిర్గుణము. నిర్గుణబ్రహ్మమునకు ఎట్టి పరిణామ క్రమముతో నైనను అన్వయము దురూహ్యము. మానవరూపమున అవతరించిన దేవుడు శక్తిని ప్రసన్నురాలిం జేసికొని, మానవులకు శ్రేయము గూర్ప ఆ శక్తినే నియోగించును. దేవునిచే ఈ రీతిని ఆరాధిత యైన దేవి కనికరించి, దారి తప్పి భ్రాంతి పాలగు చున్న మానవాళికి పురోగతి కలుగుటకు అనుకూల పరిస్థితులను మరల ఏర్పఱచును. అంతే కాదు దేవుడు మానవరూపమున అవతరించి నప్పుడు,

* ఇది ఆంగ్లములో హోలీమదర్ శారదాదేవి అను పేర శ్రీమద్గంభీరానందస్వామి ప్రణీతమై శతతమవార్షికోత్సవ ప్రముఖముగా వెలువడిన గ్రంథము. —సంపాదకులు.

శక్తియు సాధారణముగ స్త్రీరూపమునే దాల్చి, ఆయన వెంబడి నవతరించు చుండును. రామావతారముతోబాటు సీతావతారము, కృష్ణావతారముతోబాటు రాధికావతారము, బుద్ధావతారముతోబాటు యశోధరావతారము, శ్రీ చైతన్యావతారముతోబాటు విష్ణుప్రియావతారము— ఇవి పైప్రతిపాదనను బలపఱచుచున్నవి. వ్యావహారికరంగములోను ఆధ్యాత్మికరంగములోను అవతారములందును పరాశక్తి పరమేశ్వరునికి ప్రియవల్లభగా ఆయన సొంత పనులలో అతిమాత్రముగ తోడ్పడును. ఆమెను ఎడబాయు నేని, ఈ జగన్నాటకమును దేవుడు ఆడను లేడు, దానిని మనము అర్థము చేసికోను లేము.

శ్రీశారదానందస్వామి ఈలాగు వ్రాసియున్నారు—"భరతవర్ష మహర్షులు 'శక్తిచైతన్యాల' నిత్యయోగమును కనుగొన్నారు, కనుగొని ఎల్లెడలను, అసాధారణ శక్తియుత పదార్థము లన్నింటిలోను 'సాగిలబడియున్న శివుని శరీరముపై నర్తించు దేవి'నే ఆరాధించిరి. ఈ దేవత సాటి లేనిది. మెడలోనా, పుఱ్ఱెల దండ యున్నది. ఉభయహస్తములలోనా, వరదాన ముద్రయు అభయప్రదానముద్రయు ఉన్నవి. పరతత్త్వమును ఈరూపాన సాక్షాత్కరించుకొన్న మన ఋషులు, జ్ఞానోపదేష్ట యైన గురునిరూపముననను విశ్వమోహను లైన కామినుల రూపములలోను ఈ పరతత్త్వమునే ఆరాధించిరి. శాంతి, క్షమ, జ్ఞానము — మొదలైన ఉదాత్తతాపాదకము లగు గుణముల రూపముననను, భ్రమ, ప్రమాదము, జడత — మొదలైన అపకర్షావహము లైన గుణముల రూపముననను గూడ, వారు ఈ పరతత్త్వమునే ఆరాధించిరి. ఈలాగు స్పృహణీయసిద్ధుల నన్నింటి నందిన ఆ ఋషులు, అదే మార్గాన, పురోగమించి సిద్ధులను పొందు డని ఇతరులకును నేర్పిరి". [భారతి – శక్తిపూజ పుట 20].

ఆధునికయుగమువారికి మరల వీర్యమును ప్రసాదించుటకై శ్రీరామకృష్ణుడు ఆ దివ్యశక్తినే మేలుకొలిపినాడు. ఈ విషయము శ్రీ వివేకానందస్వామికి ప్రత్యక్షము. కావుననే స్వామిజి ఈలాగు మనలను హెచ్చరించుచు ఘోషించినారు — "ఉచ్ఛ్రియము మనకు మరల కలుగ నున్నది. దాని తొలిఊపులే ఇప్పుడు విశ్వము నెల్ల మాఱుమ్రోగించుచున్నవి. రిత్త సందేహాలను దౌర్బల్యమును విడువుడు. అట్టి సందేహదౌర్బల్యాలకు సులభముగ లోనగు వారు బానిసలు". నిత్యయు నిరాకారయు నై సర్వాంతర్గత యైన పరాశక్తియే ప్రకృతయుగావతారమూర్తికి ప్రియవల్లభగా మరల అవతరించినది. తన పెనిమిటి సాధింప బూనుకొన్న వానిని సాధించుటకు ఆయనకు తోడ్పడుటే కాక, ఆమె మానవుల సాంఘిక సంబంధాల వివిధ రంగాలలో తన ప్రభావమును వ్యాపింప జేసి, తాను వేసిన క్రొత్తబాటలో భారతదేశమునే కాక, సకల ప్రపంచమును పురోభివృద్ధివంకను నడపినది. కావున ఆ యుభయుల దీవనలను అందుకొన్న శ్రీవివేకానందస్వామి ఆ యుభయులకును ఇట్లు అనుచు మ్రొక్కెను —

దాసుఁడను నేను మీకు నిద్దఱకుఁ గాన,
దండ మిడెదను మీకు నిద్దఱకు భక్తి.

భగవదవతారముల కొక ప్రత్యేక నియతక్రమము ఉన్నట్లే, పరాశక్త్యావిష్కారములకు గూడ సొంత పద్ధతి ఉన్నది. అనగా దేవునకును దేవికిని నిప్పునకును దాని వేడిమికిని ఉన్నట్టి అవినాభావసంబంధమే ఉన్నందున,

భగవదవతారమునకును శక్త్యవతారమునకును కాలమును ప్రయోజనమును అభిన్నములుగనే ఉండును. ప్రాప్యమును పొందు విధము పురుషావతారాన ఒకరీతి నుండును, స్త్రీరూపావతారమున వేరొకరీతి నుండును. కావున తత్త్వము అవిభాజ్యమేయైనను అవతారమూర్తుల జంట లోని స్త్రీమూర్తి చరిత మందలి సంభవాలను వేఱుగ పరికించుటకును ప్రత్యేక మైన విలువ గలదు.

దుర్గాసప్తశతిలో [XI : 54-55] లోకమాత

* ఏ యే సమయమందు నిట్లు దానవుల
వలని బాధలచేతఁ బ్రజ గాసి వడునో
ఆ యా సమయమందు నవతార మెత్తి
శత్రు నివహముల సమయింతు నేను.

అని తానే సెలవిచ్చి యున్నది. ప్రాచీనకాలమున అసురులు సాధువులను అసాధువులను ఏకరీతిగ పీడించుచుండినారు. కావున వారిని ధ్వంసము చేయ వలసిన జరూరు సదా ఉండెడిది. లోకనాశక మైన యసురుల విహారము ఒక్క భౌతికరంగములో మాత్రమే కాదు. సత్ప్రవణతలకును దుష్ప్రవణతలకును మానవుల డెందములందు సదా చెల్లుచుండు పోరాటముకూడ, దేవతల సేనలతో దానవులు ఘోరించు పోరాటమే అని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. ప్రకృతయుగమున ఈ పోరాట మొక క్రొత్త రూపు దాల్చినది. అవిశ్వాసమును ఇంద్రియసుఖసక్తియు ఒకపక్షము. దేవునందు విశ్వాసమును, ఆత్మ నిత్యము అను నమ్మకమును, భగవన్నిష్ఠయు ఒకపక్షము. ఆ పక్షము ఈ పక్షమును 'నా యెదుట నిలుము, చూతము' అని సవాలు చేయుచున్నది. ఇరుదుల ఫలితముగ నాస్తికతయు అసూయయు వైరమును మనఃప్రకోపాలును హెచ్చు పెరిగినవి. యుద్ధకారణాలు ఎప్పుడును ఇవే. ఇకను యుద్ధమా, అనుత్తమవ్యక్తులకు అసంఖ్యాకులకు ప్రళయము

ఆధునికయుగమున భావరంగమున సాగుచున్న పోరాటము, పూర్వ మెప్పుడో జరిగినట్లు పురాణాలలో చెప్పబడిన దేవదానవుల పోరాటమునకంటె ఎక్కువ వినాశకర మై ఉన్నది. ప్రాతకాలపు ద్వేషాలు, భౌతికరంగ సీమావధులను దాట లేదు. కాని నేటి పోరాటము భావరంగాన పుట్టు వొంది, నిత్యజీవితరంగా లన్నిటి లోనికిని వ్యాపించుచు మానవకోటినిర్మూలనమునకే దారి తీయు చున్నది. కావున ఉన్న పరిస్థితులలో దివ్యశక్తి ప్రధానముగ భావరంగమునసే తన పనిని నిర్వహింపవలసి యున్నది. నేటి ప్రపంచానకు అన్నిటి కంటె ముఖ్యములుగ కావలసినవి నైతికాభివృద్ధియు, జ్ఞానప్రబోధమును, విశ్వాసమునకును శౌచమునకును భక్తికిని ప్రాధాన్యము గలిగినచో తత్క్షణమే బాహ్యలోకముకూడ తప్పక మాఱి పోవును. కావుననే ప్రస్తుతము దివ్యశక్తి అవతరించి అంతశ్శత్రువులతో పోరుచున్నది; పాపిని, పాపముతోసహ రూపుమాపి గెలుపు చేకొన వచ్చును. లేదా, ప్రేమను చూపి, దాని సహజశక్తిచే పాపిలో ఒక పరివర్తనమును తెచ్చి గెలు పొంద వచ్చును. ఒకశత్రువును ధ్వంసము చేయుటకు కావలసిన శక్తికంటె, ధార్మికతాతిశయముచేత అతని పాపహృద

* మూలము

ఇత్థం యదా యదా బాధా దానవోత్థా భవిష్యతి
తదా తదా ఽవతీర్యాహం కరిష్యామ్యరిసంక్షయమ్ ॥

యాన పరివర్తనము తెప్పించుటకు ఎక్కువ శక్తి కావలెను. కావున ఇప్పటి యవతారములో వినయము, నమ్రత, పవిత్రత, సౌజన్యము, వాస్తవప్రేమ, జ్ఞానానుభూతి అనునవి కొల్లగ ఉన్నవే కాని, యుద్ధఘోష లేదు, ఆయుధాల గణగణలు లేవు, అంతే కాదు. దేవికి రెండు పనులు ఉన్న ప్రతిబంధములను తొలగించుట ఒకటి, నూతన లక్ష్యములను క్రొత్త యభిలాషలను సృష్టించుట ఒకటి. రెండవ పని చాల పెద్దది. భక్తుల మార్గాన అడ్డంకులను తొలగించుట మాత్రమే కార్యమైనచో అందులకై దేవుడు పరిపూర్ణముగ అవతరింప నక్కఱ లేదు, ఆవేశావతారమో అంశావతారమో చాలును. సమస్తమానవకోటిని ఉన్నతాధ్యాత్మికస్థాయికి ఎక్కింప వలసి యున్నందున, దివ్యశక్తి తానే రంగమును అధిష్ఠించినది.

అతిప్రాచీనమైన భారతీయ సంస్కృతిని పరభాగముగా గొని, నేడు దివ్యశక్తి ఆవిర్భవించినది. ఆ యావిర్భావము ముఖ్యముగ మహిళలలో పునస్సంజీవనమహోద్యమమునకు సూచకము. మహిళల పురోగతి ఆవశ్యక మని అందఱును అంగీకరించుచున్నారు గదా! ఒకటే రెక్కతో పక్షి ఎగుర లేనట్లు మన మహిళలను మరల శక్తిమతులనుగా జేసికొన కున్న భారతదేశము శ్రేయ మొంద జాలదు అను గట్టి నమ్మకము గల వారు శ్రీ వివేకానంద స్వామి. కావున ఆ విషయమును స్పష్టపఱచుటకు ఆయన వాక్కులనే ఉద్ధరించుట ఉత్తమము — ''అందుచేతనే శ్రీరామకృష్ణుడుగా అవతరించినప్పుడు భగవంతుడు కాళీమాతను ఆరాధించినాడు, పెక్కు సాధనలలో మహిళాత్వమును తనయందే ఆరోపించుకొన్నాడు, తన భార్యను శిక్షించి తర్ఫీదు చేయు బాధ్యతను తానే వహించినాడు. దేవుని మాతృత్వమును లోకులకు చాటి చెప్పినాడు''.

క్రిందటి శతాబ్దము నడుమ భారతీయ మహిళలు ఒక పెనుసమస్యను ఎదుర్కో వలసి వచ్చెను. విదేశీయాదర్శములధాటికి దేశీయాదర్శములు వేరూడినవి. పాశ్చాత్యులను అనుకరింప వలె అను వెఱ్ఱి పోటెక్కి దేశీయములైన విలువలు మంట గలియ జొచ్చినవి. 1854 వ సంవత్సరము జూలై తే 19 ది సర్చార్లెస్వుడ్డుగారు విద్యాసంస్కరణవిధానము నొకదానిని పంపిరి. భారతీయ మహిళలకు లభింపనున్న శిక్షణస్వరూపము ఆ లేఖలో అస్పష్టముగ సూచితమై యున్నది. విదేశీయుల భావాలను ఆచారాలను భారతీయు లాదరించుట పూర్తిగా తప్పు పని కా దనుట నిజమే. తప్పు కాక పోవుటే కాదు. అది భారతీయుల యాచారమున కెంతయు తగినదే యున్నది. సొంత వ్యక్తిత్వమును కోల్పోక, అన్యుల లక్ష్యాలను కలుపుకొనుచు, తమ సంస్కృతి సంపదను పెంపొందించుకొనుట భారతీయుల యాచారము. విదేశీయ సంస్కృతిని కొంత రానిచ్చి మన మహిళలను ఉత్తేజపఱుపవలసిన జరూరు ఉన్నది. అట్లు చేసిన దేశీయజీవనము అధిక శక్తివంతమును సఫలమును అగును. మన యొద్ద నుండి మాతృభక్తిని పాశ్చాత్యులును కొంత నేర్వ వలయును. అప్పుడు వారి నాగరకతకు దృఢతర మైన యాధ్యాత్మికాధారము ఏర్పడును. ఏర్పడిన, ఆ నాగరకత ఇంకను ఎక్కువ కాలము వెలసియుండగలదు. ప్రాచ్యపాశ్చాత్య సంస్కృతులు ఒండొకదానినుండి నేర్చుకో వలసిన విషయ మెంతో ఉన్నను మూలగతములైన భేదాలను ఒప్పరికించిన ముప్పు వాటిల్లును.

మహిళలకు మర్యాద అన్ని దేశములలోను ఉన్నది. కాని ఆ మర్యాద తఱచు ఏరూపమున ఉండు ననగా, వారి మేని సోయగమును మెచ్చుకొనుటగానో, వారి మెప్పునకై సాహసౌదార్యాలను చూపుటగానో ఉండును. మఱి భారతీయుల పొగడ్త లందుకొను గుణము లేవి యనగా — మహిళల పాతివ్రత్యము, వారి మాతృత్వము. ఏల యన ఆత్మముక్తియే మన లక్ష్యము. ఆత్మనిగ్రహమే అందులకు ఆధారము. సీతయు సావిత్రియు దమయంతియు మనకు ఆదర్శమహిళలు. ఉభయదృక్పథాలకును ఉన్న విరోధము స్పష్టమే. భవిష్యత్కాలమున విశ్వసంస్కృతి ఈ రెండింట ఒకదానిని వరింపనైన వరింప వలెను, లేదా రెంటికిని పొందికనైన కుదుర్ప వలెను. నూఱేండ్లకు మునుపు లేని జరూరు ఈ సమస్యకు ఇప్పుడు కలిగినది. "ఐనను ప్రాచ్యపాశ్చాత్యవిభేదాలను ఉండనీయ వలసినదే. గట్టి పునాదులపై ఉభయ సాంఘిక నిర్మాణములను నిర్మింప వలెను. అందులకు ఆధునిక భావాల ప్రళయమునుండి భారత సంస్కృతిని ఉద్ధరింప వలెను" — అని మన దేశ భవిష్యత్తును నిర్ణయించు విధాత ముందుగనే కనుగొనెను. అవలంబనీయ మైన ఒక గొప్ప ఆదర్శవ్యక్తి పుట్ట వలసిన ఆవశ్యకత ఏర్పడినది. ఆ వ్యక్తిలో మాతృత్వ – గురుత్వ – దైవత్వములు మేళన మొంద వలెను. అప్పుడే అట్టి వ్యక్తినుండి అందఱును ఉత్సాహము నొందుదురు.

ఏ దృక్పథముతో చూచినను భారతదేశీయాదర్శమును సంజీవన మొనర్చుటయు దానికొక పరిపూర్ణత గలిగించుటయు జగజ్జననికొక్కతెకు తప్ప ఇతరులకు సాధ్యపడు పనులు కావు. క్రిందటి శతాబ్ద మధ్యకాలమున భారతదేశమునకు గలుగ నున్న మహత్ప్రాప్తిని భారతీయులకు జ్ఞప్తిపఱచుటయు, విశ్వసంజీవన సమర్థ మైన భారతీయ సందేశమును లోకమునకు దెల్పుటయు వే ఱెవ్వరికిని శక్యములై యుండవు. భారతదేశీయ మతాచార్యకములో అనాదినుండి జరుగుచున్న క్రమము ఇదే. క్రీ. శ. 1850 వ సంవత్సరమునకును 1920 వ సంవత్సరమునకును మధ్య కాలమున గలిగిన నైతిక పతనమునకు, సరిగా ఆదుకో గలంత టిదిగానే అవతారమూర్తి వెలసినది. ఎంతటి అధఃపతనము కలుగునో అంతకు చాలినట్టిదై దివ్యశక్తి వైషమ్యాల నన్నిటిని సమీకరింప గలదిగా ఉండును. విశ్వసంస్కృతిలో నూత్నాభివృద్ధు లేర్పడునప్పుడు, అందులకు ప్రారంభ మంగళ మేది? గురుత్వ మాతృత్వ దేవీత్వములను ఒక్కటిగ తనలో రూపొంద జేసికొన్న ప్రకృత యుగావతారమూర్తిని ఆరాధించుటే.

భగవంతుడు విశ్వశ్రేయమునకై మానవ లోకమున అవతరించును. కాని మానవులు ఆయన యథార్థమహిమను తెలిసికో లేరు. అందులకు ఒక కారణము వారి మేధ అల్పమగుట, ఐహికపరిచ్ఛేదాలలో ఆయన తన్ను మఱుగుపఱచుకొనుట మఱియొక కారణము. ఈ విషయమును శ్రీకృష్ణుడు భగవద్గీతలో తెలిపి యున్నాడు. అవతరించుటచే చేతనులకు తన్ను తెలుపుకో వలె ననెడి దేవుని సానుగ్రహ సంకల్పమునకు అవతారస్వరూపమే అడ్డుతగులుచున్నది. అదే అందు పైకి కన నగు వైపరీత్యము. అది లోపమే. కాని పాపములు చేయుచు దుఃఖము ననుభవించు చుండు మానవులకు వారి జీవితముల నాధ్యాత్మికములుగ జేసికొను మార్గము ఉపదేశింప ఎలయు ననిన, అందులకు ఒక్కటే ఉపాయము. దేవుడు

తాను మానవుడుగ అవతరింప వలయును. అల్పస్వార్థసాధనలలో బడి యున్న వారిని మరల ఉన్నత సిద్ధుల నందు నట్లు ఉత్తేజపఱచుటకు వేఱు ఉపాయము లేదు. నూతనబలము నిచ్చుటకును సంజీవనశక్తిని గలిగించుటకును అవతారమూర్తులు వివిధమార్గాల ననుసరింతురు. (i) కొన్నియెడల ఉదాత్త పరిపూర్ణ లక్ష్యములను ప్రత్యక్షముగ మానవులకు ప్రదర్శింతురు. తమ యనుష్ఠాన ముఖమున గాని, ఉపదేశాలద్వారా గాని ఆ యాదర్శములను మఱింత ఉన్నతపఱచి దృఢపఱతురు. (ii) కొన్నియెడల దివ్యసంకల్పముచే క్రొంగ్రొత్త దారు లేర్పఱతురు. (iii) కొన్నియెడల మనోహర దివ్యలీలలచే సనాతన మార్గముల వంకకు మానవహృదయాలను ఆకర్షింతురు. ఇవన్నియు నిజమే కాని, ఉదాత్తతను పెంచుటలో నూత్నలక్ష్యాల నేర్పఱచుటలో మానవుల డెందముల నాకర్షించుటలో — ఇవే అవతారమూర్తుల పని అని మనము ఆపాతముగ తలంప రాదు. ఒక అవతారమూర్తి సాధించినదానిని మనము విభజించి అర్థముచేసికొనుటకు ప్రయత్నింపవచ్చును. కాని అవతారమూర్తిలో అన్నిరకముల జ్ఞానదశలును రూపుదాల్చి యుండును గావున ఆయన ప్రాముఖ్యమును పూర్తిగ తెలిసికొనుటకు గాని, మాటలలో చెప్పుటకు గాని మానవులకు శక్యము కాదను విషయమును మనము జ్ఞప్తియుంచుకో వలెను. అంతే కాదు. ఒక్కొక్క యవతారమునను వెలువఱుపబడిన శక్తి కొన్ని యుగాలకై ఉద్దేశింపబడినది. అట్టి శక్తిని 'ఇంతటిది' అని సమకాలిక చరిత్రము నిర్ణయింప జాలదు. ఐనను మాతృశ్రీ చరిత్రమును అవగాహన చేసికొనుటకై పైని చెప్పిన మూడు మానములను ఆధారములుగ తీసికొందము. ఆమెచరితమున మాతృగుణములు అతిమానుష పరిపూర్తి నందినవి. అవి ఈ యుగాన నూత్న జ్ఞానలక్ష్యాల రూపొందింపనెటు ఉపయోగపడెనో మనము తెలిసికొన నున్నాము. పుత్రికగా, సోదరిగా, పత్నిగా, మాతగా ఉన్నప్పుడు ఆమెలో ఆ యా స్థానాలకు దగిన మహిళాగుణాలు ఆదర్శస్థాయి నందుకొన్నవి. వేయేల ఆమెగారి ఆత్యంతిక విశుద్ధియే చాలును, ఇతరులకు ఉత్సాహ మిచ్చుటకు. దీని నంతటిని మనము గుర్తింప నున్నాము.

ఇదంతయును భావముల పొంగా? లేక పరమార్థమున కించుక సూచనయా? చదువరి ఈ జీవితచరిత్రమును పూర్తిగ చదివిన పిమ్మట ఈ ప్రశ్నను లేపుకొనును గాక. అచిరకాలములో నిజము చదువరికే తెలియనై అతని సంశయాలు వీడిపోవు నని మా గట్టి నమ్మకము. కాని మనము పరిశీలించుచున్న జీవితము పెక్కు విషయాలలో అసాధారణమైన దని మాత్రము చదువరి ముందుగా గుర్తించి, తదనుగుణముగ మెలకట్ట వలెను. కొందఱు మహోజ్జ్వల వ్యక్తులు సమకాలిక చరిత్రలో తటాలున ఉన్నతి నొంది కొంతకాలము అతిమానుషస్థాయి నధిష్ఠించి, తర్వాత పునరావృత్తిరహితముగ మఱుగువడిపోవుదురు. అట్టివారి కోవకు చేరినది కాదు మాతృశ్రీ. కొందఱు వ్యక్తులు క్రందైన కార్యక్రమాలచేతనో జాజ్జ్వల్యమాన వాగ్ధాటిచేతనో ఆయుధాల సంఘర్షణచేతనో మానవ నాగరకతకే ముప్పు దెచ్చి చరిత్రమున మాయని మచ్చను కలిగింతురు. అట్టి వారి వరుసకు చెందినదియు కాదు మాతృశ్రీ. ఒక కొందఱు మహావ్యక్తులు మాన వాదర్శాల నన్నిటిని తమజీవితములో స్థిరముగ పాదుకొల్పి, మానవ సంస్కృతి నొక పైస్థాయి కెక్కింతురు, వారి ప్రభావము

సమకాలికుల దృష్టికి అలక్ష్యముగ నున్నను, సదా వర్ధిల్లుచు అతిచిరకాలము నిల్చును. అట్టివారి మహోజ్జ్వల పరంపరకు చెందినది మాతృశ్రీ. నిజముగ ఆమె 'సతి' 'సీత' మొదలైన యవిస్మరణీయ వ్యక్తుల వర్గమునకు చేర్చబడవలసినది. ఆ వర్గమువారు తమ యవతారముచే మానవ జీవితమును పవిత్ర మొనర్చి పునరుద్ధరణమార్గమును వెలుగొందింతురు.

పైని చెప్పిన విషయాలకు ఆక్షేపణే లేదు. కాని ఒక ప్రశ్న మాత్రము ఉన్నది. "విశ్వమంతటికై అవతరించిన శక్తి, తన రంగముగా జయరామవాటిని ఏల ఎన్నుకో వలె? నవ్య వైభవాల కన్నిటికిని దూరముగ ఉన్న కుగ్రామము గదా అది?" . ఇట్టి ప్రశ్నకు జవాబు ఎవరు చెప్ప గలరు? దివ్యశక్తి దుర్జ్ఞేయము, సృష్టిస్థితిసంహారసమర్థము, దాని వ్యాపారము లిట్లుండు నని చెప్ప లేము. వానిని గూర్చి లేచు ప్రశ్నలలో ఎన్నింటిని మనము ఉత్తరింప గలము? కాని మానవ ప్రతిభ పరిమితమే ఐనను పరిశోధింపక విడుచుట మాత్రము లేదు. కాబట్టి అంతటి భాగ్యము ఒనగూర్ప గల ప్రత్యేకత జయరామవాటికి ఏ మేని కలదా అని యోచింప వలెను. శ్రీకృష్ణుని జననము కంసుని చెరలో: ఆయన బాల్యలీలలు గోకులములో; జీససు జన్మము గుఱ్ఱాల లాయములో; ఆయన తొలి శిక్షణము వడ్రంగియింట. శ్రీరామకృష్ణుడు పుట్టిన దొక దంపకాల గుడిసెలో, బీద పూజారిగ జీవితము గడపిన దొక గుడిలో. వీని కన్నిటికిని చారిత్రక ప్రమాణాలు ఉన్నవి కాని, ఎంత సూక్ష్మముగ చూచినను జయరామవాటి కొక ప్రత్యేకత కానిపింపదు, సంఘశాస్త్రము ఒక విషయమును దెలుపు చున్నది. ప్ర:ల విదేశీయ సంస్కృతి ధాటికి నగరాలలోని ధనసంపన్నులును విద్యాసంపన్నులును తమ పట్టూడి పతనము గాంతురు. అప్పుడు దేశీయ సంస్కృతి ఏ నిమిషాన కేమి మూడునో అను దిగులుతో దూర గ్రామ పరిసరాలలో తల దాచు కొనును. అంతే కాదు. భారతీయ సంస్కృతి తన నిలుకడకై ఒక వింత దారిని కనుగొన్నది. అది ఏ మనగా తన్ను బీదప్రజలకును నిర్ధనులైన గురువులకును అప్పగించు కొనుట. అందులకు వలసిన హంగులు జయరామవాటిలో కొల్లగ ఉన్నవా?

ధరణి విశాలతల్ప, ముపధానము బాహువు, నింగి చందువా,
సురటులు గంధవాహములు, శోభనదీపము చందురుండుగా —
విరతివధూమణిం గలసి, వేడుక మీఱ సుఖించి, శాంతుఁడై,
నిరుపమలీల యోగి శయనించు మహీపతి మాడ్కి నడిమిన్ ॥

కౌపీనంబును, జీర్ణకంథయును, నశేషాశూన్యభైక్షంబుఁ, జిం
తాపాయంబు, వనశ్మశానముల నిద్రావాప్తి, గుర్వీరప
ద్వ్యాపారంబుఁ, బ్రశాంతచిత్తమును, యోగారూఢి రూఢిన్, వృత్తిసం
క్షేపంబుం - గల దేని, యోగికిఁ ద్రిలోకీప్రాభవం బేటికిన్ ॥

—(భర్తృహరి వైరాగ్యశతకము)

# వివేకానందస్వామినిగూర్చి జ్ఞప్తికివచ్చు కొన్ని విషయములు

మూలము :
మిస్ జోసెఫైన్ మెక్లియాడ్

అనువాదము :
శ్రీ సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు

1895 సం॥ జనవరి 29వ తారీఖునాడు, నేను నా సోదరితో న్యూయార్కు నగరమందలి పడమటి 33వ వీథిలోని 54 నెంబరు ఇంటికి వెళ్లియుంటిని. అచ్చట శ్రీ వివేకానందస్వామి వారి యుపన్యాసమును వింటిని. వారి సొంత గదిలో ఏ పదునైదుగురు నారీమణులో, ఇద్దరు ముగ్గురు పెద్దమనుష్యులో సమావేశమై యుండిరి. గదిమాత్రము నిండిపోయెను. కుర్చీలు ఖాళీలేనందువలన, నేను ముందువరుసలో నేలపై కూర్చుంటిని. స్వామి ఒకమూలలో నిలబడి యుండిరి. వారిమాటలు నాకు యథాతథముగ జ్ఞప్తికివచ్చుటలేదు; కాని వారి మొదటివాక్యము ఆక్షణమే నాకు 'సత్య' మయ్యెను; వారి రెండవవాక్యమును 'సత్యమే'; మూడవదియు 'సత్యమే'. ఇట్లు ఏడుసంవత్సరములపాటు నేను వారి బోధనలను వింటిని; వారు చెప్పినదంతయు నామట్టుకు నాకు 'సత్యమే'. ఆనాటి మొదటి యుపన్యాసము మొదలు, జీవితమునకొక భిన్నార్థము నాకు గోచరించెను. మనము శాశ్వతస్థితియందు లీనులమై యుంటిమని, మనమే గ్రహించునట్లు స్వామి చేసిరని తోచెను. ఈ భావము మరి ఎన్నటికిని మారను లేదు, పెరుగను లేదు. ఒకసారి చూచిన మరి యెన్నటికిని మఱపునకు రాని భాస్కరునిభాతి, అది విలసిల్లెను.

ఆ శీతాకాలమంతయు నేను వారి యుపదేశములను వింటిని, వారమునకు మూడుసార్లు. ఇవి ఉదయము 11 గంటలకు జరుగును. నేనెన్నడును వారితో మాటలాడలేదు. కాని, మేము అతిక్రమముగ వెళ్లుచుండుటవలన, ఎప్పుడును ముందరి యాసనములు రెండు మాకొఱకై ప్రత్యేకింపబడియుండును, స్వామియొక్క యా గదిలో. ఒకనాడు వారు నావైపు తిరిగి, "మీరు అక్కచెల్లెండ్రా?" యని అడిగిరి. "ఔ"నని మేమంటిమి. అప్పుడు వారు: "మీరు చాల దూరమునుండి వచ్చుచున్నారా?" అని ప్రశ్నించిరి. మేమంటిమి: "కాదు, చాలదూరము నుండి కాదు—హడ్సన్ ఖాతమున ముప్పదిమైళ్ల దూరము మాత్రమే". "అంతదూరమా? ఆశ్చర్యము!" ఇవియే వారితో నేను మొట్టమొదటి సారిగా ఆడిన మాటలు.

వివేకానందునికి పిమ్మట, నేను కలిసికొన్న అందరు వ్యక్తులలోను, రోత్లిస్బర్గరుసతియే ఆధ్యాత్మికశక్తి అత్యంతముగ గల వ్యక్తి యని నేనెల్లప్పుడు భావించియున్నాను. ఆమెయే నన్ను వారివద్దకు దీసికొని వెళ్లినది. స్వామిజీకి ఆమెయందు ఎంతో ఆదరము గలదు. ఒకనాడు ఆమెయు, నేనును, స్వామియొద్దకు వెళ్లినప్పుడు, "స్వామీ, ఎట్లు ధ్యానము చేయవలయునో మాకు చెప్పెదరా?" అని అడిగితిమి. స్వామి: "ఓం అను శబ్దమును ఒకవారము ధ్యానించి, పిమ్మట నాకు మీ యనుభవమును తెలుపుడు" అనిరి. కావున, ఒకవారము తరువాత మేము మరల వెళ్లితిమి. రోత్లిస్బర్గరుసతి (స్వామితో): "నాకొక వెలుతురు కనబడుచున్నది" అనెను.

స్వామి: ''మంచిది, ధ్యానమును కొనసాగింపుము'' అనిరి. నేను: ''లేదు, లేదు, వట్టి వెలుతురగుటకంటె ఎక్కువగా, అది హృదయమందొక జ్యోతివలె నున్నది'' అంటిని. అందులకు ఆయన నాతో: ''మంచిది, కొనసాగింపుము'' అని సెలవిచ్చిరి. ఇదియే నాకు వారు చేసిన యేకైకబోధ. కాని, వారిని కలిసికొనుటకు చాల ముందుగనే మేము ధ్యానతత్పరలమై యుంటిమి; గీత మాకు కంఠస్థము. ఇందువలననే స్వామిజీ ఒక మహోన్నత జీవశక్తియని మేము గ్రహించితిమని నాకు తోచుచున్నది. ఇతరులలో ఆయన కలిగించిన ధైర్యమే, ఆయన నిజశక్తి యని చెప్పవచ్చుననుకొందును. తన్నుగూర్చిన చింతయే ఆయనకు ఎప్పుడును లేదు. ఇతరులనుగూర్చిన చింతయే ఆయనకు ఎల్లప్పుడును. ''గ్రంథము తెఱవబడ నారంభింపగనే, ఇక వేడుక ఆరంభము'' అని ఆయన జెప్పుట గలదు. జీవితమునందు అపారమార్థికమైనభాగము లేనేలేదని అది పూర్తిగా ''పవిత్రమే''యనియు, ఆయన మాకు సుగ్రాహ్యమొనరించుచుందురు. ఆయన యీవిధముగ మమ్ములను హెచ్చరించును: ''ఎప్పటికిని జ్ఞప్తియందుంచుకొనుడు: మీరు అమెరికాదేశీయులగుటయు, స్త్రీలు అవుటయు యాదృచ్ఛికమే గాని, ఎప్పటికిని మీరు దేవుని బిడ్డలు మాత్రమే. రాత్రింబగళ్లు మీ స్వరూపమును స్మరించుకొనుచుండుడు. దాని నెన్నటికిని మరవకుడు''. ఆయన సాహచర్యము శక్తిదాయకము. శక్తి మీకున్ననే గాని, ఇతరుల కొసంగజాలరు. ఎట్లన, ధనము మీకున్నగాని, ఇతరులకు దానముచేయజాలరుగదా. ఈపనులన్నియు జేయగలమని మన మేదో అనుకొనవచ్చును గాని, నిజమున కశక్తులము!

ఆయనతో మే మంతగా మాట్లాడుటయే లేదు. ఆయనతో మా కంతగా బనిలేదు. కాని, ఆ వసంతకాలమున, ఒకనాటిరాత్రి ఫ్రాంసిస్ హెచ్, లెగ్గెట్ గారితో మేము భుజించుచుంటిమి. ఆయన పిమ్మట నా సోదరిని బెండ్లియాడెను. ఆయనతో మే మిట్లంటిమి: ''భోజనమగునంతవరకే మేము మీతో ఉండగలము, పిమ్మట వెళ్ళవలయును''. ఆయన: ''చాలమంచిది; భోజనమునకుండుడు,చాలును'' అని, (భోజనము తరువాత): ''ఈ సాయంకాలము మీ రెక్కడికి వెళ్లుచున్నారు?'' అని అడిగెను. మే మొక యుపన్యాసమునకు వెళ్లుచుంటిమని తెలిపితిమి. ఆయన: ''నేను రావచ్చునా?'' అని యడిగెను. మేము: ''రావచ్చును'' అని అంటిమి. ఆయన వచ్చెను; ఉపన్యాసమును శ్రద్ధగా వినెను. అది ముగియగానే స్వామిజీవద్దకు వెళ్లి, కరచాలనము చేసి ఇట్లనెను: ''స్వామీ, మీ రెప్పుడు నాతో విందారగింతురు?'' ఈయనయే విందు మొదలగు సాంఘికవిశేషములలో వెళ్ళి స్వామిజీని కలిసికొను అవకాశము మాకు కలిగించినవాడు.

పిమ్మట స్వామి రిడ్జీమేనరునకు వచ్చిరి. కాట్స్కిల్లుపర్వతములలోని, లెగ్గెట్ గారి నివాసస్థలమిది. వారచ్చట కొద్దిరోజులు గడపిరి. అప్పుడు కొందరు విద్యార్థులు స్వామితో నిట్లనిరి: ''స్వామిజీ, మీరు వెళ్లుటకు వీలులేదు. అచ్చట పాఠములు జరుగుచున్నవి''. చాల గంభీరముగ వారివైపు తిరిగి, స్వామి: ''అవి నా బోధనల తరగతులా? సరి, నేను వెళ్లెదను''. ఆయన వెళ్లనే వెళ్లెను. ఆయన అక్కడ ఉన్నప్పుడు, నా సోదరియొక్క బిడ్డలను జూచియుండిరి. (అప్పుడు వీరి వయస్సు

పం(్రెండుసంవత్సరములును, పదునాలుగుసంవత్సరములును). కాని, మేము న్యూయార్కునకు వెళ్ళిన పిమ్మట, తరగతులు మరల ప్రారంభమైనప్పుడు, ఈ బిడ్డలను వారు గుర్తుపట్టినట్లగపడలేదు. బిడ్డలు చాల ఆశ్చర్యము నొందిరి. బిడ్డలు: ''స్వామికి మేము జ్ఞాపకము లేము'' అని అనుకొనిరి. మేము: ''తరగతి ముగియువరకు ఓపిక పట్టుడు'' అంటిమి. ఆయన ఉపన్యసించునపుడు, తాను మాట్లాడు విషయమునందే ధ్యానమునంతయు నుంచుచుండును. ఉపన్యాసమును ముగింపగానే ఆయన మావద్దకు వచ్చి, ''మంచిది పిల్లలూ, మిమ్ములను మరల చూచుట ఎంత సంతోషము!'' అని పలికిరి. బిడ్డలను వారు మరవనేలేదు. బిడ్డలు చాల సంతోషించిరి.

ఆ రోజులలోననే జ్ఞాపకము; న్యూయార్కు నగరములో ఆయన మా అతిథిగానున్నప్పుడు. ఒకరోజున ఆయన చాల మౌనముగను, వినమ్రతతోను ఇంటికి మరలివచ్చెను. గంటలకొలది ఆయన మాటలాడనేలేదు. చివరకు మేము వారిని: ''స్వామీ, నేటి మీ కార్యకలాపమేమి?'' అని అడిగితిమి. స్వామి: ''అమెరికాలో మాత్రమే దృగ్గోచరమగు ఒక విశేషమును నేను గుర్తించితిని. నేను బస్సు (స్ట్రీట్-కార్)లో వెళ్లుచుంటిని. హెలెన్ గౌల్డు ఒకప్రక్కను, తాను ఉతికిన బట్టలతో నీగ్రో చాకలి దొకర్తె మరియొక ప్రక్కను కూర్చుండియుండిరి. అమెరికాలోతప్ప మరి ఎచ్చటను ఇట్టిదానిని చూడజాలము''.

ఆ సంవత్సరము జూన్ నెలలో, స్వామి ఎన్. హెచ్. (రాష్ట్రము) లోని క్రిస్టైన్ లేక్ నకు జెందిన కాంప్ పర్సీకి వెళ్ళిరి అచ్చట వారు లెగ్గెట్ గారి చేపలుపట్టు మకాములో, ఆయన కతిథిగా నుండిరి. మేముకూడ వెళ్ళితిమి. అచ్చట లెగ్గెట్ గారికిని, నా సోదరికిని పెండ్లి నిశ్చయమైనదని ప్రకటింపబడెను. విదేశములో జరుగనున్న ఆ పెండ్లికి స్వామి ఆహ్వానింపబడిరి. స్వామిజీ ఆ మకాములో నున్నప్పుడు, అందమైన తెల్లని కొండరావిచెట్లక్రింద కూర్చుండి, గంటలకొలది ధ్యానని మగ్నులై యుందురు. మాకు తెలియకుండనే, ఆ చెట్టు పట్టలతో ఆయన పుస్తకములను రెండింటిని తయారుచేసి, నాకును, నా సోదరికిని ఇచ్చిరి. ఇవి సంస్కృతములోను, ఆంగ్లములోను వ్రాయబడియుండెను.

ఈ కాంపులోనున్న తరువాత, నేనును, నా సోదరియు, ఆమె పెండ్లి బట్టలను కొనుటకు పారిస్ నగరమునకు వెళ్ళినప్పుడు స్వామిజీ సహస్రద్వీపవనము (థౌసండ్ ఐలండు పార్కు) నకు వెళ్ళిరి. అచ్చట ఆయన, ఆరువారముల పాటు, ''దైవప్రేరితోపదేశములు''(ఇన్‌స్పైర్డ్ టాక్సు) అనబడు అద్భుత బోధనలను జేసిరి. అంతరంగికశిష్యవర్గమున కొసంగబడినవగుటచే, నాకు ఈ ''ఉపదేశములు'' స్వామిజీవారిచే వ్రాయబడిన సువార్తలోకెల్ల అత్యంతము అందమైనవగును. వారేమో శిష్యులు; కాని నేనెన్నడునుకూడ కేవలము ఒకస్నేహితురాలినే. అయినను ఆ గుణమును వారికి ఆయన కలిగించెను. ఆ రోజులలోవలె స్వామివారి హృదయము, మరెన్నడును, ఏ అనుభవమువలనను, నిజస్వరూపమును జూపియుండలేదు.

ఆయన ఆగస్టునెలలో లెగ్గెట్ గారితో పారిస్ నగరమునకు వచ్చిరి. అచ్చట అక్కచెల్లెండ్ర మిద్దరము ''హాలెండ్ గృహము''లో నివసించుచుంటిమి. స్వామి, లెగ్గెట్ గారు, వేరొక హోట

లులో బసచేసిరి. కాని, ప్రతిరోజును వారిని కలిసికొందుము. ఆ సమయమున లెగ్గెట్‌గారిని గమనించుచుండిన హోటల్ ఉద్యోగి యొకడు, స్వామిని ఎల్లప్పుడు ''రాజకుమారులవారూ!'' అని పిలుచుచుండెను. అప్పుడు, స్వామి: ''కాని నేను రాకుమారుడనుగాను. నే నొక హిందూ సన్న్యాసిని'' అనెడివారు. ఉద్యోగి: ''తాము తమ్ముల నట్లు జెప్పికొనవచ్చును. కాని, రాజకుమారుల అనుభవము నాకుగలదు. రాజకుమారు నొకరిని జూచిన, నేను వెంటనే గుర్తుపట్టగలను''. ఆయన ఠీవి అందరిని వశీకరణ మొనర్చును. కాని, ఒకప్పు డెవరో ఆయనతో: ''మీ రెంతో ఠీవిగలవా''రని చెప్పగా, వారిట్లు జవా బొసంగిరి: ''నాయందేమియు లేదు; నే నడచు పద్ధతిలో నున్నది అది''.

ప్టెంబరు 9 వ తేదీనాడు, లెగ్గెట్‌గారికిని, లెగ్గెట్‌సతికిని పెండ్లి జరిగెను. మరునాడు స్వామి లండన్‌నగరమునకు వెళ్ళిరి. అచ్చట ఆయన ఈ. టీ. స్టర్డీగారి అతిథి. ఈయన అదివరకే ఇండియాలో రామకృష్ణసంస్థ సన్న్యాసులను కొందరిని కలిసికొనియుండిరి. తాను సంస్కృత పండితుడు. స్వామి అచ్చట కొంతకాలమున్న పిదప, నా కిట్లు వ్రాసిరి: ''ఇచ్చటికివచ్చి, కొన్ని (మతబోధనా) తరగతులను ఏర్పాటు జేయుడు''. కాని, మేము వెళ్లుసరికే ఆయన ఉపన్యాసముల నొసగుచుండిరి. ఒకనాడు ''రాజ కుమారుల ఉపన్యాసమందిరము' (ప్రిన్సెస్ హాలు)లో మహోపన్యాసమును గావించిరి. మరునాడు, లండన్ నగరమున నొక గొప్ప హైందవయోగి వచ్చియున్నాడను విషయమును గూర్చి పత్రికలనిండుగ ప్రకటింపబడెను, ఆయన అచ్చట చాల గొప్పగ గౌరవింపబడెను. డిసెంబరు పదునైదువరకు మే మచ్చట నుంటిమి. పిమ్మట స్వామి యిచ్చటి తమపనిని కొనసాగించుటకు ఈ దేశమునకు (అమెరికాసంయుక్త రాష్ట్రములకు) మరల విచ్చేసిరి. మరుసటి సంవత్సరము ఏప్రెలులో ఆయన లండనుకు మరలి వెళ్ళిరి. అచ్చట తరగతులను స్థాపించి, నిర్దిష్టమును, క్రమబద్ధముఅగు కార్యకలాపమును ప్రారంభించిరి. ఇది 1896 సం॥లో. ఆ వేసవి యంతయు, జూలై నెలవరకు, ఆయన అచ్చట పనిచేసి, పిమ్మట సీవియర్స్‌కుటుంబముతో స్విట్జర్లెండు దేశమునకు వెడలిరి.

స్వామిజీవారి జ్ఞానము అఖండము. ఒకసారి నాదగ్గర బంధువు (నీస్), ఆల్బర్టాస్టర్జస్ (పిమ్మట ఈమె పేరు సాండ్విక్ ప్రభ్వి), రోమునగరములో ఆయనకు ప్రఖ్యాతస్థలములను జూపుచుండెను. గొప్ప స్మారకచిహ్నము లెచ్చట నుండెనో ఆయనకు తెలిసియుండుటను జూచి, ఆమె ఆశ్చర్యమొందెను. ఇక, ఆమె ఆయనతో సెయింట్ పీటర్స్‌చర్చికి వెళ్లినప్పుడు, రోముమత (కథోలిక్) పీఠము యొక్క చిహ్నములయెడ స్వామిచూపిన గొప్ప భ ఆమె యింకను ఎంతయో ఆశ్చర్యపడెను, ఋషుల (సెయింట్ల) పై నుంపబడిన నగలన్నిటియెడలను, అందమైన వస్త్రములన్నిటియెడలను ఆయన భక్తినే ప్రకటించెను.

ఆమె ''స్వామీ, తాము సాకారదైవము నందు నమ్మకమున్నవారు కారుగదా, వీనియందేల ఇంత ఆదరము కలిగియున్నారు?''అని అడుగగా ఆయన: ''కాని, ఆల్బర్టా, ఒకరు సాకార దైవమును నమ్ముటయే జరిగినచో, అప్పుడు విధిగా తన భక్తివిశేషమునంతను సమర్పించును గదా?'' అనిరి.

ఆసంవత్సరపు ఆకురాలు ఋతువు (ఆటమ్) (సెప్టెంబరు, అక్టోబరు, నవంబరు నెలల) లో, ఆయన స్విట్జర్లండు నుండి ఇండియాకు సేవియర్ దంపతులతోను, జే. జే. గుడ్ విన్ గారితోను వెళ్లిరి.

అచట భారతజాతియంతయు స్వామికి అఖండమగు స్వాగతము నొసంగెను. ఈవైభవమునుగూర్చి, "కొలంబో నుండి ఆల్మోరా వరకు నొసంగబడిన ఉపన్యాసముల" సంపుటిలో చదువగలము. గుడ్విన్ గారనగా, పడమటి 33 వ వీధి 54 నెం. భవనములో సంక్షిప్తలేఖకుడుగా నియమింపబడినవారు. వీరు వివేకానందస్వాముల ఉపన్యాసములను వ్రాసికొనుచుండిరి. గుడ్విన్ గారు న్యాయస్థాన (కోర్టు) సంక్షిప్త లేఖకుడు; అనగా నిమిషమునకు 200 మాటలని భావము. కావున ఆయనను నియమించుటకు చాల ఖర్చగును. కాని, వివేకానందుని ఒక్కమాటనైనను పోగొట్టుకొనుట కిష్టము లేక, వీరిని మేము నియమించితిమి. ఒక వారమగుసరికి గుడ్విన్ గారు డబ్బునుతీసికొనుటకు నిరాకరించిరి. "ఎందుకు తీసికొన" రని వారి నడుగగా, ఆయన: "వివేకానందులు తమ జీవితమునే అర్పణ జేయగా, నేను చేయతగిన అత్యల్పసేవ, నా వ్రాతపనియే". ఆయన ప్రపంచమంతట స్వామిననుసరించి వెళ్లెను. ఆయన వ్రాసికొనిన వివేకానందుని సుబోధలు ఏడు సంపుటములు నేడు మనకున్నవి.

స్వామి ఇండియాకు వెడలినపిమ్మట, ఆయనకు నేను జాబులువ్రాయనేలేదు; ఆయన వ్రాసెదరని నిరీక్షించితిని. చివరకొక జాబు వచ్చెను : "ఏల నీవు వ్రాయుట లేదు?" అప్పుడు నేను జవాబువ్రాసితిని : "నేను ఇండియాకు వత్తునా?" ఇందుల కాయన బదులు : "సరి, నీకు అసహ్యాదృశ్యములను, నీచతను, దారిద్ర్యమును, కౌపీనధారు లసంఖ్యాకులు మతమని యేదో పెద్దమాటలను మాటలాడుటను చూచుట సమ్మతమైనచో, రమ్ము; మరేదైనను గావలయుననిన, రాకుము. మాపై మరొక నిశితవిమర్శనము జరిగిన మేము తాళజాలము". మొట్టమొదటి నౌకమీదనే నేను వెళ్లియుండుట సహజమేకదా? జనవరి 12 వ తారీఖు నాడు ఓల్ బుల్ సతితోను, శారదానందస్వాములతోను నేను బయలుదేరితిని. మేము లండనులో ఆగితిమి. పిమ్మట రోమాపురి కేగితిమి. బొంబాయిని ఫిబ్రవరి 12 కు చేరుకొంటిమి. అచ్చట అళగసింగగారు మమ్ములను కలిసికొనిరి. వైష్ణవుల ఎఱ్ఱ నిలువు బొట్టు ఈయనముఖమున గలదు. తరువాత ఒకప్పుడు, కాశ్మీరమువెళ్లుచు స్వామి (వివేకానందుల)తో నేను మాటలాడు సందర్భమున, ఇట్లనుటతటస్థించెను: "అళగసింగ గారు తమ ముఖముపై ఆ వైష్ణవచిహ్నాములను ధరించుట ఎంత శోచనీయము!" వెంటనే స్వామి చఱ్ఱున లేచి, చాలకఠినముగ: "ఆయన జోలికి వెళ్లకుము! నీ వెప్పుడైనను చేసిన దేమున్నది?" అని మందలించెను. నేను జేసిన దిదియని చెప్పగలిగిన గదా! నేను జవాబియ్య లేదని చెప్పనక్కరలేదు. నా కళ్లలో నీరు నిలిచెను. పిమ్మట నాకీ విషయము తెలియ వచ్చెను: అళగసింగ పెరుమాళ్ ఒక బ్రాహ్మణ యువకుడు; చెన్నపురియందలి ఒక కళాశాలలో ఈయన వేదాంతశాస్త్రమును బోధించుచుండెను. జీతము 100 రూపాయలు. దీనితో తన తండ్రిని, తల్లిని, భార్యను, నలుగురు బిడ్డలను పోషించుచుండెను. వివేకానందుని పాశ్చాత్య ప్రపంచమునకు బంపుటకు వలయు ధనము కొఱకై ఈయన ఇంటింటికిని వెళ్ళి యాచించి

యుండెను. ఆయనవలన గాకున్న మనము (పాశ్చాత్త్యులము) వివేకానందుని సందర్శించియే యుండమేమో! దీనినిబట్టి, అళగసింగగారిని ఎంత కొద్దిగ ఆక్షేపించినను, స్వామిజీకి ఎక్కుడుగ కోపమువచ్చుట సహజమేగదా.

మేము బొంబాయి చేరినపుడు, అక్కడ మే మాగవలయునని మిత్రులు చాల కోరిరి. కాని, మొట్టమొదటి బండిలోనే మేము కలకత్తాకు బయలుదేరితిమి. రెండవరోజు వేకువజామున 4 గంటలకు స్వామిజీ, శిష్యులు పండ్రెండుగురితో, మాకు స్వాగత మొసంగిరి. వీరుగాక యితర ప్రసిద్ధ హైందవులు ఇరువది మంది వచ్చియుండిరి. ఊదా, ఎఱుపురంగులు గల, సరిగ తలపాగలను వీరు ధరించియుండిరి. వీరికి ఓల్ బుల్ సతి అమెరికాలో ఆతిథ్య మొసంగియుండెను. పూలమాలలతో మమ్ములను కప్పివైచిరి; పూలవర్షము! దండలువేసెదరన్న, నాకెప్పుడును భయమే. ఓల్ బుల్ సతియు, నేనును, ఒకహోటలునకు వెళ్ళితిమి. మోహినీ ఛాటర్జీగారు అచ్చటికివచ్చి, సాయంకాలము 5 నుండి, రాత్రి 10 వరకు నుండిరి. వారితో ప్రసంగవశమున ఇట్లంటిని: "మీ భార్య బెంగపెట్టుకొనదు కదా?" ఆయన: నేను ఇంటికి వెళ్లినప్పుడు అమ్మకు విషయమును తెలిపెదను అనెను. నాకు దాని అర్థమేమో బోధపడలేదు. ఛాటర్జీగారితో తగుమాత్రము పరిచయమైన పిమ్మట, సంవత్సరము తరువాత కాబోలును, ఆయనను "ఆ మొదటిరోజున 'అమ్మకు సవిస్తరముగ తెలిపెదను' అని మీరంటిరే, దాని అర్థమేమి?" అని అడిగితిని. ఆయన: "ఓహో, నే నెన్నడును రాత్రి, మా అమ్మగదికి మొదట వెళ్ళి, పగలు జరిగిన దంతయు చెప్పిగాని నా గదికి వెళ్లను" అనెను. నేను: "మరి మీ భార్య విషయమేమి? ఆమెతో చెప్పరా?" అని అడిగితిని. ఆయన: "నా భార్యయా? ఆమె కుమారుడు అట్టివిషయముల నామెకు దెలుపును" అని బదులుచెప్పెను. అప్పుడు తెలిసినది నాకు, హైందవనాగరికతకు, మా పాశ్చాత్త్యనాగరికతకు గల తీవ్రమగు భేదము. హైందవనాగరికత మాతృత్వము నాధారముగాగొన్నది; మనది గృహిణీత్వము నాధారముగాగొన్నది. అనగా, విపరీతమైన భేదమున్నదన్నమాట.

ఒకటి రెండు రోజులలో, స్వామిని బేలూరులోని ఆయన తాత్కాలికమఠమువద్ద జూచుటకు వెళ్లితిమి. ఇది నీలాంబరముఖర్జీగారి ఉద్యానవనగృహమే యగును. మధ్యాహ్నము స్వామి సెలవిచ్చిరి: "మేము కొనుచున్న క్రొత్తమఠమునకు నిన్ను దీసికొనివెళ్లవలయును". నేను: 'ఓహో; కాని, స్వామీ, ఇది చాలినంత పెద్దది కాదా?' అంటిని ఈ తోటయిల్లు అందమైన, చిన్నప్రదేశము. దానితో జేర్చి ఒకటి, రెండుఎకరముల నేలగూడ ఉండెను; ఇంకను, ఒక చిన్నతటాకము, ఎన్నో పూలచెట్లు. ఈ వసతు లెవ్వరికైనను సరిపోవునని నే ననుకొంటిని. కాని వారిది పెద్ద అంచన అనుట విదితము. కావున, ఆయన మమ్ములను సందుగొందులగుండ, ఇప్పటి మఠమున్న స్థలమునకు దీసికొని వెళ్ళిరి. ఓల్ బుల్ సతియు, నేనును, నదీతీరస్థమగు నీ పురాతనగృహము ఖాళీగా నుండుటనుజూచి, "స్వామీ, యీ యింటిని మేము వాడుకొనవచ్చునా?" అని అడిగితిమి. ఆయన: "అది సరియగు స్థితిలో లేదు" అనిరి. మేము: "కాని మేము దానిని బాగుపరచెదము" అంటిమి. అందుమీదట ఆయన మాకు సమ్మతి దెల్పెను. కావున మేము ఆ యింటికి

సున్నము కొట్టించితిమి. అంగడివీధులకు వెళ్ళి, పాత, దేవదారు చెక్కతో తయారైన కుర్చీలు, బీరువాలు మొదలగువానిని కొంటిమి. అతిథులను కలిసికొను గది (డ్రాయింగురూము) నొకదానిని సగము హైందవపద్ధతిని, సగము పాశ్చాత్యరీతిని తయారుచేసితిమి. బయట నొక భోజనాలగది; మా కొక పడకగది; మేము కాశ్మీరమునకు వెళ్లువరకు మా అతిథిగానుండిన సోదరి నివేదితకొఱకై ఒక యదనపుగది. రెండు నెలలవరకుగూడ మే మచ్చటనే యుంటిమి. స్వామిజీతో మేము గడపిన రోజులలోకెల్ల, ఈ ఘట్టమే అత్యంతము ఆకర్షించునదని చెప్ప వచ్చును గాబోలు. ప్రతి యుదయము ఆయన తొట్టతొలి తేనీటిపానమునకు వచ్చుచుండిరి. దీనిని వారు, అచ్చట నేటికిని ఉన్న పెద్ద మామిడిచెట్టుక్రింద, తీసికొనుచుండిరి. అచ్చటి వారు ఈ చెట్టును పడగొట్టుటకు చాల కోరి నను, మేము మాత్రము వారి కవకాశమియ్య లేదు. ఆ నదీతీరస్థగృహములో మేము నివసించుట ఆయన కెంతో ప్రియముగ నుండెను. తాము నివాసయోగ్యముగాదని ఎంచిన యా యింటినే, మేము అంత అందమైన వసతిగృహముగ జేసిన విశేషమును జూపించుటకు, తమ్ము సందర్శింపవచ్చిన ఎల్లరిని ఆయన తీసికొనివచ్చు చుండును. సాయంకాలపువేళలందు, ఇంటి ముందర, నది పూర్తిగా కనబడుచున్న స్థలములో, మేము తేనీటి సమావేశములను జరుపు చుందుము. ప్రవాహదిశ కెదురుగా, నదిలో ఎల్లవేళలయందును సరకులతో నిండిన పడవలు వెళ్లుచుండును. మా స్వగృహములయందలి అతిథుల యాహ్వానపు గదులలో మే మున్నటులనే భావించి, మా యతిథులకు స్వాగత మర్పించుచుంటిమి. సాధారణవస్తువులవలె అక్కడి వారు భావించుచుండినవానినే, అత్యంతసన్నిహితరీతిని మే ముపయోగపరచుచుండుటను జూచి, స్వామిజీ ఎంతో ముద మొందెను. ఒక నాటిరాత్రి మామూలురీతిగా ప్రళయమగు వర్షము పడెను. ఎక్కడజూచినను, ఒకటేనీరు. స్వామిజీ మా బయటి భోజనపుగదియొక్క వరాండాలో అటు, నిటు నడచుచుండిరి. ఆయన కృష్ణునిగురించియు, కృష్ణునిప్రేమనుగూర్చియు, ప్రపంచములో ప్రేమకు గల శక్తినిగూర్చియు ముచ్చటించుచుండిరి. ఆయనయం దొక వింత ప్రకృతి గలదు. తాను ఒకభక్తునియొక్కయో, ప్రేమికుని యొక్కయో మనఃస్థితియం దున్నప్పుడు, కర్మయోగమును, రాజయోగమును, జ్ఞానయోగమును, వానికి ఎట్టి ముఖ్యత్వమును లేదన్న విధమున, త్రోసిపుచ్చును. కాని, కర్మయోగిగా తన్ను భావించినపుడు, దానినే ముఖ్యవస్తువుగా దీసికొనును. లేక, అదేవిధముగా, జ్ఞానయోగమునుగూడ. ఒక్కొక్కప్పుడు, వారిములకొలది, ఏదో యొక్క మనఃస్థితిలోనే యుండును. అప్పుడు, అంతకుముందుగానే తా నుండియున్న స్థితిని పూర్తిగా విస్మరించును. ఆయనయం దట్టివేళల నాశ్చర్యకరమగు ఏకాగ్రతాశక్తి అలముకొనియుండును. మనలను నలు ప్రక్కల నావరించియున్న విశ్వవాసనలను (కాస్మిక్ క్వాలిటీస్) గ్రహించు శక్తి అయ్యది. ఈ ఏకాగ్రతాశక్తియే గానోపును, ఆయన నంత యువకునిగను, వికాసవంతునిగను నుంచెను. ఆయన ఎన్నడును ఒకసారి చెప్పినదే, మరల, మరల చెప్పియుండ లేదు. చాల అముఖ్యమగు విషయమునుండిగూడ ఆయన కొక సుప్రకాశమగు నూతనపథము గోచరించును. ఇక, ఆయన మనకు, పాశ్చాత్యులకు, ఎంతో ముఖ్యత్వ మొసంగుచుండెను. మమ్ముల నాయః

"(నడతలో =) అనుష్ఠాన వేదాంతులు" అని వర్ణించుచుండిరి. ఆయన చెప్పెను: "మీరొక విషయమును నిజమని నమ్మిన, దాని ప్రకారము నడచెదరు; ఊరక దానినిగూర్చి కలలుగాంచుచుండరు. అదే మీలో నున్న శక్తి".

ఒకనాటిరాత్రి వర్షముపడుచుండెను. లంకా ద్వీపవాసియగు బౌద్ధభిక్షువు అనాగరికధర్మపాలుని, స్వామి మమ్ములను గలిసికొనుటకు దీసికొనివచ్చెను. ఓల్ బుల్ సతియు, సోదరి నివేదితయు, నేనును ఈ చిన్నిగృహములో ఎంతో సౌకర్యముగ నివసించుట జూచి, పాశ్చాత్యస్త్రీలు ఇండియాలో నివాసమేర్పరచుకొని, ఆనందప్రదమగు నొకగృహము నెట్లు నిర్వహింపగలరో తనయతిథులకు జూప స్వామి ముచ్చటపడుచుండెను.

1898 సం॥ మే 12 వ తేదీనాడు మేము కాశ్మీరునకు ప్రయాణమై వెడలితిమి. దారిలో సంయుక్తపరగణాల (యు. పి.) ప్రభుత్వపు ఎండాకాలపు రాజధానియగు నైనిటాలులో నాగితిమి. అచ్చట హైందవులు వందలకొలది స్వామిని సందర్శించి, వారి నొక పర్వతప్రాంతపు, అందమైన, చిన్నిగుఱ్ఱముపై నుపవిష్టులను జేసిరి. పిమ్మట, ఒకప్పుడు క్రీస్తు జెరుసలెం పట్టణము లోనికి వెళ్ళినప్పుడు ఎట్లు ప్రజలు వారిని గౌరవించిరో, సరిగ అదేవిధముగ స్వామిజీ ముందర ఇక్కడి ప్రజయు పుష్పములను, కొబ్బరిమట్టలను వెదజల్లిరి. నే నప్పుడే అంటిని: "కావున, ఇది తూర్పుదేశముల ఆచారమే!"

ఆయన మమ్ములను చూచుటకు మూడు రోజులపాటు రానేలేదు. మేము వారిని చూడనె నలేదు. మే మొక హోటలులో బసచేసితిమి. చివర కాయన మమ్ములను పిలిపించెను. చిన్నయిండ్లలో నొకదానికి మేము వెళ్ళితిమి. అచ్చట తనపక్కపై, మందహాసవదనులై ఆయన కూర్చుండుటను జూచితిని. మమ్ములను మరల జూచుటవలన ఆయన కంత సంతోషము కలిగెను! మే మాయనకు సంపూర్ణ స్వాతంత్ర్యము నొసంగియుంటిమి. ఆయనను మేము కొంచెముకూడ గమనింపనేలేదు. మావలన ఆయన కెట్టి శ్రమయు నేర్పడలేదు. మాతో మాటలాడి, కాలమును గడపుటకు తోడ్పడవలయుననెడి ప్రశ్నయే యుదయింపలేదు.

అచ్చటినుండి మేము ఆల్మోరాకు వెళ్లితిమి, ఇచ్చట సేవియర్ దంపతుల అతిథిగా స్వామి యుండిరి. ప్రత్యేకముగా నొక బంగళాను అమర్చుకొని, అచ్చట నొక నెలరోజులుంటిమి. తమ పాశ్చాత్య శిష్యులకు హిమాలయపర్వత ప్రాంతములలో ఆల్మోరాయే తగునివాసస్థలమని స్వామిజీ ఎప్పుడును తలచియుండెను. అచ్చటనే యొక మఠమునుగూడ స్థాపింప నుద్దేశించెను. కాని, మఠమును స్థాపించెడి తన యత్నమును చాల శ్రద్ధతో కొనసాగించుచున్న సేవియర్ గారికి, నిత్యము తేనేటివిందులకు వచ్చుచుండెడి జనులవలన ఎంత ప్రతిబంధక మేర్పడుచుండెననగా, ఆయన హిమాలయములలో మరి 40 మైళ్లు లోపలికి వెళ్ళితీరవలయునని పట్టుపట్టెను. కావున, మాయావతీ ఆశ్రమము స్థాపింపబడినపుడు, దానికిని రైలుస్టేషనునకును 80 మైళ్ల దూరము. ఇక తగినరోడ్లుకూడ నుండియుండలేదు.

మే మక్కడ నున్నప్పుడు, గుడ్విన్ గారు ఉదకమండలములో చనిపోయిరను వార్త వచ్చెను. ఈ వార్త విన్నప్పుడు స్వామిజీ ఎంతయోసేపు, మంచులో కప్పబడియున్న హిమవచ్ఛిఖరములవైపే జూచుచు నుండిపోయెను. పిమ్మట నిట నెను? "నా చిట్టవరి

బహిరంగోపన్యాసము ముగిసిపోయినది''. మరి ఆయన బహిరంగసభలలో మాటాడనేలేదు.

మేము ఆల్మోరానుండి జూను 20 వ తేదీన కాశ్మీరమునకు బయలుదేరితిమి. రావల్పిండి వరకు రైలు; అచ్చటినుండి మూడుగుఱ్ఱములచే లాగబడు టాంగాలలో, కాశ్మీరములోనికి 200 మైళ్ళవరకు ప్రయాణము చేసితిమి. ప్రతి 5 మైళ్ళకు గుఱ్ఱములు మార్చబడుచుండెను; కావున, అందమైన యా రోడ్డుపై మేము చాల త్వరితముగ పురోగమించితిమి. ఈ బాట, పూర్వము రోమనులచే గట్టబడిన యే రోడ్డునకును దీసిపోలేదు. పిమ్మట బారాముల్లాకు వెళ్ళి, ఆ ప్రాంతపు ''పడవ ఇండ్ల''ను నాలుగింటిని అమర్చుకొంటిమి. 'డుంగాస్' అనబడు ఈ పడవలు సుమారు 70 అడుగులు పొడవైనవి: రెండుపక్కలకును, మధ్య నొక బాటకును చాలినంత వెడల్పుగలవి; యీ పడవలపై చాపలతో నిర్మింపబడిన ఇండ్లుండును. కిటికీ నేర్పరచుకొనవలయుననిన, చాపను చుట్టివేసిన జాలును, చూరునంతటిని పగటివేళలో ఎత్త వచ్చును; ఈ విధముగా మేము ఆరుబయట నివసింతుము; కాని, మా తలలపై అవసరమగునపు డొక కప్పు ఉంచుకొనగలమని మాకు ధైర్యమును గలదు. ఈ డుంగాలు మాకు నాలుగుండెను; ఒకటి ఓల్ బుల్ సతికి, నాకు; ఒకటి పేటర్ సన్ సతికి, నివేదితకు గలిసి; ఒకటి స్వామికి, వారి సన్న్యాసులలో నొకరికి. ఇక నాలుగవది, మేమందరముచేరి భుజించు భోజన విడిది. మేము కాశ్మీరములో నాలుగునెల లుంటిమి; మొదటి మూడునెలలు ఈ చిన్ని పడవలలోను, సెప్టెంబరు తరువాత, చలి చాల ఎక్కువ అయినందువలన నొక సాధారణ 'పడవ–ఇంటి'లోను నివసించితిమి. దీనియందు చలి కాచుకొను స్థలములు గలవు; కావున యథార్థమగు నింటియందువలెనే నిచట వెచ్చదనపు సుఖము ననుభవించితిమి. ఇచట జరిగిన సంభాషణలనుగూర్చి సోదరి నివేదిత ఎంతయో వ్రాసియున్నది. స్వామి వేకువనే 5–30 కు లేచును; ఆయన చుట్ట కాల్చుచు, కళాసులతో మాటలాడుటను గుర్తించి, మేముకూడ లేచుచుందుము. పిమ్మట, రెండుగంటలపాటు ఆ సుదీర్ఘసంచారములు జరుగును. అప్పటికి సూర్యుడు నభోమండలిని పైకెగ బ్రాకి, వెచ్చని కిరణములను బరపుచుండును. స్వామి ఇండియానుగూర్చియు, జీవితములో ఈ దేశమునకు నిర్దిష్టమైన లక్ష్యమునుగూర్చియు, ఇస్లాము మతము సాధించిన దానిని గూర్చియు, అది సాధింపని విషయములను గూర్చియు ముచ్చటించుచు. హైందవచరిత్రమునందును, దాని శిల్పకళయందును, జనుల యాచారములందును తమ మనస్సును లయింపజేసి వారు సంభాషింతురు; నడక నీలిరంగుపూవులు (ఫర్ గెట్–మీ–నాట్) గల చెట్లతో నిండిన పొలముల ద్వారా. ఈ పొలములు ఒకమోస్తరు ఎఱుపు రంగు పూవులతోను, నీలిపూవులతోను నిండిపోవుట కారంభించును, ఆ ప్రాతఃసమయమున, అవి పైన; క్రింద మా గమనము.

బారముల్లా వెన్నీసునగరమును బోలినది. ఎన్నోచోట్ల కాలువలే వీధులు. భూప్రదేశము నుండి, అటు, ఇటు, మాసొంత చిన్నపడవలో వెళ్లుదుము. కాని వర్తకులు మా పడవలను బోలిన చిన్ని, చిన్ని పడవలలో నలువైపులను, వచ్చుచుందురు. మేము మాకువలయు వస్తువులలో చాలమట్టుకు మాపడవ అడ్డుకఱ్ఱలవద్దనే కొనెడివారము. మా పడవలొక్కొక్కటికిని నెలకు 30 రూపాయలు అద్దె; ఇది కళాసులను

కలుపుకొని; వారి భోజనమువారిదే. పడవ వారు అందరు ఒకేకుటుంబమునకు చెందినవారు; తండ్రి, తల్లి, కుమారుడు, కుమార్తె, చేతి పిల్లలు. పడవచివరను వారికి కొద్దిగా స్థలము ప్రత్యేకింపబడును. చాలసార్లుమేము వారి యాహారమును రుచికి కొంతయిమ్మనెడివారము ; దాని సువాసన అంత చక్కగనుండును. ఈపడవలను ఎట్లు నడిపెడివారనగా: తెడ్లతో నదిలో నెళ్లుట, లేక కళాసులు గట్టుమీదనడుచుచు పడవనులాగుట, ప్రయాణమేవిధముగనున్నను, అదనముగా నేమియు చెల్లింప నక్కరలేదు. జీలంనదిమీదుగా నేతటాకమునకైనను మేము వెళ్లదలచిన ఆముందురాత్రి మా నౌకరులతో చెప్పెడివారము. వారు బాతులు, కోడిపిల్లలు, కూరలు, గ్రుడ్లు, వెన్న, పండ్లు, పాలు మున్నగు నాహారవస్తువులనన్నిటిని సిద్ధపరచెడివారు. ఉదయము మేములేచుసరికి, పడవజరిగి వెళ్లుట మాకు తెలియవచ్చును. అది ఎంత కుదుపులేక వెళ్లుచుండుననిన, మాకు సులభముగ ఆవిషయమును కనిపెట్టుటే అసాధ్యముగ నుండును. మాకు ముందుగ వెళ్లు నౌకరు మాకొరకై చక్కని భోజనమును దయారుచేసి యుంచును. వంట ఒక చిన్నపొయ్యిమీద; ఇది మూడుపాత్రలుపట్టగలది ; ఒకదానిలో పులుసు (సూప్), రెండవదానిలో మాంసము, మూడవదానిలో అన్నము. వీరి నైపుణ్యము ఆశ్చర్యకరము; చివరవరకు మాకు అగ్రాహ్యము. పూర్వాచారపరాయణులగు హిందువులు కోడిపిల్లలను చంపితినుటను గర్హింతురు గాన, మేము కొనువానిని చంపితినబోవుటను ఎవరికిని తెలియనిచ్చెడివారముగాము. కాని, మేము నదిపై వెళ్లునపుడుమాత్రము, పడవ క్రిందిభాగములో ఆరు కోడిపిల్లలు వాని చిన్ని కూతలను వేయుచునుండును. స్వామిని సందర్శింపవచ్చెడి పండితులు ఈచప్పుడు విన్నప్పుడు, కోడిపిల్లలెక్కడనున్నవని నలుప్రక్కల చూచెడివారు. అవి క్రిందనున్నవని ఎరిగియుండిన స్వామిజీ మమ్ము సాభిప్రాయముగ జూచును. కాని, ఆయన మారహాస్యమును బయటపెట్టుట ఎన్నడునులేదు. అప్పుడు పండితులు: "కాని, స్వామీ, ఈస్త్రీలతో ఏల సంపర్కము పెట్టుకొనెదరు? వారు మ్లేచ్ఛలు! అస్పృశ్యలు". ఇక, పాశ్చాత్యులు మావద్దకువచ్చి, యిట్లు చెప్పుటగలదు : "కాని, మీరు తెలిసికొనుట లేదా? స్వామి మిమ్ములను గౌరవముగా చూచుటలేదు. ఆయన మిమ్ములను తన తలపాగా లేకుండగనే సందర్శించుచున్నారు". ఇట్లు మేము పరస్పరము, మాదేశముల విచిత్ర గుణములను జూచి హాస్యమొనరించుచు, వినోదమును పొందెడివారము.

పిమ్మట, ఇండియాలోని అపూర్వస్థలములను మాకు జూపుటకై, మాతో ప్రయాణమొనరింప, శారదానందస్వామిని స్వామిజీ రప్పించిరి. మేము లాహోర్, ఢిల్లీ, ఆగ్రా, కురుక్షేత్రము మున్నగు స్థలములకు వెళ్లితిమి. స్వామి తిన్నగా కలకత్తాకు వెళ్లదలచిరి. మేము కలకత్తా చేరుసరికే, స్వామిజీ బేలూరులోని మాచిన్నిగృహమున మఠమును స్థాపించిరి. మేము మరి అక్కడకు వెళ్లుటకు వీలులేనందువలన, రెండుమైళ్లు ఎగువనున్న బాలీలో ఒక చిన్నయింటిని కుదుర్చుకొని, మేము మరల పాశ్చాత్యప్రపంచమునకు వెళ్లువరకు నచ్చట నివసించితిమి.

ఓల్ బుల్ సతి యీ మఠమును స్థాపింప, పెక్కువేల డాలర్లను ఇచ్చియుండెను. నాదగ్గర చాల తక్కువ ధనమున్నందువలన, కొన్ని

సంవత్సరములకుగాని 800 డాలర నెనను మిగతపెట్టలేకపోతిని. ఒకనాడు నేను స్వామి జీతో: ''ఇదిగో, మీకుపయుక్తముగ నుండ జాలు కొంతధనము''అంటిని. ఆయన: ''ఏమీ! ఏమీ!'' అన్నారు. నేను: ''అవును; నిజమే!'' అంటిని. ఆయన: ''ఎంత?'' అని అడిగినారు. ''800 డాలర్లు'' అంటిని. వెంటనే ఆయన త్రిగుణాతీతస్వామినిజూచి, ''ఇదిగో, మీకుకావలసినది దొరికినది; మీరు కోరిన ముద్రణాలయమును కొనుడు'' అనిరి. ఆయన అట్లుచేసెను; ఇందు మూలముగా, రామకృష్ణమిషన్ వారి వంగభాషాపత్రికయగు ''ఉద్బోధన్'' ను ప్రారంభించుట జరిగెను.

1899 సం॥ జూలై నెలలో స్వామి, సోదరి నివేదితతోకూడ, ఇంగ్లాండునకు మరల విచ్చేసిరి. ఇచట సోదరి క్రిస్టైనును, ఫంక్ సతియు ఆయనను కలిసికొనిరి. పిమ్మట ఆయన అమెరికాకువచ్చిరి.ఆసంవత్సరముసెప్టెంబరులో ఆయన మా''రిడ్జెలీ మేనర్'' నివాసస్థలమునకు వచ్చిరి. వారికి ప్రత్యేకముగ నిచ్చిన ఇంటియందు, ఆయన సన్న్యాసులిద్దరు, అభేదానంద తురీయానందులు గూడ బసచేసిరి. సోదరినివివేదితయు వచ్చియుండెను; ఓల్ బుల్ సతికూడ. స్వామిని ప్రేమించి గౌరవించునట్టి యొకగోష్ఠి యేర్పడిపోయెను. నాసోదరి, లెగ్గెట్ సతిని, ఆయన ''అమ్మా'' యని పిలుచుచు, భోజనసమయమున ఎల్లప్పుడును ఆమెప్రక్కనే కూర్చుండును. ఆయనకు చోకలేట్ ఐస్క్రీమనిన చాల ఇష్టము (చోకలేట్ అనగా కోకోనుండి తయారగు తీపివస్తువు); ''నేనుకూడ చోకలేట్ వలెనున్నాను; అదినాకు ఇష్టము'' అని ఆయన కారణము చెప్పును. ఒకనాడు స్ట్రాబెర్రీసను పండ్లను తినుచుంటిమి; అప్పు డొకరు: ''స్వామీ, మీకివి ఇష్టమా?'' అని అడిగిరి. ఆయన: ''నేనెప్పుడును వానిని తినియుండలేదు'' అనిరి. మేము: ''ఎప్పుడు రుచిచూడలేదా! బాగున్నది! ప్రతిరోజును మీరు తినుచునే యున్నారే!'' అంటిమి. ఆయన: ''దాని మీద మీరు మీగడవేయుచున్నారు.—గులకరాళ్లు కూడ, మీగడపూసిన బాగుండును!'' అని బదులుచెప్పిరి.

సాయంకాలపువేళలందు, ''రిడ్జెలీమేనర్' హాలులో చలికాచుకొను పెద్ద స్థలమున అందరము పరివేష్టించియుండ, స్వామి ప్రసంగింతురు. ఒకసారి ఆయన తనకుదయించిన ఆలోచనలను వెలిబుచ్చినపుడు, ఒక నారీమణి: ''స్వామీ, ఈచోట మీతో నేనేకీభవింపను'' అనెను. ''ఏకీభవించుటలేదూ! అట్లగుచో నేను చెప్పినది మీకు వర్తింపదులెండి!'' అని స్వామి సెలవిచ్చిరి. మరెవరోఅనిరి: ''ఓ! అలాగైన యెడల సరిగా, ఆవిషయమునందే, మీరుచెప్పినది నిజమని నాభావము!''

స్వామి: ''ఆహా! అటులైన అది మీకొరకై చెప్పినదే!'' అనిరి. ఈసంభాషణలో, ఇతరుల అభిప్రాయములనెట్లు పూర్తిగ ఆయన మన్నించుచుండెనో సువిదితమగును. ఒకనాటి సాయంకాలము ఆయన ఎంతో గంభీరముగ మతోపన్యాసమును జేయుచుండెను. సుమారు పండ్రెండుగురు సభ్యులుండిరి. ఆయన గొంతుక కొంతసేపటికి మార్దవమునొందెను; ఆయన ఏదో లోకమునుండి మాటలాడునట్లనిపించెను. ఉపన్యాసాంతమున, ఒకరివద్ద నొకరు సెలవు పుచ్చుకొనుటనుకూడ మరచి, ఎవరిలోకమున వారు వెడలిపోయితిమి. అటువంటి పునీతమగు వాతావరణము ఏర్పడెను. పిమ్మట గదులలో నొకదానికి నాసోదరియగు లెగ్గెట్ సతి వెళ్లెను.

అచట నొక అతిథి ఏడ్చుచుండెను; ఈపెమతము అజ్ఞేయవాదము (అగ్నాస్టిసిసమ్).

మా అక్క: "ఏల ఇట్లు ఏడ్చుచున్నారు?" అని అడిగినది. ఆపె: "ఆయన నాకు శాశ్వత జీవితమును ప్రసాదించినారు. ఆయన పలుకులను మరల నేను వినగోరను".

స్వామిజీ రిడ్జెలీ మేనర్‌లో నున్నప్పుడే, మాకపరిచితురాలగు నొక నారీమణివద్దనుండి ఒకజాబువచ్చెను. లాస్ ఏంజెలిసులో మా యేకైకసహోదరుడు చాల జబ్బుగనుండె ననియు, అతడు చనిపోవునని తనకు తోచు చుండెననియు, మాకది తెలుపుట అవసరమని, తానెంచుచున్నాననియు ఆమెవ్రాసెను. కావున నా సోదరి నాతో "నీవు వెళ్లవలయునని నాకు తోచుచున్నది", అని అనెను. నేను "తప్పక" అని జవాబిచ్చితిని. రెండుగంటలలో నేను తయారయితిని; గుఱ్ఱములు సిద్ధమయ్యెను. స్టేష నుకు నాలుగుమైళ్లు. నేను వెళ్లునపుడు, స్వామి చేతులెత్తి, సంస్కృతములో ఆశీర్వచనముగ నేమో చెప్పిరి. పిమ్మట వారు: "కొన్ని తరగ తులను ఏర్పాటుచేయుడు; నేను వచ్చెదను", అనిరి.

నేను తిన్నగా లాస్ ఏంజెలిసునకు వెళ్లితిని. రోజాపువ్వులతో కప్పబడిన ఒక చిన్న, తెల్లని యింటిలో నా సోదరుడు చాల జబ్బుగ, మం చముపట్టియుండెను. ఈ యిల్లు ఊరిచివర నుం డెను. అతని తలకు మీదుగా, వివేకానందుని పటమొకటి, నిజాకృతి పరిమాణముగలది, యుండెను. పదిసంవత్సరములుగ నా సోదరుని నేను కలిసికొనియుండలేదు. కావున ఒక గంట సేపు అతనితో మాటలాడుచు నుండిపోయితిని; అతడు చాల జబ్బుగనుండుటను గుర్తించితిని. పిమ్మట, ఇంటియాపెయగు బ్లాడ్జెట్ సతిని వెళ్లి జూచి "నా సోదరుడు చాలజబ్బుగానున్నాడు" అంటిని. ఆమె: "అవును" అన్నది. "అతడు చనిపోవునని నాకు తోచుచున్నది". అని నేను చెప్పగా ఆమె: "అవును" అనెను. నేను: "అతని అంతము ఇక్కడనే జరుగవచ్చునా?" అని అడిగితిని. ఆమె: "దాని కొకరి అడ్డు ఉండునా? అన్నది. పిమ్మట నేను; "నా సోద రుని పక్కకు మీదుగానుండు చిత్రము ఎవరిది?" అని ప్రశ్నించితిని?

ఆమె డెబ్బదిఏండ్లయాపె; తనవయస్సున కుండగల పూర్తిశీవితో నామె, తలఎత్తినిలచి: "ఈ ప్రపంచములో నెన్నడైన నొక దైవ ముండియున్న, ఆ చిత్రములోని మనుష్యుడే ఆదేవుడగును" అన్నది. నేను: "ఆయనను గూర్చి మీకేమి తెలియును?" అని అడిగితిని. ఆమె: "1893 సం॥ లో చికాగోలో జరిగిన మతముల మహాసమావేశము (పార్లమెంట్ ఆఫ్ రిలిజన్స్)లో నేనును పాల్గొంటిని. ఆయువ కుడు లేచి నిలువబడి, 'అమెరికాలోని సోదరు లారా, సోదరీమణులారా!' అని సంబోధింప గానే, ఏడువేలమంది ప్రజ లేచి నిలువబడిరి; తామిదియని చెప్పజాలని యొక యపూర్వ వస్తువునకు జోహారులర్పించురీతిని వారటుల జేసిరి. సమావేశము ముగిసినది; స్త్రీలెందరో ఆయనవద్దకు వెళ్లుటకు బల్లలమీదుగా నడిచి వెళ్లుచుండుటనుజూచి, నాలో నేనిట్లనుకొంటిని: 'మంచిది, నాప్రియమైనపిల్లడా, యీప్రజల ధాటిని నీవు తాళుకొనిన, నీవు నిజముగ నొక దైవమేసుమా!" (పిమ్మట) నేను: "నేనాయన నెరుగుదును" అంటిని. "ఆమె: "ఆయన నెరు గుదురా?" అని అడిగినది. నేను: "అవును; న్యూయార్కు రాజ్యమునందలి, కాట్‌స్కిల్ కొండల ప్రాంతములోని 200 ప్రజగల 'స్టోన్

రిడ్జ్ కు గ్రామమునం దిప్పుడుండు ఆయన వద్ద నుండియే నేను వచ్చుచున్నాను'' అంటిని.

''మీరాయన నెరుగుదురా?'' అన్నది మరల ఆమె.

''ఆయనను మీరిక్కడికి ఆహ్వానింప కూడదా?'' అంటిని నేను.

''నా యింటికా?' అన్నది ఆమె.

నేను: ''ఆయన తప్పక వత్తురు'' అంటిని. మూడు వారములలో మా సోదరుడు మరణించెను; ఆరు వారములలో స్వామిజీ అక్కడకు వచ్చిరి. పసిఫిక్ సముద్రతీరమునగల 'కాలిఫోర్నియా'లో ఆయన తన మతతరగతులను ప్రారంభించెను.

మేము బ్లాడ్జెట్ సతి అతిథిలుగా నెలలబాటుంటిమి. ఈచిన్న యింటిలో మూడు పడక గదులుండెను; ఒక వంటగది, ఒక భోజనపు గది, ఒక సమావేశపుగది. ప్రతియుదయము స్వామిజీ తమస్నానపుగదిలో సంస్కృతమున మంత్రోచ్చారణచేయుట మాకు వినిపించును. ఆయన చెదరినజుత్తుతో బయటికివచ్చి, ఉదయాహారమునకు ఆయత్తమగును. బ్లాడ్జెట్ సతి రుచికరమైన దోసెలను తయారుజేసెడిది; వీనిని వంటయింటి మేజావద్ద మేముతిందుము. స్వామి మాతోబాటు కూర్చుందురు. స్వామి చాల రసవత్తరమగు సంభాషణను బ్లాడ్జెట్ సతితో గావింతురు. బలమగు జవాబులు, ఛలోక్తులు; ఆమె పురుషుల 'దుర్మార్గము'ను గూర్చి వర్ణించిన, ఆయన స్త్రీల ఎక్కుడు దుర్మార్గమును గూర్చి ముచ్చటింతురు! బ్లాడ్జెట్ సతి ఆయన యుపన్యాసములకు వెళ్లుటయే అరుదు; మేము మరలునపుడు మాకు రుచికరమగు భోజనమును సిద్ధము జేసియుంచుటయే తనకు కర్తవ్యమని ఆమె చెప్పును. స్వామి ఎన్నియోపర్యాయములు ''సత్యగృహము'' (హోమ్ ఆఫ్ ట్రూత్) లోను, ఎన్నియో ప్రసంగమందిరములలోను ఉపన్యాసముల గావించిరి. కాని, వీనిలో కెల్ల గొప్పది, నేను విన్నవానిలో, 'నాజరత్ కు చెందిన జీసస్ అను నుపన్యాసమేనని చెప్పవచ్చును. అప్పుడాయన తలనుండి పాదముల వరకు నొక తెల్లని కాంతిని ప్రజ్వరిల్లజేయునట్లగపడెను; క్రైస్తుయొక్క అద్భుతము(మహత్తు) నందును, శక్తియందును ఆయనయంత లీనులై యుండిరి. ఆయనచుట్టునుండు నీప్రత్యక్షప్రభను జూచి, నేనచేతనురాలనైతిని. ఆయన యింకను గొప్ప ఆలోచనలయందే మునిగితేలుచు నుందురను నభిప్రాయముతో, వాని కడ్డురాకుండుటకై, యింటికి వెళ్లునపుడు నేను ఆయనతో మాటలాడలేదు. ఉన్నట్లుండి ఆయన నాతో: ''అది ఎటులచేయబడునో నాకు తెలియును'' అనిరి.

నేను: ''ఎటుల, ఏదిచేయబడును?'' అని అడిగితిని.

స్వామి: ''మిరియాలచారు ఎటుల తయారు జేసెదరో యనుట! దానిలో కరివేపాకు(బేలీఫ్) వేసెదరు''.

ఈ విధముగ, తన గొప్పతనమునుగూర్చి కొంచెముకూడ ఆలోచనయే లేక యుండుట, స్వామిజీ యొక్క ప్రధానగుణములలో నొకటి. ఎదుటిమనుష్యుని ఆత్మబలమును, ప్రతిభను, శక్తిని ఆయన గ్రహించునటుల కనబడుచుండెను; ఇందువలన ఆవ్యక్తి తనకొక నూతన ధైర్యము కలుగుచున్నటుల భావింపగలుగుచుండెను; దీని ఫలితముగ స్వామిని గలిసికొను ప్రతివ్యక్తియు సేదదేరియు, శక్తినిపొందియు,

ఆధారమునుపొందియు నాయన సాన్నిధ్యము నుండి వెడలును. కావున జనులు "ఆధ్యాత్మిక శక్తి ఉన్నదీ, లేనిదీ ఎట్లు కనుగొనుట?" అని నన్నడిగిన, "ఒక మహాత్ముడు తన సాన్నిధ్యమున మనకు కలిగింపగల ధైర్యమునుబట్టియే" అని నేను ఎల్లప్పుడు జవాబు నిచ్చియున్నాను. స్వామిజీ యిట్లనుచుందురు: "రక్షకులు తమ శిష్యుల పాపములను, కష్టములను తామే భరించి, వారిని ఆనందముగను, స్వతంత్రులుగను, తమ మార్గమున బోవిడువవలయును. అదే భేదము! రక్షకులు బాధ్యతనంతను భరింపవలయును".

రిడ్జలీమేనర్‌లో నా దగ్గర బంధువు (నీస్)తో ఒకసారి చెప్పిన మరొక విషయము: "ఆల్బర్టా, జీవితములో నే విషయమును, మనము దానిని గూర్చి యనుకొన్నంతటదిగా ఎన్నడును నుండ జాలదు".

ఒకనాడు బ్లాడ్జెట్ సతి స్వామివద్దకు ముగ్గురు విదుషీమణులను దోడ్కొనివచ్చెను. ఆయన వారితో నాంతరంగికముగ మాటలాడుటకు వీలగునట్లు నేను వెంటనే లేచి, వెళ్లితిని. అర గంట పిమ్మట స్వామి నావద్దకువచ్చి: "ఈ ముగ్గురును తోబుట్టువులు. పాసడీనాకు. తమవద్ద కొకసారి రమ్మని వారు కోరుచున్నారు" అనిరి. నేను: "వెళ్లుడు" అంటిని. ఆయన: "వెళ్లనా?" అని అడిగినారు. నేను: "అవును, వెళ్లుడు" అంటిని. వారు హాన్స్‌బరోసతి, మీడ్ కన్య, వైకాఫ్ సతి. కడపటియామె యిల్లు, యిపుడు హాలీవుడ్‌లోని "వివేకానంద మందిరము". ఆమెతో స్వామిజీయొక్క సన్న్యాసి యొక రున్నారు.

కాలిఫోర్నియాలోని అలమేడానుండి, 1900 సం॥ ఏప్రెలు 18వ తేదీనాడు స్వామిజీ నాకు జాబు వ్రాసిరి. వారు వ్రాసిన లేఖలన్నిటిలోను నిది మీదుమిక్కిలి అందమైనది. "దైవప్రేరిత ఉపన్యాసముల"లో నిది ఆఖరుది.

పిమ్మట 1900 సం॥లో "బోధన (ఎక్స్‌పొసిషన్)" కొఱకై పారిస్‌లో నా సోదరియు, లెగ్గెట్‌గారును నొక యింటిని అద్దెకు తీసికొనిరి. మేము జూన్ నెలలో వెళ్ళితిమి; స్వామి ఆగస్టులో అనుసరించిరి. ఆయన కొన్ని వారములపాటు మాతో నున్నతరువాత, బ్రహ్మచారియగు గెరాల్డ్ నోబెల్ గారివద్దకు వెడలిపోయిరి. పిమ్మట ఆయన నోబెల్‌గారినిగూర్చి: "నోబెల్‌గారిని బోలిన యొక్క వ్యక్తిని స్నేహితునిగా పొందుటకు మాత్రమే యీ జన్మ నెత్తవచ్చును" అని చెప్పిరి. అంత ఎక్కుడుగ ఆయన యీ, మా స్నేహితుని గౌరవించుచుండెను. ఆ యారు నెలలు మేము విందుల నెక్కుడుగ నొసంగుచుంటిమి. స్వామి రమారమి ప్రతిరోజును మధ్యాహ్నభోజనమునకు వచ్చుచుండిరి,

ఒకనాడు మధ్యాహ్నభోజనసమయమున, ఎమ్మాకావ్ సతి యను గాయకురాలు, తాను చలికాలమును గడపుటకు ఈజిప్టుదేశమునకు వెళ్లుచుంటినని చెప్పెను. మేముకూడ నామెతో వెళ్ళిన బాగుండునని నేను చెప్పగా, ఆమె వెంటనే స్వామిజీని "మీరు నా యతిథిగా నీజిప్టునకు వచ్చెదరా?" అని అడిగెను. ఆయన యంగీకరించిరి. మేము దారిలో వియెన్నాలో రెండురోజులు, కాన్‌స్టాంటినోపుల్‌లో తొమ్మిది రోజులు, ఏథెన్స్‌లో నాలుగురోజులు నుంటిమి. ఈజిప్టులో కొద్దిరోజులున్నతరువాత, స్వామి నాతో "నాకు వెళ్ళిపోవలయునని యున్నది" అనిరి. "వెళ్ళిపోవుట ఎక్కడకు?" అని నే నడిగితిని. "ఇండియాకు" అని ఆయన అనిరి. నేను: "తప్పక!" అంటిని.

కావున నేను ఈవాకావ్ గారివద్దకు వెళ్ళి, ''స్వామికి ఇండియాకు మరలివెళ్ళవలయునని యున్నది'' యని తెలియజేసితిని. ఆమె ''తప్పక'' యని జవాబొసంగెను. ఆమె ఆయనకు మొదటి తరగతి టిక్కెట్టు కొనియిచ్చెను. ఆయన ఇండియా చేరుసరికి సీవియర్ గారు మరణించిరి. స్వామి వెంటనే, సీవియర్ సతి తన భర్తృమృతిని ఎంతో ప్రశాంతముగను, ప్రశంసనీయముగను భరించెననియు, తన భర్త యింకను మాయావతీ ఆశ్రమములో నుండిరా యనునటుల నామె యచటి కార్యకలాపమును నడపుచుండెననియు నాకు జాబు వ్రాసిరి.

నైల్ నదిమీద ప్రయాణముజేసినపుడు, మంచి సరసులగు నాంగ్లేయులను కొందరిని నేను కలిసికొనుట తటస్థించినది. వారు నన్ను తమతో జపానుదేశమునకు రమ్మని చాల కోరినందున, నేను మార్గమున మరల నిండియా మీదుగా వెళ్లుట తటస్థించినది. నేను మరల స్వామిజీని కలిసికొంటిని. నేను జపానునుండి, రమ్మని వ్రాసిన, తామచటికి వత్తుమని ఆయన చెప్పిరి. బిజిత్సుయిన్ చిత్రకళాశాలను టోక్యోలో స్థాపించియుండిన ఒకాకురా కాకాజూ గారి పరిచయము నాకు కలిగెను. స్వామి జపానుకువచ్చి, తమ యతిథిగా నుండవలయునని ఈయన మిక్కిలిగ కోరెను. కాని స్వామి వచ్చుటకు సమ్మతింపనందున, ఆయనను కలిసికొనుటకు ఒకాకురాగారే నాతో ఇండియాకు వచ్చిరి. బేలూరులో కొద్దిరోజులున్నతరువాత ఒకాకురాగారు నాతో నిర్ధారణగా నిట్లనిరి : ''వివేకానందులు మావారు, ఆయన తూర్పు ప్రపంచపు వ్యక్తి. మీవారు కారు. ఒకటి రెండు రోజులతరువాత, స్వామి నాతో: ''ఎన్నడో విడిపోయిన సోదరుడు మరలివచ్చినట్లున్నది, నాకు'' అనిరి. నా జీవితమునందలి ఆనందమయమగు అనుభవములలోనిదియొకటి. ఒకాకురా, స్వాములు, పరస్పరము యథార్థముగ నవగాహనముజేసికొనియుండిరని, నాకప్పుడు సువిదితమయ్యెను. స్వామి ఆయనను : ''మీరు మాగోష్ఠిలో చేరెదరా?'' అని అడిగిరి.

ఆయన: ''లేదు, నాకు ఈప్రపంచముతో పని యింకను పూర్తికాలేదు'' అనెను. ఇది చాల వివేకముతో చెప్పినమాట.

ఆవేసవి, అమెరికాదూతయగు పాటర్ సన్ సేనాని నన్ను తమప్రభుత్వభవనములో నుండనిచ్చిరి. అచట, టోక్యోయందలి అసాకుసా దేవాలయమున నాకాతిథ్యమొసగిన ఓడాగారు నాయతిథిగా నుండిరి.

ఆసంవత్సరమంతయు నేను స్వామిని అప్పుడప్పుడు కలిసికొనుచుంటిని. ఏప్రెలు నెలలో ఒకనాడు స్వామి నాతో: ''నాకీ ప్రపంచములో నేమియు లేదు. నాదని ఒక పైసాకూడ లేదు. నాకీయబడిన ధనమును పూర్తిగా నితరుల కిచ్చివేసితిని'' అనిరి. నేను: 'స్వామీ, మీరు బ్రతికియున్నంతవరకు నేను నెలకు 50 డాలర్లనిచ్చెదను'' అంటిని.

ఆయన ఒకనిమిష మాలోచించి: ''దానితో నేను కాలక్షేపము జేయగలనా?'' అనిరి. నేను: ''చేయగలరు, తప్పక! కాని, ఒకవేళ, మీగడదొరకదేమో'' అంటిని. అప్పుడు నేను ఆయనకు 200 డాలర్లు ఇచ్చితిని; కాని నాలుగు నెలలు ముగియులోపుగనే ఆయనమరణించెను.

(సశేషము)

# వంటయింట భగవానులు

శ్రీ గుఱ్ఱము వేంకట సుబ్బరామయ్యగారు, ఎమ్. ఏ. (ఆనర్సు)

ఆకాలమున (1940) భగవాన్ శ్రీ రమణ మహర్షులతోఁగూడ వంటయింట బనిచేయు నపూర్వమహాభాగ్యము నాకు లభించెను. పని వేళ రాత్రి 2½ గంటలనుండి 4 గంటలవఱకు. శ్రీ భగవానులు సరిగా 2-30 కి వత్తురు; కొంత సేపు పరిచారకులతో భక్తులతోఁగూడ కూర గాయలు తఱుగుటయందు గడపుదురు; అటు పిమ్మట పాకశాలలో బ్రవేశించి ఉదయ ఫలాహారమునకు పులుసుగానీ పచ్చడిగానీ తయారు చేయుదురు; ఒక్కొకప్పుడు ఏవైనా భక్ష్య విశేషములుగూడ చేయుదురు. సబ్ రిజిస్ట్రారు శ్రీ ఆర్. నారాయణయ్యరూ, పుస్తకాలయోద్యోగి శ్రీకల్యాణసుందరమయ్యరూ, నేనూ శ్రీ భగవానులకు తోడ్పడుచుంటిమి. మొట్టమొదట నాకు ఈపనియేమీ తెలియదు. శ్రీ భగవానులు ప్రొయ్యివద్ద విశేషముగా చెమ్మట గార్చుచుండుట జూచి నేను వారికి విసనకఱ్ఱ వీవ బ్రయత్నించితిని. కాని శ్రీ భగవానులు సమ్మతింపలేదు. వారు తమకు ఏవిధమైన యాధిక్యమును జూపుట కొప్పుకొనరు. నేను విసరుట నిలిపితిని. కానీ శ్రీ భగవానుల యవధానము పనిలో మగ్నమైనప్పుడు నేను మరల మెల్లగా విసరుటకారంభించితిని. శ్రీ భగవానులు నావైపుచూచి నవ్వుచు ఇట్లనిరి : "ఓహో! నీవు నన్నేమార్చి విసరగోరుచున్నావు. కానీ అది గూడ చక్కగాచేయుట నీకు చేతగాలేదు. నీకు నేర్పించెదను". ఇట్లు పలుకుచు వారు నాచేయిపట్టుకొని చక్కగా విసరుట నేర్పించిరి. ఆహా! అప్పటి నా పారవశ్యము వర్ణనాతీతము. ఆ యదృష్టమునకు గారణమైన నా యజ్ఞానమును గొనియాడితిని. వంటింటినుండి ప్రక్కగదికి పోయి అచ్చట ఆ కదంబమును రుబ్బుచుంటిమి. అక్కడగూడ మొట్టమొదట రుబ్బుడు పత్రమును బట్టుకొని త్రిప్పుట నాకు చేతగాకుండెను. శ్రీ భగవానులు వారిచేతిని నా చేతిపైనుంచి రుబ్బుడు పత్రమును జక్కగా ద్రిప్పించిరి. మరల ఏమానందము! నాయజ్ఞానమెంత యదృష్టవంతము! పని పూర్తియైన పిదప పళ్లెమునుండి పదార్థము నించుక తీసికొని దానిలో కొంచెము తాము రుచిచూచి మిగత మాకు రుచిచూచుటకిచ్చుచుండిరి. ఒక్కొకవేళ మేము చేతులు కడుగుకోనప్పుడు వారే స్వహస్తముతో మా నోటిలోబెట్టుదురు. అది మాపారవశ్యమునకు పరమావధి. అంతటవారు తిరిగి హాలుకు గబగబ వెళ్ళి సోఫాపై ఒత్తిగిలిపరుండి బ్రాహ్మణులు వేదపారాయణకు వచ్చుసరికి తూగుచున్నట్లు కాన్పింతురు. శ్రీ భగవానులకు అంత సమీపమున గూర్చుండుట, వారితో ముచ్చటలాడుట, వారి పరిశ్రమానుగ్రహాఫలితములో బాల్గొనుట – ఇది యెంతటి భాగ్యము! ఎంతటి యదృష్టము! నిక్కముగా మా ముప్వురి జీవిత గోపురములకు అదే స్వర్ణకలశము. దాని సంస్మరణమే యెల్లవేళల మా జీవితపర్యంతము మాకు బ్రహ్మానందము.

కానీ (శ్రీ) భగవానులతో ఇట్లు పనిచేయుట సంతోషావహమయ్యెను, కత్తిపై సాము చేయుటవంటిది. (శ్రీ) భగవానులు కరుణాపూర్ణ

సుధాబుద్ధులే గాక నిశితక్రమశిక్షకులుగూడ. పనియందేపాటి మాంద్యమునూ వారు సహింపరు. ప్రతి పనియు పూర్తిగా బాగుండవలెను. ఏదీ వ్యర్థము కాగూడదు, చెడిపోగూడదు. వారి యాదేశములను నిండుశ్రద్ధతో గమనించి చక్కగా నెరవేర్పవలెను. ఒకరాత్రి న్యాయవాది భక్తుడొకాయన తానుగూడ ఈపనిలో పాల్గొనెదనని పట్టుపట్టెను. పులుసుపాత్రను దీసుకరమ్మని అతనితో శ్రీ భగవానులు చెప్పిరి. అది తెచ్చుటలో పాత్ర తొణికి కొన్ని బొట్లు పులుసు చిందిపోయెను. వెంటనే శ్రీ భగవానులిట్లు మందలించిరి: "మీరు కోర్టులో వాదించుటకు తగుదురే గానీ యీ పనికి తగరు." పాప మాయన మరల ఎప్పుడూ ఈ పని చేసెదనని రాలేదు. ఒక్కొకరికి ఒక్కొకపని విధింపబడును. అది యతడు శ్రీ భగవానుల చూపు మాత్రముననే గ్రహింపవలెను. ఉదాహరణము: నా పని ఉప్పును ఉదకమును దెచ్చియిచ్చుట. శ్రీ భగవానులు నావైపు చూచినపుడెల్ల నేను ఆ రెంటిలో ఏది కావలెనో గ్రహించి వెంటనే తేవలెను. సాధారణముగా మేము రాత్రి రెండుగంటలకే లేచి ప్రక్షాళణములు పూర్తిచేసికొని శ్రీ భగవానులు వచ్చుటకుముందే సిద్ధముగా నుందుము. కానీ ఒక రాత్రి నేనయిదునిమిషము లాలసించితిని. నేను వచ్చుటకుముందే పని ప్రారంభమై జరుగుచుండెను. శ్రీ భగవానులు పాకము రుచి చూచి ఉప్పు కొంచె మెక్కువైనదని చెప్పుచు నావంక దిరిగి మఱియు నిట్లనిరి: "నీవు రానందున, ఉప్పు వేయునప్పుడు నిన్ను దలచుకొంటిని. అదే యీ యెక్కువకు కారణము." నా యాలస్యమునకు శ్రీ భగవానులు మందలించు తీరు అట్టిది. మఱియొక రాత్రి పాకములో పులుసు కొంచె మెక్కువయ్యెను. శ్రీ భగవానులు దానిని రుచి చూచి, నవ్వుచు ఇట్లు పలికిరి: "పులుపు పైత్యమునకు మంచిమందు. ఇచ్చటికి వచ్చువారికి కొద్దియో గొప్పో పైత్యముండును. కాబట్టి దీనితో ఆ పైత్యము పాఱిపోవును!" కానీ అట్టి పొరపాట్లు చాలఅరుదు. సాధారణముగా భక్ష్యములు దివ్యమైన రుచి కలిగియుండుట ఆశ్రమములోని యెల్లవారి కనుభవమే. శ్రీ భగవానుల హస్తస్పర్శమాత్రముననే వాటి కంత కమ్మదనము వచ్చెనా అనిపించును. అది వాటిపై అమృతము ప్రోక్షించినట్లే.

పనిచేయుచున్నప్పుడు ప్రాసంగికములగు సామాన్యభాషణల వ్యాజమున పరమార్థమును బోధించుట శ్రీ భగవానుల పద్ధతి. ఒకరాత్రి ఒకసీమకూర దఱుగుచుండగా, పరిచారకుడొకడు, "ఈ కూర మన ఆశ్రమము తోటలో వేసి పెంచగలిగిన ఎంత బాగుండును" అనెను. వెంటనే శ్రీ భగవానులిట్లు జవాబిచ్చిరి:

"అది యెచ్చట పెరిగిన దనుకొన్నావు? మన తోటలోనే. కాకున్న మన కెట్లదివచ్చును? వాస్తవముగా ప్రపంచములో అన్నితోటలూ మన ఆశ్రమము తోటలే!"

మఱియొకమారు పులుసు ఉడుకుచుండగా శ్రీ భగవానులిట్లు పలికిరి:

"అది పూర్తిగా ఉడుకవలెను. ఆ పొంగుతయు అణగిపోవలెను. అప్పుడే అది పక్వమై స్వాదు వగును."

మఱియొక రాత్రి సుమారు మూడుగంటలప్పుడు మేము శ్రీ భగవానులతోగూడ పాకశాలకు ప్రక్కగదిలో పచ్చడి రుబ్బుచుంటిమి. ఒకాయనవచ్చి హాలుపద్ద నాకొఱకు ఎవరో

కొందఱు కాచుకొనియున్నారని చెప్పెను. నేను వెళ్లి చూడగా వాళ్లు నాయుడుపేటనుండివచ్చిన స్త్రీలూ పిల్లలూ అని తెలిసినది. వాళ్లు గిరి ప్రదక్షిణము పోవుచు శ్రీ భగవానుల దర్శనా పేక్షించిరి. ఆ సనుయమున శ్రీ భగవానుల దర్శనము వీలుపడదని వాళ్లతో ఖండితముగా జెప్పివేసి నేను లోపలికి వెళ్లితిని. నన్ను జూడగానే శ్రీ భగవానులు "ఏమి సంగతి?" అని యడిగి నావలన విని యిట్లనిరి :

"పాపము! వాళ్లు ఆశాభంగముతో ఎందుకు పోవలెను? వాళ్లను ఈ ప్రక్క గుమ్మమునకు రమ్మని చెప్పండి. అచ్చట వాళ్లను గలసి కొంటాను."

ఆ ప్రకారమే నేను వాళ్లకు జెప్పగా వాళ్లు అచ్చటికి పరుగిడిరి. శ్రీ భగవానులు ద్వారబంధముపై నిలుచుండిరి, నడుమ పరిచారకుడెవ్వడూ లేడు. ఆ జట్టువాళ్లందఱు శ్రీ భగవానుల పాదములపై వ్రాలి వాటిని కన్నుల నద్దికొని కన్నీటితో గడిగిరి. శ్రీ భగవానులు అనుగ్రహము వర్షించునట్లు వాళ్లను గటాక్షించుచు నిలబడిరి. అప్పుడు నేను ఆ జట్టువాళ్లు శ్రీ భగవానుల యనుగ్రహము నిట్లు కొల్లగొట్టుటకు వారి యదృష్టవిశేషమును గొనియాడుచు, శ్రీ భగవానులు 'కరుణాపూర్ణసుధాబ్ధి' అని కీర్తించుటలో గల భావమును చక్కగా గ్రహించితిని.

[అచ్చగుచున్న "శ్రీరమణస్మరణామృతము" అను స్వకీయగ్రంథమునుండి యుద్ధృతము. సర్వస్వామ్యములు రచయితవి.]

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# మహాత్మా తులసీదాసు

## శ్రీమతి కుమారి సరళాదేవి

హిందీభాషలో తులసీ రామాయణము అత్యుత్తమగ్రంథమనియు, ఉత్తరహిందూదేశ మంతటను ప్రతియింటను ఈ గ్రంథము ఆదరముతో పఠింపబడుననియు ఆంధ్రులకు తెలిసిన విషయమే.

ఈ గ్రంథమును రచించినవారి పూర్తిపేరు శ్రీ గోస్వామీ తులసీదాసు. గ్రంథము పూర్తిపేరు 'రామచరితమానస'. శ్రీ తులసీదాసు ఈ ఒక్క గ్రంథమేకాక మరి 12 గ్రంథములు రచించెను. (1) రామచరితమానస, (2) వినయపత్రికా, (3) దోహావలీ, (4) కవితావలీ, (5) గీతావలీ, (6) రామాజ్ఞా ప్రశ్న, (7) పార్వతీ మంగల్, (8) జానకీ మంగల్, (9) రామలలానహఛూ, (10) బరవై రామాయణ, (11) వైరాగ్య సందీపినీ, (12) కృష్ణ గీతావలీ. కాని అన్నింటికన్న రామాయణ ఖ్యాతి దినదినాభివృద్ధినందుచున్నది.

రామచరితమానసమునకు సాటి హిందీ

సాహిత్యములో వేరొండు గ్రంథములేదు. ఇయ్యది ఉత్తమోత్తమ కావ్యలక్షణ లక్షితమును, నవరసభరితంబునునయి యొప్పుచున్నది. ఇందు ఆదర్శరాజధర్మము, ఆదర్శకుటుంబిక జీవనము, ఆదర్శ సోదరధర్మము అత్యుత్తమముగా వర్ణింపబడియున్నది. అంతియేకాక భక్తి జ్ఞాన త్యాగ వైరాగ్యములు సదాచార సంపన్నతతో నిండియున్నది. స్త్రీ పురుషులకు, బాలక వృద్ధులకు, పండిత పామరులకు ఎల్లరకును విశదమగునట్లు సులభశైలిలోను, ఎల్లరకు ఉపయోగపడునట్లు లౌకిక, పారమార్థిక విషయములతో ఇయ్యది యలరారుచున్నది.

సతతము అంతఃకలహములతోడను, వైషమ్యములతోడను, హిందూరాజ్యము విచ్ఛిన్నమయి, తురుష్కరాజుల పరిపాలనకు లోబడి హిందూరాజులు తమ వీర్యమును పూర్తిగా కోలుపోయిరి. 'యథారాజా తథాప్రజా' అన్నట్లు రాజులు బలహీనులైన ప్రజలు బలవంతులుగ నుందురా? తురుష్కుల సంసర్గమున దేశము నిర్గుణనిరాకారబోధనలతోనిండి ప్రజలు జడత్వముతోపాటు, నిస్పృహత, సోమరితనము అలవరచుకొని దేశదుస్థితిని ద్రష్టలై చూచుచుండిరి. దేశము దాస్యశృంఖలలచే బంధింపబడుటయేకాక ప్రతి మానవుడును సత్యమును పూర్తిగా మరచి పరతంత్రుడై, కర్తవ్య విముఖుడై, పతితావస్థయందుండెను. తమస్సులో మునిగియున్న మానవుని మేల్కొలిపి భగవంతుని లీలలను, సాకార నిరాకారతలను రెండింటి సమన్వయమును చూపి, భగవంతుని మానవునిస్థితి క్రిందికి తీసికొనివచ్చి ఎల్లరును వానినిచేరు సులభ భక్తిమార్గమును శ్రీతులసీదాసు నిరూపించెను. అంతఃకరణ శుద్ధియే భ యోగమునకు పట్టుకొమ్మ. అందుచేతనే ''స్వాంతః సుఖాయ తులసీ రఘునాథగాథా'' (అంతఃకరణ శుద్ధికై తులసీ దాసు రామాయణము రచించుచున్నాడు) అని రచించెను.

ఇట్టిరామాయణము రచించిన మహాత్ముని జీవితము పఠనార్హము.

సుప్రసిద్ధ ప్రయాగక్షేత్రమునకు సమీపమందున్న బాందాజిల్లాలో రాజాపురమను గ్రామమొండు కలదు. అందు సరయూపారీణ బ్రాహ్మణులగు ఆత్మారామదుబే, హులసీ అను పుణ్యదంపతులకు విక్రమశకము 1554 శ్రావణశుద్ధ సప్తమి 'అభుక్త మూల' నక్షత్రమందు తులసీదాసు జనించెను. హులసీ మాత 12 మాసములు పూర్తిగ గర్భముధరించి శిశువును కనెను. పుట్టగనే బిడ్డనోటిలో 32 పండ్లు ఉండెను. బిడ్డడు 5 సంవత్సరముల బాలునివలె కాన్పించెను. పుట్టగనే ఏడ్చుటకు బదులు బిడ్డనోటినుండి 'రామ' శబ్దము వెలువడెను. ఇట్టి విచిత్రపుబిడ్డ పుట్టుటయందేమో అనిష్టము సంభవింపనున్నదని తల్లి శంకించి దశమిరాత్రి ఆబిడ్డను 'చునియా' అను దాది ద్వారా తన అత్తవారి ఇంటికి పంపెను. ఆ మరుసటిదినమే హులసీమాత స్వర్గధామ మలంకరించెను. చునియా దాదియే ఆబిడ్డను సాకుకొనుచుండెను. బిడ్డకు 5½ సంవత్సరములు కాగనే దాది మరణించెను. ఆబిడ్డ దిక్కుమాలినవాడై ఇంటింట బిచ్చమెత్తుకొన దొడంగెను. దయామయురాలగు జగజ్జనని పార్వతి ఆబిడ్డకడకు ప్రతిదినము ఒక బ్రాహ్మణి స్త్రీ వేషమున వచ్చి భోజనమిడి చనుచుండెను.

రామశైలముపై శ్రీ అనంతాచార్యుని ప్రియశిష్యుడగు శ్రీ నరహర్యానందు డుండెడువాడు. శ్రీ పరమశివుని ప్రేరణచే అత డీ

బాలునికొఱకు వెదకికొనుచువచ్చి, తన సంర క్షణక్రింద ఉంచుకొనెను. నరహరిదాసు బాలుని అయోధ్యకు కొనివచ్చి వి॥ శ॥ 1561 మాఘ శుద్ధ పంచమీ శుక్రవారము అతనికి ఉపనయ నము కావించెను. చెప్పకమున్నే గాయత్రీ మంత్రమును బాలు డుచ్చరించుట చూచి జను లాశ్చర్యపడిరి. నరహరిదాసు బాలునకు 'రామ బోలా' అను నామమిడెను. రామబోలాకు నర హరిదాసు వైష్ణవరీతిని రామమంత్రోపదేశము చేసెను. రామబోలాకు విద్యాధ్యయనము ప్రారంభమయ్యెను. ఒక్కమారు గురువునోటి నుండి వెలువడుటతోడనే శిష్యుడు వానినెల్ల కంఠస్థము కావించుకొనెడివాడు. అటనుండి గురుశిష్యు లిరువురును సూకరక్షేత్రమునకు వెడలిరి. సూ క ర క్షే త్ర ము న గురువాతనికి రామాయణము వినిపించెను.

పిమ్మట తులసీదాసు కాశికివచ్చి సనాతనజీ వద్ద 15 సంవత్సరములలో వేదవేదాంగముల నెల్ల ముగించెను. విద్యాగురువునొద్ద సెలవు గైకొని స్వగ్రామముచేరెను. అట తండ్రి బంధువులెల్లరును అప్పటికే చనిపోయియుండిరి. తండ్రికి శ్రాద్ధముపెట్టి రామాయణ కాలక్షే పము చేయుచుండెను.

ఇప్పటికే తులసీదాసునకు కొంత ప్రపంచ వాసనలందు రుచి కలిగెను. వి॥శ॥ 1583 జ్యేష్ఠ శుద్ధ త్రయోదశి గురువారము భారద్వాజస గోత్రురాలగు ఒక కన్యను వివాహమాడి ఆమెతో సుఖముగా జీవించుచుండెను. ఒకనాడు తులసీదాసునితో చెప్పకుండ ఆతనిభార్య తన సోదరునితో పుట్టింటికి వెడలెను. భార్యపై అత్యంత మమతకలవాడగుటచే వెంటనే బయలు దేరి భార్యను చేరుకొనెను. అంత నామె తీక్ష ణముగ "ఈ రక్త మాంస కల్పితమగు దేహ మున్పై నీకెందుల కింతటి మక్కువ? ఇందులో అర్ధభాగము భగవంతునిపై రక్తియుండెనేని నీవుతప్పక సంసారసాగరమును తరింపగలవు" అనెను. ఈ మాటలు సూటిగ హృదయతంతు వుల కదలింప తక్షణమే తులసీదాసు ఇలు వీడెను. ప్రయాగచేరి అట సన్న్యసించి, తీర్థా టనముచేయుచు కాశిచేరెను. వానికి మానస సరోవరమందు కాక భుశుండుని దర్శనభాగ్యము లభించెను.

కాశిలో తులసీదాసు రామాయణముచెప్ప నారంభించెను. అటనుండ వాని కొకనాఁడొక దయ్యము కనిపించి హనుమంతునిజాడ తెలి పెను. తులసీదాసు హనుమంతుని కనుగొని తనకు శ్రీరఘునాథునిదర్శనము కల్గునట్లొనర్పు మని ప్రార్థించెను. "నీకు చిత్రకూటమునొద్ద శ్రీరాముని దర్శనము కలుగగల"దని హను మంతుడు చెప్పి అంతర్ధానముకాగా తులసీదాసు చిత్రకూటమునకు పయనించెను.

చిత్రకూటముచేరి రామఘట్టమున నివసింప దొడంగెను. ఒకదినము ప్రదక్షిణముచేయుచుం డగా మార్గమధ్యమున శ్రీరాముని దర్శనము లభించెను. నిరుపమ సుందరులగు నిద్దరు రాజ కుమారులు ధనుర్బాణములగైకొని గుఱ్ఱములపై పోవుచుండిరి. తులసీదాసు వారి అపూర్వ సౌందర్యమునకు ముగ్ధుడయ్యెనేకాని వారిని సాక్షాత్ రామలక్ష్మణులని గుర్తింపజాలడాయె. వెనువెంటనే హనుమంతుడు వచ్చి తెలుపగా తులసీదాసు మిగుల చింతించెను. "మరల నీ కొక ప్రాతఃకాలమున శ్రీభగవానునిదర్శనము కలుగగలదని" ఊరడించి వెడలెను.

వి॥ శ॥ 1607 మీన అమావాస్య బుధ వారము శ్రీరామచంద్రుడుచిన్న బాలుని రూప మున వచ్చి తులసీదాసుని గంధమడిగెను. ఈ

మారుకూడ తులసీదాసు మోసపోవునేమో అని భయపడి వెంటనే హనుమంతు డొక చిలక రూపమునవచ్చి చెట్టుపైకెక్కి శ్రీవారి రాకను ఎఱుకపగచెను.

"చిత్రకూటకే ఘటపర్ భయిసంతన్ కీ భీర్
తులసీదాస చందనఘిసే తిలకదేత రఘువీర"

తులసీదాసు భగవానుని కన్నులార కనుంగొని ఆనందసముద్రమున నోలలాడెను. శ్రీ భగవానుడు తన చేతితో గంధముతీసికొని తన నుదుట పెట్టుకొని పిమ్మట తులసీదాసుని నుదుట నుంచి అంతర్ధానమయ్యెను.

వి॥శ॥ 1628 తులసీదాసు శ్రీ హనుమంతుని అదేశానుసారము అయోధ్యవైపు పయనించెను. ప్రయాగలో మాఘమేళ జరుగుచుండెను. అచట కొన్ని దినములుండెను. మాఘమేళ జరిగిన ఆరు దినముల తర్వాత తులసీదాసునకు యాజ్ఞవల్క్య, భరద్వాజమునుల దర్శనము లభించెను. అచటనంత నతనికి తాను సూకరక్షేత్రములో తన గురువు చెప్పిన రామాయణము మరల వినబడెను.

కాశికివెళ్లి ప్రహ్లాదఘట్టమునొద్ద ఒక బ్రాహ్మణుని ఇంట నివసింప దొడంగెను. వానికి కవిత్వధోరణి స్ఫురింపగా నతడు సంస్కృతమున పద్యములు వ్రాయనారంభించెను. పగలు వ్రాయుపద్యములెల్లను రాత్రులందు మాయమగుచుండెను. ఇట్లొక వారముదినములు గడచెను. ఎనిమిదవనాడు తులసీదాసునకు శ్రీ పరమశివుడు స్వప్నమందు కనిపించి "నీ స్వభాషలో పద్యరచన కావింపు"మని ఆజ్ఞ ఇడెను. వెంటనే తులసీదాసు నిద్రమేల్కాంచి, లేచి కూర్చుండెను. పార్వతీపరమేశ్వరు లిరువురును ప్రత్యక్షమైరి. తులసీదాసు వారలకు సాష్టాంగ ప్రణామమాచరింప శివుడు "నీవు అయోధ్యకు వెడలి అవధిలో (హిందీభాషలో చేరినభాషయో అయోధ్యలో వాడుకభాష) కావ్యము రచింపుము. నా ఆశీర్వాదఫలమున ఆకృతి సామవేదమువలె ఉపయోగపడగలదు". శివుని ఆశిరసావహించి తులసీదాసు కాశీవీడి అయోధ్యకు వెడలెను.

త్రేతాయుగమున శ్రీరామజన్మదినమందెట్టి యోగముండెనో, అదేయోగము వి॥ శ॥ 1631 శ్రీరామనవమిరోజున నుండెను. అట్టి శుభదిన ప్రాతఃకాలమున తులసీదాసు రామాయణము వ్రాయ ప్రారంభించెను. వి॥శ॥ 1633 మార్గశీర్ష శుక్లపక్షమునకు అనగా 2 సంవత్సరములా, ఏడుమాసముల 26 దినములకు శ్రీ రామకల్యాణమహోత్సవ దివసమునకు సప్త కాండలతో రామాయణరచన సంపూర్ణమాయెను.

తర్వాత భగవదాజ్ఞానుసారము తులసీదాసు కాశికివెళ్ళి అన్నపూర్ణా విశ్వనాథులకు తన కృతిని వినిపించెను. రాత్రి పుస్తకమును ఆలయమందేయుంచి వెడలెను. ఉదయమునవచ్చి పుస్తకము తెరువగా దానిపై 'సత్యం, శివం, సుందరం' అని వ్రాయబడి, క్రింద శ్రీశంకరుని దస్తూరి యుండెను. ఆలయమంతయు సత్యం, శివం, సుందరం అను శబ్దముతో మారు మ్రోగెను.

ఒక పండితుని పొగడిన వేరొకపండితునికి ఈర్ష్యకల్గుట స్వాభావికమే కదా! పండితులందరును ఒక కట్టు అయి తులసీదాసును నిందింపదొడంగిరి. పుస్తకము (రామాయణము) ను నాశనమొనర్ప సమకట్టిరి. ఒకనాటి రేయి యిద్దర దొంగలను ప్రోత్సహించి పుస్తకమును దొంగిలించుక రమ్మని పంపిరి. కాని

తులసీదాసుని కుటీరసమీపమున కేగుసరి. ఆ ప్రాంతమును ఇద్దరు యోధులు ధనుర్బాణముల చేతనిడుకొని ఆకుటీరమును కాపుదల చేయుచుండిరి. వారిలో నొకరు శ్యామవర్ణము వేరొకరు గౌరవర్ణము. ఆ దివ్యరూపుల చూచుటతోడనే దొంగలబుద్ధి మారిపోయి, వారు తమవృత్తిని మానివేసి భగవద్భక్తులుగ మారిరి. ఈవిషయము తర్వాత తులసీదాసునకు తెలిసెను. తనవలన భగవంతునకు ఇంతటి కష్టము కల్గెనని చింతించి తన కుటీరములోని యితర వస్తువుల నన్నింటిని వదలివైచి, రామాయణమునుమాత్రము తన మిత్రుడగు తోడరుమల్లు (అక్బరుపాదుషా మంత్రి) వద్ద ఉంచెను. తోడరుమల్లు రామాయణప్రతుల నెన్నో వ్రాయించెను. నలుదిశల రామాయణఖ్యాతి వ్యాపించెను.

ఇటపండితులెన్నియో మాయోపాయములు పన్నినను అన్నియు వ్యర్థములుకాగా తుదకు వారు రామాయణమును శ్రీ మధుసూదన సరస్వతీ పండితులకు పంపి వానిని విమర్శింప ప్రార్థించిరి. శ్రీ మధుసూదనులు ఆపుస్తకము చదివి ఆనందపరవశులై తన అభిప్రాయమును ఈ క్రిందివిధముగ ఆపుస్తకముపై వ్రాసిరి.

''ఆనందకాననే హ్యాస్మిన్ జంగమ స్తులసీతరుః
కవితామంజరీభాతి రామ భ్రమర భూషితా॥''

(ఈ కాశీ అనెడి ఆనందవనమున తులసీదాసు పెరుగుచున్నట్టి తులసిమొక్క. వాని కవిత్వ మంజరి కడు సుందరమైనది, దానిపై శ్రీరాముడనెడి భ్రమరము తిరుగుచున్నది).

పండితులందఱును సంతుష్టులు కాలేదు. వారు కడకు వేరొక పరీక్ష చేయదలంచిరి. శ్రీ విశ్వనాథాలయమున భగవంతుని సమక్షమున వేదశాస్త్రపురాణముల కన్నింటిక్రింద శ్రీతులసీ రామాయణము నుంచి ఆలయమును మూసిరి. ప్రాతఃకాలమున ఆలయము తెఱచి చూచుసరికి వేదశాస్త్రపురాణము లన్నింటిపైన తులసీ రామాయణము పెట్టబడియుండెను. ఇక పండితులు చేయునదిలేక లజ్జతో తలలువంచిరి. వారు తులసీదాసుని పాదములపై సాగిలబడి తమ్ము క్షమింప ప్రార్థించిరి.

తులసీదాసు అసీఘట్టమువద్ద నివసింప దొడంగెను. ఒకనాటిరేయి కలిపురుషుడు దేహము దాల్చి తులసీదాసునొద్దకు వచ్చి వానిని బాధింప దొడంగెను. గోస్వామిజీ హనుమంతుని ప్రార్థించెను. హనుమంతుడు తులసీదాసును వినయ (ప్రార్థన) గీతికల వ్రాయుమని చెప్పి వెడలెను. తులసీదాసు అంత 'వినయపత్రిక' రచించి భగవానుని చరణముల కంకితము చేసెను. శ్రీరామచంద్రుడు 'వినయపత్రిక'పై తన దస్తూరిచేసి తులసీదాసునకు అభయహస్త మిడెను.

వి॥ శ॥ 1680 శ్రావణ బహుళ తదియ శనివారమున అస్సీఘట్టమందు గోస్వామి తులసీదాసు రామనామమును జపించుచు భౌతిక దేహము వీడెను. మహాత్ముల జీవితములు చిర స్మరణీయములు కదా !



# శ్రీకృష్ణదేవరాయలు - సంగీతప్రయోజనము

శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు, ఎమ్. ఏ.

సంగీతప్రయోజనమునకు ఆముక్తమాల్యద లోని మాలదాసరికథ చక్కని నిదర్శనము. పాడియే గదా ఆ దాసరి భగవదనుగ్రహమును పొంది దాన బ్రహ్మరక్షస్సునకు మోక్ష మొసంగినాఁడు......పాడు మము లాలస మంగళ నామ కైశికిన్', ఆశ్వా 6-3.

మంగళకైశికిరాగము 15 వ మేళకర్తది. సరిగమప – సనిధపమగరిస. మూలగ్రంథము లోని కథతో సంబంధము లేకపోయినను రాయలవారు ప్రయత్నపూర్వకముగా చేర్చినట్లున్నది ఈ కథ. పైగా మాలదాసరి గుడిలోనికి పోరాని వాఁడు. అర్చాబింబము ఎట్లుండునో ఎఱుంగఁడు. మఱి వానికి ధ్యానము కుదురుటకు ఎదుట ఏమియు లేదు. వానికి గలది గోపురదర్శనమును భగవద్భక్తుల దర్శనమును మాత్రమే. మఱి సంగీతమే వానికి ఏకాగ్రత నొసంగినది. దానిని రాయలవా రిట్లు హృద్యముగా వర్ణించినారు ఆశ్వా 6-7.

'గం డాభోగముల న్మదశ్రు లహరు
  ల్గప్ప న్నుతు ల్పాడి, యా
దండ న్వ్రేగులు డించి భక్తి జని తో
  ద్యత్తాండవం బాడు నా చండా
లేతర శీలుఁ డుత్పులకుఁడై
  చాండాలిక స్మిటుచున్
గుండు ల్నీరుగ నెండ గాలి పసితాఁ
  కం జూడ కాప్రాహ్ణముల్',

'జాతిచేత చండాలుఁడైనను ఉత్తమోత్తములయొక్క యాచారమందు ఉన్నట్టి యీ దాసరి ప్రతిదినము తన బరువులు ఆ చెంతను దింపి ఎండను గాలిని ఆఁకటిని తలంపక మధ్యాహ్నమువఱకు ఒడ లంతయు గగుర్పొడుచుండఁగా, రాలు గరఁగునట్లు, తన చండాలవీణను వాయించుచు, ఆనందబాష్పములు చెక్కిళ్లను నిండుగా కమ్ముచుండఁగా, నా స్తోత్రములు పాడి భక్త్యుద్రేకముతో తాండవమాడును... ...గుండు ల్నీరుగన్ – లోకోక్తి – శ్రోతలకు గానరస మెఱుఁగని వారికి సైతము అపరిమితానందము కలుగు నట్లుగా' సంజీవని.

మాలదాసరియందు రాయలవారి కెట్టి గౌరవమో బ్రహ్మరాక్షసుఁడు దాసరిం గూర్చి చెప్పెడి పద్యమువలన తెలియును. తమమెచ్చుకోలునే పాత్రభాషితముగా వచించినారు. ఆశ్వా 6-49.

'ఇతరులు నీకు నీడె మఱి?
  యీ ధృతి, నీస్మృతి, నీ బు తేరిత
స్థితగతి, నీ మురారి పద
  సేవన జీవనవ న్మతిన్, సమా
దృత కల గాన సింధు లహ
  రీ ప్లవన ప్లవ భావ భా గురు
శ్రుతి తత బద్ధ తుంబికిఁ గు
  రుంగుడి నంబి కృపావలంబికిన్'

'నీవు మధురము లయిన హరిస్తోత్ర గాన

సముద్రపు టలలను దివ్యనాదప్రదముగా తుంబి కట్టిన నీ వీణయనెడి తెప్పచే దాఁటుచున్నావు; కురుంగుడి భగవంతుని కరుణ నీకు పట్టుగొమ్మగా నున్నది; అట్టి నీకు ఈ ధైర్యమందు ఈ జ్ఞప్తి యందు, ఈమాట నిలుకడయందు శ్రీహరి సేవనమే పరాయణ మైన యీ బుద్ధియందును సాటి యెవ్వరును లేరు'. సంజీవని.

సంగీతప్రయోజనమును ఇంత కన్న చక్కఁగా చెప్పిన యాంధ్రుఁడు అన్యుఁ డెవఁడు? ఆ సంగీత ఫలంబున కొంత బ్రహ్మరక్షస్సు యాచించుట ఎటువంటి నాస్తికునిగూడ భాగవతుని చేయఁ జాలి యున్నది. ఆశ్వా 6–64.

'సంగీతఫలంబునఁగో
సంగీ సగమైనఁ దయ వొసఁగనీవే; మిన్కా
మ్రింగిన గ్రుక్క న్వారిధి
కిం గొఱఁతయె? కొదయె విష్ణుకీర్తన కనినన్'

'ఓయి దాసరీ, చేఁప మ్రింగిన గ్రుక్కెడు నీటిచే సముద్రము తక్కువపడ నట్లు ఏకదినగీత ఫలములో సగము నాకిచ్చుటచే నీ యపార హరికీర్తన ఫలము తగ్గదు; కావున దయచేసి నే నడిగిన దినగీతఫలార్ధమును నాకు ఒసంగుము'.

తర్వాతి వచనమున "...... 'కలుష రహిత కాయంబునంగాని కల్యాణంబు లబ్ధంబు గాదు, గాఁబట్టి యి వ్వికృప విగ్రహం బను గ్రహంబున నుడిపి కృతార్థుం జేయు, మని పాదంబుల వ్రాలి 'పాటం బాతిక పా లేని యీవే' యనిన నతం, 'డదియును నీలే'నన్నఁ 'బోని మిన్న ప్రభాత సమయంబునం బాడిన చరమగీతం బైన నిచ్చి ప్రపన్నుండ నగు నన్నవిపన్నుం జేయు' మని లేవ కున్నం, బరమ దయార్ద్రుండై, 'యట్ల కానిమ్ము, లె'మ్మని యతని లేవ నెత్తి..."

బ్రహ్మరాక్షసుండు తన కథయంతయుం జెప్పుకొనిన వెనుక మరల 'కైశికీ గాన ఫల దానంబున దీని మానుపవే?' అనిన నతం డేను ఫలం బెఱుంగ, ఫలంబు పరమేశ ముఖోల్లాసంబ, యాజ్ఞాకైంకర్యంబులకు ఫల పరిమాణ గణన ప్రపన్నుల కెక్కడియది? కాన బంధకం బగుట ఫలం బిం తంత యందుఁ గొంతఁ గొమ్మన వెఱతు, భగవంతుండ రక్షించు, నూఱడిలు, మన్న న న్నొరి మాట నోరన యుండ నతండు' '...వైష్ణవుఁడై నిల్చె సోమశర్మ'.

'ఇట్లు భాగవతపరిచయప్రభావంబున బ్రాహ్మణ్యంబె కాక భాగవతశ్రీయునుం గలిగె'.

వీనిచే భాగవతప్రభావమును సంగీతప్రయోజనమును ఆ ప్రభువు నిరూపించిన విధము అనిర్వచనీయము.

. గ్రంథమందలి ఈభాగముల మీఁద సంజీవనీ వ్యాఖ్య పీఠికలో గ్రంథగుణములను భాగమున ఇట్లున్నది: '...మాలదాసరియొక్క చిత్తశుద్ధి, స్థిరభక్తి, జ్ఞానమహిమ, జ్ఞానబోధము, అతఁడు అనుగ్రహించిన మాత్రాన బ్రహ్మరక్షస్సునకు వైష్ణవోత్తమత్వము కలుగుట... ...భగవ దనుగ్రహమునకు భక్తిప్రధానము గాని జాతిప్రధానము గాదు, అని మాలదాసరి కథవలని బోధ. ...... ఈకవికి ... సంగీత–తర్క – తంత్ర – జ్యోతిష – ధర్మశాస్త్రస్పర్శ కలదు. కర్మార – కళాద – కర్మపరిశీలనమును– స్వప్నశాస్త్ర పరిజ్ఞానమును గలవు'. 'వీరికి ఔపనిషద విద్య కరతలామలక' మని సంజీవని. సామగానమును గుఱించి—

'నీరంధ్ర కుసుమధారా
సారచ్ఛర చంచరీక సంకుల కుల ఝుం
కారానుకారి సంస్తవ
కారి మునిస్తోమ సామగానం బెసఁగెన్'.

సామగానము తుమ్మెదల ఝుంకారమునకు అనుకరణమువలె నుండిన దట.

రాయలవారు సామగానశ్రవణముతో మాత్రమే తృప్తిపడి ఊరకున్నవారు కారు. వైదిక రహస్యములనుకూడ గ్రహించియుండిరి. వారు ఆరణ్యకములను విన్న వారు. ఆ 4-79.

'ఉర్విఁ గాదంబినుల యల యుమ్మనీరు
దొరుఁగఁ గేకులు కేకలు తోన నేసె,
ద్విజత నారణ్యక ధ్వని వినఁగఁ జేసి
గర్భము సుఖచ్యుతము సేయఁ గడఁగె
నవఁగ'

'భూమిమీఁదికి మేఘపంక్తులయొక్క ఉబ్బనీరు (ప్రసవజలము) స్రవించినవెంటనే, నెమళ్లు ద్విజతన్ (తాము బ్రాహ్మణు లగుటవలన, పక్షులగుటవలన) ఆరణ్యక ధ్వనిని, ఆరణ్యకము లనెడి వేదభాగముయొక్క శబ్దమును వినిపించి. కాదంబినులయొక్క గర్భమును (అనఁగా వృష్టిని) సుఖముగా జాఱినదానినిగా చేయుటకు ఆరంభించెనో యను నట్లు, వెంటనే కూయం దొడంగినవి' '...అరణ్యమందు అధ్యయనము సేయ వలసిన దగుటచేత ఆరణ్యకమనఁబడును. దీనిని ఇంటిలో చెప్పరు. ఏల యన దీనిని విను గర్భిణులకు గర్భస్రావ మగును. ప్రసవసమయ మందు స్త్రీ వినునట్లుగా దీనిని పఠించిన సుఖ ప్రసవ మగును. ప్రసవమే కాక, నొప్పులే పడు చున్నను, అప్పుడు బ్రాహ్మణులు దీనిం బఠింతురు. దీనిని వినుటచేత శీఘ్రమే సుఖ ప్రసవ మగును'. సంజీవని.

సంగీతమునకు ఇంతటిశక్తి గల దని దాని ప్రయోజనమును ఆముక్తమాల్యదాప్రబంధమున నాంధ్రలోకమునకు చాటిన రాయల వారిని వారితో నిరంతరము ఇష్టాగోష్ఠిలో మెలఁగుచు ఒకమనస్సుగా నుండిన అష్టదిగ్గజములను తదితరవిద్వాంసులను విద్యావంతులను కళావంతులను మఱువఁ గలమా?

## గోవిందనామకీర్తన మహిమ

[బమ్మెర పోతరాజు]

కౌరవేశ్వర, తొల్లి ఖట్వాంగుఁ డను విభుం డిల నేడు దీవుల నేలుచుండి,
శక్రాది దివిజులు సంగ్రామభూముల నుగ్రదానవులకు నోడి వచ్చి
తమకుఁ దో డడిగిన, ధరనుండి దివి కేఁగి, దానవవిభుల నందఱ వధింప,
'వర మిత్తు' మనుచు దేవతలు సంభాషింప, 'జీవితకాలంబు సెప్పుఁ, డిదియ
వరము నాకు, నొండు వర మొల్ల' ననవుడు 'నాయు వొక ముహూర్త మంత దడవు
గల' దటంచుఁ బలుక, గగనయానమున న య్మానవేశ్వరుండు మహికి వచ్చి॥ ౧
గిరులం బోలెడి కరులను, హరులం, దన ప్రాణదయితలై మనియెడి సుం
దరులను, హితవరులను, బుధవరులను - వర్జించి గాఢవైరాగ్యమునన్॥ ౨
గోవింద నామ కీర్తన గావించి, భయంబు దక్కి, ఖట్వాంగ ధరి
త్రీవిభుఁడు నూఱఁగొనియెను గైవల్యముఁ, దొల్లి రెండు గడియలలోనన్॥ 3

# వార్తలు, విశేషాలు

## శ్రీ రాఘవానందస్వాముల నిర్యాణం

బేలూరుమఠంలో 1957-వ సంవత్సరం జూన్ తే 10 ది శ్రీరాఘువానందస్వాములు మహాసమాధి నొందినారు.

కలకత్తా ప్రెసిడెన్సికాలేజీలో వీరి విద్యార్థి దశ మహోజ్జ్వలంగా సాగింది. విద్యార్థిగ ఉన్నప్పుడే ఈయన శ్రీరామకృష్ణకథామృత రచయిత యైన శ్రీమహేంద్రనాథగుప్తతో పరిచయభాగ్యం లభించి, బేలూరి మఠానికి తఱచు రావడం శ్రీరామకృష్ణుని సాక్షాచ్ఛిష్యులలో పెక్కండ్రతో కలిసికోవడం ప్రారంభించాడు. ఎమ్.ఏ. పట్టము నొంది 'లా' పరీక్షలలో కూడ నెగ్గిన తర్వాత ఈయన తన 25 వ ఏట 1913 లో మదరాసు మఠంలో చేరాడు. శ్రీబ్రహ్మానందస్వామి ఈయన కప్పుడు మంత్రోపదేశం చేయడమే కాక 1918 లో సన్న్యాసదీక్ష ప్రసాదించారు. 1913 లో ఈయన మాయవతిలోని అద్వైతాశ్రమంలో 'ప్రబుద్ధభారత' పత్రికాకార్యంలో శ్రీప్రజ్ఞానందస్వామికి సాహాయ్యులుగా పని ప్రారంభించారు, ఆల్మోరాలో శ్రీతురీయానందస్వామికి కొన్నాళ్లు తోడ్పడ్డారు, తర్వాత కొంతకాలం శ్యామలాతల్ లో శ్రీవిరజానందస్వామికి శ్రీవివేకానందస్వామి జీవితచరిత్రను తయారు చేయడంలో సాయపడ్డారు. శ్రీప్రజ్ఞానంద స్వామి నిర్యాణానంతరం 1918 లో ఈయన ప్రబుద్ధభారతపత్రికకు సంపాదకత్వం వహించారు. హిమాలయాలలో ఉండగా ఈయన కైలాసం మానససరస్సు కేదారనాథం బదరీనాథం మొదలైన స్థలాలకు యాత్రలుచేశారు.

1923 లో న్యూయార్కు వేదాంత కేంద్రాధిపతులైన శ్రీ బోధానందస్వామికి సాహాయ్యం చేయడానికై ఈయన యూరపు మీదుగా అమెరికాసంయుక్తరాష్ట్రాలకు చేరుకొని, నాలుగేండ్ల పాటు అక్కడ వేదాంత ప్రచారం చేశారు. తర్వాత భారతదేశానికి మరలి వచ్చారు. కొన్నాళ్లు శ్రీమహేంద్రనాథ గుప్తతో ఉండి, ఆధ్యాత్మిక సాధనలకై మళ్లా హిమాలయాలకు పోయ్యారు. తర్వాత కొంత కాలం అలహాబాద్ - పూరీ కేంద్రాలలోను, కలకతా గదాధరాశ్రమంలోను పని చేసి మరల సాధనలకై హిమాలయాలకు పొయ్యారు. గర్వాలు జిల్లాలో ఉండగా ఆరోగ్యం చెడి, బేలూరుమఠానికి మరల వలసి వచ్చింది. 1954 వ సంవత్సరంలో ఆయనకు 'అంగవికార రోగం' (అపాప్లెక్సి) తొలి దెబ్బ తగిలింది. అదే సంవత్సరం అక్టోబరులో రెండవమారున్ను ఈ సంవత్సరం ఏప్రిలులో మూడవ మారున్ను ఆయనకు దాని తాకుడు గలిగింది. మూడవ సారి ఇక లేవ లేక మంచం పట్టారు. జూన్ తే 10 ది సాయంకాలం పుఱ్ఱెలో నెత్తురు గడ్డ కట్టుకపోవడం (సెరెబ్రెల్ త్రాంబాసిస్) అనే వ్యాధిచే ఈయన 8-33 గంట లప్పుడు శరీరం చాలించారు. వయస్సు 69. శ్రీరామకృష్ణ సంఘ అనుభవశాలి యశస్సంపన్నుడు ఐన ఒక సాధువును కోల్పోయింది.

## శ్రీరామకృష్ణమిషన్ ఆశ్రమం, బొంబాయి

తే 27-1-1957 ది ఆదివారం కేంద్రోపాధ్యక్షు లైన శ్రీమద్విశుద్ధానందస్వాములు మాతృశ్రీ స్మారక భవన ప్రారంభ మంగళోత్సవం జరిపారు. వారు అనుగ్రహించిన ఉపన్యాస సారం—

మాతృశ్రీ శతతమ జయంతి మహోత్సవం ఆసియా ఖండంలో ఇండియా బర్మా సిలోన్ మలయా దేశాలలోను, యూరపు అమెరికా ఖండాలలోను కొనియాడబడింది. మన ప్రజల యొక్క దేశంయొక్క మతచరిత్రలో ఇది ప్రకృత యుగ చిహ్నం.........శ్రీ ఎస్.ఎన్. డేగారు ఇచ్చిన విరాళంతో నిర్మిత మైన ఈ భవనం ప్రశంసార్హం. మాతృశ్రీని వర్ణించడం మాటలకు సాధ్యం కాదు. ఆమెలో ఉన్నత తమ భారతీయ మహిళాలక్ష్యాలు రూపు దాల్చాయి. ఆమెను శ్రీరామకృష్ణుడు 'శక్తి' అన్నాడు...... శ్రీవివేకానందస్వామికి బలోత్సాహప్రదాయిని ఆమెయే''.

మన మఠానికిన్నీ మిషనుకున్నూ ఉన్న స్వరూపవిభేదం తెలియక చాలమంది తికమక పడుతుంటారు. 'వైరాగ్య'నిలయం మఠం. నిస్స్వార్థసేవాకేంద్రం మిషను... ఆ వైరాగ్యం ఆత్మ ... ఈ సేవ శరీరం .... కాబట్టి మఠానికీ మిషనుకు ఆత్మకూ శరీరానికి ఉన్న సంబంధం లాంటి సంబంధము.........ఉభయమున్నూ, బహుజనహితమును బహుజన సుఖమును బోధిస్తాయి''.

## శ్రీరామకృష్ణమఠ ధర్మవైద్యశాల - మదరాసు 1956-వ సంవత్సర నివేదిక

ఈ ధర్మవైద్యశాలకు ఇప్పటికి ముప్పైయవ సంవత్సరం పూర్తి ఐంది.

ఈ సంవత్సరం మాతృశ్రీ శతతమ జయంతి స్మారకంగా ఒక లక్షరూపాయల వ్యయంతో ధర్మవైద్యశాలలో క్రొత్తకట్టడం నిర్మితమైంది. 1956 డిసంబరులో నూత్నభవనాన్ని కేంద్రోపాధ్యక్షులు శ్రీమద్విశుద్ధానందస్వాములు ఆవిష్కరించారు. వైద్యశాలలో ఉన్న శాఖలు కాక క్రొత్తగా 'నేత్ర' 'శ్రోత్ర' 'ఘ్రాణ' 'కంఠ' 'శస్త్ర' చికిత్సా శాఖలు స్థాపింపబడ్డాయి. ఎక్స్‌రే శాఖ త్వరలో చేర్పబడుతుంది.

ఆలోపాతిక్ హొమ్యోపాతిక్ శాఖలలో కలిసి చికిత్స పొందిన రోగుల సంఖ్య 1955 లో 1,10,403; 1956 లో 1,21,291.

1953 లో ప్రారంభింపబడ్డ 'దంత' శాఖయు లాబొరేటరియు చురుకుగా పని చేశాయి. ఈ సంవత్సరం పోషణ చాలని స్త్రీలకు శిశువులకు 28,624 మందికి పాలు పంచిపెట్టబడింది.

వైద్యశాలకు వచ్చుబడికంటె వ్యయం ఎక్కువగానే ఉంటూ ఉంది. నైకం చాలక సేవాకార్యాన్ని తగ్గించవలసి వస్తూ ఉంది. నెలకు వెయ్యిరూపాయల ఆదాయం ఇచ్చే మాన్యం జరూరు. ఉదారమహాజనులు మానవసేవారూప మైన యీమాధవసేవకుచేయూత ఇవ్వాలి—

**స్వామి రామకృష్ణానందజీ మహారాజుల తొంభైనాలుగో జయంతి తిథిపూజ హోమ సంతర్పణలు తే 25-7-57 ది. బహిరంగసభ తే 28-7-57 ది ఆదివారం.**

# గ్రంథసమీక్ష

## శంకరాచార్య సదుపదేశాలు

రచన: శ్రీ కేశవతీర్థస్వామి, ప్రాప్తిస్థానము: శ్రీరామతీర్థసేవాశ్రమము, పిడుగురాల; గుంటూరు జిల్లా; (ఆంధ్ర). పుటలు 113. వెల 0-8-0.

ఇది మధుర రసమయమైన ఒక చిన్న ద్రాక్షాఫల గుళుచ్ఛము. హృదయంగమమైన గ్రామ్యశైలితో నిండిన ఈ చిన్ని పుస్తకము చదువుచున్నపుడు, ఆ శంకరుఁడే వచ్చి మన కండ్లఎదుట నిల్చి, హితముగా – ప్రియముగా – సత్యముగా – మాటలాడుచు, అద్వైతామృతమును మనచే కడుపార కుడిపించునట్లు దోచును. ఇందు మొదటి 38 పుటలలో శంకరుని బాల్యమును గుఱించి – ఆ మహనీయుని తత్త్వమును గుఱించి సంక్షిప్తముగా వ్రాయబడియున్నది. శంకరతత్త్వమును విమర్శించువారలకు చక్కని సమాధానము లొసంగఁబడినవి. శంకరుని, హృదయంలేని నిర్దయుఁడనికొందఱనుచున్నారు. దానికి గ్రంథకర్త సమాధానమిచ్చుచు, "బుద్ధుని ఆస్తికతను, శంకరుని దయను అర్థం చేసికోవడం చాలాకష్టమే: అవి అతీతస్థితిని అలంకరించిన విషయాలు" అని అనుచు, విపులీకరించి, విమర్శకులకు విజ్ఞానమును గలిగించుచున్నాడు. ఇంకను ఈ ఉపోద్ఘాతమునందే,— ఉత్కృష్ట మానవుడు సోదరమానవుని రక్తమాంసములకై వెంటాడుచు, ఒకరింజంపి, పదస్థులై బ్రదుక వేతెఱఁకరు జూచుచు, దేశమును మారణహోమమున కాలవాలముజేసెడి ఈ అణుశక్తియుగములో, — లోక కళ్యాణమునకు హేతుభూతమైన శంకరుని అద్వైత తత్త్వప్రాముఖ్యమును, ఈ గ్రంథకర్త, ఉద్ఘోషించుచున్నాడు.

తరువాతి 75 పేజీలలో శంకరుని భజగోవిందశ్లోకములను, తదితర శ్లోకములను, సరళమైన గ్రామ్యభాషలో ఆంధ్రీకరించి, శంకరుని అద్వైతసారమునంతను, ఈ చిన్ని పుస్తకములో పొందుపఱచెననుటలో అతిశయోక్తి లేదు.

ఉదాహరణమున కొక శ్లోకమును దిఙ్మాత్రముగా నిట నుటంకించెదను.

నాహం దేహో నేన్ద్రియాణ్యాన్తరంగం<br>
నాహంకారః ప్రాణవర్గో నబుద్ధిః<br>
దారాపత్య క్షేత్ర విత్తాది దూర<br>
స్సాక్షీనిత్యః ప్రత్యగాత్మా శివోహమ్॥

అని మూలము.

"నేను శరీరాన్నిగాను, ఇంద్రియాలనుగాను, అహంకారాన్నిగాను, పంచప్రాణాలనుగాను, బుద్ధినిగాను, పుత్ర కళత్ర విత్తాలనుగాను.

సాక్షి, నిత్యుఁడూ, ప్రత్యగాత్మ ఐన శివుఁడను నేను! శివోహం".

ఇట్లే అలతి అలతి వాక్యములతో, సకలజన గ్రాహ్యమగు శైలిలో, రచించుటయేగాక, ఆధ్యాత్మికరంగములోనేగాక, ఆంధ్రవాఙ్మయ రంగమునఁగూడ, విశృంఖలముగా వీరవిహారమును సలిపినాడు ఈ గ్రంథకర్త.

శ్రీ కేశవతీర్థస్వాములవారి "శంకరాచార్య సదుపదేశాలు" అను తీర్థమును ప్రతివారు గ్రహించి, ధన్యులగుదురుగాక!

## శాంతి గీత

రచయిత: శ్రీ శేషి. ప్రాప్తిస్థానము: సరససాహితి, ఆలపాడు – గుంటూరు జిల్లా. వెల: రెండు అణాలు. పుటలు: 20.

మానవకోటిలో ద్వేషము – అసూయ – మున్నగునవి పెరిగి, అశాంతి అధికమగుచున్నది. కావున మానవుఁడు "శాంతికోఱకై తహ తహ పడుచున్నాడు. ఆగమశాస్త్రములన్నియు చదివిన, వేదాది విద్యలన్నియు పఠించిన, శాంతములేక సౌఖ్యములేదుగదా! అట్టి "నిజమైన శాంతిఏది?" అనుదానికి ఈ గ్రంథకర్త భగవద్గీతలోని శాంతికి అనుకూలమైన కొన్ని శ్లోకములను గ్రహించి, తెనుగున అనువదించినాడు.

అఖండం గోపాలకృష్ణ.

## భాగవతదర్శనము – భాగవత కథ

### తృతీయ చతుర్థ ఖండములు

ఒక్కొక్కదాని వెల రూ 2. ప్రాప్తిస్థానము: సాధనగ్రంథమండలి, తెనాలి.

ప్రయాగనివాసులున్నూ, గొప్ప హిందీ రచయితలున్నూ ఐన శ్రీ శ్రీ శ్రీ ప్రభుదత్త బ్రహ్మచారిమహారాజుగారు భాగవతగ్రంథమును ఇతరపురాణాలను లెక్కలేనన్నిమార్లు పారాయణము చేసి అన్నింటి సారమును భాగవతకథ అను పేర దాదాపు నూరుభాగాలుగా హిందీవచనంలో రచించినారు. వారి ఆజ్ఞ మేరకు ఆగ్రంథాలను తెలిగించి సాధనగ్రంథమండలిద్వారా ఆంధ్రులకు అందచేసే మహోదారకార్యానికి రామశరణ్ శ్రీ కుందుర్తి వేంకటనరసయ్యగారు పూనుకొన్నారు. బ్రహ్మచారిగారు రన్నట్లు వ్యాసోపవనాహృత సుమముల మాల యైన ఇది భక్తసహృదయులకెల్ల శిరోధార్యమనుట అత్యుక్తి కాదు. కాబట్టి ఇప్పటికి ప్రకటితములై ఉన్న భాగాలను ఆదరించడమే కాక, ప్రకటింప బడ వలసి ఉన్న భాగాలకు చేయూత ఇవ్వడం ఉదారాంధ్రమహాజనుల కెల్ల ప్రాప్తం.

ప్రభాకర్.

## తులసీ – గోపూజ

సంపాదకులు: రామశరణ్ శ్రీ కుందుర్తి వేంకటనరసయ్యగారు, విద్వాన్ బులుసు సూర్యప్రకాశశాస్త్రిగారు. ప్రకాశకులు సాధన గ్రంథమండలి, తెనాలి. వెల: రెండణాలు.

తులసియు గోవును హిందువుల ఆరాధ్యకోటిలో అగ్రగణ్యాలు. రెండింటి పూజా విధానమును అష్టోత్తరశతనామావళులతో సహా ఇందు ప్రశంసార్హముగ పొందుపఱుపబడి యున్నది. కావున ఆస్తికుల కెల్ల ఈచిఱుత పొత్తము స్పృహణీయము.

ప్రభాకర్.

## జీవయాత్ర

ఇది మచిలీపట్నములోని జనతా విద్యాకేంద్రమువారు ప్రచురించు మాసపత్రిక. దీని సంపాదకులు శ్రీ కె. జి. బాబురావుగారు, ఎమ్.ఏ., బి.ఎల్. సాలుచందా రూపాయిపావలా, విడి ప్రతి వెల రెండణాలు. ప్రజానీకానికి సమష్టిగా విదేశీయభాషదాస్యం తొలగించి దేశీయభావావబోధం కలిగించి, సంఘశ్రేయానికి, దాని మూలాధారమైన వ్యక్తిశ్రేయానికి వలసిన శిక్షణ కల్పించే ప్రణాళికగల యీ పత్రికకు స్వాగతం.

ప్రభాకర్.

# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు శ్రీరామకృష్ణుని జీవిత సంగ్రహమును 1121 మహోపదేశములును గలవు.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బాధగురువులు : బోధగురువులు, తార్కికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, దేవుడు, జ్ఞానము : భక్తి : కర్మము, బ్రహ్మతత్త్వము మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డల కయిన అవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

నీతికథలును సూక్తులును మకరందపేశలములు, నిర్వృతికరములు.

... ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూక్ష్మాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్జ్వలమగు పంచమ ముద్రణము ! వెల : రూ. 3-50

# హిందూమతము

రచయిత : శ్రీ వివేకానందస్వామి

అనువాదకులు: శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

హిందూమత నామమును పరస్పరభిన్నభావభూయిష్ఠములగు అనేక మతసంప్రదాయములు వహించి యుండుటచే, తత్ స్వరూప నిర్వాచనమునకు ఇందు శ్రీ వివేకానంద స్వాములవారు పూనుకొని ఆ మతము వేదసంహితాకాలమునుండి ఎట్లు క్రమ పరిణామ మందెనో, అందు సర్వసమ్మతమూలభావము లెవ్వియో, అది చేయు బోధ యెట్టిదో, ఇన్ని భిన్నమతాంతరము లెట్లు కలిగెనో, ఈ కలగూరగంపకు హిందూమత నామ మెట్లు లేర్పడెనో విశదీకరించియున్నారు. జిజ్ఞాసువుల కత్యంతోపయుక్తమగు గ్రంథము.

... తెనుగువాఙ్మయములో వేదాంతచర్చలపై ... ప్రకటింపబడిన గ్రంథములలో ఇది ఉత్తమోత్తమమైనదని శిరసాగ్గి చెప్పవలసియున్నది. ... —భారతజ్యోతి 12-4-1956.

168 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౪ ౧౯౫౭, ఆగస్టు; హేవిళంబి — శ్రావణము సంచిక ౩

## విషయసూచిక

శ్రీలక్ష్మీనృసింహపఞ్చరత్నమ్—శ్రీమచ్ఛంకర భగవత్పాదులు ... ౪౯
రామకృష్ణానందస్వామి ప్రశస్తి—[సంపాదకీయము] ... ... ౫౧
శ్రీరామకృష్ణానందుని అపూర్వ గురుభక్తి—సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు ౫౬
వివేకానందస్వామినిగూర్చి జ్ఞప్తికివచ్చు కొన్ని విషయములు ... ౫౯
—శ్రీ సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు
మాతృశ్రీ శారదాదేవి—[శ్రీమద్గంభీరానందవాణి] ... ... ౬౧
శ్రీ రామకృష్ణ దివ్యవాణి—శ్రీమతి హెచ్. కనకలక్ష్మమ్మగారు ... ౬౬
షడ్వింశత్యేకాదశీవ్రతవైభవము—శ్రీ కిళాంబి రంగాచార్యులుగారు ... ౬౮
శ్రీకృష్ణలీలల అంతరార్థము—శ్రీ గురుభక్తి పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు ... ౭౧
శ్రీ వివేకానందస్వామి—(ప్రభాకర్) ... ... ౭3
వార్తలు, విశేషాలు ... ... ౭౮
గ్రంథసమీక్ష ... ... ౭౯

# స్వామి - శిష్య సంవాదములు

(శ్రీమద్వివేకానందస్వామితోడి సంభాషణలు)

అనువాదకులు : శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

సాంసారిక సమస్యలు పరిష్కరించుకొనదలచినను సమాధిస్థితి సాధింపదలచినను; రాజకీయవిశేషము లాకళింపదలచినను, లలితకళారహస్యము లవగతముచేసికొనదలచినను — ఇంతేల, లౌకికాలౌకిక విషయములలో వేనినిగుఱించిగాని మీ పరిజ్ఞానము వృద్ధి గావించుకొనదలచినచో ఈ గ్రంథమును తప్పక చదువుడు. నవభారతభాగ్యవిధాత శ్రీమద్వివేకానందస్వామిచంద్రులు శిష్యులతో కావించిన యీ ప్రసంగములలో వారి అనుభవసర్వస్వము రాశీభూతమై యున్నది. సులభశైలి, హృదయమును పట్టి యిచ్చు సంభాషణలు, ముచ్చటైన అచ్చుకూర్పు.

పుటలు 552+12 అకారాది అనుక్రమణిక వెల : రూ. 5/-

# నా జీవితము, జీవితకార్యము

అనువాదకులు : శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

శ్రీరామకృష్ణసందేశమును లోకమునకు అందజేయుకొఱకును, లోకమును భౌతికముగా, వైజ్ఞానికముగా, పారమార్థికముగా సేవించుటయందు నేడు జగద్విఖ్యాతిగాంచి యున్న శ్రీరామకృష్ణమఠ సేవాసంస్థలను ప్రథమమున స్థాపించు మహోద్యమము నిర్వహించు కొఱకును, శ్రీ వివేకానందాది శిష్యవర్గమువారు ఎంత గాఢదీక్షతో పరిశ్రమించి, ఎంతటి దుర్భరక్లేశముల నోర్వవలసివచ్చెనో, ఈ ఉపన్యాసమున గుండెలవియు వాక్కులతో శ్రీ వివేకానందస్వామి వివరించియున్నాడు. అందఱును చదివి తీఱవలసిన గ్రంథము.

62 పుటలు అందమైన కూర్పు వెల : 50 న. పై.

# పారమార్థిక సంభాషణలు

అనువాదకులు : శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

శ్రీరామకృష్ణదేవుని స్వశిష్యవర్గములోని ఆర్గురు జ్ఞానసిద్ధులు శిష్యులతోడను, భక్తులతోడను, చేసిన పరమార్థ విషయక సంభాషణ కతిపయములు. ఎన్నెన్నో గ్రంథములు చదివినగాని తీఱని ఆధ్యాత్మిక సంశయము లీ గ్రంథమూలమున అవలీలగా తీఱును.

402 పేజీలు (మనోజ్ఞమగు ప్రథమ ముద్రణము) వెల: రూ. 3/-

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4




'సర్వేశ్వరుని శరణు జొరుము, అతని కృప నీ యనుభవమునకు అప్పుడు వచ్చును.''

-శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౪ } ౧౯౫౭ - ఆగస్టు : : హేవిళంబి - శ్రావణము { సంచిక

## శ్రీ లక్ష్మీ నృసింహ పఞ్చరత్నమ్

### శ్రీమచ్ఛంకర భగవత్పాదులు

త్వత్ ప్రభుజీవప్రియ మిచ్ఛసి చే న్నరహరిపూజాం కురు సతతం
ప్రతిబి మ్బాలఙ్కృతి ధృతి కుశలో బి మ్బాలఙ్కృతి మాతనుతే
చేతోభృఙ్గ, భ్రమసి వృథా భవమరుభూమౌ విరసాయాం
భజ భజ లక్ష్మీనరసిం హానఘ పద సరసిజ మకరన్దమ్ ॥ ౧

టీక॥ చేతోభృఙ్గ = మనస్సు అనెడి ఓ తుమ్మెదా, త్వత్ = నీకు, ప్రభు = నియంతయైన, జీవ = ఆత్మయొక్క, ప్రియం = ప్రీతిని, ఇచ్ఛసి చేత్ = కోరుదు వేని, సతతం = ఎల్లప్పుడును, నరహరిపూజాం = నరసింహస్వామి పూజను, కురు = చేయుము, ప్రతిబిమ్బ + అలఙ్కృతి ధృతి కుశలః = ప్రతిబింబమును సింగారింప గోరు నేర్పరి, బిమ్బ + అలఙ్కృతిం = అసలుబింబమునకే సింగారింపును, ఆతనుతే = చేయును, విరసాయాం = వెగటుగొలుపునట్టి, భవమరుభూమౌ = సంసారపు ఎడారిలో, వృథా = వర్థముగా, భ్రమసి = చుట్టుచున్నావు, లక్ష్మీనరసింహ = లక్ష్మీదేవితో కూడిన నరసింహస్వామియొక్క, అనఘ=స్వచ్ఛములైన, పద సరసిజ మకరన్దమ్= అడుగు దామరల తేనెను, భజ = సేవింపుమా, భజ = సేవింపుమా.

తా॥ నా మనస్సు అనెడి ఓ తుమ్మెదా, వెగటు గొలుపు నట్టి యీ సంసారపు ఎడారిలో వ్యర్థముగ చుట్టుచున్నావు, లక్ష్మీసనాథు డైన నరసింహస్వామి యడుగు దామరల తేనియను

గ్రోలుమా. నీకు నియంత యైన జీవుని మెప్పింప గోరుదు వేని, నరసింహదేవుని పూజను సదా చేయుము. దేవుడు బింబము, జీవుడు ప్రతిబింబము. సొమ్ములను మనము అసలుబింబమునకు అర్పించిననే, అవి ప్రతిబింబమునకు అర్పితము లగును.

శుక్తౌ రజత ప్రతిభా జాతా కట కా ద్యర్థ సమర్థా చేద్
దుఃఖమయీ తే సంసృతి రేషా నివృతిదానే నిపుణా స్యాత్ ॥ చేతో ॥ ౨

టీక॥ శుక్తౌ = ముత్తెపుచిప్పయందు, జాతా = కలిగినట్టి, రజతప్రతిభా = వెండి యను భ్రాంతి, కటక + ఆది + అర్థ సమర్థా చేత్ = కడియము చేసికొనుట మొద లైన ప్రయోజనా లకు ఉపయోగపడు నేని, దుఃఖమయీ = దుఃఖములతో నిండిన, ఏషా = ఈ, సంసృతిః = సంసారము, తే = నీకు, నివృతిదానే = ఆనందము నొసంగుటలో, నిపుణా స్యాత్ = సామర్థ్యము కల దగును.

తా॥ ముత్తెపుచిప్పను చూచినవానికి అది వెండి అను భ్రాంతి కలుగును, వెండి యను భ్రాంతి అతనిలో ఉన్న దే కాని, ఎదుట నేమో వెండి లేదు. కడియము చేసికొనుటకు నిజ మైన వెండి పనికి వచ్చునే కాని, వెండి యనెడి భ్రాంతి పనికి వచ్చునా? అందుల కది పనికిరా నట్లే ఆనందమును సమకూర్చుటకు, దుఃఖమయ మైన యీ సంసారమును పనికి రాదు.

ఆకృతిసామ్యా చ్ఛాల్మలికుసుమే స్థలనళినత్వభ్రమ మకరోః
గన్ధరసా విహ కిము విద్యేతే విఫలం భ్రామ్యసి భృశవిరసే ఽ స్మిన్ ॥ చేతో ॥ ౩

టీక॥ ఆకృతిసామ్యాత్ = రూపు లోని పోలికచేత, శాల్మలికుసుమే = బూరుగుపూవు నందు, స్థలనళినత్వ = మెట్టతామర యనెడి, భ్రమం + అకరోః = భ్రాంతి జెందితివి. ఇహ = దీనిలో, గన్ధరసే = సువాసనయు, రుచియు, విద్యేతే కిము = ఉన్నవా? విరసే = వెగటుపుట్టించు, అస్మిన్ = దీనియందు, విఫలం = వ్యర్థముగా, భ్రామ్యసి = చుట్టుచున్నావు.

తా॥ మెట్టతామరపూవును బూరుగుపూవును ఆకారములో ఒక్కరీతిగనే ఉండును. కాని దానిలోని సువాసనయు రుచియు దీనిలో ఉన్నవా? ఇది వెగటు గొలుపును. ఇందులో వ్యర్థముగ చుట్టుచున్నావే.

స్రక్ చన్దన వనితాదీన్ విషయాన్ సుఖదాన్ మత్వా తత్ర విహరసే
గన్ధఫలీసదృశా నను తే ఽమీ భో గానన్తర దుఃఖకృత స్స్యుః ॥ చేతో॥ ౪

టీక॥ స్రక్ = పూలమాలలు, చన్దన = గంధము, వనిత + ఆదీన్ = స్త్రీలు మొద

లైన, విషయాన్ = ఇంద్రియ లక్ష్యాలను, సుఖదాన్ = సుఖకరము లని, మత్వా = తలంచి, తత్ర = వానిలో, విహరసే = విహరించుచున్నావు. భోగ + అనన్తర దుఃఖకృతః = అనుభవించిన పిమ్మట దుఃఖమును గలిగించునవి అగును. అమీ = ఇవి, తే = నీకు, గన్ధఫలీసదృశాః స్యుః నను = సంపంగివంటివి అగును కదా.

తా॥ ఇంద్రియలక్ష్యాలు సుఖకరము లని భ్రమించి వానిలో విహరించుచున్నావు. అనుభవించిన పిమ్మట ఆ విషయాలు దుఃఖమును గలిగించును. అవి నీకు సంపంగివంటివి కదా. సంపంగిని జూచిన తొలగి పోవుదువే, అట్లే వీనినుండియు తొలగి పో దగు ననుట. తుమ్మెదకు సంపంగి అప్రియ మని కవిసమయము.

తవ హిత మేకం వచనం వక్ష్యే శృణు సుఖకామో యది సతతం
స్వప్నే దృష్టం సకలం హి మృషా జాగ్రతి చ స్మర తద్వ దితి ॥ చేతో॥ ౫

టీక॥ తవ = నీకు, హితం = శ్రేయస్కరమైన, ఏకం వచనం = ఒక మాటను, వక్ష్యే = చెప్పెదను. సుఖకామః యది = సుఖమును గోరుదు వేని, శృణు = వినుము. స్వప్నే = కలలో, దృష్టం = కనబడినది, సకలం = సమస్తమును, మృషా హి = కల్లయే కదా, జాగ్రతి చ = మేలుకొనియున్నప్పుడును, తత్ వత్ ఇతి = అట్లే అని, సతతం = ఎల్లప్పుడును, స్మర = తలంపుము.

తా॥ సుఖింప గోరుదు వేని ఒక్క హితమును చెప్పెదను వినుము. కలలో కన్న దెల్ల కల్లయే కదా, జాగ్రదవస్థలో కనిపించునదియు కల్లయే అని తలంపుము.

# రామకృష్ణానందస్వామి ప్రశస్తి

## (సంపాదకీయము)

పరమహంస శ్రీరామకృష్ణుడు దివ్యావతార మూర్తి, ఈ యుగపు ఆచార్యుడు, నేటి విశ్వమతాల లక్ష్యాలు ఆయనలో పూర్తి చెందినవి. భగవంతుడు ఉన్నాడు అనుటకు ఉత్తమప్రమాణము భగవదనుభవమే అను సత్యమును ఆయన జీవితచరిత్రము మనకు ప్రకాశపఱచుచున్నది. 'నేను ఆత్మ' నను భావన సాధకునకు స్వానుభూతి మాత్రము కాదు, అతనిలో ఉన్న ఆ భావన అన్యులలో మార్పు తేగల శక్తియు అగుచున్నది. శ్రీరామకృష్ణుడు తాకిన చాలును, ఆ స్పర్శ పతితపావనసమర్థము. పాశ్చాత్యుల అజ్ఞేయవాదములో పడిపోయిన మహాప్రతిభా

వంతులగు వంగీయులను ఆయన వ్యక్తిమహిమ, ఆకర్షించి, తన యద్భుతప్రభావముచే వారిని జగము నుఱ్ఱూత లూప గల వేదాంతులుగ రూపొందించెను. వారు లోకులకు సర్వము విష్ణుమయమే అనియు మానవసేవయే మాధవ సేవ యనియు కఱపిరి. దక్షిణ హిందూదేశము అనాదికాలమునుండియు సనాతనాచారనిష్ఠకును వేదాంతశాస్త్రమునకును నెలవు, అట్టి చోట ఈనూత్న సిద్ధాంతమును బోధించుటకు ఈయన కున్న అర్హత వే ఱెవ్వరికిని లేదని అందులకు రామకృష్ణానందస్వామినే శ్రీ వివేకానందస్వామి ఎన్నుకొనెను. రూపుదాల్చిన గురుభక్తియే రామకృష్ణానందస్వామి.

రామకృష్ణానందస్వామికి మొదటి పేరు శశిభూషణుడు. ఈయన వంగదేశమున సనాతనాచారనిష్ఠులును తాంత్రికోపాసకులు నైన బ్రాహ్మణుల కుటుంబాన క్రీ॥శ॥ 1863-వ సంవత్సరమున జన్మించెను. శ్రీవివేకానందులు జన్మించినదియు ఆ సంవత్సరముననే కదా! తొలుదొల్త గౌరాంగదేవునిబోధలు శశిభూషణుని డెందమును డక్కగొన్నవి. ఈయన పూర్తిగ శాకాహారి అయ్యెను. కళాశాలలో విద్యార్థిగ నున్నప్పుడే ఈయన ప్రతిభ అలోకసామాన్యముగ వెలుగొందెను. లెక్కలకు కావలసిన సూక్ష్మత, వేదాంతమునకు గావలసిన లోతు, సంస్కృతవైదుష్యము — ఇవి మూడును ఈయనలో మేళనమును బొందినవి. జ్ఞానక్షుధ జాడలు బాల్యములోనే ఈయనలో కనిపించినవి. గొప్ప బ్రాహ్మసమాజ నాయకుడైన కేశవచంద్రసేను బోధనలచే ఆక్షుధ మఱింత చుఱుకెక్కినది. గురుదేవు డొక్కడే ఆక్షుధను తీర్ప గలిగినాడు. ఈయనయు శరత్తును గురుదేవుని దక్షిణేశ్వరమున తొలిసారి 1883 లో కలిసికొనిరి. వెంటనే ఈయన మంత్రముగ్ధుడుం బోలె గురుదేవు నాకర్షణకు వశపడి, బి.ఏ. తరగతిలో చదువుచుండిన తన చదువును మాని, ఐహిక కామలోభాదుల నెల్ల త్యజించెను. గురుదేవుడు సాక్షాద్దివ్యావతారమూర్తి అనియే ఈయన నమ్మెను. ముక్తికంటెనుకూడ ఈయనకు గురుభక్తియే ప్రియతర మయ్యెననగా ఇక ఆ గురుభక్తి ఎంత ఉత్కటమో! 1883 నుండి 1886 వఱకు ఈయన గురుదేవుని చరణసన్నిధి నుండెను. గురుదేవుడు 1886 లో మహాసమాధి నొందెను. అప్పటినుండి శశి నిస్స్వార్థమైన ఆస్థతో తన జీవితమును గురుసేవకే అంకిలి మొనర్చుకొనెను. యువశిష్యులందఱును వివేకానందస్వామి నాయకత్వమున ఒక్కటైరి. క్రైస్తవసంప్రదాయమున సెయింటుపాల్ స్థాన మెట్టిదో, ఈ సంప్రదాయమున శ్రీ వివేకానందస్వామి స్థాన మట్టిది. అందఱును సన్న్యాసదీక్షను స్వీకరించి, ఒక సంస్థగా ఏర్పడి, 'ఆత్మసిద్ధి' 'సేవ' అనెడి జంట లక్ష్యాల ప్రచారమునకై పూనుకొనిరి. ఆ లక్ష్యాలలో తపస్సునకును కర్మనిష్ఠకును చక్కని సామరస్యము కుదిరిపోయినది. గురుదేవుని స్మారక శేషాల (రెలిక్సు)ను కాచుకొనుట, మఠమును నడపుట, ప్రేమమయియగు తల్లిపలె భోజనాదికమును విచారించుచు సాధువులను ఓముట—ఇవి శశి చేయుచుండిన పనులు.

1897 లో రామకృష్ణానందస్వామి మదరాసునకు విజయంచేసినప్పుడు శ్రీమాన్ అళగసింగ పెరుమాళ్లు, ఎమ్. సి. నంజుండరావు మున్నగు వారు ఈయనను పరమాదరపూర్వకముగ స్వీకరించిరి. సముద్రతీరమున పూర్వము శ్రీవివేకానందస్వామి వేంచేసి యుండి పవిత్రీ

కరించిన ఐస్హౌసులోనే ఈయనయు వసింప నారంభించెను. కొన్నాళ్లు అగు సరికి అక్కడ చోటు చాలక స్వామి చాల ఇబ్బందులు పడెను. 1907 లో మైలాపూరులో బ్రాడీసు వీధి [ఇప్పటి రామకృష్ణమఠ వీధి] లో ఒక ఇల్లు నిర్మింపబడెను. గురుమహారాజుతో ఆ క్రొత్తయింటిని చేరుకొన్న దినము శశి అనుభవించిన ఆనందము ఇంత అంత అన లేము. ఐస్హౌసులో ఉన్నప్పుడు గాని, తర్వాత మఠములో చేరుకొన్నప్పుడు గాని, తపస్సే ఈయనగా రూపుదాల్చినదేమో అని చెప్ప దగి ఉండెను. ఈయనదైనందిన జీవితములోని కేంద్రాంశము గురునాథు నారాధనము. దక్షిణేశ్వరాలయమున కాళీమాత గురుదేవునకు సదా ప్రత్యక్షమై ఉండినటుల, ఇక్కడ పూజా మందిరమున రామకృష్ణానందస్వామికి గురుదేవుడు సదా ప్రత్యక్షమే. గురుదేవుని ప్రతిమ ఈయనదృక్పథాన సాక్షాద్గురుదేవుడే కాని, ప్రతిమయు కాదు, మనఃకల్పితమును కాదు, లాంఛనమును కాదు. భక్తిపరవశతాపాదకమైన సాక్షాత్సంశ్లేషమే ఈయన యనుభూతి కావున, సామాన్యపూజాప్రార్థనానియమాలు అతిక్రాంతము లగు చుండెడివి. స్వామిశరీరము లావు. ఈయన గురుదేవు నారాధించు నప్పుడు చూచిన చాలును, అదే గొప్ప జ్ఞానపాఠముగ నుండెడిది. కామినీకాంచనాలకే కాక, కొండెగాండ్రకును వదరుబోతులకును కూడ ఈయన దూరముగ నుండెడి వాడు. మఠములో బ్రహ్మచారులను తర్ఫీదు చేయుటలో ఈయన చాల కచ్చితముగ నుండెడి వాడు. వెంట్రుకంత వ్యతిక్రమమును గూడ ఓర్వడు. కాని మోమున నేమో సదా ప్రేమహాసాలే తొణికిస లాడు చుండెడివి.

స్వామి విచారణలో మఠకార్యక్రమమును సేవాసంఘకార్యక్రమమును ప్రక్కప్రక్కనే నిత్యప్రవర్ధమానములై సాగుచుండినవి. ఆ వివరాలు వీరి జీవితచరిత్రగ్రంథములో విపులీకరింపబడి ఉన్నవి.

1910-వ సంవత్సరములో మాతృశ్రీ శారదాదేవి దక్షిణదేశయాత్రకు బయలుదేరి చెన్నపట్టణమునకు వచ్చినది. అప్పుడు రామకృష్ణానందస్వామి మాతృదేవిసేవలో పూర్తిగా నిమగ్నుడయ్యెను. మొత్తము పదునాలుగేండ్లు పడ్డ శ్రమకు ఫలితముగా ఆరోగ్యము చెడి, 1911 లో ఈయన వైద్యము నిమిత్తము కలకత్తాకు మరలి వచ్చెను. ఎంతటి దేహబాధ పడుచున్నప్పుడు కూడ ఈయన దిటవు చెడలేదు, చిత్తము శ్రీశారదారామకృష్ణుల చరణారవిందములందే తిరముగ నెలకొనియుండెను; అట్లుండి ఈయన ఆగస్టునెలలో మహాసమాధి నొందెను. అప్పుడు చెన్ననగర ప్రముఖు లందఱును పచ్చయ్యప్పకళాశాలలో సమావేశమై తమ దుఃఖమును వెలిబుచ్చిరి.

రామకృష్ణానందస్వామి బోధనలను పరికించిన సంఘులక్ష్యాల ఉదాత్తత తెలియ నగును. ఆయన బోధనా పద్ధతి ప్రత్యేకము. గురుదేవునందు వలెనే ఈయనలోను జ్ఞాన భక్తి కర్మ మార్గాలు మూడును మేళనమును పొందినవి. ఆ మూడింటిలోను తక్కిన రెంటికన్న భక్తి ప్రాధాన్యము గాంచినది ఈయనలో. ఈయనది ప్రచురముగా 'నేను కాను, నీవే' అను వైఖరి.

గౌరాంగదేవుడును భగవద్రామానుజులును బోధించిన భక్తి ఈయనకు కరము అభిమతమైనది. ఆస్తిక్యము జీవుని దేవునిగ జేసి ఐక్యమొందించు ననియు భగవత్ప్రాప్తి ప్రతి చేత

నునికిని జన్మహక్కు అనియు ఈయన చెప్పు చుండెడి వాడు. ఈయనకు భక్తిలో పరవశతయు ఉన్మాదమును గలిగి నప్పుడు ఆ వెల్లువలో నిత్యానుష్ఠానవిధానావధులు కొట్టుకొని పోయెడివి. ఆ ఉన్మత్తదశ ఒక తుపానును బోలి యుండును. వేఱు సమయాలలో ఈయన స్థైర్యము అతిమాత్రము. ఈయన కేవలము సాక్షిగను ఉదాసీనుడుగను ఉండును. కాని భక్త్యుద్రేకము కలిగి నప్పుడు, రంగము పూర్తిగా మాఱి పోవును, ఉద్రేకము ఉన్మాదమగును. అహంకారము నంతరింప చేసికొన్న భక్తునిలో దేవుడు చొచ్చి నిండుకొనును. ఒకనాడు స్వామి తిరువన్మియూరుగుడిలో దక్షిణామూర్తిని సేవించుచుండెను. ఈయనలో భక్తి భావము ఉద్రిక్తమై ఉన్మాదముగ మాఱెను. కృష్ణప్రేమ వెలి కుబికెను. అశ్రు కంప రోమాంచములు అతిశయించినవి. చూచుచున్న భక్తులును ఆ భావ ప్రవాహములోనికి ఆకృష్టులై పాడను ఆడను ఆరంభించిరి. ఇట్లు రామకృష్ణానందస్వామి అభిరుచి జ్ఞానము మీదకన్న భక్తిమీద నెక్కువ. భగవద్రామానుజులను ఈయన విశేషించి కొనియాడుటకు ఈ యభిరుచియే కారణము. రామానుజ జీవితోపదేశాలను గూర్చి స్వామి తన మాతృభాషలో ఒక పెద్ద గ్రంథమునే రచించెను, ఈయన భాగవతమును ముఖ్యముగ పారాయణము చేయుచుండెను, ఈయన వ్రాసిన గ్రంథాలలో "గొల్లకృష్ణుడు – రాజకర్తయైన కృష్ణుడు" (శ్రీకృష్ణ ది పాస్టొరల్ అండ్ కింగ్మేకర్) అనున దొకటి. అందులో ఈయన కుండిన కృష్ణప్రేమాత్కృష్ట్యము స్పష్టమగును.

ఇప్పటి మానాలను పట్టి చూచినను ఈయన ఆదర్శగురువు. శిష్యుల చిత్తవృత్తుల లోతును కనుగొని తన పాఠాలను వారి అక్కఱలకు తగ్గట్లు రూపొందింప గల నేర్పు ఈయనది. మద్రాసులో ఈయన ఒసంగిన బహిరంగోపన్యాసాలలోను వ్రాసి ప్రకటించిన గ్రంథాలలోను గణితవేదాంతవైదుష్యపరిపక్వత గాంచ నగును. అద్వైత సిద్ధాంతమును వివరించు నప్పుడు ఈయన శాంకరమార్గమునే గాక బెర్క్లి, కాంట్, డిస్కార్టిస్–మున్నగు పాశ్చాత్య ప్రముఖుల మార్గములను గూడ అనుసరించెను. భగవదారాధనకు భగవంతునితోడి యైక్యానుభూతిలోనే పర్యవసానము. ఈయన భావనా సూక్ష్మతను దెలుపు కొన్ని సూక్తులు—

. . ఇంద్రియ గోచర పథమున కావల నామరూపాత్మక జగత్తు లేదు. (2) అవి పట్టి యునో రూపాలే, ఇంద్రియానుభూతులే, మనస్సును అహంకారమును వాని నేకీకరించును. (3) నేను ఉన్నా నని అనుకొనుచున్నాను కాబట్టి ఉన్నాను. ఆత్మ ఉన్న దనుటకు ఆత్మయే ప్రమాణము. (4) ఉన్న ఆత్మ ఒక్కటే, అది అనంతము. అనంతము లెనవి రెండుండుట పొసగదు. కావున ఆత్మ ఏకము. అద్వితీయము. శూన్యమును, అనంతమును అభిన్నములు. కావున అణువుకంటె అణీయమైనదియు మహత్తుకంటె మహీయము మయినదియు ఒక్కటే. ప్రతివాడును శబ్దాదివిషయాలనుండి ఆనందముకై ప్రతీక్షించును కాని ఆనంద ముండునది మనలోనే. ఆనందము నిత్యము. ఆత్మ సదా ఆనందించును. ఆనందమే ఆత్మకు స్వరూపము. ఆత్మ నిత్యసత్తు, నిత్యచిత్తు, నిత్యానందము.

ఏకాంతమున నుండుటయు, మౌనముగ ధ్యానించుటయు స్వామికి ప్రియములు. కావున "గుమిగూడి ఆరాధించుట" (కాంగ్రిగేషనల్ వర్షిప్) అనిన (కాంట్రడిక్షన్ ఇన్ టెరమ్స్)

"విరోధాభాసము" అని ఈయన అప్పుడప్పుడు చెప్పుచుండెడివారు. జ్ఞాని గావున ఈయన గర్భగృహమున కేగి అట సచ్చిదానందబ్రహ్మస్వరూపమును ధ్యానించెడివాడు. ఏకాంతము అభయప్రదము అనికూడ ఈయన చెప్పుచుండును

సగుణోపాసనకును నిర్గుణబ్రహ్మజ్ఞానమునకును రామకృష్ణానందస్వాముల జీవితము ఆదర్శము. బ్రహ్మము నిరాకారమైనను, భక్తి, ఆ బ్రహ్మమును సాకారమొనర్చునని ఈయన విశ్వాసము. భక్తిచే ఘనీభవించిన సచ్చిదానందస్వరూపమే సాకారబ్రహ్మము. పరాభక్తియు జ్ఞానమును ఒక్కటే. చక్కెర మధురము. చక్కెరతీపి అనుభవింప గోరినను కోరవచ్చును, చక్కెరగనే రూపొందినను రూపొందవచ్చును. ద్వైతాద్వైతములు ఒండొకదానికి అవిరుద్ధముగ ప్రక్కప్రక్కన ఉండ వచ్చునని ఈయన యభిప్రాయము. ఒక్కొక్కరకపు ముక్తియు దానివలకు నది పరిపూర్ణమే. ద్వైతమునకు లక్ష్యము అనుభూతి, అద్వైతమునకు లక్ష్యము ముక్తి, అనుభూతియు ముక్తియు రెండును ఉదాత్తములే. స్వామి యోగములనన్నిటిని అభ్యసించి అన్నింటి లక్ష్యమొక్కటే అని కనుగొనెను. రూపు గొన్న ముక్తియే భక్తి. అనుభూతియు ముక్తియు ఒక్కటే. సంప్రదాయనిష్ఠయు సంస్కారాభిరుచియు రెండును గలవు ఈయనకు. సంప్రదాయనిష్ఠ బాహ్యజీవితములో ఉన్నది లోలోన సంస్కారప్రీతి గలదు. జీససును బుద్ధుడును మహమ్మదును దేవు నవతారము లనియే ఈయన విశ్వాసము.

ఈయన స్వభావము సరళము, నిరాడంబరము, ఈయనలో తపోనిష్ఠయు గలదు, అంతర్ముఖతయు గలదు, యోగదశలో దేవునితోను గురుదేవునితోను సంశ్లేషానుభవమును గలదు, పోయిన చోటనెల్ల ఆధ్యాత్మికతను వెల్లివిరియించు యోగి అగుటే కాక నిరంతరము మానవుల యోగక్షేమములకై పాటుపడు వాడు ఈయన. కావున తపస్సునకును కర్మనిష్ఠకును అద్వైతమునకును సగుణోపాసనకును అవిరోధమును గూర్చునది ఈయన జీవితము. సేవాసంఘసేవ బహుముఖము గదా. అందు వివేకానందస్వామి సేవయు రామకృష్ణానందస్వామి సేవయు ఒండొకదానికి పూరకములు. వివేకానందస్వామి కోట్లకొలది సదస్యులను ఉఱ్ఱూతలూపు మహోజ్జ్వల వక్త. రామకృష్ణానందస్వామికి చర్చలలోను పాఠములను గరపుటయందును దక్షత మిక్కుటము. వివేకానందస్వామి అందఱపై వేదాంతమును ప్రసరింపజేసెను. రామకృష్ణానందస్వామి ఒకకొందఱకు మాత్రమే కరపి, తనబోధనలను వారి యక్కఱలకు సరిపడునట్లు చేసెను. వివేకానందస్వామిది జ్ఞానావృతభక్తి, రామకృష్ణానందస్వామిది భక్త్యావృతజ్ఞానము. ఇరువురి చిత్తవృత్తులును భేదిల్లినను, ఇరువురును సత్యమునే బోధించిరి. గురుదేవుడు ఎన్నుకొని అంగీకరించినవారే ఇద్దఱును. ఇతరుల మతములను నిరసూయముగ అర్థము చేసికొని అంగీకరించుటయు, అనేకమున నిగూఢమైయున్న యేకమును గుర్తించుటయు శ్రీరామకృష్ణసేవాసంఘప్రణాళికలో సారతమాంశములు. ఇప్పటి లోకమునకు ఎంతేని జరూరైనవి ఇవే.

# రామకృష్ణానందుని అపూర్వ గురుభ.

## సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు

హేవిళంబి ఆషాఢ కృష్ణ త్రయోదశి (25—7—1957) శ్రీరామకృష్ణానందస్వామి యొక్క 95 వ జయంతి. ఈ యవసరమున వారి యద్వితీయ గురుభక్తిని సువిదితము జేయు నొక కొన్నియంశములను పరికింతముగాక—

క్రైస్తవ ఋషి యగు (సెయింట్) పాల్ తన్ను గూర్చి యిట్లు పలికి యుండెను: "నాయందు, నేను కాదు, క్రైస్తే జీవించి యున్న వాడు". శ్రీరామకృష్ణానందులును అటులనే. సోదరి దేవమాత చెప్పినట్లు, "రామకృష్ణానందులయొక్క సంచారము, భోజన నిద్రలు, పరిశ్రమ, బోధలు, ఆయన జీవిత మంతయు, తన గురుదేవుని ఇచ్ఛనే ఆధారముగ గొని యుండెను గాని, ఎప్పుడును తన యిచ్ఛపై గాని, సౌకర్యముపై గాని కాదు.

'ఐస్‌హౌస్'నుండి, చెన్నపురిలోని మైలాపూరు పేటలోని క్రొత్తమఠమునకు 'పూజా మందిరము'ను ఆయన మార్చినప్పుడు, ఆయన తన గురుదేవుని చిత్రమును హృదయమునకు హత్తుకొని, — తన శరీరమును అపుడు కురియు చున్న వాననుండి పటమును కాపాడుటకై దానిమీద వంచి యుంచి, — బండినుండి మఠ ద్వారమునకు ఆయన నడచుటను జూచిన వారు, ఆయనయందు నిండియున్న ప్రేమ యను నవనీతమును, గురువునందలి భక్తిపారవశ్యమును గ్రహింప గలిగిరి. సెయింట్‌పాల్ వలెనే ఆయనగూడ తన గురువరేణ్యుని గూర్చి. 'ఈ మానవశరీరమందు నేను నడపు బ్రతుకు, దేవకుమారుని యందలి విశ్వాసముచేతనే' అని చెప్పియుండవచ్చును, యథార్థముగ.

ఆయన తన గురుదేవుని మహిమ పెంపొందుటకును, ఆయన సందేశప్రచారము జయప్రద మగుటకును మాత్రమే అవతార మెత్తెను. ఆలంబజార్, బారానాగూరులందువలెనే, చెన్నపురిలోగూడ తా నెప్పుడును నిమిత్తమాత్రుడుగ నుండి, తనగురువరేణ్యునే పూజామూర్తిగ సుప్రదర్శితము జేసియుంచెను. 1897 వ సంవత్సరము ఫిబ్రవరి నెలలో వివేకానందుడు కొలంబోనుండి చెన్నపురి జేరుకొని, అచ్చట ఉపన్యాసాదికముల నొసంగెను, తొమ్మిది రోజుల పాటు. ఆయన వ్యక్తిత్వము కోటిసూర్యులవలె ప్రజ్వరిల్లుటచేత, ప్రజలు సమ్మోహితులై. ఆ మహనీయునియొక్క గురువగు పరమహంసనే మఱచిరి. మరుసటి నెలయే రామకృష్ణానందస్వాములు చెన్నపురికి విచ్చేసి, ప్రప్రథమముగ తన గురుశ్రేష్ఠుని జీవితమును గూర్చియు, సందేశమును గూర్చియు ప్రబోధన గావించెను. ఆయనమూలముగనే దక్షిణదేశస్థులు శ్రీరామకృష్ణుని నిజముగ నవగాహనము జేసికొనిరి, — అసలు ఆయననుగూర్చి వినుట యీ శిష్యుని మూలముగనే. పూజామందిరమును కేంద్రముగ నుంచియే ఆయన(సన్న్యాసి) మఠమును స్థాపించెను.

రామకృష్ణానందునకు గురుదేవుని చిత్రము, సంతత జీవధారిణి యగు నొక సజీవవ్యక్తియే. పరమహంస మందిరమునం దున్నట్లుగనే

భావించి, తదనుగుణముగనే ఆయన మూర్తిని సేవించి, ధ్యానించి, కాపాడుచుండెను! శిష్యుడు వీధిలోనికి వెళ్ళినప్పుడు, తలిదండ్రులవద్ద కుమారుడు సెలవు గైకొనునట్లు, సెలవు దీసికొనియే వెళ్లును. తిరిగి వచ్చినప్పుడు, గురుమూర్తికే తన యనుభవముల తెలియజేయును! చెన్నపురియందు వేసవి దుర్భరముగా నుండెను. కావున, గాలి లేనప్పుడు స్వామిజీ తనగురుదేవుని చిత్రమునకు కడుభక్తితో గంటలకొలది విసురును! "గురువునకు జయము" అని అప్పుడు పలుకుచుండును. ఆయన తనకష్టములను గూర్చి గురుదేవునికి మాత్రమే నివేదించును.

ఒక సాయంకాలము కొందరు భక్తులు స్వామిజీని సందర్శించుటకై మఠమునకు వచ్చియుండిరి, ఆ సమయమున ఆయన మందిరములో గురుదేవుని పూజామందిరమున నిట్లరచుటను వినిరి: "మీరు నన్నిచటికి గొని తెచ్చి, ముసలాయనా, నన్ను నిస్సహాయముగా వదలి వేసితిరి! మీరు నా సహనశక్తిని శోధించుచున్నారా? నేనిక నాకొరకు గాని, చివరకు మీకొరకే గాని, యాచన చేయ జాలను. అనాయాచితముగ నేదైనను ప్రాప్తించిన, మీకు సమర్పించి, 'ప్రసాదము'ను నేనును పొగ్గొందును. అటుల తటస్థింపకున్న, సముద్ర తీరపు టిసుకను మీ నివేదనకొరకై గొని తెచ్చి, నేనును దానిమీదనే బ్రతికియుందును!"

స్వామిజీ చెన్నరాజధానియందు తన పనిని జయప్రదముగ సాధింప గలుగుటకు ఆయన అపూర్వగురుభక్తియే కారణము. ఆయన ఆధ్యాత్మికజీవితమునకు పట్టుగొమ్మయు గురుభక్తియే. గురువునం దొకడు అచంచలవిశ్వాసము నుంచినచో, మోక్షము తథ్య మని ఆయన నమ్మి యుండెను. గురువు మానుష రూపమున నున్న 'ఇష్టదైవము'; ఆయన అట్టి శిష్యుని తప్పక అనుగ్రహించును ఒకభక్తునితో పల్కిన ఆయన యీ క్రింది మాటల నుండి ఆయనకు తన గురువునందు గల భక్తి సువిదిత మగును: "మన మొక దారి కనబడని అయోమయావస్థలో తగుల్కొని నప్పుడు, ఒక మనుష్యుడు వచ్చి, మనతో, 'నేను నీకు విమోచనమార్గమును జూపింపగల' నని చెప్పి నప్పుడు, మన కర్తవ్య మేమి? ఆయన ననుసరించుటయే! మన కాయనయందు జనించు కృతజ్ఞతాభావమే, పూజ యనియు, భక్తి యనియు అందుము. ఈ వ్యక్తియే 'గురువు'; ఈయనను మనము సంపూర్ణవిధేయతతో ననుసరింపవలయును; మోక్షమున పేక్షించుచో..."

ఒకొక్కసమయమున గురుదేవుని స్వామిజీ "నా గురుదేవా, నా హృదయపు ప్రేమమూర్తీ" అని సంబోధించును, గురుదేవుని మూర్తి ముందర నిలబడి. ఎక్కడకు వెళ్ళినను ఆయనచిత్రము నొకదానిని తీసికొని వెళ్లును.

శ్రీరామకృష్ణపరమహంస జీవితకాలమున, ఒకనాడు ఆయన కాళికాదేవ్యాలయమునందలి తన గదిలో నొంటరిగా కూర్చుండియుండెను. అప్పుడు రామకృష్ణానందస్వాములు (శశి) ఒక అవసరకార్యముమీద గదినుండి బయటకు బోవుచుండెను. పరమహంస ఆయన నాపి, "చూడుము, ఏ దేవుని నీ వన్వేషించుచున్నావో, ఆయనయే (తన వేలితో తన్నే జూపుచు)" ఇతడు, అని చెప్పెను. రామకృష్ణానందుని గురుభక్తిగూడ గురువు ననుగ్రహమే కదా? శారదామాతనుకూడ ఆయన కడుభక్తితో సేవించెను.

రామకృష్ణమఠముయొక్క ఐదవ అధ్యక్షులు శ్రీరామకృష్ణానందుని జన్మదిన వార్షికోత్సవ

సమయమున నొకతూరి, వారినిగూర్చి యిట్లు సెల విచ్చిరి: "మాత్రలను వెళ్ళకుండగనే, ఒకచోసస్థలమందు స్థిరముగ నుండియు, రామ కృష్ణపరమహంసను ('గురుదేవుని') అచంచల భక్తితో సేవించిన, మనకు దైవసాక్షాత్కారము సిద్ధించు నను సత్యమును మనము రామ కృష్ణానందస్వాముల జీవితమునుండి దెలిసికొనగలము. ఆయన దక్షిణమున రామేశ్వరము మున్నగు తీర్థముల సేవించియుండెను గాని, అది తనకొరకుగాదు! మాతృశ్రీ శారద, బ్రహ్మానంద స్వామి, ప్రేమానందస్వామి — వీరి కొరకు".

ఆయన దైవమునుగూడ సజీవవ్యక్తిగ భావించి పూజించును. ఆలయమున ఆయన గాంచునది దైవమునే, విగ్రహమును మాత్రము గాదు! రామకృష్ణపరమహంస యనిన, రామ కృష్ణానందునికి కేవలము దేవుడే, మనుష్య రూపమున; సకలదేవతాస్వరూపుడు కూడను. నవరాత్రియందు దుర్గాపూజ, గురుదేవుని చిత్ర మునకే. గురువే విష్ణువు, గురువే బ్రహ్మ, గురువే శివుడు. అతడే పరబ్రహ్మ — సకల దేవతలును ఆ మూర్తినుండియే అవతరించుట!

గురుదేవుని నామభజన చేయునపుడు, ఆయన భక్తిపారవశ్యముచే నృత్యము జేయును! గంటలకొలది అట్లు తన్మయత్వము జెంది యున్నప్పుడు, ఆయన దివ్యతేజస్సుతో ప్రకాశించును.

రామకృష్ణపరమహంసయందు శ్రీరాముని మధురమనోహరతయు, దివ్యార్జవమును, శ్రీకృష్ణుని సునిశిత వివేకమును, ధీశక్తియు అపూర్వరీతిని సమ్మిళితములై యున్న వని, రామకృష్ణానందులు నుడివి యున్నారు. గురు దేవుడుకూడ, ఏ దైవము రాముడుగను, కృష్ణుడుగను అవతరించి యుండెనో, ఆ దైవమే శ్రీరామకృష్ణుడుగ అవతరించె నని, మరణ శయ్యపై ప్రకటించి యుండెను గదా! రామ కృష్ణునిశక్తికి ఒక ఎల్ల లే దనియు, సమీపకాలమునందే ఆయన జీవితసందేశము ప్రపంచమునం దందరియందును సుప్రకాశ మగు ననియు, ఈ శిష్యశ్రేష్ఠుడు ఒకసారి నుడివెను.

రామకృష్ణానందుని పూర్వాశ్రమనామము, శశిభూషణుడు. ఆయన తన 20 వ యేట, ఎఫ్. ఏ. చదువుచున్నపుడు శ్రీరామకృష్ణుని ప్రప్రథమమున గలిసికొనెను. ఈయన జననము, 1863 జూలై నెలలో (ఆషాఢ, కృష్ణ త్రయోదశి). గురుదేవుని, ఆయన చివరి అనారోగ్యస్థితియందు సేవింప, బి. ఏ. పరీక్షకు ముందు తన చదువును వదలి వేసెను. కొంత కాలము బ్రహ్మసమాజమునందుండెను. ప్రథమ సమాగమమునందే, శశిభూషణుడు తన ప్రియ శిష్యుడు కాగల డని పరమహంస గ్రహించె నట. శశి తఱచు గురుదేవుని సందర్శించుచుండెను. 1883 నుండి 1886 వరకు (అనగా పరమహంస నిర్యాణమువరకు శశి ఆయనను కడు భక్తితో సేవించి, ఆధ్యాత్మికశిక్షణమును బొందెను. చివరిరోజులలో రాత్రింబవళ్లు ఆయనకు శుశ్రూష చేసెను! అందరి శిష్యులలో మిన్నగ ఒకక్షణ మైనను ఇతడు మాత్రమే గురుని విడిచి జరిగి యుండ లేదు. ఈ సమయమున గురుదేవుడు భగవంతుని అవతార మని దెలిసికొన గలిగెను. పరమహంసయే ఆయనకు సన్న్యాసాశ్రమము నొసంగెను.

రామకృష్ణ, శశిభూషణులకు గల సంబంధము, శ్రీరామునకును, ఆంజనేయులకును గల సంబంధమునంటిది! మన మెల్లరము శ్రీరామ కృష్ణానందుని దివ్యజీవితమునుండి గురుభక్తిని నేరుము గాత!

# వివేకానందస్వామినిగూర్చి జ్ఞప్తికివచ్చు కొన్నివిషయములు

మూలము :
**మిస్ జోసెఫైన్ మెక్లియాడ్**

అనువాదము :
**శ్రీ సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు**

(గతసంచిక తరువాయి)

బేలూరుమఠములో నొకనాడు, సోదరి నివేదిత వ్యాయామపు పోటీలలో పాల్గొన్న వారికి బహుమతులను పంచిపెట్టుచుండెను. నేను స్వామిజీ పడకగదియందు, కిటికీవద్ద నిలువబడి, చూచుచుంటిని. అప్పుడు ఆయన: "నేను నలువదవ ఏటిని ఎన్నటికిని చూడబోవుటలేదు" అనెను. (ఆయన వయస్సు 39 అని నాకు తెలియును).

నేను: "కాని స్వామీ, బుద్ధుడు తన మహత్కార్యమును 40 ఏండ్లు దాటినపిమ్మటను, 80 లోపుగను మాత్రమే జేసియుండెను" అంటిని. ఆయన: "నాసందేశమునిచ్చుట ముగిసినది. నేనిక నిర్గమింపవలయును" అనెను. "ఎందులకు?" అంటిని నేను. ఆయన "పెద్దచెట్టుయొక్క నీడ, చిన్నవానిని పెరుగనీయదు. ఇతరులకు స్థలమునిచ్చుటకు నేను పోవలయును" అని చెప్పినాడు.

పిమ్మట నేను మరల హిమాలయములకు వెళ్లితిని. నేను స్వామిని మరి చూడలేదు. రాజుగారి జ్యూబిలీకొరకై నేను ఐరోపాఖండమునకు మరలి వెళ్లితిని. నేనిదివరకు చెప్పినట్లు, నేనెన్నడును స్వామియొక్క శిష్యురాలినిగా నుండియుండలేదు; కేవలము స్నేహితురాలను. కాని, 1902 సం॥ ఏప్రెలులో నేనాయనకు వ్రాసిన ఆఖరు ఉత్తరములో ఈక్రింది వాక్యము గలదని నాకు స్పష్టముగ జ్ఞప్తియున్నది. (ఇదియే వీడ్కోలు లేఖ; నేనిండియానుండి వెడలిపోవుచుంటిని; ఆయన నిక చూచియుండలేదు): "నేను మునుగుట, తేలుట—మీతోనే". ఆ జాబును పంపుటకుమునుపు, మరల మరల, మూడుసార్లు చదివితిని; స్వగతముగ 'నేను నిజముగ నిట్టి నిశ్చయము కలిగియున్నానా' యని ప్రశ్నించుకొంటిని. నేను యథార్థముగ నట్టిభావముతోనుంటిని. ఆజాబు పంపబడెను. నాకు జవాబురాకున్నను, ఆయనకేమో అది చేరియేయుండెను. ఆయన 1902 సం॥ జూలై 4 వ తేదీన సిద్ధిని బొందిరి.

జూలై 2 వ తేదీనాడు సోదరి నివేదిత ఆయనను ఆఖరుపర్యాయముగ జూచెను. తనబడిలో శాస్త్రము నొకదానిని బోధింపవచ్చునాయని ఆయననడుగుటకు ఆమె వెళ్లెను. స్వామియిట్లు జవాబొసంగిరి: "నీవు చేయదలచినది సరియే కావచ్చును, కాని నామనస్సితరవిషయములయందు లగ్నమైయున్నది. నేను మరణమునకు సంసిద్ధుడ నగుచున్నాను".

కావున, ఆయన యుపేక్షాభావముతో నుండెనని ఆమె తలచెను, అప్పుడాయన: "కాని, నీవు భోజనముచేయవలయును" అనెను. సోదరి నివేదిత ఎల్లప్పుడును హిందువులవలె తన వేళ్లతోనే భుజించుచుండెను. ఆనాడు ఆమె భోజనముముగియగనే స్వామి ఆమెచేతులమీద నీళ్లుపోసిరి. శిష్యోచితముగ నామె: "మీరిట్లు చేయుట నేను ఒప్పుకొనజాలను" అనెను.

ఆయన: ''జీసస్ క్రైస్తు తన శిష్యుల కాళ్లను కడిగెను''.

ఈ క్రింది జవాబు నివేదిత నాలుక కొసన సిద్ధముగ నుండెను—

''కాని అదియే వారు కలిసికొనుటకు ఆఖరు పర్యాయము''.

అదియే స్వామిని ఆమె జూచుట కాఖరు సారి. ఆ ఆఖరురోజున, ఆయన నివేదితతో నన్ను గూర్చియు, ఇతరులను చాలమందిని గూర్చియు సంభాషించెను. నన్ను గుఱించి చెప్పునప్పుడు, ఆయన: ''ఆమె పరిశుద్ధతాస్వరూపము; ప్రేమదేవతా స్వరూపము'' అనిరి. కావున నే నెన్నడును ఆవారి పల్కులనే, నా కొసంగిన తుది సందేశముగ భావించితిని. మరి రెండురోజులలోనే వారు మరణించిరి. ఆయన ఆఖరు సందేశము: ''బేలూరునం దేర్పడిన యీ ఆధ్యాత్మికసంయోగము (ఇంపాక్ట్) 1500 సంవత్సరములపాటు ఫలప్రదముగ నుండగలదు. మరి యీ స్థలము ఒక గొప్ప విశ్వకళాపరిషత్తుగ నుండగలదు. నేనూరక ఏమో అనుకొనుచున్నానని భావింపవలదు; నేను స్పష్టముగ భావిని చూడగలుగుచున్నాడను''.

జూలై 4 తేదీన నాకిట్లు తంతినిచ్చిరి: ''స్వామి నిర్యాణమునొందెను''. రోజులకొద్ది నేనచేతనురాలనైతిని. నేనీ తంతికి జవాబైనను ఇయ్యలేదు. ఇక, నాజీవితము నావరించిన శూన్యతవలన, ఏండ్లకొలది నే నేడ్చుచుంటిని.

''నీ వెవరివలననైన గొప్పగా మార్పునొంది యుండిన, ఆ విషయమును నీ జీవితములో ధ్రువపరుపుము; కన్నీటివలనగాదు''.

అని చెప్పియున్న మెయిటర్ లిన్కు యొక్క గ్రంథమును చదివినపిమ్మటనే, నే నేడ్చుట మానితిని. అమెరికాకుమరలి, స్వామిజీ నివసించియుండిన స్థలములన్నిటిని కనిపెట్టుట నారంభించితిని. థౌసండ్ అయిలండ్ పార్కునకు వెళ్లి, అచట స్వామిజీ నివసించిన ఇంటి యజమానురాలు అగు డచర్ కన్య కతిథినయితిని. స్వామి నివసించిన గదినే ఆమె నాకునునిచ్చెను.

నే నిండియాకు మరల వెళ్లుట, పదునాలుగు సంవత్సరముల తరువాతనే, అపుడు నేను ఆచార్య గెడిస్ దంపతులతోపాటు వెళితిని. ఇండియా ఆశావిహీనముగ, దీనస్థితియందుండుటకు బదులుగా, స్వామిజీ యున్నతాదర్శములతో నిండియుండుటను కనుగొంటిని. సన్యాసి మఠములు ఆరు, వేలకొలది కేంద్రములును, వందలాది సంఘములును స్థాపితములయ్యెను. అప్పటినుండి నే నిండియాకు తరుచు వెళ్లుచున్నాను. ఇప్పటి, యువకులగు శిష్యవర్గము స్వామిజీని చూచి యెరుగరు. కావున, నేను వారికి వివేకానందస్మృతిని సజీవమొనరించుట వలన, మఠమునందు అతిథిగృహములో నా సాహచర్యమును వారు కోరుచుందురు. నాకో, ఇండియాయందుండుట యిష్టము; ఏలయన ఒకప్పుడు నేను స్వామిజీని: ''స్వామిజీ, నేను మీకు ఏవిధముగ ఎక్కుడు సహాయము చేయగలను? అని అడిగితిని. ఆయన: ''ఇండియాను ప్రేమింపుడు?'' అనిరి.

కావున, మఠమునందలి పైయంతస్తు నేను వెళ్లినపుడెల్ల నాకీయబడును; నాజీవితాంతము వరకును ప్రతి చలికాలమందును నే నచటికి వెళ్లెదనని చెప్పవచ్చును.

(ఈమె 14-10-1949 తేదీనాడు మరణించెను. ఈవ్యాసము శ్రీరామకృష్ణమిషన్ వారి ''ప్రబుద్ధ భారత'' ఆంగ్ల మాసపత్రికలో 1949 డిసెంబరులో ముద్రితము; దీనికి తర్జుమాయే మీరింతవరకు చదివినది).

# మాతృశ్రీ శారదాదేవి

[శ్రీమద్గంభీరానందవాణి]

## ధన్యమైన గ్రామము

పశ్చిమబంగాళము సారవంతమైనరాష్ట్రమే. కాని అందులో, బంకూరాలో మాత్రము తక్కినప్రాంతములందుకంటె భూసారము తక్కువ. కాటకములు తఱుచు. బంకూరాలో ఆగ్నేయమూలలో ఉన్నది జయరామవాటి అను చిన్న పల్లె. అందలి కర్షకులు మిగుల శ్రద్ధాళువులు. వారు తమ పల్లెలో, చుట్టు పక్కల ప్రాంతాలలో కంటె ఎక్కువగా వరిని, గోధుమలను, చెఱకును కూరగాయలను పండింతురు. ఆ పంటలతో ఆ పల్లె సదా కళకళలాడుచుండును; పరిసరప్రాంతాలకంటె జయరామవాటి అధికభాగ్యవంతమే. దీనికి మూడు మైళ్లు పడమరగా ఉండును శ్రీరామకృష్ణుని జన్మగ్రామమగు కామార్పుకురు. విష్ణుపూరుతాలూకా కోటుల్పూరు ప్రధాన ఠాణా పోలీసులకు చెందిన శిబిర మొకటి శిరోమణిపూరు నొద్ద నున్నది. అక్కడివారి అవేక్షణలోనిదే జయరామవాటి. ఈ గ్రామ వాయవ్యమూల నుండి ఆమోదర మను చిన్న జీవనది, తేటనీటితో, శిశువువలె వంకరటింకరగ నడచుచు తూర్పున కొక మైలు దూరము ప్రవహించి పల్లెకు ఉత్తరపుపొలిమేరగా నేర్పడుచున్నది. అట నుండి అది ఆగ్నేయముగ తిరిగి, కామార్పుకురులో ఒక భాగ మైన ముకుందపూరుమీదుగ సాగి, దక్షిణమునకు పాఱుచున్నది. ఆ ప్రవాహమునకు వెడల్పును లోతును రెండును తక్కువే కాని అక్కడక్కడ సుడులు ఉన్నవి. సుడు లున్న చోట లోతు ఎక్కువ, చేపలు నిండుగ నుండును, చిట్టిమొసళ్లును తఱచు ఆకృష్టము లగుచుండును. పల్లెకుత్తరభాగమున ఈ చిన్ననదిచే నొక ద్వీపకల్ప మేర్పడియున్నది. అది చక్కని ద్వీపకల్పము. దానిది ముక్కోణాకారము. అందులో నడిమి భాగము ఎత్తుగ ఉండును. అక్కడ పచ్చికయు ఎత్తైన చెట్లును ఉన్నందున, పగలిటి యెండ వేడిమి నోర్వక చల్ల నీడ నపేక్షించువారికి అది ఆశ్రయమై ఉన్నది. శ్మశానచిహ్నములు అట నట గలిగి అందుచే మఱింత యేకాంత మైన యా చోటు సంసారవ్యథలచే నిర్విణ్ణు లయిన వారిని రం డోయి రండి అని ఆహ్వానించుచున్నట్లుండును. పక్షుల కూజితములు శ్రోత్రపర్వములుగను, వృక్షములందలి ఫలపుష్పములు నేత్రపర్వములుగను ఉండును. శ్రీ శారదానందస్వామి, యోగిన్మా, గోలాప్మా మున్నగు వారికి ఈ చోటు ప్రియము. వారు నదిలో మునిగిన పిమ్మట, ఆ దినాలలో అట నట్ట నడుమ నుండిన ఉసిరికచెట్టుక్రింద గూర్చుండి దీర్ఘకాలము ధ్యానముననో 'చండీ' 'గీ'తాదిపారాయణముననో గడపుచుండిరి. శారదామాత తన పసిప్రాయమున విశేషదినాలలో అనుష్ఠానాంగస్నానమును ఈ నదిలో చేసెడిది.

జయరామవాటి సహజసన్నివేశము చాల

బాగున్నది. చుట్టును విశాలము లైన పొలాలు. ఆమోదరనదికిని పల్లెకును నడిమి భూమి దాదాపు అర మైలు పొడవు ఉండును. ఆ నేల మిక్కిలి సారవంతము. అక్కడనే గాక సమీప మందలి పొలాలలోను, శ్రద్ధాళువు లైన యా పల్లె ప్రజలు మామూలు కూరగాయలనే కాక, వరి, కాయధాన్యాలు, మిరపకాయలు, పసుపు మున్నగు ముఖ్యము లైన పంటలను పండింతురు. ప్రజల అక్కర లేమో మితములే. ప్రత్తిపంటయు నుండెడిదే. తటాకాలలో చేపలు సమృద్ధిగ నుండెడివి. పల్లెలో ఈ సమృద్ధి యంతయు మాతృశ్రీ అవతరించిన పిమ్మటనే గల్గినది అందురు. పల్లెలో ఆ దినాలలో అంగళ్లు లేవు. లేకున్నను ప్రజలు అన్య గ్రామాలపై ఆధారపడి యుండు వారు కారు. వారు తమ పొలాలలో లభించు దానితోనే సంతృప్తు లగుచుండిరి. అక్కఱ గలిగినప్పుడు వారు కామార్పుకురకో, ఆఱు మైళ్లు ఉత్తర మున నున్న కోటుల్పూరుకో, ఐదాఱు మైళ్లు నైరృతిగా ఉన్న కయాపాట్బదంగంజుకో పోయెడి వారు. కామార్పుకురులో తియ్య భక్ష్యాలు, కోటుల్పూరులో బట్టలు, ఉప్పు, సుగంధద్రవ్యాలు లభించెడివి. పడమరగా ఒక మైలు దూరాన ఉన్న షి.యోడులో చిల్లర సామానుల అంగళ్లుండెడివి. ఒకటిన్నర మైలు దూరాన ఉన్న పుకూరిలోను ఒకటి ఉండినది. జరూరు అక్కరలకు జయరామవాటి వారికి ఆ యంగళ్లు సరఫరా చేసెడివి. జయరామవాటికి ఉత్తరాన ఆమోదరనది కావలి గట్టున విశాల మగు పొలమున కవతల దేష్ట అను పెద్ద గ్రామ మొకటి కలదు. తూర్పునను విశాలము లగు వరిపొలాలు దాటినచో ఆమోదరనదీతీర మున్నది. నదిని దాటి అమర్పూరుగుండ పోయిన కామర్పుకూరు చేర వచ్చును. ఆ దారి వెడల్పు ఇప్పుడు హెచ్చింప బడినందున ప్రయాణమున కెక్కువ సౌకర్యముగ ఉన్నది. దాని కిరు వైపుల నీడ నిచ్చు పెద్ద చెట్ల చాళ్లున్నవి. గొల్ల పిల్ల లేమి, పాదచారు లగు బాటసారు లేమి విశ్రాంతికో చలువకో ఆ నీడల నాశ్రయించుచుందురు.

మాతృశ్రీకి ప్రభవ మైన ముఖర్జీవంశము వారు ఆ పల్లెలో ఎన్నాళ్ళనాఁడో చేరిపోయిరి. ముఖర్జీల బంధువులే బానర్జీలు. వీరు ఉభయులును బ్రాహ్మణకుటుంబాలవారు. వీరు తప్ప వేఱు బ్రాహ్మణకుటుంబములు ఆ పల్లెలో లేవు. తక్కిన వా రందఱును బ్రాహ్మణేతరులు. 'విశ్వాస్' 'మండల్' 'ఘోష్' 'సామయి' మున్నగునవి బ్రాహ్మణేతరుల కుటుంబ బిరుద నామములుగ నుండును. ఆ బ్రాహ్మణకుటుంబములు, కొన్ని గొల్లకుటుంబాలు, ఒక మంగలి కుటుంబము, భక్ష్యములను తయారుచేయు వారి కుటుంబ మొకటి, కమ్మరికుటుంబ మొకటి బాగ్దీ కుటుంబాలు కొన్ని నిరాడంబర మగు పల్లెజీవితము గడపుచున్నా రక్కడ. వారు వసించు మట్టియిండ్లు దాదాపు ఒక వంద ఉండును. పల్లె పేరు ఎట్లు వ్యుత్పన్నమయ్యెనో నిర్వివాదముగ మన కేమియు తెలియదు. ముఖర్జీవంశ మూలపురుషుని పేరునుండియో వారి యిలువేల్పు పేరునుండియో ఆ గ్రామ నామము వ్యుత్పన్నమై ఉండ వచ్చు నని ఊహింప వచ్చును.

ఆపల్లెలోదక్షిణభాగమునబాడుజ్యె(బానర్జీ) పుకుర్ అను పెద్ద సరస్సు ఒకటి కలదు. దాని చుట్టును పొడ వైన తాటిచెట్లు ఉన్నవి. పల్లె ప్రజల స్నానపానములకు ఆ తటాక ముపయోగపడుచుండెడిది. ఇంకను దక్షిణముగ ప్రాచీన

తటాక మొకటి ఉన్నది. అందు వికసించిన పద్మములు మెండుగ నుండును. పల్లెకు పడమటి వైపు ఆహిర్ అను పెద్ద చెఱువు ఉన్నది. కర్షకులు వ్యవసాయమునకు కావలసిన నీటికై దానిపై ఆధారపడి యుందురు. పుణ్యపుకుర్ అను ప్రాచీన తటాక మొకటి నడిమి భాగాన ఉన్నది. 1916 లో మాతృశ్రీకై నిర్మింపబడ్డ క్రొత్తయిల్లు దాని పడమటి గట్టుననే ఉన్నది. ఆ గట్టుననే ఉత్తరమువైపు దక్షిణముఖముగ చిన్న గుడిసె ఒకటి యున్నది. అది ముఖర్జీల గుడి, చాల ప్రాచీనము. ఆ గుడి యందలి గదులొకదానిలో కూర్మాకారము గల సుందర నారాయణు డను ధర్మదేవుని మూర్తి యున్నది. ముఖర్జీలు వంతుల ప్రకారము అచట ఆరాధన చేయుదురు. మఱియొక గదికి కాళిమాడొ అని పేరు. అట ఏటేట కాళిపూజ జరుగుచుండును. కుటుంబ కలహములచే అర్వాచీనకాలమున ఈ కాళిపూజ ఆగిపోయినది. ఈ గదియే పల్లె పాఠశాలగాను ఉపయోగపడుచుండినది. పసి బాలురును బాలికలును ఇట సమావేశ మగు చుండిరి. తాటాకులే వారి చేత నుండు వ్రాత సాధనాలు. మధ్యాహ్నపు చిఱుతిండికై వారు తమ బట్టల కొసలలో కరకర లాడెడి బొరుగులును (ముడిని) మూట కట్టుకొని యుందురు. ఆ గది కీశాన్యమూలలో నల్లరాయి ఒకటి ఉన్నది. అదే షష్ఠీదేవి. ఆ దేవి తన్ను పూజించు వారికి సంతతిని ప్రసాదించి కాపాడును. నూత్న వధూవరులను ఆదేవికి మ్రొక్కించుట ఆచారము. శ్రీరామకృష్ణుడును శారదా మాతయు గూడ ఆ దేవికి మ్రొక్కియుందురనియే మా నమ్మకము. షష్ఠీదేవి ఇప్పుడు సుందరనారాయణు డున్న గదిలోనే ఉన్నది. పుణ్యపుకుర్ దక్షిణపు టొడ్డు మీదుగ బోవు పల్లెవీథికి దక్షిణపు వైపున మొడల్పాద మున్నది. దానికి దక్షిణముగ సింహవాహిని గుడి యున్నది. చండియు మహామాయయు సింహవాహినికి సఖులు. సింహవాహిని పీఠము వేఱు, సర్పదేవత యగు మానసాదేవి పీఠము వేఱు. వంశక్రమముగ ఈ గుడులం దన్నిటను పూజారులుగ ఉన్న వారు ముఖర్జీలు. మన కథాకాలమున సింహవాహిని ఒక గుడిసెలో నుండెను కాని, ఇప్పుడు సిమెంటు నేలయు వంపులు గల యినుప రేకుల పైకప్పును గల గట్టి యింట నున్నది.

పుణ్యపుకుర్ దక్షిణపుగట్టు బానర్జీలు వసించుచుండిన చోటు. ఇటికలతో కట్టబడిన ప్రాత గుడి చావడి మొద లైన వానిని బట్టిచూడగా ఒకప్పుడు బానర్జీలు సంపన్నులై యుండి రని తెలియుచున్నది. కాని ఇప్పు డవి యెల్ల శిథిలావస్థలో నున్నవి. -

పుణ్యపుకుర్ గట్టున నున్న కాళిగుడికిని మాతృశ్రీ నూత్నభవనమునకును పడమట, ఉత్తరదక్షిణములుగ పోవు వీధియే ఈ పల్లెకు ప్రధాన మైన వీథి. ఆ వీధిలో కొంత ఉత్తరముగ పోవుదు మేని, ఎడమవైపు ఇటికలతో కట్టబడి తెల్లగ ప్రకాశించుచుండుగుడి ఉన్నది. మాతృశ్రీ జన్మించిన చోట నిర్మిత మైన గుడి అది. ముఖర్జీలలో వంశపూర్వులు వసించుచుండిన దిచ్చట. కాని ఆ వంశము పెరిగిన కొలదియు ఆ వంశీయులు నైరృతివైపునకు వ్యాపించిరి. వారి యిండ్లు పల్లెవీథికి పడమట తూర్పుముఖముగ నుండును, ప్రాతయింటికి తూర్పుగ ఒకగుడిసె ఉన్నది. అందు రెండు భాగములు. వెలుపటి భాగము అందఱును సమావేశ మగు గదిగ ఉపయోగపడుచుండెను. దంపకాల కొటారును వంటిల్లును దక్షి

ణపు వైపున నున్నవి. ముఖర్జీల యిప్పటి యిండ్లకు దక్షిణముగ మఱియొక వీధి ఉన్నది. ఆ వీధి, పల్లెప్రధానవీధినుండి ప్రారంభమై ఘోష్పాదమునకు దక్షిణముగను కలుగెడె అను తటాకపు టుత్తరతీరమునను పడమరగా సాగి ఆహిర్ తటాకపు టుత్తరతీరమున సిహోడు చేర్చు రస్తాతో కలియుచున్నది. ఘోష్పాదమునకు మిక్కిలి పడమట ధర్మదేవునిగుడి ఉన్నది. గుడి ఇటిక కట్టడము. ధర్మదేవునకు యాత్రా సిద్ధిరాయ డని పేరు. పొట్టి నాలుగు కాళ్ల పీట ఆయన లాంఛనము.

జయరామవాటి చుట్టు నున్న గ్రామాలలో శారదా శ్రీరామకృష్ణుల పవిత్రస్మృతిలక్షితములైన గ్రామాలను పేర్కొన వలయునన్న సిహోడును కోఆల్పారను ఆనూరును శ్యాంబాజాఱును పేర్కొన వచ్చును. శ్రీరామకృష్ణుని మేనత్తకూతురైన హేమాంగినీదేవికి అత్తగారిల్లు ఉండునది సిహోడులో. మాతృశ్రీశారదకు తల్లియైన శ్రీశ్యామసుందరీదేవి జన్మించిన ఊరు సిహోడే. ఈ ఉమ్మడి సంబంధముచే గురుదేవుడును మాతృశ్రీయు తమ శైశవమునుండియే తఱచు ఈ గ్రామముచే ఆకృష్టులగుచుండిరి. అనంతరకాలమున కలకత్తాకు రాకపోకలు చేయుచు విష్ణుపూరుగుండ పోవునపుడెల్ల మాతృశ్రీ కోఆల్పారాయొద్ద ఆగెడిది. ఆనూరు విశాలాక్షిగుడికి ప్రసిద్ధము. ఆ గుడికి పోవు దారిలోనే గురుదేవునకు శైశవమున భావోద్రేకదశ గలిగినది. శ్యాంబాజాఱులో ఆయన ఒకసారి సప్తాహసంకీర్తనలో పాల్గొనెను. జయరామవాటికి తూర్పున ఆమోదర నది కావలి గట్టున తాజ్పూరు అను పెద్ద పల్లె ఉన్నది. దానికి దక్షిణాన జిబ్టా. జయరామవాటి భూస్వాముల యిండ్లుండు చోటు అది. నైరృతిగా ఉన్నది మసినాపూరు, పడమటికి సిహోడు. ఈ గ్రామా లన్నియు జయరామవాటికి ఒక మైలుకు లోబడిన దూరమువే. సిహోడుకు పడమట శిరోమణిపూరు. అక్కడ ప్రజలు మహమ్మదీయులు. అట నొక పోలీసు ఠాణాయు ఉన్నది.

కలకత్తానుండి జయరామవాటికి చాల దూరము లేదు కాని, మనకథాకాలమున ప్రజలు గ్రామవీథులగుండను పొలాలగుండను కష్టపడి నడచి పోయెడి వారు. దారులు దుర్గమములుగ నుండెడివి. దొంగభయము తఱచు. ఆ గ్రామమును చేరుట కష్టముగ నుండెడిది. బండ్లలోను పల్లకీలలోను ప్రయాణము చేయు భోగము సంపన్నులకు మాత్రమే సాధ్యపడెడిది. ఆ దారులలో ఒకటి కామార్పుకురు ఆరాంబాగ్ తారకేశ్వరముల గుండ పోయెడిది. తారకేశ్వరము శివునిగుడికి ప్రసిద్ధము. ఆరాంబాగుకును తారకేశ్వరమునకును నడుమ నున్న విశాల సమభూమికి తెలోభెలో అని పేరు. అచట పయనించుట పట్టపగలైనను సాపాయమే. కావున ప్రజలు ఒంటరిగ కాని రాత్రులందు కాని అమార్గమున పోవుటే లేదు. ప్రజలు సాధారణముగ అనుసరించుచుండిన రెండు దారులలో అదే దగ్గఱదారి. దానిగుండ పోయిన కలకత్తా జయరామవాటినుండి ఇంచుమించు అరువదిమైళ్లు దూరము. దక్షిణేశ్వరమున గురుదేవుని కలసికొన నేగునప్పుడెల్ల మాతృశ్రీ మామూలుగ పయనించుచుండిన దారి ఇది.

రెండవ దారి బర్ద్వానుగుండ పోవును. బర్ద్వాను రైల్వేస్టేషను. ఈ దారి దూరము. దొంగల భయము ఇక్కడను లేక పో లేదు. ఇప్పుడు జయరామవాటికి పోవువారు కలకత్తా

నుండి రాత్రి రైలుబండిలో తరలి విష్ణుపురము నకు చేరుకొందురు. అక్కడనుండి బస్సులో పోవలెను. వాన లేని కాలములో బస్సులు జయరామవాటివఱకు పోవును, వానకాలమున కొటుల్పూరునొద్ద ఆగును. కొటుల్పూరునుండి జయరామవాటి ఆరు మైళ్ల దూరము. ఆదూర మును కాలినడకమీదనో బండిలోనో యథా సౌకర్యము పయనింపవలసి యుండెడిది. జయ రామవాటికి ఏకాలములో నైనను పోవుటకు సౌకర్యముగ క్రొత్తరోడ్డు ఒకటి 1953 లో నిర్మింపబడినది. కాలక్రమమున ఆ వీధి కామా ర్పుకురువఱకు పొడిగింపబడ వచ్చును.

ఈలాగు నవ్యనాగరతాస్పర్శకు దవ్వున నున్నను, జయరామవాటి గ్రామములో ఉత్సవ విశేషాలు లేక పోలేదు. అవి ప్రతిసంవత్సరము వచ్చు ఉత్సవవిశేషాలే. ఆ గ్రామాధిదేవత సింహవాహిని. ఆ అమ్మవారి ఉత్సవాలు ఆశ్వ యుజ మాసములో జరుగును. వానికి అన్ని ప్రాంతాలనుండియు ప్రజలు వత్తురు. తక్కిన వేల్పులకును దేవేరులకును సంబంధించిన ఉత్సవ దినాలు కూడ యథావిధిగను ఎంతో విభవ ముతోను కొనియాడబడుచుండును. శివరాత్రి నాడు ఈ పల్లె ప్రజలు సిహోడులో శాంతి నాథు (శివు)ని సేవింప బోవుచుందురు. ఏకాహ నామసంకీర్తనలును పురాణేతిహాసకథలు ఇతి వృత్తములుగా గల పల్లెనాటకాల ప్రదర్శనా లును జరుగుచుండును. ఆ ప్రదర్శనాలపై ప్రజ లకు ఆదరమును మోజును హెచ్చు.

జయరామవాటినిగూర్చి పైని చెప్పబడిన విశేషా లన్నింటిని మించిన విశేష మొకటి కలదు. ఏ దనగా మాతృశ్రీ శారద ఆగ్రామ ములో అవతరించుటే. అందుచే అది పవిత్ర క్షేత్ర మైనది. ప్రపంచ మందలి అన్నిప్రాం తాల నుండియు యాత్రికులు ఆత్మనిర్వృతికై అచటికి వచ్చుచుందురు. గుడి తెలి గోపురము మీది టెక్కెముపై వంగభాషలో చెక్కబడిన 'మా' (=అమ్మ) అను అక్షరాలు పల్లె పెంపును పాంథులకు దూరమునుండియే చాటు చుండును. ఈ గుడి ప్రతిష్ఠ 1923 వ సంవత్స రము ఏప్రిలు నెల 19 తేది (అక్షయ తృతీయ) నాడు జరిగినది. ఆ దినము ఇప్పటికిని కొని యాడబడుచున్నది. వివిధప్రాంతాలనుండివచ్చు నూర్లకొలది భక్తుల ఆనందమేళనము ఆనా డచ్చట ఒనగూడు చుండును. జగద్ధాత్రీ పూ జయు ప్రతిసంవత్సరమును జరుగుచుండును? దానికి ప్రారంభకురాలు మాతృశ్రీశారదా మణిని కన్న తల్లి. అందులకు వలసిన శాశ్వ తపు ఏర్పాట్లు మాతృశ్రీయే కావించినది. జగద్ధాత్రీపూజయు తక్కినవానివలె భక్తులకు ప్రియమే. భౌతికముగను మానసికముగను ఆధ్యాత్మికముగను ప్రజల కున్న అక్కరలను దీర్చు శ్రీరామకృష్ణమఠ శ్రీరామకృష్ణ సేవా సంఘ శాఖలు ఈ పల్లెలో నెలకొల్పబడుటతో దీనిపై ప్రజల యాదరము మరింత హెచ్చినది. మార్గోపద్రవాలు తొలగి ప్రయాణసౌకర్య మేర్పడినందున ప్రజలను ఈ పల్లె మఱింతగ ఆకర్షించుచున్నది. మాతృశ్రీ అవతరించుటచే ఈ క్షుద్రగ్రామము ఇంత స్వల్పకాలములో ఇంత ప్రాముఖ్యమునకు వచ్చుట అద్భుతము. మాతృ శ్రీయే ఇచటి భూరజమును తల దాల్చి—

''జననీ జన్మభూమి శ్చ స్వర్గా దపి గరీయసీ''.

[జన్మభూగరిమకు జననిమహిమకు
స్వర్గవిభూతియు సరి గాదు చూడ].

అని కీర్తించెను.



ఓం

# శ్రీ రామకృష్ణ దివ్యవాణి

## శ్రీమతి హెచ్. కనకలక్ష్మమ్మ గారు

నేననుట పతనమునకు మూలము. ఈ నేనను నహంత నశించుటయే ముక్తి యన బరగును. అవిద్యాసంభవ మగు దేహాహంత మొదటికే నాశనహేతువు. ఇక రెండవది విద్యాహంకారము లేక జ్ఞానాహంకారము. ఇది బంగరు సంకెల వంటిది. దీనిని విడువ నిష్టపడడు విద్యాహంకారి. కాని పరమాత్ముని యనంతకృపావృష్టి యాతనిపై వర్షించిన త్వరలో నీజ్ఞానాహము రూపు మాయును. భగవానుని కృప లేనిది యిట్టి మహాపదవిని గాని, అంతటి శక్తి గాని ఏ మానవునకును గలుగదు. మహాభక్తుడే జ్ఞానియై వెలుగుచున్నాడు. మహాజ్ఞానియే విజ్ఞానియై అనగా అనుభవ మగు జ్ఞానమును బడయ గల్గుచున్నాడు. ఇచ్చటనే భక్తుడు పెక్కు ఇడుమల గుడువ వలసి వచ్చుచున్నది. ఇట్టి విశుద్ధామనస్కు యోగారూఢుడగుటకు ఈ నేను, నేనను, నహంత తన్ను నిజజ్ఞానమున మునుగ నీయక యసంబద్ధ మగు ప్రకృతి జీవాహంకార మగు ఈశ్వరత్వమున ముంచుచున్నది. ఈశ్వరత్వము ఎంతమాత్రము శాశ్వతము గాదు. దానిని దాట వలెను. నేతి, నేతి, యని పోయిన గాని సంపూర్ణానంద శాంతులను బడయ జాలడు. నామములవాడు వచ్చును, పోవును. విభూతిదారి వచ్చును, పోవును. ఇంత యేల? మూడు లోకము లగు వైకుంఠ, కైలాస, సత్య లోకములును అశాశ్వతములే. మూడు గుణముల ప్రోవు లగు నీ మూర్తిత్రయము ఎటుల శాశ్వతు లగుదురు? మరియు వారి లోకము లెట్లు శాశ్వతము లగును? లోకమే కాని యలోకమును గూడ నతిక్రమించిన, నచట వెలుగు దివ్యజ్యోతిలో లీనము కావలసిన దివ్యాత్మను సంకుచితము లగు లోకముల బట్టి బంధింపదలంచుచున్నారా? వల్ల కాదు, మీరు నిలుప దలంచినను అది నిలుచునది కాదు. శాశ్వత మొక్కటియే శాశ్వతము కాని, యశాశ్వత మని దెలిసియు లోకములను లోకపాలకులను నిలుప దలచు నీవు నిజముగ జ్ఞానివి గావు. రూప నామాతీత మగు భావమున దెలియ వలసిన చైతన్యమును నహంత మూలమున నెట్లు దెలిసికొందువు? ఏలనగా, నీవుండిన నాతడు లేడు. ఆతడుండిన నీవు లేవు. ఇక చీకటియు వెలుగును నొకేపరి ఉండుట ఎట్లు పొసగును? లేదా నీవు భక్తుడవైనచో, ఆతడు యజమాని యనియు, నీవు సేవకుడ వనియు నుండుట సరి యగునే గాని, జ్ఞానమునకు ఏకాత్మ యొక్కటియే కాని ద్వైతభావ మచట లేదు. కావుననే సంపూర్ణుడు మాట లాడడు. ఇంకను, తానే పరమాత్ముడు కావున, వేరొక్క దైవమును జూపడు. మరల తా నను వాడు, తాను కాదు గనుక, నేననడు. ఈతడే, బుద్ధిమంతుడు. ఇట్టిబోధయే, బుద్ధునిబోధ యని తెలియునది.

పరమాత్ముడు నిరామయుడు. అనగా శరీరము లేని వాడు. ఐనను పరిశుద్ధుడు అనగా

జీ వాహంకార ప్రకృతులు లేని వాడు. ఆనంద రూపి, అనగా సుఖము, దుఃఖము, వేడి, చల్లన, చీకటి, వెలుగు, రాత్రి, పగలు, భూతము, భవిష్యత్తు, బంధము, మోక్షము అను ద్వంద్వ ములు లేని వాడు. నిశ్చలుడు. పరమసత్య మాతడే యై యున్నాడు. అంతటను నిండి యున్నాడు. పతనము లేని వాడు పుణ్యపాప ము లంటని వాడు, శాస్త్రాతీతుడు, జగ న్నాథుడు. మరియు సర్వాలయందు నిండి యున్నాడు. చరాచరములను సృష్టించిన వాడు. తాను సృష్టింపబడని వాడు. జననమరణములు లేని వాడు. జ్ఞాన ముండిన కాని ఆ నరుని యందు లేని వాడు గాడు. అజ్ఞానియందును నిండి యున్నాడు. పండితునియందును, నల్పుని యందును సమభావమున నిండి యున్నాడు. కావున మహాత్ములకు పాపులయందును భగ వానుడు గోచరించుచున్నాడు. జ్ఞాన ముండిన కాని యీ పరమ సత్యము అవగాహనము కా నేరదు. నీవు భక్తుడవే యగుదువు గాక కాని రాజసిక భక్తుడ వగుచో ఆ నిర్మలు నెటుల గాంచ గల్గుదువు? ఇట్టి రాజసిక భక్తికి జెందిన వారలే, హిరణ్యకశిపు రావణాదు లని జ్ఞప్తి యం దుంచుకొన వలెను. తపస్సు చేయనిది, భక్తులు కానిది రాక్షసు లగుటకును సాధ్యము కాదు. ఇట్టి రాజసిక తపస్సు వలన నే యొక్క లాభమును లేదు. నేను భక్తుడ ననుకొనుట తప్ప నంతకు మించిన సుఖము లేదు. పరపీడ నము గూడ సహాయపడెద నని యుత్సాహిత లూగును. కాక పోయిన కొన్ని రాక్షసశక్తులు కలుగ వచ్చును పో, వానిని జూచుకొని మిడిసి పాటు పడు వాడేమి ముక్తి కాంతామణిం జేపట్టం గల్గును? కావున సాత్విక భక్తి ముఖ్యము. జనక, శుకాదులు సత్వభక్తిసంప న్నులు. ఇది నా దనక, నే ననక, వాదములు సలుపక నిర్వైరులై, సకలజీవరాసులను ప్రేమ మున జూచుచు, తిట్టిన దిట్టక, గొట్టిన గొట్టక, అలిగిన నలుగక, అపకారికి నుపకా రము జేయుచు, కులభేదము లెంచక, వీరు పాపులు, వీరు పుణ్యాత్ములని నిరసింపక, సమ దృష్టిని వారల ప్రేమించు మహాసాత్వికశిరో మణి. శ్రీ యేసుక్రీస్తు కూడ నిట్టి భక్తవతంసుల శ్రేణికి జెందిన భక్తరత్నమే.

ఎంత అందముగ నున్నది? వీరి ప్రవర్తనము! అయ్యారే! మన మెప్పు డైనను వార లంతటి వారల మగుదుమా? అది దేవుని కరుణపై నాధారపడియున్నది. కావున మునుముందు నేర్వ వలయు గుణము సత్వసంపద యని తెలియ వలెను. కామ క్రోధ ద్వేషాసూయల అశుద్ధము వలె తక్షణమే విడువ వలయును.

ఓం తత్ సత్.



సత్సంగతి బియ్యమును కడుగు నీటివంటిది. ఆ కడుగునీరు త్రాగుడు కైపును తొలగింపగలదు. అట్లే వ్యర్థాశామద్యపానోన్మత్తులై నవారి కైపును సత్సంగతి తొలగించును.

శ్రీరామకృష్ణుడు

శ్రీం శ్రియైనమః

శ్రీరంగాచార్యగురవేనమః

# షడ్వింశత్యేకాదశీవ్రతవైభవము

శ్రీ కిడాంబి రంగాచార్యులుగారు

సమస్తలోకములకు కర్తయు భర్తయు హర్తయు నైన హరికి ప్రియమైన దినమనియు. ఏకాదశీవ్రతము సర్వపాపహర మనియు, పుణ్యప్రద మనియు, ఇహపరసాధన మనియు నెల్లరు ఎరింగిన విషయమే. దశమీతిథియందు ఏకభుక్తము, ఏకాదశ్యుపవాసము, ఆ రాత్రి భగవద్ధ్యాన కీర్తనాదులతో జాగరణము, ద్వాదశియందు ఏకభుక్తము — ఏకాదశీవ్రతవిధాన మని ప్రసిద్ధము. ఇట్టి ఏకాదశి తిథులు మాసమునకు రెండు చొప్పున సంవత్సరమునకు 24 వచ్చును. అధికమాసము వచ్చినచో 26 ఏకాదశులు అగును.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | కార్తీకమాసము. | | బహుళ | ఏకాదశి | ఉత్పత్తి. | |
| 2. | మార్గశిర | ,, | శుద్ధ | ,, | మోక్షదా | బ్రహ్మాండపురాణము. |
| 3. | ,, | ,, | బహుళ | ,, | సఫలా | |
| 4. | పుష్య | ,, | శుద్ధ | ,, | పుత్రదా | భవిష్యోత్తరపురాణము. |
| 5. | ,, | ,, | బహుళ | ,, | షట్తిలా | భవిష్యత్పురాణము. |
| 6. | మాఘ | ,, | శుద్ధ | ,, | జయా | భవిష్యత్పురాణము. |
| 7. | ,, | ,, | బహుళ | ,, | విజయా | స్కాందపురాణము. |
| 8. | ఫాల్గుణ | ,, | శుద్ధ | ,, | ఆమలకీ | బ్రహ్మాండపురాణము. |
| 9. | ,, | ,, | బహుళ | ,, | పాపమోచనీ | భవిష్యత్పురాణము. |
| 10. | చైత్ర | ,, | శుద్ధ | ,, | కామదా | వరాహపురాణము. |
| 11. | ,, | ,, | బహుళ | ,, | వరూధనీ | భవిష్యత్పురాణము. |
| 12. | వైశాఖ | ,, | శుద్ధ | ,, | మోహినీ | కూర్మపురాణము. |
| 13. | ,, | ,, | బహుళ | ,, | అపరా | బ్రహ్మాండపురాణము. |
| 14. | జ్యేష్ఠ | ,, | శుద్ధ | ,, | నిర్మలా (నిర్జలా) } | భారతము. పద్మపురాణము. |
| 15. | ,, | ,, | బహుళ | ,, | యోగినీ | బ్రహ్మవైవర్తపురాణము. |
| 16. | ఆషాఢ | ,, | శుద్ధ | ,, | పద్మా (శయన) } | బ్రహ్మాండపురాణము. భవిష్యోత్తరపురాణము. |
| 17. | ,, | ,, | బహుళ | ,, | కామికా | బ్రహ్మవైవర్తపురాణము |

| | | | | |
|---|---|---|---|---|
| 18. | శ్రావణ మాసము. | శుద్ధ ఏకాదశి | పుత్రదా | భవిష్యత్పురాణము. |
| 19. | ,, ,, | బహుళ ,, | అజా | బ్రహ్మాండపురాణము. |
| 20. | భాద్రపద ,, | శుద్ధ ,, | పరివర్తినీ | స్కాందపురాణము. |
| 21. | | బహుళ ,, | ఇందిరా | బ్రహ్మవైవర్తపురాణము. |
| 22. | ఆశ్వయుజ | శుద్ధ | పాశాంకుశా (పాపాంకుశా) | బ్రాహ్మపురాణము. |
| 23. | | బహుళ | రమా | బ్రాహ్మపురాణము. |
| 24. | కార్తీక | శుద్ధ | ప్రబోధినీ | స్కాందపురాణము. |
| 25. | అధికమాస | శుద్ధ | పద్మినీ. | |
| | | బహుళ | పరమా. | |

## "పుత్రదా" నామ శ్రావణ శుద్ధైకాదశి :

దీని మాహాత్మ్యము భవిష్యత్పురాణము నందు గలదు. పాపహార మైన ఈ కథను వినుటచే వాజపేయ యజ్ఞఫలము లభించును. ద్వాపరయుగప్రారంభమున పూర్వము మాహిష్మతీపురమును మహీజిత్తను భూపాలుడు సర్వజనులకు సుఖప్రదుడై ధర్మముగ బరిపాలించుచుండెను. అతనికి పుత్రులు లేక పోవుటం జేసి రాజ్యసుఖ మెంతమాత్రమును లేదు. "అపుత్రస్య సుఖం నాస్తి ఇహలోకే పరత్ర చ" అను వచనమును తలచుచు సభామధ్యమున ప్రజలతో నిట్లని పలికెను. "ఈజన్మమందు నే నేమియు పాతకముల జేసి యుండ లేదు. అన్యాయముచే నుపార్జితమైన ధనముచే నా కోశము నిండింపబడి యుండ లేదు. బ్రాహ్మణులయొక్కయు దైవములయొక్కయు ధనము నాచే నెన్నడును పరిగ్రహింపబడియుండ లేదు. ఇతరుల ద్రవ్యము నాయొద్ద న్యాసముగా నుంపబడిన నద్దాని నెన్నడు నేను అపహరించియుండ లేదు. ప్రజలను సొంత కుమారులవలెనే పరిపాలించుచున్నాను. భూమిని ధర్మమార్గమున జయించి యున్నాడను. బంధుపుత్రసమానులైనను దోషములచే దుష్టులైన వారిని శాస్త్రప్రకారము దండించుచునే యున్నాడను. శిష్టాచారసంపన్నులను బ్రాహ్మణులను సదా పూజ చేయుచు ధర్మమార్గముననే సంచరించుచున్నాడను. నాకీ పుత్రసంతానప్రాప్తి లేకపోవుటకు హేతువు విచారింపు" డని పలుకగా బ్రాహ్మణులీ వాక్యముల విని పురోహితులు ప్రజలు కలిసి రాజహితమును గోరినవారై అరణ్యమును గూర్చి పోయి ఋష్యాశ్రమముల సేవించుచు అందు ధర్మతత్త్వజ్ఞుడును, సర్వశాస్త్రవిశారదుడును, దీర్ఘాయుష్మంతుడును, నిరాహారుడును, జితక్రోధుడును, జితాత్ముడును, మహాత్ముడును ప్రతియొకకల్పాంతమునకు నతనిశరీరముపై గల రోమములలో నొకటి వంతున నూడిపోవుచుండువా డగుటచే "లోమశ" నామము గల వాడును త్రికాలజ్ఞుడును, బ్రహ్మతేజముతో విరాజిల్లువాడును నగు మహామునిని జూచి వార లందరు సంతుష్టమనస్కులై తమ భాగ్యవశమున అట్టి బ్రహ్మర్షి దర్శనము సంప్రాప్తించె నని వారిలో వారు చెప్పుకొనుచు అమ్మహామునికి విధిప్రకారముగ నమస్కారాదు

లొనరించిరి. అంత నా మునియు ''మీరు వచ్చిన కారణం బెయ్యది? మీరు వచ్చిన కార్యమును దప్పక నెరవేర్చెదను. నిస్సందేహముగ పరోపకారమునకే మావంటివారి జననము'' అని చెప్పగా — ''మేము మహీజిన్మహారాజుప్రజలము. రాజు పుత్రహీనుడై దుఃఖించుచుండ తత్ప్రాప్తికి తప మొనరించుటకు మే మీ అరణ్యమునకు వచ్చినారము. అదృష్టవశమున సాక్షాద్బ్రహ్మస్వరూపు లైన తమ దర్శన మబ్బినది. ''మహాత్మాం దర్శనే నైవ కార్యసిద్ధి ర్భవే న్నృణామ్'' అను వాక్యము చొప్పున మాకు కార్యసిద్ధి గలుగును. మా రాజునకు పుత్రోత్పత్తి యగు మార్గ ముపదేశింపు''డని ప్రజ లామునిపుంగవుని ప్రార్థింప వారి వాక్యముల నాకర్ణించి లోమశుడు ముహూర్తమాత్రము ధ్యానములో నుండి రాజుయొక్క పూర్వజన్మవృత్తాంతమును దెలిసికొన్నవాడై యిట్లని పలికెను - ''ఈ రాజు పూర్వజన్మమందు ధనహీనుడైన యొక వైశ్యుడు. ఆతడు వ్యాపారమున గ్రామాంతరముల దిరుగాడుచు జ్యేష్ఠమాసశుక్లపక్షద్వాదశి రోజున మధ్యాహ్నకాలమున ఎండచే దాహము గొని యొక రమ్యమైన జలాశయము నొద్దకు బోయి అట కపుడే ఈనిన గోవు నిదాఘార్తయై జలపానము జేయుచున్న దానిని అపవారించి తాను నీరమును ద్రావుటచే గలిగిన తత్కర్మపరిపాకముచే పుత్రహీనుడైన రాజై పుట్టెను. పూర్వజన్మకృతపుణ్యావిశేషముచే నిష్కంటకమైన రాజ్యప్రాప్తి నొందెను''. అని లోమశమహర్షి నుడువగా — ''పుణ్యముచే పాపము క్షయించు నని పురాణములవలన విని యుంటిమి. ఏపుణ్యముచే పాపము క్షయించునో యే ప్రసాదమున ఏరీతిగా పుత్రప్రాప్తి నొందనగునో నయ్యది ఉపదేశింపు'' డని జనులు కోరగా శ్రావణమాస శుక్లపక్షమందు వచ్చు ''పుత్రదా'' అను ఏకాదశీ వ్రత మాచరించి యథావిధిగ యథాన్యాయముగ యథోక్తముగ జాగరణ జేసి తద్వ్రతఫలమును రాజున కర్పించిన పుత్రుడు గలుగు నని లోమశమహర్షి ఉపదేశింప జను లంద రా మునికి నమస్కరించి వారి గృహముల కేగిరి. లోమశభాషితమును స్మరించుచు జను లందరు రాజుతో గూడి శ్రద్ధతో నా వ్రత మాచరించి ద్వాదశీదినమున నా పుణ్యమును రాజునకు ధారవోయ తత్ప్రభావమున రాజుభార్య గర్భిణియై సుపుత్రుని గనెను. కాబట్టి యీ యేకాదశి ''పుత్రదా'' అను నామముచే ఖ్యాతి నొందినదాయెను. ఇహలోకపరలోకసుఖమును గోరు వా రంద రీ వ్రతమును నాచరింప దగును. ఈ మాహాత్మ్యమును వినినవారికి సర్వపాపములు నశించి ఇహలోకమున పుత్రసౌఖ్యము గలిగి పరలోకమున ఉత్తమగతి గలుగును.

## ''అజా'' నామ శ్రావణబహుళైకాదశి :

దీని మాహాత్మ్యము బ్రహ్మాండపురాణమందు గలదు. ఈవ్రతము నాచరించు వారును ఈకథను విను వారును పాపములనుండి విముక్తి నొందుదురు. ఇందుల కెంతమాత్రము సందేహము లే దనియు సత్య మనియు శ్రీకృష్ణభగవాను డాన తిచ్చెను. పూర్వము సత్యసంధుడైన హరిశ్చంద్రు డను విఖ్యాతినాముడైన చక్రవర్తి యుండెను. కర్మయోగము వలన రాజ్యభ్రష్టుడై భార్యను పుత్రుని విక్రయించి, చివరకు దాను కూడ విక్రీతుడై పుల్కసునకు

దాసుడై సత్యవ్రతమునే ఆధారముగా జేసికొని కాటికాపరిగా ననేకవత్సరములు కాలముగడపి దుఃఖితుడై యుపాయము గాన లేక విచారించు చుండ బ్రహ్మశాసనానుసారము గౌతము డా చక్రవర్తి యెదుట ప్రత్యక్షము కాగా సాష్టాంగ దండప్రణామం బొనరించి తన దుఃఖభాజనమైన చరిత్ర నంతయు విన్నవించి త న్నిష్కృతికి ఉపాయమును బ్రార్థింప నా గౌతముడు శ్రావణ బహుళైకాదశీ దినమున వచ్చు "అజా" నామ వ్రత మాచరించిన పాపము లన్నియు బోవు నని ఉపదేశించి అంతర్ధాన మయ్యెను అంత నా నృపుడు గౌత మాజ్ఞాను సారము "అజా" వ్రత మాచరించిన వెంటనే తత్ప్రభావ విశేషమున పెక్కు వత్సరము లను భవింప వలసిన దుఃఖము క్షయము నొంది భార్యను గూడి పునర్జీవితు డైన పుత్రుని గలిసి నిష్కంటక మైన తన రాజ్యమును బొందిన వాడై పెక్కువత్సరములు ధర్మపరిపాలనము జేసి అంతమున పురజనసహితముగ స్వర్గము నొందెను. ఎవరీ వ్రతమునాచరింతురో వారును ఈప్రకారముగనే సర్వపాపవిముక్తులై ధ్రువ ముగా స్వర్గము నొందుదురు. ఇది చదివినను విన్నను అశ్వమేధ ఫలము గలుగును.



# శ్రీ కృష్ణలీలల అంతరార్థము

శ్రీ గురుభక్తి పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు

## శకటాసుర భంజనము

భక్తుడు భగవంతుని గూర్చి తపస్సు చేసి నచో నాతనిమనస్సు కొంతకాల మేకాగ్రతతో నిలుచును. కాని అనేకజన్మ వాసనలతో సూక్ష్మదేహములో ప్రోగుపడియున్న జ్ఞాపక ములను బట్టి బాహ్య విషయములు జ్ఞప్తి చలించిపోవును.

అప్పుడు భక్తుడు తిరిగి ఏకాగ్రతలోనికి వచ్చుటకు ఈ జ్ఞాపకముతోకూడుకొనియున్న విషయవాసన లను బండిని త్రోసివేయును. అదియే అంతర్ముఖుడగుట. త్రోసివేసినగాని మనసు నిలువదు. ఈ ప్రకారము చాలకాలము సాధనముచేయుచు రాగారాగా మన స్సేకా గ్రతలోనికి వచ్చును. ఇందుకు కావలసిన సాధకము వైరాగ్యాభ్యాసము.

## తృణావర్త సంహారము

గడ్డిపరకలవంటి సామాన్య మానవులు సుఖ దుఃఖములు వచ్చినపుడు దానిలో కొట్టుకొని పోవుదురు.

భక్తు డట్లుగాక వివేకముచేత నేకాగ్రతను వృద్ధిచేసికొని సుఖదుఃఖములను తృణముగా జూచును గర్వింపడు. దుఃఖింపడు.

సుడిగాలియని చెప్పబడు ప్రబల సుఖము

గాని ప్రబల దుఃఖముగాని జ్ఞాని మనస్సును చలింపచేయలేవు.

జ్ఞానము వానిని తృణప్రాయముగా జూచును. జయించును. దాటును. జ్ఞాని నెట్టి ద్వంద్వములు నడ్డజాలవు. చలింపజేయలేవు.

## శ్రీ కృష్ణుడు మన్నుతినుట తల్లికి విశ్వరూపమును చూపుట

భక్తుడు జ్ఞానము వృద్ధికాగా మన్ను తిన్నాడు. అనగా త్రిదేహాభిమాన రహితుడైనాడు. ఈ దేహములన్నియు మన్నే. ఈ త్రిదేహములు నశించునవి. మట్టిలో కలియునవి. కనుకనే త్రిదేహాతీతుడైనాడు. తన్ను తాను తెలిసికొనినాడు. అనగా భక్తున కాత్మ సాక్షాత్కారమైనది.

అట్లాతడు అభిమానములను త్రిదేహములను మ్రింగివేసెను. హరించెను, రహితము చేసెను. ఇట్టి ఆత్మ సాక్షాత్కారమగుట కొంచెముసేపే పిమ్మట జీవుడు దేహములోనికి వచ్చును. జీవునకు భక్తి జ్ఞాన వైరాగ్యములు పుట్టినవి. జీవునకీ మూడు నభివృద్ధియైనపుడు ఆత్మ సాక్షాత్కారమైనది. తిరిగి సమాధినుండి జీవుడీ దేహములోనికి వచ్చినపుడు మామూలుగానే వ్యవహరించును. కాని యీ ప్రకృతి యంతయు మిథ్యయని తెలిసికొని దానిలో నుండెడి సత్పదార్థమునే గ్రహించుచు ఆనందించు చుండును.

ఈ దేహము నేనుకాదు. నేను సర్వాంతర్యామిని. సర్వ భూమండలములు నాలోనే యున్నవని తెలిసికొనును.

స్వస్వరూపానుభవమును పొందినవానికి బాహ్యప్రపంచమందు రుచి యుండదు. కాంచనము లోష్టము సమానముగా నుండును. కాంతాకనకములం దాకర్షణయే యుండదు. విముఖుడై యుండును.

మట్టి ప్ర॥ మట్టితోనే సర్వము చేయబడ్డది. కనుక మట్టిని మ్రింగినాడనగా జీవుడు ప్రకృతిని లోబరుచుకొని దాని కతీతుడైనాడన్నమాట. దేవుడే మొదటి పరిణామస్థితులలో ప్రకృతికి లోబడి జీవుడై యనుభవజ్ఞానమును పొంది ప్రకృతిని జయించి తుదకు ప్రకృతి కతీతుడై సంపూర్ణత్వము పొందును. అట్టివాడు సర్వాంతర్యామియే. ప్రకృతిలోని పదునాలుగు భువనములు వాని కడుపులోనే యున్నవి. సృష్టియంతయు భగవంతుని దేహమే.

త్రిదేహములను విడుచుటయే ముక్తి. ముక్తిగలిగినవానికి స్వస్వరూపానుభవము కలుగును. ఇక్కడ యశోద యనగాముక్తియే. ముక్తి భర్త ఆనందము. ముక్తికి ఆనందానుభవమే గనుక విశ్వరూపదర్శనమైనది.

ఏయే లక్షణములు కలవారికి విశ్వరూపము కనబడునో ఆలక్షణములు వర్ణింపనలెను. యశోదరూపములో చెప్పనలెను.

## శ్రీకృష్ణుని ఉలూఖల బంధనము

శ్రీకృష్ణుని మొలను ఒక త్రాటితో రోటికి కట్టవలెనని ప్రయత్నించిరి ఎంత పొడుగుగల త్రాడును తీసికొనివచ్చి చుట్టపెట్టినప్పటికిని కొంచెము తక్కువవచ్చినదట.

ఏలయన:—శ్రీకృష్ణుడు అనంతుడు. ఆదిమధ్యాంతరహితుడు. త్రాడు ఆద్యంతములు కలది. ఆదిమధ్యాంతరహితమైన మొలకు ఆద్యంతయుతమైన త్రాడెట్లు సరిపోవును. శ్రీ

త్రాడు కట్టలేక సిగ్గుపడవలసి వచ్చినది.

భగవంతుడు తాను యిష్టపడి మనలను గట్ట నిచ్చిన సాధ్యమగునుగాని ఆతని యిష్టమునకు వ్యతిరేకముగా చేయుట కెవరికి సమర్థతగలదు? శ్రీకృష్ణుడు తన మహాత్త్మను గనబరచి మీాడు కట్టలేరనిపించి అప్పుడు తిరిగి కట్టబడుటకు సంకల్పించెను. అప్పుడే అతనిని కట్టగలిగిరి.

భగవంతుడు ''అణోరణీయాన్ మహతో మహీయాన్''. అణువులలో నీయనకన్న తక్కువ యణువులేదు. ఈయనను మించిన పెద్ద వస్తువులేదు, కనుక వానిని కట్టువస్తువు లేనేలేదు. అణువుగానున్నప్పుడు కట్టబోయిన దొరకడు. జారిపోవును. పెద్దవస్తువుగా నున్నప్పుడు కట్టవలెననిన ఎవరికిని నందనే యందడు. ముడివేసిన త్రాటికి ఎంతోకొంత కైవారమున్నది. ఆకైవారముకంటె బహు సూక్ష్మమయినప్పుడా కైనారమేమి లాభము? త్రాడు త్రాడువలెనే యున్నది ముడిముడివలెనే యున్నది. దానిలో శ్రీకృష్ణుడు సూక్ష్మముగ నున్నాడు గనుక కనిపింపడు ఆకాశమంతయు త్రోవయే గనుక యది పెనుత్రోవ. దీని నెవరు కట్టకలరు? ఇది కనిపించెడివస్తువు కాదు. కనిపింపనిదానిని మనము బంధించుటెట్లు? అంతకంటెను సూక్ష్మమగు శ్రీకృష్ణు నెవరు బంధింపగలరు? ఆతని బంధింపగల త్రాడే లేదు.

జ్ఞానాతీతుడగు భగవంతుని వివేకమను రోలు కట్టుట యసంభవము. వివేకము లేనివాడు జ్ఞానియేకాడు. జ్ఞాని యనగా వివేకము గలవాడే. జ్ఞానము వివేకము క్రొత్తగా తీసికొనివచ్చి పెట్టుకొనదగినవి కావు అవి లోపలి నుండి వృద్ధికావలసినవి. శ్రీకృష్ణుడు మనుష్యమాత్రుడుగా వ్యవహరించెను. కనుక వివేకమను రోటిని కట్టించుకొనెను. రోలు అనగా ధాన్యపుగింజలోని ఊకనుండి బియ్యపుగింజను విడదీయునదని యభిప్రాయము. అనగా భక్తుడు సదసద్వివేకముగలవాడుగా నుండును.

# శ్రీ వివేకానందస్వామి

[ 95-వ జయంతి మహోత్సవోపన్యాసము ]

( ప్రభాకర్ )

## I

శ్రీ స్వామిజీ తొంభై ఐదో జయన్తి మహోత్సవాన్ని పురస్కరించుకొని మనం ఇక్కడ ఇప్పుడు సమావేశమై ఉన్నాం. స్వామిజీ జీవితంలో నుంచిన్నీ వారి ఉపన్యాసాల నుంచిన్నీ మనకు ఉపలభ్యమానమై ఉన్న సందేశాన్ని మనం మళ్లా ఒకసారి స్మరించవలసిన దినం ఇది. 'బోధయన్తః పరస్పరమ్' అన్నట్లు మనలో మనం ఒకరి కొకరం ఆ సందేశవిశేషాలను వివరించుకో వలసిన దినం ఇది. ఆత్మముక్తికిన్నీ జగద్ధితమునకున్నూ స్వామిజీ మార్గం చూపెట్టినారు. సనాతనమార్గమే ఐనా ఇప్పటి ప్రపంచ పరిస్థితులకుతగ్గట్లు ఆమార్గాన్ని చికిలి నగషి చేశారు. ఆ మార్గాన్ని అనుస

రిస్తూ పురోగమించే ఉద్యమానికి మనలను మనం పునరంకితం చేసుకోవలసిన దినం ఇది.

II

కాలిఫోర్నియాలో లాస్ ఏంజలిస్ అను చోట స్వామిజీ 1900-వ సంవత్సరములో ఒక ఉపన్యాసం చేశారు. అది క్రైస్తును గురించిన ఉపన్యాసం. 'క్రైస్తు ది మెసెంజర్' అని ఉపన్యాసానికి పేరు. దివ్యసందేశహారి యైన, దూత ఐన క్రైస్తు అని అర్థం. ఆ ఉపన్యాసంలో క్రైస్తును గురించి వారు సెలవిచ్చిన కొన్ని వాక్యాలు ఉన్నాయి. ఆ వాక్యాలు ఒక్కొక్క-అక్షరమూ మనం స్వామిజీని గురించి కూడా చెప్పుకో తగినవిగా ఉంటున్నాయి. ఆ వాక్యాలను మాత్రం అనువదించి ముందుగా మనవి చేస్తాను. ''క్రైస్తు ఆచార్యకం [మినిస్ట్రీ] చెల్లింది మూడేండ్ల కాలమే. ఐనప్పటికిన్ని అనంత కాలానికి ఉపాదేయములైన విషయాలు గ్రాహ్యములైన అంశాలు ఆ ఉపదేశంలో ఉన్నాయి. ఆ ముల్లె మూటను విప్పుకొనే పనినే మనం ఇప్పటికి ఇంకా చేస్తున్నాం. పందొమ్మిది శతాబ్దాలు గడచి పోయాయి. ఆ మహనీయుడు మనకు ప్రసాదించి పోయిన విజ్ఞాన ధనం ఇంత అని తెల్సుకోవడానికి గాని దాన్ని సమగ్రంగా మన అనుభవానికి తెచ్చుకోడానికి గాని ఇంకా ఎంత కాలం పడుతుందో, ఎవరు చెప్ప గలరు?'' అన్నారు. ఇవి క్రైస్తును గురించి స్వామిజీ అన్న మాటలు. స్వామిజీ విషయం చూడండి. వీరు పురుషాయుస్సు జీవించినవారు కారు. వేదాదివాఙ్మయంలో పురుషాయుష్యం అంటే నూ రేండ్లు. మనం ఎఱిగినంతలో వాస్తవికంగా చూచినా, డెబ్బై ఎనభై ఏళ్లు పురుషాయుస్సు. స్వామిజీ పురుషాయుస్సు జీవించిన వారు కారు. శ్రీశంకరాచార్యుల జీవితకాలం వలెనే స్వామిజీ జీవితకాలం కూడా చాల కొద్దియే. మన భౌతిక దృక్పథం నుండి మఱుగు పడి పొయ్యే టప్పటికి స్వామిజీకి ముప్పై తొమ్మిదో సంవత్సరం నిండ లేదు. కాని ఆ అల్ప కాలంలోనే ఆయన కాషించిన ప్రచారప్రబోధ ప్రభావం మన దేశంలోను బయటి దేశాల లోను అను గుంపు శక్తిలాగా వ్యాపించింది. మన దేశంలో అంతటా నూతనమున్నూ ఆత్యంతికమున్నూ అక్షయమున్నూ అమోఘమున్నూ ఐన ఉత్సాహం వెల్లి విరిసింది— స్వామిజీయే ఈలాగు అన్నారు—

నర్ కాన్ట్ రెసిస్ట్ హర్ (ఇండియా) ఎనీ మోర్; నెవర్ ఈస్ షి గోయింగ్ టు స్లీప్ ఎనీ మోర్; నో ఔట్వర్డ్ పవర్స్ కాన్ట్ హోల్డ్ హర్ బాక్ ఎనీ మోర్; ఫార్ ది ఇన్ఫినిట్ జయంట్ ఈస్ రైసింగ్ టు హర్ ఫీట్.

భారతదేశాన్ని ఇక ఎవరూ ప్రతిఘటింప లేరు; భారతమాత ఇక ఎన్నటికీ నిద్రింపదు; బాహ్యాశక్తులు ఏవిన్నీ ఆమెను వెనుక్కు నెట్ట లేవు. మహాభూతం లేస్తూ ఉంది—అన్నారు. దేశంలోని ఆ ఉత్సాహఫలితంగా విప్లవోద్యమం తల ఎత్తింది. అనర్గళంగా సాగింది. అరవిందయోగి లోకమాన్య బాలగంగాధర తిలక్ గాంధిమహాత్ముడు మొదలైన మహాపురుషులు నాయకత్వం వహించారు. దేశ స్వాతంత్ర్యం సిద్ధించింది. ఈ స్వాతంత్ర్య ధర్మానికి ప్రవక్త ప్రవర్తకుడు శ్రీవివేకానంద స్వామి. ఐతే స్వామిజి లోకానికి లక్ష్యంగా ప్రదర్శించిన స్వాతంత్ర్యం చాల విశాలమైంది. ఇప్పుడు మనం సాధించుకొన్న స్వాతంత్ర్యం, రాజకీయ స్వాతంత్ర్యం మాత్రమే, రాజకీయ బంధం మాత్రమే తొలగిందన్న మాట. అన్ని బంధాలు తొలగ వలె. బంధాలను తొలగించు

కోవడమే మనం పడే పాట్లకు అన్నిటికీనీలక్ష్యం. ముక్తి అంటే ఏమి? పరిపూర్ణ స్వాతంత్ర్యమే ముక్తి. అట్టి స్వాతంత్ర్యానికి మూర్తీభావము భగవంతుడొక్కడే. కాబట్టి భగవదన్వేషణ మున్నూ స్వాతంత్ర్యాన్వేషణమున్నూ రెండు ఒక్కటే. ఆ విశాల స్వాతంత్ర్యంలో రాజకీయ స్వేచ్ఛ సాంఘిక స్వేచ్ఛ వైజ్ఞానిక స్వేచ్ఛ – ఈ స్వేచ్ఛలన్నీ అంగాలు. ఆవిశాల స్వేచ్ఛ వైపు మనంపురోగమించ వలె, పురోగమి స్తున్నాం, స్వామిజీ కలిగించిన ఊపు మనలను ఆశిఖరానికి చేర్చి తీరుతుంది. మన దేశానికి మహోజ్జ్వల మైన భవిష్యత్తు ఉంది అని తమ దివ్యదర్శ నంలో స్వామిజీ ప్రత్యక్షంగా చూచారు. దాని సాధనకు అవశ్యకాలున్నూ అమోఘాలున్నూ ఐన ప్రణాళికలను సూచించారు. వాని ఆచరణ ప్రచారాల కనియే ఈ మఠాలను మిషనుశాఖ లను మన దేశంలోనే కాక దేశాంతరాలలోను నెలకొల్పారు.

III

స్వామిజీని గురించి ప్రసంగించే టప్పుడు సాధారణంగా పేట్రియట్ మాంక్ అని వ్యవ హరి స్తుంటారు. సన్న్యాసి దేశభక్తుడు అని అర్థం. స్వామిజీ దేశభక్తియొక్క ప్రత్యేకతను మనం గుర్తించ వలె. అదే మనకు గొప్ప గుణ పాఠం నీతిపాఠం ఔతుంది. ఆయన దేశభక్తి మిక్కుటమైంది. దేశభక్తి ఆయనలో రూపు దాల్చింది అని చెప్పినా సమంజసంగానే ఉం టుంది. దేశభక్తి స్ఫోరకాలైన వారి వాక్యాలు ఎన్నైనా ఉన్నాయి. "భారతదేశపు మట్టి కూడా నాకు పరమపవిత్రం, భారతదేశంలో వీచే గాలి కూడా నాకు పరమపవిత్రం, భారత దేశం నాకు యాత్రాస్థలం" అన్నారు. "నా దేశంలో ఒక్క కుక్క ఐనా సరే పస్తు ఉండే వఱకు దానికి అన్నం పెట్టడమే నా ఆస్తిక్య సర్వస్వం' అన్నారు.

దైవభక్తి గురుభక్తి రాజభక్తి మొదలైన భక్తులలో ఉండే టట్లే దేశభక్తిలో కూడా ప్రకారభేదాలు దశాభేదాలు ఉన్నాయి. దృష్టి సంకుచితమైనప్పుడు భక్తి ఒక విధంగా ఉం టుంది, దృష్టి విశాలం ఐనప్పుడు భక్తి ఇంకో విధంగా ఉంటుంది. సంకుచిత దృష్టితో కూడిన భక్తి కలవాడు తన లక్ష్యాన్ని మాత్రం ఆద రింప గలుగుతాడు. దాని కంటె వేరైన వాని విషయంలో అతనికి సహనం ఉండడం అరుదు, ద్వేషం ఉండడం తఱచు. అతని లక్ష్యంవైపు అతనిని త్రిప్పితే అతడు భక్తుడు, అతనికిలక్ష్యం కాని దానివైపు అతనిని మళ్లిస్తే అతడు ద్వేషి. తన లక్ష్యం మీద ఏ చేతితో పూలు చల్లు తాడో తన లక్ష్యం కానిదానిమీద అదే చేతితో రాళ్లు రువ్వుతాడు. లీలాశుకుడు శైవుడు.

'శైవా వయం న ఖలు తత్ర
విచారణీయం, పఞ్చాక్షరీ
జపపరా నితరాం'

మాకు మంత్రం పంచాక్షరి, మాకు దైవం శివుడు, అందుకు ఏమీ సందేహం లేదు అన్నాడు. ఐతే బాలకృష్ణలీలలు ఆయనమన స్సును ఆకర్షించి ఆయనను గొప్ప కృష్ణభక్తు ణ్ణిగా చేసి అతనిచేత శ్రీకృష్ణకర్ణామృతం అనే గ్రంథాన్ని కూడా వ్రాయించాయి. ఆ కృష్ణ భక్తుడి యెదుట రాముడు ప్రత్యక్షమైనాడట. రాముడూ కృష్ణుడూ ఇద్దఱూ ఒక్కరే అని తెలిసినవాడే ఐనా మన లీలాశుకుడు ఏం చేశాడు? ప్రత్యక్షమైన రాముడికి నమస్కారం కూడా పెట్ట లేదు. పైగా ఈలాగు అన్నాడు "నీవున్నూ కృష్ణుడున్నూ ఒక్కరే కా వచ్చు. మీకు ఉండే భేదం వేషంలో మాత్రమే కా

వచ్చు. "నా కృష్ణవేష మైతేనే నాకునచ్చు తుంది కాని ఇప్పుడు నీవు వేసికొని వచ్చిన యీ వేషం నాకు గిట్టదు. వేషం మార్చుకొని రా, కృష్ణుడి వేషం వేసుకొని రా, తర్వాత నమస్కారం చేస్తాను'' —

విహాయ కోదణ్డశరౌ ముహూర్తం
గృహాణ పాణౌ మణిచారువేణుం
మాయూరబర్హం చ నిజోత్తమాఙ్గే
సీతాపతే త్వాం ప్రణమామి పశ్చాత్.

విల్లూ బాణాలు పారవేయి. పళపళ ప్రకాశిస్తూ అందంగా ఉండే పిల్లంగ్రోవి చేతికి తీసుకో, ఒక నెమలి పురిని తలలో చెరువుకో, తర్వాత నీకు నమస్కారం పెడతాను — అన్నాడు. ఇదే విధంగా తన కక్షమీద తన వర్గంమీద తన శాఖమీద తన జాతిమీద తన మతంమీద తన దేశంమీద మాత్రమే భక్తిన్నీ ఇతర కక్షలమీద ఇతరవర్గాలమీద ఇతరశాఖల మీద ఇతరజాతులమీద ఇతరమతాలమీద ఇతరదేశాలమీద అసహన ద్వేష భావా లున్నూ ఉండడం సంకుచితదృష్టిఫలితమే. విశాలదృష్టితో గూడిన భక్తి గల వాడు తన లక్ష్యంమీద ఎంత ఆదర మైనా చూపుతాడు కాని తన లక్ష్యం కాని దాన్ని కంటగించు కోడు, ద్వేషించడు. అంతే కాక జగన్మంగళాన్ని ఆశిస్తాడు. మన కక్ష శ్రేయం పొంద వలె, ప్రతికక్షా శ్రేయం పొంద వలె; మన వర్గానికి మేలు కలుగ వలె, ప్రతివర్గానికి మేలు కలుగ వలె. మన శాఖ తనకు అర్హ మైన ప్రాధాన్యం గడించుకో వలె. ప్రతిశాఖకు, దానికి తగిన ప్రాధాన్యం ఉండ వలె. మన జాతి బాగుపడ వలె, ప్రతి జాతి బాగుపడ వలె, మన మతం మనకు నిశ్శ్రేయసప్రదం, ప్రతిమతమున్నూ దాన్ని ఆస్థతో అనుసరించే వారికి నిశ్శ్రేయస ప్రదమే. మన దేశాని అభ్యుదయం కలుగ వలె, ప్రతిదేశాని అభ్యుదయం కలుగ వలె. అఖండజగచ్ఛరీరంలో ప్రతిదేశమూ ఒక అవ యవం. శరీరం సుస్థితిలో ఉండ వలె నంటే ప్రతి అవయవం సుస్థితిలో ఉండ వలె. మానవ తతి శ్రేయం పొందవలె అంటె ప్రతికక్ష ప్రతి వర్గం ప్రతిశాఖ ప్రతిజాతి ప్రతిమతం ప్రతిదేశం శ్రేయం పొంద వలె. విశాల దృక్పథం వల్ల కలిగే ఈ సామరస్యమే భక్తికి ఉదాత్తతా పరిణతిని కలిగిసుంది. భక్తికి అలంకార మే ప్రకాశపరుస్తుంది. అట్టి భక్తి స్వామిజీది.

## IV

ఒక్కొక్కరి దగ్గర ఒక్కొక్క మేలిమి సుసమృద్ధంగా ఉంటుంది. అదే ఇతరుల దగ్గర తక్కువగా ఉండ వచ్చు. ఏది ఎవరి దగ్గర హెచ్చుగా ఉందో దాన్ని వారు ఇతరులకు వినిమయం చెయ్య వలె. భౌతిక రసాయని కాది శాస్త్ర పరిజ్ఞానం ఐహిక సంపదలు ఇవి పాశ్చాత్య దేశాలలో అపరిమితంగా వెల్లి కొల్లగా ఉన్నాయి. భారతదేశంలో ఆ పరి జ్ఞానం తక్కువ. ఐహికసంపదలు తక్కువ. పైగా దారిద్ర్యదేవత విలయతాండవం చే స్తుంటుంది. కాబట్టి పాశ్చాత్యులు ప్రాచ్య దేశాలలో ఉండే ఈ లోట్లు తీరే టట్లు తోడ్పడ వలె. అట్లే భారతీయులలో ఆధ్యాత్మికదృష్టి, ఆస్తిక్యం, అనిత్యవస్తువిరక్తి, నిత్యతత్త్వపిపాస, దానిసిద్ధికి సాధనావిధానాలు సమృద్ధిగా అనాది కాలంగా ఉంటున్నాయి. ఇవి పాశ్చాత్యదేశా లలో మృగ్యాలు. భారతీయులు వీనిని పాశ్చా త్యులకు వినిమయం చేయ వలె. ఇది శ్రీస్వామిజి ప్రణాళికకు హృదయం. ప్రతి ఒక్కరూ తమ వద్ద ఉన్న దాన్ని ఇస్తూ లేని దాన్ని తెచ్చు కుంటూ, సమష్టిశ్రేయస్సుకు పాటు పడ వలె.

పాశ్చాత్యులప్రజ్ఞ మనప్రజ్ఞ పాశ్చాత్యుల విజ్ఞానం మన విజ్ఞానం మేళనం పొంద వలె. పాశ్చాత్యులది అధునాతన దృక్పథం, మనది సనాతన దృక్పథం. సనాతనం అంటే ప్రాతది అని అనుకుంటారేమో, కాదు సార్వకాలికం అని అర్థం, నిత్యం అని అర్థం. దేహమనశ్శక్తుల పోషణం పాశ్చాత్యుల లక్ష్యం, ఆధ్యాత్మికశక్తి వర్ధనం మన లక్ష్యం. సంఘసేవ వారి ఆదర్శం, భగవత్సేవ మన ఆదర్శం. పాశ్చాత్యుల దృక్పథం పాశ్చాత్యుల లక్ష్యం పాశ్చాత్యుల ఆదర్శం — అవిన్నీ గొప్పవే, ఆవశ్యకాలే. కాని అవి మాత్రం ఉంటే చాలదు. మన దృక్పథం మనలక్ష్యం మనఆదర్శం ఇవిన్నీ గొప్పవే ఆవశ్యకాలే, కాని ఇవి మాత్రం ఉంటే చాలదు. అవీ ఇవీ కలిసి సర్వత్ర వెలసిన ట్లయితే అప్పుడు లోకకల్యాణం, విశ్వశ్రేయం జగన్మంగళం సాధ్య మౌతుంది. పూర్వకాలం లో మన పెద్దలు మన వర్ణవ్యవస్థను మాత్రం మనస్సులో ఉంచుకొని క్షత్రబలమున్నూ బ్రహ్మతేజమున్నూ కలిసిన ట్లైతే లోకశ్రేయస్సు కలుగుతుంది అన్నారు

పవనాగ్ని సమాగమో హ్యయం
సహితం బ్రహ్మ యదస్త్ర తేజసా

అన్నాడు కాళిదాసు. అస్త్రతేజంతో కూడిన బ్రహ్మతేజం వాయుసహకృతమైన అగ్నిలాగా ప్రజ్వరిల్లుతుంది అని అర్థం. ఇప్పటి ప్రపంచా నికి సరిహద్దులు హిమశైలసేతువులు కావు. ఇప్పటి విశాలప్రపంచపరిస్థితులలో పాశ్చాత్యు లది క్షత్రతేజం. భారతీయులది బ్రహ్మతేజం. ఈ తేజోద్వయ మేళనమే సకలార్థసాధకం. ఇదే స్వామిజీ సందేశం.

## V

ఈ సందేశం స్వామిజీ ఉపన్యాసాల మూలం గా మాత్రమే కాక, వారి జీవితం మూలంగా కూడ తెలుస్తూ ఉంది. ఆయన సంపన్న కాయస్థ వంశంలో అవతరించారు. ఆస్తిక వైజ్ఞానిక వాతావరణంలోనే వర్ధిల్లినారు —

నాయ మాత్మా బలహీనేన లభ్యః

అని అనంతరకాలంలో వేదాంతకేసరిగా గర్జింప నున్నందుకు అనురూపంగానే వారు స్వయంగా బలోత్సాహములకు అక్షయనిధులుగ ఉండే వారు. ఆయన నీతి ధర్మనిష్ఠ అప్రకంప్య మైంది. (వెరి స్ట్రాంగ్ మారల్ కారక్టర్) అన్నిటికిన్నీ పునాది అదే. అది ఉంటే అన్నీ సుసాధ్యాలే ఔతాయి. అది లేక పోతే ఏదీ సాధ్యం కాదు. దుర్వార మయిన సత్యాన్వేషణ తృష్ణ గల వారు స్వామిజి. ఆ తృష్ణను తీర్ప గల వ్యక్తిని కలుసుకొనేంతవఱకు, ఆ తృష్ణ ఆయనను నెమ్మ దిగ ఉండ నీయ లేదు. ఆయన పాశ్చాత్యవిద్యా విజ్ఞానాలను అధికరించారు. అవి ఆయన తృష్ణను ఉద్దీప్తపఱిచాయే గాని తీర్ప లేదు. శ్రీరామ కృష్ణునితోడి సమాగమమే ఆయన తృష్ణను తీర్చింది. 1880 వ సంవత్సరంలో నరేంద్రనాథ శ్రీరామకృష్ణులు కలసికొన్నారు. ఆ కలయిక ఎంతో ప్రాముఖ్యం గల కలయిక. గురుదేవుని కలసికోవడానికి మునుపటి నరేంద్రనాథుడు అప్పటంగా పాశ్చాత్య విజ్ఞాన సంప న్నిధి. నరేంద్రనాథాది బ్రాహ్మసమాజీయులను కలసికోవడానికి మునుపటి శ్రీరామకృష్ణులు అప్పటంగా ఆర్ష భారతీయ విజ్ఞాన సంప న్నిధి. లోకకల్యాణసాధకమైన భగవదంశం మొదట శ్రీరామకృష్ణుడుగా భారతీయ విజ్ఞానసంపదను ప్రోగు చేసికొని, నరేంద్రునిలో మూర్తీభవిం చిన పాశ్చాత్యవిజ్ఞానసంపదను తనయొద్దకు ఆకర్షించుకొని రెండు విజ్ఞానాల కలయికను సాధించుకొన్నది. నరేంద్రనాథ శ్రీరామకృష్ణుల

కలయిక అధునాతన సనాతన దృక్పథాల కలయిక, పాశ్చాత్య ప్రాచ్య విజ్ఞానాల కలయిక దేహమనఃపాటవాలకున్నూ ఆధ్యాత్మికశక్తికిన్నీ కలయిక. సంఘసేవాదర్శానికిన్నీ భగవత్సేవా దర్శానికిన్నీ కలయిక. వేఱే వేఱేగా ఉండే టప్పుడు అవి నరేంద్రునిలో ఇవి శ్రీరామకృష్ణునిలో ఉంటూ వచ్చాయి. అవి రెండు వ్యక్తిత్వాలు. రెండూ కలిసి ఒక్క మహావ్యక్తిగా రూపొందాయి. ఆ మహావ్యక్తియే శ్రీ వివేకానందస్వామి.



# వార్తలు, విశేషాలు

## స్వామి రామకృష్ణానందజీ మహారాజుల తొంభై ఐదవ జయన్తి

1957 వ సంవత్సరం జూలై తే 25 ది గురువారం రామకృష్ణానందస్వాముల జయంతి తిథి పూజ మైలాపూరు శ్రీరామకృష్ణమఠంలో జరిగింది. ఆ నాటి కార్యక్రమం — ఉదయం 5 గంటలకు మంగళారాత్రికం, భజన; 6 గంటలకు గీతోపనిషత్పారాయణాలు; 8 గంటలనుండి 11 గంటలవఱకు చండీపారాయణం, విశేష పూజ, భజన; 11 గంటలనుండి 12 గంటల వఱకు హోమం, భోగం, ఆరాత్రికం; 12 గంటల నుండి 2 గంటలవఱకు దరిద్రనారాయణసేవ, ప్రసాదవినిమయం; సాయంకాలం 7 గంటల నుండి 7–30 గంటలవఱకు ఆరాత్రికము, భజన; 7–30 గంటలనుండి 8–30 గంటలవఱకు శశిమహారాజచరిత్రపఠనం, గోష్ఠి; శశిమహారాజుల జీవితవైభవాన్ని విశేషాలను గూర్చి ఆంగ్లమున శ్రీమచ్చిద్భవానందస్వాములయు శ్రీమదోజసానందస్వాములయు శ్రీ K. బాలసుబ్రహ్మణ్యయ్యారు, B. A., B. L., M. L. C. గారియు ఉపన్యాసాలు.

బహిరంగోత్సవము తే 28–7–1957 ది ఆదివారము. మధ్యాహ్నం 3 గంటలనుంచి 5 గంటలవఱకున్నూ శ్రీ విద్వాన్ ఉడయలూరు రాజగోపాలశర్మగారు కణ్ణప్పనాయనారును గూర్చి హరికథాకాలక్షేపమును శ్రావ్యంగా శ్రోతృహృదయంగమంగా సాగించారు. 5–30 గంటలకు మఠంలో పౌరసమావేశం. తిరుప్పరైత్తురై శ్రీరామకృష్ణతపోవనాధ్యక్షులైన శ్రీమత్స్వామి చిద్భవానందులు సభాధ్యక్ష్యం వహించారు. మద్రనగర మఠాధ్యక్షు లయిన శ్రీమత్కైలాసానందస్వాములు సభకు స్వాగత మంగళం అనుగ్రహించారు. రామకృష్ణమిషను హైస్కూలు మాజీ ప్రధానోపాధ్యాయు లైన శ్రీ N. సుబ్రహ్మణ్యం[అణ్ణా]గారు తమిళంలోను, జైన కళాశాలాధ్యక్షు లైన శ్రీ A. L. కృష్ణను గారు ఆంగ్లంలోనున్నూ శ్రీరామకృష్ణానంద స్వాముల జీవితవిశేషాలను ఉపదేశాలను గూర్చి ఉపన్యసించారు. సభాధ్యక్షు లైన శ్రీ చిద్భవానందస్వాములు శశిమహారాజుల నిస్స్వార్థ గురుసేవా మహిమను అరవంలో అద్భుతంగా ఉపన్యసించారు. ఉత్సవ నిర్వాహకవర్గ కార్య ప్రొఫెస్సరు శంకరనారాయణను గారి కృతజ్ఞతావందనసమర్పణంతో సభాకార్యక్రమం ముగిసింది.

## శ్రీరామకృష్ణమఠ ధర్మవైద్యశాలలో 'ఎక్స్‌రే'శాఖకు ప్రారంభోత్సవం

కేంద్రప్రభుత్వంవారున్నూ పౌరమహాశయులున్నూ ఇచ్చిన విరాళాలతో మఠధర్మవైద్యశాలలో 'ఎక్స్‌రే' శాఖను నెలకొల్పారు. దానికి ప్రారంభోత్సవాన్ని 1957 వ సంవత్సరం ఆగస్టు తే 4 ది ఆదివారం సాయంకాలం 4-15 గంటలకు చెన్నరాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కామరాజనాడారుగారు జరిపారు. నాటి సభకు వారే అధ్యక్షులు. భజన ప్రార్థనల కనంతరం మఠాధ్యక్షులు శ్రీమత్కైలాసానందస్వాములు మొదట సదస్సుకు స్వాగతం పలికారు. లండను నగరంలో శ్రీరామకృష్ణవివేకానందకేంద్రానికి అధిపతులుగా ఉంటున్న శ్రీమద్ఘనానంద స్వాములు ఆనాడు తలవనితలంపుగా చెన్ననగరంలో ఉండినారు కాబట్టి వారు సభ్యుల కోరిక పై శ్రీరామకృష్ణసంఘసేవాదర్శాన్ని గూర్చి ఉపన్యసించారు. మఠశ్రీకార్యనిర్వాహకులైన శ్రీ శుద్ధసత్త్వానందస్వాములు ధర్మవైద్యశాలనుగూర్చిన సంగ్రహనివేదిక చదివి ఎక్స్‌రే శాఖ నెలకొల్పడం ఏలాగు నెఱవేఱిందిన్నీ వివరించారు. ముఖ్యమంత్రి పూజ్యశ్రీ కామరాజనాడారుగారు తమిళంలో ఉపన్యసిస్తూ తుపాను వరదలు కాటకాలు మొదలైనవి సంభవించినప్పుడు శ్రీరామకృష్ణసంఘవారు వేదారణ్యం మొదలైన చోట్లలో నిర్వహించిన ప్రజాసేవాకార్యక్రమాన్ని ధర్మవైద్యశాలాకార్యక్రమాన్ని అభినందించారు. అనంతరోపన్యాసకులు శ్రీ K. బాలసుబ్రహ్మణ్యయ్యరు, B. A., B. L., M. L. C. గారు కూడా అవే విషయాలను మఱికొంత విస్తారంగా వివరించి మితహితవాక్కు లనిన్నీ ప్రజాసేవాకార్యధురంధరు లనిన్నీ, ముఖ్యమంత్రిగారిని కొనియాడడమే కాక ధర్మవైద్యశాలకు 500/- రూపాయల విరాళాన్ని తాము సమర్పిస్తున్నామని కూడా చెప్పారు. డాక్టరు శేషాద్రినాథను గారి వందనసమర్పణంతో నాటి కార్యక్రమం ముగిసింది.

# గ్రంథ సమీక్ష

## శ్రీరామానుజకీర్తికౌముది

(మొదటి భాగము)

ప్రాప్తిస్థానము: శ్రీవైద్యవిద్యాసంస్థానము, ఆలపాడు, వయా తెనాలి, గుంటూరు జిల్లా; పుటలు 95: వెల: రూపాయి పావలా.

బహుభాషాకోవిదులుగను కవిశేఖరులుగను అనంతకల్యాణగుణపరిపూర్ణులుగను భగవద్భాగవతసేవాసంపన్నులుగను శ్రీమద్రామానుజసిద్ధాంతనిర్ధారణధురంధరులుగను వెలసిన శ్రీమాన్ ధనకుధరం రామానుజాచార్యుల వారి యెడ తమ భక్తిప్రపత్తులకు చిహ్నముగా తచ్ఛిష్యులు తొడంగిన ఈ గ్రంథము శ్రీవైష్ణవ ధర్మ విజ్ఞాన సర్వస్వ నిధి. ఇది మాసమున కొక్కొక్కటిగా 16 భాగములుగా వెలువడును. దీనికి సంపాదకులు శ్రీమాన్ ధనకుధరం వరదాచార్యులవారు. సమాలోచన సమితిలో "శ్రీమాన్ గొట్టుముక్కల రమాకాంతాచార్యులు, శ్రీమాన్ ఈయుణ్ణి వేంకటవీరరాఘవాచార్యులు, శ్రీమాన్ చెలమచెర్ల రంగాచార్యులు, డాక్టరు కందాడ రంగాచార్యులు, శ్రీమాన్ ఎమ్. వి. వి. కె. రంగా

చార్యులు'' అను విశిష్టాద్వైత సిద్ధాంత దిగ్దంతు లున్నారు. గ్రంథప్రథమభాగము 1957 వ సంవత్సరం ఫెబ్రువరి (దుర్ముఖి మాఘ) మాస మున మా కార్యాలయమునకు అందినది. ఈ భాగమున ఆఱు రచన లున్నవి. మొదటిది శ్రీమద్రామానుజోదాహరణము. కర్త శ్రీమాన్ శిరోమణి చెలమచెర్ల రంగాచార్యులవారు. రామానుజవిషయికమై తెలుగు దేశీయకావ్య విశేష మైన యిది యీ సంపుటమునకు ప్రారంభ మంగళముగ చరితార్థ మైనది. రెండవ వ్యాసము శ్రీరామానుజావతరణము. దీని రచయితలు శ్రీ శ్రీ శ్రీ (1008) శ్రీమన్నారాయణ రామాను జియ్యరు స్వామివారు కలియుగా రంభమతస్థితియు శ్రీమద్రామానుజావతార ప్రసక్తియు తత్సిద్ధాంతవిశిష్టతయు ఇందు సరళ సుగ్రహము చేయబడినవి. మూడవ వ్యాసమున శ్రీమాన్ ఆత్మకూరు గోవిందాచార్యులుగారు మతకర్తృతయందును సంఘసంస్కారమందును భగవద్రామానుజుల ప్రత్యేకతను సువ్యక్త మొనర్చిరి. సంస్కృతాంగ్లహిందీబంగాలీభాషా వేత్తలును ఉత్తరమధురానగరీయులైన శ్రీమాన్ పరాంకుశాచార్యస్వామివారి హిందీ మాతృకనుండి సంగృహీత మైనది 'శ్రీమ ద్రామానుజులు తత్సిద్ధాంతము' అనెడి నాల్గవ వ్యాసము. ఐదవ రచన ఏకాంక నాటిక. పేరు యతిరాజభిక్షు. రచయిత శ్రీ మధునాపంతుల సత్యనారాయణశాస్త్రిగారు. ఇందు యతిరాజుల పతితపావనప్రభావము ప్రపంచితమైనది ఆఱవది పద్యదశకము, శ్రీరామానుజవైభవోల్లాస స్తుతి పరము. ఇది శ్రీమాన్ కరి నారాయణా చార్యుల అస్ఖలితాక్షరపదపంక్తివిరాజితఫణితి. 'అనుకల్పభూత మురభిత్పదం సతాం' అని శ్రీ వేదాంతదేశికులవారు సాయించినట్లు ప్రప న్నులకు భగవత్పాదారవిందములకంటెనుగూడ రామానుజులచరణారవిందములు ప్రాప్యతర ములు. తత్కీర్తికౌముదికి శరదాగమముగా శ్రీవైద్యవిద్యాసంస్థానమువారు పూనుకొన్న యీ గ్రంథప్రచురణోద్యమమునకు మా యభి నందనములు.

## యాత్రామార్గదర్శి

మొదటిభాగము (దక్షిణభారతము – మల బారు కేరళ మైసూరు కూర్గు ప్రాంతములు) రెండవ ముద్రణము, పుటలు 480, వెల 4 రూపాయలు, రచయిత శ్రీరాగం వేంకటేశ్వర్లు గారు, ప్రకాశకులు శ్రీ సీతారామనామసంకీర్తన సంఘమువారు, శ్రీరామనామక్షేత్రము, గుంటూరు.

యాత్రల ఆవశ్యకతను భారతీయులకు ఉప న్యసించుట జ్ఞాతజ్ఞాపనమే అగును. సంసార తర ణార్థులకు క్షేత్రయాత్రలు ఎంత ఆవశ్యకాలో ఆ క్షేత్రాలనుగూర్చిన సర్వవిషయాలను తెలి యజేయు ఇట్టి గ్రంథాలును అంత ఆవశ్యకాలే. ఆ అక్కఱను గుంటూరు శ్రీసీతారామనామ సంకీర్తనసంఘమువారు శ్రీరాగం వేంకటేశ్వర్లు గారిచే ఈ గ్రంథరచన చేయించి సర్వజన సంస్తుత్యముగా తీర్చినారు. సర్వజిజ్ఞాసూపజీవ్య మైన ఈ పుణ్యగ్రంథమునకును, దీనికర్తలకును, కారయితలకును, ప్రేరకులకును, అనుమోదకు లకును, అధమర్ణులు గాని ఆస్తికాంధ్రులు ఉండరు. వారికి నిత్యమంగళము గలుగును గాత.

ప్రభాకర్.

# శ్రీ రామకృష్ణ లీలామృతము

(లేక శ్రీరామకృష్ణ జీవిత చరిత్ర)

అనువాదకులు :

కీ. శే. వెదురుమూడి కృష్ణరావుపంతులుగారు, బి. ఏ.; శ్రీ కంచుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

ప్రశస్తమైన వస్తువు, అకలంకమైన జీవితము, లోకోత్తరమైన సందేశము. దేహమును పులకరింపజేయు ఆధ్యాత్మికానుభవములు—శైలి సరళము, మధురము. భాష నిర్దుష్టము.—సర్వవిధముల నమూల్యమైన గ్రంథరాజము.

—శ్రీ పా. వే. రాజమన్నారుగారు, గౌ॥ ప్రధాన న్యాయమూర్తి, మద్రాసు.

* * * ఈ గ్రంథము విషయానురూపమై సుబోధమైన శైలిలో రచింపబడినదనుటకు ఎట్టి సందియమును లేదు. * * *

—శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు.

* * * ఆధునిక కాలములో వెలువడిన కొలది మహాగ్రంథములలో, అన్నివిధముల నిది యొకటి. * * *

—శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

496 పుటలు (ద్వితీయ ముద్రణము) వెల : రూ. 5/-

---

# శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకు పూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదరశిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీ స్వాముల వారి సంపూర్ణ చరిత్ర!

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

438 పుటలు (సప్తమ ముద్రణము) వెల : { సాదా ప్రతి రూ. 3/- ; అట్ట బైండు రూ. 3-50 }

---

# శ్రీ శారదాదేవి చరిత్ర

(మూడవ కూర్పు)

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

ప్రతి స్త్రీయును పురుషుడును...చదువవలసిన గ్రంథ మిది...అమృతకలశము!... అనన్యసామాన్య నీతిమంజరి...తియ్యని తెలుగు...పాలవంటి శైలి... —ఆంధ్రప్రభ

246 పుటలు వెల : రూ. 2/-

---

# దేవీ మాహాత్మ్యము

(శ్రీ దుర్గాసప్తశతి)

అనువాదకులు: శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

ఇందు మూలశ్లోకములు, వానికి ధారాళమయిన ఆంధ్రానువాదమును పొందుపఱుప బడియున్నవి. అందందు ముఖ్యములును నిగూఢములును అగు శబ్దములకు పాదదీపికలందు వివరణములు చేర్పబడియున్నవి. దేవీనవరాత్రములందును, ఇతర పవిత్రావసరములందును నిత్యపారాయణ మొనర్పవలసిన ఉత్తమగ్రంథము. ఈ గ్రంథప్రాశస్త్యము పూర్తిగా వివరించు పీఠికయు చేర్పబడియున్నది.

(170 + 16) పుటలు ప్రజ్జ్వలమగు ప్రథమ ముద్రణము వెల : రూ. 2/-

# శ్రీ వివేకానంద లేఖావళి

(రెండు భాగములు)

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

భారతదేశమున ఇంటింటను ఉండవలసిన పుస్తకములలో నిది యొకటి; బాలికా బాలకు లెల్లరును శ్రద్ధతో పదేపదే చదువవలసిన పుస్తకములలో నిది యొకటి.

ఈ లేఖలయందు దైవభక్తి, మానవరక్తి, కార్యాసక్తి—ఇవి నిరంతరసంయోగము దాల్చి జీవితాంధకారమును దొలగింపజేయు జ్యోతిగ నుండుట స్పష్టము

కట్టమంచి రామలింగారెడ్డి

మొదటి భాగము : 256 పుటలు
రెండవ భాగము : 226 పుటలు

ఒక్కొక్క భాగము వెల : రూ. 1-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౪   ౧౯౫౭, సెప్టెంబరు; హేవిళంబి — భాద్రపదము   సంచిక ౩

## విషయసూచిక

శ్రీకృష్ణకర్ణామృతబిందువులు ... ... ౮౧
శ్రీమద్భగవద్గీత II – స్థితప్రజ్ఞస్వరూపము—అను : శ్రీమ త్స్వామి నిర్వికల్పానందులు ౮౪
వేదోత్తంసవిహార సారథి శ్రీకృష్ణుడు—[సంపాదకీయము] ... ౮౬
రాముని యిచ్ఛ—(కథ) ... ... ౯౨
ఇంద్రియపరీక్ష—డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఎం. ఏ, ఎం. లిట్., పిఎచ్. డి. ౯౩
ఆలోచనాపథము—ఒక ''జీవి'' ... ... ౯౬
విచిత్ర విశ్వము—ఆయుర్వేదవైద్య శ్రీ వస్తాదు వేంకటస్వామిగారు ... ౯౭
మాతృశ్రీ శారదాదేవి—[శ్రీమద్గంభీరానందవాణి] ... ౯౮
హరివాసరవ్రతమాహాత్మ్యము—శ్రీ కిళాంబి రంగాచార్యులుగారు ... ౧౦౬
వార్తలు, విశేషాలు ... ... ౧౧౦
గ్రంథసమీక్ష ... ... ౧౧౧




"సర్వేశ్వరుని శరణు జొరుము, అతని కృప నీ యనుభవమునకు అప్పుడు వచ్చును."

—శ్రీ శారదామణి.

# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౪ } ౧౯౫౭ – సెప్టెంబరు : : హేవిళంబి – భాద్రపదము { సంచిక

## శ్రీ కృష్ణ కర్ణామృత బిందువులు

శ్లోక కర్త : లీలాశుకయోగి

పద్య రచయిత : వెలగపూడి వెంగన

చాతు ర్యైక నిధాన సీమ చప లాపాఙ్గ చ్ఛటా మన్థరం,
లావ ణ్యామృత వీచి లాలిత దృశం, లక్ష్మీ క టా క్షాదృతమ్,
కాళిన్దీ పులి నాఙ్గణ ప్రణయినం, కా మావ తా రాఙ్కురం,
బాలం, నీల, మమీ వయం, మధురిమస్వారాజ్య మారాధ్నుమః ॥ ౧

టీక॥ అమీవయం = ఈ మేము, (౧) చాతుర్య = నేర్పునకు, ఏక = ఒక్కటియే ఐన, నిధాన = నెలవుయొక్క, సీమ = మేరలైనవియు, మిక్కుటంపు నేర్పునకు పట్టులును అనుట, చపల = చంచలములును అగు, అపాఙ్గ = కడకన్నుల, ఛటా = కాంతిమొత్తముచే, మన్థరం = బరువుగలవాడును, (౨) లావణ్యా = కాంతియనెడి, అమృత = అమృతపు, వీచి = అలల(చే)తో, లాలిత = చెలువొందింపబడిన, దృశం = కన్నులుగలవాడును, (౩) లక్ష్మీ = శ్రీదేవియొక్క, కటాక్ష = కడకంటిచూపుచే, ఆదృతం = సమ్మానింపబడ్డవాడును, (౪) కాళిన్దీ = యమునానది యొక్క, పులిన + అఙ్గణ = ఇసుకదిన్నెల ప్రదేశములపై, ప్రణయినం = మోజుగలవాడును, (౫) కామ = మన్మథుని, అవతార = పుట్టుకకు, అఙ్కురం = కారణమైనవాడును, (౬) మధురిమ = సౌందర్యమునకు, స్వారాజ్యం = స్వర్గరాజ్యమైనవాడును — అగు — నీల = నల్లని, బాలం = బాలుని (బాలగోపాలుని) ఆరాధ్నుమః = ఆరాధింతుము.

తా॥ మేము బాలగోపాలుని నీలమేఘశ్యాముని ఆరాధింతుము. చంచలములై వెలుగొందు నతని కడకన్నుల చూపులు నేర్పు నెలవునకు మేరలు, కాంతిసుధాతరంగములతో గూడి సొంపొందుచుండు కన్నులతనివి, శ్రీదేవికడకన్నులచే సదా చూడబడు భాగ్యముగలవాడు ఆ బాలుడు. అతనికి యమునానదియిసుకదిన్నెలపైని మోజు ఎక్కువ. సౌందర్యమునకు అతడే స్వర్గరాజ్యము. ఆ సౌందర్యములో పుట్టు వొందిన వాడే మన్మథుడు.

బాలుక్, మంజుల తాలవాల చప లాపాం గోల్లస ల్లీలునిం,
గాళిందీ పులి నాంగణ ప్రణయి శృంగా రైక ఖేలుక్, శుభ
శ్రీలోలుక్, గరు ణావలోకన సుధా శీలుక్, వినీల ప్రభా
జాలుం, గొల్చెద, రామణీయక రస స్వారాజ్య పాలుక్, మదిక్ ॥

అనమ్రా మసిత భ్రువో, రుపచితా మక్షీణ ప క్ష్మాఙ్కురే,
ష్వాలోలా మనురాగిణోర్ నయనయో రార్ద్రాం మృదౌ జల్పితే,
ఆతామ్రా మధ రామృతే, మద కలా మమ్లాన వంశీ రవే,
ష్వాశాస్తే మమ లోచనం వ్రజశిశో మూర్తిం జగన్మోహినీమ్ ॥ ౨

టీ॥ (౧) అసిత = నల్లని, భ్రువోః=కనుబొమలయందు, అనమ్రాం=కొంతవంపుగలదియు, (౨) అక్షీణ = దట్టములైన, పక్ష్మ + అఙ్కురేషు = ఱెప్పమొలకలందు, ఉపచితామ్= పెంపొందినదియు, దట్టముగ పెరిగిన ఱెప్పవెంట్రుకలు గలదియు అనుట, (3) అనురాగిణోః=అనురాగవంతములైన, నయనయోః = కనుదోయియందు, ఆలోలామ్ = చంచలమైనదియు, బెళుకు గన్నులు గలదియు అనుట, (౪) మృదౌ = వీనులకింపైన, జల్పితే = మాటయందు, ఆర్ద్రాం = సరసమైనదియు, సరసముగను వీనుల కింపుగను మా టాడునదియు అనుట, (౫) అధర + అమృతే= తియ్యని మోవియందు, ఆతామ్రామ్ = అంతటను ఎఱ్ఱనైనదియు, (౬) అమ్లాన = గంభీరమైన, వంశీరవేషు = పిల్లంగ్రోవియొక్క ధ్వనులందు, మదకలామ్ = మదముచే ఇట్టి దట్టి దన రాక మధుర మైనదియు, జగత్ మోహినీం = విశ్వమును మరులుగొలుపునదియు అగు, వ్రజశిశోః = గోప బాలుని, మూర్తిం = దివ్యమంగళవిగ్రహమును, మమ లోచనం = నా నేత్రము, ఆశాస్తే= (చూడ) కోరుచున్నది.

తా॥ వంపు గల కనుబొమలును, దట్టము లైన ఱెప్పవెంట్రుకలును, కరుణ వెలి జిమ్ము బెళుకు కన్నులును, ఎఱ్ఱని తియ్యని మోవియు, మధుర గంభీర మగు పిల్లంగ్రోవి రవళియు గల బాలగోపాలుని దివ్యమంగళరూపమును చూడ నా కన్నులు ఉబలాటపడుచున్నవి.

కాంచుట యెన్నఁ డీక్షణసుఖంబుగఁ దొంగలి ఱెప్పలున్, బనా
యించిన వింటి వంటి బొమ, లింపగు మాటలు, కెంపు మోవిఁ బొం
దించిన పిల్లఁగ్రోవిఁ బలికించు హళాహళియున్, ద యోన్నతిన్
మించిన బెళ్కు-ఁజూపు గల మిక్కిలి చక్కని ముద్దు బాలకున్ ?

మధుర మధరబిమ్బే, మఞ్జులం మన్దహాసే, శిశిర మమృతవాదే, శీతలం దృష్టిపాతే,
విపుల మరుణనేత్రే, విశ్రుతం వేణునాదే, మరకతమణినీలం బాల మాలోకయేను ॥ ౩

టీ॥ అధరబిమ్బే = దొండపండును బోరయు కెమ్మోవియందు, మధురం = తియ్యనైన వాడును; మన్దహాసే = చిఱునవ్వునందు, మఞ్జులం = మనోజ్ఞుడును, అమృతవాదే = మధురముగ పలుకుటయందు, శిశిరం = చల్లనివాడును, దృష్టిపాతే = చూపునుపఱుపుటయందు, శీతలం = చల్లనైనవాడును, అరుణనేత్రే = ఎఱ్ఱసెరలకన్నులందు, విపులం = వెడలుపుగలవాడును, వేణు నాదే = పిల్లనగ్రోవిరవళియందు, విశ్రుతం = ప్రసిద్ధుడైనవాడును, మరకతమణి నీలం = ఇంద్రనీల రత్నమువలెనల్లనైనవాడును అగు, బాలం = బాలుని, ఆలోకయే ను = చూతునా ఏమి ?

తా॥ ఇంద్రనీలచ్ఛవిం గేరు మేనిచాయయు, తియ్యని కెమ్మోవియు, మనోజ్ఞమందహాస మును, చల్లని తియ్యని మాటలును, చల్లని చూపులును, విశాలములై ఎఱుపు మించిన కన్ను లును, విఖ్యాత వేణు నాదమును గల బాలుని నేను చూతునా ఏమి!

చల్లని బెళ్కుఁ జూపు, సుధఁ జల్లెడు మాటలుఁ, దియ్య మోవియున్,
సల్లలి తారుణ ద్యుతి విశాల విలోచనముల్, మృదు స్మితో
త్ఫుల్ల ముఖాంబుజంబుఁ, బరిపూరిత వేణు వినోద నాదమున్,
నల్లని మేని క్రొమ్మెఱుఁగునన్- విలసిల్లిన బాలుఁ గాంచెదన్.

[ కీ. శే. వేదము వేంకటరాయశాస్త్రులవారు ]

తరువోజ

కావవో పాంచాలిఁ గరుణాసముద్ర ? కావవో మునిరాజుకాంత నహల్యఁ ?
గావవో కపిరాజుఁ ? గావవో కరిని ? గావవో ప్రణతు లంకాపతియనుజుఁ ?
గావవో ప్రహ్లాదుఁ ? గావవో ధ్రువునిఁ ? గావవో కుబ్జను ? గావవో పసులఁ ?
గావ వేల త్వదేకగతుల నీ మమ్ముఁ ? గావు కావుము, రమాకాంతా కళత్ర.



# శ్రీమద్భగవద్గీత II – స్థితప్రజ్ఞస్వరూపము

అనువాదము :

శ్రీమత్స్వామి నిర్వికల్పానందులు

(౧) ఆత్మవలన ఆత్మయందే తృప్తుడై, యోగి మనస్సునందుండు కోర్కెలనన్నిటిని సంపూర్ణముగ త్యజించిన, స్థితప్రజ్ఞుడనబడును. (౫౫)

(౨) దుఃఖములయందు ఉద్వేగము నందనివాడును, సుఖములయందు నిస్పృహతను వహించువాడును, అనురాగము, భయము, క్రోధములు లేనివాడును అగు ముని స్థితప్రజ్ఞుడని చెప్పబడును. (౫౬)

(౩) ఎవడు, సర్వవిషయముల మమతాశూన్యుడై, ప్రియాప్రియవిషయములు లభింప ఆనందమును గాని దుఃఖమును గాని బొందడో అతడు స్థితప్రజ్ఞుడైనాడు. (౫౭)

(౪) వెఱపు గొనిన తాబేలు తల, కాళ్లు, మొదలగు అవయవములను లోపలకు ముడుచుకొనునట్లు, జ్ఞాననిష్ఠుడగు యోగి శబ్దాది విషయములనుండి ఇంద్రియములను మరలించిన, స్థితప్రజ్ఞుడనబడును. (౫౮)

(౫) ఇంద్రియముల ద్వారమున విషయముల గ్రహింపని కఠోర తపస్వినుండి విషయములు నివృత్తము లగును కాని, అతని విషయతృష్ణ ఉపశమింపదు; మఱి ఆత్మసాక్షాత్కారమైన, విషయతృష్ణగూడ విలీనమై పోవును. (౫౯)

(౬) విక్షేపకరము లగు ఇంద్రియగణములు అత్యంతయత్నశీలుడును, మేధావియు (శాస్త్రజ్ఞుడు) నగు పురుషుని మనస్సును గూడ బలపూర్వకముగ ఆకర్షించుచున్నవి. (౬౦)

(౭) కనుక, యోగి ఆ యింద్రియముల నన్నటిని నియమించి, సమాహితుడై ఆత్మస్థుడై ఉండ నగును. ఏమన, ఎవని యింద్రియములు వశీభూతము లైనవో అతని ప్రజ్ఞయే ప్రతిష్ఠితము; అతడే స్థితప్రజ్ఞుడు. (౬౧)

(౮) విషయములను చింతించుచుండుటవలన మనుష్యునకు వానియందాసక్తి కలుగుచున్నది, ఆసక్తినుండి కామమును, కామము ప్రతిహతమైన, కోపమును గలుగుచున్నవి. (౬౨)

(౯) క్రోధమునుండి అవివేకము, అవివేకమునుండి స్మృతివిలోపమును కలుగుచున్నవి. స్మృతిభ్రంశమైన సదసద్విచారము వినష్టమగును. ఈ వివేకమే నశించిన మనుజుడు సంపూర్ణముగ చెడిపోవుచున్నాడు: అనగా పురుషార్థమునుండి వంచింపబడుచున్నాడు. (౬౩)

(౧౦) కాని, సంయతచిత్తుడగు పురుషుడు ప్రియవస్తువుల ఆసక్తినుండియు, అప్రియవిషయముల ద్వేషమునుండియు విడివడును. స్వాధీనము లగు ఇంద్రియములవలన జీవించుటకు తప్పనిసరియగు విషయములను గ్రహించుచు నిర్మలుడగుచున్నాడు. (పరమమగు శాంతిని బొందును). (౬౪)

(౧౧) చిత్తము నిర్మల మైన దుఃఖము లన్నియును నశించును. ఏల యన, నిర్మలచిత్తుని బుద్ధి శీఘ్రముగనే ఆత్మస్వరూపమున నిశ్చలత నందును. (౬౫)

(౧౨) ఇంద్రియనిగ్రహము లేని వానికి వివేకబుద్ధి కలుగుట లేదు, అవివేకి యగు వానికి పరమార్థవిషయముల అభిరుచి కలుగదు. పరమార్థచింతాశూన్యునకు శాంతి లభింపదు, అశాంతచిత్తుడగువానికి సుఖ మెక్కడిది? (౬౬)

(౧౩) వాయువు నీటిపైన దేలు నౌకను పెడత్రోవ బెట్టునట్లు, ఆ యా విషయముల దవిలి పర్విడు ఇంద్రియములలో నెద్దానిని మనస్సు అనుసరించునో, ఆ యింద్రియమే నిగ్రహహీను డగు పురుషుని వివేకబుద్ధిని హరించుచున్నది. (అనగా విషయాభిముఖ మొనర్చుచున్నది). (౬౭)

(౧౪) మహాబాహూ, కనుక, ఎవని యింద్రియములు శబ్దాదివిషయములనుండి సర్వవిధముల నిగ్రహింపబడుచున్నవో, అతని ప్రజ్ఞ ప్రతిష్ఠిత మగు చున్నది. అనగా, అతడే స్థితప్రజ్ఞుడు. (౬౮)

(౧౫) జీవు లందఱికిని తెలియక పోవుట వలన నెయ్యది రాత్రివలె దోచునో, ఆ బ్రహ్మమున స్థితప్రజ్ఞుడు మేల్కొని యుండును — బ్రహ్మదర్శన మొనర్చుచుండును. ఏ అజ్ఞాన — రాత్రియందు జీవు లందఱును మేల్కొని యుందురో — సంసారదర్శన మొనర్చుచుందురో — అయ్యది స్థితప్రజ్ఞునకు రాత్రి; అతడు సంసారమును గాంచడు. (౬౯)

(౧౬) పరిపూర్ణమై యుండిన సముద్రమున నదీప్రవాహములు ప్రవేశించినను అది పొంగి చెలియలికట్టను దాటక స్థిరముగ నుండు నట్లు, ప్రారబ్ధవశమున అనివార్యము లగు విషయము లెవనియందు ప్రవేశించి విలీనము లగుచున్నవో అనగా ఎవనిని కలత వెట్టజాలవో అతడే శాంతిని బొందుచున్నాడు. కాని విషయముల గోరువాని కెన్నడును శాంతి లభింపదు. (౭౦)

(౧౭) ఎవడు కోర్కెల నన్నిటిని విడిచి, 'నేను' 'నాది' యను భావమును త్యజించి, శరీరమున జీవితమునగూడ స్పృహాశూన్యుడై సంచరించునో అతడు సంసారదుఃఖనివృత్తియగు పరమశాంతిని బొందును. (౭౧)

(౧౮) ఇదియే బ్రాహ్మిస్థితి. దీనినిబొందిన వా రెవ్వరును మోహగ్రస్తులు కారు. మరణ సమయమునం దైనను దీనిని బొందినవాడు మోక్షము నందును. (౭౨)



జయ గోవింద, ముకుంద, చక్రధర, కంసద్వేషి, సాత్రాజితీ
ప్రియ, నారాయణ, కౌస్తుభాభరణ, కుంభిత్రాణపారీణ, కా
ళియదర్పఘ్న, పతంగవాహ, వనమాలీ, కృష్ణ, వైకుంఠ, శౌ
రి, యశోదాత్మజ, భక్తవత్సల, మురారీ, గోపికావల్లభా ॥
శరధిక్రోడనివేశ, శార్ఙ్గధర, శిష్టధ్యేయ, శీతాంశుభా
స్కరనేత్రద్వయ, శుభ్రపంకరుహ భాస్వన్నాభ, శూరాన్వయా
భరణా, శేషశయాన, శైలధర, శోభారమ్యసర్వాంగ, శౌ
ర్యరసోదంచిత, శంఖచక్రధర, శర్వాణీసహాయప్రియా ॥ — [ముద్దుపలుకుల ముక్కతిమ్మన్న]

# వేదోత్తంసవిహారసారథి శ్రీకృష్ణుడు

## (సంపాదకీయము)

శాంత్యాశ ఎప్పుడును ఉండునదే, అది సర్వదేశ సర్వకాలాలలో మానవుల హృదయములం దున్న వాంఛ. ఐనను 'శాంతి' 'శాంతి' అను నది ఈ కాలమున వినబడుచున్న ఘోష. 'అంతర్దేశీయరంగాన శాంతి నెలకొనవలెను, శాంతిని భంజించు పోరాటాలు జరుగకూడ' దను వాదము నేడు శ్రుతిగోచర మగుచున్నది. తదనుగుణముగ హింస అధర్మ మనియు మృగోచిత మనియు తలంపు గలిగి యున్నది. కాని 'విశ్వశాంతి' 'అహింస' అను ఈ ఘోషకు ఆధార మైన చిత్తవృత్తిని విభజించి చూతుమేని నేటి నాయకులలో పిఱికిస్వభావ మొకటి నెలకొన్నట్లు గుర్తింప గలుగుదుము. వారిలో ఎవరికిగాని యుద్ధమనిన ఏవగింపు లేదు. శాంతిని నిలుపుటకై బాలాత్కారమున కొడిగట్టుట వారికి అప్రియముకాదు. అంతర్దేశీయరంగాన చిక్కు లేర్పడినప్పుడు వానిని సరిపఱచుటకు సాయుధులమై దుముకుద మను తలంపే వారికి ఆపాతముగ గలుగు చుండును. కాని 'అణుగోళము' 'జలవాయుగోళము' (ఆటంబాంబ్ హైడ్రోజిన్ బాంబ్) మున్నగు ఘోర మారణాయుధములు కనుగొనబడుటతో, కదనమున మార్కొనువారియు ప్రతిఘటించువారియు ఉభయులయు మనుగడ సాపాయ మైనది. భవిష్యద్రణము ప్రపంచయుద్ధముగ నుండుటతో ఆగదు. మానవజాతి నిశ్శేషముగ అంతరించుటయు సుసంభవమే. కావున ఉభయవర్గముల వారును శాంతిని నిలబెట్ట ఆత్రపడుచున్నారు.

దేశీయరంగాన కూడ ఈ భయమును ఈ యవిశ్వాసమును గలవు. మానవతతిని అఖండదృష్టితో చూచుట లేదు. యాదృచ్ఛికముగను చారిత్రకముగను కల్పితము లైన సరిహద్దులను నిలబెట్టుటే, తమ వర్గమువారి అక్కరలను కాపాడుటే, తమ బాధ్యతఅని నాయకులనుకొనుచున్నారు. ఇది స్వార్థపరత. ఇందుచే ఒక వర్గమువారు ఒక దేశమువారు తమ లాభాలకై వేఱొక వర్గమువారిని వేఱొక దేశమువారిని చెఱచుచున్నారు. ఆ వర్గమువారికిని ఈవర్గమువారికిని, ఆదేశమువారికిని ఈదేశమువారికిని నడుమ ద్వేషాసూయలుండుటసహజమే. క్రిందటి రెండు శతాబ్దాలలోను వలసరాజ్యాలును సామ్రాజ్యాలును పెంపొందినవి. ఈ శతాబ్దమున సన్ననో వలసరాజ్యాలయు, వెనుకబడియున్న దేశాలయు ప్రజలు తల లెత్తుచున్నారు. దేశప్రజలలో అన్నివర్గాలవారిని సంతృప్తిపఱచుటకు ప్రయత్నములు జరుగుచున్నను, దేశాల నడిమి కలహాలు సాగుచునే ఉన్నవి. ఏల యన దేశీయుల స్వార్థపరతచే గలుగు సమస్యలను తఱచు అంతర్దేశీయసమస్యలుగా పెంచుకొనుటచే చిక్కులు మఱింత దుర్భేద్యము లగును. ఈ స్పర్ధల కెల్ల కారణము ఒక్కొక్క దేశమువారి స్వార్థపరతయే. ఒక్క దేశములోనే వివిధ వర్గములవారు ఒండొరులను ద్వేషించుకొనుచున్నారు. జాతి భాష మొద లైన ప్రాంతీయ విషయాల లోని దురభిమానముచే శాంతి వాతావరణము చెడుచున్నది. అసహనమును

అవిశ్వాసమును అసూయయు భయమును పో టెక్కు చున్నవి.

ప్రతివ్యక్తి జీవితములో కూడ భీతిచేతను భద్రతాలోపముచేతను అశాంతి మిక్కుటముగ నున్నది. నవ్యనాగరకత వ్యామిశ్ర మైనది. పరిశ్రమలు పెరిగినవి. విజ్ఞానశాస్త్రమును సంకేతవిద్యయు పెంపొందినవి. ప్రజలు క్రిక్కిరిసి యున్న నగరాలలోనికే ఇంక నింకను ప్రజలు తండతండములుగ వచ్చి చేరిపోవు చున్నారు. చోటు చాలుట లేదు. ఉద్యోగాలకై పోటీలు విపరీతముగ జరుగుచున్నవి. తమ తమ చుట్టాల నుండి ఎడబాసి వచ్చి చేరిన ప్రజలలో పరస్పరము ఆంతరంగికత లేదు. ఈయన్నింటి చేత ఇప్పటి ప్రజలు తమ మనస్సులలో ఆయాసమును ఒత్తిడిని జెందు చున్నారు. వ్యవసాయముమాత్రమే వృత్తిగ నున్నచో ప్రజలలో పోటీ లుండవు, సాహచర్యము వర్ధిల్లును. కాని గడచిన యిన్నూ ఱేండ్లలో లోక జనాభా విపరీతముగ పెరిగి పోయినందున మనుగడకు వ్యవసాయ మొక్కటే చాలదు, నేటి అర్థశాస్త్ర దృక్పథము అఖండభూమండలమును తనలో ఇముడ్చుకొనును. ఆర్థికశక్తులు సదా మాఱు చున్నవి. ఎవరును వానిని తప్పించుకో లేరు, వానినుండి తొలగను లేరు. ప్రాచీనకాలమున మానవులలో నుండిన సమష్టిభావము రూపుమాసి వ్యష్టిభావము నేడు నెలకొన్నందున కలతలయు సంక్షోభములయు సుడులు వడి హెచ్చినవి. అంతే కాదు, ఆధ్యాత్మికపు పునాదుల కెడసిన నేటి మానవునకు తనతోనే తనకు సంఘర్షణ గలుగుచున్నది. డాక్టరు జంగుగారు మానవ మనస్తత్వ విషయిక పరిశోధనలు సాగించి, దాదాపు ముప్పదియైదేండ్ల, నలువదేండ్ల వయస్సురాగనే ప్రజ లెదుర్కొన వలసిన లక్ష్యము ఆధ్యాత్మికముదిగ ఉన్నదని కనుగొన్నారు. నిలుకడైన బ్రదుకు దెరువు లేదే, ఎటు తిరిగినను భంగమే కలుగు చున్నదే, ముదిమి వచ్చునే, మరణము గలుగునే — ఇవి మున్నగు భయాలు మానవులను వేపుకొని తినుచున్నవి. వారికి నిర్వృతినిర్భరతలనుగూర్పగల విశ్వాసము నేడు ఎంతేని ఆవశ్యకము.

కాబట్టి వ్యక్తిగతముగాను దేశీయాంతర్దేశీయరంగాలలోను సాగుచు ఉన్న ఈ శాంతి ప్రసంగాల మఱుగున నరుల మనసులలో ప్రధానముగ ఉండునది భీతియే అనియు, నైతికాధ్యాత్మికవిచారము అప్రధాన మనియు, తేలినది కదా. కురుక్షేత్రయుద్ధారంభ మప్పుడు అర్జునుని మనఃపరిస్థితియు ఇట్టిదే. ఎదుటి పక్షమున నుండిన భీష్మద్రోణాదులైన గొప్ప వీరలను, ప్రియబంధువులను ఒక రొకరి మెడ గోయ సంసిద్ధులై అట కూడి ఉన్న అల నాటి భారతదేశీయ యోధుల నందఱను చూడగనే అర్జునుడు భయపడెను, కర్తవ్యమునుగూర్చి అవ్యవస్థిత చిత్తు డయ్యెను. భగవద్గీతోపదేశము అతనిని ఉత్తేజపఱచి, భీతిని అవ్యవస్థితచిత్తతను పౌరుషశూన్యతను దులిపివేసికొనునట్లుచేసినది. పరిసర పరిస్థితుల యీ సాదృశ్యమును బట్టి చూడ శ్రీకృష్ణునుపదేశము ఈ కాలమునం గూడ మార్గదర్శకమై సార్థకము కాక తప్పదు.

మన ప్రాచీన వేదములు మానవులకు అంతర్గతముగ ఉండు ఈ భయశీలమును గుర్తించినవి. ఈ భయము మానసికమే కావున జీవిత పరమార్థమునుగూర్చిన తప్పభిప్రాయాలను సరిచేసి ఈ భయమును నిర్మూలింప వేదములు పూనుకొన్నవి. రెండవ దొకటి ఉన్నచో భయము పుట్టు నని బృహదారణ్యకోపనిషత్తు

చెప్పుచున్నది — "ద్వితీయాద్ వై భయం భవతి" I. 4-2.

ఉన్న దెల్ల ఒక్క బ్రహ్మమే కావున ['సర్వంఖల్విదం బ్రహ్మ' ఛాందో. III. 14-1] నిజముగ భయకారణము లేనే లేదు. సర్వమును బ్రహ్మమే అను దాని సత్యాసత్యాలను తర్కమాత్రముచే నిరూపింప లేము. సర్వదేశ సర్వకాల యోగులును ద్రష్టలును అంతఃప్రబోధముచే నెఱింగిన సత్యమును ఆ వాక్యము తెలుపుచున్నది. విశ్వైక్యమే తమకు ప్రియలక్ష్యమనుచుండు వారి హృదయాలలో కూడ సర్వము బ్రహ్మమే అను అనుభూతి అస్పష్టముగను దుర్లక్ష్యముగను ఉన్నది. ప్రాచీనాచార్యుల ననుసరించి శ్రీకృష్ణుడును అర్జునునకు తన స్వరూపమును ప్రదర్శించి నప్పుడు, సర్వమును బ్రహ్మమే యను పరతత్త్వమును నొక్కిచెప్పినాడు. విశ్వరూపి యైన శ్రీకృష్ణుడు సాక్షాద్బ్రహ్మమే కాని గోపికానందనమాత్రుడు కాడు. [భాగ. దశ. 31-4.] 'కృష్ణస్ తు భగవాన్ స్వయమ్' 'కృష్ణుడు స్వయముగ భగవంతుడే' [భాగ. I. 3-28]. 'బ్రహ్మ' 'పరమాత్మ' 'భగవ' చ్ఛబ్దములు ఏకతత్త్వవాచకము లని భాగవతము తెలుపుచున్నది. "బ్ర హ్మేతి. పరమా త్మేతి భగవా నితి శబ్ద్యతే" [భాగ. I. 2. 1. 1.] దారమున మణులవలె ఈ జగత్తంతయు ఆత్మభూతు డగు కృష్ణునియం దనుగత మై అతనిచే ధరింపబడుచున్నది. [భగవద్గీత VII-7]. తన ఒక అంశము వలననే సమస్తవిశ్వమును వ్యాపించి ధరించి ఉన్నాడు. అతనిని శరణు పొందిన మానవుడు భయసంఘర్షణల అతిక్రమించి పరమశాంతి నందును. ఈ గీతాతత్త్వము రహస్యముల కంటె రహస్యము. ['గుహ్యాద్గుహ్యతరమ్' భగవద్గీత XVIII-63]

ఇది భౌతికరంగమును అతిక్రమించిన సత్యము. ఇది తర్కసిద్ధ మని కాని, తర్కాభేద్య మని కాని, యథావిధిగ అధిగత మని కాని ఐహికులు అంగీకరింపక పో వచ్చును. ఐనను ఇందుల నిత్యోపయోగము నిస్సందేహము. పిండివంటను తిన్న నే అది ఎట్లన్నదో తెలియును. విద్యుచ్ఛక్తి స్వరూపము సరిగా ఇట్టిదే అని మనము నిరూపింప లేము గాని, విద్యుచ్ఛక్తిని మాత్రము మనము ఎంతెంతగనో ఉపయోగించుకో వచ్చు. శ్రీరామకృష్ణు డొక కథలో చెప్పినట్లు — మామిడితోట కేగి, తోటసొంతదారు చెలిమిని సంపాదించి, పండ్లను తిన దొడంగు వాడే వివేకి యగును కాని, మామిడాకులను లెక్కించుచుకూర్చుండు వాడు వివేకి కానే కాడు.

పరతత్త్వమునందు విశ్వాసము ఉండి తీరవలెను, సంశయనిరాశోపహతులకు విశ్వాసమే అవలంబము. కాని శ్రీకృష్ణుడు అందుంగూర్చి పిడివాదము సేయడు. అన్ని రకాల వ్యక్తులకు తరణోపాయము ఆయన యొద్ద ఉన్నది. ఉదాత్త మైన నిష్కామ కర్మ సిద్ధాంత మొకటై యున్నది. 'అసక్తో హ్యాచరన్ కర్మ పరమాప్నోతి పూరుషః' (గీత III-19) నిష్కామకర్మపరునకు నమ్మకముతో పనే లేదు: పనిని చేయుటకు ముందును చేసిన పిదపను వ్యర్థవ్యథలకు వశపడ రా దనెడి దృఢాధ్యవసాయము మాత్రము అతనికి ఉండ వలెను. ఏ నాటికి ఆ నాడు అతనికి క్రొత్తదినమే. కర్మానుష్ఠానమునకు అతనికి అధికార మున్నది. ఉండుటే కాదు, అతని స్వభావమే అతనిచే కర్మల నాచరింపించును. 'కరిష్య స్యవశో ఽపి తత్' (గీత XVIII-60) 'న హి కశ్చిత్ క్షణ మపి జాతు తిష్ఠ త్యకర్మకృత్' (గీత III-5). కర్మఫల

మున కతనికి హక్కు లేదు. 'కర్మణ్యేవాధి కారస్తే మా ఫలేషు కదాచన' (గీత II-47) కర్మసిద్ధికి హేతువులు ఎన్నో ఉన్నవి. అవి ఐదు అని శ్రీకృష్ణుడు పరిగణించినాడు — శరీరము, అహంకారము, మనోబుద్ధులతో గూడిన యింద్రియములు, ప్రాణాదుల వివిధ కార్యములు, చక్షురాదీంద్రియములకు అధిష్ఠాత లగు ఆదిత్యాదిదేవతలు. కార్యకారణ క్రమము పూర్తిగా మానవుని చేతిలో లేదు. కంటికి కనిపింపని కారణాలు, జన్మాంతర సంస్కారము, విధి, వంశక్రమము, సంఘము — వీని కన్నిటికిని మానవుని జీవితములో ప్రాముఖ్యము గలదు. మానవునకు చొరవయు ఉద్యమమును ఆవశ్యకములే ఐనను దైవపరాధీనుడుగనే ఉండవలెను. లేదా ఫలవిషయమున నిస్సంగత్వమును అలవఱచుకో వలెను. అలవఱచుకొన కున్న — భంగప్రాప్తి తప్పదు. యౌవనమున మహోత్సాహవంతులై యుండిన పెక్కండ్రు కొన్ని యేండ్ల పిదప కేవలము మనుష్యవిద్వేషులుగ పరిణమింప కున్నను అశుభాశంసులుగ నైనను తయారగుటకు అదే కారణము.

కష్టానుభూతికి రెండు వైపులు ఉన్నవి. ఒకటి వాస్తవికము, ఒకటి మానసికము. ప్రాణబంధువుల యారోగ్యము, పిల్లల చదువు, నౌకరీభద్రత వర్గీయస్పర్ధలు దేశీయవిపత్తులు, అంతర్దేశీయ సంఘర్షణలు ఇవన్నియు గంభీర వాస్తవాలే ఐనను వీని వలన నేర్పడు వెతలును ఆవేశాలును మన మనస్సుల వ్యర్థకల్పనలే. ఈ ప్రకోపాలవలన నెట్టి ఉపయోగమును లేదు. వీనిని వదలించుకొం డని శ్రీకృష్ణుడు మానవులకు బోధించినాడు. వాస్తవమైన కష్టమును అనుభవింపక తప్పదు. పోరాటము నిరంతరముగా సాగుచునే యున్నను మానసికవ్యథను మాత్రము వదులుకో వచ్చును. ఈ యసంక్షుబ్ధ మనఃపరిస్థితినే శ్రీకృష్ణుడు యోగ మని పేర్కొన్నాడు. 'సమత్వం యోగ ఉచ్యతే'. వాస్తవముగ కార్యనైపుణిలోని మర్మ మిదే, 'యోగః కర్మసు కౌశలమ్'. భక్తియుతులకు మాత్రము వారి భావోద్రేకాలు దైవోన్ముఖములుగ నుండును కావున ఆ యుద్రేకాలకు స్వేచ్ఛ ఉండవచ్చును. వారు తినుట నివేదించుట మున్నగా ఏమి చేసినను అన్నిటిని భగవదర్పితములుగ చేయుదురు. ప్రతికూలపరిస్థితులు వారిని ముంచుకొని వచ్చినప్పుడు వారికి శరణము ఈ వైఖరియే.

ఇట్టి మనోవైఖరి కుదిరినచో, ఎట్టెట్టి పరిస్థితులు గలిగినను అందులకు సంసిద్ధత చేకూరును. 'పరిపక్వతయే సర్వస్వము' (రైపెనెస్ ఈస్ ఆల్) అన్నాడు షేక్స్పియరు (కింగ్లియరు V-2). షేక్స్పియరు వ్రాసిన మఱొక నాటకములో, మాక్బెత్తు తాను ఉన్నతి నొందు ప్రయత్నాలకు పూనుకొనెను, చేసెను కూడ, కాని తాను తన గోతినే త్రవ్వుకొనుచున్నట్లతడు తుది నిమిషములో గ్రహించెను. "వన్నొక గుంజకు కట్టివేసిరి. నేను ఎగిరిపోలేనుకాని, ఎలుగుబంటివలె నేను పోరాడవలసినదే" అన్నాడు. నిజమును కనుగొని విరక్తుడైనంతనే ఒక విధమైన మాలిన్యవిముక్తి పూర్తిగ గలిగి, మానసికముగ ఎంతో లాభకారి అయ్యెను. కాని ఇది నిరాశచే అగతికతచే తెగించిన వాని సంసిద్ధత. కృష్ణుడు కఱపిన సంసిద్ధత ఇది కాదు. ఆయన అర్జునునితో 'వస్తువుల స్వరూపమును చూడు, సృష్టియంతయు సర్వేశ్వరుని విశ్వరూపములో ఇమిడి

ఉన్నది, అన్నింటి ప్రవృత్తియు దైవసంకల్పా ధీనము. తన్ను దైవసంకల్పానుసారిగ పను పఱచుకొనుటయు ఫలసంగరహితముగ కర్మల నాచరించుటయు మానవుని విధి. ఏ పదవిలో తాను ఉన్నను, తాను చేయ వలసిన కర్మము ఎట్టిదైనను మానవుడు దానిని బలోత్సాహ లతో నిర్వర్తింప వలె, కాని మమకారము ఎంతమాత్రమును ఉండ కూడదు. సాధారణ ముగా తనకున్న కోరికలచేతను ఉద్రేకాల చేతను మానవుడు పనులను నెఱవేర్చుచుండు నందురు. కాని శ్రీకృష్ణుడు మానవులను ఒక మెట్టు పై కెక్కించి స్వధర్మానుసారము విధు లను నిర్వర్తింపు డనుచున్నాడు. ఇట్టి దృక్ప థము అలవడినచో — ఎట్టి పర్యవసానము గలిగినను మనసు తొణకదు, నెమ్మదితో నెదు ర్కొను ధైర్యము గలిగి యుండును. ఇందులకు శ్రీకృష్ణుని దివ్యచరిత్రమే ఒక మహోజ్జ్వల లక్ష్యము. "ఆత్యంతిక కర్మానుష్ఠానముననే ఆత్యంతిక విశ్రాంతి, ఆత్యంతిక విశ్రాంతిలోనే ఆత్యంతికకర్మాచరణము, ఇదే గీతాలక్ష్యము" అన్నారు శ్రీవివేకానందస్వామి. ఈ లక్ష్యము నెప్పుడు సాధింప నగు ననగా నరుడు స్వధర్మ మనెడి తలంపు దృఢముగ గలిగి, తనకైయు తనవారికైయునే గాక లోకమంతటికైయు చేయ వలసినపనులను నిస్సంగబుద్ధితో చేయ బూనుకొన్నప్పుడు.

శాంతిసమృద్ధులు నెలకొని యున్నప్పుడు కూడ, ముఖ్యముగ ఐహికాభివృద్ధులను సాధిం చుకొన్న దేశాలలో మానవుడు క్రమముగ మరియొక చిక్కు నెదుర్కొనుచున్నాడు. యు ద్ధమా, లేదాయె, ఆత్రముతో ఉద్రేకముతో పనులు చేయ వలసిన జరూరు లేదు, కావున విరామవేళలలో ప్రొద్దు పోక, అతడు క్రొత్త భావోద్రేకాలను కోరుచుండును. అనల్పకార్యా లను అల్పకాలములో ముగింప గల యంత్రము లున్నందున పనుల బరువు అతనికి తగ్గినది. కాని అతని లౌకిక దృక్పథాన ఉత్కృష్ట లక్ష్యాలు లేనందున అంతయు ఖాళీయే అందుచే అతనికి కొండకొన కెక్కుటము, కడలి అడుగునకు పోవుటము, అరణ్యగుహావాసుల జీవిత మువంటి జీవితము గడపుటము అనిపించును. ఇందులో ఎంతో సాహసప్రీతి లేక పోలేదు కాని ఇది మనస్సును ఆత్మయు ఎండుకొనిపోయి నందున పుట్టిన యభిరుచి. మానవునిలో ఆత్మ ఉన్నది. క్షుద్రములైనవానితోను, క్షణిక ములైనవానితోను ఆత్మకు తృప్తి లేదు. ఏది అనంతమో అది అతనికి తెలియ రాక అతనిని ఆకర్షించును. అతనిచే ఎత్తైన కట్టడాలను కట్టించును, పెద్ద పెద్ద భవనాలను నిర్మింపిం చును, పెద్దవీధులను వేయించును, ఇంకను అట్టి పెద్దపనుల నెన్నింటినో అతనిచే చేయించును. అనంతతత్త్వపిపాసయే మానవునకు మనశ్శూన్య తను భర్తీచేసికొన దారులను గఱపును. ఇట్టి సాహసాలకు ఐహికరంగములోనైనను అడ్డు లేదు, కానివానికి ఉండవలసినంతకంటె అతి మాత్రమైన ప్రాధాన్యము గలుగుట సుసంభ వము. రాజకీయరంగసాహసికులకు కూడ అట్టి సాంఘికవాతావరణము కరము అనుకూలము. కావున మానవశ్రేయమునకై మనశ్శక్తులను మార్గాంతరమునకు మరలించుట జరూరు. సాహసము ఇక మీద వైజ్ఞానిక కాధ్యాత్మిక రంగాలలోనే ఉండ వలెను. దేశాభివృద్ధి కొక మితి లేదని పార్నెల్మహాశయుడు చెప్పి యు న్నాడు. అభివృద్ధి అనగా ఐహికసంపదభివృద్ధి మాత్రమే కాదు. ఆ రంగములో పోటీలును

ప్పవు. ఇంతకును అభివృద్ధి అనునది సాపేక్ష ృన పదము. దాని నొక పైమెట్టున కెక్కింప ిన్నచో అన్నియు తమకే కావలె నను ోభము మానవులలో చుఱుకైన పోరాట ుసను సాగించుచునే ఉండును. కావున మానవ ్ృదయమునకు ఆ ఉదాత్తతను గల్పించుట ాయకుల ధర్మము. మానవులకు శాశ్వత ూర్గ దర్శి యైన శ్రీకృష్ణుడు చేసినది ఆ ినియే "నీ వెక్క గల భావశిఖరాలను చూ ుము, నీవు దూక గల ఉద్రిక్తభావాగాధలను ినుము, నీవు విశ్రమింపగల హృదయగుహ ిను తిలకింపుము" అన్నాడు ఆయన మాన ్నితో. ఇట్లు చేయుటకు నరుడు సత్యాన్వేష ుము చేతను ఉదాత్తశీలావిష్కరణము చేతను ్తు డగును. అనంతతత్త్వమునకు అనుగుణముగ ివితమును గడుపుకొను మని, ఉనికిలోను చేష్ట ులోను అనంతతత్త్వముతో ఐక్య మొందు మని శ్రీకృష్ణుని ఆనతి. భగవదన్వేషణము, పర ుత్త్వాన్వేషణము — జీవాత్మ సదా సాగించు చున్న అన్వేషణము. చిక్కులతో నిండిన క్షుద్రవిషయాలకై శక్తిని యుక్తిని రిత్తపుచ్చు ోక, చేతనుడు భగవదన్వేషణము మఱింత హెచ్చుగా చేయ వలెను. విహిత కృత్యము నకు అర్జునుని బూన్చుటకు ముందు కృష్ణు డతనికి పరతత్త్వమును బోధింపనే విశ్వరూప మును జూపెను. చూపి, 'నీ సర్వస్వమును నా కర్పించి, నను స్మరించుచు విధిని నిర్వహింపు' మనెను. 'మా మనుస్మర యుధ్య చ'. నిజము తెలిసిపోయి, వస్తుస్వరూపము అవగతము కాగానే అర్జునునకు అహంకారమును భయ మును మోహమును తొలగి పోయినవి. 'నష్టో మోహః'. అతడు సర్వనియంతచేతి యొక పనిముట్టు అయినాడు. మానవు డెప్పుడు తన జీవితమును విశ్వసూత్రమున కనుగుణముగ చేసి కొనునో, దైవనిర్ణయాల నిర్వర్తనమునకు అతడు అత్యుత్తమ మైన ఉపకరణముగ ఔను.

గీతాశాస్త్ర మొక మహచ్ఛక్తినిధి అని శ్రీవివేకానందస్వాముల అభిప్రాయము. ఉపని షత్తులనుండి అగ్గిగుండువలె ఉరలుచు వచ్చు ఏకైక పద మే మనగా "అభీః" (=భయము లేమి) అనుటయు స్వామిజికి నచ్చిన యొక తలంపు. ఈ పరతత్త్వమున నమ్మికయు భగవ న్నియమానుసారము స్వధర్మనిర్వహణమును సంగరహితతయు నిర్భీతి సాధనాలు.

మానవతతి పూర్తిగ అంతరించు నేమో అను వెఱపు సర్వత్ర వ్యాపించి యున్న యీ దినాలలో దీనాత్ములకు ఈ నిర్భీతి బోధనము చక్కని జీవ నౌషధ మగును. ప్రయత్నాలును ప్రజ్ఞలును వ్యర్థములై, పరిస్థితి తన చేతికి మించి పోయినప్పుడు మానవుడు ఇప్పటికి తాను అందు కొన్న స్థాయినుండియే, ఆరంభ మగు మఱు జన్మము ఒకటి తనకు ఉన్నదను నమ్మకముతో నిర్భయముగ మృత్యువు నెదుర్కొవచ్చును. ఈ పుట్టువున చేసిన కర్మలకును ప్రారబ్ధకర్మ శేషములకును ఫలితముగ మానవునకు భవిష్య జ్జన్మ మేర్పడును. అట్టిజన్మము సాధనకు పునరవ కాశము అగును. ఏ ప్రయత్నము కాని వ్యర్థము కాదు. 'వికసించుటకు ముందే రాలిన నకు కాని, ఎడారిలో ఇగిరిపోయిన నదికి కాని వినాశము కలుగ లే దని నే నెఱుంగుదు' నన్నాడు టాగూరు. భగవద్గీతలో శ్రీకృష్ణు డును ఎన్నో సార్లు 'ధర్మపథము ఏ కొంత పాటించినను అది మానవుని మహావిపత్తుల నుండి కాపాడును' "స్వల్ప మ ప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్". "మంచిపని

చేసిన వా డెన్నటికిని దుర్గతిని పొందడు'' 'నహి కల్యాణకృత్ కశ్చిద్ దుర్గతిం తాత గచ్ఛతి'- మున్నగు పలుకులచే నమ్మకముగొలిపి యున్నాడు. గంభీరముగను సానుగ్రహముగను ఇట్లు మాట యిచ్చినాడు — ''ఆ దురాచారి నన్ను భజించుచు శీఘ్రముగ ధర్మచిత్తు డగుచున్నాడు, నిత్యశాంతిని పొందుచున్నాడు, కౌంతేయ, నా భక్తు డెన్నడును వినష్టుడు కాడు, కృతార్థుడే యగును. నీ వీ విషయమును నిశ్చితముగ గ్రహించి ప్రతిజ్ఞాపూర్వకముగ నుడువుము''. ఆత్మ నుద్బోధించు ఈ మాటలు మనకు దృఢవిశ్వాసముగలిగించు గావుత! అట్టి విశ్వాసము గలిగి నప్పుడు మన సర్వస్వము నతని పరము చేసి అర్జును డొనర్చుకొన్నట్లుగా మనమును అతనినే మనకును సారథిగ నొనర్చుకొందుము.

# రా ముని యి చ్ఛ

## (క థ)

ఒకపల్లెలో సాలెవా డొకడు ఉండెను. అతడు మిక్కిలి దైవభక్తి గల వాడు. అతని యందు విశ్వాసమును అతనిపైని ప్రేమయు లేని వారు లేరు. సంతలో తన సరకును అమ్ముకొనుట అతనికి మామూలు. కొన వచ్చిన వాడు ఈ గుడ్డ వెల ఎంత అని అడుగును, సాలెవాడు ''రామునిసంకల్పముచొప్పున నూలు వెల రూపాయ, నేతకూలి నాలుగు అణాలు, రాముని సంకల్పానుసారము లాభము రెం డణాలు. కాబట్టి రాముని సంకల్పానుసారము ఈ గుడ్డ వెల రూపాయ ఆ ఱణాలు అని చెప్పును. జనుల కతనియందు ఎంత నమ్మకము! కొన వచ్చిన వాడు ఆ వెలను ఇచ్చి గుడ్డను తక్షణమే కొని తీఱును. ఆ సాలెవాడు యథార్థ దైవభక్తుడు. రాత్రిభోజనము కాగానే అతడు భగవన్నామములను పాడుచు మహిమలను కీర్తించుచు ధ్యానించుచు పెక్కు గంటలకాలము పూజామందిరమున గడపెడివాడు. ఒకనాటి రాత్రి ఎంత సేపటికిని అతనికి నిద్ర రా లేదు. పూజామందిరమున గూర్చుండి అతడు నడుమ నడుమ పొగ ద్రాగుచుండెను, అప్పు డొక జట్టు దొంగలు ఆ దారిని నచ్చిరి. తమ సరకులను మోయుటకు వారి కొక మనుష్యుడు కావలసి వచ్చెను. వారు సాలెవానిని తమతో ర మ్మన్నారు, చేయి పట్టుకొని పిలుచుకొని పోయినారు. వారు ఎవరింటనో దోపిడిచేసి వచ్చినారు, ఆ సరకు మూటను వారు సాలెవాని తలపై నుంచి మోసికొని ర మ్మన్నారు. తటాలున పోలీసువారు అటువైపువచ్చిరి, దొంగలు పాఱిపోయిరి. కాని సాలెవాడు తన తలపై నున్న మూటతో పట్టువడినాడు. పోలీసులు అతనిని ఆ రాత్రి జైలులో ఉంచి మఱునాడు విచారణకై మాజిస్ట్రేటు నెదుటికి తెచ్చినిలిపిరి. జరిగిన సంగతిని తెలిసికొని ఊరివారు అంద ఱును న్యాయస్థానము [కోర్టు] నకు వచ్చిరి. మాజిస్ట్రేటుతో వారు ''న్యాయమూర్తిమహా

శయా, ఇతడు దోపిడీ చేసి యుండ లేడు'' అని ఏకగ్రీవముగ జెప్పిరి. అంత మాజిస్ట్రేటు 'ఏమందువు' అని సాలెవానినే అడిగెను.

సాలెవాడు ఇట్లు అనెను — ''న్యాయమూర్తి మహాశయా, నిన్న రాత్రి రాముని సంకల్పానుసారము నేను భోజనము చేసి లేచితిని. తర్వాత రామునిసంకల్పానుసారము పూజామందిరమున కూర్చుంటిని. రామునిసంకల్పానుసారము నాటి రాత్రి చాలప్రొద్దుపోయినది. రామునిసంకల్పానుసారము నేను భగవద్ధ్యానము చేసికొనుచు భగవన్నామముల పాడుచు మహిమల కీర్తించుచు నుంటిని. అప్పుడు రామునిసంకల్పానుసారము ఒక జట్టు దొంగలు ఆ దారిని వచ్చిరి. రామునిసంకల్పానుసారము వారునన్ను తమతో లాగుకొనిపోయిరి. రామునిసంకల్పానుసారము వారు ఒకరింట దోపిడి చేసిరి. రాముని సంకల్పానుసారము వారు మూటను నా తల కెత్తిరి. సరిగా అదే సమయమునకు రాముని సంకల్పానుసారము పోలీసులు వచ్చిరి; రాముని సంకల్పానుసారము నను బంధించిరి, రాముని సంకల్పానుసారము రాత్రియంతయు నను వారు చెఱ యందుంచిరి. నేటిప్రొద్దున, న్యాయమూర్తి మహాశయా, రామునిసంకల్పానుసారము పోలీసులు నను దెచ్చి మీ యెదుట నిలిపిరి''. ఆ సాలెవాడు దైవభక్తుడని మాజిస్ట్రేటు గ్రహించి అతనిని విడుదల చేయించెను. ఇంటికి మరలి వచ్చుచు సాలెవాడు తన మిత్రులతో ''రాముని సంకల్పానుసారము నాకు విడుదల గలిగినది'' అనెను. [సూక్తిసుధ, పుటలు 295–7].

# ఇంద్రియ పరీక్ష

డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఎం. ఏ., ఎం. లిట్., పిఎచ్. డి.

మనకు కన్పించు ప్రపంచమును ఇంద్రియములద్వారా గమనించుచున్నాము. కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము, అనునవి బాహ్యముగానున్న ఐదు ఇంద్రియములు. ఆంతరమైన ఇంద్రియము మనస్సు, వీనివలన అనుభూతమగునది వాస్తవముగానున్న వస్తువని అనుకొనుచున్నాము. కాని ఈ ఇంద్రియముల స్వరూపమేమి? ఇవి వాస్తవముగా నున్నవా? అను ప్రశ్నలను వివేచింపవలెను. ఈ వివేచనలో ఇంద్రియములకే వాస్తవికత కన్పింపనిచో, తద్ద్వారా అనుభూతమగు ప్రపంచమునకు సత్యత సిద్ధముకాజాలదు. ఈ విషయమును ప్రపంచింపగోరి నాగార్జునుడు ఇంద్రియపరీక్షా ప్రకరణమును చెప్పినాడు.

## చక్షురాదీంద్రియపరీక్షా

1. దర్శనం శ్రవణం ఘ్రాణం రసనం స్పర్శనం మనః
   ఇంద్రియాణి షడేతేషాం ద్రష్టవ్యాదీని గోచరః.
2. స్వమాత్మానం దర్శనం హి తత్త్వమేవ న పశ్యతి
   న పశ్యతి యదాత్మానం కథం ద్రక్ష్యతి తత్పరాన్.

3. న పర్యాప్తో ఽగ్ని దృష్టాంతో దర్శనస్య ప్రసిద్ధయే
సదర్శనః స ప్రత్యుక్తో గమ్యమానగతాగతైః.

4. నాపశ్యమానం భవతి యదా కించన దర్శనమ్
దర్శనం పశ్య తీ త్యేవం కథ మేతత్తు యుజ్యతే.

5. పశ్యతి దర్శనం నైవ నైవ పశ్య త్యదర్శనమ్
వ్యాఖ్యాతో దర్శనే నైవ ద్రష్టా చా ప్యుపగమ్యతాన్.

6. తిరస్కృత్య ద్రష్టా నా స్త్యతిరస్కృత్య చ దర్శనమ్
ద్రష్టవ్యం దర్శనం చైవ ద్రష్ట ర్యసతి తే కుతః.

7. ప్రతీత్య మాతాపితరౌ య థో క్తః పుత్రసంభవః
చక్షూరూపే ప్రతీ త్యైవ ముక్తో విజ్ఞానసంభవః.

8. ద్రష్టవ్య దర్శ నాభావా ద్విజ్ఞా నాది చతుష్టయమ్
నా స్తీతి; ఉపాదానాదీని భవిష్యంతి పునః కథమ్.

9. వ్యాఖ్యాతం శ్రవణం ఘ్రాణం రసనం స్పర్శనం మనః
దర్శనే నైవ జానీయా చ్ఛ్రోతృశ్రోతవ్య కాది చ.

ఇత్యాచార్య నాగార్జునపా దోపరచితాసు మధ్యమక కారికాసు
చక్షురాదీంద్రియ పరీక్షా.

## [వివరణ]

1. చూచుట, వినుట, వాసనజూచుట, రుచిచూచుట, తాకుట అను క్రియలను జేయునవి కన్ను, చెవి, ముక్కు, నాలుక, చర్మము అనునవి ఐదింద్రియములు. ఆరవది మనస్సు. బౌద్ధులకు మనస్సుకూడ ఇంద్రియమే. అద్వైతులుమాత్రము మనస్సు నింద్రియ మనరు. ఈ ఆరింద్రియముల ద్వారా తెలియబడు విషయములున్నవని లౌకిక ప్రజలు చెప్పుదురు.

2. కాని ఈ ఇంద్రియములే యుక్తి పూర్వకముగా సిద్ధము కాజాలవు. చూచునదికన్ను. చూడబడువస్తువునకు రూపములేనిచో ఆ వస్తువును కన్ను గ్రహింపజాలదు. రూపమును మాత్రము కన్ను గ్రహింపగలదా ? అను ఆశంక ఇక వివేచింపబడుచున్నది.

కన్ను తన్ను తాను చూచుకొనలేదు. ఇట్లే చెవి తన్ను తాను వినలేదు. స్వస్వాదర్శనాది క్రియలలో శక్తిరహితములైనవి ఇంద్రియములు. తన్ను తానే చూచుకొనలేని కన్ను లీలాదిరూపములనెట్లు చూడగలదు ?

3. ఐనను అగ్ని ఇతరవస్తువులను దహించుచున్నట్లు కన్ను తన్ను తాను చూడలేకపోయినను, ఇతరవస్తువుల నెందుకు చూడలేదని ప్రశ్నింపవచ్చును. కాని ఈ అగ్నిదృష్టాంతము

ప్రస్తుతవిషయమును సాధింపలేదు. గతాగత గమ్యమానములు కుదరజాలవని వెనుక చెప్పితిమి. ఇట్లే అగ్నికూడ దహింపబడినదానిని గాని, దహింపబడనిదానినిగాని, దహింపబడు చున్నదానినిగాని ఏమాత్రము దహింప జాలదని స్పష్టము. ఇదేవిధముగా చూడబడినది, చూడబడనిది, చూడబడుచున్నది అనువానిలో దేనిని కన్ను చూడలేదని చెప్పవలెను. కావున కన్ను తన్ను తాను చూచుకొనలేదు, అన్య వస్తువులను చూడలేదు అని సిద్ధమగుచున్నది.

4. చూడనప్పుడు చూచుచున్నదని చెప్పుట అసంగతము గనుక కన్ను వస్తువులను చూచునని చెప్పుట తగదు.

5. దర్శనస్వభావముగల కంటికి దర్శన క్రియతో సంబంధమున్నదా? లేక దర్శనస్వభావములేని కంటికి ఈ దర్శనవ్యాపారముతో సంబంధమున్నదా ?

వస్తుతః కంటికి చూచు స్వభావమేఉన్నచో మరల కన్ను చూచుచున్నదని చెప్పితిమేని కంటికి రెండు దర్శనవ్యాపారములు రాగలవు. అప్పుడు ఒక్కొక్కకంటికి రెండుకన్నులు రావలెను. చూచుస్వభావమేలేని కన్ను దేనిని చూడలేదు. దర్శనక్రియారహితమైన నేత్రము నేత్రమే కాజాలదు.

చూచుటకు అనునది కుదరనిచో, చూచువాడుకూడ సిద్ధము కాజాలడు గదా!

6. చూచువాడులేనిచో చూచుటగాని, చూడబడు వస్తువుగాని ఉండజాలవు. ఇవి ద్రష్ట్రుసాపేక్షములు. చూచువానిని వదలివేసినచో దర్శనమాశ్రయరహితమగును. ఆశ్రయమే లేనిచూపు ఎక్కడను ఉండజాలదు. చూచువాడొకడున్నచో, ఇతని స్వభావమే చూచుట కాగలదు గనుక ఇతనికి వేరొకదర్శనక్రియా సంబంధము కుదురదు.

7. "చూచుట, చూడబడువస్తువు అనువానిని ఆశ్రయించుకొని విషయసంబంధమగు జ్ఞానముకలుగుచున్నది. తల్లిదండ్రులను ఆశ్రయముగా జేసికొని పుత్రుడు జన్మించుచున్నాడు గదా! ఇట్లే చక్షువు, రూపము, చూచుట అనునవిలేవా?" అను ఆశంకలు కలుగవచ్చును.

8. ఈ ఆశంకకు సమాధానము చెప్పబడు చున్నది. చూచువాడులేడు గనుక ద్రష్టవ్యము, దర్శనము లేవనిచెప్పితిమి. అప్పుడు విజ్ఞానముమాత్రముండగలదని చెప్ప వీలుపడదు. దర్శనము, ద్రష్టవ్యము, విజ్ఞానము అనువాని కలయికవలన వచ్చు స్పర్శ అనునది విజ్ఞానమే లేనిచో ఉండజాలదు. స్పర్శలేనిచో వేదన ఉండదు. వేదనలేనిచో తృష్ణలేదు. ఇట్లు ఉపాదానాదులు సిద్ధము కాజాలవు.

9. దర్శనము విషయమున చెప్పిన యుక్తిని అనుసరించితిమేని శ్రవణము, ఘ్రాణము, రసన, స్పర్శ, మనస్సు అనునవి సిద్ధింపవు. ఇట్లే వినువాడు, వాసనచూచువాడు, రుచిచూచువాడు, తాకువాడు, మనోవ్యాపారము గలవాడుకూడ ఉండజాలరు. శ్రవణాది క్రియలుకూడ సిద్ధము కాజాలవు.

శ్రీ ఆచార్య నాగార్జునపాదులు రచించిన చక్షురాదీంద్రియ పరీక్ష అను ప్రకరణము.

"బాణవిద్యను అభ్యసించువారికి నేను చెప్పునది — మొదట అరటిచెట్టును గురిపెట్టవలెను, తర్వాత దీపపువత్తిని, అటు పిమ్మట ఎగురుచున్న పక్షిని". —శ్రీరామకృష్ణుడు.

# ఆలోచనా పథము

## ఒక "జీవి"

శ్రీ రమణమహర్షి తమభక్తకోటిని, మౌనముగ కొంతకాలము కూర్చొనియుండుట నభ్యసింపుమని చెప్పుచుండిరట. 1936 లో కార్తీక దీపపురోజులలో నేను వారి సాన్నిధ్యమున నొక వారమురోజులపాటుంటిని. అది మరపురాని యనుభవము. ఆశ్రమములో నే నడుగుపెట్టిన వెంటనే ఒక గొప్పశాంతిని అనుభవించితిని. పిమ్మట వారిసాన్నిధ్యమున కూర్చొనియుండినపుడుగూడ నట్టిశాంతియే. వారు ఒకబల్లపై శాంతముగ కూర్చొని, ఎక్కడికో దూరప్రదేశమునకు చూపునిమిడ్చియుందురు. పరిచయస్థులతో అప్పుడప్పుడు మాట్లాడుదురు, భక్తులు ప్రశ్నలవేయుట అరుదు; ఆయనజవాబిచ్చుట అంతకన్న అరుదు. తమపుస్తకములను చదివి, సందేహముల బాపికొనుమని మహర్షి భక్తులకు చెప్పెడివారట. విదేశీయులుకూడ మౌనముగ వారి సాన్నిధ్యమున కూర్చొనియుందురు.

సాయంకాలములయందు, ప్రాతఃకాలమున బ్రాహ్మణులు, భక్తులు వారిని వేద ఋక్కులతో కొలిచెడివారు. ఆహా! పూర్వము మున్యాశ్రమములు ఇట్లు కదా ఉండియుండవలెనని నే ననుకొనెడివాడను.

నే నాశ్రమములో నున్నపుడు గుజరాతీ ఒకరు, బొంబాయి న్యాయవాది, అచ్చట స్వామి దర్శనార్థము కుటుంబముతో వచ్చియుండిరి, ఆయననాతో ''ఇక్కడినుండి వెళ్లిన తరువాత నీకు శుభముకల్గును. ఇక్కడ ఎప్పుడునూ అంతయే'' అని చెప్పిరి. ఆశ్చర్యము! అట్లే జరిగెను. 14 సంవత్సరముల బాటు వివాహముజేసికొన యత్నించియు, నటుల జరిగియుండలేదు. కాని, శ్రీరమణాశ్రమమునుండి మరలగనే, మొదట నొకచిన్ని ఉద్యోగమును, పిమ్మట వివాహమును నాకు ప్రాప్తించెను.

పాల్‌బ్రంటన్ అను నొక ప్రఖ్యాత ఆంగ్లేయ తత్త్వవేత్త యీ ప్రపంచమంతయు తిరిగి, మూలమూలలనున్న మహాత్ములనందరిని సందర్శించెను. ఈయనుభవములనుగూర్చి వారు కొన్ని యుద్గ్రంథములవ్రాసియున్నారు. వీనిలో ''ఇండియాయొక్క రహస్యములను వెదకుట'' అనునది ఒకటి. ఈ పుస్తకములో తాను రమణభక్తుడగుటనుగూర్చి ఆయన వ్రాసియున్నారు. తప్పక చదువదగినది.

తరువాత నొకసారి తిరువణ్ణామలైమీదుగా ప్రయాణ మొనర్చినను మహర్షుల దర్శన భాగ్యము నాకు దొరకలేదు. ఆశాభంగముతో నాఊరుదాటి వెళ్లితిని. ఇటీవల చెన్నపురిలోని ఒక వైద్యునిఇంట నొక వివాహమునకు వెళ్ళినపుడు, గోడలమీద నెక్కడజూచినను మహర్షి చిత్రములే, పెద్దవి. ఎంతో ఆనందముకలిగెను.

రామకృష్ణ, రమణులబోలిన మహర్షులు శతాబ్దముల కొకతూరి అవతరింతురు. ఈభగవత్కటాక్షమును మనము గుర్తెరింగి, తరింతుము గాక!

''నీరు చేతిని కాల్చును అందురు. నీటిలోని వేడిమి, నీటిలోని నిప్పు, చేతిని కాల్ప గలుగునే కాని, వట్టి నీరు చేతిని కాల్ప గలది కానే కాదు. ఇంద్రియములు తమ పనులను తామే చేయును అని మానవుడు అనును, కాని ఇంద్రియముల మఱుగున చైతన్యస్వరూపి యగు దేవుడున్నాడని అతడెఱుగడు''.

—శ్రీరామకృష్ణుడు.

# విచిత్ర విశ్వము

## ఆయుర్వేదవైద్య శ్రీ వస్తాదు వేంకటస్వామిగారు

సోదరా, ఈ బ్రహ్మాండభాండములో నేనొక చిన్న నలుసును. అనంతకోటిజీవరాసులలో నేను లెక్కా? పత్రమా? ఒక చిరుగాలి విసరి ధూళిధూసరమును లేవగొట్టి యే మూలకో విసరి వేయునట్లు ఈ విశ్వము నన్ను లక్ష్యపెట్టకుండ తన ఆట తా నాడుకొనుచుండగా, తనపాట తాను పాడుకొనుచుండగా, నేను మాత్ర మీ విశ్వమును ఎందుకు లక్ష్యపెట్టవలె అని మాత్రము కాదు నా సంకోచము నా సందేహము—ఈ విశ్వము కన్నులు లేని కబోది యని యనుకొనుచున్నావు, దాని నడక గ్రుడ్డి దని నీ యభిప్రాయము నీ ఉనికే దానికి తెలియ దని నీ యుద్దేశము. అది యెంత అజ్ఞానావస్థ. ఈ విశ్వమునకు వెయ్యి కన్ను లున్నవి. కాదు — అనంతకోటి నక్షత్రా లన్నియు కన్నులే. విశ్వములోని ప్రతివస్తువును, ప్రతికార్యమును, ప్రతిజీవిని కూడ ఆ కన్నులతో కనుపెట్టుచునే యున్నది. విశ్వము చూపులో విభాగాలు లేవు. ఆ చూపునకు ప్రతిజీవి యొక కేంద్రమే! ఒక లక్ష్యమే! బ్రహ్మాండభాండాల నన్నింటిని ఎంత సమగ్రముగా, ఎంత సంపూర్ణముగా, ఎంత నిష్పాక్షికముగా చూచుచున్నదో ని న్నొక్కనిని గూడ నంత సమగ్రముగా, అంత సంపూర్ణముగా, అంత నిష్పాక్షికముగా అన్ని కన్నులతో అన్ని వేళల కనుపెట్టుచునే యున్నది. విశ్వ మన గానే వస్తువుల కూడిక కాదు. జీవుల లెక్క కాదు. ఏది ప్రతి అణువునందు, ప్రతిజీవియందు సంపూర్ణమో, సర్వమునందు కూడ అంత సంపూర్ణము, అంత అనంతము. మనము ఈ విచిత్రవిశ్వమును లక్ష్యపెట్టక పోయినను విశ్వములోని కెల్ల నీవు ఒక్కడవే యైనట్లు విశ్వము నిన్ను సంపూర్ణముగా లక్ష్యపెట్టుచు నీ భవితవ్యమును సమాదరణతో నిరంతరము నిరూపించుచునే యున్నది. ఈ విచిత్రవిశ్వములో ప్రతిఅణువునకు ప్రతిజీవికి స్థాన మున్నది, ఉనికి యున్నది. ప్రాముఖ్యము ఉన్నది. విశిష్టత యున్నది. లోక మనుకొను హెచ్చుతగ్గులు, న్యూనాతిరిక్తములు, కృత్రిమాకృత్రిమములు, ఈ విచిత్ర విశ్వదృష్టిలో సర్వము సమానము. సమస్త ధర్మములు విశ్వపోషకములు. జగత్తునకు అగ్ని ఎంత అవసరమో నీరు గాలి అంత అవసరములే అయినను వాని ధర్మములు వేరు. లోకము చఱచు చప్పట్లను బట్టి ప్రాముఖ్యాలను నీవు నిర్ణయింపకుము. నీవు విశ్వమును ఎంత నఱ కుపలక్షించి ఎట్టి బలిదానము చేయగల్గుచుంటివో నీ ప్రాముఖ్యము అంతప్రమాణాన పెరుగుచుండును. ఈ లోకమే విశ్వ మని భ్రమింపకు, ఈ లోకము ని న్నాదరింపక పోవుగాక! బహిష్కరించి పీడించినను పీడించుగాక! కాని విశ్వజనని నిన్ను విడనాడదు.

తల్లియంకమే నీ రంగభూమి. తల్లిప్రేమ బాహుబంధములనుండి ని న్నెవ్వరు తప్పింపగలరు? లోకము గతానుగతికముగా నిర్దేశించు కొలతలను, ప్రమాణములనుబట్టి నీ జీవనమున కీ విచిత్ర విశ్వమున విలువ కట్టుకొనుట సరి కాదు. నీ ప్రాముఖ్యము నీది. నీ భవితవ్యము నీది, నీ వొక్కడవు లోపించినను విశ్వ

మే తారుమారై యూరకుండును. ఇక నీ ప్రాముఖ్య మెట్టిదో నీవే యూహించుకో.

విశ్వజనని సర్వాంగసుందరి. నీవు తల్లి యవయవములలో నొక యంగమే యగుదువు గాక. ఆ యొక్క అంగము లేక పోయినచో నీ తల్లి వికలాంగిని, కురూపిణి కాదా! నీ తల్లి పాద నఖాగ్రలేశములో నీ వొక నఖాగ్రలేశమై నను, ఆ నఖాగ్రలేశము నిండు దీప్తితో ప్రకాశించినచో నా తల్లి యెంత పరమానందభరితురా లగునో యోచించుకొనుము. అప్పుడు నీనుండి ప్రకాశించి ప్రకటిత మైన వెలుగు జిలుగు ఎంతమంది దుఃఖతమస్సులను పటాపంచలు గావించి ప్రశాంతి దాయక మగునో!

ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః.



# మాతృశ్రీ శారదాదేవి

## [ శ్రీమద్గంభీరానందవాణి ]

### అవతరణము

జయరామవాటి గ్రామములోనికి ముఖర్జీలు ఎప్పుడు వచ్చి చేరిరో మన మెఱుగము. ప్రాచీనపత్రాలు రెండు ఉన్నవి. వానివలన 1669 వ సంవత్సరమధ్యమును శ్రీ చైతన్యసింహు డను విష్ణుపూరు రా జొకడు ముఖర్జీవంశ మూలపురుషు డైన ఖేలారాము అను నొకనికి కుటుంబభృతికై యు ధర్మదేవారాధనకై యు ఆఱు ఎకరాల పొలమును పన్నులు శిస్తు లేవియు కట్టవలసిన బాధ్యత లేని పద్ధతిలో దాన మిచ్చినట్లు తెలియుచున్నది. ముఖర్జీ లంతకు పూర్వమే ధర్మదేవారాధకులుగ నుండి ఆ యారాధన నిర్వహణార్థమే ఈ గ్రామమునకు వచ్చి యుండ వచ్చును. బౌద్ధదేవతలలో ధర్మదేవుడు ముఖ్యుడు. ఆయన పెక్కు నామములతో విలసిల్లు చుండెను. అది వంగదేశ చరిత్రములో హిందూమతము బౌద్ధమును బౌద్ధదేవతలను తనలోనికి ఆకర్షించుకొనుచున్న సంధియుగ మేమో! ఈ పల్లెలో పద మిడిన వెంటనే ముఖర్జీలు త త్ప్రాంతీయ హిందువులకు కులపురోహితులై, క్రమముగ హిందూమతమునే సర్వప్రధానముగ జేసిరి. వా రారాధించు చుండిన హిందూదేవత సింహవాహినియే వారికి ఇలువేలు పైనది.

ముఖర్జీల మొదటి బస ఇప్పుడు మాతృశ్రీ గుడి ఉన్నచోటనే ఉండె నేమో. ఏల యన గుడికి పునాదులువేయుటకై త్రవ్వుచుండినపుడు నల్లరాతి శివవిగ్రహము దొరకినది. ఈ విగ్రహమును ముఖర్జీ లొకప్పుడు ఆరాధించు చుండి యుండ వలెను. మాతృశ్రీ ఇచ్చట తనకు తొమ్మిదేండ్ల వయస్సు వచ్చు వఱకు నుండెను.

ఆమె వివాహ మైనదియు ఇచటనే. "నా పెండ్లి ప్రాతింట జరిగినది. తర్వాత నా తొమ్మిదవ యేట క్రొత్తింటికి వచ్చి చేరితిమి. ఏల యన ప్రాతిల్లు మాకు బొత్తిగా చాల కుండినది" అని శారదామాత స్వయముగ చెప్పియున్నది. ఈ క్రొత్తిల్లు ఆమె సోదరులలో వరదుని భాగమునకు వచ్చినది.

ముఖర్జీల వంశమున సర్వగుణభవ్యుడు రామచంద్రుడు. ఆయన కిష్టదేవత శ్రీరాముడు. దైవభక్తియు మధురచిత్తవృత్తియు ఎల్లర యెడ కనికరమును గల ఆయనపై జయరామవాటి గ్రామవాసుల కెంతో గౌరవము. సిహోడు లో శ్రీహరిదాసమజుందారుగారి పుత్రిక యైన శ్యామసుందరీదేవిని రామచంద్రుడు వివాహ మాడెను. ధర్మాచరణమున పతికి దీటు వచ్చు సతి ఆమె. ఆమె పవిత్రతను సరళతను స్థైర్యమును పల్లెప్రజలు సదా కొనియాడు చుండెడి వారు. మాతృశ్రీ శారదాదేవి ఈ భక్తదంపతుల పుత్రిక. తన తల్లిదండ్రులను గూర్చి మాతృశ్రీ అప్పు డప్పుడు కొన్ని వాక్యములు చెప్పి యున్నది. ఆ వాక్యములవలన వారిపట్ల ఆమె భక్తి ఎట్టిదో, వారి సచ్ఛీల మెంతటిదో మనకు తెలియును. ఇవే ఆమె వాక్యాలు—"నా తల్లిదండ్రులు చాల మంచి వారు. మా నాయన గొప్ప రామభక్తుడు, సనాతనాచారనిష్ఠుడు, వర్ణాంతరులు ఏమి దానము చేసినను స్వీకరింపడు. మాఅమ్మకు ఎంత దయ! అన్నార్థులకు అన్నము పెట్టుటలో ఆమెకు ఎంత శ్రద్ధ! వారిని ఆమె ఎంత శ్రద్ధగా విచారించుకొనెడిది! ఎంత అమాయకురాలు! మా నాయనకు పొగత్రాగుట ఇష్టము. అయనను చాల నిగర్వియు . సరళస్వభావుడును కావున తన వాకిలి మీదుగ ఎవరు పోయినను వారిని మైత్రితో ఆహ్వానించి "సోదరా, కూర్చుండుము, పొగత్రాగుము" అనెడి వాడు. స్వయముగ హుక్కాను మాటిమాటికి నింపి యిచ్చెడి వాడు. శాంతాత్ములు కాని తలిదండ్రులకు బిడ్డగ అవతారమూర్తి జనించునా? మా అమ్మ సాక్షాల్లక్ష్మియే. సంవత్సరము పొడుగునను ఆమె వస్తువులను సేకరించి వానిని చక్కగ అమర్చి ఉంచెడిది. 'నా కుటుంబము భగవంతునకును భగవద్భక్తులకునే' అనుచుండును ఆమె. కుటుంబము ఆమె సొంతజీవితమున అంగభూత మయ్యెను. దానిని సుస్థితిలో ఉంచుటలో ఆమె చూపని శ్రద్ధ కలదా?"

రామచంద్రునకు త్రైలోక్యనాథుడు ఈశ్వరచంద్రుడు నీలమాధవుడు అని మువ్వురు తమ్ములుండిరి. అందఱును ఏకకుటుంబముగ ఉండిరి. వీరు సంపన్నులుగ ఎన్నడును ఉండ లేదు. సేద్యముచేతను పౌరోహిత్యముచేతను ఎట్లో జీవితము గడపుచుండిరి. ఐనను రామచంద్రుని దానాభిరతి నిరర్గళము. మనకు అందుంగూర్చిన నిదర్శనములు కాలక్రమమున కనిపింపనున్నవి.

సిహోడు ఉత్తరభాగాన తండ్రియింట నుండగా ఒకప్పుడు శ్యామసుందరీదేవి మారేడు చెట్టు క్రింద కుమ్మరివాని పొయ్యికి ప్రక్కన చీకటిలో కూర్చుండ వలసి వచ్చినది. తటాలున పొయ్యి ఉన్న వైపునుండి ఘల్లుఘల్లు మను చప్పుడు విన నై వృక్షశాఖలనుండి చిన్న బాలిక యొకతె దిగి వచ్చినది. ఆమె తన మృదుహస్తములతో శ్యామసుందరీదేవిని కౌగిలించుకొనెను. శ్యామసుందరీదేవి స్మృతి తప్పి పడిపోయెను. ఎంత సేపు అట్లు పడి యుండెనో ఆమెకు తెలియదు. బంధువు లామెను అన్వే

షించుచు వచ్చి యింటికి కొంపోయిరి. స్మృతి గల్గినప్పుడు ఆమెకు ఆ చిన్న బాలిక తన గర్భములోన చొచ్చుకొని ఉన్నట్లు అనిపించినది.

అప్పుడు రామచంద్రుడు తన కుటుంబమునకు వలసిన ధనము గడించు నుపాయముల వెదకుచు కలకత్తాలో నుండెను. కుటుంబ దారిద్ర్యమును గూర్చిన మనోవ్యథ ఆయన కెక్కువగ నుండెను. కలకత్తాకు బయలుదేఱుద మని నిశ్చయించుకొనుటకు మును పొక నాడు ఆ యాలోచనలోనే నిమగ్నుడై యుండి నిదురించెను. కల గాంచెను. కలలో బంగారు చాయ నెమ్మేను గల కన్య యొక్కర్తె వెనుకనుండి వచ్చి తన మృదుహస్తములతో అతని మెడను కౌగిలించుకొనె నట. నిరూపమాన మైన ఆమె సౌందర్యమును, వెల యిడ రాని యామె యాభరణాలను గనిన, ఆమె మామూలు వ్యక్తి కా దనుట స్పష్ట మగుచుండె నట. అతి విస్మితుడై రామచంద్రుడు 'అమ్మాయి, నీ వెవరు' అని అడిగినా డట. ఆ కన్నె మృదుమధుర కంఠమున 'నీకొఱకే వచ్చితి నిటకు' అనెనట. ఇది స్వప్నవృత్తాంతము. నిదుర మేలుకొనిన పిదప, తనకు ఆలాగు దర్శన మనుగ్రహించినది భాగ్యాధిదేవత యగు సాక్షా ల్లక్ష్మియే అను నమ్మిక మతని మనమున పెంపొందెను. మొదట అనుకొన్నట్లే అతడు కలకత్తాకు పోయెను. ధనాన్వేషణములో అతడు ఎంతవఱకు కృతార్థుడయ్యెనో మే మెఱుగము కాని ఇంటికి మరలిన వెంటనే. ప్రియురాలికి గలిగిన యనుభూతిని వినెను. తాను ఆధ్యాత్మికచిత్తుడు కావున నిరభ్యంతరముగను పూర్తిగను నమ్మెను. అప్పటి నుండి దివ్యశిశుజన్మమును ప్రతీక్షించుచు ఈ పుణ్య బ్రాహ్మణ దంపతులు అత్యంత పవిత్ర జీవితముల గడపు చుండిరి. మాతృశ్రీ జన్మించు వఱకు రామచంద్రుడు తన సతిని ఎప్పుడును స్పృశింపనే లేదు. అతని కామెయెడ ఆదరమతిమాత్రము. అనన్యలభ్య మగు తన భాగ్యమును శ్యామసుందరీదేవి చక్కగ నెఱుగును. పిదప చిరకాలమునకు ఆమె యోగిన్మాతో ఇట్లనెను. ''నేను గర్భిణిగ నుండినప్పుడు ఎంత సౌందర్యవతిగ అగపడెడిదానను! శిరోజములు ఎంత దట్టము! నాకు ఆ దినాలలో కానుకలుగ అర్పితము లైన వసనము లెన్ని!''

క్రమముగ కానుపు దినాలు దరిసినవి. శరత్తు దాటినది. పుష్యమాసము అప్పుడే ప్రారంభ మైనది. వంగ దేశీయ గ్రామ ప్రజలకు సంవత్సరములో చాల సుఖకరము లైన నెలలో పుష్య మొకటి. పైరు కోత లైనవి. ధాన్యాల కొట్లు నిండి ఉన్నవి. చుట్టుపట్ల పొలాలలో వేసవి దినాలకు అందునట్లు సస్యములు పెరుగ జొచ్చినవి, కోతపండుగ ముగిసినది. భక్ష్యాల విందులు భుజింప పసిపిల్లలు ధనుస్సంక్రాంతిపండుగకు నిరీక్షించుచుండిరి. క్రైస్తవ లోకము క్రిస్తుమసు దినానందానుభూతికి ఉవ్విళులూరుచుండినది. ఆ నెలలో కాళినారాధించిన ఫల మెక్కువ కావున తాంత్రికులు కాళిగుడుల కెక్కువగ వచ్చుచు బోవు చుండిరి. అది ధనుస్సంక్రాంతిదినము. సంవత్సరమున కంతటికిని దీర్ఘతమ మైన రాత్రి గడచినది. సూర్యుడు ఉత్తరమునకు మరల నున్నాడు. అది హిందుదేతలును దేవేరులును ఆఱు మాసాల నిద్రనుండి మేల్కాంచు దినము. అట్టి కాలమున 1853 వ సంవత్సరము డిసంబరు తే 22 ది పుష్యాష్టమి గురువారము, నిశీధినీదేవి జయరామవాటి ప్రజలను నిదుర బుచ్చు కప్పిన చుక్కల కంబళముం బోని చుక్కల రాత్రి

వేళ రామచంద్రు నింట శంఖములు మ్రోగి శ్రీ శారదామణీదేవి అవతరించిన దను మంగళ వార్తను వెల్లడించినవి. వెంటనే ఒక జోస్యుని పిలిపించిరి. తత్కాల గ్రహ నక్షత్ర స్థితులను బట్టి శిశువునకు ఠాకూర్మణి అను పేరు యథా విధిగ పెట్టబడెను. కాని ఆమెగారి 'శారదా మణి' అను పేరే జనప్రీతి నెక్కువగ చూఱ గొనెను.*

శారద తన తల్లిదండ్రులకు ప్రథమ సంతానము. పిమ్మట కాదంబిని యను చెల్లె లొకతె పుట్టినది. అటు తర్వాత ప్రసన్నకుమారుడు ఉమేశచంద్రుడు కాళీకుమారుడు వరదాప్రసాదుడు అభయచరణుడు అను నైదుగురు తమ్ములు పుట్టిరి. కొకందము సుధారామచక్రవర్తిని పెండ్లాడిన వెంటనే కాదంబిని మరణించినది. ఆమెకు బిడ్డలు పుట్ట లేదు. ఉమేశుడు కూడ పెండ్లి కాక మునుపే తన పదునెనిమిదవ యేటనో పంతొమ్మిదవ యేటనో మరణించెను. అభయుడును వైద్యపరీక్షలో నెగ్గిన వెంటనే తన భార్యను పుత్రికను విడిచి లోకాంతరగతు డయ్యెను. ఆ పుత్రికను గూర్చి, మీద విశేషముగ చెప్ప వలసి యుండును. తక్కిన సోదరులు పెరిగి పెద్ద వారై వేఱు వేఱు కాపురాల వారై తమ తమ కుటుంబాలను పోషించుకొను చుండిరి. తండ్రితాతల నాటి తమ యింటికి దక్షిణముగ కాళిమామ † తన యింటిని కట్టుకొనెను. ఆ యింటి ఈశాన్యముగ వరదయ్యా మామ యి ల్లుండెను. అందుకు నైరృతిగ కలుగెడె అను సర స్సున్నది. దానిని మునుపే పేర్కొని యున్నాము. ఆ నీళ్లతోనే ముఖర్జీలు తమ గృహపరికరాలను శుద్ధి చేసికొను చుండిరి. మాతృశ్రీగుడికి దక్షిణముగను కాళిమామ యింటి కుత్తరముగను మామ ప్రసన్నుని యిల్లున్నది. మాతృశ్రీ తన జీవితమున విశేష భాగమును ప్రసన్నుని కుటీరముననే గడపినది. రామకృష్ణమఠాధికారులు ఇప్పుడు ఆ కుటీరమును కొని దానిని అమ్మగుడి ఆస్తులలో చేర్చి వేసినారు. పుణ్యపుకూరును మాతృశ్రీ క్రొత్తిల్లును ఆ ఆస్తులలోనే చేరి యున్నవి. ఆ కుటీరమున కుత్తరముగ ఉన్న వాకిలి మామ సూరయ్యా (సూర్యుని)ది. సూర్యుడు ఈశ్వరచంద్రముఖర్జీకి పుత్రుడు. ఈశ్వరచంద్రముఖర్జి మాతృశ్రీ పినతండ్రులలో ఒకడు. పినతండ్రులలో పెద్దాయన త్రైలోక్యుడు. అతడు సంస్కృతపండితుడు. పెండ్లి ఐన వెంటనే నడివయస్సులో అతడు మరణించెను. కడగొట్టు పినతండ్రి నీలమాధవుడు బ్రహ్మచారిగనే రామచంద్రు నెడబాయ కుండెను.

మామప్రసన్నుని మొదటి భార్య రామప్రియాదేవి. ఆమె గతింపగా నతడు సువాసినీదేవిని పెండ్లి యాడెను. నళినియు సుశీలయు పెదభార్య కూతుండ్రు. చినభార్యకు 'కమల'

* రెండు పేళ్లు పెట్టుట ఆచారము. ఒకటి జ్యౌతిషశాస్త్రానుగుణ మైనది, ఒకటి మామూలు వ్యవహారమునకు ఉపయోగించునది. మామూలు వ్యవహారమునకై శిశువునకు మొదట క్షేమంకరి అను పేరు పెట్టినా రట. కాని శ్యామసుందరీదేవి తోబుట్టువులలో నొకతెకు శారద యను కూతు రొకతె పుట్టి గతించెను. జ్ఞాపకార్థము ఆ పేరును ఈ శిశువునకు ఆమె పెట్టించిన దట. ఈ సంగతిని మాతృశ్రీయే శ్రీ గౌరీశ్వరానందస్వామికి చెప్పె నట. ఆయన మాకు తెలిపినాడు.

† మాతృశ్రీ భక్తులకు ఆమె సోదరులను మామ లనియు, వారి భార్యలను అత్త లనియు, వారి దుహితలను అక్కచెల్లెండ్రనియు, వ్యవహరించుట పరిపాటి.

'విమల' అను సుతలు మాతృశ్రీ జీవించి యుండగనే పుట్టిరి, గణపతి అను తనయుడు ఆమె మరణానంతరము పుట్టెను. కాళీమామకు సుబోధబాలాదేవియందు 'భూదేవ' 'రాధారమణు' లను నిద్దఱు పుత్రులు పుట్టిరి. మామ అభయుడు మరణింపగా, అతని భార్య సురబాలయు, పుత్త్రిక రాధారాణియు మిగిలి రని పైని చెప్పి ఉంటిమి కదా. రాధారాణికి రాధు అనియు రాధి అనియు కూడ ముద్దు పేళ్లు. మామప్రసన్నుడు కలకత్తాలో పౌరోహిత్యము చేసి ఏదో కొంత అధికపడి ధనము గడించుచుండును. జీవితప్రారంభదశలో పేదఱిక మనుభవించిన వాడైనందుచేత నేమో మిక్కిలి మితమైన వ్యయము చేయును. మిగుల్చుకొన్న పైకము పెట్టి అతడు పొలాలను ఎడ్లను కొని తన పరిస్థితిని బాగుపఱచుకొనెను. కాళీకుమారునకు చిరాకు ఎక్కువ. అతనికంటె ముందు పుట్టిన బిడ్డలు కొందఱు మరణించియుండినందున అతని తల్లి దుఃఖపరవశురాలయ్యె నట. అప్పుడు కాళి నుపాసించు మహిళ యొకతె ఆమెకు కొన్నిమందు లిచ్చి దీవించిన దట. అందు మీదట కాళీకుమారుడు పుట్టెను. అతని కున్న కస్సు బుస్సు మను స్వభావమునకు కారణ మదే. కాళి జయరామవాటిలోనే ఉండెను. సనాతనాచారనిష్ఠుడును నిత్యనైమిత్తికకర్మానుష్ఠానపరుడును అగుటచేత అతని పట్ల జనులకు ఎంతో గౌరవము. వరదయ్యమామ కూడ జయరామవాటిలోనే ఉండువాడైనను ప్రసన్నునికి సాయపడుటకై తఱచు కలకత్తాకు పోవు చుండెను.

మాతృశ్రీ బాల్యము గడచిన దొక పేద కుటుంబములో. కాని ఆ పేదఱికమే ఒక విధమైన వరముగనై, ఎల్లరయెడ ప్రేమను జూపు నవకాశముల నెక్కువగ నిచ్చి, జీవితమాధుర్యమును హెచ్చించెను. రామచంద్రుడు తన పొలములో పండించు వరి కుటుంబవ్యయాలకు చాలుట లేదు, కావున అతడు కొంచెము ప్రత్తిని కూడ పండించుచుండెను. శ్యామసుందరీదేవి పసిపిల్లయైన శారద నెత్తుకొనియే ప్రత్తిపొలాలకు పోయెడిది, పిల్ల నట పరుండబెట్టి తాను ప్రత్తికాయలను కోసెడిది. శారద కొంత ఎదిగిన పిమ్మట తల్లికి ఈ పనియందును, జందెములకు వలసిన నూలు వడకుటలోను సాయపడుచుండెను. జందెముల అమ్మకముచే లభించు పైకము వీరింటి గుడ్డల ఖర్చుకును మఱికొన్నింటికిని అయ్యెడిది. తమ్ములను చూచుకో వలసిన పని కూడ శారద కుండెడిది. "గంగకు స్నానమునకు పోవు నప్పుడు కూడ తమ్ములతోనే పోవుట నాకు వాడుక. గంగ అనగా ఆమోదరనదియే. అదియే మాకు గంగ.‡ స్నానానంతరము అక్కడే వారును నేనును బొరుగులను తిందుము. పిమ్మట వారిని నే నింటికి తెత్తును. గంగ అనిన నాకు ఎప్పుడును విశేషాభిమానము" అన్నది అమ్మ. తన తక్కినపనులను గూర్చి ఇట్లన్నది — "బాలికనుగ ఉండినప్పుడు మెడబంటి నీట దిగి పశువులకు పచ్చిక కోసెడి దానను. బొరుగులను పొలాలకు కొంపోయి పనివాండ్ర కందించెడి దానను. ఒకసంవత్సరము మిడుతలు పైర్లను చాలవఱకు పాడు చేసినవి. అప్పుడు ధాన్యమును ప్రోగుచేయుటకు నేను పొలముల వెంట తిరిగితిని". తన చదువును గూర్చి ఇట్లు చెప్పినది—

‡ కాలవిశేషములలో సకలజలాశయములును గంగాతుల్యము లగు నను ప్రజల నమ్మకము. అందులకు వేదప్రమాణమును గలదు.

"ప్రసన్నుడు రామనాథుడు మున్నగు వారు బాలకులుగ నుండి బడికి పోవుచుండి నప్పుడు నేనును వారి వెంబడి ఎప్పుడైన పోవుచుంటిని. అట్లట్లు ఏదో కొంత నేర్చుకొంటిని".

అప్పుడప్పుడు తన పసిప్రాయమును గూర్చి ఆమెయే సంక్షేపముగ చెప్పు విషయాలే కాక, సమకాలికుల వలన తెలియ నైన సంగతులును కొన్ని కలవు. శ్రీరాజ్మొఖర్జీగారి సోదరి అఘోర్మణీదేవి మాతృశ్రీకి బాల్యసఖి, క్రీడాసఖి. ఆమె ఇట్లు చెప్పినది — "మాతృశ్రీ మిక్కిలి సరళస్వభావ. సారళ్యమే ఆమెలో రూపుదాల్చినది. చిన్ననాటి వేడుకలలోను క్రీడలలోను ఆమె సాధారణముగ ఇంటియొడయడుగనో ఇల్లాలుగనో నటించెడిది. ఆ సందర్భాలలో ఎవరికిని ఆమెతో ఎట్టి వాదులాటయు లేదు. ఆమె తానే బొమ్మలను చేసి వానితో ఆడుకొనుచుండెను. కాళీ లక్ష్మి విగ్రహాలను చేసి వానిని బిల్వదళాలతోను పూలతోను బూజించుట ఆమెకు ఎక్కువ ప్రియము. ఇతర బాలికలలో జగడములు గల్గిన, ఆమె మధ్యవర్తినియై జగడములను సరిపెట్టి సౌహార్దమును మరల నెలకొల్పెడిది. ఒకనాడు జగద్ధాత్రిపూజ జరుగుచున్నప్పుడు హాల్దెపుకూరువాడగు శ్రీ రామహృదయఘోశాలు అట ఉండెను. దేవియెదుట ధ్యాననిమ్నయై యున్న మాతృశ్రీని చూచి, రెప్ప వాల్పక చాలసేపు ఆమెపైనే కన్నుంచి యుండెను. చూడగా చూడగా దేవివిగ్రహమిది మాతృశ్రీశరీర మిది అని గుర్తింప లేని దశకు వచ్చి భయపడి అటునుండి పోయెను". మఱి కొందఱు వృద్ధులు ఇట్లన్నారు— "చిన్ననాటినుండి శారద తెలివికలది, శాంతస్వభావ, సన్మార్గవర్తిని. శ్రద్ధగా పనులు చేసెడిది. పనిని చేయుమని ఆమె నెవరైన కోరవలసిన జరూరే ఉండెడిది కాదు. ఆమె తనంతటనే చాల శ్రద్ధగాను సమయస్ఫూర్తితోను తన పనులను నిర్వర్తించుకొనెడిది".

ధ్యానములో మాతృశ్రీ జగద్ధాత్రిలో లీన అగుట! తలవని తలంపుగా అటు వచ్చిన యొక ప్రేక్షకుడు దానిని జూచి ఆశ్చర్యస్తబ్ధుడగుట! ఈ సంభవము శారదమ్మ నిరుపమానచరిత్రములో తక్కిన అంశములతో సంబంధపడనిది కాదు. మాతృశ్రీ పసిబాలగా ఉన్నప్పుడు ఆమెలో దివ్యత్వము, మానవత్వముతో అద్భుతమేళనముబొంది యుండినది, దివ్యత్వమే మొగ్గగను ఉండినది. ఇందుచే ఆమె బాల్యమునకు వింత గొలుపు ప్రత్యేకత సిద్ధించినది. తర్వాతి దినాలలో ఆమెనుగూర్చి ఎవరు ఏమనుకొన్నను, ఆమెలో సాధారణముగ మానవత్వమే ప్రకట మగుచుండెను. కాని ఏకాలమునుగూర్చి ఇప్పుడు వ్రాయుచున్నామో ఆకాలమున అంతకుముందే. ఏ పైలోకములో నుండియో అవతరించిన ఆమె స్వర్గమర్త్యాల కూడలిలో నిలబడి ఎటు తిరుగుటకును పాలుపోక ఉండినదా అనిపించును. లేక ఆ పసిప్రాయాన దివ్యత్వమే హెచ్చుగ ఆవరించియుండవలసినట్లు దైవనిర్ణయ మేమో! కావున ఆ దినాలనుగూర్చి చెప్పుచు అమ్మ ఇట్లన్నది. "సఖీ, మనసులో పెట్టుకో. నేను పసిపిల్లనుగా ఉండి నప్పుడు నాకు సవయస్కయైన మఱి యొక పసిపిల్ల సదా నావెంబడి నుండెడిది, నా పనిలో నాకు సాయపడెడిది, నాతో ఆడుకొనుచుండెను, వేఱెవరైనను దరిసి నప్పుడు మాత్రము ఆ పిల్ల మఱుగుపడిపోవు చుండెను. నాకు పదిపదునొకం డేండ్ల వయస్సు వచ్చువఱకు

అట్లేజరుగుచుండెను.''* గొడ్లకై గఱిక కోయుటకు ఆమె నీట దిగినప్పుడు సవయస్కయైన ఆ పిల్లయు ఆమెకు తోడ్పడుటకై అగపడెడిది. ఆపిల్ల కోసి పెట్టిన గడ్డికట్ట నొకదానిని మాతృశ్రీ గట్టుపై వేసి వచ్చు నప్పటికి మఱియొక కట్ట సిద్ధముగ ఉండెడిది.

ఆ పసిప్రాయములో అమ్మ ఎంతగా పనులలో వ్యగ్రురాలై ఉండెడిదో మనకు ఈపాటికి తెలిసిపోయినది. వంట మొదలైన గడ్డుపనులకు ఆమె తఱచు పూనుకో వలసి వచ్చెడి దని ఆమె జ్ఞాపికలవలననే తెలియుచున్నది. ఆపె కష్టాలకు ప్రాలుమాలనిదియు, ఈడుకు మించిన బుద్ధిగలదియు ఐనను గాటా పనులకు కావలసినంత సత్తువ ఆమెచేతులకు లేనందున పొయిమీద నుండి పెద్ద పెద్దపాత్రలను దింపుకోవలసి వచ్చినప్పుడు అందుకై ఆమెతండ్రినితోడ్పఱచుకొనెడిది. ఇంటికి కావలసిన నీళ్లను చెరువు నుండి బిందెలలో మోచి తెచ్చుటయు ఆమె పనియే. దీనినే అవకాశముగా గొని ఆమె బిందె సాయమున ఈత నేర్చుకొన్నది

ఆమె పదునొకండవ యేట (1865) పల్లెలలో దారుణక్షామము గలిగినది. ఆమెతండ్రి చేర్చిపెట్టుకొనియుండిన ధాన్య ముండెను. తాను సంపన్ను డెంతమాత్రమును కాక పోయినను, చుట్టుపట్ల ప్రజల దుఃస్థితిని జూచి హృదయము కరగి, తన యొద్ద ఉన్న ధాన్యముతో అతడు ఉచితభోజనశాల నొకదానిని ప్రారంభించెను. మాతృశ్రీయే ఈ వృత్తాంతము నిట్లు చెప్పియున్నది ___ 'ఒకప్పుడు ఎంతటి ఘోర క్షామముగల్గినది! ఆకలిచే మలమలమాడుచు మా యింటికి ఎంతమంది ప్రజలు వచ్చెడివారు! క్రిందటి సంవత్సరము మిగుల్చుకొన్న ధాన్యము మాయొద్ద కొంత ఉండినది. మా నాయన ఆ ధాన్యమును దంపించి బియ్యమును పప్పును కలిపి వేడి కిచ్చుడి తయారు చేయించెను. ''ఇంట అందఱును ఈ కిచ్చుడినే తిన వలెను. ఇంటికి వచ్చిన వారికిని దీనినే వడ్డింప వలసినది. అమ్మాయి శారదకు మాత్రము మేలి రకపు బియ్యమును వేఱుగా వండి పెట్ట వలసినది'' అని మా నాయన ఏర్పాటు చేసినాడు. కొన్ని కొన్ని దినాలలో వచ్చిన మూకకు, మాయింట నున్న చ్చుడి చాలక పోయెడిది. మరల వంట ప్రారంభము చేయ వలసినదే. అతిథులకు ఆకులలో వేడి కిచ్చుడి వడ్డింపగనే, దాని వేడి నార్చుటకై నా చేతులతో నేను విసరుచుంటిని. ఏల యన ఆకలికి నకనకలాడువారు పాపము! జాగు నోర్తురా? ఒకనాడు ఒక పిల్ల వచ్చినది. ఆపె బాగ్ది తెగదో డోము తెగదో! ఆమె కురులకు నూనె లేక బిరుసెక్కియుండెను, కన్నులు వెఱ్ఱిదాని కన్నులవలె కెంపెక్కియుండెను. బియ్యపు పొట్టు నానవేసియున్న పాత్రయొద్దకు పరుగున బోయి ఆమె దానిని నోట గ్రుక్కకొన దొడగెను. 'లోపలికి రా కిచ్చుడి తిను' అని జనులు వేసిన కేకలు ఆమెచెవిని జొరవాయెను. కొంత పొట్టును తిన్న తర్వాతనే ఆమెకు ఆ కేకలు వినబడినవి. అప్పటి కాటకము అంతటిది, అంత దారుణమైనది. అప్పుడు నేర్చుకొన్న గుణపాఠముచేతనే, ప్రజలు పండిన ధాన్యములో కొంత నిలవ యుంచి భద్రపఱుప నారంభించిరి''.

సరళములును సహజములును నిరుపమానములును అగు ఈ మాటలలో అమ్మ భా:

* గురుదేవుని నిర్యాణానంతరము మాతృశ్రీకి ఇట్టి బాలికాదర్శనము మరల గలిగినది. చూ. ప్ర ౧౪.

కాలాన వేలకొలది భక్తుల డెందములలో మాతృపీఠమును నిరాఘాటముగా అధిష్ఠింప నున్న ఆమె! — అల నాటి వృత్తమును చిత్రించినది. ఇందునుండి పనులలో ఆమె శ్రద్ధ మనకు తెలియుచున్నది. ఆకలికి మలమల మాడుచున్న దీనులకు వేడి కిచ్చుడి వడ్డించి దాని వేడి యార్ప తన కోమల హస్తములతో విసరుట! ఇకను ఆ పేద విప్రునకు ఆ గారాము పట్టిపై ఎంత ప్రేమ! పల్లెలోని తక్కిన పిల్లల జీవితమువలెనే ఉండెడిది అమ్మజీవితముకూడ. కాని గ్రామోచిత సరళ సన్నివేశ మధ్యాన అప్పు డప్పుడు దివ్యజ్యోతి తళుక్కు మనెడిది. ఈ వెలుగుచీకట్ల అంతఃక్రీడను, ఆమెను లోక ప్రజ లందఱివలెనె తమ చెల్లి యని బిడ్డ యని డెందములకు హత్తుకొను తమ్ములు కాని తలి దండ్రులు కాని బొత్తుగా గుర్తింప కుండ లేరైరి. మనసున అప్పటి సంభవాలు అవిస్మర ణీయములుగ నున్నందుచేత నేమో మాతృశ్రీ మాత యగు శ్యామసుందరీదేవి అనంతర కాలాన ఒకప్పుడు కూతుతో ''అమ్మా, నా ముద్దుపట్టీ, నిక్కముగ నీ వెవ్వరవో అని నేను కుతూహలిత నగుచున్నాను. ని న్నెట్లు నేను గుర్తింతు నమ్మా!'' అనెను. మాతృశ్రీ ఈ పొగడ్తల నిచ్చగింపలే దనుట స్పష్టము. ఆమె ''ఎవరను నేను? ఎవరనుగా ఉండ గలను? నా కేమి నాలుగు చేతు లున్నవా? ఉన్న, నేను మీయొద్ద కేల రావలెను?'' అని చెప్పి పంపివేసెడిది. సోదరిగా శారద ఎట్లు ప్రవర్తిం చెడిదో, ఒకనాడు అమ్మతో ఆమెకు జరిగిన సంవాదముచే తెలియ నగుచున్నది. 'అమ్మా శారదా, మఱుజన్మమునగూడ నాకు నీవంటి కూతురు కావలె నమ్మా' అన్నది శ్యామ సుందరీదేవి. కోపించినదియుం బోలె శారద ''నన్ను మరల క్రిందికి ఈడ్తువు. నీ పిల్లలను చూచుకొనుటకు నేను మరల దిగిరావలె నన్న మాట!'' అన్నది. నెమ్మదితోను శ్రద్ధతోను ప్రీతితోను తన కూతురు పనులు చేయుచుండిన రీతి విస్మరింపరానిదిగ నున్నందున శ్యామ సుందరీదేవి మాటిమాటికి ''అమ్మా, నాకు నీవే మరల కావలె నమ్మా'' అనుచుండెడిది. కాళీమామయు ఒకసారి ఈ పొగడనె ఊనుచు ఇట్లనెను: ''మా చెల్లి సాక్షాల్లక్ష్మియే. మమ్ము అంత కష్టపడి ఆమె కాపాడినది! వడ్లుదంచుట, నూలువడకుట, పశువులకు మేత వెట్టుట, వంటవండుట . ఇంతేల, ఇంటి పను లను ఇంచుమించు పూర్తిగనే మా చెల్లి ఒంట రిగా నిర్వహించెడిది.

''వరిపొలమున బాలుడు తన తండ్రిచేతిని ఊతగా తాను పట్టుకొని, సన్నని దూలముపై నడచుచున్నప్పుడు, క్షణము మెలకువ తప్పి నను ఆ పట్టు సడల వచ్చును, బాలుడు అగడ్తలో పడ వచ్చును. తండ్రియే కుమారుని చెయి పట్టుకొను నేని, అప్పుడు అట్లు కానే కాదు, పిల్లవాడు అగడ్తలో పడనే పడడు''.

శ్రీరామకృష్ణుడు



ఓం శ్రీం శ్రియైనమః

శ్రీ రంగాచార్యగురవేనమః

# హరివాసరవ్రతమాహాత్మ్యము

## శ్రీ కిళాంబి రంగాచార్యులుగారు

### "ఉత్పత్తి" ర్నామ కార్తీక బహుళైకాదశి :

శ్రీకృష్ణార్జునసంవాదరూపమైన "ఉత్పత్తి" యనెడి యేకాదశీ మాహాత్మ్యమును వినినవారలు ఇహలోకమున సర్వవిధభోగముల ననుభవించి అంతమున విష్ణులోకము నొందుదురు. రాత్రి ఉపవాసముండుటయు ఒకపూట మాత్రమే భోజనముచేయుటయు వలన పుణ్యమేమి? అట్టి విధానమును చెపుమా యని అర్జునుడు ప్రార్థింప శ్రీకృష్ణభగవాను డీ రీతిని చెప్పుచున్నారు.

దశమిరోజున ఏకభుక్తముజేసి రాత్రి ఉపవాసముండి ఏకాదశి దినమున నదీ తటాకములందో బావియందో ——

"అశ్వక్రాంతే రథక్రాంతే
 విష్ణుక్రాంతే వసుంధరే।
మృత్తికే హనమే పాపం
 యన్మయా పూర్వసంచితమ్
త్వయా హతేన పాపేన
 గచ్ఛామి పరమాం గతిమ్॥"

అను మంత్రము నుచ్చరించుచు వ్రతియైనవాడు మృత్తికాస్నానమాచరింపవలయును. నదియందు స్నానము ఉత్తమము. తటాకము మధ్యమము, బావి అధమము. భాండస్నానము అధమాధమము. పతితులు, చోరులు, పాషండులు, మిథ్యావాదులు, దేవవేదబ్రాహ్మణనిందకులు, అగమ్యాగమనులు, ఇతర దురాచారపరులు, పరద్రవ్యాపహారులు, దేవద్రవ్యాపహారులు—వీరలతో సంభాషణ వర్జింపవలయును. అట్టివారలను చూచినచో సూర్యుని చూడవలయును. అంత గోవిందుని భక్త్యాదరములతో నర్చించి నైవేద్యమిడి గృహమందు దీపము నిడవలయును. ఈ దినమున నిద్రమైథునము, నృత్యగీతాదివినోదములను విసర్జించి దివారాత్రములు నియమముతో గడపవలయును. భక్తితో గూడిన మనసు గలవాడై దివారాత్రములు జాగరణముజేసి విప్రులకు దక్షిణాదులు సమర్పించి నమ్రతతో దండమిడి క్షమాపణము వేడవలయును. ఈ ప్రకారమే శుక్లపక్షమందు కృష్ణపక్షమందు వచ్చు రెండు ఏకాదశులును సమానపూజనీయములు. రెంటియందు భేదబుద్ధి ఉండరాదు. శంఖోద్ధారమందు స్నానముజేసి దైవమైన గదాధరుని దర్శించుటవలన గలుగు పుణ్యఫలము ఏకాదశ్యుపవాసఫలములో పదునారవవంతుకు సహితము సమానము కానేరదు. వ్యతీపాతసమయమున చేయు దానముల సంఖ్య లక్షతోను,

సంక్రాంతియందు చేయు దానములు నాలుగు లక్షలతోను, చంద్రసూర్యగ్రహణముల సమయమందు కురుక్షేత్రమందు గల పుణ్యమును— వీని యావత్తు పుణ్యమును ఏకాదశ్యుపవాసమువలన లభించును. అశ్వమేధయాగము చేయుటచే గలుగు ఫలమునకు నూరింతలు పుణ్యమును, ఒకని యింటియందు ప్రతినిత్యము లక్షమంది తపస్సంపన్నులు అరువదివేల సంవత్సరముల పర్యంతము భోజనము చేయుటచే గలుగు పుణ్యము ఏకాదశ్యుపవాసముచేయు మానవునకు గలుగును. వేదాంగపారగులకు జేసిన సహస్రగోదానఫలమునకు పదిరెట్లధిక పుణ్యము ఏకాదశ్యుపవాసము జేయువానికి లభించును. ఎవనియింట నిత్యమును పదిమంది బ్రాహ్మణులు భుజింతురో అందువలన గలుగు పుణ్యమునకు బదింతల పుణ్యము బ్రహ్మచారికి భోజన మిడిన పుణ్యముతో సమానము. అట్టి సహస్ర బ్రహ్మచారి భోజనమువలన గలుగు పుణ్యము భూదానముతోను కన్యాదానముతోను సమానము. ఇందుకు పదిరెట్ల పుణ్యము విద్యాదానమువలన గలుగును. విద్యాదానము కంటెను పదిరెట్లు ఆకలిగొన్నవానికి అన్నదానము చేయుటవలన గలుగును. అన్నదానముతో సమానమైన దానము యిదివరకెన్నడును లేదు. ఇకముందును గలుగబోదు. ఇందుచే పితృదేవతలు తృప్తినొంది స్వర్గమునకు బోదురు, ఏకాదశీవ్రతమువలన గలుగు పుణ్యముయొక్క సంఖ్య యింత యని తెలియలేము. ఈ వ్రతప్రభావము దేవతలకు సహితము దుర్లభము. దశమి దినమున ఏకభుక్తమును హరి దినమందు ఉపవాసమును గల ఈ వ్రతముతో దాననియమాదులు, మహాయజ్ఞములు సరిరావు. కాబట్టి సంసారభయము గలవారలు అవశ్యము ఏకాదశ్యుపవాసముండవలెను. ఇది వ్రతములలోకెల్ల ఉత్తమమైన వ్రతము. సహస్ర యజ్ఞములు చేసిన ఫలము కూడ ఇందుతో సమానము కానేరదు.

తిథులలోకెల్ల ఏకాదశీతిథి యెక్కువ పవిత్రమగుటకు కారణ మెద్ది యని అర్జునుడు ప్రశ్నింపగా శ్రీకృష్ణపరమాత్మ యీ ప్రకారము జెప్ప నారంభించెను.

పూర్వము కృతయుగమందు ''మురు'' డను దానవుడు అత్యద్భుతమైన పరాక్రమము గలిగి మహారౌద్రుడును సర్వదేవభయంకరుడునై ఇంద్రుని జయించి దేవతలనందర పదభ్రష్టుల జేయగా పురందరుడు ఈశ్వరునొద్దకేగి తన స్వర్గభ్రంశమును జెప్పి ఉపాయమును గోరగా పరిత్రాణపరాయణుడైన జగన్నాథుని సన్నిధికిం బోయి శరణువేడుమని శంభు డుపాయము జెప్ప ఇంద్రుడు దేవతలతో కలిసి జలమధ్యమందు నిదురించుచున్న జగత్పతిని జూచి కృతాంజలిపుటుడై బహువిధముల స్తోత్రము జేసి స్థానభ్రష్టులైన తమ్మును రక్షింపవలెనని శరణు వేడగా నా రాక్షసు డెవడు? ఎట్టివాడు? అతని స్థాన మెద్ది? యని భగవానుడు ప్రశ్నింప— పూర్వము బ్రహ్మవంశోద్భూతుడైన నాడీజంఘుడను దైత్యుని కుమారుడైన ''మురు'' డనువాడు చంద్రవతి యను నగరమున నివసించుచు తన వీర్యముచే విశ్వమునంతయు జయించి దేవతల నందరను త్రివిష్టపమునుండి తరుమగొట్టి ఇంద్రాగ్నివాయ్వాకాశసోమనిర్ఋతి పదవుల తానే అధిష్ఠించి తానే సూర్యుడై తపింపజేయుచు తానే పర్జన్యుడై అందర దేవతలకు అజేయుడైయున్న యా మహాసురుని వధించి దేవతలకు జయమును గలిగింపుమా

యని దేవేంద్రుడు ప్రార్థింపగా శ్రీభగవానుడు అటులనే వధించెదనని అభయమిచ్చి యుద్ధసన్నద్ధుడై దేవతలందరితో చంద్రవతీనగరమునకు విచ్చేసెను. దానవు లనేకులు వివిధాయుధపాణులై యుద్ధము జేయగా దేవతలందరు శక్తి లేనివారలై పారిపోయిరి. అంతట హృషీకేశుండు ఆశీవిషోపములైన శరములచే దానవులందర సంహరింప మురుడు ఏకాంగియై నిలువబడి తిరిగి తిరిగి యుద్ధము జేయదొడగెను. శంఖచక్రగదాధరుడు ప్రయోగించిన ఆయుధములన్నియు వాని తేజమును గోల్పోయి పుష్పములతో సమానములై జయింప శక్యముకాకపోగా బాహుయుద్ధమును సహస్రదివ్యవర్షములు సలిపి భగవాను డలసట నొందినవాడై బదరికాశ్రమముజేరి అట ''హైమవతి'' యను నామముగల శుభప్రదమైన గుహను ప్రవేశించి అట శ్రమనివారణార్థము నిదురించెను. అంత మురుడును వెంటనంటి గుహను ప్రవేశించి పరుండి నిదురించుచున్న భగవానునిజూచి దానవక్షయకారకుడైన హరిని వధించెదనని నిశ్చయబుద్ధిగలవాడైయుండ నంతలో గరుడధ్వజుని శరీరమునుండి గొప్ప తేజోవంతురాలైన యొక కన్యక యుద్భవించి దివ్యాయుధముల ధరించి యుద్ధసన్నద్ధురాలాయెను. దుష్టబుద్ధిగల యా దానవు డా రౌద్రరూపమును ధరించినట్టియు అత్యుగ్రాశనిపాతినియునైన యామె యెవరిచే నిర్మితయైనదని విస్మయమును బొందుచు నా కన్యకతో యుద్ధము జేయుచుండెను. అంత నా మహాదేవి విజృంభించి దానవుని సర్వశస్త్రములను ఛేదించి క్షణములో విరథుని గావించి బాహుయుద్ధమునకు మీదకు దుముకుచున్నవానిని తలప్రహారముచే క్రింద బడగొట్టెను. భూమినుండి లేచి కన్యకావధకాంక్షతో పరుగెత్తుకువచ్చుచున్న దానవుని రోషముతో నామె వానిశిరమును త్రుంప, ప్రకాశించుచున్న తచ్ఛిరము భూమిపైబడి ఆ దైత్యుడు వైవస్వతాలయమున కేగెను. మిగిలిన రాక్షససైనికులు దీనులై భయముతో పారిపోయి పాతాళలోకమందు దాగిరి.

అంత భగవానుడు లేచి అసురసంహారమును దనయెదుట నమ్రతతో చేతులు జోడించుకొని నిలుచున్న కన్యకను విస్మయముతో జూచి—దుష్టదానవు డెవరిచే వధింపబడెను. దేవగంధర్వాది లోకేశులకు అజేయుడును తాను సహితము జయింపబడుదునను భీతిచే నలసట నొంది యీ గుహయందు నిదురించుచుండగా ఎవరి కారుణ్యప్రభావముచే పారిపోయిన తాను రక్షింపబడితిననియు భగవానుడు ప్రశ్నింప—''ఓ ప్రభూ, నీ అంశచే నేను ఉద్భవించి నీవు నిదురించుటయు త్రిలోకకంటకుడైన దైత్యుడు నిన్ను చంప నుద్దేశించుటయు జూచి వానిని నేను వధించి దేవతలు నిర్భయులగునటుల జేసితిని. నేను సర్వశత్రుభయంకరియైన నీయొక్క మహాశక్తిని. త్రైలోక్యరక్షణార్థము లోకభయంకరుడైనవాడు వధింపబడెను. దానవవధజూచి యెందులకంతాశ్చర్యమో చెప్పుమా ప్రభూ!'' అని కన్య నుడివెను. ''నీ యీ కార్యముచే దేవతలందరు సంతసించి కుశలమునొంది ఆనందించుచున్నారు. నేను ప్రసన్నుడనైతిని. నీవు వరమును కోరుకొమ్ము'' అని భగవానుడు పలుక—''ఉపవాసపరుడైన మానవుని మహాపాపములను పోగొట్టుటకును నా యొక్క దినమునందు జితేంద్రియుడై భక్తితో వ్రతమాచరించినవాడు వైష్ణవస్థానమునొంది నూరుకోట్ల కల్పములు వివిధభోగముల ననుభవించుటకును రాత్రి ఉప

వాసము ఏకభుక్తము ఎవరు పాటింతురో వారికి మోక్షమిచ్చునటుల వరమిమ్ము'' అని కన్యక కోరెను.

అంత భగవానుడు ''లోకములో నాయొక్క భక్తులును నీయొక్క భక్తులును త్రిలోకము లందు విఖ్యాతులై నా సన్నిధిని పొందుదురు. ఏకాదశీదినమందు నా పరాశక్తి ఉద్భవించుటచే ''ఏకాదశి'' యని నీ పేరు కాగలదు. సమస్త పాపములను దగ్ధముజేసి అవ్యయమైన నా స్థానము నిచ్చెదను. తదియ, అష్టమి, నవమి, చతుర్దశి, విశేషముగా ఏకాదశి — యీ తిథు లన్నియు నాకు మహాప్రియములు. సర్వతీర్థముల పుణ్యము, సర్వదానముల ఫలము, సర్వవ్రత ఫలముకంటెను ఏకాదశీవ్రతఫలము అధికమైన దని సత్యముగా ముమ్మాటికిని చెప్పుచున్నాను'' అని వరమిచ్చి అంతర్ధానము నొందెను.

ఆ ప్రకారముగా ఉద్భవించిన ఏకాదశీతిథి తృప్తినొంది సంతోషించినదాయెను. ఏకాదశీ తిథి చేయు నరునియొక్క శత్రువులనందరిని వధించి పరమగతిని ఇచ్చెదను. ఏకాదశీ మహావ్రతముచేయువారికి వారి విఘ్నములనెల్ల బోగొట్టి సర్వసిద్ధుల నొసంగెదను. ఏకాదశి యొక్క ఉత్పత్తి ఇయ్యది. ఈ యేకాదశి సర్వ పాపక్షయంకరి. ఇది యొక్కటియే మహాపుణ్య మైనది. సర్వపాపనిషూదని. సమస్తలోకము లకు పుట్టిన సిద్ధిని కలిగించు తిథియై యున్నది. విష్ణుభక్తిపరాయణులైన మానవులు లోక ములో ధన్యులు. ఏకాదశీమాహాత్మ్యమును ఎవరు సర్వకాలములందును పఠింతురో వారికి నిస్సంశయముగా అశ్వమేధయాగము జేసిన పుణ్యము లభించును. విష్ణుపరాయణులయొక్కయు వారి భక్తులయొక్కయు ముఖమునుండి వెలువడిన మంగళప్రదమైన విష్ణుకథల నెవరు దివారాత్రములు వినుదురో వారు కోటికులముల పర్యంతము విష్ణులోకము నొందుదురు. ఏకాదశీ మాహాత్మ్యము ఒకపాదమైననువినినచో నిస్సం శయముగ బ్రహ్మహత్యాదిపాపము నశించును. గీతార్థముతో సమానమైన విష్ణుధర్మము మరొండు లేదు. ఏకాదశీవ్రతముతో సమమైన మరొండు సనాతన వ్రతము లేదు — అని శ్రీకృష్ణభగవానుడు అర్జునునకు బోధించెను.



''గృహస్థు సంగరహితుడై అరులకు దానము చేయు నేని, అది అతడు తనకే చేసికొను ఉపకార మగునే కాని ఇతరులకు చేయు ఉపకారము కాదు. అతడు చేయు సేవల నందుకొను నది సకలప్రాణులలోను అంతర్యామిగ ఉన్న భగవంతుడే. భగవంతు నారాధించుటచే ఆరాధకుడు నిజముగ తనకే ఉపకరించుకొనుచున్నాడు గాని ఇతరులకు కాదు. మానవులకే కాక సకలప్రాణులకును సేవచేయుట ద్వారా దేవుని సేవింప వలెను. పేరుప్రతిష్ఠలను గాని, దేహపాతానంతరము స్వర్గసౌఖ్యమును గాని ఆపేక్షింప రాదు. సేవచేయునాతడు సేవ నందు కొను వారి యొద్ద నుండి యెట్టి ప్రతిఫలమును కోరకూడదు. ఇట్టి చిత్తముతో చేయు సేవయే నిజముగ నిస్సంగకర్మానుష్ఠాన మనిపించుకొనును. దీనికి కర్మయోగ మని పేరు''.

—శ్రీరామకృష్ణుడు



# వార్తలు, విశేషాలు

## శ్రీ కృష్ణజయంతి

మదరాసు మైలాపూరు శ్రీరామకృష్ణ మఠంలో 1957–వ సంవత్సరం ఆగస్టు తే 18 ది నాడు శ్రీకృష్ణజన్మోత్సవము పూజా భజనభాగవతపారాయణగోష్ఠులతో కొనియాడబడింది. ఆగస్టు తే 25 ది ఆదివారంనాటి బహిరంగ సభలో శ్రీ G. కృష్ణమూర్తి అయ్యరు B.A.,B.L. గారు ఆంగ్లములోను, శ్రీ R. S. దేశికర్ M. A. గారు తమిళంలోను శ్రీ కృష్ణావతార విశేషాలను గూర్చి ఉపన్యసించారు.

## శ్రీరామకృష్ణ మిషనువారు వేదారణ్యంలో నిర్మించిన 'హరిజనుల వలసవిడిది'లో క్రొత్తిండ్ల ఆవిష్కరణం

వేదారణ్యంలో 1955 తుపానువఱదల ప్రళయంలో తమ సర్వస్వాన్ని కోలుపోయిన హరిజనులకై శ్రీరామకృష్ణ మిషనువారు నిర్మింపబూనుకొన్న యిన్నూటిండ్ల వలసవిడిదిలో నూటయిరవైయెనిమిదిండ్ల 'చాలు'ను ఏడు నెలల క్రితం మదరాసు గవర్నరుగారు ఆవిష్కరించారు. మిగిలిన డెబ్బైరెండిండ్ల 'చాలు'ను సెప్టెంబరు తే 8 ది నాడు మదరాసు మంత్రిశేఖరులు పూజ్య శ్రీ M. భక్తవత్సలముగారు ఆవిష్కరించారు.

వలసవిడిది చుట్టును కాననపరిసరాలు. ఈ విడిది నిర్మాణానికి మూడులక్షలకు పైనే ఖర్చైంది. కావలసినవన్నీ అందులోనే ఉన్నందున, ఏప్రయోజనానికైతే నేమి ఇది ఇంకొకచోటుపై ఆధారపడ నక్కఱలేదు. ప్రాథమిక పాఠశాల ఉంది. గ్రంథాలయం ఉంది. ప్రార్థన మందిరం ఉంది. శ్రీరామకృష్ణదేవునిగుడి ఉంది. పిల్లల తోట ఉంది. వడ్లదంపకానికి ప్రతి ఏకడాసికి చోట్లున్నాయి. తొమ్మిది బావులున్నాయి. 42 కక్కసులున్నాయి. తేనెటీగల వర్ధనసహకారసమితి ఒకటి ప్రారంభింపబడింది.

శ్రీచిద్భవానందస్వాములు సభాధ్యక్ష్యం వహించారు. శ్రీమన్త్రైకలాసానందస్వాములు సదస్యులకు స్వాగతాశీస్సు అనుగ్రహించారు. మదరాసు రామకృష్ణమిషను మేనేజరులైన శ్రీ శుద్ధసత్వానందస్వాములు తంజావూరు రామనాథపురమండలాలలో మిషనువారు కావించిన సాహాయ్య కార్యక్రమాన్ని వివరించే నివేదిక చదివారు. సంవత్సరంగా ప్రార్థిస్తున్నా వలసవిడిదిలోని పాఠశాలకు సర్కారువారు (రెకాగ్నిషను) అనుమోదనాభ్యనుజ్ఞను ఇంకను ఇవ్వలేదని; వలసవిడిది నిర్మాణానికి 3,08,000 రూపాయలు ఖర్చైందని; అందు మిషనువారు సొంతంగా అచ్చుకొన్నది 1,25,000 రూపాయలని; వేదారణ్యంనుండి ఈ విడిదికి మంచి రస్తా వేయబడిందని — నివేదికలోని విశేషాలు. మంత్రిగారు రామకృష్ణ మిషనువారి నిస్స్వార్థసేవను కొనియాడి, విడిదివాసులను అచ్చటి వసతులన్నిటిని సద్వినియోగపఱచుకొంటూ మంచి జీవితం గడపండని ఆదేశించారు. తుపాను పీడితులకు ఇంకను ఇండ్లను కట్టించి ఇవ్వాలనే సర్కారువారి ప్రణాళికలు ఉన్న వన్నారు.

కలెక్టరు శ్రీ వి. కార్తికేయనుగారు, జిల్లా మాజిస్ట్రేటు కె. రాజగోపాలనుగారు, సబ్ కలెక్టరు ఎస్. గుహను గారు, తంజావూరుజిల్లా పోలీసు సూపరింటెండెంటు ఎల్. ఆర్. అడిజి గారు, డిప్టీసూపరింటెండెంటు గారైన రాజగోపాలయ్యంగారు, సూపరింటెండింగు ఇంజనీరు శ్రీ నారాయణరావుగారు, ఎక్సిక్యూటివు ఇంజనీరు వి. ఆర్. సుబ్రహ్మణ్యముగారు, జిల్లాబోర్డు ఉపాధ్యక్షులు పి. వెంకాటాచల తేవారుగారు మొదలైన ప్రముఖులందరు సభకు హాజరయ్యారు.

# గ్రంథసమీక్ష

## హరిజనజ్యోతి - భక్తనందనారు

బుఱ్ఱకథ

రచయిత: శ్రీ కేశవతీర్థస్వామి, ప్రాప్తిస్థానము శ్రీరామతీర్థ సేవాశ్రమము, పిడుగురాల పోస్టు, గుంటూరు జిల్లా, పుటలు 29, వెల అర్థరూపాయి.

ద్రావిడదేశ శైవభక్తులలో నందనారు అగ్రగణ్యుడు. భక్తి ప్రచారమునకు ఎంతేని ఆవశ్యకత గల యీ దినాలలో అట్టి భక్తవతంసుల చరిత్రలే అందులకు అవలంబాలు. విషయ వైలక్షణ్యమునుగూర్చి యింతకంటె చెప్పుటకు మనము సమర్థులముకాము. ఏలయన భక్తి మహిమ భగవన్మహిమనుమించినది. ఇకవిషయ వైలక్షణ్యమునకు దీటువచ్చు వక్తృవైలక్షణ్యమును ఉన్నది ఇట. శ్రీ కేశవతీర్థస్వామిగారి వాణి లాలిత్యపరాకాష్ఠ. స్వానుభూతియందలి భక్తియే నందభక్తి చిత్రణముగ వెలువడినందున ఇందు ప్రతి పట్టును ప్రతిగీటును సహృదయ హృదయ ద్రవీకరణ సమర్థముగనున్నది. వారికిని వారి ఫణితికిని మాజోహారులు.

## శ్రీ నృసింహోపాసనము

రచయిత శ్రీ కేశవతీర్థస్వామి, ప్రాప్తిస్థానము శ్రీరామతీర్థసేవాశ్రమము, పిడుగురాల పోస్టు, గుంటూరు జిల్లా, పుటలు 73. వెల: పావలా.

భక్తిరసగుళిక యనదగిన యీ శతకము, సౌందర్యలహరి, శ్రీకృష్ణకర్ణామృతము, మొదలగువాని కోవకు జేరినది. ఇందు శ్రీ కేశవతీర్థస్వాముల శ్రీనృసింహస్తుతిపరమైన దివ్యవాణి అద్వైతామృతవర్షిణియగుచు వృత్తవృత్తమునను పరమనిర్వృతి నొనగూర్చుచున్నది.

## జపయోగము

శ్రీ స్వామి శివానందకృతి, శ్రీ దిగవల్లి శేషగిరిరావుగారి తెలిగింపు, ప్రాప్తిస్థానము: ఆధ్యాత్మిక గ్రంథమండలి, బక్కింగ్హాంపేట, విజయవాడ-2, పుటలు: 120, వెల: ఒక రూపాయి.

జపస్వరూప తద్భేద తద్విధాన జిజ్ఞాసువులకు మిక్కిలిగ ఉపయోగపడు గ్రంథ మిది.

## మహాప్రస్థానము

(బడ రహస్యము)

ఇది విమలానంద విజ్ఞాన విలాసానుబంధములలో పంచమసంపుటి, శ్రీ విమలానందభారతీ ప్రియశిష్యప్రణీతము. "సి. హెచ్. కృష్ణమూర్తి గారు, బి. ఏ., బి. ఇడి., 16/71, సత్యనారాయణపురము, గుడివాడ, కృష్ణాజిల్లా" అను చిరునామాకు మూడణాల పోస్టుబిళ్లలు పంపిన జాలును. బుక్పోస్టుద్వారా 200 పేజీల యీ పుస్తకమును ఉచితముగా బడయవచ్చును. ఇందు 'క్షేత్ర' 'తీర్థ' 'దేవత' 'తత్త్వ' 'మోక్ష' నామకప్రకరణము లైదును బహు విషయగర్భములు. ఆఱవ యేడవ ప్రకరణాలుగా పొందుపఱుపబడిన గూఢార్థదీపికయు అక్షరసాంఖ్యశాస్త్రసారసంగ్రహమును ఈ గ్రంథపు విలువను హెచ్చించుచున్నవి.

## ప్రేమసమాజం

ఇది నెల్లూరులో హేవిళంబి చైత్రమునుండి ప్రచురింపబడుచున్న యొక మాస పత్రిక. విఖ్యాతలోకసేవాధురంధరులయిన శ్రీ అప్పల ఆంజనేయులుగారు దీనికి నిర్వాహకులు, సంపాదకులు. 'పాషాణహృదయాలను ప్రేమపూరితాలుగా చేయుట, మానవునిలోని దానవత్వమును ఆర్పివేసి దేవత్వమును వెలుగొంద జేయుట, సర్వోదయసిద్ధాంతప్రచారము' — ఇవి ఈ పత్రికకు లక్ష్యాలు. సాలు చందా రెండు రూపాయలు, ఆరు నెలలకు చందా రూపాయి పండ్రెండు నయాపైసలు, విడిసంచిక 19 నయాపైసలు. ప్రాప్తిస్థానము - 11/203, ప్రకాశ్ భవన్, ఆంజనేయస్వామివీధి, సంతపేట, నెల్లూరు.

ప్రభాకర్.



## మతాచార్యకము

మతాచార్యకమా? అవినయము గల మానవునకే మతాచార్యకముపై మనస్సు పోవును. మానవుడు అకించనుడు. ఆచార్యకము దేవుని పని. చంద్రసూర్యులను లోకములోని వెలుగును సృజించిన దేవుడే ఆచార్యకము చేయును. మతాచార్యకము అంత చులకన అయిన పనియా? దేవుడు నీకు ప్రత్యక్షమై మతాచార్యకము నిర్వహింపు మని నిన్ను నియోగింపనిదే నీవు ఆ పనిని చేయ లేవు. మతాచార్యకమును చేయనీయక ఎవరును నిన్ను ఆప లేరనుటయు సరియే. భగవన్నియమనము నేమో ఇంకను నీవు పొంద లేదు. కాని గొంతు రాచుకొనునట్లు అఱచుచున్నావు. ప్రజలు రెన్నాళ్లపాటు నీ మాటలను విందురు. తరువాత వాని నన్నిటిని మఱచి పోదురు. తాత్కాలికోద్రేకము లన్నింటివంటిదే అదియు. నీవు మాటాడుచున్నంత సేపును ప్రజలు 'భళి, బాగున్నది' అనుచుందురు. నీ ప్రసంగము ఆగిన క్షణముననే అంతయు మాయమగును. దేవుడు నీకగపడి ఆజ్ఞ అందజేయునేని అప్పుడు నీవు ప్రజల కాచార్యుడవు కావచ్చును. లేకున్న నీ మాటల నెవరు విందురు?

—శ్రీ రామకృష్ణుడు



# శ్రీ రామకృష్ణ లీలామృతము

(లేక శ్రీరామకృష్ణ జీవిత చరిత్ర)

**అనువాదకులు :**

కీ. శే. వెదురుమూడి కృష్ణరావుపంతులుగారు, బి. ఏ; శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు, బి. ఏ.

ప్రశస్తమైన వస్తువు, అకలంకమైన జీవితము, లోకోత్తరమైన సందేశము. దేహమును పులకరింపజేయు ఆధ్యాత్మికానుభవములు—శైలి సరళము, మధురము. భాష నిర్దుష్టము.—సర్వవిధముల నమూల్యమైన గ్రంథరాజము.

—శ్రీ పా. వే. రాజమన్నారుగారు, గౌ॥ ప్రధాన న్యాయమూర్తి, మద్రాసు.

* * * ఈ గ్రంథము విషయానురూపమై సుబోధమైన శైలిలో రచింపబడినదనుటకు ఎట్టి సందియమును లేదు. * * *

—శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారు.

* * * ఆధునిక కాలములో వెలువడిన కొలది మహాగ్రంథములలో, అన్నివిధముల నిది యొకటి. * * *

—శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు.

496 పుటలు (ద్వితీయ ముద్రణము) వెల : రూ. 5/-

---

# శ్రీ వివేకానంద జీవితచరిత్ర

(శ్రీ చిరంతనానందస్వామి ప్రణీతము)

ఇందు శ్రీ స్వాములవారి జీవితమున నింతకు పూర్వము గ్రంథస్థములుగాని ముఖ్య సంఘటన లెన్నియో శ్రీవారి సోదరశిష్యులవలన విని వ్రాయబడినవి. ఇది శ్రీ స్వాములవారి సంపూర్ణ చరిత్ర!

నిర్దుష్టమైన భాష, అందమైన అచ్చు, ఆకర్షకమైన రూపము.

438 పుటలు (సప్తమ ముద్రణము) వెల : { సాదా ప్రతి రూ. 3/-<br>అట్ట బైండు రూ. 3-50

---

# శ్రీ శారదాదేవి చరిత్ర

(మూడవ కూర్పు)

రచయిత : శ్రీ చిరంతనానందస్వామి

ప్రతి స్త్రీయును పురుషుడును...చదువవలసిన గ్రంథ మిది...అమృతకలశము!...అనన్యసామాన్య నీతిమంజరి...తియ్యని తెలుగు...పాలవంటి శైలి... —ఆంధ్రప్రభ

246 పుటలు వెల : రూ. 2/-

---

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# దేవీ మాహాత్మ్యము

(శ్రీ దుర్గాసప్తశతి)

అనువాదకులు: శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

ఇందు మూలశ్లోకములు, వానికి ధారాళమయిన ఆంధ్రానువాదమును పొందుపఱుప బడియున్నవి. అందందు ముఖ్యములును నిగూఢములును అగు శబ్దములకు పాదదీపికలందు వివరణములు చేర్పబడియున్నవి. దేవీనవరాత్రములందును, ఇతర పవిత్రావసరములందును నిత్యపారాయణ మొనర్పవలసిన ఉత్తమగ్రంథము. ఈ గ్రంథప్రాశస్త్యము పూర్తిగా వివరించు పీఠికయు చేర్పబడియున్నది.

(170 + 16) పుటలు ప్రజ్వలమగు ప్రథమ ముద్రణము వెల : రూ. 2/-

# శ్రీ వివేకానంద లేఖావళి

(రెండు భాగములు)

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

భారతదేశమున ఇంటింటను ఉండవలసిన పుస్తకములలో నిది యొకటి; బాలికా బాలకు లెల్లరును శ్రద్ధతో పదేపదే చదువవలసిన పుస్తకములలో నిది యొకటి.

ఈ లేఖలయందు దైవభక్తి, మానవభక్తి, కార్యాసక్తి—ఇవి నిరంతరసంయోగము దాల్చి జీవితాంధకారమును దొలగింపజేయు జ్యోతిగ నుండుట స్పష్టము.

-కట్టమంచి రామలింగారెడ్డి

మొదటి భాగము : 256 పుటలు
రెండవ భాగము : 226 పుటలు

ఒక్కొక్క భాగము వెల: రూ. 1-50

అడ్రెసు : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౪    ౧౯౫౭, అక్టోబరు; హేవిళంబి – ఆ    సంచిక ౪

## విషయసూచిక


| | | |
|---|---|---|
| శ్రీ మీనాక్షీ పఞ్చ రత్న స్తోత్రమ్—శ్రీమచ్ఛంకర భగవత్పాదులు | ... | ౧౧౩ |
| మాతృలీలాలహరి—[సంపాదకీయము] | ... | ౧౧౬ |
| దుర్గాపూజ—శ్రీ గురుభక్త పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు | ... | ౧౨౫ |
| దేవీపూజ—శ్రీ వస్తాదు వేంకటస్వామిగారు | ... | ౧౨౬ |
| భ్రమయా? ప్రేమయా?—[శ్రీ పరమాత్మానందస్వామి] | ... | ౧౨౮ |
| బ్రహ్మానందస్వామి—శ్రీ సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు | ... | ౧౩౪ |
| వేదారణ్యములో రామకృష్ణమిషన్ వారి సేవ—శ్రీ సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు | ... | ౧౩౮ |
| వార్తలు, విశేషాలు | ... | ౧౪౦ |
| గ్రంథసమీక్ష | ... | ౧౪౩ |




'సర్వేశ్వరుని శరణు జొరుము, అతని కృప నీ యనుభవమునకు అప్పుడు వచ్చును.

-శ్రీ శారదామణి.



# శ్రీరామకృష్ణ ప్రభ



సంపుటము ౧౪ } ౧౯౫౭ – అక్టోబరు : : హేవిళంబి – ఆశ్వయుజము { సంచిక

శ్రీః

## శ్రీ మీనాక్షీ పఞ్చ రత్న స్తోత్రమ్

### శ్రీమ చ్ఛంకర భగవత్పాదులు

ఉద్యద్ భాను సహస్ర కోటి సదృశాం, కేయూర హా రోజ్జ్వలాం,
బి మ్బోష్ఠీం, సిత ద న్త పఙ్క్తి రుచిరాం, పీ తామ్బ రాలఙ్కృతామ్।
విష్ణు బ్రహ్మ సు రేన్ద్ర సేవిత పదాం, త త్త్వస్వరూపాం, శివాం,
మీనాక్షీం - ప్రణతో ఒస్మి స న్తత మహం, కారుణ్యవారాంనిధిమ్ ॥ ౧

టీ॥ అహం = నేను, మీనాక్షీం = మీనాక్షమ్మనుగూర్చి, స న్తతం = సదా, ప్రణతః అస్మి = ప్రణమిల్లినవాడ నగు చున్నాను, మ్రొక్కుచున్నా ననుట. ఆ తల్లి ఎట్లు ఉన్న దనగా, (1) ఉద్యద్ = ఉదయించుచున్న, భానుసహస్రకోటి = వేయికోట్ల సూర్యులను, సదృశాం = పోలి(వెలుంగు)నది; (2) కేయూరహార + ఉజ్జ్వలాం = బాహుపురులతోను హారములతోను ప్రకాశించునది; (3) బిమ్బ + ఓష్ఠీం = దొండపండు(నుబోరయు)కెమ్మోవిగలది; (4) సిత = ధవళము లైన, ద న్త పఙ్క్తి = పలు వరుసతో, రుచిరాం = ఒప్పునది; (5) పీత + అమ్బర + అలఙ్కృతామ్ = పచ్చ పచ్చడముతో సింగారింపబడినది; (6) విష్ణు బ్రహ్మ సుర + ఇన్ద్ర సేవిత పదాం = విష్ణువుచేతను బ్రహ్మచేతను దేవేంద్రునిచేతను ఆరాధింపబడిన చరణములు గలది;

(7) త త్త్వస్వరూపామ్ = పరమసత్యమునకు సొంత రూప మైనది; (8) శివాం = శుభముల గలిగించునది; (9) కారుణ్యవారాంనిధిమ్ = దయకు సముద్ర మైనది.

తా॥ మీనాక్షితల్లికి సదా మ్రొక్కుచున్నాను. ఆమె తేజము వేయికోట్ల సూర్యుల తేజమునకు సమానము. బాహుపురులు హారాలు మున్నగు నగలతో ఆమె జాజ్వల్యమానమై ఉన్నది, కెమ్మోవి దొండపండును దొరయునది, పలు వరుస తెల్లగ మెరయు చున్నది, పచ్చ పచ్చడము ఆమె కొక కైసేత, విష్ణు వేమి, బ్రహ్మ యేమి, ఇంద్రు డేమి ఆమె అడుగుల ఆరా ధించువారే. జగత్తునకు సకల శుభములు ఆమె వలన గలుగును, దయకు ఆమె సముద్రము పరమసత్యము ఆమెలో రూపు దాల్చినది.

ముక్తా హార లసత్ కిరీట రుచిరాం, పూ ర్ణేన్దు వక్త్ర ప్రభాం,
శిఞ్జ న్నూపుర కిఙ్కిణీ మణిధరాం, పుష్పప్రభా భాసురామ్,
స ర్వాభీష్టఫల ప్రదాం. గిరిసుతాం, వాణీరమా సేవితాం॥ మీనాక్షీం॥ ౨

టీ॥ (ఆమె), (1) ముక్తా = ముత్యాల, హార = దండలతోను, లసత్ = పళపళని, కిరీట = కిరీటముతోను, రుచిరాం = వెలుగొందునది; (2) పూర్ణ + ఇన్దు = నిండుచందురుని (వెలుగును)బోలిన, వక్త్రప్రభాం = నెమ్మోముకాంతిగలది; (3) శిఞ్జత్ = ఘల్లుఘల్లుమనుచున్న, నూపుర = అందెలోని, కిఙ్కిణీ = గజ్జెలను, మణి = రత్నాలను, ధరాం = దాల్చినది; (4) పుష్పప్రభాభాసురాం = పూలకాంతులచేప్రకాశించునది; (5) సర్వఅభీష్టఫలప్రదాం = కోరినప్రయోజనాలనన్నింటినిచ్చునది; (6) గిరిసుతాం = హిమవంతునిపుత్త్రి; (7) వాణీరమా సేవితాం = సరస్వతిచేతను లక్ష్మిచేతను ఆరాధింపబడినది.

తా॥ ఆ మీనాక్షమ్మ పర్వతరాజపుత్రి, లక్ష్మీసరస్వతులు ఆమెకు పాదపరిచారికలు, ఆమె తలపై నొక తళతళని కిరీటమును, మెడలో ముత్యాల హారాలును, రకరకాల పూల కాంతులును సొంపుకులుకుచుండును; ఆమె నెమ్మోముకాంతి, నిండుచందురుని వెలుగును బోలి నది; ఆమె దాల్చిన రత్నాలును అందెలోని చిఱుగజ్జెలును ఘల్లుఘల్లు మనుచుండును. ఎవ రేమి కోరినను ఆమె అనుగ్రహించును. దయాసముద్రురా లైన ఆమెకే సదా నా మ్రొక్కు.

శ్రీవిద్యాం, శివ వామ భాగ నిలయాం, హ్రీం కార మ న్త్రోజ్జ్వలాం,
శ్రీ చ క్రాఙ్కిత బిన్దు మధ్య వసతిం, శ్రీమ త్సభా నాయకీమ్,
శ్రీమత్ షణ్ముఖ విఘ్నరాజ జననీం శ్రీమ జ్జగ న్మోహినీం॥ మీనాక్షీం॥

టీ॥ [ఆమె] శ్రీవిద్యాం = మాతృఉపాసనా రూప విద్యా స్వరూపిణి, శివ వామ భాగ

నిలయాం = పరమశివుని మేని యెడమ సగము నెలవుగా గలది, హ్రీంకార మన్త్ర + ఉజ్జ్వలాం = 'హ్రీం' అనెడి మంత్రము నధిష్ఠించి వెలు గొందునది, శ్రీచక్ర + అఙ్కిత బిన్దు మధ్య వసతిం = (విష్ణూపాసకులకు సాలగ్రామమువలెను శంభూపాసకులకు లింగమువలెను మాతృపాసకులు చేసెడి ఆరాధనాదులకు లక్ష్య మైన) శ్రీచక్రమున గుఱుతింపబడిన చుక్కకు నడుమ నెలకొన్నది, శ్రీమత్ సభానాయకీమ్ = మాతృపాసకులసమూహమునకు ప్రాప్యప్రాపకురాలు లేక, మధుర లోని శెందమిళ విద్వత్సంఘమునకు నాయకురాలు, శ్రీమత్ షణ్ముఖ విఘ్నరాజ జననీం = విభూతిమంతు లైన కుమారస్వామికిని వినాయకునకును తల్లి, శ్రీమత్ = కలుము లెల్ల గలదై, జగత్ = విశ్వమును, మోహినీం = మోహింప జేయునది.

తా॥ మాతృపాసనా విద్యా స్వరూపిణి మా మీనాక్షమ్మయే, మాతృపాసకుల కెల్ల లక్ష్య మైన శ్రీచక్ర మండలి బిందుస్థానమున నెలకొని యుండునది మా మీనాక్షమ్మయే, మాతృపాసకులకు ప్రాప్యయు ప్రాపకురాలును మధురలోని శెందమిళ విద్వత్సంఘమునకు నాయకురాలును మా మీనాక్షమ్మయే. హ్రీం అను మంత్రమునకు అధిష్ఠాన దేవతగా వెలు గొందునది మా మీనాక్షమ్మయే, విభూతిసంపన్ను లైన కుమారస్వామివి గణనాయకుని కన్న తల్లి మా మీనాక్షమ్మయే, ఇక ఈ జగత్తును తన మాయాజాలమున తగుల్కొల్పునది శ్రీమంతు రా లైన మా మీనాక్షమ్మయే. ఆమెకు సదా నా మ్రొక్కు.

శ్రీమ త్సున్దర నాయకీం, భయహరాం, జ్ఞానప్రదాం, నిర్మలాం,
శ్యామాభాం, కమలాస నార్చిత పదాం, నారాయణ స్యానుజామ్,
వీణా వేణు మృదఙ్గ వాద్య రసికాం, నానా వి ధాడమ్బికాం ॥ మీనాక్షీం ॥ ౪

టీ॥ (ఆమె) శ్రీమత్ = ఐశ్వర్యవంతుడైన, సున్దర = సుందరేశుడు అను పేర మధురలో వేంచేసి యున్న పరమశివునకు, నాయికీం = వల్లభ, భయహరాం = వెఱపులను బోగొట్టునది, జ్ఞానప్రదాం = ఎఱుకను ప్రసాదించునది, నిర్మలాం = కళంకములేనిది, శ్యామాభాం = చామని మేని చాయ గలది, కమల + ఆసన = బ్రహ్మదేవునిచే, అర్చిత = పూజింపబడిన, పదాం = చరణములుగలది, నారాయణస్య = శ్రీమహావిష్ణువునకు, అనుజాం = చెల్లెలు, వీణావేణు మృదఙ్గ = వీణియ, పిల్లంగ్రోవి, మద్దెల — మున్నగు, వాద్య = జంత్రసంగీతమందు, రసికాం = రసమును(=సారమును)గ్రహించునది, నానావిధ + ఆడమ్బికామ్ = రకరకాలవికాసము గలది.

తా॥ ఆ మీనాక్షమ్మ నెమ్మేను కళంక రహితము, చామని చాయ గలది, ఆమె నీలమేఘశ్యామునకు నారాయణునకు చెల్లెలు, సుందరేశు డను పరమశివునకు ప్రాణేశ్వరి, ఆమె చరణములను బ్రహ్మదేవుడు సైతము ఆరాధించును. ఏల యన జ్ఞాన మిచ్చునది ఆమె, భయాలను పోగొట్టునది ఆమె; ఆమె లీలావిజృంభణము నానా విధము. దయాసముద్రురా లైన ఆమెకే సదా నా మ్రొక్కు.

నానా యోగి మునీన్ద్ర హృన్నివసతీం, నానార్థ సిద్ధి ప్రదాం,
నానా పుష్ప విరాజి తాఙ్ఘ్రి యుగళాం, నారాయణే నార్చితామ్,
నాదబ్రహ్మమయీం, పరాత్పరతరాం, నానార్థ తత్త్వాత్మికాం ॥ మీనాక్షీం ॥ ౫

టీ॥ (ఆమె) నానా = పలువు లైన, యోగి = యోగసాధకులయు, ముని + ఇంద్ర = మునిశ్రేష్ఠులయు, హృత్ = హృదయము, నివసతీం = ఉనికిపట్టుగాగలది, నానా = పలువిధము లైన, అర్థ = జీవితప్రయోజనాలకు, పురుషార్థాలకు, సిద్ధిప్రదాం = సిద్ధించుటను గలిగించునది, అనగా సిద్ధింప జేయునది, నానా = రకరకాల, పుష్ప = పూలచే, విరాజిత = వెలుగొందింపబడిన, అఙ్ఘ్రియుగళాం = అడుగులజంటగలది, నారాయణేన అర్చితాం = శ్రీమహావిష్ణువుచేత పూజింపబడినది. నాదబ్రహ్మమయీం = బ్రహ్మస్వరూపమనుకోబడెడు నాదమే తా నైనది, పరాత్ = పైదానికంటె, పరతరాం = మిక్కిలి పైవడినది, నానా = పెక్కువిధము లైన, అర్థ = పదార్థములకు, తత్త్వఆత్మికాం = (దానిదాని) స్వభావ మైనది.

తా॥ పైవా రందఱ స్థానముకంటె పైది మా మీనాక్షమ్మ స్థానము. ఆమెను శ్రీమహావిష్ణువు సైతము ఆరాధించును, పూజార్పితము లైన వివిధపుష్పాలతో ఆమె అడుగుల జంట ప్రకాశించుచుండును. యోగులును మునులును ఎంద ఱెంద ఉన్నారో, అందఱ హృదయములును నాతల్లికి ఉనికిపట్లు. సకలపురుషార్థముల సిద్ధియు, ఆమెచేతులలో ఉన్నది. నిప్పునకు వేడి స్వభావము, మంచునకు చలువ స్వభావము, ప్రతివస్తువులోను దాని దాని స్వభావముగా నెలకొని యుండునది మా మీనాక్షమ్మయే. బ్రహ్మస్వరూప మనుకొనబడెడు నాదమును ఆమెయే. ఆమెకు సదా నా మ్రొక్కు.



## కొట్లాటవల్ల నష్టపడ్డ ప్రాంతాలకు శ్రీరామకృష్ణమిషనువారి తోడ్పాటు కార్యక్రమం

### రామనాథపురంజిల్లా, చెన్నరాష్ట్రం.

### విన్నపం

1957 వ సంవత్సరం సెప్టెంబరునెల రెండోసగంలో చెన్నరాష్ట్రాన రామనాథపురంజిల్లాలోని కొన్ని తాలూకాల ప్రజలు దురదృష్టవశాన కొట్లాడుకోవడం, కొంపలు తగులపెట్టుకోవడం, పొడిచి చంపుకోవడం మూలాన ఏర్పడ్డ అపారప్రాణధననష్టాన్ని విని మనోవ్యథ చెందని మహాజనులు ఉండరు కదా. రామకృష్ణమిషను వారు అక్కడ సాహాయ్యకార్యక్రమానికి పూనుకోవడం ఎంత జరూరో, చెప్పవలెనా ? వారిసాహాయ్యకార్యక్రమ కేంద్రం ఒకటి మనమదురైలో నెలకొల్పబడింది. దెబ్బ తిన్న ప్రాంతాల కన్నిటికిని ఆ సాహాయ్యం అందజేయబడవలె. వీధుల పాలైన ప్రజలకు నీడలు నిర్మించవలె, పైకప్పులు కూలిపోయిన ఇండ్లకు పైకప్పులు వేయవలె, గోడలు పడిపోయిన యిండ్లకు పునాదులతో లేపవలె. సర్వస్వం పోగొట్టుకొన్న దీనులకు కూడు గుడ్డ మొదలైనవి సరఫరా కావలె. జరూరుగా కావలె, అన్నిటికి పైకం అవసరం, దీనసంరక్షణకై విరాళా లిం డని ఉదార మహాజనులకు మా విజ్ఞప్తి. విరాళాలు వస్తురూపంలో కాక పైకంరూపంలో ఉండడమే ఎక్కువ సౌకర్యం. విరాళాలను మైలాపూరు శ్రీరామకృష్ణమఠ మానేజరుగారు కృతజ్ఞతాపూర్వకంగా స్వీకరిస్తారు.

కైలాసానందస్వామి
మదరాసు రామకృష్ణమఠమిషనుల అ  లు.
7-10-1957.

# మాతృలీలాలహరి

## (సంపాదకీయము)

పరమసత్యము ఒక్కటే. అది సచ్చిదానంద స్వరూపము. ఒకటి నిత్యమును ఒకటి లీలాత్మకమునుగా దైవమునకు రెండు వైఖరులుకలవు. వేఱు వేఱు సాధనలచే ఆ రెంటిని సాక్షాత్కరించుకొన్న శ్రీరామకృష్ణుడు ఇట్లు అనెను— "దేవుడు రూపసహితుడు అనుటయు నిజమే, రూపరహితుడు అనుటయు నిజమే". "ప్రత్యేక రూపము నీటికి లేదు, మంచుగడ్డకు ఉన్నది, అట్లే అపరిచ్ఛేద్య మైన సచ్చిదానందము భక్తిచే ఘనీభవించి మంచుగడ్డవలెనే రకరకాల రూపముల దాల్చును. ఏతత్త్వమును మీరు బ్రహ్మ మందురో దానినే నేను తల్లి అందును".

లోకమాత పెక్కు రూపాలతో భక్తులకు తన్ను అగపఱచుకొన్నది. ఒక కొందఱ అనుభూతులను ఈ క్రింద ప్రస్తావింతుము—

శ్రీతోతాపురి గొప్ప యోగి, జ్ఞాన మార్గ ప్రతిపాదితము లైన 'సారాసార వివేక' 'సమాధు'ల ద్వారా ఉన్న తోన్నత మైన మెఱుకను ప్రాపించిన వాడు, పటు వయిన దేహము గల వాడు, ఐహికపరులను బంధించు మాయాజాలమునకు దవ్వుగ పవిత్ర వాతావరణమున ఎదిగినవాడు, దివ్యశక్తిస్వరూపిణిని లోకమాతను దర్శించు అవకాశము కాని శరణు పొంద వలసిన యక్కఱ కాని ఆయనకు లేదు. లోకజననిముద్దుబిడ్డ డగు శ్రీరామకృష్ణుని వ్యక్తి గుణములు ఆయనను ఆకర్షించినవి. దక్షిణేశ్వరమున ఉండిన దినాలలో చేతులతో తట్టుచు నామగానము చేయు చున్న శిష్యుని ఆయన 'ఏ మోయి, చప్పాతీలు చేయు చున్నావా ఏమి' అని పరిహాసించెడివాడు. అంతటి పరమైకాంతచిత్తునకు ఒక సారి అతిసారవ్యాధి దాపురించినది. కడుపునొప్పి మిక్కుటమై నిర్గుణ బ్రహ్మనిష్ఠ మైన చిత్తమును ఉత్పాత లూపినది. దేహబాధ నోర్వ లేక ఆయన గంగలో దూకి యైనను జీవితమును తుద ముట్టించుకొనగోరెను. అర్ధరాత్రమున గంగలో కాలి నడకన ముందున కేగ జొచ్చెను. శ్రీశారదానంద స్వామి ఈలాగు వ్రాసినారు — "నేటిరాత్రి అగాధ మైన భాగీరథి ఎండి పోయినదా? లేక అతని మనఃకల్పన అటు వెలువడినదా? ఎవరు చెప్ప గలరు? తోతాపురి ఆవలిగట్టునకు చేరి పోయెను గాని, తాను మునిగి పో గలంత నీరతనికి లభింప దాయెను. క్రమక్రమముగ ఆ నిశాంధకారమున ఆవలిగట్టునందలి చెట్లును ఇండ్లును నీడలవలె కనిపింప సాగగా, తోతాపురి నివ్వెఱపడి "ఏమి వింత దివ్యమాయ ఇది! ఒక వ్యక్తి మునిగిపో గలంత నీ రైనను ఏటిలో లేదే. ఏమి విని యెఱుగని దైవ లీల!" అని తలంచెను. అంతట అంతర్యామిగ నున్న ఎవరో ఒకరు ఆయన మతిని గప్పియుండిన తెరను తొలగించిరి. ఒక మహోజ్జ్వల కాంతి ఆయన మతిని మిఱుమిట్లుగొలిపినది. ఎటు చూచినను అమ్మయే కనిపించినది, అమ్మ, అమ్మ, అమ్మ,

లోకాలను కన్న తల్లి, అచింత్యశక్తి యైనతల్లి! భూమిలో అమ్మ కనిపించినది, నీటిలో అమ్మ కనిపించినది, మేను అమ్మయే, మనస్సు అమ్మయే, రోగము అమ్మయే, ఆరోగ్యము అమ్మయే, జ్ఞానము అమ్మయే, అజ్ఞానము అమ్మయే, బ్రదుకు అమ్మయే, చావు అమ్మయే, కన నైనది, విన నైనది, తలంప నైనది, ఊహింప నైనది సకలము అమ్మయే. ఆమె అగుదానిని కాకుండ చేయును, కాని దానిని అగునట్లు చేయును. ఆమె సంకల్పము లేనిదే దేహధారి ఆమె ప్రభావమును తప్పించుకో లేడు, చావ గోరినను చావ నైన లేడు. దేహ మనోబుద్ధులకు అతీత ఐనదియు ఆ తల్లియే, సాటి లేని 'తురీయ', నిర్గుణ. చిరకాలముగ తోతాపురి ఏ బ్రహ్మమును ఆరాధించుచు తన హృదయ పూర్వక ప్రేమభక్తికి లక్ష్యముగ ఒనర్చుకొని యుండెనో, ఆ బ్రహ్మము ఈ తల్లియే. శివుడును శక్తియు హరగౌరీస్వరూప మగు ఏక తత్త్వమే; బ్రహ్మమే బ్రహ్మశక్తి, బ్రహ్మశక్తియే బ్రహ్మము, రెండు నొక్కటే''.

అట్టిది ఒక మహాజ్ఞానయోగీంద్రుననుభూతి.

## II

ఇకను శ్రీరామకృష్ణుడో, వివిధదశానుభూతులు గన్న వాడు. మాతృసాక్షాత్కార సంజనితానందమును ఆయన అనుభవించిన ప్రకారాలు లెక్కకు మిక్కిలి యైనవి. తోతాపురికి గలిగిన దని పైని ప్రస్తావిత మైన అనుభవముతో తులతూగు గొప్ప అనుభవము శ్రీరామకృష్ణునకును గలిగినది. అది ఆయన వాక్కులోనే ఇట్లు వర్ణితము — ''సమస్తముగను తానే రూపొందితి నన్న తత్త్వమును లోకమాతయే నాకు కనబఱచినది. సమస్తమును చిన్మయమే అని ఆమె నాకు చూపినది. విగ్రహము చిన్మయము, బలిపీఠము చిన్మయము, చలువఱాతినేల చిన్మయము, సమస్తమును చిన్మయమే. గదిలో నున్న దెల్ల సచ్చిదానందనిమగ్నముగ నాకు కనిపించినది''.

## III

శ్రీశంకరులనుగూర్చి ఒక కథ వాడుకలో ఉన్నది. ఒకనాడు ఆయన వారాణశి వీధు లొకదానిలో పోవుచుండినా డట. ఆ వీధిలో ఒకపీనుగు పడియుండె నట. ఒక యువతి, చని పోయినవాని పత్ని కాబోలు, ప్రక్కనే కూర్చుండి విలపించుచుండె నట. అట ఉన్న వారితో శ్రీశంకరులు ''పీనుగును ఎత్తి వేయుడు' అన్నా రట. ఆ మగువ ''ఏల, తొలగి పొమ్మని ఆపీనుగుతోనే అన రాదా'' అని బదులు చెప్పిన దట. ''తనంతట కదలు శక్తి పీనుగున కెక్కడిది'' అన్నా రట శంకరులు. ''ఈ దేహము ఏపాటి? తన్ను కదల్చు శక్తి ఒకటి లేనిదే, ఇదే కదల లేనప్పుడు, శక్తి నిరపేక్షముగా, ఈ జగత్తు సాగుచుండు నను అభిప్రాయ మెట్లు తమకు కలిగినది?'' అని ఆ మహిళ శంకరులను అడిగిన దట. పరాశక్తి ఒకటి కల దనియు ఈ జగత్తు ఆమెలీలావిలసితమే అనియు నొక క్రొత్త దారి శంకరులకు తెఱచి చూపబడిన ట్లయ్యెను. ఈ జ్ఞానము ఆవశ్యక మైనదే. ఏల యన, 'వ్యావహారిక' 'పారమార్థిక' రంగాల నడుమ నుండనిదే, జగత్తుయొక్క వ్యావహారిక సత్యత నించుక గుర్తింపనిదే, సిద్ధుడు సంఘమున పారమార్థిక పునరుద్ధరణమున కైనను దేనిని గాని సాగింప లేడు. ఈ సాక్షాత్కారానంతరము శ్రీ శంకరులు ప్రసిద్ధ మైన తమ 'సౌందర్యలహరి'

మొదటి శ్లోకముననే—

శివ శ్శక్త్యా యుక్తో యది,
భవతి శక్తః ప్రభవితుమ్
న చే దేవం, దేవో
న ఖలు కుశలస్ స్పన్దితు మపి.

[శక్తిఁ గూడిన యప్పుడే శక్తుఁ డగుచు
శివుఁడు లోకాల సృజియించుఁ జెన్నుమీఱి,
శక్తిఁ గూడని శివునకు శక్తి లేదు
కాలు సేతుల నేనియుఁ గదలుపఁగను]

(అనువాదము అస్మదీయము)

అని కీర్తించినారు. ఈ విషయమునే శ్రీరామకృష్ణుడు "బ్రహ్మము నిర్వ్యాపారము, సృష్టిస్థితి సంహారవ్యాపార వ్యాపృత మైనప్పుడు ఆ బ్రహ్మమే ఆదిశక్తి అన బరగును. ఆ శక్తిని ఆరాధింప వలెను' అను మధుర ఫణితిలో చెప్పి యున్నాడు.

## IV

నరేంద్రనాథునకు [ఇతడే అనంతరకాలాన శ్రీవివేకానందస్వామి] లోకజననియందు నమ్మకము లేదు. బ్రాహ్మసమాజీయు డైనందున, సాకారబ్రహ్మము నతడు అంగీకరింపడు. తండ్రి మరణానంతరము, కుటుంబము మిక్కిలి పేదఱికమునకు అగ్గ మైనందున నరేంద్రునకు జ్ఞానసాధనలకు వ్యవధి చాల కుండెను. దైవసాహాయ్యమున ఆ పేదఱికమును తొలగింపు మని, నరేంద్రుడు శ్రీరామకృష్ణుని బలవంతపెట్టి ప్రార్థించెను. ఎంతో ప్రేమతో గురుదేవుడు "అబ్బాయి, అటువంటి మాటలు నా నోటికి రావు అనుట నీకు తెలిసిన విషయమే, నీవే ఏల ప్రార్థింప రాదు? లోకజననిని నిరాకరింతువే, అదే నీ యీ కష్టాల కన్నిటికిని కారణము, నేటి రాత్రి గుడికి పొమ్మ, దేవికి ప్రణమిల్లి వర మడుగుము. ప్రేమమయి ఐన నా తల్లియే బ్రహ్మశక్తి. ఆమె శుద్ధ చిత్స్వరూపిణి. సంకల్పమాత్రముచే ఆమె ఈ జగమును సృజించెను. సంకల్పించినచో ఆమెకు ఏది అసాధ్యము?" అని ఓదార్చి పంపెను. నరేంద్రుడే ఈలాగు వర్ణించినాడు — "బయలుదేరగనే నన్నొక గాఢోన్మాదము ఆవేశించినది. నేను తూలుచుంటిని. జననిని ప్రత్యక్షముగ కందును, ఆమె దివ్యవాణిని తప్పక విందును అను గట్టి నమ్మకమునకు లోనైతిని. తక్కిన యన్నింటిని మఱచి, ఆ తలంపొక్కదానిలో పూర్తిగ మునిగి యుంటిని. గుడిలోని కేగితిని, అమ్మ సాక్షాచ్ఛుద్ధచిత్స్వరూపిణి అనియు, ఆమె ఉనికి వాస్తవ మనియు, నిరవధికప్రేమకును సౌందర్యమునకును ఆమెయే ప్రభవ మనియు కంటిని, నా డెందమున ప్రేమభక్తి ఉప్పొంగెను. ఆనందపరవశుడనై మరల మరల ఆమెకు నమస్కరించి, "అమ్మా, నాకు వివేకము నిమ్మ, నిస్సంగత్వము నిమ్మ, దివ్యజ్ఞానమును భక్తిని ఇమ్మ, నీ సందర్శన భాగ్యము నాకు నిరంతరము గలుగ నిమ్మ" అని ప్రార్థించితిని. నా హృదయమున శాంతి వెల్లి విరిసెను. విశ్వ మెల్ల పూర్తిగ మాయ మయ్యెను. అమ్మ మాత్రమే నా డెందాన నిండి యుండెను".

ఐహికప్రయోజనాలను అడుగుద మని నరేంద్రుడు ముమ్మార్లు పోయినాడు కాని, అమ్మను చూడగానే తుచ్ఛ ప్రయోజనాలను అడుగుటకు సిగ్గు జెంది, పారమార్థికవిశేషములను ప్రసాదింపు మనియే కోరెను. గుడినుండి వెలువడి ఆరాత్రి అంతయు—

"లోకాల పాలింతు వో కాళి తల్లి"

అను పాటనే పాడుచుండెను. 'నరేంద్రుడు

లోకమాతను అంగీకరించినాడు, చాల మంచి' దనుచు శ్రీరామకృష్ణుడు తన సంతోషమును వెలిపుచ్చెను.

తర్వాత మఱి కొన్ని యనుభూతులు గాంచిన పిదప, నరేంద్రునకు సమస్తమందును పైకి లోకవినాశకములుగ గన్పట్టు వైఖరులలోగూడ జననియే కాన్పింప జొచ్చినది.

ఒక రూప నాశము వేఱొక రూపప్రాప్తికి అందించు నప్పుడు, ఆ నాశము నాశమే కాదు. హిందువుల విశ్వాసములలో ఇది సాటి లేనిది. దీనిని శాక్తులు ప్రత్యేకముగ ఆదరింతురు. లయశక్తిని ఎక్కడివాడో అయిన దయ్యాల నాయకునకు (సేటనుకు) విడిచి పెట్ట లేదు. సౌమ్య కరాళ రూపాలు రెండును తల్లివే. జగన్మోహన మగు త్రిపురసుందరీరూపాన ఆమె సృష్టికర్త్రి, భయంకర కాళీరూపాన ఆమె సంహారకారిణి. కరాళరూపాన దేవిని సాక్షాత్కరించుకొన్నప్పటి తన యనుభూతిని శ్రీ వివేకానందస్వామి 'కాళీమాత' అను కావ్యమున పొందుపఱచి యున్నాడు-

అమ్మ, రా వమ్మ, మా యమ్మ, ర మ్మిటకు;
భీతికర్త్రి వటంచు పే రొప్పు నీకు;
నీ రూపె లోకాళి నీ ఆనన్నెడిని;
పాద మెత్తి యిడితివా యేని, జగము
లుఱ్ఱూత లూగుచు, నొగి నాశ మందు.
కాలమృత్యు నీవె, లోక లయ కర్త్రి వీవె;
అమ్మ, రా వమ్మ, మా యమ్మ, ర మ్మిటకు.

స్త్రీప్రాథమ్యమును సాధించుకొనుటకై స్త్రీ లేర్పఱుచుకొన్న శాస్త్రమే 'తంత్రశాస్త్ర' మని కొందఱందురు. ఆ ప్రతిపాదనను స్వామిజి యనుభూతి నిశితముగ ఖండించినది. కేవలము స్వానుభవములో చూచుకొన్నను, క్షేత్రబీజములు(స్త్రీపురుషులు) ఉభయమును ఉండ కున్న సృష్టి సిద్ధింపదు. మామూలు జీవితములో కూడ తల్లివంతు ఎక్కువజరూరు, ఎక్కువ సేపు చెల్లును. భక్తుల వైఖరులను బట్టి దైవము తల్లిగను ఉండ గలదు. తండ్రిగను ఉండ గలదు. పారమార్థికదృష్టితో చూతు మేని బ్రహ్మమునకు స్త్రీత్వపురుషత్వాలు లేవు. సంస్కృతభాషలో మాతృశబ్దము పుంలింగమును స్త్రీలింగమును కూడ నగును.

## V

రామప్రసాదుడు పదునెనిమిదవ శతాబ్దమున నుండిన శాక్తభక్తుడు. లోకజననిని గూర్చి ఆయన పాడిన పాటలు నూర్ల కొలదిగ ఉన్నవి. భావమునందును గాంభీర్యమునందును సహజావబోధమందును ఆయన గేయాలకు సాటి లేదు. వానిలో దేవీభక్తి, దేవ్యుపాసనము, దేవీసాక్షాత్కారానుభూతి — ఇవి ప్రతిపాదితములై ఉన్నవి. వీనిచే ఆ గేయాలకు అంతటి పటుత్వమును ఆకర్షకతయు గలిగినవి. అతని గాఢప్రేమకు అలరి లోకమాత అతనికి తన దర్శనానుభవాలను అనుగ్రహించినది. ఒకనా డతడు తన యింటి చుట్టు నున్న వెదురు తడికెను సరిచేసికొను చుండెను. ఎవరైన నౌకరు తడికెకు ఆవల నిలబడి ఈవలి నుండి అందీయబడు త్రాటి నందుకొని ముడులు వేయుచు తోడ్పడ వలసిన జరూ రుండెను. జననినిగూర్చి గేయాలను పాడుచు అతడు తనకు ఆ పనిలో తన కూతురు సాయపడు నని నిరీక్షించు చుండెను. అతడు పనిని ప్రారంభింపగనే తడికకు ఆవల నున్న వారు త్రాటి నందుకొని ముడులు వేయుచు తోడ్పడుటచే పని చుఱుకుగ సాగినది. తల్లినిగూర్చిన ధ్యానమున శిశువువలె ఆనందించుచు రామప్రసాదుడు పనిని

సాగించెను. కొంత సేపటికి అతని కూతురటకు వచ్చి పని చాల చుఱుకుగ సాగినందుకు అచ్చెరువొందెను. విచారింపగా ఆమె అంతసేపును ఇంటిలో వేఱు పనిని దేనినో చేయుచుండినదని తెలిసినది. కావున ఇంతవఱకును తనకు తడికె పనిలో తోడ్పడి అనుగ్రహించినది తన యిష్టదేవతయే అని అతడు గ్రహించి భక్త్యావేశమున ఒకపాటను పాడెను. ఆ పాటచే ఆవృత్తాంతమునకు శాశ్వతత్వము చేకూరినది –

జనని చరణ జలజములకు నెడసి
ఉండెద వెందుకే ఓ నా మనంబ?
అమ్మను దలఁపుమా, యామెను నీదు
భక్తిపాశముచేత బంధింతు వేని,
బంధవిమోచిత వౌదువు నీవు;
కన్ను లుండియుఁ దల్లిఁ గాంచఁగా లేని
దానవు, నీ వెంత దౌర్భాగ్యవతివో!
భక్తునితోఁ దాను రక్తిఁ గ్రీడింపఁ
గోరి వాని సుతగఁ గూర్చుండి, తడికె
కట్టుచు, వానిని గరుణించెఁ జూవె!
నీ౯ అనన్య లగుచు నిలుకడ తోడ
ధ్యానించు వారలు దరిసింతు రమ్మ;
అంతిమక్షణమున అమ్మ, యొకపరి
దుహితవై ముందట తోతెంచి, నీదు
రామప్రసాదుని రక్షించుకొమ్మ

## VI

రామనాథమండలీయుడైన వీరకవి రాజేంద్రునకు అతని పుత్రికారూపమున, అమ్మ, కనిపించినది. పరమభక్తుడైన ఆ కవి అన్నపూర్ణావిశ్వేశుల దర్శింప కాశికి యాత్ర చేయగోరెను. ప్రయాణ సన్నాహములు చేయుచున్నప్పుడు అతని యేకైక పుత్రిక అతనిని దరిసి 'నాయనా, యాత్రకు నన్ను కూడ పిలుచుకొని పొమ్మ' అని ప్రార్థించినదట. కాలి నడకన సాగింపవలసిన ప్రయాణమైనందునను మార్గ మతి దీర్ఘమును ఆపద్బంధురమును ఐనందునను 'అమ్మా నీకు సాధ్యము కాదు' అని తండ్రి అనెను. ఆమెయు వయసుకు తగిన వివేకము కలదే కావున తండ్రిమాటను గ్రహించి పయనమును మానుకొనెను. అంతట కవి ఇంటివారియొద్దను ఊరివారియొద్దను వీడ్కోలు పొంది, బయలుదేఱెను.

ఒక మైలు దూరమైనను పోయెనో లేదో అతనికి వెనుక ఎండు టాకులపై అడుగుల చప్పుడు విన నయ్యెను. ఎవరో అని వెనుతిరిగి చూడగా, తన కూతురే. కవి ఆశ్చర్యపడెను. ''నాయనా, నీవు బయలుదేఱిన వెంటనే, నీతో రావలెను అను ఉబలాటము నాకు హెచ్చెను, అమ్మతో చెప్పితిని, ఆమె సమ్మతించినది, దొడ్డిదారిని వచ్చితిని'' అని అమ్మాయి చెప్పినది. అబ్బురపడినను, అది లోకజనని సంకల్పమనుకొని అతడు ఆమెను వెంటగొని చనెను. కాశి మున్నగు క్షేత్రముల యాత్ర ముగియుటకు అతని కొక సంవత్సరము పట్టినది. అన్నాళ్లును గుడ్డ లుతికి పెట్టుట వంట వండి పెట్టుట మొదలైన సేవల నన్నిటిని కూతురు తండ్రికి చేయుచునే ఉండెను. ఊరికి మరలి వచ్చుచున్నప్పుడు ఒక మైలు దూరమున నుండగనే కూతురు ''నాయనా, నీవు రాగనే ఊరివారందఱును నిను జూడ వత్తురు. నేను నీ వెంబడి వచ్చిన సంగతి వారి కెవ్వరికిని తెలియదు, కాబట్టి నన్ను ముందుగా దొడ్డి దారిని ఇలు చేర నిమ్మ, తర్వాత నీవు వత్తువు కాని'' అన్నది. అమాయికుడైన తండ్రి 'సరే' అనెను.

ఇల్లు చేరగనే, ఊరివా రందఱును అతనిని కలసికొనుటకు వచ్చిరి. మిక్కిలి సంతోషించి అతడు ఒక్కొక్కరిక్షేమమును విచారించెను. కొంత సేపైన పిమ్మట అతని భార్య వచ్చి "ఇక్కడ ఉన్న అందఱి క్షేమమును అడుగుచున్నారే కాని, మన అమ్మాయి క్షేమమును అడుగ లేదే. మన కొక అమ్మాయి ఉన్న సంగతే మీకు జ్ఞాపకము లేదా? మనకు కూతురు ఒక్కతే కదా. ఆమె మనసు ఎంత నొచ్చెనో ఇంట ఆ మూలకు పోయి వెక్కి వెక్కి ఏడ్చుచున్నది" అని చెప్పెను. "ఏమి వచ్చినది ఆమెకు? ఈ సంవత్సరము పొడుగునను ఆమె నాతో గూడనే కదా ఉండినది ? మఱి ఆమెయెడ నాకు అక్కర లేదను చున్నావే" అని భర్త గద్దించెను. ఇల్లాలు బిత్తరపోయి "మీకు మన సేమైన చెడెనేమో. అమ్మాయి ఇన్నాళ్లును నాతోకూడ ఇంట కదా ఉండినది" అని మొత్తుకొనెను. అప్పుడు తన పుత్రీరూపున తన్ననుసరించి ఒకసంవత్సరకాలము తనకు పరిచర్య చేసినది సాక్షాజ్జగజ్జననియే అని కవికి తెలియ నయ్యెను.

అతనికి సంబంధించిన కథాంశము మఱియొకటి కూడ ఉన్నది. ఒకనాడు అతడు గుడిలో పూజచేయుచున్నప్పుడు ఒక గాజుల వాడు వచ్చినా డట. పల్లెలోని మామూలు ప్రకారము ఇంటింటి మగువలును పడుచులును గాజుల నేరుకొనుటకు ఒకచోట ప్రోగయినారు. కవిగారి గృహిణి గాజుల వానికి పైక మీయ వలసి వచ్చి నప్పుడు "అమ్మా, మీ యింట మాత్రము ఇద్దఱు పిల్లలు గాజులు వేసికొని పోయినారు, కావున ఆ ఉభయుల లెక్కను మీరు చెల్లింప వలె" నని గాజులవాడన్నాడు. ఆమె 'అయ్యో మాకు కూతు రొక్కతెయే' అని అన్నది. ఊరివా రందఱును గూడ ఔ నన్నారు. పూజలో ఉన్న పీరకవికి ఈజగడము చేత ధ్యానము చెడినది, లోపలినుండియే గాజులవానితో 'మాకు కూతు రొక్కతే" అని అతడును కేక వేసినా డట. అప్పు డతనియెదుట నున్న పూజాకలశమునుండి ఘల్లు ఘల్లు మను గాజులతో రెండుచేతులు వెలువడి "నాయనా, ఒక్క సంవత్సర కాలము నీతోనుండి నీకు నా శక్తికొద్ది పరిచర్య చేసితినే, నాకై ఒకటి రెండణాలు ఖర్చుపెట్టుట నీకు కష్టమా?" అను వాణి విన నైన దట. ఈమాతృదర్శనానుభవానందము భక్తునకుతలమునకలయ్యెను. గాజుల వానికి పైకము వెంటనే ముట్టినది. లోకజనని ప్రసాదముచే కవితాశక్తిని ప్రాపించి అతడు మాతకర్పితముగ జగద్గురు శంకరాచార్య ప్రణీతమైన సౌందర్యలహరిని మధుర తమిళ పద్య కృతిగ అనువదించి 'కవి' బిరుదము నొందెనట.

అనంతరకాలమున రామనాథమండలము ననే సేతుపతి యాస్థానకవిగా వెంబత్తూరువాడైన పిచ్చుఅయ్యరను నొక డుండెను. కవిరాజ పండితునెడ లోకజనని నెరపిన లీలను అత డీ క్రింది తమిళపద్యమున ప్రశంసించియున్నాడు—

నాట్టిల్ అదిక ప్పుగళ్ శేరుం
కాశి నగర్ వరైక్కుం
తాట్టిక మాన కవిరాజ పణ్డితర్
తమ్ మగ ళాయ్
వేట్టి తువైత్తు శమైత్తిట్టు
పిన్నుం వెగు వరిశై
శూట్టియ కైయిల్ అళగీ,
మధురై త్తురై మగళే.

[దేశవిఖ్యాత మా కాశివటకును
మహితుఁడౌ కవిరాజదుహిత వై యేగి

బట్ట లుతికి, వంట వండి పెట్టితివి,
గాజులతోడ సింగారించుకొన్న
కరకమలయుగళి గలిగి వెలిగితి
పాండ్యరాజతనయ, భక్తవిధేయ].

రామనాథజిల్లాలోని పీ రా చ ల పు ర ము (పీరై) కవిరాజపండితుని స్వగ్రామము. జీవిత చరమదశలో అతడు సన్న్యసించెను. అతని సమాధి ఇప్పటికిని అచ్చట ఉన్నది.

## VII

ఆదిశంకరుల సౌందర్యలహరి (75) లో లోకజనని స్తన్యపానము చేసిన 'ద్రావిడశిశు' ప్రస్తావము కలదు—

తవ స్తన్యం మన్యే, ధరణి
ధరకన్యే, హృదయతః
పయఃపారావారః పరివహతి
సారస్వత మివ,
దయావత్యా దత్తం ద్రవిడ
శిశు రాస్వాద్య తవ యాం
కవీనాం ప్రౌఢానా మజని
కమనీయః కవయితా ॥

ఓ పర్వతరాజపుత్రీ, నీ స్తన్యము పాల సముద్ర మనియే నా తలంపు. అది సరస్వతీ వాహినిగా ప్రవహించుచుండును. దాని నాస్వాదించి కదా ద్రావిడశిశువు ప్రౌఢకవులకు సైతము కమనీయు డైన కవి యయినాడు.

ఆ ద్రావిడశిశువు ఎవ రనగా గొప్ప శైవ యోగి యైన తిరుజ్ఞానసంబంధుడే. అతడు మూ డేండ్లబాలుడుగ నున్నప్పు డతనిని గట్టున కూర్చుండ బెట్టి, తండ్రి స్నానార్థము నదిలో దిగె నట. తండ్రిని గానక పిల్లవాడు భయపడి 'అమ్మా' 'అప్పా' అని ఏడ్వ దొడంగె నట. అప్పుడు పార్వతీమాత ప్రత్యక్షమై తన స్తన్యము నొక పాత్రలో త్రాగ నిచ్చె నట. బాలుడు త్రాగినాడు, పసివాడు కావున నోటి మూలల నుండి పాల చుక్కలు కన నగు చుండినవి. ఇంతలో నాయన వచ్చి 'పాలు నీకు ఎవ రిచ్చినా'' రని అడిగినా డట. అప్పు డందులకు జవాబుగా బాలునినోట సాంబమూర్తి స్తుతి పరముగ వెలువడిన పాశురము —

తోడుడైయ శెవియన్, విడై యేఱి,
యోర్ తూ వెణ్ మది శూడి,
కాడుడైయ శుడలై ప్పొడి పూశి,
ఎన్ ఉళ్ళం కవర్ కళ్వన్,
ఏడుడైయ మలరాన్ మునై నాళ్
పణిం దేత్త అరుళ్ శెయ్ద
పీడుడైయ పిరమాపుర మేవియ
పెమ్మా నివ నన్ఱే॥

[పో గొప్ప చెవులు, నాఁబోతు వాహనము,
సిగ పైని నెలవంక సింగార పూవు.
సొద బూది మైపూఁత— సొం పొందు హరుఁడు
తమ్మిగద్దియవేల్పు తన్నుఁ బ్రార్థింప,
దయచేసి యాతని ధన్యు నొనర్చి,
బ్రహ్మపురములోన బరగు చున్నాడు.
అతఁడె పో చిత్తాపహారి నా స్వామి].

## VIII

ప్రసవవేదన పడు చున్న యొక కూతునకు సొంత తల్లి రూపున వచ్చి పరమశివుడే తోడ్పడిన కథ యొకటి కలదు. తిరుచిరాపల్లి సమీపమున ఒక వృద్ధురా లుండెను. ఆమె తన కూతును కావేరి కావలిగట్టు పల్లెలోనున్న యొకని కిచ్చి పెండ్లి చేసి పిల్లను కాపురమున

కంపెను. కొంతకాలమునకు అమ్మాయి గర్భిణియై కానుపు వేళ సమీపించి నప్పుడు అచట సాయపడ గల వారు ఎవ్వరును లే నందున తల్లికి పిలు పంపెను. కాని కావేరి గట్లొరసి కొనుచు ప్రవహించు చుండెను. ప్రవాహంపు పోటు మామూలు పడవలను సైతము తిరుగాడ నీయ లేదు. నది కీవలి గట్టున తల్లి 'ఎట్లో కదే ఈశ్వరా' అనుకొను చుండెను, ఆవలిగట్టు పల్లెలో కూతును అల్లే మలయప్పని ప్రార్థించు చుండి యుండును.

కొన్నాళ్లకు నదిలో వెల్లువ తగ్గినది, అమ్మ కూతు నింటికి పరుగున బోయి 'ఏ మైనది? ఎట్లయినది' అని ఆతురముతో ప్రశ్నించినది. కానుపు ఎప్పుడో ఐపోయినది, బాలింతయు బిడ్డయు క్షేమముగా ఉన్నారు. అంతే కాదు, ఆ బాలింత ఆశ్చర్యపడి తన తల్లిని "నాకు నొప్పులు పుట్టి నప్పటి నుండియు నీవు నా ప్రక్కనే ఉండి సమ స్తోపచారములు చేయు చుంటివే. ఇప్పుడు ఈ ప్రశ్న ఏమి?" అని అడిగినది. తల్లికిని ఆశ్చర్యమే. కాని మలయప్పడే ఆ రూపున వచ్చి తమ్మేలినా డని అచిర కాలముననే ఆతల్లికూతుండ్రు గ్రహింపగలిగిరి. ఇందుచేత ఆకొండసామికి 'తాయుమానవర్' 'అమ్మయు ఐనవాడు' అను పేరు గలిగినది. ఆస్వామి కంకితముగ ఆపేరనే పరగిన 'తాయు మాన' యోగీంద్రుడు పాడిన మధుర భక్తి గేయమాలయు కలదు.

## IX

మాతృశ్రీశారదాదేవికి లోకమాతృదర్శనము ఎన్నో సార్లు గలిగినది. భర్తను జూచుటకై జయరామవాటినుండి దక్షిణేశ్వరమునకు పోవుచుండగా దారిలో ఆమెకు తీవ్రజ్వరము వచ్చినది. అది మానిన రీతి ఆమె వాక్కులోనే ఇట్లు వర్ణితమై ఉన్నది — "తీవ్రజ్వరముచే నాకు స్మృతి తప్పినది. మొలచీర నైనను చూచుకో లేని దశలో నేనుండగా ఒక బాలిక వచ్చి నా ప్రక్కన కూర్చుండినది. ఆమె మేను చామని చాయ గలది, సొంపు అదృష్టపూర్వమైనది, ఆమె కూర్చుండి తన చేతితో నా తలను ఒడలిని నిముర జొచ్చెను. ఆస్పర్శ సుఖానకును చలువకును నా జ్వరము తగ్గ సాగినది. ప్రేమతో "ఎక్కడినుండి వచ్చితి వమ్మాయీ" అని అడిగితిని. "దక్షిణేశ్వరము నుండి వచ్చితిని" అన్నది ఆ పిల్ల. అబ్బురపడి "దక్షిణేశ్వరమునుండియా? అక్కడికి పోవలె ననియే కదా, ఆయనను (=శ్రీరామకృష్ణుని) చూచి పరిచర్య చేయ వలయు ననియే కదా నా కోరిక! కాని దారిలోనే ఈ జ్వరము వచ్చినది. కోరిక తీరు భాగ్యము నాకు ఉండదు." అని నే నంటిని. "ఏల ఉండదు? తప్పక నీవు దక్షిణేశ్వరమునకు బోవుదువు రమ్మ, పోయి చూడుము ఆయనను. నీకొఱకే నే నాయనను అచట నిలిపి ఉన్నాను" అని ఆ బాలిక చెప్పినది. "ఔనా? నీవు మా చుట్టమవా? దయచేసి చెప్పవే" అని నే నడిగితిని. "నేను నీ తోబుట్టువను" అన్న దామె. "ఔ నౌను. కావుననే వచ్చితివి" అని నే నంటిని. ఆమెతోడ నాకు ఈ సంభాషణ నా నిద్రలో జరిగినది".

## X

వికలేంద్రియులైన భక్తులను జనని అనుగ్రహించిన ఐతిహ్యాలు పెక్కులు. 'మూకం కరోతి వాచాలం' 'మూగను వక్తగా మార్చును' అను నానుడికి ఆలంబమైన కథ — కంచి కామాక్షి 'మూకునకు' (=మూగవానికి)

మాటాడు శక్తినే కాక, భక్త్యమృత రసభరిత గేయములను పాడు శక్తిని కూడ ప్రసాదించినది. 'మూక పంచశతి' అను గ్రంథములో కవి ఈ వృత్తాంతమును తడవి యున్నాడు.—

మూకో ఽపి జటిల దుర్గతి శోకో ఽపి
స్మరతి యః క్షణం భవతీమ్
ఏకో భవతి స జన్తుర్
లోకోత్తర కీర్తి రేవ కామాక్షి.

'అమ్మా, కామాక్షీ, మూగ కానీ, పెను గొన్న విపత్తులచే శోకనిర్మగ్నుడు కానీ, నిన్ను క్షణ కాలము స్మరించిన చాలును, ఆ ప్రాణి లోకాన సాటి లేని కీర్తివంతు డగును' [ఆర్యా శతకము 57].

మూకానా మపి కుర్వతీ
సురధునీ నీకాశ వాగ్వైభవమ్

'మూగవారికి సైతము గంగాప్రవాహమును బోలిన వాగ్ధారను ప్రసాదించునది' [స్తుతి శతకము].

మూకో విరిఞ్చతి పరం పురుషః, కురూపః
కందర్పతి, త్రిదశరాజతి కింపచానః,
కామాక్షి, కేవల ముపక్రమ కాల ఏవ
లీలా తరఙ్గిత కటాక్ష రుచః క్షణం తే॥

అమ్మా, కామాక్షీ, లీలాతరంగితమై నీ కడ కంటి చూపు ప్రసరించిన తత్క్షణమే, మూగ వాడు చతుర్వేదవక్త యగును, కురూపి మన్మథు డగును, తిండికి లేని వాడు త్రిదశేశ్వరు డగును'' (కటాక్ష శతకము 74).

## XI

జనని మహిమ అపారము, అమేయము, ఇం తంత అనుటకు ఎవరికిని సాధ్యపడనిది, ఆమె అనుగ్రహమయి, అజ్ఞాతనిగ్రహ —

శరణాగత దీనార్త
పరిత్రాణ పరాయణే,
సర్వస్యార్తి హరే, దేవి,
నారాయణి, నమో ఽస్తు తే॥

అనుచు ఆమె చరణములను శరణు జొచ్చుటే మనకు స్వరూపానురూపము.

# దుర్గా పూజ

శ్రీ గురుభక్త పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు

ఈ పూజ ఆశ్వయుజ మాసములో వచ్చును. హిందూదేశమునం దన్ని వర్ణములవారును అందరును బహు సంతోషముతో నీ పూజచేసి యానందింతురు. ఈ పూజను ముఖ్యముగా తొమ్మిది రాత్రులు చేయుదురు. మొదటి మూడు రాత్రులు దుర్గాశక్తిని నావాహనము చేయుదురు. రెండవ మూడు రాత్రులు సరస్వతీదేవి పూజ జరుపుదురు. ఆఖరి మూడు రాత్రులు ఆయుధపూజ చేయుదురు. ఈ నవరాత్రపూజ యైనపిమ్మట మహాకాళీశక్తి మహిషాసురుని జంపును. పిమ్మట పదియవరోజున విజయదశమి నాడు కాళీదేవిని ప్రతియూరను ముఖ్యవీధుల యందూరేగించి గొప్ప యుత్సవము చేయుదురు.

ఇట్లు బాహ్యాడంబరముతో చేయుచున్న దుర్గాపూజకు అంతరార్థము కలదు. అది యేమనగా దుర్గయు మహాకాళియు ఈశ్వరుని మహాశక్తులే. ఇవియే ఇచ్ఛాశక్తిగా మానవునియందు పరిణమించును. మహిషాసురుడనెడి దుర్మార్గపు

నడతను నశింపజేయవలయు నన్నచో మనలో నుండెడి యిచ్ఛాశక్తిని ముందు దృఢముగా నెల కొల్పవలెను. అనగా ఇచ్ఛాశక్తి బలమైననే గాని యేపనియు జయప్రదముగా నెరవేరదు. కనుకనే దేవిని పూజించుటకు రాత్రియే చక్కని సమయము. అదియే మన ఇచ్ఛాశక్తిని బల పరచుటకు తగిన సమయముకూడను. బాహ్య ప్రపంచము నిద్రించుచున్న సమయ మేకాగ్ర తతో నిచ్ఛాశక్తిని బలపరచుటకు మంచి తరుణము. మూడురాత్రులు పూజయనగా 'నిచ్ఛా శక్తి' దృఢమై దేవతారూపమును దాల్చును. మంచి సంకల్పములు దేవతారూపమును దాల్చు ననియు చెడ్డ సంకల్పములు రాక్షసరూపమును దాల్చుననియు మనగ్రంథములు చెప్పుచున్నవి. కనుక ఏపనినైనను నకుంఠితమైన దృఢ సంకల్పముతో చేయవలయును. రెండవ మూడు రాత్రులలో చేయు సరస్వతీపూజ అనగా నిచ్ఛా శక్తి బలమైనతోడనే అట్టి యిచ్ఛను అమలు జరుపుటకు జ్ఞానశక్తి బయలుదేరును. అనగా "ఇచ్ఛ" ఉద్దేశమును ఏవిధముగా నెరవేర వలెనో అందుకు కావలసిన సాధన సంపత్తిని సంపాదించుటయే జ్ఞానశక్తి. చివరి మూడు రాత్రులు నాయుధపూజ. ఆయుధమనగా మనుష్యుని త్రిదేహములును. వీనిచే పనిచేయించు శక్తియే క్రియాశక్తి. పూజయనగా ఇచ్ఛాజ్ఞాన శక్తులు బలమగునపుడు క్రియాశక్తి తనంతట తానే దేహమును ప్రోత్సాహపరచి దేహముతో పనిచేయును. కార్యమును చేయుటయే క్రియాశక్తి.

మహిషాసురుని చంపుట యనగా :— దేహేంద్రియ మనస్సంఘాతము జీవాత్మను లోబరచుకొని తమ యిష్టము వచ్చిన ప్రకారము స్వార్థపరత్వముతో పనిచేసి ప్రకృతి యొక్కయు ప్రభువుయొక్కయు ధర్మములకు వ్యతిరేకముగా నడచి తనయందుండెడి శక్తిని పోగొట్టుకొని అందువలన పలువిధములగు దుఃఖములకు తెరువై అనేకజన్మ లనుభవించును. అనేక జన్మానుభవములవలన జ్ఞానోదయమును పొంది ఆ జన్మల కర్మసంచితమును క్రమముగా స్వార్థత్యాగ జీవనముచేత నశింప జేసికొనును. ఇదియే మహిషాసుర మర్దనము.

జంతువులలో శుద్ధ అజ్ఞానముతో కూడిన పశువు మహిషము లేక దున్నపోతు. ఇట్టి దున్నపోతును బండికి కట్టినయెడల తనయిష్టము వచ్చినట్లు బండిని, బండిలోనున్న వారిని ఈడ్చుకొనిపోయి సముద్రములో ముంచును. అటు వలెనే మనుష్యుని కుండెడు ఇంద్రియములు అను తరిఫీజుకాని పొగరుబోతు గుఱ్ఱములు కళ్ళెము అను మనస్సును బానిసగా చేసికొని లక్ష్యపెట్టక విచ్చలవిడిగా విహరించి పలువిధము లగు జబ్బులకు, లోనై మనుష్యుని దేహమును బహు భంగుల దుఃఖములో ముంచివేయును. అట్టి అజ్ఞానాంధకారములో మునిగి యింద్రియ సుఖముల కొఱకై స్వేచ్ఛగా పరుగెడుచున్న మహిషాసురుడను ఇంద్రియలోలత్వమునుజయించినగాని మనుష్యునకు తరణోపాయము లేదు.

అట్టి తరణోపాయము నిమిత్తమై ఆహార నియమము సత్సాంగత్యము సద్బోధ సత్కార్యా చరణలలో తన యిచ్ఛాజ్ఞాన క్రియాశక్తులను సాధనముచేసి జయమును పొందుటకై యుద్దేశింపబడిన ఈ దుర్గాపూజయొక్క అంతరార్థమును గ్రహించి బహుకష్టపడి సంపాదించిన ధనమును ఆడంబరములయందు ఖర్చుపరపక దానిని జాగ్రతచేసి లోక సంగ్రహార్థమై పరోపకారార్థమై వినియోగించి మానవకోటిని తరింపజేసి తమరు తరింతురుగాక!

# దేవీ పూజ

## శ్రీ వస్తాదు వేంకటస్వామిగారు

వేదాంత వేద్యమగు పరబ్రహ్మము నిర్గుణము, నిష్క్రియము అవికార్యము. ఈ కారణములచేత బ్రహ్మము మాయాశక్తి లేనిది ప్రపంచసృష్టి గావింపజాలదు. కదలుటకు మెదలుటకు సైతము శక్తివంతము కాజాలదు. ఈ మాయాశక్తితో కూడుకొన్న చైతన్యమును ఈశ్వరుడని ఈశ్వరియని పేర్కొనుచున్నారు. శక్తిని స్త్రీరూపమున, తల్లిరూపమున ఉపాసించుటలో విశేషము కలదు. తల్లి ప్రేమస్వరూపిణి, తండ్రికి పుత్రునిపై ఎప్పుడేని కోపము రావచ్చును. గాని మాతృమూర్తి ఎల్లప్పుడు తన సంతానముపై ప్రేమను వర్షించుచునే యుండును. పరాశక్తిని తల్లిగా ఉపాసించి ముక్తి పొందినవారి చరితములను మనము వినుచునే యున్నాము. అందున శ్రీరామకృష్ణపరమహంసగారి చరిత్ర లోకవిదితము. ఈమహాతల్లి తన్ను అనన్యమైన భక్తితో గొల్చువారికి తన మాయాస్వరూపము నుపసంహరించి, తన సంవిద్రూపము నావిష్కరించును. మాయ (=శక్తి) పారమార్థికముగా లేకపోవుటచేత భక్తుడు ప్రసాదముచే ద్వైతబుద్ధి వదలి స్వరూపస్థానము నొందును.

శ్రీదేవి బ్రహ్మస్వరూపిణియై అవ్యాకృతరూపిణియు సూత్రాత్మరూపిణియు విరాట్ స్వరూపిణియు నగుచున్నది. ఓంకార రూపిణి యన్నను హ్రీంకారరూపిణి యన్నను ఇదియే అర్థము.

శ్రీ దేవీపూజ ముఖ్యముగా ప్రతి శుక్రవారము అనేకుల గృహములలోను ప్రతి ఆలయములోను జరుగుచునే యున్నది. శ్రీ దేవీ బాహ్యపూజ చెప్పబడి యున్నప్పటికి, యిది ముఖ్యముగా ఆభ్యంతర పూజయే యగును. తల్లి షట్కమలముల మీదనున్న సూర్య, చంద్రాగ్ని, రూపమైన మెరపుతీగవంటి యీ కళను కామాది మలవిరహితమైన చిత్తముతో ధ్యానించిరేని అట్టివారు మహదానంద ప్రవాహమున నోలలాడుచుందురు అని శ్రీ శంకరులు సౌందర్యలహరిలో స్తోత్రము చేసియున్నారు, కుండలిలో నిద్రాణముగా నున్న శక్తి సుషుమ్న నాళముగుండను షట్చక్రములగుండను సహస్రారమునకు పోయి అచ్చట ఆనందరూపమున నుండుటయే యీ సాధన పరమార్థము.



## గురుదేవుడు పాడిన గేయాలలో ఒకటి

కాళిమాతను దెలియఁగఁ గలఁ డెవండు?, జనని కల రూపు నాఱు దర్శనము లయినఁ
జూపఁగా లేవు సుం తైన; శుచిత గలుగు, నాత్మయందునె యెల్ల యానంద మొందు
పరమయోగివరుల వైన భవ్య హృదయ, ములను దేవి వెలయు నని తెలుపు శ్రుతులు;
తనదు సంకల్పమునె యూనె, తల్లి సర్వ జీవరాసుల లోపలఁ జెలఁగు చుండు,

# భ్రమయా? ప్రేమయా?

[ శ్రీ పరమాత్మానందస్వామి ]

## అద్భుతాలు

లోక మెల్ల కేల్మోడ్చి పూజించు గురువులు జ్ఞానులు భక్తులు మహాతపస్వులైన యోగులు, తమకొఱకు కాక ఒరులకొఱకు జీవించు ఉదారులు ఇట్టి పెద్దల చరిత్రలలో సంభవించినట్లు చెప్పుకొబడు చెయ్దములు పెక్కులు, అనుభూతులు పెక్కులు, దివ్య దర్శనాలు పెక్కులు అసాధారణము లనియు, ఆకళించుకొరాని వనియు మానవస్వభావమును మించిన వనియు ఇప్పటి చదువులు చదివిన చదువరులకు అనేకులకు తోచుచున్నది. వారు వానినిగూర్చి ఉమ్మడిగా మూడు రకాల తలంపులు గలిగి యున్నారు. (1) ఆచెయ్దములు అసంభవములు, ఆమహాత్ములయెడ మిక్కుటంపు భక్తియు, సులభముగ నమ్ము స్వభావమును గల వారు తమ నమ్మకముచేతను, పరిశోధనయు ఎఱుకయు లేనందుచేతను, తెలిసియో తెలియకయో కల్పనల అల్లుచుందురు. అట్టి కథలు, కాలము సాగగా సాగగా పెరిగి పర్వి ప్రాతవడి పురాణములై గౌరవము నొందుచున్నవి. వానిలో నిజము లేదు, అవి మానవస్వభావమునకు అందనివి, కావున వానిని నమ్ముట కాని, ప్రమాణీకరించుట కాని, తగదు (2) అవి ప్రకృతి విరుద్ధములైన యాచారముల చేతను సాధనల చేతను ఏర్పడునవి కావున ప్రశంసనీయములు కావు. ఒడలును నరాలును చెడి, సడలి, మామూలు స్థితి మాఱి వ్యాధిగ్రస్తులైన దశలో పెద్దలు అనుకొబడు వారి చరిత్రములలో ఇట్టివి ఉప్పతిల్లును. వీనిని చూచిన యనంతర కాలము వారు వీనినే లక్ష్యములుగ గొని, వీనిని బడయ గోరుట మతిహీనతయే అగును. (3) చాలినంత యెఱుకయు అభివృద్ధియు లేని కాలములో జరిగినట్లు చెప్పబడు నవి ఈ కాలము రాగనే పోయినవి. విజ్ఞానమును. పలు ప్రాణుల స్వభావ జ్ఞానమును, మన స్తత్త్వ శాస్త్రపరిశోధనజ్ఞానమును ముదిరిన ఈ కాలములో ఆ వార్తలు మఱుగు వడి పోవును. గ్రుడ్డినమ్మకాలను పోగొట్టి, సరియైన జ్ఞానపరిశోధనల చే ఉల్లమును వశపఱచుకొను ఈ కాలములో అసత్యమును కల్పనలును ధారాళముగ వ్యాపింప లేవు. ఈ విధముగా, జ్ఞానజీవి తోచి తానుభూతులు (1) నిజములు కావు, (2) ఒడలిస్థితియు మనఃస్థితియు చెడినప్పుడు ఏర్పడునవే. (3) ఈ కాలమున అట్టివి జరుగవు అని మూడు విధములుగ ఖండింపబడు చున్నవి. వీనిని పరిశీలించి చూతమనుటే మా సంకల్పము.

## కొన్ని ఉదాహరణాలు

శ్రీరామకృష్ణుడు గంగనుగూర్చి ఎన్నో సార్లు ఇట్లు చెప్పి యున్నాడు ''గంగాజలము బ్రహ్మమువలె పవిత్ర మైనది. గంగగట్టున జీవించు నేని అజ్ఞేయవాదికి సైతము భక్తి కలుగును. గంగాశీకరములతోడి గాలులు వీచు తావు లెల్ల పవిత్రక్షేత్రములే. ఆచోట్లలో ఉండు జీవులు ఎట్టి సాధనయు లేక జ్ఞానోద

## శ్రీ రామ కృష్ణుడు
### ఒక శిల్పి దృష్టిలో
సంపలాల్బోస్



గంగగట్టున నిలుచున్న శ్రీరామకృష్ణుడు



బండిలో కలకత్తాకు పోవుచున్న శ్రీరామకృష్ణుడు




పంచవటిలో శ్రీరామకృష్ణుడు




దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణుడు



దివ్యభావోద్రేకమున నర్తించుచున్న శ్రీరామకృష్ణుడు

పప్పు దంపకపు యంత్రము బోధించు జ్ఞానపాఠము



కామార్పుకురులో శ్రీశారదాదేవియు వసమండుగుల సఖులును



పితృభావనచే దోపిడివాని కటికగుండెను కరగించుచున్న శ్రీశారదాదేవి



గోపాలు నెత్తుకొని పక్షివేశ్వరమునకు వడిగా పయనించుచున్న గోపాల్మా



దివ్యశిశువుతో గోపాల్మా




తల్లితో కట్టెలేరుచున్న గోపాలుడు




అమ్మ వెతలనెల్ల దీర్చుచున్న గోపాలుడు

యము గాంతురు. పాపులు కూర్చున్న చోటును పవిత్ర మొనర్ప వలె నన్న అక్కడ గంగా నీటిని చల్లు మందురు. ఐహిక ప్రసంగము కావించిన నోటిని పవిత్రీకరించుకొన గంగాతీర్థమును గ్రోలు మందురు". ఈ భావాలకును ఈ చేతలకును ఆధారము శ్రీరామకృష్ణునికి గలిగిన గంగా దివ్యదర్శనానుభవమే. శ్రీరామకృష్ణుడు భజనను నామసంకీర్తనను చేయునప్పుడు మైమఱచి భక్తిసమాధినొంది ఆనందతాండవమాడును, తనతో చేరి పాడి యాడు భక్తులను కూడ ఆనందోన్మాదమున నిమగ్నులనుగా చేయును. దీనిని పండితులును పామరులును, పెద్దలును పిన్నలును ప్రత్యక్షముగ చూచి యున్నారు. శ్రీశారదాదేవి తన పదుమూడవ యేట పెనిమిటింటి వెనుకవైపు ఉన్న కోనేటిలో స్నానము చేయుటకు ఒంటరిగా పోవలసి వచ్చెను. ఒంటరిగ ఎట్లు పోగలనని ఇంచుక సంకోచపడగనే ఎనమండుగురు సఖులు ప్రత్యక్షమై నలుగురు ముందువైపును నలుగురు వెనుకవైపును అమ్మను పరివేష్టించి పిలుచుకొని పోయి స్నానము చేసి చేయించి యింటికి తిరిగి వచ్చిరి. ఆట్లు వారితోడుతో స్నానమాడుట అనునది అమ్మ కామార్పుకూరులో ఉన్నన్నాళ్లును జరిగినది. వారు దేవియొక్క యెనమండుగురు సఖులను సంగతి తర్వాత తెలిసినది. తర్వాత ఒకనాడు శ్రీశారదాదేవి ప్రొద్దుక్రుంకి చీకటి వ్యాపించు చున్న వేళలో దొంగలుండు ప్రాంతమునకు సమీపపు మైదానము మీదుగ ఒంటరిగ పోవలసి వచ్చెను. ఒక దొంగ ఒంటరిగ అట' అగపడి అమ్మను అదల్చి "ఎక్కడికి పోవుచున్నావు? నిలు" అన్నాడు. అమ్మ అట్లే నిలువగా దొంగ స్థిమితముగ అమ్మ మోమును జూచెను. వెంటనే హృదయపరివర్తనమై "భయపడవలదు, నా భార్య వెనుకవైపు వచ్చుచున్నది" అనెను. అతని భార్యయు వచ్చెను. ధైర్యముతో అమ్మ దొంగను జూచి "దారి తప్పిన నన్ను, నాయనా, ప్రక్క ఊరికి పిలుచుకొనిపో" మ్మని ప్రార్థింపగా, ఇద్దఱును మాతృప్రేమకంటె అధికప్రేమతో అమ్మను పిలుచుకొని పోయి చేయ వలసిన సాయముల నెల్ల చేసిరి. అంతే కాదు. అమ్మను తమ గారాబుకూతుగా నాటినుండి ఆదరింప జొచ్చిరి. ఇట్లు తండ్రిగా మారిన ఆదొంగ కంటికి, అమ్మ సాక్షాత్కాళీదేవిగా కనిపించినదందురు. అఘోరమణీదేవి అను విధవ యైన యొక బ్రాహ్మణ తరుణి కృష్ణుని తన శిశువుగా భావించుసట్టి భక్తి నిష్టపడి, ముప్పదిసంవత్సరములుగ జపధ్యానములను చేయుచు వచ్చెను. 1885 వ సంవత్సరమున ఒకనాటి వేకువన 3 గంట లప్పుడు ఆమె జపముచేయ తొడంగగనే శిశురూపమున గోపాలుడు ఎదుట దోగాడుచు వచ్చి వెన్న నిమ్మని ఆవృద్ధను అడిగినాడు. మఱునాడు అఘోరమణీదేవి గోపాల శిశువును చేత నెత్తుకొని భుజములపై కెక్కించుకొని శ్రీరామకృష్ణునొద్ద కేగెను. ఆ గోపాల శిశువు తనచేతనుండి శ్రీరామకృష్ణునిలో చొచ్చుటను అచటి నుండి మరల తన చేతికి వచ్చుటను ఆమె ప్రత్యక్షముగ చూచినది. తర్వాత శిశువుతో తన యింటికి చేరుకొనెను. అటుపిమ్మట గోపాలుడు అమ్మతో సదా క్రీడింప సాగెను. ఆమె నూలు వడకునప్పుడు ఆపనిని బాగుగ సాగించెను. మఱుదినము ఆమె వంటకు కట్టె లేరుకొన పోయినప్పుడు ఆమెకు తోడ్పడి కట్టె లేరినాడు. ఇట్లు ఆమె రేయుంబగళ్లు నిరంతరము ఆబిడ్డతో ప్రొద్దుపుచ్చుచుండెను. (పైని పేర్కొనబడిన అద్భుతా

లను మఱికొన్నింటిని శ్రీనందలాల్ బోసు అను సుప్రసిద్ధచిత్రకారుడు చిత్రించి ఉన్నాడు. ఆ చిత్రాలను ఈసంచికలో చూడ వచ్చును).

## అవి అసంభవములా!

(1) దివ్యత్వము నెనసిన పెద్దల జీవితాలలో అగపడు దివ్యదర్శనాలును అనుభూతులును దివ్యప్రేమయు భారతదేశములో మాత్రమే కాదు తక్కిన యన్ని దేశాలలోను, ఒక కాలములో మాత్రమే కాదు అన్ని కాలములలోను సంభవించునవే అనుట ప్రపంచచరిత్రపరిశోధకులకు సుగ్రహమైన సత్యమే. శీలసంపన్నులును పరమపవిత్రులు నగు పెద్దలు, మాట తప్పని వారు ఆయనుభూతులను నోరార చెప్పుచున్నారు, వానిని అసత్యము లని త్రోసివేయ ఎవరు సాహసింతురు? వారు భ్రాంతిపరవశులై అట్టి దర్శనాలను కన్నా రందురా? వారు తమ జీవితకాలములో ఇతరుల భ్రాంతులను పోగొట్టి స్వచ్ఛజ్ఞానమును పలువురకు గలిగింప సమర్థులుగ ఉండిరే, అ దెట్లు సాధ్యపడినది? ఉన్నతోన్న తానుభూతులను కన్న వారును తమ యనుభూతులను తామే మొదట నమ్మకుండి, గురూపదేశముతోను శాస్త్రగ్రంథములలో వ్రాయబడి యున్న పూర్వసాధకుల యనుభూతులతోను పోల్చి చూచి మూడును ఒకటే విధముగ నుండుటను కనిన పిమ్మటనే సందేహము తీఱి నెమ్మది నొందిరి. ఇందుకు శ్రీశుకబ్రహ్మర్షియే అగ్గమైరే. మనవలెనే, దేనిని గాని బాగుగా శోధించిన పిమ్మటనే నమ్మునట్టి వారలు ఆ పెద్దల కాలమున ఉండియుండ రని అన గలమా? శ్రీరాముడు శ్రీకృష్ణుడు, శ్రీక్రైస్తు, శ్రీబుద్ధుడు, మున్నగువారి చెయ్దములను ఆయాకాలములలోనే పలువురు ఖండించి రనుట చరిత్రమునుండి తె. చున్నది. శ్రీరాముని నడవడిని ఒక చాకలవాడుసైతము తెగడి మాటాడినాడు. ఆనిందను పోగొట్టుకొనుటకై ఆయన సీతను అడవికి పంపివేసెను గదా! దుర్యోధనుడు శ్రీకృష్ణుని విశ్వరూపమును ప్రత్యక్షముగ చూచియు నమ్మక అది ఇంద్రజాల మన్నాడు గదా! శిశుపాలుడు శ్రోతల చెవులకు దుర్భరములైన దూషణలను శ్రీకృష్ణుని మీద వీచినాడు కదా! శ్రీయేసునాథుని సిలువపై చంపిరి కదా! ''నొసటికంటిని తెఱచినను తప్పు తప్పే'' అన్నాడు భక్తనత్కీరుడు. సందేహ మనునది ఏకాలమునైనను ఏదేశమునైనను ప్రజల మనస్సులో కలుగునదే. పూర్వకాలమువారును అందులకు తప్పరు. (2) ఉత్తమజ్ఞానగురువులు తమ్ము జ్ఞానమునకై ఆశ్రయించువారికి ఉపదేశించునదెల్ల 'మా ఉపదేశాల సత్యమును సాధనచేతను శోధనచేతను పరీక్షించి కనుగొను' డనియే. బుద్ధుడు తన శిష్యులకు ఎన్నో సార్లు ''ఎంత పెద్దలను కాని ఎంతగా కొనియాడబడు శాస్త్రమును గాని పరిశోధింపక నమ్మకుము'' అనియే బోధించి యున్నాడు. ''దుఃఖము తొలగి మరణము లేని నిత్యజీవితమును బొందు దారిని నేను కనుగొంటిని, దానిని అనుసరించి పోయి ఆనందమును గాంచుడు'' అనియే ఋషులు ఆర్తముతో ఇతరులను పిలుతురు. వారు మనకు బోధించునది, మంత్రము కాదు, వేదార్థము కాదు, నమ్మితీరవలసినది కాదు, వారే మనలను 'శోధించి నిజపఱచుకొండి' అని వేడుచున్నారు. (3) మనుష్యస్వభావమును మించి ఉన్నందున ఆ కథలు సత్యములు కావు అందురు కొందఱు. మనుష్యునకు స్వాభావికము కాదు అనుటకు ముందు మనుష్యస్వభావంపు లోతు

ఇంత అని సరిగా తేల్చుకొన్నారా? సామాన్యమైన మెట్టునకు పై మెట్టుగా నడచుకొనువారే పెద్దలు, వారును ప్రజలవంటివారే. కావున సర్వత్ర కనిపింప దగిన అనుభూతు లొకవర్గము వారియొద్దమాత్రమే అరుదుగా కనిపించినను వానిని ఒకమూలకు త్రోసివేయుట పరిశోధనకు అందము కాదు. సత్యాన్వేషణమునకు అది అవద్యకరము కదా. మానవతత్త్వమున కడుగున దివ్యత్వము చొచ్చుకొని యున్నది. దానిని సాధనామూలమున వెలువఱుప వచ్చును అని వారు అనుభవమునుపట్టి చెప్పునది నిజమే ఐనచో, మనుష్యులయొద్ద అట్టి సంభవాలు కననగుటలో విపరీతము ఏమియు లేదు కదా!

## స్వస్థతతప్పినందున గలుగునవా అవి?

దేహమనఃస్థితులు చెడినందులకు అవి తార్కాణములా? దేహస్థితియు మనఃస్థితియు చెడిన వారియొద్ద కనిపించు నడవడులవంటివి గానే జ్ఞానుల నడవడులు పైకి కనిపించినంత మాత్రమున జ్ఞానులకు దేహమనఃస్థితులు చెడిన వనుట పొసగదు. ఒకదాని కొకటి విరుద్ధములుగ నుండు కొన్నింటి చేష్టితములు పైకి ఒకటే విధముగ కనిపించినను, స్వరూపమున అవి వేఱే అనుట లోకానుభవము. మితి మించిన సుఖము వలనను కొలదిమీఱిన దుఃఖమువలనను మానవునకు మరణము గలుగును. మిగుల సన్నని శబ్దమును మిగుల పెద్దశబ్దమును వీనులకు వినిపింపవు. మిక్కిలిగ ప్రకాశించు వెలుగును అత్యల్పమైన వెలుగును కంటికి కనిపింపక పోవును. తీవ్రసాధనారూపమైన సమాధిదశయు ప్రాణరహిత మైన యొక రాయి ఉండు తీరును ఒకటిగానే అగపడును. కావున స్వరూపమును పరిశీలింపక పైకి ఒకటిగా కనిపించున వెల్ల ఒక్కటే అనుట సత్యదూరము. జ్ఞానులు వెఱ్ఱివారిని పోలియు భూతావిష్టులను పోలియు శిశువులను పోలియు ప్రవర్తింతు రని జ్ఞానశాస్త్రాలే ఘోషించుచున్నవి. కాని వారికిని వీరికిని పర్వతపరమాణ్వంతరము. జ్ఞానసాధనను చిరకాలము సాగించువారును, భగవచ్చింతలోనో భక్తిలోనో నిమగ్నులగువారును, నరాలరోగాలకును వెఱ్ఱికిని లోనగుదు రని విద్వాంసులును భ్రమింతురు. దీని ప్రసంగము శ్రీరామకృష్ణు నెదుట ఒకనాడు వచ్చినది, అప్పుడు ఆయన ఇట్లన్నాడు — వ్యథలకును దుఃఖమునకును లోనగు జడలోకవస్తువులనుగూర్చియే సదా తలంచు చుండు మీకు వెఱ్ఱి లే దనుచున్నారు. రాత్రింబవళ్లు అనవరతము శాంతినిలయ మైన అఖండచైతన్యసాగరమును ధ్యానించుటలో మునిగి యుండు నాకు వెఱ్ఱి ఉన్నది అనుచున్నారు. జ్ఞాననిలయ మగు చైతన్యమును చింతించువారి జ్ఞానము చెడు ననుట యుక్తియుక్తమా?" మఱొక సారి జ్ఞానసాధనయందలి సక్తిచేతనే తనకు ఐహికకార్యాలలో విస్మృతి గలిగిన దని తలంచిన యొక యువకునితో శ్రీరామకృష్ణుడు — "అదెట్లు? భగవచ్చింతతో మొలకు వస్త్రధారణమును సైతము మఱచువాడను నేను. కాని కలకత్తాకు బయలుదేఱునప్పుడు నాసంచి తువాలా మొద లైన వానిని తెచ్చుకొనుటకు ఒకదినమైనను నేను మఱచుట లేదు. రవంత జపము చేయగనే మీకు మఱపు గలుగుచున్నదా?" అని తెలియజెప్పినాడు. పారమార్థికజీవితమున నిజముగ ఆసక్తికొనువారికి మనఃప్రసాదమును ప్రబోధమును ఔత్సుక్యమును హెచ్చుచుండును. తప్పుదారిలో గురుసహకారము లేక యోగము నభ్యసించువారికి బుద్ధి చెడుటయు, నరాల

నొప్పియు వ్యాధి కల్గుటయు సుసంభవములే కాని సరియైన దారిలో సాధన చేయువారికి సిద్ధి తప్పక వర్ధిల్లును. మనోనిగ్రహమును ఆరోగ్యమును తమంతట కలుగును. జ్ఞానమార్గమున సరియైన సాధన చేయువారికి దైవోన్మాదమో జ్ఞానోన్మాదమో కలుగును గాని, లోకులు చెప్పు వెఱ్ఱి కలుగదు. బుద్ధిప్రసాదమును శాంతియు ఆనందమునే జ్ఞానోన్మాద లక్షణాలు. అవతారపురుషులం బోని పెద్దల చరితములో వారిప్రేమను లోకులు చిత్తభ్రమ అనుకొని వ్యాధియో పిశాచచేష్టితమో అని వెఱచి చికిత్స చేయబూనుకొని రని వినియున్నాము కాని దయ్యాలను పాఱద్రోలుటలో నిపుణులును వైద్యశాస్త్రవేత్తలును ఆ పెద్దల దశను పరిశీలించి తమ చికిత్సలు పనికి రా వనియు వారి అసాధారణచేష్టితాలకు కారణములు దయ్యాలును కావు రోగాలును కావు అనియు నిస్సందేహముగ చెప్పియున్నారు. దీనినిమనము కనియున్నాము.

అంతే కాదు. జ్ఞానమార్గాన పెంపొందు వారికి ఒడలును మనస్సును రాను రాను మెరుగెక్కి సూక్ష్మమైన మేలిమి దశ నొంచును. ''జ్ఞానానుభూతియో ప్రేమభక్తియో కలుగునప్పుడు దివ్యప్రబోధప్రవాహవేగమును ఆపుటకు శుద్ధసత్త్వమయ మైన యొడలికే శక్తి యుండును. అట్టి దేహము కూడ మొదట మొదట పలుమార్లు దాని నోర్వ లేక గాసి చెందుటయు, బాధ నొందుటయు, గలదు, తర్వాత అలవడగా అలవడగా, వాని నోర్చుట సులు వగును సహజ మగును'' అని చెప్పును శ్రీరామకృష్ణుడు. కావున, లౌకికవాంఛలకు ఉపయోగపడు ఒడలును మనస్సును నరాలును ఉన్నతానుభూతులవలన గలుగు సంక్షోభము నోర్వ లేక అల్లాడును. కావున జ్ఞానానుభూతి నొంద గోరువారు చాల శ్రమపడి బ్రహ్మచర్య వ్రతముచేతను ఇంద్రియదమముచేతను నిస్సంగత్వముచేతను గలుగు పవిత్రతను దార్ఢ్యమును సౌక్ష్మ్యమును ఒడలికిని మనస్సునకును గలిగించుకొందురు. అనుభూతి వర్ధిల్లుటకు పవిత్రతయు సూక్ష్మతయు చాల జరూరు. లేకున్న, అనుగ్రహముచే అనుభూతి గలిగినను, ఒడలును మనస్సును తట్టుకొన లేవు, నరాలవ్యాధులు అగపడును. ఈ వికారాలు, ఆహారనియమము చేతను మనస్సును సత్త్వదశలోనే నిలుప నభ్యసించుటచేతను, కొన్నాళ్లకు అదృశ్యములగును.

కేశవచంద్రసేన్ అను బ్రాహ్మసమాజ నాయకుడు రోగగ్రస్తుడుగ ఉన్నప్పుడు, అతనిని చూడబోయిన శ్రీరామకృష్ణుడు అతనితో అతని వ్యాధినిగూర్చి ఇట్లనెను — ''నీకు ఈ వ్యాధి ఏల? అందుల కొక కారణము ఉన్నది. ఎన్నో జ్ఞానానుభూతులు మీయొడలిగుండ పోయి యున్నవి. కావున అది రోగగ్రస్తమై ఉన్నది. ఒక మహానుభవము గలిగినప్పుడు అందుంగూర్చి మనకు తెలియవచ్చునది స్వల్పమే. అందువలన దేహమునకు తగులు దెబ్బ చిరకాలమునకు పిమ్మటనే గుర్తింపబడును. పెద్ద పెద్ద పొగనావలు గంగలో పోవుటను చూచి యున్నాము. అప్పుడు వాని పోకను గమనించుటకు హేతువు ఏమియు ఉండదు. కొంత సేపైన పిమ్మట కెరటాలు గట్టు కేసి మోదునప్పుడు ఎంత పెద్ద ధ్వని వినబడును! ఒక్కొక్కసారి అందుచే గట్టులో ఒకభాగము తెగి ప్రవాహములో కలిసి పోవుటయు గలదు.

ఒక యేనుగు ఒక గుడిసెలో చొచ్చినప్పుడు లోపల నాశము చేయును. తుదకు గుడిసెను పెల్లగించి కూలద్రోయును. దివ్యభావనాదశ

అను ఏనుగు ఈ యొడలిని చొరునప్పుడు, దానిని పిండికొట్టును. ఏమి జరుగునో ఎఱుగుదురా? ఒక యిల్లు నిప్పంటుకొన్నప్పుడు మొదట లోపల ఉండు కొన్ని వస్తువులు కాలిపోవును. తర్వాత పెద్ద మంట లేచును. అట్లే జ్ఞానాగ్ని మొదట పారమార్థికజీవితమునకు విరుద్ధము లగు కామక్రోధాదులను నిర్మూలించును. నశించు వంతు అహంకారాదులకు, తర్వాత వచ్చును. ఇంతలో ఒడలియందు తీవ్రవ్యథలు అనుభవగోచరము లగును.

అంతయు ముగింపునకువచ్చుచున్న దని నీవు అనుకోవచ్చు. కాని బాధ రవంత బాకి ఉన్నను దేవుడు నిన్ను విడిపింపడు. ఆస్పత్రిలో నీవు నీ పేరును వ్రాయించుకొంటి వేని, అక్కడినుండి నీవు వెలువడ లేవు. వ్యాధి పూర్తిగ గుణమగు వఱకు రోగులు వైద్యశాలనుండి వెలువడుటకు అనుమతి లభింపదు. నీవు ఆస్పత్రిలో నీ పేరు ఏల వ్రాయించుకొంటివి? . . .

మంచువలని పూర్తి లాభము పొందుటకై తోటమాలి శాస్రారోజా చెట్టు అడుగున ఉన్న మట్టిని వేరులవఱకు తోడి ఎత్తును. ఆ చెమ్మ వలన ఆ లత మెఱుగుగా వర్ధిల్లును. అటువలననే కాబోలు నీయందు సైతము వేరులవఱకు సంక్షోభము గలుగు చున్నది. నీవు మరల వచ్చినప్పుడు అద్భుతకృత్యములు సాధించెడివాడవు కావచ్చును.

ఇంటి లోపలి భాగమున చాల సేపు ఉండకుము. స్త్రీలనడుమ ఉంటి వేని నీ దేహపరిస్థితి నానాటికి తీసిక ట్టగును. భగవద్విషయప్రసంగములు మాత్రము వినుచుండు వేని నీ దేహపరిస్థితి మేలొందును''.

ఈ సంభాషణను బట్టి ప్రేమవలనను, ఆత్మజ్ఞానమువలనను గలుగు బాధలకును, దేహమనఃపరిస్థితులు చెడుటవలన గలుగు వ్యాధులకును ఉన్న భేదము స్పష్ట మైనది. ఆ బాధలు నయము కావలె నన్న, మనశ్శుద్ధియు, సత్త్వపూర్తియు, సత్సంగతియు, ఐహికాసక్తివర్ధకములను వర్జించుటయు, సాధనాభ్యాసమును కావలెను. ఈ వ్యాధులు నయము కావలె నన్న, బలకరాహారమును, మందును, అపథ్యవర్జనమును, దేహ మన స్సుస్థితి సాధక నియమానుసరణమును ఆవశ్యకములు. జ్ఞానహేతుక మైన బాధ అనుభవించునప్పుడు, ఆనందమును శాంతియు మనఃప్రసాదమును తిరములుగ ఉండును. సుస్థితి తప్పుటచే వచ్చు వ్యాధి దుఃఖమునే కలిగించును, జ్ఞానమును కలచును, శాంతిని కూల్చును. శ్రీరామకృష్ణుడు అతిసార వ్యాధిచే బాధపడుచుండినప్పుడును కోట్లకొలది చీమలు బుఱ్ఱను కొఱికితినుచున్న ట్లనిపించినప్పుడును ఆనందోన్మాదమును పారమార్థిక సంభాషణయు రేయుంబవళ్లు సాగుచునే ఉండినవి. (సశేషము)



''అజ్ఞులదృష్టికి దేవి నిక్కముగ సంహారకారిణియే. కాని శ్రీరామకృష్ణునకు ఆమె దయావాత్సల్యభరిత అగు మాతృమూర్తియే. ఆమెకంఠమును జుట్టి పుర్రెల దండ ఉన్నది. నడుముచుట్టును నరుల హస్తాల ఒడ్డాణము ఉన్నది. ఆమె చేతులలో రెంటిలో మారణాయుధాలు ఉన్నవి. ఆమె నేత్రాలు నిప్పులు గ్రక్కుచు ఉండును. ఐనను శాశ్వతత్వమునకు వి త్తనము ఆమెయే, ఆమె యూపిరి తాకడు ప్రణయ శిశిరము. అదే వింత!''

నిఖిలానందస్వామి

# బ్రహ్మానందస్వామి

## శ్రీ సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు

ఒకనాడు శ్రీరామకృష్ణునకు ఒకదివ్యదర్శనము గలిగెను. అప్పుడు అతని శరీర మంతయు కంపించెను. లోకమాత ఒకపిల్లవానిని ఆయనకు జూపి, వా డాయన కుమారు డని వచించెను. వివాహితు డయ్యు శ్రీరామకృష్ణుడు నిశితబ్రహ్మచర్యమునే అవలంబించియుండగా, కుమారు డేమి? ఆ ఆలోచనయే తనకు మృత్యుతుల్యముగ నుండెను! అప్పుడు లోకమాత తనబిడ్డను సమాశ్వసించి, ఆ బిడ్డ ఆయనకు ఆధ్యాత్మికసంతాన మగును గాని, లౌకికార్థమున కుమారుడు గా నోప డని చెప్పెను. శ్రీరామకృష్ణున కంతట ధైర్యము కలిగెను. పిమ్మట, సన్న్యాసాశ్రమమున బ్రహ్మానందస్వామి యన బరగిన శిష్యుడు తనవద్దకు వచ్చినప్పుడు, శ్రీరామకృష్ణుడు తాను దివ్యదృష్టిలో జూచిన పిల్లవా డాతడే అని వెంటనే గ్రహించెను.

ఆపిల్లవానిపేరు రాఖాల్‌చంద్రఘోష్, వంగదేశములోని ఒకధనికకుటుంబమునకు జెందిన వాడు. అతనితల్లి దైవభక్తి గలిగినది. అతనిపుట్టుక 1863 సం॥ జనవరి 21–వ తేదీ నాడు. రాఖాలునకు ఐదేండ్లకే తల్లిపోయెను. అతనినిజూచిన మాత్రముననే ఎల్లరును ప్రేమించుచుండిరి. మంచి తెలివితేటలు. జీవితమం దెన్నో విషయములం దతని కభిరుచి గలదు. బాల్యమునందే తరుచు కాళికాలయమున కేగును. దైవభక్తి ఎక్కువ. భక్తిగీతములను వినునపుడు తన్ను తాను మరచును.

1875 లో కలకత్తాకు ఆంగ్లవిద్యాభ్యాసమున కేగెను. అతని వాడలోని బాలకుల నాయకు డగు నరేంద్రనాథుని (పిమ్మట వివేకానందస్వామి) కలిసికొనెను. నరేంద్రుడు ఎక్కువ చురుకుతనము కల వాడు; పుట్టుకచేతనే నాయకుడు; రాఖాలో, సాధువు; కావున, నరేంద్రుని అనుచరు డయ్యెను. వీరిరువురి నడుమ ఎక్కువ స్నేహ మేర్పడి, దీని ఫలితముగ ఇరువురును శ్రీరామకృష్ణుని శిష్యులగుట జరిగెను.

నరేంద్రుడే రాఖాలుని బ్రహ్మసమాజమునకు దీసికొని వెళ్లెను. ఆరోజులలో రాఖాలు జీవితరణముల రహస్యములను గూర్చి దీర్ఘాలోచన జేయ నారంభించెను. శాశ్వత వస్తువును సిద్ధింపజేసికొనుట కతని మనస్సు పలవరించెను. అతడు ప్రజ్ఞాధురీణుడు, సునిశితబుద్ధిగలవాడు, కాని అతనికి బడిచదువులో అభిరుచి పూర్తిగా అంతరించెను. చదువు విషయములో అతనికి గల యుపేక్షను జూచి తలిదండ్రులు అలజడి నొందిరి. చివర కతనికి పెండ్లి జేసిరి. కాని, విధివశమున, ఈ వివాహ ఫలితముగనే రాఖాలునకు శ్రీరామకృష్ణునితో సంబంధము గల్గుటయు, తత్ఫలితముగ నాతనిజీవితమే మారిపోవుటయు జరిగెను.

అతడు తన బావమరిదిచే శ్రీరామకృష్ణుని వద్దకు గొంపోబడెను (1881). రాఖాలు ఆయనకు నమస్కరించి నపుడు, ఆయన ఆనందపులకితాంగు డయ్యెను. ఆయన ఆపిల్లవాని

యెడల ఎంతో వాత్సల్యమును జూపెను. ఇంతటి ప్రేమను మ రెవరును అతనియెడ జూపి యుండ లేదు.

పిమ్మట రాఖాలు తరచు దక్షిణేశ్వరమునకు వెళ్లుచు, ఒక్కొక్కతరి యచట నివసించుచుండెనుగూడ. యువకుడయ్యును, గురుదేవుని యొద్ద నాలుగైదేండ్ల బాలునివలె మారిపోవుచుండెను. ఆయనవద్ద తాను గోల్పోయిన మాతృప్రేమ లభించెను, శతాధికముగ! ఆయన రాఖాలును బిడ్డవలె గాపాడుచుండెను. చనవుకొలది రాఖాలు అవిధేయతగూడ జూపును! కాని రాఖాలు గురుశుశ్రూషను చాల జాగ్రత్తగనే చేయుచుండెను. ఏ కుమారుని కన్నను గూడ ఆయనను ప్రేమించి, కొలిచెను. ఆయనసమాధిలో నున్నపుడు ఆయన శరీరమును జాగ్రత్తగా కాపాడును.

రాఖాలునితండ్రి తన పిల్లవాని పోకడను నివారించుటకై నిర్బంధములో గూడ నొకసారి యుంచెను. కాని అతడు తప్పి, దక్షిణేశ్వరమునకే పరుగిడెను. గురుమహారాజాతనికి ఆధ్యాత్మికబోధనలను జేయు చుండెను గూడ. వేడుకకు గూడ నబద్ధమాడరాదని శిష్యుని శ్రీరామకృష్ణుడు హెచ్చరించెను.

ఒకసారి గురుదేవుడు తన్మయత్వమున నున్నపుడు రాఖాలునకు శ్రీకాళికాదర్శనము నను గ్రహించెను. ఆతడు దక్షిణేశ్వరమునందే యుండి పోయెను. తఱచు సమాధియం దుండును. తఱచు పరమాత్మునితో ఐక్యము నందును. రాత్రింబవళ్లు 'పవిత్రనామము'ను స్మరించును. శిష్యుని గాంచి గురుడు తన్మయస్థితి (ఎక్స్టసీ) లోనికి దిగిపోవును. ఇటువంటి శిష్యరత్నము దొరకెనను సంతోషముచే గురుదేవుడతనికి యోగసూత్రములను, యోగసాధనలను—పరమరహస్యమైనవి—బోధించును.

కాని ఆధ్యాత్మికసాధన యనిన ఆట గాదు. ఒకనాడు రాఖాలు ధ్యానమునందు దిగుటకు ఎంత ప్రయత్నించినను, నిష్ఠ కుదుర లేదు. అతని ప్రాణము విసుగెత్తెను. అపుడు గురుదేవుడాతని నాలుకపై ఏదో వ్రాసెను. అపుడు శిష్యుని మనస్సునుండి ఒక పెద్ద బరువు సడలెను; ఆనందము ప్రజ్వరిల్లెను.

తరువాత కొంతకాలమునకు రాఖాలు ఆరోగ్యము చెడెను. తఱచు జ్వరబాధ గల్గెను. గురుదేవుడు చాల బెంగపడెను. ఏలయన పూర్వజన్మములలో నొకదానియందు రాఖాలు శ్రీకృష్ణునిచెలికాండ్రలో నొకడని గురుదేవుడొక దివ్యదర్శనముతో తెలిసికొని యుండెను; అట్టిజీవి, పూర్వజన్మస్మృతిగలిగి, తనశరీరమును త్యజించునేమో! మూడు నెలల తరువాత రాఖాలున కారోగ్యము గలిగెను.

శ్రీరామకృష్ణుని వ్యక్తిత్వముచే నాకర్షింపబడిన భక్తులయొక్కయు, యువకశిష్యుల యొక్కయు సంఖ్య హెచ్చుచుండెను. ఈయువకులలో కొందరు రాఖాలుని ప్రాతస్నేహితులే. కాని కొంతకాలమునకు గురుదేవుడు తీవ్రవ్యాధివాత బడెను. నరేంద్రుని నాయకత్వమున రాఖాలును, ఇతరులును గురుదేవుని సంరక్షించుచుండిరి. దానితోబాటు తీవ్రమగు నాధ్యాత్మిక సాధనలను గూడ జేయుచుండిరి. రోజురోజుకు రాఖాలు ధ్యానతత్పరుడగుచుండెను. ఒకనాడు గురుదేవుడు నరేంద్రునితో నిట్లనెను: "రాఖాలునకు ఒక పెద్ద రాజ్యమేల తగిన వివేకమును, సామర్థ్యమును గలవు". నరేంద్రునికి దీనియంతరార్థము తెలియును. సమయము వచ్చినపుడు, రాఖాలునే (బ్రహ్మానంద స్వాములనే) రామకృష్ణమిషన్ ప్రథమాధ్య

క్షుని జేసెను! గురుదేవు డింకను జీవించి యుం డగానే, రాఖాలును 'రాజా' యని అందరు పిలువ నారంభించిరి.

1886 సం॥ ఆగస్టు 16-వ తారీఖునాడు శ్రీరామకృష్ణుడు సిద్ధి నొందెను. అపుడు రాఖాలు ఇతరశిష్యులతో బాటు బారానగర మందలి సన్న్యాసిమఠమును జేరెను. పిమ్మట వారందరు లాంఛనముగ సన్న్యాసదీక్షను గైకొనిరి. రాఖాలు 'బ్రహ్మానంద' అను పేరును దాల్చెను. కాని తోటి శిష్యు లాతనిని 'రాజా' అనియే సంబోధింతురు!

బారానగరములోని జీవితము, కఠిన తాపసిక జీవనము, అవాఙ్మానసగోచరుని తెలియు ప్రయత్నములో వా రుండిరి. ఆహారవాంఛయే లేదు. మఠజీవితముగూడ సంకుచితముగ దోచి, విశాలప్రపంచములోనికి వెడల సాగిరి. బ్రహ్మానందస్వామి పూరీక్షేత్రమున కేగెను. భిక్షచే జీవనము; నిరంతర భగవద్ ధ్యానము. గురుదేవుని కత్యంతప్రియతము డగు బ్రహ్మానంద స్వామి కష్టపడుటను జూచి యితరులు సహింపలే కుండిరి. పిమ్మట బ్రహ్మానందస్వామి బారానగరమునకు,—మఠమునకు— మరలెను. ఇంకను కఠినతపస్సు నొనరించుటకై ఉత్తర హిందూస్థానమున కాయన కొంతకాలమునకు వెళ్ల నిచ్చగించెను. ఆయన సంరక్షణకై వివేకానందస్వామి (నరేంద్రుడు) సుబోధానంద స్వామినిగూడ పంపించెను. ఈ సంచారములో నర్మదానదీతీరమున తపస్సు జేయునపుడు బ్రహ్మానందస్వామి ఒకసారి ఆరురోజులపాటు తన్మయావస్థలో నుండి పోయెను.

స్వామి ఎట్టి వస్తువును గైకొన నిచ్చగింపరు. బృందావనములో వారు కఠిన మగు ఆధ్యాత్మికసాధనల నొనర్చిరి. కూడ నున్న సుబోధానందస్వాములతో గూడ మాట్లాడుట అరుదు. ఒక్కొకసారి భోజనమే యుండదు.

బ్రహ్మానందులు బృందావనములో నున్నపుడు అమెరికాలో వివేకానందుని దిగ్విజయమునుగూర్చి వినిరి. 1894 లో స్వామిజీ ఆలంబజారులోని మఠమునకు మరలిరి. తమ మఠము ద్వారా గురుదేవుని దివ్యసందేశమును ప్రచారము గావింప గోరెను. ఆయన తన 'గురుభాయీ (తోటిశిష్యు) లతో నిట్లు నుడివెను: "మీ జీవితములు, మీ మఠము, అలసిన వారికిని, చింతాభరితులకును సమాశ్వాసనములుగను, ఆశాజనకములుగను, ఉద్బోధకరములుగను నుండ గలవు. మీజీవితములను దీని కను వగు రీతిని నడపుడు".

రామకృష్ణసన్న్యాసిగోష్ఠిని(బ్రదర్‌హుడ్) పటిష్ఠ మొనర్చి, తన పరిమితిలేని శాంతముతోను, ఓర్పుతోను, అసాధారణప్రపంచజ్ఞానముతోను, వివేకముతోను, వివేకానందుని దివ్యసందేశమును భారతమునందు జయప్రద మొనరించెను. బ్రహ్మానందులు వివేకానందుని 'మిత్రుడు, బోధకుడు (ఫిలాసఫర్), మార్గదర్శి'. అతని ఆరోగ్యమును కాపాడెను; సలహాల నిచ్చెను; ప్రయాణపువివరముల నిర్ణయించెను; అతని ఆదర్శముల ననుష్ఠానమునకు దీసికొని వచ్చెను. రామకృష్ణమిషన్ (ప్రచారక) సంఘము స్థాపింపబడినపుడు, వివేకానందుడు దాని 'జెనరల్' అధ్యక్షు డయ్యెను; బ్రహ్మానందుడు కలకత్తాకేంద్రమున నధ్యక్షత వహించెను. కాని 1902 నుండి బ్రహ్మానందుడే తన జీవితాంతమువరకు ప్రధానాధ్యక్షుడుగ నుండెను.

వివేకానంద, బ్రహ్మానందు లిరువురును నిత్యసిద్ధులు ఈశ్వరకోటులని శ్రీరామకృష్ణుని

వాక్కు. బంధరహితాత్మలు; కాని లోక కళ్యాణార్థము అవతరించిరి.

బేలూరులోని క్రొత్తమఠము 1899 లో స్థాపింపబడెను. 1902 లో వివేకానందుడు సిద్ధిని బొందెను. ఇది తోటిస్వాములకు అశనిపాతమువలె నుండెను. భారమంతయు బ్రహ్మానందులపైనే పడెను. అది అతికష్టమైనది. కాని ఆయన ఎన్నడును తన నిశ్చలతను విడనాడ లేదు. తన కర్మమార్గమునుగూర్చి ఆయన ఇట్లు సెలవిచ్చిరి: "మీ మనస్సు నంతటిని భగవదర్పణ జేయుడు. మానసిక శక్తిని వృధా పుచ్చనియెడల, మీ మనశ్శక్తిలో నొక భాగముతోనే ప్రపంచము నిర్విణ్ణమగు రీతిని మీరఖండ కార్యకలాపమును సాధింప వచ్చును'

బ్రహ్మానందులు భారతమంతటను పెక్కుసార్లు ప్రయాణమొనర్చిరి. సన్న్యాసులు తమ ఆధ్యాత్మిక పురోభివృద్ధిని, ప్రజాసేవను, రెండింటిని కూడ చేయవలయు నని ఆయన అభిప్రాయము. ఆయనయుపదేశము లతిశక్తివంతములు: విన్నవా రాజన్మాంతము నుత్సాహము పొందుదురు. గురుమహారాజునకును, బ్రహ్మానందులకును ఎన్నో విషయములందు పోలిక; ఆకృతిలో కూడ!

వివేకానందు డస్తమించిన వెనుక, బ్రహ్మానందులు ప్రప్రథమమున కేంద్రసంస్థను పటిష్ఠ మొనర్చిరి. 1908 అక్టోబరులో ఆయన చెన్నపురికి వచ్చెను. ఒకనా డాయన ఒక బ్రాహ్మణ భక్తునియింట భిక్షకు వెళ్ళినపుడు, బ్రాహ్మణులు, బ్రాహ్మణేతరులు, క్రైస్తవులు, బ్రాహ్మలు, అందరు కలిసి భోజనము చేసిరి. ఇది ఆరోజులలో అపురూపము. స్వామి సాన్నిధ్యమున భేదముల మరచిరి.

మద్రాసునుం డాయన రామేశ్వరము, మధుర మున్నగు క్షేత్రములకు వెళ్ళిరి. 1916 జూలైలో ఆయన మరల దక్షిణమునకు విచ్చేసిరి. 4-8-1916 న చెన్నపురియందలి రామకృష్ణమఠపు క్రొత్తకట్టడమున కాయన శంఖుస్థాపన గావించెను. హరిజనులయందు ఆయన కభిమాన మెక్కువ. 6-5-1917 న స్వామిజీ చెన్నపురిలో రామకృష్ణమిషన్ వారి విద్యార్థిగృహము (స్టూడెంట్స్ హోం) యొక్క నూతన భవనమునకు శంఖుస్థాపన గావించెను.

ఆయన ఆఖరుపర్యాయముగా దక్షిణమునకు 1920 లో నేతెంచిరి. ఈసారి రామకృష్ణ విద్యార్థిగృహమునకు ప్రారంభోత్సవమును గావించిరి.

ఉత్తరదేశమునందు ఆయన యాత్రకు వెళ్ళునపుడు, ఆయనతోకూడ అనేకయతులును, భక్తులును వెళ్ళుదురు. అట్టి తరుణములందు ఆయన ఒక్కొక్కప్పుడు ధ్యానసమాధిలోనికి దిగి పోవును.

"పండినను, పైకి అట్లు కానరాని మామిడిపండు రాఖాలు" — అని గురుదేవుని వాక్కు. ఆయన భక్తకోటి నయస్కాంతమువలె నాకర్షించెను. ఆయన ఎల్లరిని గాఢముగ ప్రేమించును. కాని బయటికి జూపెట్టడు. ఎన్నో జీవితముల నాయన మార్చివేసెను. ఆయన ఆజ్ఞ అనేకులకు సుగ్రీవాజ్ఞయే. ఆయన ప్రేమశక్తిచే నాకర్షింపబడి, అనేకయువకులు తమసర్వస్వమును త్యాగముచేసిరి. పాత్రత నెరింగియే ఆయన మంత్రదీక్షను ప్రసాదించెడివాడు. ఇతరులయెడ చాల మర్యాదతోను, శీలితోను ప్రవర్తించును. ఇతడు యతియా రాజా యనిపించును, ఆయన హావ, భావములు. నిజమున కొకరాజుయొక్క గంభీరాకృతి ఆయన కుండెను.

ఇంతటి మనుష్యుడు బిడ్డలతో నాడునపుడు, ఇతడేనా జగద్విదితు డగు రామకృష్ణగోష్ఠి (ఆర్డరు) నాయకు డని ఆశ్చర్యపడుదురు, చూపరులు.

చివరి రోజులలో ఆయన చాల జబ్బుబడిరి. అప్పుడుకూడ గొప్ప ఆధ్యాత్మిక సంభాషణయే! గొప్పహాస్యసరళియే! కరుణ వెల్లివిరసి ఆయన ఎల్లరిని ఆశీర్వదించుచుండెను. ఇది చూచి, ఆయన ఇహలోకమును విడిచివెళ్లుచుండెనా యని భక్తులు భయపడు చుండిరి.

శ్రీరామకృష్ణున కొకనాడు దివ్యదర్శన మొకటి కలిగి యుండెను. గంగానదీతరంగముల మీద, వేయిరేకుల కమల మొకటి కొట్టుకొని వచ్చెను. అది ఎల్లెడలను ప్రకాశజ్యోతిని వ్యాప్తి నొందించెను. ఆ పుష్పముపై, శ్రీకృష్ణునిచేతులు పట్టుకొని ఒకపిల్లవాడు నిలుచుండి యుండెను. రాఖాలును గురుదేవుడు మొదట జూచినపుడు, అతడే ఆదివ్యదర్శనమందలి బాలకు డని గుర్తుపట్టెను. రాఖాలు ఇది యెరింగిన, ఈ భౌతికశరీరమును త్యజించు నని భయపడి, గురుదేవుడు ఏకొలదిమంది ఆప్తులకు మాత్రమో యీవృత్తాంతమును దెలియ జేసెను. ఈ అంతిమ దినములలో, తన్మయావస్థయందు బ్రహ్మానందులు సరిగా నిట్టి దివ్యదర్శనమునే గాంచిరి. అంతట జనుల కింకను ఎక్కుడు భయము కలిగెను. కాని, రెండవరోజు సాయంకాలమున (ఏప్రెలు 10, 1922) ఆయన మూసిన కన్నులను, మరి తెరువ లేదు. ఆయన అస్వస్థతయంతయు మూడువారములు మాత్రమే.

ఒక అవతారము ముగిసెను.



# వేదారణ్యములో రామకృష్ణమిషన్ వారి సేవ

## శ్రీ సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు

సెప్టెంబరునెల 8వ తేదీనాడు అరవదేశము లోని తంజావూరుజిల్లాకు చేరిన వేదారణ్య పట్టణమునందు ఒక చక్కని యుత్సవము జరిగెను. రెండు మూడు సంవత్సరముల క్రిందట అక్కడ భయంకరమగు తుపాను వచ్చెను. వేదారణ్యమునకు సముద్రము చాల దగ్గిర. అచ్చటికి ఐదారుమైళ్ల దూరములో నున్న పాయింట్ కాలిమర్ వద్ద, కన్యాకుమారివలె మూడుప్రక్కల సముద్రము గలదు. తుపాను సమయమున సముద్రముపొంగి, ఆ చుట్టుపక్కల చాలదూరము ప్రళయమువలె విజృంభించెను. వేదారణ్యములో సముద్రమువైపు సుమారు ఒకమైలుదూరములోనున్న హరిజనవాడ కొట్టుకొనిపోయెను. ఇందువలన చాల జననష్టము కలిగెను.

తుపాను తరువాత కొద్దిరోజులవరకు పైయూర్లనుండి వేదారణ్యప్రాంతమునకు రాకపోకలే అసాధ్యముగ నుండెను. కొంచెము సాధ్యము కాగానే అందరికన్న ముందుగనే చెన్నపట్టణమునుండి శ్రీరామకృష్ణమిషన్ వారు అచటికివెళ్లి, ఘోరనష్టము చెందిన ప్రజలకు సాధ్యమగు సహాయమునంతను చేసిరి. కొన్ని



తిరగలిలో బియ్యపుపొట్టు తీయడం
మంత్రిగారు ప్రారంభిస్తున్నారు, కుటీరపరిశ్రమ పునరుద్ధరణం,
వేదారణ్యము

దశాబ్దములుగా మన దేశమునందు శ్రీరామకృష్ణ మిషన్ వారు ఇట్టి సాంఘికసేవకు ప్రసిద్ధి నొందియున్నారు. కావున ప్రభుత్వమువారు వేదారణ్యప్రజలరక్షణపు పనిని మిషన్ వారి ధైర్యముగా ఒప్పగించిరి

బహుకష్టమైన పరిస్థితులలో మిషన్ వారు ప్రజలకు ఆహారము, గుడ్డలు మొదలగువానిని అందజేసి కాపాడిరి. అందరికన్న నిస్సహాయులగు హరిజనులకు వీరు మంచి ఇండ్లు కట్టి యిచ్చిరి. ఈ యిండ్లుగల ''రామకృష్ణపురము'' వేదారణ్యమునకే ఒక అలంకారముగా నున్నది. వీనిసంఖ్య 200. వీనిలో 128 యిండ్లు కొన్నినెలలక్రిందట మద్రాసు గవర్నరుగారిచే 'తెరువ'బడినవి. మిగత 72న్ను, ఈనెల 8వ తేదీ మద్రాసు రాజ్యపు 'హోం' మంత్రియగు శ్రీ భక్తవత్సలముగారిచే 'తెరువ'బడినవి. ఈ ప్రారంభోత్సవమునకు నేను వెళ్లియుంటిని.

ఇళ్లు చిన్నవైనను, చక్కగ నున్నవి. భూమినుండి నీటినితోడి సరఫరాచేయుటకు పంపులు గలవు. 'బొంబాయి' పాయిఖానాలు గలవు. ఒక్కొక్క భాగమునకును ప్రత్యేకమగు పేరు గలదు. ఇవి మహాత్ములపేర్ల ననుసరించినవి. ఒకబడి, దంపుడుబియ్యపు పరపతిసంఘము, రామకృష్ణపూజామందిరము మున్నగునవియు గలవు. కావలసినంత ఆరుబయలు గలదు. సాధ్యమగునంత తక్కువఖర్చుతో, అతిశీఘ్రకాలమున నీ యిండ్లు కట్టబడినవి.

మిషనుకుచేరిన సన్యాసి (స్వామిజీ) యొకరును, బ్రహ్మచారి యొకరును ఇచ్చటనే యుండి,. కార్యము ముగిసిన పిదప చెన్నపురికి మరలియున్నారు. ఇచ్చటినుండి మిషన్ మేనేజరు, శ్రీ శుద్ధసత్త్వానందులు తరచు అక్కడికి వెళ్లివచ్చుచుండిరి. విశేషసమయములందు తక్కుంగల యతులును, బ్రహ్మచారులును అక్కడకు వెళ్లివచ్చుచుండిరి. ఇప్పుడు ఈ వ్యవహారములన్నియు చూచుకొను బాధ్యత ప్రభుత్వమువారికే అప్పజెప్పబడినది.

మిషన్‌కు చేరిన వారియందు గ్రామస్థులకు అతిభక్తి, ప్రేమ. దీనిని నేను కండ్లారజూచి, ఆనందించితిని. స్వామిజీలు తమ్ము వదలి వెళ్లుచున్నందులకు అసంఖ్యాకులు కన్నీరు గార్చిరి.

ఉత్సవదినమున హరిజనకుటుంబములన్నిటికిని చక్కని విందు గావింపబడెను; వస్త్రములొసంగబడెను. సాయంత్రము బహిరంగసభలో మంత్రి, స్వామిజీలు, ఊరిలోని పెద్దమనుష్యులు ప్రసంగించిరి. ఈ విశేషములన్నిటిని ఇండియా గవర్నమెంటు ప్రచారశాఖవారు పటములు తీసిరి. మీ రీ సరికి చూచియుందురేమో. మంత్రియు, తదితరులును రామకృష్ణమిషన్ వారి సేవను వేయినోళ్లను పొగడిరి. సాయంకాలము బడికి మంత్రి ప్రారంభోత్సవమును సలిపెను.

ఆ మూడుదినములు నాకు చిరస్మరణీయములు. ఆదివారమునాడు జరిగిన ప్రారంభోత్సవమునకు యతులతోను, బ్రహ్మచారులతోను కలిసి శుక్రవారమునాడు సాయంకాలము బయలుదేరి వెళ్లి, మంగళవారమునకు మరలితిని. భక్తులయందు వారి కెంతో యాదరణాభిమానములు, వేకువనుండి రాత్రివరకు వారి పరిశ్రమ చాల ఎక్కువ. గృహస్థులుకూడ తమ సొంత పనికికూడ ఇంత శ్రమపడరు, శ్రమపడలేరు. మనమెల్లరము వీరి నిరంతరకార్యదీక్ష నలవరచుకొనవలెను. జై! శ్రీగురుమహారాజునకు జై!!

# వార్తలు, విశేషాలు

## మద్రాసు శ్రీరామకృష్ణమిషను స్టూడెంట్సుహోము 1956 వ సంవత్సర నివేదిక

ఈ స్టూడెంట్సుహోము మిషనువారి ప్రధాన విద్యాకేంద్రాలలో ఒకటి. నిరాడంబరమును బహుళప్రయోజనమును ఐన దీని చరిత్రలో యాభై రెండో సంవత్సరం నిండింది.

హోములో నాలుగుశాఖలు ఉన్నాయి — కాలేజీశాఖ, టెక్నికల్ శాఖ, సెకండరిశాఖ, ఎలిమెంటరిశాఖ.

కాలేజీశాఖ — ఈ శాఖలో ఉండిన విద్యార్థులు మొత్తం నలభై ఒక్కరు. అందు ఇరవై యెనిమిదిమంది వివేకానందకాలేజీలో చదివే వాళ్లు, నలుగురు ఇంజనీరింగుకాలేజీలో చదివే వాళ్లు. పరీక్షఫలితాలలో హోము తన యెప్పటి స్థానాన్ని నిలుపుకొన్నది. పద్ధెనిమిదిమందిలో పదిహేడుమంది నెగ్గారు. ఉపకారవేతనము (స్కాలరుషిపు) తగ్గింపుజీతాలు మొదలైన అనుకూలాలు పొందిన విద్యార్థులు ముప్పైఐదుమంది.

టెక్నికల్ శాఖ — సంవత్సరప్రారంభంలో డెబ్బైఒక్క విద్యార్థు లుండినారు. తర్వాత మరిఇద్దరు చేరారు. వారిలో ఎందఱికో ఉపకారవేతనాలు తగ్గింపుజీతాలుఉన్నవి. డిప్లొమా పరీక్షలో పద్ధెనిమిదిమందిలో పద్నాల్గురు మొదటితరగతిలో నెగ్గారు. పాఠ్యేతరకార్యక్రమాలలో కూడ విద్యార్థులు పాల్గొన్నారు. సదర్న్ రీజియనల్ కమిటి(టెక్నికలు)వారి సిఫారసుచేత టెక్నికల్ ఇన్‌స్టిట్యూటును పెంపొందచేయడానికి కేంద్రప్రభుత్వంవారు ఎనిమిది లక్షలముప్పైఐదువేలరూపాయల ప్రణాళికను అనుమతించారు. ధనంలో విశేషభాగం ప్రభుత్వం వారే ఇస్తారు.

సెకెండరిశాఖ — అత్తూరులోని రెసిడెన్షల్ హైస్కూలులో 177 విద్యార్థులు చదువుతున్నారు. 1956 ఎస్. ఎస్. ఎల్. సి. పరీక్షకు కూర్చున్న ముప్పైమూగ్గురిలో ముప్పైఒక్కరు ఉత్తీర్ణులయ్యారు. ఉపకారవేతనాల తగ్గింపుజీతాల అనుకూలాలు పొందిన విద్యార్థులు చాలమందిఉన్నారు. నూలువడకడం, నేయడం, కొయ్యపని మొదలైన వృత్తులు దాదాపు అందఱు కార్యనిర్వహణగౌరవపరిజ్ఞానార్థం తప్పక నేర్చుకోవలసిందే. ఆటలు మున్నగు పాఠ్యేతరకార్యక్రమాలలోగూడ విద్యార్థులు చాల చుఱుకుగా పాల్గొన్నారు.

ఎలిమెంటరిశాఖ — 409 గురు బాలికాబాలకులతో 12 సెక్షన్లతో సెంటినరిఎలిమెంటరి స్కూలు ఎప్పటిగుడిసెగదులలోనే పనిసాగిస్తూ ఉంది. ఉత్తరమేరూరులోని మల్లియంకరణై యొద్ద హైయర్ ఎలిమెంటరిస్కూలు ఉంది. 161 బాలురు 39 బాలికలు చదువుతున్నారు అక్కడ. వృత్తిపనులను నేర్పడానికి ముందు అక్కడ సేద్యం కొంత నేర్పుతారు. హాస్టలులో భోంచేసే కుఱ్ఱవాండ్రు 30 మంది. హరిజన్

వెల్ఫేర్ ఫండువారు ఈ హాస్టలు ఖర్చులు భరి స్తారు.

'హోమ్‌దినోత్సవం' 26-2-1956 నాడు జరిగింది. శ్రీ కె. సంతానంగారు అధ్యక్ష్యం వహించారు, శ్రీ సి. సుబ్రహ్మణ్యముగారు ఉపన్యసించారు.

హోము సెక్రటరిగా ఇరవైనాలు గేండ్లు ఘనత వహించిన శ్రీమాన్ సి. రామానుజాచార్యుల వారి మరణంచేత ఆ సంస్థకు కలిగిన నష్టం అపారం. సెక్రిటరిపదవిని శ్రీ ఎస్. కృష్ణయ్యరు గారు ఇటీవల అధిష్ఠించారు.

హోము అధికారులు ఉదారవిరాళా లొసంగిన మహాశయులకు తమకృతజ్ఞతను తెలుపుకొంటూ ఈ సేవావ్రతం దినదినాభివృద్ధిగాంచుతూ సాగవలె నని వేడుకొంటున్నారు.

## — హరిద్వారం కంఖాల్ రామకృష్ణమిషన్ సేవాశ్రమం

ఈ సేవాశ్రమానికి యాభై ఆరో సంవత్సరం నిండింది. 1901 వ సంవత్సరంలో శ్రీవివేకానందస్వాముల నియమానుసారం శ్రీకల్యాణానందస్వామి ఇచ్చట యాత్రికులకు వైద్యసేవకై యాభైమంచాల చిన్న వైద్యశాల నారంభించారు. ఇప్పుడు పెక్కు ప్రాంతాలప్రజలు ఇక్కడికి వస్తూ వైద్యసాహాయ్యం పొందుతున్నారు. దేశస్వాతంత్ర్యప్రాప్తి కనంతరం ప్రదేశప్రభుత్వంవారున్నూ కేంద్రప్రభుత్వంవారున్నూ ఈ సేవాశ్రమానికి ధనసాహాయ్యం చేస్తున్నారు. ఇన్‌పేషంటు ఔట్పేషంటుశాఖలు రెంటిలోను వైద్యానికి వచ్చే వారి సంఖ్య ఎక్కువౌతూ ఉంది. అనుభవశాలులైన వైద్యపట్టభద్రులు ఇద్దఱు ఉచితముగా వైద్యసేవ చేస్తున్నారు. ప్రదేశారోగ్యశాఖవారున్నూ, ఇంజినీరింగు ఇలాకావారున్నూ 1,55,000 రూపాయలు విరాళం ఇచ్చారు. నీటివసతులు ఆరోగ్యసౌకర్యాలు చేయ పూనుకొన్నారు. వైద్యుల ఇండ్ల కట్టుబడి ఈ సంవత్సరం పూర్తి ఐంది. ఎక్స్‌రే శాఖ క్రొత్తగా నెలకొల్పబడింది. ఉత్తరప్రదేశ సర్కారువారు హరిద్వారపుసంతనిధినుండి 5000 రూపాయ లిచ్చారు. ఇండియన్ యూనియన్ ఆరోగ్యశాఖవారు ఆసుపత్రికి వలసిన సామానులను కొనడానికి 36000 రూపాయల మూలధనం ఇచ్చారు.

కడచిన సంవత్సరం ఇన్‌పేషంటుశాఖలో ఉండిన రోగులు మొత్తం 1569 మంది. సరాసరి ప్రతిదినం 35 మంచాలు ఉపయోగంలో ఉండేవి. వ్రణవైద్యం పొందినవారు 166 మంది. ఔట్పేషంటు శాఖలో మందుతీసికొన్న రోగులు 89,754; అందులో 24,985 మంది క్రొత్త రోగులు, 64,769 మంది ప్రాతవారు. చిన్న కుఱుపుల చికిత్స చేయించుకొన్నవారు 749 మంది. ఆస్పత్రిపరీక్షా కేంద్రంలో పలురకాల శోధనలు మొత్తం 2860 జరిగాయి. సేవాశ్రమ గ్రంథాలయంలో ఉన్న గ్రంథాల సంఖ్య 4,288; కడచిన సంవత్సరం క్రొత్తగా చేర్పబడ్డ గ్రంథాలు 53. పత్రికాపఠనాలయానికి 17 మాసపత్రికలు, 6 వార్తాపత్రికలు వస్తాయి. శ్రీవివేకానందస్వామి జయంతి నాడు 2,500 మంది దరిద్రనారాయణులకు అన్నసంతర్పణ జరిగింది. 114 మంది బాలికాబాలకులు 'ఒప్పగింత' 'ఉపన్యాసం' పోటీలలో పాల్గొన్నారు. అగ్రశ్రేణిలో నెగ్గిన ముగ్గురికి 100 రూపాయల బహుమానాలు ఇయ్యబడ్డాయి. న్యూఢిల్లీ రెడ్‌క్రాస్ సొసైటివారు వెన్న తీసిన పాలు నిండిన 11 పెద్ద తపేలాలు ఇనాముగా ఇచ్చారు. కావున పేదశిశువులకు చాలిం

తలకు పాలు ఉచితంగా ఇవ్వగలిగారు. పాల పొడియు వెన్నయు మందులును వేఱువేఱచోట్ల నుండి సైతం ఉచితంగా లభించాయి. 1956 లో జరిగిన అర్ధకుంభ మేళములో ఎన్నో విధాలుగా సేవాశ్రమం, రోగులకు సేవ చేసింది. సంవత్సరానికి మొత్తం వచ్చుబడి రూ. 70,899-5-3 లు; వ్యయం మొత్తం 75,699-6-0; కావున వచ్చుబడికంటె వ్యయం రూ. 4,800-0-9 లు ఎక్కువ.

తమకు తోడ్పడ్డ ప్రభుత్వాలవారికిన్ని, సంఘాలవారికిన్ని, చందాదారులకున్నూ, ఇతరులకున్నూ సేవాశ్రమనిర్వాహకులు తమ కృతజ్ఞతను తెలుపుకొం టున్నారు. ప్రస్తుతం సేవాశ్రమానికి ఉండే జరూరు అక్కఱలు — (1) పశువులకొట్టాము కట్టుబడిచే ఎక్కువగా ఖర్చైన రూ. 1,800/- లు; (2) కాలువ మెట్లకట్టుబడిచే ఎక్కువగా ఖర్చైన రూ. 5,200/- లు; (3) నిర్వాహభవనానికి గ్రంథాలయమండపానికి రూ. 50,000/- లు; (4) 20 మంచాల గది కొకదానికి రూ. 40,000/- లు; (5) వంటిల్లు - సామగ్రిగది - భోజనశాలలకు రూ 25,000/- లు; (6) వైద్యాధికారులకు రూ. 14,000/- లు; (7) 40 అల్మారాలకు రూ. 3,000/- లు; (8) మంచానికి రూ. 8,000/- ల చొప్పున 33 మంచాలకు కావలసిన మూలధనం రూ. 2,64,000/- ఇట్లు మొత్తం 4,03,000 రూపాయల అంచనా గల సేవలు జరుగ వలసి ఉన్నాయి.

శ్రీవివేకానందస్వాముల ఉపదేశానుసారం మానవసేవే మాధవసేవగా భావించి పాటుపడుతూ ఉంది ఈ సేవాశ్రమం. ఆస్పత్రిని, అక్కడ జరిగే సేవను ప్రత్యక్షంగా చూచిన వారు ఆ సేవాప్రాశస్త్యాన్ని భక్తిశ్రద్ధలను, కొనియాడి ఉన్నారు. సేవాశ్రమసేవాకార్యక్రమానికి తోడ్పడ నెంచిన ఉదారమహాజనులు తమ విరాళాలను ''జెనరల్ సెక్రిటరి, రామకృష్ణమిషన్, బేలూరుమఠంపోస్టు, హౌరా జిల్లా, పశ్చిమబంగాళం'' అనే విలాసానికో, ''రామకృష్ణమిషన్ సేవాశ్రమ కార్యదర్శి, కంఖాలుపోస్టు, సహరన్పూరు జిల్లా, ఉత్తర ప్రదేశం'' అనే విలాసానికో పంపవలసిం దని ప్రార్థన.

## అశ్రుతర్పణం

శ్రీ ఆద్యానందస్వామి తమ 61 వ యేట చండిగడ్ లో ఆగస్టు తే 30 ది రాత్రి 2 గంటలకు మహాసమాధి నొందారు. పూర్వాశ్రమంలో వీరి పేరు సువిమలపాల్, కలకత్తా విశ్వవిద్యాలయంలో పట్టం పొందారు; మాతృశ్రీతోను, శ్రీ శ్రీ మహారాజుతోను, ప్రేమానంద స్వామితోను తమకు ఒనగూడిన సమాగమాలచే ఉత్సాహం పొందారు. ఢాకా కేంద్రం ప్రారంభింపబడ్డప్పుడు కార్యనిర్వహణంలో ప్రముఖంగా పాల్గొన్నారు, మాతృశ్రీకి శిష్యులయ్యారు, 1920 లో ఢాకా రామకృష్ణమఠంలో ప్రవేశించారు, 1926 లో సన్న్యాసదీక్ష స్వీకరించారు, సింగపూరు కేంద్రానికి ప్రథమాధ్యక్షులుగ ఉండినారు (1928-33); 1934 లో దక్షిణాఫ్రికాలో పర్యటించి ఉపన్యాసాలు చేశారు. 1939 లగాయతు 1947 వరకు లాహోరు కేంద్రానికి అధ్యక్షులుగ ఉండినారు, చండిగడ్ లో ఆశ్రమనిర్మాణానికి ధనం ప్రోగుచేస్తూ ఉండి తటాలున హృద్రోగంచే అస్తమించారు. వారి ఆత్మకు శాంతి కలుగును గాక.

# గ్రంథసమీక్ష

## శ్రీరామచరితమానసము
### శ్రీమదాంధ్రతులసీరామాయణము
(ద్విపదకావ్యము - బాలకాండము)

ఆంధ్రీకర్త – శ్రీ కేశవతీర్థస్వామి, ప్రాప్తిస్థానం – శ్రీరామతీర్థసేవాశ్రమం, పిడుగురాల పోస్టు, గుంటూరు జిల్లా, ఆంధ్రప్రదేశ్, పుటలు – 501, వెల – ఐదు రూపాయలు.

'శ్రుత్వా రామకథానాదం శిరః కస్య న కమ్పతే' 'రామకథను విని తల ఊపనివాడెవడు' అన్నారు పెద్దలు. రామాయణాలలో విశ్వోపజీవ్య మైన రామాయణం శ్రీవాల్మీకులది. దేశభాషలలోకూడ రామకథకు గల ప్రాధాన్యం అనితరసాధారణం రామభక్తాగ్రేసరుడు తులసీదాసగోస్వామి. అతని విశిష్టరామకథానుభూతి 'శ్రీరామచరితమానసం' అను పేర హిందీలో వెలసింది. దానిని ఆంధ్రీకరించి ఆంధ్రులకు అందజేసే మహోపకారం శ్రీకేశవతీర్థస్వాములు నెరవేర్చారు. వీరు తమ అనువాదంలో అననురూప వ్యర్థ పాదపూరణాల ప్రసక్తి లేకుండునట్లుగా ద్విపదఛందమును ఆశ్రయించడం మిక్కిలి ఉచితంగా ఉంది. కవితాధార నిరర్గళము సరళము మధురము. మూలగ్రంథస్వారస్యాన్ని అన్యూనాతిరిక్తంగా చూఱలిచ్చే అనువాదం ఇది అంటేఅతిశయోక్తి కాదు.



## శ్రీమహర్షిజీవితకథామృతము

కాకినాడ పి. ఆర్. కాలేజి ఆంధ్రాధ్యాపకులైన విద్వాన్ శ్రీ బులుసు వేంకటేశ్వరులు, ఎమ్. ఏ. గారు రచించిన ఈ గ్రంథపు తొలిభాగం 1953లో నాల్గో ముద్రణం పొందింది; మూడోభాగం 1956 లో మూడోముద్రణం పొందింది, ఐదోభాగం 1956 లోనే తొలిముద్రణం పొందింది. ఈ మూడు భాగాలు సమీక్షార్థం మాకు అందాయి. ఒక్కొక్క భాగం వెల రెండురూపాయలు. 'సరసపదభూయిష్ఠ' మనీ, 'సకలపురాణసార' మనీ. 'సమ్మిళితప్రాచీనార్వాచీనకవితాసంప్రదాయ' మనీ, 'ప్రవీణరచన' యని, 'సారళ్యగాంభీర్యయుతద్రాక్షాపాక' మని. 'పృసిపాలకైనా చిత్తసంస్కారాపాదక' మని తొలిభాగాన్ని శ్రీరామకృష్ణప్రభలో సమీక్షిస్తూ లోగడ శ్రీచిరంతనానందస్వాములు పలికిన పలుకులు, తొలిభాగంగుఱించియే కాక, ప్రతిభాగంగుఱించిన్నీ చెప్పదగినవి ప్రత్యక్షర సార్థకాలు.



## భారతీవ్యాసములు

1955 లో వెలువడిన ఈ సంపుటంలో శ్రీబులుసు వేంకటేశ్వర్లుగారి సారస్వతవ్యాసాలు పండ్రెండు భారత్యాదిపత్రికలలో ముద్రితపూర్వాలు ఏకత్ర క్రోడీకరింపబడ్డాయి. 248 పుటలు; వెల : సాదాప్రతి రెండు రూపాయలు, గ్లేజు కాగితము క్యాలికో బైండు మూడు రూపాయలు. విమర్శసారస్వతంలో ప్రముఖస్థానానికి అర్హత గల గ్రంథం ఇది.

## తాపహారము
[ సర్వలోకేశ్వరశతకము ]

రచయిత – విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు; 1955 డిసంబరులో పునర్ముద్రితం; వెల అర్థరూపాయి; 'శర్వా సర్వలోకేశ్వరా' అను మకుటము గలిగి గురుశివాభేదరూపక మైన ఈ

శతకం భక్తిరసగుళిక, పరమార్థరచనాతృషితు లకు పరమనిర్వృతికరం.



## భక్తిగీతాలు

రచయిత – విద్వాన్ బులుసు వేంకటేశ్వరులు; 1950 సెప్టెంబరు భారతినుండి పునర్ముద్రిత మైన పదివృత్తాల గణేశస్తుతి; 1953 హిందూసుందరిపత్రిక నుండి పునర్ముద్రిత మైన పంద్రెండు వృత్తాల శివ స్తవము; శ్రీసీతారామ నామసంకీర్తనమందిర రజతోత్సవ సంచికనుండి పునర్ముద్రిత మైన ముప్పైవృత్తాల 'శ్రీరామ నామము'; ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచి కలోనుండి పునర్ముద్రిత మైన పదుమూడు సీస పద్యాల 'భరతమాత'; త్రిలిఙ్గపత్రికలో నుండి 'దేవా'అనుశీర్షికతో పునర్ముద్రిత మైన 'సమ వృత్తాష్టకం'; 'గురుదేవా' అను పద్యపంచకం— ఈ కూర్పులో చేర్పబడ్డాయి. రచనలో రచ యితగారి కృతహస్తతకు ఇందలి ప్రతిపద్యమూ ఒక ఉదాహరణమే. వెల అర్ధరూపాయి.

## శాంభవీశతకము

శ్రీ బులుసు వేంకటేశ్వర ప్రణీత మైన యిందులో 'శాంభవీ' మకుటవిరాజితాలై మకరందపేశలా లైన నూటైదుపద్యాలే కాక, బ్రౌనింగు అను నాంగ్లకవిగారి 'ఆండ్రియాడెల్ సార్టో' అను గ్రంథంలోని ఆండ్రియా పశ్చా త్తాపఘట్టానికి అనువాదా లైన 16 పద్యాలు, 'ఆస్–యు–లైక్–ఇట్' అను నాటకంలో జక్వీస్ భాషితంగా ఆంగ్లకవివరేణ్యు డైన షేక్స్పి యరు వర్ణించిన 'ది సెవెన్ ఏజెస్ ఆఫ్ మాన్' అనుదానికి అనుగుణంగా మానవజీవితాన్ని సప్తాంకవిరాజితనాటకంగా రూపొందించి 'జీవిత నాటకం' అను పేర పొందుపఱచిన 14 పద్యాలు; ఒకసంవత్సరం తమ పుట్టిన రోజున కవిగారి హృదయమున ఉప్పతిల్లిన భావాలను 'సింహావ లోకనం' అను పేర తెలిపే 12 పద్యాలు ఉన్నాయి. కవితయే కాక విషయప్రకీర్ణకతయు ఇందు స్పృహణీయం. వెల అర్ధ రూపాయి.



## అష్టావక్రసంహిత

సంస్కృతంలో ఇది అద్వైతసారం అన దగ్గ గ్రంథం. వేదాంతగ్రంథాంధ్రీకరణదక్షులైన శ్రీ బులుసు వేంకటేశ్వరులుగారి తియ్యని తెలుగుఫణితిలో ఇది యానధాంధ్రోపజీవ్యా మృతంగా వెలసింది. పుటలు 54, వెల తెలియదు.



## అరుంధతీవసిష్ఠము

ఉత్తమగార్హస్థ్యపాతివ్రత్యధర్మాలకు నిత్య లక్ష్యభూతు లైన వసిష్ఠారుంధతుల భవ్యచరిత్ర మును ప్రతిపాదిస్తూ ఆశ్వాసత్రయవిరాజితమైన బులుసు వేంకటేశ్వర్లుగారి యీ పద్యకావ్యం శ్రీ సోమయాజిగా రన్నట్లు సర్వగుణభవ్యం కావడమే కాక ఈ కాలంలో సర్వేతరవిలక్ష ణంగాను ఉంది. వెల: రూ. 2/- శ్రీ వేంక టేశ్వరుల గ్రంథాల కన్నిటికిని ప్రాప్తిస్థానం: 'బి. వి. అండ్ సన్సు, రామారావుపేట, కాకినాడ'

ప్ర

# దేవీమాహాత్మ్యము

(శ్రీ దుర్గాసప్తశతి)

అనువాదకులు: శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

ఇందు మూలశ్లోకములు, వానికి ధారాళమయిన ఆంధ్రానువాదమును పొందుపఱుప బడియున్నవి. అందందు ముఖ్యములును నిగూఢములును అగు శబ్దములకు పాదదీపికలందు వివరణములు చేర్పబడియున్నవి. దేవీనవరాత్రములందును, ఇతర పవిత్రావసరములందును నిత్యపారాయణ మొనర్పవలసిన ఉత్తమగ్రంథము. ఈ గ్రంథప్రాశస్త్యము పూర్తిగా వివరించు పీఠికయు చేర్పబడియున్నది.

"ధారాళమగు ఈ ఆంధ్రానువాదము తేటమాటలతో వ్రాయబడి సంస్కృతమూల ముతో పరిపూర్ణసామరస్యము కలిగియున్నది".

—హిందూ (The Hindu) 6-10-57.

(170 + 16) పుటలు ప్రజ్జ్వలమగు ప్రథమ ముద్రణము వెల : రూ. 2/-

# శ్రీ వివేకానంద లేఖావళి

(రెండు భాగములు)

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

భారతదేశమున ఇంటింటను ఉండవలసిన పుస్తకములలో నిది యొకటి; బాలికా బాలకు లెల్లరును శ్రద్ధతో పదేపదే చదువవలసిన పుస్తకములలో నిది యొకటి.

ఈ లేఖలయందు దైవభక్తి, మానవరక్తి, కార్యాసక్తి—ఇవి నిరంతరసంయోగము దాల్చి జీవితాంధకారమును దొలగింపజేయు జ్యోతిగ నుండుట స్పష్టము.

—కట్టమంచి రామలింగారెడ్డి

మొదటి భాగము : 256 పుటలు
రెండవ భాగము : 226 పుటలు

ఒక్కొక్క భాగము వెల: రూ. 1-50

ప్రాప్తిస్థానము : మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౪   ౧౯౫౭, నొవెంబరు; హేవిళంబి — కార్తీకము   సంచిక ౫

## విషయసూచిక


చతుశ్శ్లోకీ—[యామునముని ప్రణీతము] ... ... ... ౧౪౫

దీపావళి—[సంపాదకీయము] ... ... ... ౧౪౮

గతాగత పరీక్ష—డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఎం.ఏ., ఎం.లిట్., పిహెచ్.డి. ... ౧౫౦

మోక్షసాధన—శ్రీ శ్రీ నిత్యానందస్వాములు ... ... ... ౧౫౬

శ్రీ ప్రేమానందస్వామి—శ్రీ సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు, బి.ఏ., ... ... ౧౬౦

త్రిమూర్తుల ఆధిక్యము—శ్రీ గురుభక్త పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు ... ... ౧౬౪

మాతృశ్రీ శారదాదేవి—[శ్రీమద్గంభీరానందవాణి] ... ... ౧౬౭

వార్తలు, విశేషాలు ... ... ... ౧౭౪

గ్రంథసమీక్ష ... ... ... ౧౭౬

# ప్రజలకొక విజ్ఞప్తి

## "నెల్లూరు జిల్లా వరద కష్టనివారణకు సహాయము నొసంగుడు"

రామకృష్ణమిషన్‌వారి సేవ

చెన్నపురి. 18-11-[illegible]

ఇటీవల అతివృష్టివలన నెల్లూరు జిల్లాలోని [illegible] ప్రాంతములలోను అపారనష్టము వాటిల్లినది [illegible] జను లెరిగినవిషయమే. తమ సర్వస్వమును [illegible] పోగొట్టుకొనినవారికి సూళ్లూరుపేట. పరిసర ప్రాంతములలో సహాయమొసఁగుటకు శ్రీరామకృష్ణమిషన్ వారు పూనుకొని యున్నారు. మిషనుకు చేరినవారు ఆయా స్థలములకు [illegible] పరిస్థితులను స్వయముగ చూచి వచ్చియున్నారు. నేటినుండి నివారణ కార్యక్రమము ప్రారంభమగుచున్నది. [illegible] అత్యవసర వస్తువులను పంచిపెట్టుట జరుగును. ఈ ప్రయత్నమునకు వితరణముగ ధనసహాయమున్ను, [illegible] వస్త్రములును గావలసియున్నవి. వీనిని సోదర, సోదరీమణులు వెంటనే యీ క్రింది విలాసమునకు బంప ప్రార్థితులు. (ఎంత స్వల్ప సహాయమైనను కృతజ్ఞతతో స్వీకరింపబడును. అట్టి సంగతి తెలుపబడును).

మీ సేవకు,

శ్రీరామకృష్ణమఠము. మైలాపూరు. మద్రాసు - 4.




'సర్వేశ్వరుని శరణు జొరుము, అతని కృప నీ యనుభవమునకు అప్పుడు వచ్చును.''

—శ్రీ శారదామణి.





# మకృష్ణ ప్రభ



సంపుటము ౧౪ ౧౯౫౭ – నొవెంబరు : : హేవిళంబి – కార్తీకము  సంచిక ౫

## చతుశ్శ్లోకీ

[యామునమునిప్రణీతము]

కాన్తస్ తే పురుషోత్తమః, ఫణిపతి శ్శయ్యాసనం, వాహనం
వేదాత్మా విహగేశ్వరో, యవనికా మాయా జగన్మోహినీ, ।
బ్రహ్మేశాదిసురవ్రజ స్సదయిత స్త్వద్దాసదాసీగణ,
శ్శ్రీ రి త్యేవ చ నామ తే, భగవతి, బ్రూమః కథం త్వాం వయమ్ ? ॥ ౧

టీ॥ భగవతి = సకలగుణపరిపూర్ణురాలవైనతల్లీ, పురుషోత్తమః = పురుషశ్రేష్ఠుడైనస్వామి, తేకాన్తః = నీకువల్లభుడు, ఫణిపతిః = ఆదిశేషుడు, శయ్యా = పాన్పుగను, ఆసనం = పీటగను ఉన్నాడు, వేదాత్మా = వేదస్వరూపియైన, విహగేశ్వరః = పక్షిరాజు, వాహనం = వాహనముగా ఉన్నాడు, జగన్మోహినీ = జగములను మోహింపజేయు, మాయా = మూలప్రకృతి, యవనికా = తెరగా ఉన్నది, సదయితః బ్రహ్మ ఈశ ఆది సురవ్రజః త్వత్ దాస దాసీ గణః = బ్రహ్మరుద్రాదిదేవతలపత్నులు నీకు దాసీవర్గముగను ఆ దేవతలు దాసవర్గముగను ఉన్నారు, తే నామచ = నీపేరును, శ్రీః ఇతి ఏవ = శ్రీఅనియే ఉన్నది, త్వాం = ఇంతటి పెంపు గల నిన్ను, వయం = దాసులము, కథంబ్రూమః = ఎట్లు వర్ణింతుము ?

తా॥ కల్యాణగుణములు నిండిన తల్లీ, పురుషోత్తముడు నీ వల్లభుడు, సర్పరాజే నీకు పాన్పును పీఠమును, వేదస్వరూపి పక్షిరాజు నీ వాహనము, లోకమోహన మైన మూలప్రకృతి నీ తెర, దేవత లెల్లరు నీకు పరిచారకులు, వారిదేవేరులు నీకు పరిచారికలు, నీ పేరే శ్రీదేవి, ఇక నీ పెంపు నే మందుము ?

యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వ ద్వల్లభో ఽపి ప్రభుర్
నాలం మాతు మియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః।
తాం త్వాం దాస ఇతి ప్రపన్న ఇతి చ స్తోష్యా మ్యహం నిర్భయో
లోకైకేశ్వరి, లోకనాథదయితే, దా న్తే, దయాం తే విదన్॥ ౨

టీ॥ లోక + ఏక + ఈశ్వరి = లోకాలకుఅద్వితీయురాలవైనప్రభ్వీణి, లోకనాథదయితే = సర్వేశ్వరునిప్రాణవల్లభా, యస్యాః తే = ఏ నీయొక్క, నిరవధిం = ఎల్లలేనిదియు, స్వతః = స్వాభావికముగనే, నిత్య + అనుకూలం = సదాప్రియముగఉండునదియు అగు, మహిమానం = మహిమను, ఇయత్తయామాతుం = ఇంతఅనికొలుచుటకు, ప్రభుః = సర్వశక్తియైన, త్వద్వల్లభః అపి = నీప్రియుడునైతము, ఆత్మనః(మహిమానంమాతుం)ఇవ = తనమహిమనుకొలుచుటకు అసమర్థుడుగ ఉన్నట్లే, న + అలం = అసమర్థుడుగ ఉన్నాడో, తాంత్వాం = అట్టినిన్ను, అహం = నేను, నిర్భయః = భయములేనివాడనై, స్తోష్యామి = స్తుతింప నున్నాను (ఏల యన), దాన్తే(మయి) = కృపణుడనైననాయందు, తేదయాంవిదన్సన్ = నీకు ఉన్న దయను ఎఱిగిన వాడనై, దాసఃఇతి = దాసుడనను కారణముచేతను, ప్రపన్నఃఇతిచ = శరణాగతుడను అను కారణముచేతను.

తా॥ సర్వేశ్వరప్రియా, లోకైకేశ్వరి, సర్వజ్ఞుడైనను నీప్రియుడు తనమహిమకొలత నెఱుంగనట్లే నీ మహిమకొలతను గూడ ఎఱుగడు. అంతటిది నీ మహిమ! అది నిరవధి యగుటే కాక సర్వేశ్వరునికి సదా ప్రియ మైనది. నేను నీ దాసుడను, శరణాగతుడను, నాయందు నీ కున్న దయ నెఱింగినవాడను, కావున స్తుతించు సామర్థ్యము లేకున్నను భయములేక స్తుతింప పూనుకొనుచున్నాను.

ఈషత్ త్వత్ కరుణా నిరీక్షణ సుధా సన్ధుక్షణాద్ రక్ష్యతే
నష్టం ప్రాక్ తదలాభత స్త్రిభువనం సమ్ప్రత్యనన్తోదయమ్।
శ్రేయో న హ్యరవిన్దలోచనమనఃకాన్తాప్రసాదా దృతే
సంసృ త్యక్షర వైష్ణవాధ్వసు నృణాం సమ్భావ్యతే కర్హిచిత్॥ ౩

టీ॥ ఈషత్ = రవంత, త్వత్కరుణానిరీక్షణసుధాసన్ధుక్షణాత్ = దయతోడి నీచూపు అనెడిఅమృతమునుచల్లుటచే, త్రిభువనం = ముల్లోకములును, రక్ష్యతే = కాపాడబడుచున్నది, ప్రాక్ = మునుపు, తత్ అలాభతః = ఆకరుణాకటాక్షప్రాప్తిలేమిచే, నష్టం = నశించియుండినది, సంప్రతి = (కటాక్షప్రాప్తిగల్గిన)యిప్పుడు, అనన్త + ఉదయమ్ = అపారమైనఅభ్యుదయముగలిగి యున్నది, నృణాం = మనుష్యులకు, సంసృతిఅక్షరవైష్ణవఅధ్వసు = ఇహలోకభోగ, కైవల్య భోగ, పరమపదభోగాలలో, శ్రేయః = మేలు, అరవిన్దలోచనమనఃకాన్తాప్రసాదాత్ ఋతే =

పుండరీకాక్షుడైన భగవంతుని మదిమెచ్చిన దివ్యమహిషియగు దేవియనుగ్రహించిననే కాని (మఱి ఎట్లును), క్వచిత్ = ఒకప్పుడును, న సంభావ్యతే హి = సంభవింపజాలదుకదా.

తా॥ నీ కటాక్షప్రాప్తికి ముందు ఈ ముల్లోకములును నష్టములై యుండినవి. నీ కటాక్షప్రాప్తిచే వీని కిప్పుడు అనన్తాభ్యుదయము చేకూరినది, కరుణతోడి నీ చూపుటమృతమును రవంత చల్లిన చాలును, లోకము రక్షిత మగును. ఇహలోకమున గాని కైవల్యమున గాని పరమపదమున గాని, శ్రేయసు మొంద వలె నన్న దానికి అరవిందలోచనునిహృదయేశ్వరివైన నీకృప ఒక్కటే ప్రాపకము, వే ఱొండు లేదు.

శా న్తానన్త మహావిభూతి పరమం యద్ బ్రహ్మ రూపం హరేర్
మూర్తం బ్రహ్మ తతో ఽపి తత్ ప్రియతరం రూపం య దత్యద్భుతమ్।
యా న్యన్యాని యథాసుఖం విహరతో రూపాణి సర్వాణి తా
న్యాహు స్స్వై రనురూప రూపవిభవైర్ గాఢోపగూఢాని తే॥ ౪

టీ॥ శా న్త = దోషగంధమే లేనిదియు, అన న్త = ఎల్లలేనిదియు, మహావిభూతి = నిత్యవిభూతి లీలావిభూతి అను రెండు విభూతులు గలదియు, పరమం = సర్వోత్కృష్టమును, బ్రహ్మ = బ్రహ్మపదవాచ్యమును ఐన, హరేః యద్ రూపం = సర్వేశ్వరుని ఏ స్వరూపముగలదో, తతః అపి = ఆ స్వరూపమునకంటెను, తత్ ప్రియతరం = ఆ స్వామికి అత్యంతప్రియమును, అత్యద్భుతం = అత్యాశ్చర్యమును, మూర్తం బ్రహ్మ = రూపుదాల్చిన బ్రహ్మమనబడునదియు నగు, యద్ రూపం = (దేవుని) ఏ దివ్యమంగళవిగ్రహము( = పరవాసుదేవరూపము)గలదో, యథాసుఖం = హాయిగా, విహరతః = లీలారసము ననుభవించు, (తస్య హరేః = ఆ స్వామియొక్క), అన్యాని యాని రూపాని = ఉచ్చావచములైన రామకృష్ణాద్యవతారమూర్తులు ఏవి కలవో, తాని సర్వాణి రూపాణి = ఆ రూపములు అన్నియు, (ఓ శ్రీమహాలక్ష్మి) తే = నీయొక్క, స్వైః = సొంత, అనురూపరూపవిభవైః = అనుగుణరూపవిశేషాలచే, గాఢ + ఉపగూఢాని = నిరంతరసంశ్లిష్టములని, ఆహుః = చెప్పుదురు.

తా॥ సర్వేశ్వరుని దివ్యాత్మస్వరూపమందేమి, పరవాసుదేవరూపమందేమి, ప్రద్యుమ్నానిరుద్ధ సంకర్షణ వాసుదేవ రూపములందేమి, మత్స్య కూర్మ వరాహ నృసింహ రామకృష్ణాది రూపములందేమి, వానివానికి అనురూపము లైన రూపములతో ఓ శ్రీమహాలక్ష్మి నీవును చేరి ఉన్నావని చెప్పుదురు.

"అమ్మా, నాకు పేరుప్రతిష్ఠలు అక్కఱ లేదు; అష్టసిద్ధులు నాకు అక్కఱ లేదు; నూఱు సిద్ధులైనను నాకు అక్కఱ లేదు. అమ్మా, నాకు జీవితభోగానుభవాపేక్ష లేదు. నీ పాదపద్మములందు నాకు స్వచ్ఛమైన భక్తిని ప్రసాదింపుము. తల్లీ, అదే నేను కోరు వరము".                                        —శ్రీరామకృష్ణుడు.

# దీపావళి

## (సంపాదకీయము)

ఆసేతుహిమాచలము మన భరతఖండమున మహాత్ముల తపస్సుచే పవిత్రము లైన క్షేత్రములు ఎన్నో ఉన్నవి. ఆ తపస్వులకు ఎవరు సాటి? తమ సాధనలు సిద్ధించిన స్థలములకే వారు తమ తపస్సులను అర్పించిరి. ఎందుల కనగా సామాన్య మానవులు ఆధ్యాత్మికసాధనలు చేయ లేరు. కావున రా నున్న కలికాలమునకై వారు తమ తపస్సులను ఆ యా స్థలాలకు అట్లు అర్పించిరి. ఆ స్థలాలు పుణ్యక్షేత్రాలై యాత్రికులకు పుణ్యప్రదము లైనవి. అట్లే దేహమనఃపావనము లైన పుణ్యతీర్థాలును మన దేశ మంతటను ఉన్నవి. గ్రహనక్షత్రాలయోగములచే గలుగు పుణ్యకాలాలును ఉన్నవి.

మఱి విశేష మే మనగా సంక్షిప్త జగద్రూపమే మానవశరీరము అని యోగశాస్త్రము చెప్పుచున్నది. బాహ్యప్రపంచాన ఉండునట్టి పుణ్యక్షేత్రాలను పోలిన పుణ్యక్షేత్రాలు, పుణ్యతీర్థాలను పోలిన పుణ్యతీర్థాలు, పుణ్యకాలాలను పోలిన పుణ్యకాలాలు మానవ శరీరములోనే ఉన్నవి. అంతే కాదు శరీరగతా లైన క్షేత్రాలకు తీర్థాలకు కాలాలకు ప్రభావము ఎక్కువ.

ఆత్మస్థం తీర్థ ముత్సృజ్య
బహిస్తీర్థాని యో వ్రజేత్
కరస్థం స మహారత్నం
త్యక్త్వా కాచం విమార్గతి.

[సూతసంహిత XI-52]

తనలో ఉన్న తీర్థమును విడిచి వెలుపలి తీర్థాలకు పరుగులెత్తువాడు చేత నున్న మహారత్నమును పాఱవేసి గాజుముక్కను వెదకునట్టి వాడు. ఒడలియందలి నాడు లన్నియు దేవతాస్థానాలే. సుషుమ్నానాడి శివస్థానము, ఇడానాడి విష్ణుస్థానము, పింగళానాడి విరించిస్థానము, విరాణ్ణాడి సరస్వతీస్థానము. ఈ నాడుల కలయికలే ఋతువులను పుణ్యకాలాలను సూచించును.

తపోధనులు తమ తపసులను ఆయా క్షేత్రాలకు తీర్థాలకు అర్పించినందున వాని కంతటి ప్రాశస్త్యమును ప్రభావమును గలిగినవి. మఱి పుణ్యకాలాలకుమాత్రము ప్రాశస్త్యప్రభావాలు తమంతట గలిగినవే కాని మహాపురుష సంబంధముచే గలిగినవి కావు. మహోదయము, అర్ధోదయము, ఉపరాగము, విషు, అమావాస్య – అను వీని పవిత్రతకు అప్పటి గ్రహయోగాలే కారణాలు. మహావ్యక్తిసంబంధముచే ప్రాశస్త్యమొందిన పుణ్యకాలము ఒకటే ఒకటి మాత్రమే ఉన్నది. అదే నరకచతుర్దశి యనబడు ఆశ్వయుజ కృష్ణపక్ష చతుర్దశి. మహాబలగర్వితుడై లోకకంటకుడుగ ఉండిన నరకాసురుని శ్రీమహావిష్ణువు సంహరించెను. నరకాసురుని తల్లి భూదేవి. పుత్రుని మరణవార్తను విన్నప్పుడు ఆమె దుఃఖపరవశురాలు కాలేదు. పుత్రశోకము నణచుకొని, పుత్రునకు మరణము సాక్షాన్నారాయణునిచే గలిగినందులకు సంతోషించెను. కొడుకును కోల్పో

యిన దుఃఖమునకు ఆమె చో టీయ లేదు. నరకనాశనముచే లోకప్రజలకు గలిగిన సంతో షాతిశయమును జూచి ఆమెయు సంతో షించెను.

నరకచతుర్దశి అను పేర ఆ దినమును ప్రతి సంవత్సరమును పండుగగా కొనియాడవలె నని ఆమె దేవుని వర మడిగి ఇప్పించుకొనెను. నరకాసురుడే ప్రాణమును విడుచుటకు ముందు అట్టి వర మడిగి యిప్పించుకొనె నను క్రమ మొకటి కలదు. నాటి వేగుజామున ఇంటింటను ప్రజలు తలంటి స్నానము చేసి నూత్నవస్త్రము లను ధరించి విందువినోదాల తేలుదురు. కొన్ని ప్రాంతములలో ఈ పండుగకు ఇంటింటను దీపాలు వెలిగింతురు. దీపావళి అను పేరు ఈ పండుగకు కలిగినందులకు కారణము అదే.

ఇది జ్ఞానజ్యోతిచే అవిద్యాంధకారమును పోద్రోలుటనుగూడ సూచించును. తక్కిన పుణ్యకాలములవలె కాక, ఈ పుణ్యకాలము ఒకానొక భక్తురాలు దేవుని ప్రార్థించి యిప్పించు కొన్న వరముచే ప్రాశస్త్యమును గన్నది. ఆ భక్తురాలు తన దుఃఖమును గణింపక లోక క్షేమమునే కోరిన ఉత్తమురాలు. అంతేకాదు నిజమునకు మానవులకు శ్రేయము గూర్ప దేవుడు ఏర్పఱచిన ప్రణాళికలో చేరినవే మానవు లనుభవించు కష్టాలును. అట్టి దృక్ప థము నవలంబించిన నరకాసురమాత వందనీయ.

సంకల్పకల్పలతికా మవధిం క్షమాయాః
స్వేచ్ఛావరాహమహిషీం సులభానుకమ్పామ్
విశ్వస్యమాతర మకిఞ్చన కామధేనుం
విశ్వంభరా మశరణ శ్శరణం ప్రపద్యే.

వేఱు దిక్కు లేదు. విశ్వంభరాదేవినే శరణు చొచ్చు చున్నాను. ఆమె లోకజనని, పేదల పాలిటి కామధేనువు, ఓర్పుతలపోలము, కష్టపడ నక్కఱలేకే కనికరించునది, సంకల్పకల్పలతిక, వరాహనాయని దేవేరి.

పత్యు ర్దక్షిణ పాణి పఙ్కజ పుటే
విన్యస్త పా దామ్బుజా
వామం పన్నగ సార్వభౌమ సదృశం
పర్యఙ్కయ స్తీ భుజమ్
పోత్ర స్పర్శ లసత్ కపోల ఫలకా
ఫు ల్లారవి న్దేక్షణా
సా మే పుష్యతు మఙ్గళా న్యనుదినం
సర్వాణి సర్వంసహా ॥

పెనిమిటి కుడి కరకమలమున అడుగుదామర నుంచుకొని, స్వామి యెడమ భుజమును పన్నగ సార్వభౌముని బోలిన దానిని పాన్పుగ జేసి కొని, ఆ వరాహదేవుని వదనము తగులుటచే వెలుగొందు నిగనిగని చెక్కిళ్లును, వికసించిన నేత్రకమలములును గల భూదేవి నాకు అను దినమును మంగళము లొసంగు గాక.

దేహమునకు పుట్టుక కలిగినది, చావును కలుగును. కాని ఆత్మకు మరణము లేదు. అది వక్కను పోలినది. వక్క పరిపక్వమయినపుడు చిప్ప కంటుకొనదు, కాని ఇంకను పచ్చిగ ఉన్నప్పుడు దానిని చిప్పనుండి వేఱుపఱచుట కష్టము. భగవత్సాక్షాత్కారము కలిగిన పిమ్మట దేహమే ఆత్మ అని ఎవడును అను కొనడు. ఆత్మ వేఱు దేహము వేఱు అని అతడు ఎఱుగును. —శ్రీరామకృష్ణుడు

# గతాగత పరీక్ష

డాక్టరు పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఎం. ఏ., ఎం. లిట్., పిఎచ్. డి.

నవీనవైజ్ఞానికులు శాశ్వతపరిణామము కల దని వాదింతురు. అణువులో సహిత మెల్లప్పుడు మార్పులు గన్పించుచున్నవందురు. ఇట్టి మార్పును గమనమని వ్యవహరింప వీలున్నది. గమన మనునది వ్యావహారిక జగములో కన్పించుచున్నను, వాస్తవముగా యుక్తియుతము కాగలదా? అను ప్రశ్నను విచారింపవలెను. గమన మనబడు పరిణామము తార్కికబుద్ధికి గూడ కుదరజాలనిచో తత్త్వము నిష్క్రియము గాక తప్పదు. అప్పుడు వ్యావహారిక ప్రపంచమునకు తాత్త్వికత ఉండ వీలులేదు. ఈ సిద్ధాంతము మాధ్యమకులలో అంతర్లీనమై యున్నది. అద్వైతులు దీనిని ఉపనిషన్మతాను సారముగా స్పష్టపరచిరి. వస్తుతః మధ్యమక వాదమునకు పునాదులు ప్రధానోపనిషత్తుల లోనే కన్పించుచున్నవి. అందుచే నాగార్జునా చార్యులు చెప్పిన గతాగతపరీక్షను గమనింప వలసి యున్నది.

## గతాగత పరీక్షా

1. గతం న గమ్యతే తావ దగతం నైవ గమ్యతే
గతాగత వినిర్ముక్తం గమ్యమానం న గమ్యతే.

2. చేష్టా యత్ర గతి స్తత్ర గమ్యమానే చ సా యతః
న గతే నాగతే చేష్టా గమ్యమానే గతి స్తతః.

3. గమ్యమానస్య గమనం కథం నామోపపత్స్యతే
గమ్యమానే ద్విగమనం యదా నైవోపపద్యతే.

4. గమ్యమానస్య గమనం యస్య తస్య ప్రసజ్యతే
ఋతే గతే ద్గమ్యమానం గమ్యమానం హి గమ్యతే.

5. గమ్యమానస్య గమనే ప్రసక్తం గమనద్వయమ్
యేన త ద్గమ్యమానం చ య చ్చాత్ర గమనం పునః.

6. ద్వౌ గంతారౌ ప్రసజ్యేతే ప్రసక్తే గమనద్వయే
గంతారం హి తిరస్కృత్య గమనం నోపపద్యతే.

7. గంతారం చే త్తిరస్కృత్య గమనం నోపపద్యతే
గమనే௨సతి గంతాథ కుత ఏవ భవిష్యతి?

8. గంతా న గచ్ఛతి తావ దగంతా నైవ గచ్ఛతి
అన్యో గంతు రగంతు శ్చ కస్తృతీయో హి గచ్ఛతి?

9. గంతా తావ ద్గచ్ఛతీతి కథ మే వోపపత్స్యతే
గమనేన వినా గంతా యదా నైవోపపద్యతే.

10. పక్షో గంతా గచ్ఛతీతి యస్య తస్య ప్రసజ్యతే
గమనేన వినా గంతా గంతు ర్గమన మిచ్ఛతః.

11. గమనే ద్వే ప్రసజ్యేతే గంతా యద్యుత గచ్ఛతి
గంతేతి చోచ్యతే యేన గంతా సన్ యచ్చ గచ్ఛతి.

12. గతే నారభ్యతే గంతుం గంతుం నారభ్యతేఽగతే
నారభ్యతే గమ్యమానే గంతు మారభ్యతే కుతః?

13. న పూర్వం గమనారంభా ద్గమ్యమానం న వాగతమ్
యత్రారభ్యేత గమన మగతే గమనం కుతః?

14. గతం కిం గమ్యమానం కి మగతం కిం వికల్ప్యతే
అదృశ్యమాన ఆరంభే గమన స్యైవ సర్వథా.

15. గంతా న తిష్ఠతి తావ దగంతా నైవ తిష్ఠతి
అన్యో గంతు రగంతు శ్చ క స్తృతీయోఽథ తిష్ఠతి ?

16. గంతా తావ త్తిష్ఠతీతి కథ మే వోపపత్స్యతే
గమనేన వినా గంతా యదా నైవోపపద్యతే.

17. న తిష్ఠతి గమ్యమానా న్న గతా న్నాగతా దపి
గమనం సంప్రవృత్తి శ్చ నివృత్తి శ్చ గతేః సమా.

18. య దేవ గమనం గంతా స ఏ వేతి న యుజ్యతే
అన్య ఏవ పునర్గంతా గతే రితి న యుజ్యతే.

19. య దేవ గమనం గంతా స ఏవ హి భవే ద్యది
ఏకీభావః ప్రసజ్యేత కర్తుః కర్మణ ఏవ చ.

20. అన్య ఏవ పున ర్గంతా గతే ర్యది వికల్ప్యతే
గమనం స్యా దృతే గంతు ర్గంతా స్యా ద్గమనా దృతే.

21. ఏకీభావేన వా సిద్ధి ర్నానాభావేన వా యయోః
న విద్యతే తయోః సిద్ధిః కథం ను ఖలు విద్యతే?

22. గత్యా య యోచ్యతే గంతా గతిం తాం స న గచ్ఛతి
యస్మా న్న గతి పూర్వోఽస్తి కశ్చి త్కించి ద్ధి గచ్ఛతి.

23. గత్యా య యోచ్యతే గంతా తతోఽన్యాం స న గచ్ఛతి
గతీ ద్వే నోపపద్యేతే యస్మా దేకే ప్రగచ్ఛతి.

24. సద్భూతో గమనం గంతా త్రిప్రకారం గచ్ఛతి
నాసద్భూతోఽ గమనం త్రిప్రకారం స గచ్ఛతి.

25. గమనం సదసద్భూతః త్రిప్రకారం న గచ్ఛతి
తస్మాద్గతిశ్చ గంతా చ గంతవ్యం చ న విద్యతే.

ఇత్యాచార్య నాగార్జునపాద రచితాసు మూల మధ్యమక కారికాసు
గతాగత పరీక్షా నామ ప్రకరణమ్.

[ వివరణ ]

1. పోవుట అను క్రియ ముగియువేళకైన మార్గమును గతమని యందురు, ప్రస్తుతము మనము నడచుచు చేరబోవు స్థలము గమ్యము. గతము భూతకాలమునకు చెందినది. గమ్యము వర్తమానకాలము నాశ్రయించుకొని రాబోవునది. గతము నాకు గమ్యస్థలమనుట అసంబద్ధము. గమనవ్యాపారము ప్రాదుర్భవింపక పోయినచో గమ్యమని చెప్పికొనదగినది అనాగతవిషయము. అనాగతమునకు, వర్తమానమునకు విశేషభేదముండుటచేత అనాగతమును చేరుట కుదురదు. దానిని చేరగల్గితిమేని అది అనాగతమే కాజాలదు. గతము, అనాగతము అనువానికంటె విలక్షణమైన గమ్యమానమును కూడ చేరలేము.

పోవువాడే ప్రదేశము నతిక్రమించియుండునో ఆ ప్రదేశము గతము. దేనిని వాడతిక్రమింపలేదో అది వానికి అనాగతము. గతము, అనాగతముకూడ కాకయుండు గమ్యమానమను మూడవది కన్పింపదు. గమ్యమానమగు మార్గమును పొందలేమని భావము. ఈమార్గము నాచే గమ్యమాన మనుటయే కుదురదు గనుక ఇచట గమనమే లేదనవలెను.

ఒకచోటినుండి మరియొకచోటి కొకడు వెడలునప్పుడు ఏ ప్రదేశము అతని చరణాక్రాంతమో అదే గమ్యమానమనికూడ అనలేము. కాలిప్రేళ్ళ చివరఉన్న భూపరమాణువులలో వెనుకనున్న పరమాణువులు గతించిన మార్గములో నున్నవి. ముడమక్రింపనున్న పరమాణువులలో చివరవి అనాగతములోనివి. వీనికి మించి గమ్యమానమగు పరమాణువులు కన్పింపవు.

2. అడుగుతీసి అడుగు వేయుట చేష్ట. గమన వ్యాపారమున నున్నవానికి ఎచ్చట ఇట్టి చేష్ట కన్పించునో అక్కడ గమనమున్నది. గతించిన మార్గమునగాని, అనాగతమార్గమునగాని ఈ చేష్ట కన్పింపదు గనుక ఇది గమ్యమానప్రదేశమునసే కావలెను, ఎచట గమనము కలదో అక్కడ గమ్యమానము కలదనవలెను. కాబట్టి గమ్యమానమే గమనవ్యాపారమున నున్నదని సిద్ధమగును.

3. కాని గమ్యమానమునకు గమన మెట్లు కుదురగలదు? గమ్యమానమగుచున్నది మార్గము కనుక గమ్యమానము పోవుచున్నదనుట అసంబద్ధము. పోబడుచున్నది పోవుచున్నదనుటలో రెండు గమనములు ఒకే ఒక కర్త కాపాదింపబడుచున్నవి. పోవుట అను వ్యాపారములేని గమ్యమానముండజాలదుగదా!

4. గమ్యమానమునకే గమనమున్నదని

వాదించితిమేని గమ్యమానమున మాత్రము గమనవ్యాపారముండజాలదు. నే పోవుచున్న ఈ మార్గము నాచే పొందబడుచున్నది అనుటలో పునరుక్తి ఉన్నది. ఇచట రెండు క్రియా వ్యాపారములు రాగలవు. ఒకే ఒక కర్త కేక కాలమున రెండు గమనవ్యాపారములు సంభవింప వీలులేదు.

4. పొందబడుచున్నదిఅని చెప్పినపుడే గమన క్రియాసంబంధమున్నదని, కాబట్టి గమ్యమాన వ్యపదేశమున ఇట్టి క్రియాసంబంధము లేదని వాదింప వీలులేదు. గమ్యమానమునకు గమన క్రియాసంబంధమున్నచో వస్తుతః గమ్యమానమున ఇట్టి గమన ముండ వీలులేదు. అప్పుడు గమనరహితమైన గమనము నంగీకరింపవలసి వచ్చును.

5. గమ్యమానమునకు గమనక్రియాసంబంధమున్నదనినచో ఇచట గమ్యమానమున నొక గమనము, గమనక్రియలో రెండవగమనము రాగలవు. ఒకేక్షణమున రెండు గమనవ్యాపారములను చెప్పినట్లు కాగలదు. ఏ గమనము ద్వారా మార్గము గమ్యమానమగునో అది మొదటి గమనము. గమ్యమానమునగల వర్తమానగమనము రెండవది. ఈ రెండు గమనము లేక కాలమున పొసగవు.

6. రెండు గమనములు ఏకకాలమున నున్నవని అంగీకరింపవలసివచ్చినచో ఇద్దరు గమనశీలు రుండవలెను. పోవువాడు లేనిచో పోవుట యనునది ఉండదు గనుక గంతృద్వయము నంగీకరింపవలెను. గమ్యమానమున, గమనమున ఒకే ఒక కర్త యున్నచో రెండు గమనము లుండ వీలులేదు.

కాని ఒకే ఒక వ్యక్తి కూర్చొనియుండి మాట్లాడునపు డతడు రెండు వ్యాపారములను చేయుటలేదా? అను ఆశంక రావచ్చును. ఇచట వ్యక్తి ఒకడైనను అతని కభిన్నమైన శక్తులు గలవని అంగీకరించుచున్నాము. కూర్చొనియుండుటయే అతని మాటలాడు వ్యాపారము కాదుగదా! ద్రవ్య ముభయత్ర ఒకటైనను, ఈ రెండు వ్యాపారములు రెండు శకులనుంచి వచ్చునవి.

7. పోవువాడు గమనక్రియ కాశ్రయము కాజాలడని ఇక చెప్పుచున్నాడు. పోవువాడు లేనిచో పోవుటయే ఉండదు. గమనము కుదుర జాలదని వెనుక చెప్పితిమి. అప్పుడు గమనము కలవా డెట్లు లభింపగలడు? గమనశీలుడు లేనపుడు గమన మెక్కడ ఉండగలదు?

8. గమనము కలవాడు పోవుట లేదని తర్వాతి మూడు శ్లోకములలో చెప్పబడనున్నది. గమనము లేనివాడు పోనేపోలేడు. ఈ ఇరువురి కంటె భిన్నమై పోవుచున్నా డనబడు మూడవ వ్య ఎవడును లేడు గదా!

9. గమనము కలవాడు పోవుచున్నాడను వాక్యమున గమనము కలవానిలో గమనస్వభావము లేదు కనుక అతనితో పోవుట యను క్రియను జతపరచుచున్నాము. గమనములేని పోవువానిని పోవుచున్నాడన వీలులేదు. పోవుచున్నాడని మాత్ర మనవచ్చును. కాని అతని పోవుచున్నవాడని యన వీలు లేదు?

10, 11. గమనక్రియాయోగమువలననే ఒకడు పోవుచున్నవాడని వాదించినచో అతడు వస్తుతః గమనశీలము కలవాడా, కాదా? వాస్తవమైన గమనశీలమున్నవానిని మరలిపోవుచున్నాడనినచో రెండు గమనక్రియలలో అతడు చిక్కుకొనగలడు. కానిచో రెండవ గమనక్రియ లేకయే అతడు ఎప్పుడు పోవుచున్నవాడు కాగలడు? గమనశీలుడు పోవుచున్నాడని చెప్ప

రాదు. ఇట్లు కానిచో రెండు గమనములు రాగలవు. అప్పు డొకే ఒక వ్యక్తిని గంతృ ద్వయముగా పరిగణింపవలెను. ఇది అసం బద్ధము.

పోవుచున్నవాడై పోవుచున్నాడా? లేక పోకుండ పోవుచున్నాడా? లేక మూడవవిధ మేదైన గలదా? ఈ మూడు పక్షములు కుదుర వని వెనుకనే చెప్పితిమి.

12. గమనారంభ మున్నదికదా యని కొందరనవచ్చును. కాని గతించిన మార్గమున గమనారంభమున్నదా? లేక గతింపని మార్గ మున ఈ గమనారంభమున్నదా? లేక ఈ ఆరంభము గమ్యమానమార్గమున గలదా?

గమనక్రియ పరిసమాప్త మైనపుడే గతించిన మార్గముండగలదు గనుక, ఇట్టి మార్గమున వర్తమానగమనారంభమునకు ప్రసక్తి లేదు. గతించినదానికి వర్తమానమునగలదానికి పర స్పర విరోధమున్నది. ఇట్లే అనాగతమునకు, వర్తమానమునకు విరోధముండుటచే గతింపని మార్గమున వర్తమాన గమనారంభ ముండ జాలదు. గమ్యమానము లేదని, ఒకవేళ ఉన్నచో గమనద్వయము, గంతృద్వయము రాగలవని చెప్పితిమి గనుక గమ్యమానమున కూడ గమనారంభమునకు తావులేదు. కావున గమనారంభ మెక్కడ?

13. ఇచట ఎట్లున్నాడో అట్లే ఉన్న దేవ దత్తుడు గమనము నారంభింపజాలడు, గమనా రంభమునకు పూర్వము గమ్యమానమగు మార్గముగాని, గతించిన మార్గముకాని అతనికి లేవు గనుక ఈ రెండు మార్గములను గురించిన గమనారంభము కుదురదు. గతింపని మార్గ విషయమున గమన మెట్లు సిద్ధము కాగలదు? గమనక్రియ ప్రాదుర్భవింపని మార్గము గతిం పని మార్గము. ఇట్టి మార్గము గమనక్రియా రహితము గనుక దీనిని గురించి బయలుదేరుట పొసగదు.

14. గతము, గమ్యమానము, అగతము అని మార్గములను మూడు విధముల కల్పించుట అసంగతము. గమనారంభమే కన్పింపనిచో, ఈ మార్గ త్రైవిధ్య మెందుకు?

15. "గమనము, స్థితి అనునవి సాపేక్షక శబ్దములు. స్థితి యనునది ఉన్నది గనుక గమనముకూడ కలదు" అను ఆక్షేపమున కిక సమాధాన మీయబడుచున్నది.

పోవుచున్నవాడు నిలబడియుండుటలేదని తర్వాతి శ్లోకమున గలదు, గమనము లేనివాడు నిలబడియే ఉన్నాడు గనుక, మరల నిలబడి యున్నాడనిన క్రియాద్వయ ప్రసక్తి రాగలదు. ఒక క్రియవలన గమనరహితుడని, మరియొక క్రియవలన నిలబడియున్నాడని చెప్పిన కర్తృ ద్వయము రాగలదు. గమనము, గమనరాహి త్యము గలవారికంటె భిన్నమైన మూడవవ్యక్తి ఈ సందర్భమున లేదు.

16. నిలబడియున్నాడని చెప్పినపుడు స్థితికి విరుద్ధమైన గమనము నతనికి ఆపాదింప వీలు లేదు. నిలబడియున్నవాడు గమనములేనివాడు. గమనరహితుడు పోవుచున్నవాడు కాజాలడు.

17. గమన మనునది లేదని సిద్ధాంతించి తిమి గనుక గతించిన మార్గమునుంచి పోవు చున్నవాడు మరల రాజాలడు. ఇట్లే గతింపని మార్గమునుంచికూడ అతనికి నివర్తన లేదు. గమ్యమాన మనునది లేదు గనుకను, ఒకవేళ ఉన్నచో నట గమనక్రియ కన్పింపదు గను కను, గమ్యమానమార్గమునుంచికూడ నివర్తన ఉండవీలులేదు.

నిలబడియుండుట అనుదానిని సిద్ధింపజేయుటకై సాధింపబడు గమనము పూర్వము నిరస్తమైన గమనము వంటిదే. గమనమే కుదురనిచో, దీనిని ఆశ్రయించుకొని గతిసాపేక్షమైన స్థితి కూడ కుదురజాలదు. పూర్వము గమనారంభము కుదురదని చెప్పిన రీతిగానే స్థితియొక్క ఆరంభముకూడ సిద్ధింపజాలదని చెప్పికొనవలెను.

18, 19, 20. గమన మనునది ఉన్నదనినచో, అది గంతృవ్యతిరిక్తమైన కావలెను, లేక తదవ్యతిరిక్తమైన కావలెను. గమనమేదో దానినే గమనము కలవాడని చెప్పితిమేని కర్తకు క్రియకు ఐక్యము సిద్ధము కాగలదు. అప్పుడు ఇది గమనక్రియ, వాడు గమనము కలవాడు, అను వివేకమునకు తావుండదు. ఛేదించువాడు, ఛేదనము అభిన్నములు కావుగదా! గమనము కలవానికి, గమనమునకు భేదమున్నచో, అప్పుడు గమనము కలవాడు గమనక్రియపై ఆధారపడనక్కరలేదు. ఇట్లే గంతృనిరపేక్షమైన గమన ముండవలెను. కాని ఇది అసంభవము.

21. ఏకీభావమని చెప్పినను, భిన్నమని చెప్పినను గంతృగమనములు సిద్ధింపజాలవు గనుక పోవుట, పోవువాడు అనునవి కన్పించుట లేదు.

22. ఏగమనవ్యాపారముద్వారా దేవదత్తుడు గంతృశబ్దముచే వ్యవహరింపబడుచున్నాడో, ఆవ్యక్తి పోవుచున్నవాడైనను పోజాలడు. గమనవ్యాపారసంబంధమున్నపుడే పోగలవానికి వస్తుతః గమనములేదు. అసలు గమనమే లేనివాడెట్లు పోగలడు? గమనమునకు పూర్వమే గంతృశబ్దముచే వ్యవహరింపబడినను పోజాలనివాడు ఆతర్వాత మాత్రము పోలేడు గదా! గమనము నపేక్షింపకయే పోవువాడని చెప్పబడువాడు ఎక్కడకు పోగలడు?

23. గమనవ్యాపారమున్నపుడే పోగల గంతృశబ్దవాచ్యునకు రెండు గమనములుండవలెను. గంతృశబ్దమున నొక గమనము, గమన వ్యాపారమున మరియొక గమనము రాగలవు. ఒకే ఒక వ్యక్తికి గమనద్వయము కుదురదు గదా! ఇట్లే వక్త మాట్లాడుచున్నాడు, కర్త క్రియను చేయుచున్నాడు అని మొదలుగాగల ప్రయోగములుకూడ నిరస్తములగుచున్నవి.

24, 25. గమనవ్యాపారముతో సంబంధముగల పోవువాడు, ఇట్టి వ్యాపారములేని గంతృశబ్దాభిధేయుడు, గమనాగమన వ్యాపారముల సంబంధముగల పోవువాడు సిద్ధము కాజాలరు. ఇట్లే మూడు విధముల గమనముకూడ సిద్ధింప వీలులేదు. కావున పోవువాడు, పోవుట, పోబడుస్థలము ఎక్కడను కన్పింపవు.

శ్రీ ఆచార్య నాగార్జునులు రచించిన
గతాగత పరీక్షా ప్రకరణము.

ఒకానొకడు జ్వరగ్రస్తుడై మంచముపట్టి ఉన్నాడు అనుకొనుము. నీవు ప్రాతపద్ధతిని దేశీయౌషధములు ఇచ్చి వ్యాధిని మెల్లగా కుదుర్తము అని అనుకొంటివేని, ఈలోగా రోగికి ప్రాణములుపోయినను పోవచ్చును. అతనిశరీరపరిస్థితి అధిక విలంబమును ఓర్వదు. డి. గుప్తాగారి చుఱుకైన మందే ఈ దినాలలో సరియైనది. భగవత్ప్రార్థనము భగవత్సంకీర్తనము మున్నగు వానితో కూడిన భక్తిమార్గమే భక్తియోగమే కలియుగమున ఉత్తమోత్తమ మైనది. —శ్రీరామకృష్ణుడు

ఓం తత్సత్ నమస్తే!

# మోక్షసాధన

## శ్రీ శ్రీ నిత్యానందస్వాములు

శ్లో॥ సృష్ట్వా పురాణి వివిధా న్య
జయా ఒఒత్మ శక్త్యా
వృక్షాన్ సరీసృపపశూన్
ఖగ దంశ మత్స్యాన్ ।
తైస్తైరతుష్ట హృదయః
పురుషో విధాయ
బ్రహ్మావలోకధిషణం
ముద మాప దేవః ॥

(శ్రీమద్భాగవతమ్)

తా॥ బ్రహ్మదేవుడు ఆదికాలమున వృక్షములు, సర్పములు, మృగములు, పక్షులు, దోమలు, చేపలు మొదలగు సమస్త ప్రాణికోట్లను సృజించి, అన్నిటిని పరిశోధింపగా వానిలో దేనికిని ఆత్మస్వరూపజ్ఞానమును తెలిసికొనెడు శక్తి లేకపోవుటచేత తన సృష్టియంతయు వ్యర్థమయ్యెనని తలంచి, చింతాపరవశుడై దీర్ఘముగా నాలోచించి తన తపశ్శక్తి నంతయు కేంద్రీకరించి బ్రహ్మసాక్షాత్కారమును కలుగజేసికొనుటకు తగిన శుద్ధాంతఃకరణముగల మానవుని సృష్టించి పరిశీలింపగా తన సృష్టి సార్థకమయినదని తలంచి మహానందమును పొందెను. కావుననే మానవజన్మము శ్రేష్ఠమనియు, ఈమనుష్యజన్మలోనే మోక్షమును సంపాదించుకొనవలయుననియు గురువు తెలిపెడు రహస్యము.

మూ॥ య థాదర్శే త థాత్మని
యథాస్వప్నే తథా పితృలోకే
య థాప్సుపరీవ దదృశే
తథా గంధర్వలోకే ఛాయా
తపయోరివ బ్రహ్మలోకే॥

(కఠోపనిషత్)

తా॥ ఏలాగున మానవునికి నిలువుటద్దమున తన శరీరము సంపూర్ణముగా స్పష్టముగా గనిపించునో, ఆలాగున ఈమానవజన్మమునకు బ్రహ్మమును సాక్షాత్కరించుటకు తగిన హృదయసృష్టి ఏర్పడియున్నది. పితృలోకములో గల సృష్టి యెటువంటిదనగా, స్వప్నములో (కలలో) కనినట్లు అస్పష్టముగానే యుండును. స్వర్గలోకములోగల సృష్టి ఎట్టిదనగా, ఏలాగున నీటిలో ప్రతిఫలించిన తన శరీరము అస్పష్టముగా, నల్లగా గోచరించునో, ఆలాగున దేవలోకములోగల దేవతల సృష్టియుండును. కట్టకడకు సత్యలోకమగు బ్రహ్మలోకములోగల సృష్టియు నిరూపింపబడుచున్నది. ఏలాగున అచ్చటనున్నవారికి ఎండలో గనపడిన నీడ నల్లగా అస్పష్టముగా గోచరించునో, ఆలాగున ఆలోకవాసులసృష్టియు నుండును. కావుననే మానవజన్మమున కింత యాధిక్యము కలుగుచున్నది.

నిలువుటద్దముదగ్గర నిలిచిన, తాను ధరించిన వస్త్ర ఆభరణాది చిహ్నములన్నియు స్పష్టముగా గోచరమగునట్లు పరమాత్మను సంపూర్ణముగా సాక్షాత్కరించుట మానవజన్మ హృదయసృష్టి యొకటి మాత్రమే తగినదిగా ఉన్నది. తక్కిన లోకవాసులందరును మరల భూలోకమున జనన మొందియే భగవత్సాక్షా

త్కారజ్ఞానమును పొందవలసియుందురు. అట్టి మహత్తరమగు పుణ్యముచే గలిగిన మానవ జన్మయొక్క విలువను తెలియజాలకపోవు చున్నారు. (జగత్తు సృష్టి)

శ్లో॥ యథోర్ణనాభిః సృజతేగృహ్ణతే,
యథాపృథివ్యా మోషధయః సంభవంతి।
యథాసతః పురుషాత్ కేశరోమాని,
తథాక్షరాత్ సంభవతీహవిశ్వం॥
(ముండకోపనిషత్)

తా॥ సాలెపురుగు తనయందు వేరొకసహాయము లేకయే దారములను సృజించి, తిరిగి ఎట్లు తనరూపముగానే చేయునో, వృక్షలతాదులు భూమికి వేరుకానటువంటివై భూమియందెట్లు ఆ భూమి తమకు కారణము కానటువంటివై పుట్టుచున్నవో, బ్రతికియుండిన పురుషునివలన వానికి వేరగు జడములైన వెంట్రుకలెట్లు శిరోదేహములందు పుట్టుచున్నవో, ఆ ప్రకారము సమస్త జగత్తు నాశరహితమయిన ఆ పరబ్రహ్మమునుండి, అసహాయమై, అభిన్నమై, విలక్షణమై, ఈసంసారసమూహము నందుపుట్టుచున్నవి.

శ్లో॥ బృహచ్చ తద్దివ్య మచింత్యరూపం,
సూక్ష్మాచ్చ తత్సూక్ష్మతరం విభాతి।
దూరాత్సుదూరే తదిహాన్తికేచ,
పశ్యత్స్విహైవ నిహితం గుహాయాం॥
(పరబ్రహ్మస్వరూపమ్)

తా॥ ఆపరబ్రహ్మము సర్వత్రవ్యాప్తమైనిండియున్నది. అది అతిసూక్ష్మమగు ఆకాశమునకంటెను మిక్కిలి సూక్ష్మమైనది. ఇంద్రియాతీతమై స్వయంప్రకాశమైనది. మనస్సుచేత ధ్యానించుట కలవిగానిదై, చంద్రాదిత్యాది రూపములతో, ననేకవిధముల ప్రకాశించుచున్నది. ఆ పరబ్రహ్మము, అజ్ఞానులకు అతిదూరముగానున్నది, జ్ఞానులకు ఈదేహమందే మిక్కిలి సమీపముగా నున్నది. ఆత్మదర్శనము చేయుచున్న యోగులకు, ఈ దేహమందలి బుద్ధి గుహయందే ఉన్నది.

శ్లో॥ నాయమాత్మా ప్రవచనేన లభ్యో
నమేధయా న బహునాశ్రుతేన।
యమేవైషవృణుతే తేనలభ్య
స్తస్యైష ఆత్మా వివృణుతేతనూంస్వాం॥

తా॥ ఈ ఆత్మస్వరూపము వేదశాస్త్రాధ్యయనమువలన కలిగెడి విశేషవక్తృత్వముచేతను, గ్రంథధారణాశక్తిచేతను, మిక్కిలి శ్రవణముచేతను, పొందుటకలవిగానిది. ఆత్మానుగ్రహము ఏవిద్వాంసునియందు ప్రసరించునో, అట్టి విద్వాంసుడు ఆత్మను పొందుచున్నాడు. ఇంతకు వేరొక యుపాయములేదు. ఆత్మస్వరూపమును పొందవలయుననెడి ఇచ్ఛచేత విద్వాంసుడు తరించుచున్నాడు. అట్టి సుకృతాత్మునకు ఈ ఆత్మ అవిద్యచేత కప్పబడని స్వకీయమగు ఆత్మతత్త్వమును ప్రకాశింపచేయుచున్నది.

ఆత్మతత్త్వము, ఉపనిషదుచ్చారణచేతను, ర్య, పరమేశ్వరానుగ్రహ పూర్వకమైన తత్త్వమసీత్యాది శ్రవణ, మనన, నిదిధ్యాసనములచేతనే లభించును. గౌడపాదీయ, మాండూక్య కారిక

శ్లో॥ అనాదిమాయయసుప్తో
యదాజీవః ప్రబుధ్యతే।
అజమనిద్ర మస్వప్న
మద్వైతం బుధ్యతే తదా॥

తా॥ అనాది మాయ చేత నిద్రితుడగు జీవుడు ఎప్పుడు ప్రబోధమునుపొందుచున్నాడో, అప్పుడు పుట్టుక లేనట్టియు, తమోబీజరూప

మగు నిద్ర లేనట్టియు, అన్యథా గ్రహణరూప స్వప్నవిరహితమయినట్టియు, అద్వైతమగు ఆత్మతత్త్వమును తెలిసికొనుచున్నాడు.

అనగా – సంసారియగు జీవుడు బీజాత్మరూపమున, తత్త్వము నెరుంగకపోవుటయే రూపముగా గలిగినట్టియు, అనాదికాలమునుండి ఉన్నదియును అగు మాయారూపస్వప్నము చేత నాకు ఇతడు తండ్రి నాకు ఈమెతల్లి, వీడు పుత్రుడు, వీడు మనుమడు, ఇదినాభార్య, ఇది నాయిల్లు, ఇవి నా పశువులు, భూములు, తోటలు, నేను వీనికి అధిపతిని, నేను సుఖిని, దుఃఖిని, చిక్కిపోతిని, నేను వీనిచేత పోషింపబడితిని, అని స్వప్నములను, స్వప్నజాగరస్థానములందు గాంచుచు, ఎప్పుడు నిద్రించునో, అప్పుడు వేదాంతార్థతత్త్వాభిజ్ఞుడును, పరమకరుణానిధియును అగు "సద్గురుమూర్తి" యొక్క తత్త్వమసీత్యాది మహావాక్యోపదేశ ప్రభావముచేత "ఆ బ్రహ్మమే నీవు అగుచున్నావు" అని ప్రబోధింపబడినపిదప, తన్ను నిత్య, శుద్ధ, ముక్త, ఆత్మతత్త్వమునుగా నెరుంగుచున్నాడు.

ఈ ఆత్మతత్త్వస్వరూపుడగు తురీయునియందు బాహ్యముగాగాని, ఆభ్యంతరముగాగాని జన్మాది భావవికారములు లేవు. కనుకనే అజుడనంబడును. పరబ్రహ్మవిషయమును శ్రీ గౌడపాదాచార్యులు ప్రమాణపురస్సరముగనొక్కి వక్కాణించిరి. శ్రీమచ్ఛంకరభగవత్పాదుల గురువు శ్రీగోవింద భగవత్పాదాచార్యులు. శ్రీ గోవిందభగవత్పాదాచార్యుల గురువు శ్రీగౌడ పాదాచార్యులు, అవధూత శుక బ్రహ్మర్షికి ప్రియశిష్యుడు శ్రీగౌడ పాదాచార్యులు.

యోగదర్శన నిర్మాతయగు, పతంజలి మహర్షి శ్రీశంకరభగవత్పాదులతో సంభాషించినట్లును, శ్రీగోవిందభగవత్పాదులను గురువుగ స్వీకరింపవలసినదిగా ప్రబోధించినట్లును శ్రీశంకరవిజయమున కానవచ్చుచున్నది.

"తపఃస్వాధ్యాయేశ్వర
ప్రణిధానాని క్రియాయోగాః"

తా॥ తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానము క్రియాయోగములనబడునని, పతంజలియోగదర్శనమున ప్రబోధించెను. శాస్త్రోక్తములైన ఉపవాస, వ్రత, పూజాదులే తపస్సు. మోక్షసాధకునకు తపస్సుచేయనిదే వాసనలు క్షీణింపవు. వాసనాత్రయము క్షయముకానిదే ఈశ్వరదర్శనము లభింపదు. ఈశ్వరదర్శనము లభింపనిదే జనన మరణ రూపమగు సంసారమునుండి ముక్తిలేదు. కావున మోక్షసాధకునకీ తపస్సు అవశ్య కర్తవ్యము. స్వాధ్యాయ మనగా – వేదాధ్యయనము, సద్గ్రంథపఠనము, ప్రణవజపము, లేక "ఓం నమః శివాయ" "ఓం నమో నారాయణాయ" అనెడు మంత్రజపములు.

ఈశ్వరప్రణిధాన మనగా – పరమేశ్వరునికి సమస్త కర్మల నర్పించి, తత్పరాయణుడై యుండుట. ఇదియే క్రియాయోగము. క్రియాయోగము నభ్యసించుచు, పరమేశ్వరధ్యానము నొనర్చినచో పంచక్లేశములు తొలగిపోయి అఖండానంద ఘనమగు సమాధి లభించును.

పంచక్లేశములు నశింపనిదే మోక్షము లేదు. యోగదర్శనము చూడుడు.

"అవిద్యా అస్మితా రాగ
ద్వేషాభినివేశాః పంచక్లేశాః"

తా॥ అవిద్య, అస్మిత, రాగము, ద్వేషము,

అభినివేశములను పంచక్లేశములని మహాయోగి పతంజలి మహర్షి పేర్కొనియున్నాడు. ప్రతి సాధకుడును వీని పాలిట బడుచుండును. ఈ పంచక్లేశములనుండి విడివడనిదే భక్తిపథమునగాని, యోగమార్గమునగాని ప్రయాణమును సాగింప వీలుండదు. వీని శక్తి అపారము. సాక్షాత్ దేవతలే వీనికి బానిసలైరి. మానవమాత్రులన నెంత? అవిద్యా అస్మితాదులు ఒకప్పుడు బీజభావమున, సూక్ష్మగతిని, నిద్రలో వలె అణిగియుండును. సమయముదొరకినప్పుడు మానవునిపైబడి హతమొనర్చును. అందుచేత వీనినుండి తప్పించుకొనుటకు ప్రతి సాధకుడును జాగరూకుడై యుండవలయును.

ఇప్పుడనుభవించుచున్నవానిని అనుభవించియేతీరవలెను. ప్రస్తుతము దీనిని తప్పించుకొను ఉపాయము లేదు. కాని ఇకముందు మాత్రము ఈక్లేశములకు లోబడకుండ తగిన జాగ్రత్తను వహింపవలెను. జీవితకాలమంతయు పంచక్లేశములతో గడచిపోయిన యెడల, ఇక పరమేశ్వరుని ధ్యానించుటకు సమయమెప్పుడు లభించును ?

అవిద్యయనగా ఏమో విచారింతము—

క్షణభంగురమగు జగత్తును నిత్యమని తలంచుట, అశుచి, అనాత్మయగు శరీరమును శుచి, ఆత్మయని తలచుట, దుఃఖమును సుఖమనియు చెడుదానిని మంచిదనియు ఎంచుట అవిద్యా ప్రభావమే. ఇది అవిద్యాజనితమగు క్లేశము. ప్రతిబింబ రూపమున పరమాత్మతో దీనికి గలిగిన సంయోగమువలననే ఈసృష్టిపైన పేర్కొనబడిన అస్మితాదులు దీనినుండియే జనించినవి. దృక్‌శక్తి, దర్శనశక్తి ఈ రెంటికిని భోగ్యభోక్తృత్వసంబంధమున్నది. దృక్‌శక్తి యనగా పురుషచైతన్యము, భోక్త. దర్శనశక్తి శుద్ధ సత్వగుణసంపన్నమగు బుద్ధి, భోగ్యము. ఈ రెంటియొక్క ఏకీభావమే అస్మిత. అసంగుడును, అకర్తయునగు పురుషుని భావమే అస్మితాజనిత క్లేశము. విషయ సుఖములను అనుభవించు ఇచ్ఛయే, రాగము. ఒకప్పుడు అనుభవించిన సుఖములను మరల మరల అనుభవింపవలయునని తలంచుటయే అనురాగము. అనుభవించిన దుఃఖమునెడ గల్గు విరక్తియే ద్వేషము. దీనినుండియే క్రోధము ఉత్పన్నమగును. మరల మరల పుట్టుచు, చచ్చుచుండుటవలన గలిగిన మృత్యుభయము. బ్రతికియుండవలయునని తలంచుటయే అభినివేశము. ఈ పంచక్లేశ నాశముకానిదే మోక్షము లేదు. మొదట తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వరప్రణిధానములను క్రియాయోగమువలన వీనిని సూక్ష్మీకరించి, ధ్యానయోగబలమున మొదలంట పెరికి వేయవలెను. ఈ క్రియాయోగము మొదటిమెట్టు. ప్రతిసాధకుడును క్రియాయోగ మభ్యసింపవలెను.

శ్లో॥ తపసా ప్రాప్యతే సత్త్వం
సత్త్వాత్సంప్రాప్యతే మనః ।
మనసా ప్రాప్యతే హ్యాత్మా
హ్యాత్మాపత్త్యానివర్తతే ॥

తా॥ తపస్సువలన సత్త్వగుణ మభివృద్ధి యగును. ఆత్మానాత్మ విచారజ్ఞాన మలవడును. సత్వగుణాధిక్యమువలన మనస్సు శుద్ధమగును. రాగద్వేష విహీనమగు శుద్ధమనస్సువలన ఆత్మ స్ఫురించును. ఆత్మస్ఫూర్తివలన సంసార దుఃఖము నివర్తించునని సామవేదాంర్గత మైత్రేయ్యుపనిషత్తు ఘోషించుచున్నది.

# శ్రీ ప్రేమానందస్వామి

శ్రీ సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు, బి.ఏ.

శ్రీరామకృష్ణపరమహంస, తమ శిష్యులలో నార్గురను 'ఈశ్వరకోటు' లని వర్ణించుచుండిరి. ఈశ్వరకోటి యనగా దైవాంశసంభూతుడనియు, నిరంతర బంధరహితుడనియు (డివైన్ అండ్ ఎవర్ ఫ్రీ) అర్థము. ఈ అంతశ్శిష్యకోటికి చెందిన వారు ప్రేమానందస్వాములు.

వీరు 1861 సం॥ డిసెంబరు నెల 10–వ తేదీ నాడు జన్మించిరి. వీరి స్వగ్రామము వంగదేశ మందలి హూగ్లీ జిల్లాలోని ఆన్ త్ పూరు. కాయస్థకులమునకు చెందినవారు. తండ్రి తగు మాత్రము స్థితిమంతులు. లక్ష్మీనారాయణుడు కులదైవము. తలిదండ్రులిరువురును దైవభక్తి యుతులు. వీరికి ముగ్గురు కుమారులును, ఒక కుమార్తెయు గలరు. ప్రేమానందుల మొదటి పేరు బాబూరాం.

శ్రీరామకృష్ణులకు కలకత్తానగరమున బలరాంబోసను శిష్యులు కలరు. బాబూరాం తోబుట్టువగు కృష్ణభావినిని వీరు పెండ్లియాడిరి. ఇందువలన బాబూరాం కుటుంబమునకును, గురుమహారాజునకును సన్నిహిత సంబంధ మేర్పడెను. తలిదండ్రులు భగవత్సేవానిరతు లగుటచే బాబూరామునకు ఆధ్యాత్మికవిషయ ములందు సహజముగనే శ్రద్ధ ఏర్పడెను. కాని, బాబూరాముని గొప్పగుణములన్నియు తలిదండ్రులవలననే ఏర్పడజాలినవి కావు. పూర్వజన్మవాసనయు గలదు. మాటలుకూడ సరిగ రాకముందే, ఎవరైనను వేడుకకు పెండ్లిమాట లాడిన, "అయ్యో!, నాకు పెండ్లిచేయకుడు, చేయకుడు! నేను నశించిపోవుదును" అని బాబూరాం ఆక్రందనమొనర్చును. పల్లె బడియందలి బాలుర ఇతనియందుంచిన ప్రేమకు కారణము సుగ్రాహ్యముకాకుండెను; ఆత్మీయప్రేమ. ఎనిమిదేండ్లప్రాయమునందే త్యాగమును, తపస్సునుఆబాలుని ఆదర్శములు.

శ్రీరామకృష్ణుని వచనామృతమును పుస్తక రూపమున మనకు ప్రసాదించి, మహోపకార మొనర్చిన శ్రీమహేంద్రనాథగుప్త (మ). ప్రధానోపాధ్యాయుడుగానుండిన కలకత్తానగర మందలి మెట్రోపాలిటన్ ఇన్స్టిట్యూషన్ (బడి) లో బాబూరాం చేరెను. శ్రీరామ కృష్ణునితో సన్నిహిత సంబంధ మేర్పడుటకు ఇది రెండవకారణము. సన్న్యాసాశ్రమమున బ్రహ్మానందు లనబరగిన రాఖాలును, బాబూరామును, ఒకేతరగతియందు చదువుచుండిరి. ఇదియు ఒక విశేషమే. ఈకాలమున ఏర్పడిన స్నేహము ఆజన్మాంతసంబంధముగ వెలసెను. రాఖాలు అప్పుడప్పుడు దక్షిణేశ్వరమునకువెళ్లి, శ్రీరామకృష్ణుని సందర్శించుచుండెను. ఈ బాలుని మూలమునకూడ బాబూరామునకు గురుమహారాజుకీర్తి ఎరుకపడెను.

ఒకనాడు, బాబూరామును, రాఖాలును దక్షిణేశ్వరమునకు నెడలిరి. దారిలో రాందయాళుడను నతడును వీరిని గలసికొనెను. దక్షిణేశ్వరములో గురుమహారాజు తన్మయావస్థలో నుండెను. రాఖాలు ఆయనను చేయి బట్టి, జాగ్రత్తగ ఆయనగదికి గొనివచ్చెను.

మామూలుస్థితికి వచ్చినపిమ్మట, బాబూ రామునిజూచి, అతడెవ్వరని యడిగెను. బలరాముని బావమరదియని తెలియగనే, "అట్లి-చో, నీవు మాకును ఆత్మీయుడవే" అని పరమహంస సెలవిచ్చెను.

పిమ్మట బాబూరాముని సాముద్రికలక్షణములను శ్రీరామకృష్ణుడు పరిశీలించెను. అవి ఆయనకు నచ్చినవి. (అనగా ఆధ్యాత్మికోన్నతికి యోగ్యతను సూచించినవి). దక్షిణేశ్వరమందలి పంచవటి మున్నగు స్థలములన్నియు ఆ బాలునకు పూర్వపరిచితములువలె తోచినవి! బాల్యమునందు తాను ఆదర్శస్థలమని కలలు గాంచిన తపోవనములవలె.

వారము రోజులతరువాత బాబూరాం మరల దక్షిణేశ్వరమునకు వెళ్లెను. అప్పుడు నరేంద్రునితో నతనికి బరిచయముగలిగెను. ఇతర భక్తులను సందర్శించెను. మొదటి నుండియు నరేంద్రు నాతడు చాల మెచ్చుకొనెను. నరేంద్రుని చూచినమాత్రముననే ఎల్లరకును ప్రేమ కలుగుచుండెను. శ్రీరామకృష్ణుని గొప్ప ప్రేమయు, పరిశుద్ధతయు, బాబూరాముని నానాటికి ఆకర్షించినవి. గురుమహారాజుతోడి సంబంధము ఈ జీవితమునందు ప్రారంభమైనదిగాదనియు, పూర్వజన్మ సంబంధమనియు బాబూరామునకు సువిదితమయ్యెను. బాల్యమునందలి తన మహాదర్శముల మూర్తిభావమే పరమహంసయని యాతడు కనుగొనెను.

గురుమహారాజును కలసికొనునపుడు బాబూరాం వయస్సు ఇరువదికి తక్కువే. ప్రపంచ వాసన కొంచెమేని లేని పరిశుద్ధ శీలముగల వాడు. తన జీవితమంతయు ఒక బిడ్డనుబోలి అమాయికుడుగనే యుండెను. చెడు కార్యములను జేయుట యటుండగా, అట్టివున్నవనిగూడ అతడెరుగడు. అతని పవిత్ర శీలము నెరింగి శ్రీరామకృష్ణు డాతనియందు గొప్ప యభిప్రాయము గలిగియుండెను. ఒక దివ్యదర్శనమందు, కంఠాభరణమును ధరించిన దేవతవలె బాబూరాం గురుదేవున కగపడెను. దీనినిబట్టి అతని పవిత్రత ఆయనకు దెలిసెను.

ఈ కారణమునుబట్టియే శ్రీ రామకృష్ణు నెల్లప్పుడును కనుపెట్టియుండుటకు బాబూరాం తగినవాడని తక్కుంగల భక్తులు భావించిరి. బాబూరాం తనయొద్దనుండ ఆయనయు నభిలషించుచుండెను. గురుదేవుని సాంగత్యమువలన బాబూరాం ఆత్మచింతన తీవ్రమయ్యెను. చదువు పేలవముగ తోచెను; కావున క్షీణించెను. 1884లో ప్రవేశకపరీక్షయందు తప్పెను. గురుమహారాజు కిది తెలిసినప్పుడు ఆయన, "ఇంకను మంచిదయ్యెను; అతడు శృంఖలముల నుండి విడివడెను" అని చెప్పెను.

బాబూరాం తల్లి తనకుమారుడు పరమహంసయొద్ద నుండుటకు సంతోషముతో సమ్మతించెను. తనకుగూడ భగవత్సేవను ప్రసాదింపుమనియే వేడుకొనెను. అప్పటినుండి బాబూరాం గురుదేవుని మరి వదలలేదు. బాబూరాము తన ఆత్మకు చెలికాడు అని ఆయన చెప్పుచుండెను; అతనిని అంతగా ప్రేమించెను.

ప్రేమానందస్వాములు గురుదేవుని ప్రేమను తఱచు శిష్యులకు వర్ణించుచుండును. యువక సన్న్యాసులనుజూచి, ఆయన యిట్లనును: "నేనుమిమ్ములను ప్రేమించుచున్నానా? లేదు; అట్లేయగుచో, మిమ్ములను ప్రేమపాశములచే కట్టివేయగలిగి యుందును. ఆహా, గురుదేవుడు మమ్ముల నెంతగా ప్రేమించెను! మేము దానిలో నొక నూరవవంతు గూడ మిమ్ములను ప్రేమించుటలేదు". బాబూరాముని జూచుటకు పరమ

హంస తఱచు కలకత్తా వెళ్లెను. అచట తన చేతులతో అపురూపవస్తువులను తినిపించును! బాబూరాం కలకత్తాకు తన్ను విడిచి వెళ్లి యుండినచో, తఱచు ఆయన ఒక బిడ్డవలె విలపించును!

శ్రీరామకృష్ణుని ప్రేమయు, తీయని పలుకులును యువకశిష్యుని ఆత్మను సరిదిద్దుచుండెను. ఆయన జీవితమే ఒక పెద్ద యుపదేశమాయెను! ఆయన బోధనాపద్ధతులును అపూర్వములే! పేరు ప్రతిష్ఠలందు గురుదేవునకుగల బలమగు వెగటే శిష్యునకును గలిగెను. తనకుగూడ భక్తి తన్మయత్వము గలుగవలెనని శిష్యుడు గురుని వేడుకొనెను. బాబూరామునకై పరమహంస లోకమాతను ప్రార్థింపగా, ఆమె బాబూరామునకు జ్ఞానము సిద్ధించునుగాని, భావము (తన్మయత్వము) లభింపదని తెలియజేసెనట. గురుదేవు డిందులకు సంతసించెను.

గురుదేవుడు జబ్బుపడినపుడు, కాశీపూరులో బాబూరా మాతని కడుశ్రద్ధతో సేవించెను. ఆయన మరణించినపిమ్మట బరానగోరు నందలి సన్న్యాసమఠములో జేరెను. 1886–వ సంవత్సరము చివరను నరేంద్రనాథుడు (వివేకానందుడు) మున్నగు పరమహంసయొక్క శిష్యులందరు సన్న్యాసాశ్రమమును గైకొనిరి. ప్రేమదైవమగు రాధయొక్క అంశము కొంతమట్టుకు బాబూరామునందు గలదని గురుదేవుడు చెప్పియుండెనుగాన, అతనికి వివేకానందుడు ''ప్రేమానందు'' డను ఆశ్రమనామము నొసంగెను.

కొంతకాలము ప్రేమానందుడు మఠమున పూజను నిర్వర్తించుచుండెను. పిమ్మట ఉత్తరహిందూస్థానమున తీర్థయాత్ర యొనరించెను. బేలూరునకు మఠము మారినతరువాతకూడ ఆయనయే పూజను గావించుచుండెను. వివేకానందుని మృతితో, ప్రేమానందుల పవిత్రజీవితములో నొక నూతన ఘట్టము ప్రారంభమయ్యెను. వీరియందుగల పరిమితిలేని ప్రేమను, కరుణను, మార్దవమును, అఖండ శక్తిని, ప్రచండ భావోద్రేకమును ప్రపంచ మారోజులలో నెరుగనే యెరుగదు; నాచుట కాయన ఒక నెమ్మదైనట్టియు, నలుగురికంట బడనట్టియు సాధారణవ్యక్తియే. ఆయనపై బడిన పెద్ద బాధ్యతలు ఆయన వ్యక్తిత్వములోని అనంతమును, పరిపూర్ణతను సువిదితమొనర్చెను. రామకృష్ణమిషన్ వ్యవహారములను బ్రహ్మానందులు గమనించుచుండిరి. ఇందుకొరకై ఆయన దేశమంతటను సంచారముగావింప వలసి యుండెను. కావున బేలూరు నందలి మఠముయొక్క పెత్తనము ప్రేమానందులకు సంక్రమించెను. మందిరమునందలి నిత్యపూజావిధానము, యువక బ్రహ్మచారులయొక్కయు, సన్న్యాసులయొక్కయు తరిఫీదు, మఠమునకు చెందిన 'గృహకృత్యములు', భక్తులకును, అతిథులకును స్వాగతమొసంగి, వారికి ఆధ్యాత్మిక శిక్షణ నొసంగుట—మున్నగు నీ కార్యకలాపముతో ప్రేమానందులకు ఊపిరిసలుపనంత పనియుండెను.

తక్కిన శిష్యులందరికన్నను గూడ ప్రేమానందులు శ్రీరామకృష్ణుని ప్రేమగుణమును ప్రతిబింబించుచుండిరి. మఠమునకాయన 'తల్లి'. పాపులనుగూడ తల్లివలె ప్రేమించి, యుద్ధరించుచుండిరి. వారియందలి భక్తి, సేవాగుణములను—నిగూఢములై యుండినవానిని — ఆయన ప్రేమ శక్తి బయటకు గొనితెచ్చుచుండెను. ఈ శక్తిచే నాకర్షింపబడి భక్తులెందరో మఠమునందు గుమిగూడుచుండిరి. ఒక్కసారి వారిని కలిసి

కొనినమాత్రమున, వారియందు దాని ఫలితము ఎన్నటికిని గన్పట్టుచునే యుండెను. ఆయన మానవసేవనే దైవసేవగా పరిగణించుచుండెను.

తమ శిష్యులగు యువకులు అన్ని పనులను సామర్థ్యముతో నిర్వహింపగలిగియుండవలెనని ఆయన యభిలషించి, అందులకు సదా ప్రయత్నించుచుండెను. పూజ, వంట, గోసంరక్షణము, పారిశుద్ధ్యపుపని—అన్నిటిని వారు నేర్చియుండవలెను. పనిలో కొంచెము లోటుపాటును గూడ ఆయన గర్హించును. కాని అచిరకాలములోనే దానిని మరచి, క్షమించును. గురుదేవునివలెనే ఆయనయు తమయుపదేశములచేత కన్న, చేతలచేతనే శిష్యులకు మంచి గుణములను నేర్పుచుండెను. ఒకసారి ఒక మహమ్మదీయుని ఎంగిలాకును తదితరులు తీయుటకు ఇష్టపడనపుడు, తానే తీసివేసి, మార్గదర్శకులయిరి. వేరొకసందర్భమున నొక మహమ్మదీయుడు, అందరిలోనునున్న దైవమొక్కడే యని స్వామిజీ చెప్పుటవిని, తాను ముట్టిన వస్తువును వారు భుజింతురాయని ప్రశ్నించెను. వెంటనే ప్రేమానందు లట్లొనరించిరి.

ఆపెద్ద మఠమునందు పలువిధములైన స్వభావములుగల భక్తులెందరోయుండిరి. కావున మఠవ్యవహారములను నడపుటలో స్వామిజీ ఎంతయో ఓర్పు, శాంతము, క్షమ చూపవలసియుండెను. తోడిసన్న్యాసితో వారొకపరి ఇట్లు సెలవిచ్చిరి: ''సాధ్యానమును, జపమును ముగించిన వెనుక, పూజాగృహముయొక్క మెట్లు దిగివచ్చునపుడు, గురుదేవుని మంత్రమును మరల మరల నుచ్చరించుచుందును — 'ఓర్చుకో, ఓర్చుకో, ఓర్చుకో ఎవరు ఓర్చుకొందురో, వారుందురు (జీవింతురు), ఎవరు ఓర్చుకొనరో, వారు నశింతురు''. గురుదేవుని చేతిపరికరమే (ఇన్స్ట్రుమెంట్) తామని వారి నమ్మిక. తమ ఉన్నతమగు ఆధ్యాత్మికజ్ఞానమునకు ఫలితముగ, ఈ ప్రపంచమంతయు దైవికజ్యోతితో నిండియున్నటులను, చెడుగనునదే ఆజ్యోతిలో మటుమాయమైపోయినటులను ఆయన అనుభవము.

1918-వ సం॥ జూలై నెం 30–వ తేదీనాడు ప్రేమానందులు తనువును వీడిరి. వీరి వస్తువులు — జ్ఞాపకార్థమైనను దొరికినవి — ఒక ఖాళీసంచియు, కొన్ని పుస్తకములును మాత్రమే. తమ సౌఖ్యమును వారెన్నడును పాటింపలేదు. భారతజాతి ఔన్నత్యము వారి ఆదర్శము. ఇట్టి మహనీయులచే స్థాపింపబడినది గావుననే, నేడు రామకృష్ణమిషన్ (గోష్ఠి) ఒక మహావృక్షముగ వెలసి, భారతమున కలంకారప్రాయమై వెలయుచున్నది. దీనిచేత ఉద్ధరింపబడుట మనవంతు. జై! గురుమహారాజునకు జై!!

అబ్జదళముపైని అంబువు నిలదు,
నరుని జీవితమును నరయఁగా నంతె,
సాధుసంగతి నుక్కి క్షణకాల మైనఁ,
బడవయై దాటించు భవసాగరమును।

—•—

# త్రిమూర్తుల ఆధిక్యము

## శ్రీ గురుభక్త పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు

పురాణములు పదునెనిమిది. ఇవి మూడు తరగతులుగా గుణభేదములనుబట్టి విభజింపబడినవి. త్రిమూర్తులలో విష్ణువు సత్త్వగుణ ప్రధానుడు. 1. విష్ణు, 2. నారదీయ, 3. భాగవత, 4. గరుడ, 5. పద్మ, 6. వరాహ ఇవిఅన్నియు సాత్త్వికములు, విష్ణుపురాణములు గనుక విష్ణువు మహాత్మ్యనుగూర్చి యెక్కువగా చెప్పును. అందుచేత "బ్రహ్మను శివుని" గురించి వీనిలో తక్కువగా చెప్పబడెను. ఒక గుణము విజృంభించినపుడు తక్కిన రెండుగుణములయొక్క శక్తి తక్కువగా నుండుట సహజమే. కనుక విష్ణువుయొక్క మహత్త్వము ఎక్కువగా చెప్పుటకు కారణమైనదని గ్రహింపవలెను.

శివునకు శుద్ధతమస్సు హెచ్చు గనుక శివుని ఆధిక్యమును గూర్చి 1. మత్స్య, 2. కూర్మ, 3. లింగ, 4. శివ, 5. స్కంధ, 6. అగ్నిపురాణములు ఘోషించును. "బ్రహ్మవిష్ణు"వులనుగూర్చి వీనిలో తక్కువగా చెప్పబడెను.

బ్రహ్మకు రజోగుణము మెండు గనుక "బ్రహ్మ" విశేషమునుగూర్చి 1. బ్రహ్మాండ, 2. బ్రహ్మ, 3. వైవర్త, 4. మార్కండేయ, 5. భవిష్య, 6. వామన పురాణములు ఎక్కువగా శ్లాఘించును. తక్కిన విష్ణుశివులనుగూర్చి వీనిలో తేలికగా చెప్పబడెను.

ఇట్లు వ్రాయుటలో బేసబబేమియు లేదు. ఏలయన ఒక్కొక్క గుణధర్మ విశేషమును చెప్పవలసి వచ్చినపుడు ఆ గుణకియే అట్టి ధర్మమునకు విశేషముగా అవసరముండును. అట్టి స్థితిలో తక్కిన రెండు గుణశక్తులును పై చెప్పిన ధర్మమునకు ఉపయోగింపవు గనుక ఒకదానిని గురించి యీ గుణముకంటె చాలతక్కువ యని చెప్పుటలో నెంత సబబున్నదో మనకు బోధపడుచున్నది.

ఉదాహరణము:—ఒకానొకడు కలెక్టరు హోదాలోను, చేరుమేను హోదాలోను, గృహస్థుగాను నుండెననుకొందము. కలెక్టరుగా పని అవసరమైనపుడు కలెక్టరే అధికుడు. ఆ పనికి చేరుమేనుగాని గృహస్థుగాని పనికిరారు. అపుడు కలెక్టరు హోదాకు ఉభయులు లోబడియుండవలసినవారే. అటువలెనే తక్కిన రెండు హోదాలును. ఇవి భేదమైనటువంటి హోదా శక్తి విశేషములుగాని చేయువాడు ఒకడే. కనుక భిన్నమైనశక్తులను ఒకదానితో ఒకటి పోల్చుట తప్పు. అసంభవము. ఒక క్లాసులో నున్నవారిని హెచ్చుతగ్గులు కనుపెట్టుటకు పోల్చవచ్చును గాని భిన్నక్లాసులలోనివారిని ఒకరితో నొకరిని పోల్చుటకు సమాన అంతస్థు లేదు.

ఇట్టి స్థితిలో శివు డెక్కువవాడని శైవులును, విష్ణువు ఎక్కువవాడని వైష్ణవులును దేవుని పేరుమీద కలహించి జీవితకాలము యూనిట్ట్ వ్యర్థము చేయుచు పాపము చేయించు అజ్ఞానమును చూపగా బహు శోచనీయమై యున్నది. ఇటువలెనే మతభేదములు! పెట్టుకొని కలహించి దేవుని పేరుమీద ఎంత రక్తపాతము చేయుచున్నారో మనకు తెలిసినదే కదా!

దేవు డొక్కడే. నామములు భేదము మతముల ముఖ్యమూలధర్మములు సమానమే. ఇది తెలిసికొనలేక స్వభావసిద్ధమై బాహ్యభేదములను పురికొల్పుకొని మనుష్యు

లును (Individuals) జాతులును (Nations) కలహించి పురుషార్థ వృత్తులను అణగద్రొక్కి రాక్షసత్వముచేత ప్రపంచమునకు అశాంతిని మనుష్యుల పురోభివృద్ధికి భంగమును కలుగ జేయుచున్నారు.

ఇట్టి అధర్మము సంపూర్తి అయిన పిమ్మట భగవంతుడు మహాయుద్ధములను కల్పించి మనుష్యునియందుండెడు అసురత్వమును నశింప చేయుటకై ప్రజాశాసనమును కావించి తుదకు ధర్మస్థాపనము చేయును,

ఉదాహరణము :— ఈ హెచ్చుతగ్గులను గూర్చి లింగపురాణమునుండి తీసికొందము. ఒకానొకప్పుడు బ్రహ్మ విష్ణువులకు వాగ్వాదము జరిగెను. అప్పుడు విష్ణువు బ్రహ్మను "వత్సా" అని పిలువగా "బ్రహ్మ" "నేను పితామహుడను గాని వత్సను గా"నని పలికెను. దానిపై "విష్ణువు" నా నాభికమలములోనుండి వచ్చితివి గనుక నీవు నా కుమారుడవు అని నుడివెను. ఇట్లు వాదము చేయుచుండగా వీరిరువురి మధ్యను స్థాణుజ్యోతి అనగా బ్రహ్మాండమైన స్తంభమువలె తేజోరూపము బయలుదేరెను. అప్పుడు దీని ఆద్యంతములు ఎవరు కనిపట్ట గలరో వారు గొప్పవారగుదురని శబ్దము వినబడెను, అప్పుడు బ్రహ్మ హంసరూపుడై యూర్ధ్వముఖముగా నెగిరెను. విష్ణువు వరాహ రూపమై అధోముఖముగా దిగెను. తుద కిద్దరును ఆద్యంతములు కనిపట్టలేక భగ్నాశులై తిరిగి వచ్చిరి. అప్పుడు ఆకాశవాణి పలికెనట. "ఇది పరమశివుని లింగము. కనుక మీ రుభయులు కూడ దానికి లోబడవలసినవారే". కాని వీరిద్దరిమధ్య తగాయిదా తీరనే లేదు. అందుపైన బ్రహ్మ క్రింద పరుండియుండగా విష్ణువు వానినోటిలో ప్రవేశించి నాభికమలము ద్వారా పైకి వచ్చెనట. పిమ్మట విష్ణువు క్రింద పరుండగా బ్రహ్మ వాని నోటిలో ప్రవేశించి నాభికమలముద్వారా వచ్చుటకు రంధ్రము మూసికొనిపోయెనట. దానిపై విష్ణు మహాత్తు ఎక్కువ యని అంగీకరించెనట. ఇది శైవపురాణములో చెప్పబడినది. ఇక్కడ శివుని ఆధిక్యము హెచ్చు అయినది. బ్రహ్మ కనీస మాయెను. ఏల? బ్రహ్మయొక్క ధర్మము (Duty) సృష్టితో పూర్తిగా ముగిసినందున వారిని విశేషముగా నీ సమయమందు చెప్పుటకు అవసరము లేదు. వారి కెక్కడను పూజ కూడ లేకుండుటకు కారణ మిదియే! కాని రెండుచోట్ల మాత్రము వారి దేవాలయము లున్నవట. 1. అజమీరుదగ్గర పుష్కర అను పట్టణములోను, 2. గుంటూరునొద్ద చేబ్రోలు లోను మాత్రమే యున్నవి. పిమ్మట అమలులో నున్న పని విష్ణువుది శివునిదియై యున్నది. వీ రిద్దరిలోను పై కథలవలన శివుని ఆధిక్యము హెచ్చు అని విష్ణు వంగీకరింపక తప్పినదికాదు, కాని ఆయన పని ఉన్నది గనుకనే బ్రహ్మ గర్భములోనుండి నాభికమలముద్వారా వచ్చుటకు కారణ మాయెను.

మనము విష్ణుపురాణము చదివిన యెడల విష్ణు వొకానొకచోట అధికారిగానున్న శివుడు వాని ద్వారపాలకుడుగా నున్నట్టును వ్రాయబడి యున్నది. అటువలెనే బ్రహ్మపురాణము చదివినయెడల బ్రహ్మకు వారియుభయులపైన ఆధిక్యము ఎక్కువగా నున్నట్లు వ్రాయబడ్డది. ఈ పురాణము లన్నియు వ్రాసిన మహా 'కృష్ణ ద్వైపాయన వేదవ్యాసులవారు' విష్ణువు అపరావతారమై యుండినను ఇట్లు ఈ త్రిమూర్తులకును అధికారభేదములు వ్రాయుట శైవులకును వైష్ణవులకును ఎడతెగని కలహములు పెట్టుట కొరకేనా? పైన చెప్పిన సబబులతో మనము ప్రతి పురాణమును వివేకముతో పరి

శీలించినయెడల వీనిలో వ్రాసిన భేదము లన్నియు నిజమైన భేదములు కావనియు అవి యొకదానితో నొకటి పొత్తుపరచుటకు సఖ్య పరచుటకు బహు అనుకూలముగా నున్నట్లు మనకే బోధపడి ఈ ద్వేషములు శాఖాభేద ములు శుద్ధాజ్ఞానమువలన కలిగినవని మనము సిగ్గుపడుదుము.

ఇందునకు ఉదాహరణము:—అత్రి అను ఋషి గలడు. వాని భార్య అనసూయ. వారికి ముగ్గురు పుత్రులు, "సోమ, దత్తాత్రేయ, దూర్వాస ఆకాశవాణి పలికిన దేమన, "బ్రహ్మయే సోముడుగాను, విష్ణువే దత్తా త్రేయుడుగాను, శివుడే దూర్వాసుడుగాను నవతరించిరి". దీనిలోని సారస్య మేమనగా, అత్రి యనగా త్రిభేదములు లేనివాడు, కనుకనే ఆయన భార్య అనుశక్తి అనసూయ. అనగా అసూయలేనిది. ప్రేమస్వరూపురాలు. ప్రేమ అనగా ఏకత్వము. ఈ ముగ్గురున్ను అభిన్ను లైనప్పుడు (ఏకమైనప్పుడు) అసూయ యెట్లుం డును ? ఇటువలెనే పెక్కు ఉదాహరణములు మన గ్రంథములలో నున్నవి.

విష్ణుపురాణము రెండవ అధ్యాయము ఒకటవ అంశలో "జనార్దన" అను భగవంతుడు ఒక్కడే అని యున్నది. వీరు బ్రహ్మ విష్ణు శివు లను మూడు భేదములైన ఉద్యోగములు (శక్తులు)గలవారై యున్నారు. కనుకనే ఆయ నకు సృష్టి స్థితి లయ అధికార శక్తులు గలవని అభిప్రాయము. ఈ పురాణములోనే 8 వ అధ్యాయము ఒకటవ అంశలో విష్ణువే శివు డనియు ఆయన భార్య లక్ష్మియే గౌరి అనియు వ్రాయబడినది.

పద్మపురాణములో ఆదియందు విష్ణువునకు సృష్టిచేయవలయునని కోరిక గలిగి సృష్టి స్థితి లయ కారణభూతులైన మూడు వివిధశక్తులను వహించెను. ఈ సృష్టిని చేయుటకు వానియొక్క కుడిప్రక్కనుండి బ్రహ్మ వచ్చెననియు ఈ సృష్టిని రక్షించుటకు తన యెడమభాగము నుండి విష్ణువు వచ్చెననియు దానిని లయము చేయుటకు శివుడు తన నాభినుండి వచ్చెననియు వ్రాయబడెను. భాగవత పురాణము నాల్గవ స్కంధములో 7 వ అధ్యాయములో దక్షునకు హరి చెప్పిన హితబోధ ఏమనగా బ్రహ్మ విష్ణు మహేశ్వరులకును తనకును అభేదమనియు వీరు ముగ్గురు తన ముఖములే అనియు ఈ సంగతి ఎవరు గ్రహించి నమ్మి జీవించెదరో వారికి శాశ్వత సుఖము కలుగుననియు చెప్పెను.

కల్కి లింగ తదితర పురాణములలో ఒకటి మూడు మూడు ఒకటి అనియు ఈ ముగ్గురు 'భేదములేని ఒకరే' అనియు స్థిరపరుపబడ్డది. ఉదాహరణము :— కుమ్మరి కుండను చేయునపుడు దానిని రక్షించు శక్తియు నశింప జేయు శక్తియు కుమ్మరియందు లేదా? అటు వలెనే దానిని నశింపచేయునపుడు తిరిగి ఆ కుండను చేయు శక్తియు రక్షించు శక్తియు వాని యందు లేదా? అటువలెనే రక్షించు శక్తి కుమ్మ రికి నుండగా తక్కిన రెండు శక్తులు లేవా?

ఒక్కొక్క శక్తి ఉపయోగింపబడినప్పుడు తక్కిన రెండు శక్తులు నిద్రించుచున్నవియే. అటువలెనే ఈ త్రిమూర్తులను గురించి మనము గ్రహింపవలెను.

కనుక ఏ శాఖవారు ఆయా శాఖాదేవుని భజించుటకు స్వేచ్ఛగలవారై తక్కినదేవులను భజించువారిని నిరసనచేయుట అజ్ఞానము, అధర్మము అని తెలిసికొని విశాలబుద్ధితో సోదరన్యాయములు స్థిరపరచుకొని వృద్ధి పొందుదురు గాక.

# మాతృశ్రీ శారదాదేవి

## [శ్రీమద్గంభీరానందవాణి]

౪

# దివ్యజీవితంపు తొలి రుచి

జయరామవాటిలో శారదామణిదేవికి పదునొకండేండ్ల వయస్సు వచ్చు వఱకు ఆమె చరితమును తిలకించితిమి. ఈలోగా ఒక సంభవము ఘటిల్లినది. అది ముఖ్యము. దానిని పరికింతము గాక.

శ్రీరామకృష్ణుని మేనల్లుడైన హృదయరాం ముఖర్జీ నివాసము సిహోడులో. అక్కడికి గురుదేవుడు తఱచు పోవుచుండెను. మాతృశ్రీ మేనమామలును అదే గ్రామాన ఉండిరి. ఇంతే కాదు. అచట ప్రాచీన శిల్ప పద్ధతులలో నిర్మిత మైన గుడి ఒకటి ఉన్నది. అందు శాంతినాథు డను పేర శివుడు వెలసి యున్నాడు. ఏటేట అచట జరుగు ఉత్సవాలకు ఎక్కడెక్కడి పల్లెల వారును వత్తురు, కీర్తనల పాడుదురు, యాత్రల(=వీధినాటకాల)ను కందురు. హృదయునింట అట్టి కీర్తన యొకనాడు జరుగుచుండెను. అప్పటి వింత సంభవ మొకటి — శారదాదేవి చాల పసి పిల్ల, ఒక మహిళ యొడిలో కూర్చుండి యుండెను. కీర్తన ముగిసిన తర్వాత వేడుకకై ఆ మహిళ శారదను "అమ్మాయి, ఇక్కడ ఇంతమంది సమావేశమై యున్నారు కదా, వీరిలో ఎవరిని వివాహమాడుట నీ కిష్టము" అని అడిగినది. శారద తన చిఱు చేతుల రెంటి నెత్తి, ఇంచుక దూరముననే కూర్చున్న శ్రీరామకృష్ణుని జూపె నట! అప్పుడు పెండ్లి అనిన ఏమో ఆమె ఎఱుగదు, కాని ఆమె హృదయము పొరవడదు. ఏ యదృశ్యశక్తి నాడు ఆమె చేతుల నటు చూః ప్రే పించినదో, ఆ యదృశ్యశక్తియే ఆ హృదయ కాంక్షితమును అనంతర కాలాన నెఱవేర్చినది.

అమ్మకు ఐదేండ్లు నిండి ఆఱవ యేడు వచ్చినది. దక్షిణేశ్వరమున శ్రీరామకృష్ణునకు ఇరువదిమూడవ యేడు నిండుచున్నది. అప్పుడు ఆయన ఆధ్యాత్మికౌత్సుక్యంపుసుడిలో తగుల్కొని యుండెను. ఆయన ప్రసాదింప నున్న యుగసందేశము వెలువడుటకై రూపు దాల్చుచున్న కాల మది. ఆయనకు స్వస్థత చెడినదనియు వెఱ్ఱెత్తినదనియు అజ్ఞానులు భ్రమించిరి. గోరంతలను కొండంతలనుగా చేసి ఆయన వింత నడవడిని వారును వీరును చెప్పుచుండగా

కామార్పుకురులో చంద్రమణీదేవి విన్నది. పాపము తన పెద్దకుమారుడైన *రామకుమారుని కోల్పోయిన దుఃఖమునుండి ఆమె ఇంకను పూర్తిగా తెప్పరిల్లి యుండ లేదు. ఆమె వెంటనే శ్రీరామకృష్ణుని ఇంటికి పిలిపించి అతని వ్యాధికి వైద్యులచే మందు లిప్పించెను. వైద్యులవలన గాని మందులవలన గాని ఎట్టి లాభమును లేక పోయినను, తఱచు కలిగిన దివ్యదర్శనానుభవాలచేత కాబోలు శ్రీరామకృష్ణునకు కొంత స్వాస్థ్యము ఏర్పడినది. చంద్రమణీదేవికిని ఇంచుక నెమ్మది చేకూరెను. తక్కిన వారివలెనే ఆమెయు 'ఐహికవస్తువులందలి అరతియే అతని వ్యాధికి కారణ' మనుకొని, తానును రామేశ్వరుడును కలిసి అతనికొక వధువును వెదకుటకు బయలుదేఱిరి. కాని వారి ప్రయత్నాలు ఫలింప వాయెను. ఈ సంగతి శ్రీరామకృష్ణునకు తెలిసెను. వింత ఏమనగా, పెద్దల సంకల్పమును అతడు ప్రతిఘటింప లేదు, సరి కదా, ఉత్సాహముతోను బాల్యోచిత సంతృప్తితోను "జయరామవాటిలో రామచంద్రముఖర్జీ యింటికి పొండి, నాకు వధువు కానున్నది† గడ్డిపరకచే గుఱుతిడబడి అచట ఉన్నది" అని చెప్పెను. సాభిప్రాయమైన యీ సూచన ననుసరించి, వధువు ఫలానా అని కనుగొనుట ఐనది. 1859 మే నెల ప్రారంభాన నొక యనుకూల దినమున ముహూర్తము నిర్ణయింప బడెను. ఆనాడు రామేశ్వరుడు రామకృష్ణుని వెంట నిడుకొని

* కామార్పుకురులోని ఛాటర్జీలు.




† ఇది చమత్కారము. పల్లెలలో వేల్పులకై ఉద్దేశింపబడిన పండును గాని విత్తనమును గాని గడ్డిలో చుట్టి ఉంచుట దేశాచారము.

జయరామవాటి చేరెను. *పెండ్లి యథావిధిగా జరిగి పోయెను.

తన పెండ్లినిగూర్చి మాతృశ్రీ ఈలాగు చెప్పి యున్నది -- "ఖర్జూరఫలాలు పండు కాలములో ఐనది నా పెండ్లి. పదిదినాలలోగా నేను కామార్పుకురునకు వెళ్లినప్పుడు ఖర్జూర ఫలాలను ఏరుకొంటిని. (ఆగ్రామస్వామి) ధర్మదాసు లాహా వచ్చి "ఈమెయేనా క్రొత్త పెండ్లికూతురు" అని అడిగినాడు. సూర్యతండ్రి (=తన పినతండ్రి ఈశ్వరముఖర్జీ) నన్ను కామార్పుకురునకు తన చేతులలో ఎత్తుకొని పోయెను".

పెండ్లినాటి సాయంకాలమే వరపక్షము వారు వధువుతో సహా కామార్పుకురునకు చేరి పోయిరి. చంద్రమణీదేవి వారిని యథావిధిగ ఆదరించినది. ఛాటర్జీలు పేదవారు, విభవాలకు ఓపరు, కావున వివాహానంతర కుటుంబసముదాచారాలును బంధుసంతర్పణయు పరిమితముగనే జరిగినవి. ఇవి ముగిసినవో లేదో చంద్రమణీదేవికి ఒకచింత కలిగినది. ఛాటర్జీలు కన్యాధనముగా మూడువందలరూపాయలు చెల్లించిరి. గౌరవార్థము కన్యకు తగిన నగలు పెట్టవలసి ఉండెను. అందుకై చంద్రాదేవి గ్రామస్వాములైన లాహాలయింటనుండి కొన్ని నగలను ఎరవు తెచ్చుకొని యుండెను. వీనిని వారికిప్పుడు ఇచ్చి వేయవలెను. కాని అమాయికురాలైన ఆముద్దుపిల్ల యొడలినుండి ఆ నగలను ఒలిచికొనుటకు చంద్రాదేవికి మనస్సు ఒప్ప లేదు. అమ్మ పడుచున్న చిక్కును శ్రీరామకృష్ణుడు గ్రహించి "నాభార్య పసిది కాబట్టి నిద్ర పోవును, నిద్రలో ఆమెకు తెలియకుండనే నగలను తీసి యిత్తును లే" అని ఓడంబడిచెను. నిద్రించుచున్న శారదకు కొంచెమైనను తెలియకుండురీతిని అతడు ఆ నగలను నేర్పుతో ఒలిచి యిచ్చి వేసెను. కాని మఱు దినము ప్రొద్దున మేని యందు నగలు లేక పోవుటను చూచుకొని, శారద ఒక్కొక్క యవయవమును చూపుచు "ఇక్కడ ఇక్కడ ఉన్న నగలు ఏమైనవి" అని అడిగినది. బిడ్డ పలికిన యా మాటలకు చంద్రాదేవికి కన్నుల నీరు నిండెను, బిడ్డను ఒడిలో కూర్చుండ బెట్టుకొని "అమ్మా, కొంతకాలములో ఇంతకంటె మంచి నగలను గదై (= శ్రీరామకృష్ణుడు) నీకు చేయించి పెట్టును లే" అని ఊరడించెను. పిల్ల కొంత ఊరడిల్లినను, పినతండ్రి కోపించి శారద నెత్తుకొని జయరామవాటికి మరలి పోయి చేరెను.

ఈసారి శ్రీరామకృష్ణుడు స్వగ్రామమున రెండేండ్లు ఉండెను. పెండ్లికి రెండేండ్ల పిదప అత డొకసారి మామగారింటికి పోయెను. అందుంగూర్చి అమ్మ ఇట్లు చెప్పి యున్నది —— నేను ఏడేండ్లదాననుగ ఉన్నప్పుడు గురుదేవుడు జయరామవాటికి వచ్చెను. వధూవరులు వరునింటికి రెండవసారి పోవుట కలదు గదా. అప్పుడు ఆయన నాతో "ఎవరైన నీకు పెండ్లి ఎప్పుడైనది అని అడిగిన ఏడవసంవత్సరములో అన బోకుము, ఐదవయేట అని చెప్పుము" అనెను. రెండవతూరి ఇట్లు కామార్పుకురునకు చేసిన ప్రయాణమే పరిణయమని ఆమె అను

* ఇరువదియేడు కౌరవులతో మహిళలు ప్రదక్షిణించినప్పుడు శ్రీరామకృష్ణునిచేతి కంకణము నిప్పంటుకొని కాలిపోయినది. గురుదేవుని పనులు దుర్జ్ఞేయములు. తననిత్యశక్తి (=మాతృశ్రీ) తో తనకు సమాగమము ఘటిల్లగనే కంకణము కాలిపోవునట్లు ఆయనయే పన్నాగము పన్నినట్లున్నది. శ్రీ శ్రీరామకృష్ణపుంథి పుట 554.

కొను నేమో అని ఆయన అట్లు ఎచ్చరించి యుండును. గురుదేవునితో బాటు ఆయన మేనల్లుడు హృదయుడును వచ్చి యుండెను, పసిదైన తన అత్త సిగ్గుపడుచున్నను ఆమె కతడు పాదపూజ చేసినాడు. ఇది శారదకు జ్ఞప్తిలో ఉండినది. శారదాదేవి తలంపులలో అప్పటి కింకను ఎట్టి పరిపక్వతయు లేకున్నను గురుదేవుని బట్ట లుతుకుట ఆయనకు గాలి విసరుట మొదలగు సేవలు చేసెను. ప్రేక్షకులు చూచి ఆనందించిరి. జయరామవాటినుండి గురుదేవుడు మాతృశ్రీతో కామార్పుకురునకు ఏగెను. తర్వాత కొన్నాళ్లకు భగవత్సాక్షాత్కారమునకై సాధనల సముద్రమున మునుగుటకై గురుదేవుడు దక్షిణేశ్వరమునకు వచ్చివేసెను. మాతృశ్రీయు మరల జయరామవాటి చేరుకొని సరళ సుందర గ్రామ పరిసరాలలో తల్లిగారి ప్రేమావేష్టణలో ఉండెను.

ఆమె తన పదుమూడవ ఏట మూడవ మారును పదునాల్గవ యేట నాలుగవమారును కామార్పుకురునకు పోయెను. గురుదేవుడును తల్లి చంద్రాదేవియుం గూడ అప్పుడు దక్షిణేశ్వరమున నుండిరి. కామార్పుకురులో మాతృశ్రీ రామేశ్వరుని అతనిభార్యను బిడ్డలను గాంచెను. కామార్పుకూరునకు మాతృశ్రీ చేసిన యీ మూడవ నాలుగవ ప్రయాణాలకు నడిమి వ్యవధానము ఐదారునెలలు. నాలుగవ సారి ఆమె కామార్పుకురులో ఒకటిన్నరనెల లుండెను. తర్వాత మూడు నాలుగు నెలలు జయరామవాటిలోనే ఉండెను. 1867 లో గురుదేవుడును హృదయుడును (తాంత్రికసాధనాచార్య యైన) భైరవీబ్రాహ్మణియు కామార్పుకురునకు వచ్చి యున్నారను వార్త అందినది. మాతృశ్రీయును అక్కడికి పోవలసి వచ్చెను. పోయి గురుదేవునితో ఏడు నెలల కాలముండెను.

కామార్పుకురులో ప్రశాంత ప్రకృతి సౌందర్యమును ఆరోగ్యమును గల పరిసరాలలో అంత కాల ముండుటచే, గురుదేవుని దేహస్థితి బాగుపడెను. అంతట ఆయన దక్షిణేశ్వరమునకు మరలి నూత్నోత్సాహముతో ఆధ్యాత్మిక సాధనలలో మగ్నుడయ్యెను. అన్నియు ముగిసి నెమ్మది గలిగిన పిమ్మట ఆయన మరల స్వగ్రామమునకు వచ్చుచును పోవుచును ఉండెను. ప్రతి వానకాలమును గ్రామములోనే గడపుచుండెను. ఏల యన తీవ్రసాధనలచే ఆయన సుకుమారశరీరము చాల దెబ్బతిన్నది. వాన కాలమున ఆయన దక్షిణేశ్వరమున ఉండరాదని వైద్యులు నిషేధించిరి. 1880 వరకును ఏటేట స్వగ్రామమునకు పోవుచునే యుండెను. 1867 నుండి 1880 వరకు నుండు దీర్ఘకాలములో అమ్మ ఎన్నిసార్లు కామార్పుకురునకు పోయినదో అప్పటి సంభవములు ఏవో తెలిసికొనుట కష్టము. ఆ కాలపు సంభవా లని అమ్మయు ఇతరులును కొన్నింటిని చెప్పుచున్నారు కాని వానిలో ఏవేవి ఎప్పుడెప్పుడు జరిగినవో కాలమును నిర్ణయించి చెప్పుట సాధ్యము కాదు. కావున కాలక్రమమును అంతగా లక్షింపక, అప్పటి సంభవాలను కొన్నింటిని తెలిపెదము. తర్వాత భైరవీ బ్రాహ్మణికి సంబంధించిన ఐతిహ్యాలకు వత్తము.

తన పదుమూడవ యేట కామార్పుకురులో ఉండగా జరిగిన దొక యద్భుతసంభవమును అమ్మ భక్తులకు చెప్పి యున్నది. గురుదేవు నింటి వెనుక పల్లెరస్తా ఒకటి ఉన్నది. ఇంటి వెనుకవైపు వాకిలి స్త్రీల ఉపయోగార్థమే. కొంత దూరాన హల్దర్పుకు రను పెద్ద చెఱు

వున్నది. స్త్రీలు స్నానమునకు గాని నీరు తెచ్చుకొనుటకు గాని అక్కడికి పోదురు. పల్లె రస్తాలో పోవలెను. అక్కడక్కడ కొన్ని యిండ్లున్నవి. ఆ దినాలలో మహిళలు, ముఖ్యముగా ఉత్తమజాతికుటుంబాలవారు, స్వేచ్ఛగ తిరుగ రాదు, కావున సహజసాధ్వస మైన అమ్మకు అంత దూరము ఒంటరిగ పోవుట దుష్కరమే. వాకిలి దాటి బయటికి వచ్చి ఆమె "నేను పసిదానను; క్రొత్తగ పెండ్లి ఐన దానను. స్నానమునకు ఒంటరిగ ఎట్లు పోగలను?" అని తనలో అనుకొనెను. పాలుపోక నిలుచున్న ఆమె చూచుచుండగనే ఎనమండుగురు బాలికలు ఆమెను చేర వచ్చిరి. కావున ఆమె వీధిలోనికి వచ్చినది. వారిలో నలువురు ఆమెకు ముందు వైపు నడచిరి, నలువురు వెనుకవైపు నడచిరి. అందఱును చెఱువున కేగి స్నానము చేసి తర్వాత అదే విధముగ మరలి వచ్చిరి. అమ్మ ఆ ఊరిలో ఉన్నన్ని నాళ్లును ఇట్లే జరిగినది. 'స్నానసమయానకు సరిగా ప్రతిదినము వచ్చు ఈ బాలిక లెవరు' అను తలంపు ఆమెకు తలచు గలిగెడిది. కాని ఆమె కేమియు అర్థము కాలేదు. మీ రెవ రని వారిని ఆమె అడగను లేదు.*

జయరామవాటిలో ఉన్న దినాలలోనే ఎంత పేదఱిక ముండినను పనుల ఒత్తిడి ఎంత ఉన్నను అమ్మకు చదువునందు ఎంత రుచి ఉండెడిదో మునుపే చెప్పి యున్నాము. ఆ దినాలలో సంపన్నకుటుంబాలవారికి కూడ తమ కూతుండ్రను పెద్ద చదువులు చదివింప వలె నను తలంపు లే దను విషయమును మనము స్మరింప వలెను. కావున శారదాదేవి చేసిన కృషి ఆమె యద్భుతోత్సాహమునకు తార్కాణము. తర్వాత మామగా రింట అననుకూలపరిస్థితులలో ఉన్నప్పుడు సైతము ఆమెకు ఆ ఉత్సాహము తగ్గ లేదు. అమ్మ చెప్పినది—"కామార్పుకురులో నేనును లక్ష్మియు† మొదటి వాచకమును చదువుచుంటిమి. మేనల్లుడు హృదయుడు నాచేతనుండి పుస్తకమును లాగి వేసి 'మహిళలు చదువను వ్రాయను నేర్చుకో కూడదు. తుదకు నవలలను నాటకాలను చదువుదురా ఏమి?' అనెను. లక్ష్మి, ఆయింటి పిల్లయే కాబట్టి పట్టు పట్టి తన పుస్తకమును ఇచ్చివేయక ఉంచుకొనెను. నేనును రహస్యముగా ఒక అణాకు మరియొక ప్రతిని కొంటిని. లక్ష్మి పాఠములను బడిలో తాను నేర్చుకొని వచ్చి నాకు నేర్పెడిది". ప్రాయము వచ్చిన పిదప కూడ తనకు ఈ తృష్ణ ఉండిన దని అమ్మ ఇట్లు చెప్పినది—"నిజ మైన చదువు నేను చదివినది దక్షిణేశ్వరములో. గురుదేవుడు అప్పుడు వైద్యమునకై శ్యాంపుకూరులో ఉండెను. నేను ఒంటరిగా ఉంటిని. భావముఖర్జీగారింటి అమ్మాయి ఒకతె స్నానమునకు వచ్చుచుండెను. ఆమె చాల సేపుండెడిది, నాతో. స్నానమునకు వచ్చినప్పుడు ప్రతిదినము ఆమె నాకు పాఠములు నేర్పుచు పరీక్షలు సైతము జరుపు చుండెను. గుడితోట నుండి వచ్చు కాయకూరలను ఆకుకూరలను నేను ఆమెకు సమృద్ధిగా ఇచ్చుచుంటిని". ఈ యభ్యాస ఫలితముగ అమ్మకు రామాయణము వంటి పుస్తకాలను చదువ గల శక్తి వచ్చినది. కాని వ్రాయ గల శక్తి ఆమెకు అంతగా అలవడ లేదు. జీవితపు తుది దినాలలో సంతకమును

* లోకజననికి ఎనమండుగురు సఖు లున్నా రని హిందువుల విశ్వాసము.

† రామేశ్వరుని కూతురు, శారద కన్న దాదాపు పదేండ్లు చిన్న.

పెట్టుట సైతము సాధ్యపడకుండెను. అనంతర దినాలలో ఒకశిష్యుడు ఆమెపేరును ఆమెచేతనే వ్రాయించి తీసికొన గోరెను, వ్రాయుటకు ఆమెయు ఒకవిధముగ ఒప్పుకొన్నది. తన పేరునకు అక్షరరూపము దాల్ప ఆమె ఎంత సేపు గిలికినను కుదుర లేదు. విసిగి, ఆ ప్రయత్నమును విడిచి పెట్టినది.

కామార్పుకురుకుటుంబమునుగూర్చి ఆమె ఎప్పుడు మాటాడినను ఆమాటలలో అత్త మామలపట్ల యథార్థమైన ప్రేమయు ఆదరమును ఉట్టిపడుచుండెడివి. మామగారినిగూర్చి గర్వముతో ఇట్లన్నది — "మా మామగారు బ్రాహ్మణాచారనిష్ఠులు ; ఉత్సాహవంతులు ఎవరియొద్ద అనిన వారియొద్ద దానములు ప్రతిగ్రహింపరు. ఇంటికి తెచ్చి యిచ్చినను స్వీకరింప రాదను నియమ మొకటి సదా ఉండెను. మా అత్త మాత్రము ఎవరైన దేని నైన రహస్యముగ తెచ్చి యిత్తురేని, కైకొని, (ఇలు వేలు పైన) రఘువీరునకు నివేదించి, ప్రసాదము నెల్లరకును పంచిపెట్టుచుండెను. ఆ సంగతి తెలిసినప్పుడు మా మామగారికి చాల కోపము వచ్చెడిది. కాని ఆయన భక్తి చాల చుఱుకైనది. మఱియొక యిలువేలుపైన శీతాలామాత ఆయనతో సదా నడయాడుచుండెడిది. ప్రొద్దు పొడుచుటకు చాల ముందే ఇల్లు విడిచి పూలు కోయ నేగువాడుక. ఒకనాడు లాహాల తోటలోనికి పోయినాడట. అక్కడ తొమ్మిదేండ్ల అమ్మాయి ఒకతె "నాయనా, ఇటు వైపు రమ్ము, ఇటువైపు కొమ్మలలో పూవులు కొల్లగ ఉన్నవి. నేను కొమ్మను వంచి పట్టుకొనెదను, నీవు పూలను కోయుము" అన్నది. "ఈ వేళప్పుడు ఇక్కడ ఉన్నట్టి నీ వెవరవు తల్లీ" అని ఆయన అడిగెను. 'నేను, హాల్దార్‌కుటుంబమునకు చెందిన దానను' అని ఆమె అన్నది. ఇట్టి స్వభావము గలవాడు కావుననే ఆయనయింట దేవుడు (=గురుదేవుడు) అవతరించినాడు". శారదాదేవి అత్తగారికి కూతురివలె పరిచర్య చేసి, ఛాటర్జీలకు సంబంధించిన ఐతిహ్యములను వారి జీవితములో వారు అనుభవించిన వివిధదశలను గూర్చి ఎంతో తెలిసికొన్నది. ఇట్లు శిక్షితయై, ఒకనాడు తన అత్తగారి వీపునకు నూనె రాచుచున్నప్పుడు, మామగారి ఆచారనిష్ఠను గురుదేవుని ఉదారపద్ధతులతో పోల్చి చూచుకొని చిఱునవ్వుతో "అట్టివంశమున జన్మించినను గురుదేవుడు ఒక *కైవర్త (రాణి రాస్మణి) నెలకొల్పిన గుడిలో పూజారి ఐనాడు" అన్నది.

అంతకుమునుపే తాను ఇంచించుక నేర్చుకొని యుండిన ఈత, పాట, కుట్టుట, గుడ్డలపై బుట్టాలువేయుట, వంట మొదలగు పనులలో అమ్మ కామార్పుకురులో ఉండగా పరిపూర్ణమైన నేర్పును గడించినది. ఈ కళలలో గాని ఇట్టి కళలలో గాని సామాన్య వైజ్ఞానికవిషయాలలో గాని ఆ కాలపు పల్లె పడుచులకు శిక్షణమే లేదు. తమ చేత నైనంతగా వారు సొంతముగ నేర్చుకో వలసినదే. సొంతముగ నేర్చుకొనుటకు అప్పటి సంఘపరిస్థితులు కరము అనుకూలములుగ ఉండినవి. సన్న్యాసులును బిచ్చగాండ్రును ఇంటింటి వాకిటను పాడు పాటలు ఉదాత్తార్థనిబిడములు, పురాణకథలు, వీధినాటకాలు తఱచు జరిగెడివి. వీని మూలమున పల్లెప్రజలకు ఆధ్యాత్మికోన్నతియు ఐహి

* నిజమునకు రాస్మణి కైవర్త కాదు, గొప్ప దైవ మాహిష్యజాతిదే. ఆజాతి వారికైనను ఒకఛాటర్జీని తమ గుడిపూజారిగ బడయగనుట అరుదైన భాగ్యమే.

కానందమును గలిగెడివి. ఇట్టి వెన్నో మాతృశ్రీకి కలిగిన తొలిశిక్షణములో చేరి ఉన్నవి కాని దాని కొక సమగ్రరూప మిచ్చు తళుకు లొనగూర్చినది గురుదేవుడే. అనంతర కాలాన శిష్యుల తోడి ఆమె సంభాషణలలో సరళ గాఢ శిక్షణంపు ముద్రయు, గ్రాహ్యములను గ్రహించి సర్వమును రూపుదాల్చు నట్టి వయస్సులో ఆమె కొనగూడిన మహాపురుషసంబంధమును తెల్లముగ వ్యక్తమగుచుండును.

అమ్మ కామార్పుకురుకు వచ్చినప్పుడు ఐహికముగను పారమార్థికముగను గురుదేవుడు ఆమెకు ఎన్నో విషయాలను నేర్పెను. మొదట ప్రేమచే ఆమె హృదయమును తన వశ మొనర్చుకొని అందులోనికి తన యనుభవ జ్ఞానము నంతటిని పోసినాడు. ఒకవైపు భోగ వైరాగ్యమహిమచే స్వచ్ఛ మగు జీవితము నామె యెదుట బెట్టెను, స్థిరమైన శీలమును రూపొందించి తృష్ణను హెచ్చించి ఆయున్నత లక్ష్యమును మెట్టుమెట్టుగ అందుకొన నేర్పెను. వేరొకవైపు ఆమెకు పెద్దల గౌరవించుట, ఇంటిలోని పిన్నల ప్రేమించుట, కుటుంబమున కంతటికిని అన్ని విధముల ఉపయోగపడుట మొదలగు నిత్యకృత్యములను గూడ నేర్పెను. పాఠబోధనము దేశమునకును కాలమునకును వృత్తికిని తగియుండవలె నను మామూలు లౌకిక దృక్పథముతోనే ఆయన నేర్పెను. కుటుంబములో గాని బయటగాని ఇతరులతో నడచుకో వలసిన పద్ధతిని బండి నెక్కునప్పుడు కాని అందుండి దిగు నప్పుడు కాని ఏ వస్తువును మఱవకుండు నట్టి మెలకువను ఆయన ఆమెకు నేర్పెను. ఆపాఠ్యావళి బహువిషయగర్భము అద్భుతము. అందు దీపములను సరిచేయుట కూరలకు సంబారమును కూర్చుట, తమ్ములపు ఖిల్లీలను సిద్ధపఱచుట — ఇట్టి చిన్న విషయాలను సైతము విడిచి పెట్టుట లేదు. సరళయు పవిత్రయు పారమార్థికపరయు భక్తిభరితయు నగు శారదకు ఆ పాఠశిక్షణము ఆనందకరముగను విషయబోధకముగను ఉండెను. ఆ శిక్షణములో పట్టుదల ఎంతో ఉన్నను స్వార్థపరత గాని కామము కాని లేనే లేదు. దానివలన అమ్మకు కలిగిన ఆనందమును ఆమెమాటల లోనే మనము మరింత బాగుగ అర్థము చేసికో గలము. ఒకసారి భక్తమహిళలతో ఆమె ఇట్లన్నది — "అప్పటినుండి నా హృదయమున ఆనందకలశము నొకదానిని నెలకొల్పు కొన్నట్లైనది. తిరమును నిర్వికల్పము నైన యా దివ్యానందమును నా మనస్సు ఎట్లనుభవించెనో ఎంత అనుభవించెనో నేను మాటలలో చెప్ప లేను".

(సశేషము)

ధ్యానింపుమా పూర్ణు, నానందరూపు, మూర్తిరహితుని, జగన్మూల మౌ వాని,
చెవినుండి విను వాని, చేతమం దుండి చింతించు వానిని, జిహ్వలో నిల్చి
మాటాడు వానిని, మాట కతీతు, జీవములకు నెల్ల జీవ మౌ వాని,
స్తుత్యుఁ, బరాత్పరు, నిత్యుఁ, – దలంపు.

# వార్తలు, విశేషాలు

## ౧

### కొట్లాటవల్ల నష్టపడ్డ ప్రాంతాలకు శ్రీ రామకృష్ణమిషనువారి తోడ్పాటు కార్యక్రమ నివేదిక రామనాథపురంజిల్లా, చెన్నరాష్ట్రం.

**అక్టోబరు తే 5 ది నుండి తే 14 ది వఱకు**

శ్రీ ప్రియానంద సర్వజ్ఞానందస్వాములున్నూ కొందఱు వాలంటీర్లున్నూ మనమదురై చేరుకొని పాటిల్లిన నష్టమెంతో విచారించడం ప్రారంభించారు. తొలి సాహాయ్యము ముదుకులత్తూరు తాలూకాలోని కొగందర్, ఇళైయంబూరు, వీరంబల్, కర్నకుళం, ఇరుళంది, కొట్టై గ్రామాలకున్నూ, పరమకుడి తాలూకాలోని అరుంగలం గ్రామానికిన్నీ అందింది. అక్కడ కాలిపోయిన యిండ్లు 331. ప్రజలు కట్టుబట్టలతో మిగిలారు. వారికి కట్టుకోను చేఱి ఒక బట్ట ఇయ్యడం ప్రథమావశ్యకమైంది. మొత్తం 631 చీరలు, 496 దోవతులు పంచిపెట్టబడ్డాయి. ఇళైయంబూరు వీరంబల్ అరుంగలం గ్రామాలలో 314 చాపలు పంచిపెట్టబడ్డాయి. శివగంగ తాలూకాలో 40 గ్రామాలలో 1451 ఇండ్లు తగలబడిపోయినై. తిరుప్పచ్చేరి మొలక్కుడి పాపముడై పుత్తూరు గ్రామాలలో గుడిసెల పునర్నిర్మాణానికై 3,525 వెదుళ్లు, 18,500 టెంకాయాకులదళ్లు ఇయ్యబడ్డాయి.

**అక్టోబరు తే 15 ది మొదలు తే 20 ది వఱకు**

ముదుకులత్తూరు తాలూకాలోని అన్ని గ్రామాలవారికిన్నీ, శివగంగ పరమకుడి తాలూకాలలోని మగజనాభాలో ఒకమూడోవంతు వారికిన్నీ వస్త్రసాహాయ్యం అందింది. ముదుకులత్తూరు తాలూకాలో కొగందను గ్రామంలోను, పరమకుడి తాలూకాలో అరుంగలం గ్రామంలోను, శివగంగ తాలూకాలో పుదుక్కుడిఇరుప్పు గ్రామాలలోను తప్ప ఇతరత్ర చాల వఱకు కుదురుపాటు కలిగింది. కీలతు వల్లాన్మాన మగవారి నందఱిని కోల్పోయిన కుటుంబాలు ఐదు. శ్రీ శుద్ధసత్త్వానందస్వామి గారు వారి నోదార్చి ఒక్కొక్క కుటుంబానికి వస్త్రాలు పదేసి రూపాయలు ఇచ్చారు. మధురై, కరుంగలం. కిల్లూని, కణ్ణారిరుప్పర్, శంబరయర్ నందల్, కనూర్, రాజగంభీరం, కల్పిరవు, ఉదయకుడుంబంపట్టి, పాప్పాకుడి, పుదుక్కుడి, ఇరుప్పు, అన్నవాశల్ కీలతీవల్ గ్రామాలలో 514 చీరలు 440 దోవతులు పంచిపెట్టబడ్డాయి. పెరంబచెట్టి, కర్నకుళం, శెరంద్రైకోట్టై, ఇరుళందిపట్టి, పాప్పాకుడి, తిరుప్పచ్చేట్టి గ్రామాలలో 2.920 వెదుళ్లును, 50 కట్టలు వెదురుబద్దలును ఇయ్యబడినవి. పెరంబచెట్టిలోను పంబట్టి పుదూరులోను 239 తాటిబద్దలున్నూ, పెరంబచెట్టిలో 10,300 దళ్లున్నూ పంచిపెట్టబడ్డాయి. పొల్లాచ్చి మధుర ప్రాంతాలనుండి ఈ వస్తువులు సంపాదించబడుతున్నాయి.

**అక్టోబరు తే 21 ది నుండి తే 28 ది వఱకు**

శివగంగ అరుప్పుకోట్టై తాలూకాలలోని 67 గ్రామాలవారికి 2,076 చీరలు 1,916 పంచెలు పంచిపెట్టబడినై. శివగంగ తాలూకాలోని గ్రామాలకు 1,060 వెదుళ్లున్నూ 450

పోకబద్దలున్నూ కూడా ఇయ్యబడినై. రస్తాల లోని తాటిచెట్లనుండి ఆకులు కోసికొన అను మతిచ్చి రామనాథపురంజిల్లాబోర్డువారు తోడ్ప డ్డారు.

## అక్టోబరు తే 29 ది నుండి నవంబరు తే 7 ది వఱకు

ముదుకులత్తూరు, పరమకుడి, శివగంగ, అరుప్పుకోట్టై తాలూకాలలో దెబ్బ తిన్న 125 గ్రామాలలో 122 గ్రామాలకు సహాయం అందింది. 1,006 క్రొత్తచీరలు, 922 క్రొత్త పంచెలు, 133 క్రొత్త పిల్లల చొక్కాలు, 24,850 తాటాకులు, 3,550 దళ్లు, 5,217 వెదుళ్లు, 4,820 వెదురు బద్దలు, 87 తాటి బద్దలు, 2,800 మంగుళూరు పెంకులు, 6 సెట్ల అల్యూమినియం పాత్రలు పంచిపెట్టబడ్డాయి. కాలిపోయిన యిండ్ల నన్నిటిని మళ్లా కట్టించా లని మిషనువారి సంకల్పం. అరుంగలంలో కొన్ని యిండ్ల పునర్నిర్మాణం ఇప్పటికే పూర్తి ఐంది. సొంతదారులు వచ్చి ప్రవేశిస్తున్నారు. త్వరలో వారికి పంట పరికరాలు ఈయబడుతై.

ఇప్పటికి మిషను వారు సప్లై చేసిన వస్తువుల మొత్తం వివరాలు — 4,176 క్రొత్త చీరలు, 3.774 క్రొత్తపంచెలు. 352 చాపలు, 145 పిల్లల ఉడుపులు క్రొత్తవి, 12,662 వెదుళ్లు, 8,557 వెదురుబద్దలు, 60,000 దళ్లు, 2,800 మంగుళూరుపెంకులు, 6 సెట్ల అల్యూమినియం పాత్రలు.

ధన సాధ్య మైన యీ సాహాయ్యకార్య క్రమానికి ఉదారమహాశయులు విరాళాలను మదరాసు రామకృష్ణ మఠమానేజరుగారి పేర టికి అందచేయ ప్రార్థితులు.

శ్రీ కైలాసానందస్వామి,
మఠాధ్యక్షులు.

## ౨

## భువనేశ్వరం, ఒరిస్సా

పిల్లలకు ఆదివారాలలో నీతిజ్ఞానపాఠాలను నేర్ప శ్రీరామకృష్ణమిషనువారి పాఠశాలలో అక్టోబరు తే 20 ది నాడు గవర్నరు వై. ఎన్. సుక్థంకరుగారు ఉపన్యసించారు. మిషనువారి దేశీయ విదేశీయ కేంద్రాలలో జరిగే కార్య క్రమాలను, ముఖ్యంగా భానువారపాఠశాలను, దాని ఆవశ్యకతను ఆపన్నప్రాంతాలకు అంద జేయబడే సహాయాన్ని గవర్నరుగారు కొని యాడారు —

## శ్రీధరఘట్టం, రాయదుర్గంతాలూకా

శ్రీగురుదత్తాశ్రమంలో తే 24-9-57 ది మొదలు తే 3-10-57 ది వఱకు శరన్నవరా త్రోత్సవాలు శ్రీ పూజ్యపాద వైరాగ్యానంద స్వాములవారి యాజమాన్యాన వేదోక్తరీతి మహావైభవంతో జరిగింది.

# గ్రంథసమీక్ష

## శబరి

రచయిత్రి : రాష్ట్రభాషాప్రవీణ భోగరాజు చిట్టెమ్మ; ప్రాప్తిస్థానము : పూళ్ల వల్లభ రాయడు, పూళ్ల పోస్టు, పశ్చిమ గోదావరి జిల్లా; పుటలు : 103; వెల : ఒక రూపాయి.

భక్తిసంప్రదాయంలో భగవంతునకంటెను కూడ భక్తునకు పూజ్యత ఎక్కువ. రామాయణేతిహాసప్రసిద్ధభక్తమహిళలో శబరి ఉత్తమురాలు. ఆమెపావనజీవితగాథను కతిపయనూతన కల్పనలతో లలితపద్యములలో ప్రతిపాదించు ఈ చిన్న కావ్యం అభినందనార్హం.



## శ్రవణభక్తి

కర్త : టి. నాగేంద్రరావుగుప్త; ప్రకాశకురాలు : గట్టి వేంకటలక్ష్మమ్మగారు, వివేకానందమందిరము, బుట్టయిపేట, మచిలీపట్నం, కృష్ణాజిల్లా; పాకెట్ సైజు; పుటలు : 23; మూల్యము : భక్తి.

భక్తి నవవిధం. అందు మొదటిది శ్రవణం. దానివిశిష్టతను ప్రపంచించే ప్రశంసనీయోః న్యాసం ఈ చిన్న గ్రంథం లోని విషయం.



## భక్తకన్నప్ప

[హరికథ]

కవి: శ్రీ కేశవతీర్థస్వామి; ప్రాప్తిస్థానం : శ్రీరామతీర్థసేవాశ్రమం, పిడుగురాల పోస్టు, గుంటూరు జిల్లా; పుటలు : 32; వెల : ఎనిమిదణాలు.

పొత్తపినాడుమండలంలో ఉడుమూరిలో చెంచుకులాన తిన్న డను పేర అవతరించి ఉత్కటభక్తిచే పరమశివునకు తన రెండు కన్నులను అర్పించి సాక్షాత్కారసిద్ధి గాంచి కన్నప్పనాయనా రను ప్రసిద్ధి నొందిన శివభక్తాగ్రేసరుని కథను మధుర గద్య పద్య గేయ సమ్మిశ్ర రూపాన శ్రీ కేశవతీర్థస్వామిగారు ఇందు ప్రతిపాదించారు. ఇది భక్తిరసగుళిక.

## శ్రీజ్ఞానసద్గురుశతకము

రచయిత : స్వామి అమృతానంద; ప్రాప్తిస్థానము : కలగా సూర్యనారాయణరావు స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, పాలకొల్లు, పశ్చిమ గోదావరిజిల్లా; పాకెట్ సైజ్; వెల తెలియదు.

జర్మనిలో డి. ఎస్. సి. పట్టమును ఇంగ్లండులో పి. ఎచ్డి. పట్టమును పొంది నేషనల్ ఫిసికల్ లాబొరేటరి అసిస్టెంటు డైరెక్టరుగ ఉన్న పరమహంస పరివ్రాజకాచార్య శ్రీజ్ఞానానందయతీంద్రుల స్తుతించు ఈ పద్యశతకమున కవిత్వధార దివిజగంగాప్రవాహమువలె నిరర్గళము, అమృతమధురము.

—ప్రభాకర్.

మదరాసు శ్రీరామకృష్ణమఠమున మాతృశ్రీ జయన్తి తిథిపూజ డిసంబరు నెల తే 13 ది నాడును బహిరంగోత్సవము డిసంబరు నెల తే 15 ది నాడును జరుగును.

# నారద భక్తి సూత్రములు

అనువాదకులు: శ్రీ దొడ్ల వేంకటరామరెడ్డిగారు

శ్రీ త్యాగీశానందస్వాములవారి ఆంగ్ల గ్రంథమున కిది తెనిగింపు. భక్తిని గూర్చిన సమస్త విషయములును ఇందు విపులముగ నున్నవి. భాష సులభము, సరళము.

310 పుటలు వెల: రూ. 3/-

# శ్రీ శారదా ప్రసంగములు

అనువాదకులు: కీ॥ శే॥ వెదురుమూడి వేంకట కృష్ణరావుగారు

శ్రీ రామకృష్ణ పరమహంస సహధర్మచారిణియు, ఆదర్శసతి, ఆదర్శయోగిని, ఆదర్శ మాతయు నగు శ్రీ శారదాదేవి భక్తులతో నొనర్చిన దివ్యసంభాషణలు.

"...ఈ గ్రంథము ఆంధ్రదేశమున అస్పృశ్యాలగు స్త్రీలెల్లరు చదువదగినది..." —త్రిలిఙ్గ

312 పుటలు (ప్రథమ ముద్రణము) వెల: రూ. 2-50

# కులము, సంస్కృతి, సామ్యవాదము

అనువాదకులు: శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

హైందవ సంస్కృతిని ఎన్నో శతాబ్దములుగా పోషించి యభివృద్ధినొందించిన గుణకర్మ విభాగమూలమగు చాతుర్వర్ణ్యవ్యవస్థ మతాచార్యకైతవముచే మార్పబడి, భ్రంశమొంది, దేశపతనకారియయ్యెననియు దేశాభ్యుదయమును ఇప్పుడు సురల సాధించుటకు హరిజనులు మొదలు సర్వనిమ్నజాతులకు సాంఘిక, ఆర్థిక, వైజ్ఞానిక, పారమార్థిక ఉన్నతిని కలిగించి సర్వతోముఖసామ్యమును కల్పింపవలెననియు శ్రీ వివేకానందస్వామి ఈ గ్రంథమున ఉద్ఘాటించియున్నాడు. దేశాభ్యుదయమును అభిలషించువారందఱికిని అవశ్యపఠనీయమగు గ్రంథము.

"పరమసంతృప్తికరమగు ఆంధ్రానువాదము". హిందూ (The Hindu) 3-11-57.

116 పుటలు అందమైన కూర్పు వెల: రూ. 1/-

అడ్రెసు: మేనేజరు, శ్రీరామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# బుద్ధ ఉవాచ

శ్రీ బుద్ధభగవానుడు లోకమున కొసగిన సందేశమునందలి ముఖ్యాంశములు ఏర్చి కూర్చి విడివిడిగా సులభశైలియందు ఈ గ్రంథమున ముద్రింపబడియున్నవి.

పాకెట్టు సైజు (ప్రథమ ముద్రణము) వెల : 37 న. పై.

# శ్రీ రామకృష్ణ ఉవాచ
# శ్రీ శారదా సూక్తి నవనీతము
# శ్రీ వివేకానంద శంఖారావము

శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి — వీరు ముగ్గురును లోకమున కొసగిన సందేశమునందలి ముఖ్యాంశములు ఏర్చి కూర్చి విడివిడిగా సులభశైలియందు ముద్రింపబడియున్నవి. ఈ గ్రంథములలో జీవితమునందలి వివిధఘట్టములకు, వివిధవిషయములకు సంబంధించిన ఉపదేశములు గలవు. అందఱును చదివి తరింపగల చిన్న చిన్న పుస్తకములు.

పాకెట్టు సైజు (ప్రజ్వలముద్రణము) ఒక్కొక్కదాని వెల : 37 న. పై.

# శ్రీ రామకృష్ణ బోధామృతము

అనువాదకులు :

శ్రీ చిరంతనానందస్వామి

ఇందు శ్రీరామకృష్ణుని జీవిత సంగ్రహమును 1121 మహోపదేశములును గలవు.

జీవుడు : సంసారము ; మాయ, గ్రంథములు : గ్రంథులు, బోధగురువులు : బోధ గురువులు, తార్కికులు : వారి ధోరణులు, ఆత్మోన్నతి ; సాధకులు : వారి యాదర్శములు, పారమార్థిక జీవనమునకు సదుపాయములు, సర్వమతసామరస్యము, దేవుడు, జ్ఞానము : భక్తి : కర్మము, బ్రహ్మతత్త్వము మున్నగు అంశము లిందు తేటతెల్లముగ పసిబిడ్డల కయిన అవగాహన కాగల ఉపమానములతో వివరింపబడియున్నవి.

నీతికథలును సూక్తులును మకరందపేశలములు, నిర్వృతికరములు.

... ఈ గ్రంథం చదువుతూంటే ఒక్క ఐహికానికీ, ఒక్క ఆముష్మికానికీ కాక, రెంటికీ సంబంధించిన సూక్ష్మాలూ, రహస్యాలూ, కీలకాలూ చక్కగా అరటి పండొలిచి చేతిలో పెట్టినట్లు ఉంటవి... —ఆంధ్రపత్రిక

540 పుటలు ప్రజ్జ్వలమగు పంచమ ముద్రణము ! వెల : రూ. 3-50

---

# హిందూమతము

రచయిత : శ్రీ వివేకానందస్వామి

అనువాదకులు: శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

హిందూమత నామమును పరస్పరభిన్న భావభూయిష్ఠములగు అనేక మతసంప్రదాయములు వహించి యుండుటచే, తత్స్వరూప నిర్వచనమునకు ఇందు శ్రీ వివేకానంద స్వాములవారు పూనుకొని ఆ మతము వేదసంహితాకాలమునుండి ఎట్లు క్రమ పరిణామ మందెనో, అందు సర్వసమ్మతమూలభావము లెవ్వియో, అది చేయు బోధ యెట్టిదో, ఇన్ని భిన్నమతాంతరము లెట్లు కలిగెనో, ఈ కలగూరగంపకు హిందూమత నామ మెట్లు లేర్పడెనో విశదీకరించియున్నారు. జిజ్ఞాసువుల కత్యంతోపయుక్తమగు గ్రంథము.

... తెనుగువాఙ్మయములో వేదాంతచర్చలపై ... ప్రకటింపబడిన గ్రంథములలో ఇది ఉత్తమోత్తమమైనదని శిరసాగ్గి చెప్పవలసియున్నది. ... —భారతజ్యోతి 12-4-1956.

168 పుటలు వెల : రూ. 1-25

---

అడ్రెసు : మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ రామకృష్ణ ప్రభ

సంపుటము ౧౪ ౧౯౫౭, డిసెంబరు; హేవిళంబి - మార్గశీర్షము సంచిక ౬

## విషయసూచిక


... ... ౧౭౭
మాతృశ్రీ సూక్తి మకరంద బిందువులు కొన్ని ... ... ... ౧౭౮
మాతృశ్రీకి జోహారు—[సంపాదకీయము] ... ... ... ౧౭౯
మాతృశ్రీ శారదాదేవి—[శ్రీమద్గంభీరానందవాణి] ... ... ౧౮౦
శ్రీహరీ—పండిత సత్కవి శ్రీనారు నాగనార్యులు ... ... ... ౧౮౪
''అమ్మ''—శ్రీమతి కుమారి సరళాదేవి ... ... ... ౧౮౫
భాగవత రహస్యములు—శ్రీ గురుభక్త పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు ... ... ౧౮౯
హరివాసరవ్రతమాహాత్మ్యము—శ్రీచుక్కి శాంబి రంగాచార్యులుగారు ... ... ౧౯౩
వ్యాకులత—శ్రీ సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు, బి.ఏ. ... ... ౧౯౮
''తోమ్ తానా నానా''—శ్రీ బులుసు ఉదయభాస్కరముగారు ... ... ౧౯౯
కర్మసిద్ధాంతము—శ్రీమత్స్వామి నిర్వాణానందులు ... ... ... ౨౦౨
వార్తలు, విశేషాలు ... ... ... ౨౦౫
గ్రంథసమీక్ష ... ... ౨౦౮




'సర్వేశ్వరుని శరణు జొరుము, అతని కృప నీ యనుభవమునకు అప్పుడు వచ్చును.''

—శ్రీ శారదామణి.


# శ్రీరామకృష్ణ ప్రభ

సంపుటము ౧౪ } ౧౯౫౭ — డిసెంబరు : : హేవిళంబి — మార్గశీర్షము { సంచిక ౬


## శారదాస్తోత్రమ్

మూల శ్లోకములు :
శ్రీ అభేదానందస్వామి

తెలుగు పద్యాలు :
శ్రీ కందుకూరు మల్లికార్జునముగారు

కృపాం కురు మహాదేవి, సుతేషు ప్రణతేషు చ
చరణాశ్రయ దానేన; కృపామయి, నమోఽస్తు తే॥ ౧॥

ఓ మహాదేవీ, కృపాస్వరూపిణీ, నీకు వందనము; నీ సుతులమై, నీకు ప్రణమిల్లుచున్న మాకు నీ యడుగు నీడను ప్రసాదించి అనుగ్రహింపుమా.

నిరతిఁ బ్రణమిలు తనయుల నరయు కృపాపరత నో మహాదేవి, మముఁ
చరణాశ్రయ దాన మ్మిడి; కరుణామయి, ప్రణతు లివిగో కైకొను మమ్మా.

లజ్జాపటావృతే నిత్యం, శారదే, జ్ఞానదాయకే,
పాపేభ్యో నస్సదా రక్ష కృపామయి, నమోఽస్తు తే॥ ౨॥

సదా సిగ్గు అనెడి తెర చాటున నుండి, జ్ఞానము నిచ్చు, కృపాపూర్ణురాలవగు ఓశారదా, నీకు వందనము. పాపములనుండి మమ్ము నిరంతరము ప్రోవుమా.

అనిశ లజ్జాంశుకావృత వై మెలంగు తల్లి, శారద, జ్ఞానప్రదాత్రి, మమ్ముఁ
బ్రోవు మెల్లెడ నఘనిదూరుల నొనర్చి మ్రొక్కులివె కొను మమ్మ, కారుణ్యమూర్తి.



# మాతృశ్రీ సూక్తి మకరంద బిందువులు కొన్ని

౧

దైవకృపవలన మాత్రమే భగవత్సాక్షాత్కారము లభించును. కాని జపధ్యానములు అభ్యసించుట ఆవశ్యకము. వానిచే మనస్సులోని కల్మషములు హరించును. పూజ మొదలగు పారమార్థిక సాధనలు ఒనరించి తీఱవలెను. పూవును చేతపట్టుకొన్నచో దాని సువాసన వచ్చుట లేదా? గంధపు చెక్కను సానపై అఱగదీసినచో దాని పరిమళము వచ్చుట లేదా? అట్లే సదా భగవంతునిగూర్చి మననము చేయుచుండుటచే పారమార్థిక జ్ఞానము ఉదయించును.

౨

మనఃపూర్తిగా ఒక్కసారియైన భగవంతుని గూర్చి ప్రార్థించినవారికి ఇక భయములేదు. నిరంతరముగా భగవత్ప్రార్థనయందు ఆసక్తుడై యుండువానికి ఈశ్వరకృపచే 'ప్రేమభక్తి' అనబడు భక్తిపారవశ్యస్థితి లభించును. నాయనా, పారమార్థికజీవనములో ఈ ప్రేమ యనుదాని కన్న అగాధమగు వస్తువు లేనే లేదు. బృందావన గోపికలకు అది సిద్ధించినది. వారికి శ్రీకృష్ణుడు ఒక్కడు తప్ప లోకములో వేఱుపదార్థమేదియు గోచరింపకుండెను.

పసిపాప తనచేతిలోని వస్తువును నూఱుసారు లడిగినవాని కీయక, ఒక్కసారిమాత్రమే అడిగినవాని కీయవచ్చును. అట్లే భగవత్కృప నియమబద్ధము కాక ఇచ్ఛాధీనముగా ప్రసరించును.

భారమంతయు శ్రీరామకృష్ణునిపైవైచి పరిపూర్ణవిశ్వాసముతో నుండుము. ఆయన నీ వ్యథలనన్నిటిని తీర్చి మనశ్శాంతిని ప్రసాదించును. భగవన్నామమును స్మరించుచుండుము. ఇతరుల దుష్కర్మఫలములను తనపైవైచికొని శ్రీరామకృష్ణుడెట్టి తీవ్ర వ్యథ ననుభవించెనో విచారించుకొనుము. నీ మనశ్శరీరము లందుచే పరిశుద్ధము లగును. అది నీకును గోచరించును. పరమపావనుడును, ఈశ్వరాంశసంభూతుడును అగు ఆయన ఇతరుల కొఱకై ఘోర వేదన లనుభవించుచుండియు, శ్రీ విశ్వేశ్వరీ నిత్యధ్యానానుసంధానలభ్యమగు ఆనంద పారవశ్యము నొక్క క్షణమాత్రముకూడ వీడకుండుటను స్మరించితివేని, నీ కష్టములు, సంతాపములు, క్షుద్రములుగా తోచును.

౪

వ్యాకులపడకుము. ఈ ఐహికసంబంధములు అనిత్యములు. వానితోడిదే లోకమైనట్లు నేడు కనిపించును. కాని రేపటి కవి అదృశ్యము లగును. దేవు డొక్కనితో మాత్రమే నీకు నిజమగు సంబంధము కలదు.

భగవంతుని మ్రోల శరణుసొచ్చినవానిపట్ల విధినిర్ణయములుకూడ వర్తింపవు. అట్టివాని విషయమున విధి తన వ్రాతను తానే తుడిచివేయును.



# మాతృశ్రీకి జోహారు

## (సంపాదకీయము)

శ్రీరామకృష్ణుని దివ్యమహిషి శ్రీశారదా దేవి 1853వ సంవత్సరమున డిసంబరు నెల తే 22 ది నాడు అవతరించినది. ఆమెగారి నూట ఐదవ జయంతి మహోత్సవము మదరాసు వాసుల మైన మనము మన మఠ కేంద్రములో ఈ సంవత్సరము డిసంబరు తే 13 దినాడును తే 15 దినాడును కొనియాడితిమి.

శ్రీ శారదాదేవియందు రూపు దాల్చిన మహిళాధర్మములు అత్యుదారములు, అత్యున్నతములు! గురుదేవుని పారమార్థిక సాధనకును సిద్ధికిని సందేశప్రచారమునకును ఈమె తన అనుగుణప్రవర్తనలచేతను చర్యలచేతను తోడ్పడినది. కావున సహధర్మిణీశబ్దము యథార్థాక్షర మగుటే కాక, లౌకికస్థాయిలో పారమార్థికరంగమునకు విరుద్ధముగ తలంపబడు దాంపత్యమే ఇంద్రియాతిగమును ఆధ్యాత్మికము నగు స్థాయిని అందుకొన్నప్పుడు, పారమార్థిక లక్ష్యసిద్ధికి అమోఘసాధనము కాగల దనియు లోకమునకు వెల్లడి ఐనది. ఈమె అత్యంత పరతంత్ర మైె నాథుడు తన్ను తీర్చి దిద్దిన పెల్లరూ పొందుచు, జగన్మాతృవిగ్రహమున శ్రీరామకృష్ణుడు దర్శించుచుండిన దైవమును కాలక్రమమున ఈమె తనజీవితమందే ప్రత్యక్షమొనర్చెను. కావున గురుదేవుడు తన దీర్ఘ సాధనకు పరిసమాప్తిమంగళముగ తనప్రియురాలి పవిత్రరూపమునందే లోకమాతను ఆరాధించినా డటన్న అందెంతో అంతరార్థము ఇమిడి యున్నది.

స్వధర్మానుష్ఠాననిష్ఠ గల గృహిణి అగుటే కాక శ్రీ శారదాదేవి రామకృష్ణభగవానుని శిష్యవర్గమున ప్రప్రథమయు అగ్రగణ్యురాలును అయ్యెను. సాధారణముగ దేనిని మనము చదువు అనుకొనుచున్నామో ఆ చదువును ఈమె విశేషముగ చదువ లేదు. కాని పెనిమిటి యాదర్శముచేతను దివ్యసూక్తులచేతను ఈమె చక్కని సంస్కార మొంది ఆధ్యాత్మికముగ అత్యున్నత సిద్ధులను గాంచెను. తర్వాతికాలమున ప్రబోధమున కనియును చిత్తశాంతి కనియు గుంపులుగుంపులుగ తన్ను ఆశ్రయించిన వేలకొలది భక్తులకు ఉపదేశ మొనర్చుటకును, ఆధ్యాత్మికజీవితమున ప్రవేశ మొసంగుటకును అర్హాపట్టమును గడించెను.

గురుమహారాజు నిర్యాణానంతరము విశ్లేష విషణ్ణు లయిన శిష్యులు చిత్తశాంతి చేకూర్చుకొనుటకును ఉత్సాహ మొందుటకును తదేకప్రవణు లయి ఈమెనే ఆశ్రయించిరి. 'మఠ' 'సేవాసం'ఘాత్మక శ్రీరామకృష్ణసంస్థకు మొదటి నుండియు ఈమెయే మార్గోపదేశకురాలును ప్రధానాధారమును అయ్యెను. శ్రీవివేకానంద స్వామి విశ్వసంస్తుత్యముగ అమెరికాయాత్రకు బయలుదేఱుటకు ముందు ఈమె యాశీర్వచనమునే కోరెను.

శ్రీ శారదాదేవి భారతనారీజనశిరోరత్నము అని చెప్పినను విశ్వమహిళలకు అందఱకును పరమాదర్శము అని చెప్పినను అతిశయోక్తి కాదు. ఆధ్యాత్మికజగత్తున ఈమె పరంజ్యోతి.

ఈమె జీవితమును ఉపదేశమును, మనకు ఇంతంత అనరాని నిధులు, ఉత్సాహవివర్ధకములు, విశ్వాసద్రఢీకరణములు, శాశ్వతప్రదీపములు. ఈమె సంస్మరణము సర్వశ్రేయస్కరము.

ఈమె దక్షిణదేశయాత్ర చేయుచు 1911 వ సంవత్సరము మన మదరాసునగరమునకు విచ్చేసినది. ఈమె సందర్శనభాగ్యము ఈ నగరవాసులకు అప్పుడు లభించినది. పతితపావన మైన యీామె యడుగుదామరల జంటచే గుర్తిడబడిన యీ క్షేత్రవాసుల మైన మనకు ఈ నూటఐదవ జయంతిమహోత్సవసందర్భమున ఈమె కీర్తికి జోహారు లర్పించుటయు, ఈమె జీవితసందేశమును బోధనలను స్మరించుకొనుటయు ప్రాప్తము.

# మాతృశ్రీ శారదాదేవి

[శ్రీమద్గంభీరానందవాణి]

౪

## దివ్యజీవితంపు తొలి రుచి

(గతసంచిక తరువాయి)

నిత్యానందపూర్ణుడైన గురుదేవుడు అమ్మకు పాఠములు నేర్పిన తీరును లక్ష్మీదేవి ఒకసారి ఒక సాధువు నెదుట ఇట్లు చిత్రించినది — "దుఃఖవిపద్బంధుర మైన యీ జగంపు మిథ్యాత్వమును సదా సూచించుచు గురుదేవుడు అమ్మతో "కుక్కలవలెను నక్కలవలెను పిల్లల నీని నంత మాత్రాన ప్రయోజన మేమి? నిస్సంగత్వమును భక్తియునే ముఖ్యములు" అనెను. మాతృశ్రీతల్లికి ఎందరో బిడ్డలు పుట్టిరి. అందు కొందఱు మరణించిరి. వారిని తన యొడిలో పెంచినది అమ్మయే. వారిలో కొందఱు మరణించినప్పుడు తన తల్లిదండ్రులు విలపించుటను ఆమె చూచి యున్నది. ఆ దుఃఖములో ఆమె పాలు ఆమెకును ఉన్నది. వీని నన్నిటిని చూపి గురుదేవుడు "నీకును సొంతముగ ఎంతో అనుభవము కలిగి యున్నది. అ దెంత దుర్భరమో నీ వెఱుగుదువు. ఈయార్భాట మంతయు ఎందులకు? అ వేమియు లేక నీవు నీవే రాణివిగ ఉన్నావు. అట్లె ఎల్లప్పుడు నుండుదువు" అనెను.

అమ్మ సదా పనులలో నిమగ్నయై యుండును. ఒకనాటి ప్రొద్దున ఆమె యింటి నేలను పేడతోను పచ్చమట్టితోను అలుకుచుండెను. గురుదేవుడు పుల్లతో పండ్లను తోముకొనుచు వేడుకగ మాటాడు చుండెను. అమ్మతో ఆయన ఇట్లనెను — "నీ కుమారునికి అన్నప్రాశనము చేయు నాడు నీవు సింగారించుకొని ఆటపాటలు

సాగింప వచ్చును కాని, అతడు చచ్చు నేని అప్పుడు దుఃఖముచే గిజగిజలాడుదువు''. అమ్మ మౌనముగనే ఈ ప్రసంగమును ఆలకించు చుండెను కాని గురుదేవుడు మాటిమాటికిని పిల్లల చావును గూర్చియే చెప్పుచుండగా, ఆమె కడకు తగ్గు గొంతుతో "నిక్కముగ అందఱు పిల్లలును చత్తురా?'' అని అడిగెను. ఆమె ఆలాగు అడిగినదో లేదో గురుదేవుడు బిగ్గరగ ఇట్లనెను — "అరరే! ఇప్పుడు నిజముగ నేను కాలసర్పమును* కాలం ద్రొక్కితిని. ఈమె మంచి దనియు ఏమియు ఎఱుగని దనియు నే ననుకొంటిని. ఔరా, ఈమె కెంతో తెలియును. నిక్కముగ అందఱును చత్తురా అనుచున్నదే!'' అమ్మ త్వరతరగ అటనుండి పోయెను.

నగరాలలో ఉన్న నిర్బంధాలు కృత్రిమ మర్యాదయు కామార్పుకురులో లేవు. కావున గురుదేవు డచ్చట సహజమైన హాయి ననుభవించుచు ప్రజలతో స్వేచ్ఛగ మెలగు చుండెను. ఒకనాడు పొరుగూరిలో యాత్రా (మతవిషయమైనవీథినాటక) ప్రదర్శన మొకటి జరుగవలసి ఉండెను. ఇంటిలోని మఱియొకతెను తోడుగా గొని దానిని చూచి వత్తు నని అమ్మ అనెను. అందుకు గురుదేవుడు సమ్మతింప లేదు కాని వారు చెందిన ఆశాభంగమును గుర్తించి, ఆయన వారి యెదుట తా నొక్కడే ఆ నాటకము నెల్ల ఆడెను. ఆయన దానిని ఒక్కమాఱు మాత్రమే చూచి యుండెను. కాని ఆయనలో అంతటి చుఱుకైన ధారణశక్తియు అంత అనురూప మైన అభినయ నైపుణియు అంత మధుర మైన సంగీతము నుండెను. కావున మహిళ లందఱు వెంటనే చింత తీఱి అద్భుతావిష్టులై ఎంతో సేపు కూర్చుండి అసలు నాటక ప్రదర్శనమునే చూచి ఆనందించినంతగా ఆనందించిరి.

కామార్పుకురులో గురుదేవుని వైఖరిని గూర్చి మాతృశ్రీ ఇట్లు చెప్పి యున్నది — "ఆయన చిఱచిఱలాడుచు నుండగా నేను కన్నదే లేదు. పిన్నలతో ఉన్నను పెద్దలతో ఉన్నను ఆయనకు ఆ గోష్ఠి ఆనందప్రదమే. నిజముగ నమ్ము. నేను చూడగా ఆయన మొగము ముడుచుకొని ఉండినదే లేదు. ఆహా! కామార్పుకురులో ప్రతిదినమును నిద్ర లేవగనే ఆయన "నాకు ఈ దినము ఈ యాకు కూర కావలెను, దీనిని వండు'' మనెడు వారు. చాటునుండి విని మేము (=శారదయు లక్ష్మీదేవితల్లియు) కొంత ఆకు కూరను సంపాదించి వండుదుము. కొంత కాలము తర్వాత ఆయన "అరరే, ఇట్లైతినే. ప్రొద్దున నుండి నాకు తిండి ధోరణియే. ఛీ'' అనుకొనెను. నాతో "నాకు ప్రత్యేకముగ ఇష్ట మైన పదార్థ మని ఏదియు లేదు, నీ వేమి వండినను ఏమి పెట్టినను నేను భుజింతును'' అన్నాడు. దక్షిణేశ్వరమున ఉండగా ఆయన అజీర్ణవ్యాధిచే ఎక్కువగ బాధపడు చుండెను, "ఛీ, యీ కడుపు మలనిలయము. ఆ మలము సదా వెలికి పాఱుచునే ఉండును'' అనెను. మేను తేరుకొననీ అని ఆయన పల్లెకు వచ్చు చుండెను. ఒడలికి గలుగు బాధలను చూచి చూచి ఆయనకు వెగటు పుట్టి, అందుంగూర్చి ఏ శ్రద్ధయు వహింప కుండెను.

వేడుకమాట లనిన గురుదేవున కిష్టము. అం దొకటి చాల వినోదకరము. అమ్మ చెప్పినది — "కామార్పుకురులో వంటపని నా వంతు, లక్ష్మితల్లిగారి వంతు. ఒకనాడు గుర్వు

* త్రొక్కినప్పుడు పట్టిపాములు తప్పించుకొని పాఱును, నాగుబాములు పైకురికి కఱచును.

దేవుడును హృదయుడును భుజింప కూర్చుండిరి. లక్ష్మీతల్లి వంటపనిలో నిపుణురాలు. ఆమె వండిన వస్తువును రుచి చూచి గురుదేవుడు "హృదయా, దీనిని వండినది వైద్య రామదాసు" అనెను. నేను వండిన వస్తువును రుచి చూచి, ఆయన "ఇది శ్రీనాథసేనుని పాకము" అన్నాడు. లక్ష్మీతల్లి వైద్య రామదాసు. నేను శ్రీనాథసేను. శ్రీనాథసేను కువైద్యుడు. ఆ మాటలు విని హృదయుడు "నిజమే, కాని మీ కువైద్యుడు సదా అందుబాటులో ఉండును, అంగమర్దనమునకు సైతము సిద్ధముగ ఉండును, పిలువ నంపిన చాలును. ఇక వైద్యరామదాసునకు చెల్లింప వలసిన కట్నము చాల ఎక్కువ. ఆయన అన్ని వేళలలోను లభింపడు. అంతే కాక, మొదట కువైద్యుని పిలుచుటే ప్రజల మామూలు. అతడు సదా మీకందుబాటులో ఉన్నాడు" అనెను. గురుదేవుడు "నిజమే నిజమే ఆమె సదా ఇచ్చటే ఉన్నది" అని చెప్పెను.

తాలింపు సంబారముల ఘుమఘుమ లనిన గురుదేవుడు బాలు డాశించినట్లు ఆశించును. ఒకనాడు ఆయన తన అన్నకూతురైన లక్ష్మిని 'ఒక అణాకు కమ్మని సంబారములను కొనిర' మ్మనెను. శారదతో "పప్పుచారు చేయుము, వాసనవస్తువులతో నీవు తాలింపు పెట్టునప్పుడు పందిగుబ్బు మన్నట్లు శబ్దము విన బడ వలెను" అనెను. ఒకనాడు ఆయన వినుచుండగా లక్ష్మీతల్లి శారదతో — "ఈ దినము ఇంట తాలింపు సంబారము లేదు, కాబట్టి అది లేకే వంట వండ వలెను" అని చెప్పుచుండెను. వెంటనే గురుదేవుడు "ప్రేయసీ, అ దెట్లు? సంబారము ఇంట లేకున్న ఒక కాని ఇచ్చి ఏల తే రాదు? ఎందులోను ఏ వస్తువును తగ్గకూడదు. నీ తాలింపు ఘుమఘుమల కాశపడి కదా నేను దక్షిణేశ్వరము నందలి మధుర భోజనమును వదలుకొని ఇక్కడికి వచ్చినది? ఇప్పుడు నీవు వానిని నాకు లేకుండ చేయగోరుచున్నావు" అని కేక లిడెను. తలవంపులై లక్ష్మీతల్లి వెంటనే సంబారమును తెప్పించెను.

1867 లో దీర్ఘ సాధనలు ముగిసిన వెంటనే శ్రీరామకృష్ణుడు కామార్పుకురునకు వచ్చెను. మాతృశ్రీయు అచటికి వచ్చెను. యథావిధిగ ఆయన సన్న్యాసదీక్షను స్వీకరించి ఉన్నను గురువు తోతాపురి ఆయనతో ఇట్లు చెప్పియుండెను — ఎవని ఆత్మనిగ్రహమును, నిస్సంగత్వమును, వివేకమును, సిద్ధియు పత్నిసాన్నిధ్యమున సుంత యేని చెడకుండునో అతని బ్రహ్మనిష్ఠ యథార్థమైనది. స్త్రీలను పురుషులను సదా బ్రహ్మస్వరూపులనుగా చూడ గలవాడే బ్రహ్మజ్ఞాని. స్త్రీపురుషభేదాలను గుర్తించువారు సిద్ధిమార్గము పట్టినను లక్ష్యమునకు చాల దవ్వున ఉన్నవారే". స్వయము ద్రష్టయైన తోతాపురి ఇంకను ఇట్లు చెప్పెను — "ఉన్నతతమమైన యనుభూతి నొందిన శ్రీరామకృష్ణునివంటివాడు ఎట్టి మనోవికారము నొందక తన పత్నియెడ తన కర్తవ్యాలను నెఱవేర్చకొను నేని, అందుచే అతడు పారమార్థికపు విలువను కోల్పోడు, అతని కెట్టి లోటును గలుగదు". కావున సరళుడును సత్యపరుడును ధీరసాధకుడు నగు శ్రీరామకృష్ణుడు తన ప్రియురాలు కామార్పుకురుకు వచ్చినప్పుడు ఆమెను ప్రేమతో ఏల అనుమతించెనో సులభముగ అర్థమగుచున్నది. ఈ సన్నిహిత సంబంధము ఆయన మనస్సును ఎప్పుడును ఇంచుకేని చెడగొట్ట లేదు. కాని శారదాసాన్నిధ్యమునకు భైరవిబ్రాహ్మణి మాత్రము ఎంతో క్షోభిల్లినది.

అమ్మ రాగానే, గురుదేవునిలో ప్రేమయే మొదట జనించినది. అమ్మ అప్పుడు చాల పసిది, అత్తగారిని గౌరవించినంతగా భైరవి బ్రాహ్మణిని గూడ ఆమె గౌరవించెను. గౌరవమునకు భయమే కొంతవఱకు కారణము కావచ్చును. భైరవి సొంతదేశము తూర్పుబంగాళము. ఆ ప్రాంతీయులు కూరలలో మిరపకాయలను అపరిమితముగ వేయుదురు. అట్టి కూరలను ఆమె లక్ష్మీతల్లికిని మాతృశ్రీకిని వడ్డించి వారేమందురో విన వేచి యుండును. లక్ష్మీతల్లి ఏమియు మఱుగుపఱచుకోక 'అబ్బబ్బ! ఎంత కారము' అనును. అమ్మ మాత్రము భైరవి కోపానకు వెఱచి తన కన్నులనుండి నీరు ఒకవంక కాఱుచునే ఉన్నను 'నిజముగా బాగుగ ఉన్నది' అనును. వీనిని లక్ష్యపెట్టక భైరవి లక్ష్మీదేవితలితో "మఱి నా కోడలు (=మాతృశ్రీ) బాగుగ నున్నదని చెప్పుచున్నది. అమ్మా, నీకు ఏదియు బాగుండదు లెమ్ము. ఇక నెప్పుడును నీకు నేను కూరను వడ్డింపను" అని అఱచును. నిష్కపటమైన నవ్వు నవ్వుచు అమ్మ ఈ వృత్తాంతమును చెప్పెడిది. ఒకనాడు భైరవి గురుదేవునకు శ్రీ గౌరాంగుని వేషము వేసి సింగారించి, ఎంత బాగున్నాడో చూడ రమ్మని మాతృశ్రీని పిలిచినది. మాతృశ్రీ వచ్చిచూచునప్పటికి గురుదేవుడు దివ్యభావోద్రేకదశలో ఉండెను, చూచి ఆమె యించుక భయపడెను, కాని 'ఎట్లున్నా' డని బ్రాహ్మణి అడిగినప్పుడు "చక్కగా ఉన్నా" డని చెప్పి తత్తరముతో మ్రొక్కి వెడలి పోయెను. ఆమెకు సిగ్గును జంకును రెండును ఉండి యుండును. ఏల యన ఆమె కింకను మేలిముసుగు మరుగున నుండవలసిన ప్రాయము అనుటను మనము స్మరింపవలెను. భైరవి బ్రాహ్మణివంటి పెద్దల యెదుట తన పెనిమిటివిషయాన నిర్భయముగ ఉండ గల దిట్టతనము ఆమెకు లేదు. సహజలజ్జావతి యగు మాతృశ్రీయొద్ద అట్టి 'అల్ప' చేష్టితాలు లేనేలేవు.

భైరవియెడ మాతృశ్రీకి భయభక్తులకు కొదువ లేదు. ఐనను గురుదేవుడు మాతతో స్వేచ్ఛగ కలిసిమెలిసి ఉండుటను చూచినప్పుడు భైరవికి అసూయ పుట్టెను. ఇట్టి అత్తకోడండ్ర కృత్రిమబాంధవ్యాలచే సౌఖ్యరహితము లైన కుటుంబాలు ఎన్నో ఉన్నవి. అది ఉండును గాక. మాతృశ్రీయందు తప్పు లెన్నుటకు తనకు అవకాశమే లేక పోగా భైరవి తన అసూయను వేఱు మార్గాలలో చూపినది, శ్రీరామకృష్ణుని భవిష్యత్తు ఏమగునో అని ఆమె దిగులుపడినది. ఇల్లాలితో ధారాళముగ కలిసికొనుచున్నచో, ఆధ్యాత్మికయోగక్షేమము చెడు నని ఆమె ఆయనను ఎచ్చరించినది. శ్రీరామకృష్ణుని హృదయాగ్ని తన యిచ్చ చొప్పున ఏ యే వంకకు మరలినను దాని పవిత్రత కెట్టి కీడును కల్గ దని అనుభవసిద్ధు డైన తోతాపురికి తెలిసెను. ప్రేమచే కన్నుగానని భైరవి ఆ జ్వాలను తనపోషణాపేక్షణలలో నిల్పుకో గోరెను. అట్లు చేసినచో ఆ జ్వాలలో తానే కాలిపోవుదు నని ఆమె ఎఱుగదు. రంగము వేగముగ మాఱిపోవుచున్న దని ఆమె గుర్తింప నొల్ల దాయె. చిట్టి శారద తిరముగను తప్పకయు ముం దడుగు వేయుచున్నది, శ్రీరామకృష్ణు నాధ్యాత్మిక సంపదకు వారసురాలుగాను జగమునకు మాతృత్వవైభవప్రఖ్యాపకురాలుగాను రూపొందుచున్నది. శ్రీరామకృష్ణుడును ఆమె తన జీవితకాలమున నిర్వహింప వలసిన కృత్యముల నెఱిగి అందులకు తగినట్లు ఆమెను తర్ఫీదు

చేయుచుండెను. అన్నిటికిని మఱుగున ఉన్న దైవనిర్ణయమును తెలిసికోలేక, భైరవి ప్రతిఘటించినది. అందువలన ఆమెసొంతమునకే దుఃఖపరంపర గలిగినది. ఎల్లరకును జీవితము దుర్భర మైనది. తుదకు ఎట్లో ఆమె నిజ మెఱింగెను. తా ననుసరించినది తప్పుదారి అని గుర్తించెను, శ్రీరామకృష్ణు నెదుట తన తప్పు నొప్పుకొని, ఆయనను వీడ్కొని కాశికి పోయినది. శారదాచరిత్రరంగమునుండి భైరవిపాత్ర పునరావృత్తిరహితముగ నిష్క్రమించినది.

భైరవిబ్రాహ్మణి వెడలిపోయిన పిమ్మట శ్రీరామకృష్ణుడు మరల దక్షిణేశ్వరమునకు వచ్చి వేసెను. మాతృశ్రీయు ఏడు నెలల కాలము అప్పట మైన ఆనంద మనుభవించి జయరామవాటిలోని తల్లిగారింటికి చేరుకొనెను (నొవెంబర్ 1867). "అప్పటినుండి నడవడిలోను మాటలలోను వైఖరిలోను ఆమె మాఱిపోయిన దని మనము బాగుగ గుర్తింప గలము. కాని సామాన్యజనులు ఆ మార్పును గుర్తించిరా అనుట సందేహాస్పదము. ఏల యన ఆమె విజ్జీగునదిగా కా లేదు, శాంతము గల దైనది; కేక లిడునదిగా కాలేదు, తన్ను తానే పరిశీలించుకొను స్వభావము కల దైనది; స్వార్థపరురాలు కాలేదు, నిస్స్వార్థప్రేమభరితగ ఐనది. ఎట్టి పరిస్థితి యందైనను తొణకని సంతృప్తి ఆమెకు ఏర్పడినది, శోధనలకును కష్టాలకును అగ్గమౌ వారిని జూచినప్పుడు ఆమె సానుభూతి గల దైనది. ఇట్లు ఆమె నిక్కముగ రూపు గొన్న దయగా ఐనది. [లీలాప్రసంగము, సాధకభావము పుటలు 343–44].

## హరీ

పండిత సత్కవి శ్రీనారు నాగనార్యులు

శ్రీపరతత్త్వరూపి వని సిద్ధులు బద్ధులు నిన్నుఁగూర్చి యు
ద్దీపితశక్తిభక్తి నిజదివ్యపదం బమృతార్థసిద్ధి కా
త్మోపద యిచ్చి మెచ్చి వినుతుల్ పొనరించి వరించి స్వస్వరూ
పోపగతిన్ వెలుంగు బుధు లొత్తి భజింపరె నిన్ను శ్రీహరీ॥ ౧

ఇరువదియెన్మిదింటి రచియించి భవత్పదపీఠి నుంచి నీ
గురుతర సత్కృపన్ మని యకుంఠిత సౌఖ్యము లంది నాఁడ నే
బిరుదులకుం బ్రతిష్ఠలకుఁ బెంపరలాడ నఖండ మౌ స్వతస్
స్ఫురణము వేఁడువాఁడ నను జూడుమ, యెప్పటి యట్లు శ్రీహరీ॥ ౨

నీ యనుకంప లేక మన నేర నిమేషము నైన, నిట్టి నన్
బాయక వెంట నంటి బహుభంగులఁ బ్రోవక కుంజరీనదిన్
బోయినఁ బోవ నిమ్మని ప్రభూ, తలపోసిన దిక్కెవం డిఁకన్
నాయన బిడ్డపైఁ గినిసినన్ మఱి యెవ్వఁడు దిక్కు శ్రీహరీ॥ 3

నీ సముఖమ్మునన్ నిలిచి నీతివిదుంబలె నిర్వచించు నా
బైసి యొకింత నీ వెఱుఁగవా! దివిటీకడ దీప మట్లు నా
దోస మడంచి, నిన్ వెదకు దొడ్డపనిం బురికొల్పి తత్త్వవి
ద్యాసుని నాగనార్యుని స్వతస్స్ఫురణం గరుణింపు శ్రీహరీ॥ ౪

ఓం నమో భగవతే శ్రీరామకృష్ణాయ

# "అమ్మ"

## శ్రీమతి కుమారి సరళాదేవి

ఒకప్పు డొకభక్తుడు శ్రీరామకృష్ణమఠ సన్యాసినిచేరి ఇట్లు ప్రశ్నించెను. "స్వామిజీ, మాకు కొంచెము మాతృదేవిని గురించి ఏమైనా చెప్పండి". ఆ స్వామిజీ కొంచెముసేపు కన్నులు మూసికొని అమ్మను ధ్యానించి చెప్పనారంభించిరి.—

ఆహా! ఆ తల్లినిగూర్చియా?— ఏమి చెప్పుట?......ఆమె సాక్షాత్ సరస్వతీదేవి అవతారము— ఈ విషయమును గురుదేవులే ఎన్నియో పర్యాయములు తెల్పియున్నారు... వివేకానందస్వామిజీకూడ పలుమారులు ఇట్లు పల్కియున్నారు.— "అమ్మ గురుదేవునికన్న వేయిరెట్లు గొప్పతనమునే కాక, వేయిరెట్లు అధికదయకూడ చూపెడిది". శ్రీగురుదేవులు భగవంతునిగూర్చి ఏదేని విషయము మాట్లాడునపుడుగాని, కీర్తన పాడినను వినినను, తమ వ్యక్తిత్వమును దాచుకొనలేక తరచు సమాధినిమగ్నులయ్యేడివారు. అమ్మకు అట్లుకాక వీనినెల్ల తనలో ఇముడ్చుకొను శక్తి యుండెను. అట్లుచేయక ఆమెయు తరచు సమాధినందుచుండినచో గురుదేవుని సేవ ఎవరు చేసి యుండెడివారు? ఆమె తన విధిని విసువు విరామములేక చేయుచుండెడిది.

(1) ఆత్మసమర్పణము (2) కార్యతత్పరత— ఈ రెండే ఆమె ప్రారంభిక జీవితములోని ముఖ్యోపదేశములు. వీనిని సమగ్రముగా నిర్వహించి లోకమునకు చూపినది.—ఆమె కార్యతత్పరతయే ఈ సంఘమునకు (రామకృష్ణ సంస్థకు) ఊతకఱ్ఱ ఆయెను.—శ్రీ గురుదేవుని నిర్యాణానంతరము భక్త బృందము దుఃఖసాగరములో మునిగెను.—సన్యాస శిష్యులు (బాల భక్తబృందము) ఒక్కొక్కరు ఒక్కొక్కవైపు సంచారమునకై, తపమునకై వెళ్ళిరి—గృహస్థ శిష్యులు గురుదేవుని ప్రత్యక్షదర్శనము లేమి, తల్లడిల్లుచుండిరి. అట్టి క్లిష్ట పరిస్థితులలో అమ్మ ప్రత్యక్షవ్యక్తిత్వమే ఈ సంఘమునకు మూలాధారమయ్యెను. ఏ ఒక్క విషయమైనను, పనినైనను అమ్మ అనుజ్ఞ బడయనిదే శ్రీ స్వామిజీ చేసెడివారుకారు.—స్వామిజీ దక్షిణదేశమునకు వచ్చినపుడు షికాగోలో జరుగనున్న ప్రపంచమత మహాసభకు హిందూదేశ ప్రతినిధిగా స్వామిజీని పంప మద్రాసు మిత్రులు ప్రోత్సహించి తగు ప్రయత్నములు కావించుచుండిరి. కాని స్వామిజీ ఏనిశ్చయమునకు రాలేదు. ఇట్లుండ ఒకనాడు శ్రీరామకృష్ణుడు సముద్రముమీదుగా ఆవలివైపునకు వెళ్లుచున్నట్లును—తన్నుకూడ రమ్మని సంజ్ఞ చేసినట్లును— ఒక దివ్య దర్శనముకాంచెను. వెంటనే గురుదేవులు ఆజ్ఞ ఇచ్చినట్లు స్వామిజీ భావించెను. —"కాని తల్లి ప్రత్యక్షముగా ఉన్నదే! ఆమె అనుజ్ఞలేనిదే ఎట్లు పోగలను? ఆమెయేకదా

లోకమునకంతయు శక్తి — ఆమె ఆజ్ఞ తీసికొనియే పోయెదను'' అనుకొని వెంటనే తాను కాంచిన దృశ్యమునంతయు విశదముగా లేఖ వ్రా అమ్మ ఆశీర్వాదముల నర్థించెను. అమ్మయొద్దనుండి—అనుమతి ఆశీస్సులతో — ఉత్తరము రాగనే ఆ జాబు చేతినిడుకొని స్వామిజీ నాట్యమాడుచు ''అమ్మ నాకు ఆజ్ఞ ఇచ్చినది—ఆమె ఆశీస్సులు సర్వదా నాతోనే యున్నవట—ఇక నేనేపనినైనను చేయగలను —ఇక సముద్రమును దాటుట కష్టమా—'' అని పల్కెను.

* * *

(1) ప్రస్తుతము కంఖాలు రామకృష్ణాశ్రమము (హిమాలయప్రాంతము) నందున్న శ్రీ గౌరీశ్వరానందస్వామిజీ తమ చిన్నతనమున మొట్టమొదట అమ్మను చూచుటకై జయరామవాటికి వెళ్లెను.—ఆ బాలుడు (గౌరీశ్వశ్వరానంద) ''అమ్మ అంటే దేవి కదా—కాబట్టి కిరీటము పెట్టుకొని సింహాసనముపై కూర్చుండు''నని భావించుకొనెను. కాని నిజముగా వెళ్లి చూచుసరికి ఆమె కూరలు తరుగుకొనుచు కూర్చుండి యుండినది—''అమ్మ ఎక్కడ'' అని ఆ బాలుడు ప్రశ్నింప అమ్మ నవ్వి ''రా, నాయనా, ఎప్పుడు వచ్చితివి? క్షేమమే కదా?'' అని ప్రశ్నించెను. అంత అమ్మ రొట్టెలు ఒత్తుట మొదలిడినది. ఆమె వంకరటింకరగా ఒత్తుచుండినది—ఆబాలు డంత ''అమ్మా, నీవు వంకరటింకరగా చేస్తున్నావు — నేను బాగా గుండ్రముగా చేస్తాను'' అనగా, అమ్మ ''నాయనా, నేను ముసలిదానిని అయ్యాను. ఇంకమీదట రొట్టెలు చేయనులే—'' అనెను.

* *

మఱి ఒకసారి. ఒకనాడు అమ్మపుట్టినదినము వచ్చెను. కమలములు, తెచ్చి అమ్మ పాదాలపై పెట్టవలెనని ఆబాలుని కోర్కె — ఆబాలుడు - పద్మములకొఱకై ఎక్కడ విచారించినను దొరకలేదు. తిరిగితిరిగి ప్రయత్నించుచున్నాడు—రెండు గంటలైనవి—అమ్మ భోజనము చేయలేదు— భక్తులు వచ్చి అమ్మను భుజింపుమని ప్రార్థించిరి. అమ్మ ''ఆ చిన్న అబ్బాయి కొఱకు కాచుకొని యున్నాను. ఆ బిడ్డ వచ్చినకాని భుజింపను'' అనెను. తర్వాత చాలసేపటి కాబాలుడువచ్చి అమ్మ పాదములపై ఒక తామర పుష్పముపెట్టి నమస్కరించెను. అంత అమ్మ ''నాకు ఎంతో ప్రేమపాత్రులయిన బిడ్డలు కలకత్తాలో కలరు వారి పేర్లు చెప్పుచు ఒక్కొక్క పువ్వుపెట్టుచు — నా పాదములకు — వారిమారుగా నీవు ప్రణామములు చేయుము. వారు ఇక్కడ లేరు కాబట్టి నీవు ఇట్లు చేయుము''—అని ఆ పేర్లు చెప్పించి ప్రణామములు అన్నియు స్వీకరించిన పిదప ఆ బాలుని ప్రక్కన కూర్చుండబెట్టుకొని వానిని భుజింపచేసి—వాని విస్తరి ఎత్తి వేయుచుండెను. అంత నా బాలుడు వలదని వారింప ''ఏమి! నేను నిన్ను తొమ్మిదినెలలు మోసి కనలేదు — పెంచనూ లేదు — అయినప్పటికిని అమ్మా అని పిలుస్తున్నదానికైనా—నన్ను ఈ స్వల్ప మాతృవిధిని అయినను—చేయనిమ్ము'' అని బిగ్గరగా పలికెను.

* * *

ఒకనాడు అమ్మ ఆ బాలునకు తనపెట్టెలోని గుడ్డలు ఆరవేసి సరిపెట్టుమని చెప్పెను. గుడ్డలు తీయుచుండగా పెట్టెలో ఒక చింపిరిబొంతకూడ ఉండెను. మరల ఆ బొంతనుకూడ భద్రముగా పెట్టెలో పెట్టుమని అమ్మ చెప్పెను ''ఆ చింపిరి బొంత పేలికలు పేలికలు అయిపోయినది — అది ఎందుకు పెట్టెలో పెట్టుట' అని బాలు

డడుగ అమ్మ ''ఓయీ అది పేలికలు అయి ననూ సరే పెట్టెలో భద్రముగా దాచుకొన వలసినదే? అది బలరామబాబు నాకు ఇచ్చి నాడు. దానిని చూచినప్పుడెల్ల బలరాముడు జ్ఞాపకము వస్తున్నాడు. అతని శ్రద్ధా భక్తులు నిరుపమానములు — ఆహా! అంత భక్తితో అర్పించినది కాబట్టి అమూల్య మైనది—దానిని చూచుటతోడనే నేను బలరాముని ఆశీర్వదింతును. (బలరామబాబు శ్రీరామకృష్ణగృహస్థ శిష్యులలో నొకరు).

శ్రీ గురుదేవులకు అమ్మకు ఎంతో భేదము కలదు. గురుదేవులు బాగుగా పరీక్షించికాని ఎవరిని దగ్గరకు చేరతీయువారుకారు. అమ్మ అట్లుకాక తనయొద్దకు వచ్చినవారినందరను చేర దీసెను. చూడు! కడకు కల్పతరువు రోజున సైతము శ్రీరామకృష్ణులు ఇద్దరు గృహస్థులను తన పాదములను తాకనీయలేదు. — కొంత కాలము వేచియుండుడు'' అని వారికి చెప్పెను. అమ్మ సంగతియో?—ఒకనాడొక దుష్టవాసన గల స్త్రీ అమ్మయొద్ద శరణుపొంద వచ్చెను.— ఆస్త్రీ తాను చేసిన దుష్కర్మల నన్నింటిని స్మరించి — పశ్చాత్తాపపడి లోనికి వెళ్లుటకు జంకుచుండెను. ఇంతలో అమ్మయే బయటికి వచ్చి—ఆస్త్రీ వీపుతట్టి, ఆమెను బుజ్జగించి లోపలికి తీసికొని పోయి ''శ్రీ గురుదేవుని ఎదుట ఇకమీదట మరెప్పుడు తప్పిదము చేయనని మాటఇమ్ము. ఇప్పటికి చేసిన పాపముల నెల్ల నేను భరించెదను'' అని చెప్పెను.

* * *

ఎలాటివారు వచ్చిననూ వారినెల్ల అమ్మ పాదస్పర్శచేసికొన అనుజ్ఞ ఇచ్చెడిది. కాని తర్వాత ఒక్కొక్కపుడు గంగాజలము తెప్పించి కాళ్లు కడిగించుకొనెడిది.

* * *

అమ్మ ఎంతటి వినిర్మలహృదయమైనది ఆమె చంద్రునిచూచి ప్రార్థించురీతి తెల్పుచున్నది— ఆమె ఇట్లు ప్రార్థించెడిది ''నీలోని నిర్మలత్వము నాకు ప్రసాదింపుము. కాని నీలో మచ్చ యున్నది దానిని మట్టుకు రానీయక అను గ్రహింపుము.''

* *

శ్రీ గురుదేవులు అమ్మను, తమనిర్యాణానంతరము కామార్పుకూరులో ఉండవలసినదిగా ఆజ్ఞ ఇచ్చియుండిరి. అటులనే శ్రీ గురుదేవుని మహాసమాధి కనంతరము అమ్మ కామార్పుకురు వెళ్ళినది. అచట గురుదేవుల పిత్రార్జితము భూమిలో కొంచెము ధాన్యము వచ్చెను వానిని దంచుకొని అమ్మ భుజించెను. భోజనములోనికి కూర ఎట్లు? అమ్మవద్ద ఒక్క కాసీ ఉండెను. దానితో ఆకుకూరగింజలు కొని వానిని (పెరటిలో) సందులో చల్లుకొని, ఆ ఆకు కూరను వండుకొని (ఉప్పుకూడ లేకుండ) భుజించెను. ఉప్పుకొనుటకు ఆమెకు డబ్బు ఎచ్చటిది? ఆచింపిరి గుడ్డలతో, ఉప్పులేని భోజనముచేసి, తన నిత్య సాధనలను యథావిధి చేయుచుండెను. ఇట్లుండ ఒకనాడు మాస్టరు మహాశయులు (మహేంద్రనాథగుప్త) లాటూ మహారాజును— (శ్రీ అద్భుతానందస్వామిని) దక్షిణేశ్వరాలయమున దైవవశమున కలసికొనిరి. శ్రీ 'మ' స్వామిజీని అమ్మగురించి ఏమైనా తెలియునా? ఆమె ఎచ్చట కలదు? ఎట్లు జీవించుచున్నది? ఆమెను ఎవరు భరించుచున్నారు? మున్నగు ప్రశ్నలు అడుగ శ్రీ

స్వామిజీ ఆమె (శ్రీ)గురుదేవుల నిర్యాణానంతరము కామార్పుకూరునకు వెళ్ళిన విషయము మాత్రము తమకు తెలియునని చెప్పిరి. ఆమరుదినమే, (శ్రీ) మాష్టరు మహాశయులు—వంట సామగ్రిని, కూరగాయలను, తినుబండారములను, కొన్ని బట్టలను తీసికొని కామార్పుకూరుకు వెళ్ళెను. అచ్చట వెళ్ళిన తోడ్తోడనే అమ్మ విషయము విచారింపమికి మిక్కిలి వగచెను. కాని అమ్మ "నాయనా, గురుదేవుల కృపవలన అన్నియు సక్రమముగా జరుగుచున్నవి. నాకేమియు కొదువలేదు". అని ఎంతో తృప్తిగా సమాధానమిడినది. నిజముగా అమ్మ త్యాగము, ప్రేమ, నిస్వార్థతను వర్ణింపజాలము. (శ్రీ)గురుమహారాజును మాతృ(శ్రీ)యు అంతటి నిస్వార్థపరులు త్యాగులు కావుననే వారి పేర్లు చెప్పుటతోడనే లక్షలేకాదు, కోట్ల ధనముకూడ ఇచ్చి, నేడు మమ్ము ఆదరించుచున్నారు.

*　　*

(శ్రీ) రామకృష్ణులు సజీవులై యుండగా మధురబాబు ((శ్రీ)రాణీరాసమణి అల్లుడు) తానిచ్చు ఏదేని దానమును స్వీకరింపుమని (శ్రీ) గురుదేవుల పలుమారు ప్రార్థించుచుండెను. కొంతభూమిని (శ్రీ)రామకృష్ణుని పేర వేయదలంచి "ఈ మనుమని కోర్కి ఒక్కసారి అయినా తీర్పరాదా" అని అడుగ (శ్రీ) గురుదేవులు అమ్మవద్దకు వెళ్ళ మనెను. అమ్మ మొదట ఏమియు ఒప్పుకొనలేదు. ఏదేని అల్ప వస్తువునైనను స్వీకరింపుమని ఎంతో ప్రార్థించిన మీదట ఒక కాసీకి పొగాకు తెచ్చి ఇమ్మని అడిగెను.

*　　*　　*

అమ్మ తరచు ఇట్లు పల్కెడిది. "జపము, ధ్యానము, తపము, ఏమియు అక్కర లేదు. నిశ్చలమైన, దృఢమైన విశ్వాసము ఉన్న చాలును".

*　　*

(శ్రీ) స్వామిజీ (వివేకానంద) ఎంతటి దృఢ నిశ్చయులో చూడుడు.—

ఒకనాడు స్వామిజీని ఒక స్నేహితుడు అడిగెను "ఎందులకు ఆపిచ్చివానికడకు వెళ్ళెదవు?" అందులకు ఆయన చెప్పిన జవాబు — "నేను వారి పాదములకడ నా జీవితమును అర్పించినాను—ఆయన నన్ను ఏమిచేసినను సరే—నేను వేయిసార్లు నరకమునకు పోయిననూ సరే—నేను నాదృఢ నిశ్చయమును మార్చుకోజాలను"—అట్టి దృఢనిశ్చయమావశ్యకము.

*　　*　　*

కొందరు మాకు ఏలాటి ఉన్నతి కన్పించుటలేదు అని తరచు పల్కుచుందురు. ఉన్నతి ఉన్నను, లేకున్నను, ఎంతటి కష్టములు వచ్చినను అచంచల శ్రద్ధా విశ్వాసము లున్న చాలును. మనము ఒక్క అడుగు ముందుకు వేసిన ఆయనయే (గురుదేవులు) 16 అడుగులు మనకు ఎదురుగా వత్తురు—

ఒక్క అణా నిస్వార్థముగా దానముచేసిన తప్పక 10 అణాలు తిరిగి వచ్చును. కాని ప్రతి ఫలముకోరి చేసిన లాభములేదు. అన్నింటికిని అమ్మ జీవితమే—మనకు ఆదర్శము.



# భాగవత రహస్యములు

## శ్రీ గురుభక్త పెద్దిభొట్ల కృష్ణశాస్త్రిగారు

### బాలక్రీడ

భక్తుడు తనయందుండెడు మాలిన్యమును మొదట పోగొట్టుకొని పిమ్మట అంతర్ముఖుడై ద్వంద్వాతీతుడైనకొలది శ్రీకృష్ణుని దరికి చేరుచుండును. అప్పుడే బాలక్రీడ సలుపును.

భక్తుడు పాలు పెరుగు వెన్నయు జాగ్రత చేసికొనియుండగా శ్రీకృష్ణుడు వానిని హరించివేయును. అనగా భక్తులు ఏ కర్మచేసినను దాని ఫలమును తాము లేశమైన కోరక శ్రీకృష్ణున కర్పించుటయే. భక్తులు అంతర్ముఖులై తపస్సు చేసినపుడు భగవంతునియందు మనస్సు లగ్నమగును. పిమ్మట లౌకికవ్యవహారములలో తానే కర్మచేసినను ఫలాపేక్ష లేకుండ పరోపకారముగ జేయును. సుఖదుఃఖములు లాభనష్టములు మున్నగు ద్వంద్వములవలన భక్తుడు చలింపడు.

గోపిక లనగా భక్తుల మనస్సు. భక్తుల మనస్సును స్త్రీలింగముగ వాడుదురు. వీరి మనస్సు పురుషుడగు శ్రీకృష్ణునితో గలిసినప్పుడు ఆనందసాగరములో మునుగుదురు. భార్యాభర్తల ప్రేమ సంయోగములోనే మనస్సు లేకమై దేహస్మారకము పోయి యానందములో మునిగిపోవుచుందురు గదా! అట్టిచో భక్తుల మనస్సు శ్రీకృష్ణునితో గలసినప్పుడు వారి యానందము చెప్ప నలవి యగునా?

పాలు పితుకుట, పితికిన పాలను కాచుట, పెరుగును కవ్వముతో చిలికి వెన్నతీయుట ఇవి కర్మయొక్క సూచనలు. పాలనుండి తయారు చేసిన వెన్నను హరించె ననగా భక్తుల పని నిష్కామముగాను పరోపకారముగాను కర్మ చేయుటయే. దాని ఫలమను వెన్న శ్రీకృష్ణునిది. భక్తుడు ఫలము నపేక్షింపక లోకసంగ్రహమునకుగా శక్తిని వ్యయపరచి పనిచేయుటయే శ్రీకృష్ణార్పణము. అట్లు శ్రీకృష్ణార్పణముగా కర్మ నాచరించు భక్తుల యోగక్షేమములను శ్రీకృష్ణుడే చూచును. ఇదియే యజ్ఞవైభవము.

తాను లేశమును ఫలము నపేక్షింపక సర్వభూతహితముగా కర్మచేయుటయే పాలకుండ బ్రద్దలు కొట్టుట.

కృష్ణునకు రాముడు సోదరుడు. రాముడనగా రమించువాడు. అనగా నానందమయుడు. శ్రీకృష్ణుడు భక్తిమయుడు. భక్తిలో నానందముకూడ నుండును.

వీరిద్దరు తోడబుట్టినవారు. అనగా తన్మయత్వము గలిగినవారికి "ఆనందో బ్రహ్మ" అనగా ఆనందమే బ్రహ్మస్వరూపము.

శ్రీకృష్ణుడు నేరముచేసెనని గోపికలు వాని తల్లిదండ్రులకు జెప్పుట యనగా వారి కర్మ ఫలము నాతడు హరించెను గనుక నీలాగు చెప్పిరి.

### కాళీయ మర్దనము

కాళీయుని మడుగే యీ సంసారము. సంసార మనగా జననమరణప్రవాహములో తగులుకొని కొట్టుకొని పోవుచుండెడిది. జనన

మరణప్రవాహ మనునది జీవుడు చేయు కర్మల వలన వాని సుఖదుఃఖము లనుభవించుటకు కలుగుచున్నది. ఈ కర్మలు జీవుని మితిలేని కోరికలవలన వృద్ధియగుచున్నవి. కాని నశించుటలేదు. కోరికల నెవరును చంపుటలేదు. ఒక కోరికను పాతివేసిన నది పెక్కు పిల్లలను పెట్టుచున్నది. ఋణము చేసినవాడు ఋణమును దీర్చుటకు ప్రయత్నింపక ఇంకను ఋణము చేసినట్లు మితిలేని స్వార్థపరకర్మలుచేసి ఋణములను వృద్ధిచేయుచున్నాడు. అందువలన ననేక జన్మలలో చేసికొనిన కర్మలయొక్క సుఖదుఃఖానుభవమును పొంది జ్ఞానమును సంపాదించి వివేకమును వృద్ధిచేసికొని నిష్కామకర్మ చేయుచు అనేకజన్మలలో జీవుడు ఋణమును తీర్చును. ఇట్లన్ని ఋణములు తీరిన పిమ్మట కారణశరీరము నశించి ముక్తిని పొందును.

ఈ కథలోని పాముస కుండెడి విశేషము మనుష్యుని మోహింపజేసెడు శక్తి. ఈ పాము అందముగాను మిగుల ముద్దుగాను మృదువుగాను సొగసుగాను నున్నగాను జారిపోవునదిగాను ఉండును. దాని కళ్లు, దాని పడగ, దాని యాట, దాని మెరుపు, దాని నునుపు, దాని చుక్కల యందము, వీనియం దెంత యాకర్షణ యున్నది!

ఇది ఒక చిహ్నముగా నుదహరింపబడినది. (This is a symbol of sense objects and sense pleasures). అనగా నింద్రియవిషయము లన్నియు నిట్టివే. ఇవియన్నియు నస్థిరమైనవి. దుఃఖభూయిష్ఠములు.

పాము దొరకదు. దొరికినదని భ్రమించి నప్పు డది కాటువేయును. జీవు డనుభవించునది దాని కాటు తప్ప నిజమైన సుఖమే లేదు. ఈ ప్రపంచములో జీవుడు సుఖించుచున్నాడను భ్రమను కలిగించుచున్న కోరికలు విషయము లన్నియు నిట్టి దుష్టసర్పములవంటివే. ఈ కోరికలవల్ల తుదకు తేలిన ఫలితమే 'దుఃఖము'. ''సుఖ మనున దేదైన నున్నదా'' యను ప్రశ్న వేసికొని యాలోచించిన యెడల నేదియును లేదు.

కాళీయుని మడుగు సంసారదుఃఖసముద్రమే. దానిలో నున్నదంతయు దుఃఖమే. ఏది రుచి చూచినను మొదట సుఖమున్నదని భ్రమింప జేయును. కాని తుదకు దుఃఖమే.

అశాశ్వతములో సుఖము లేదు. శాశ్వత మందే యానంద మున్నది. ఇదియే 'యానందో బ్రహ్మ'.

కాళీయు డన మహాకాలము. (Time) కాలమునకు లోబడని దీ ప్రపంచములో నేదియును లేనే లేదు. సర్వమును మార్పుచేయు నది కాలమే. ప్రపంచములో మార్పు చెందని వస్తు వేదియును లేదు. మార్పుచెందని వస్తు వొక్క పరమాత్మయే. మార్పుచెందు వస్తువు లన్నియు నశాశ్వతములు అనిత్యములు అస్థిరము లయినవే. అందుచేతనే దుఃఖభూయిష్ఠములు. రాష్ట్రములు పోయి క్రొత్తవి వచ్చుచున్నవి. రాజులు, సార్వభౌములు పోయి క్రొత్తవారు వచ్చుచున్నారు. భూమి పోయి అక్కడ జలమయమగుచున్నది. జలములోనుండి గొప్ప ద్వీపములు వచ్చుచున్నవి. పగలు పోయి రాత్రి వచ్చుచున్నది.

శ్రీకృష్ణుడు కాళీయుని మడుగునుండి పైకి వచ్చుటయే జ్ఞానోదయము. పడగలను త్రొక్కి చంపుటయే కోరికలను నశింపజేసి నిష్కామ కర్మచేసి పంచఋణములను దీర్చుట. తుద కన్నిపడగలను నశింపజేసిన గాని కారణ శరీరము పడిపోదు. పడగ లనగా పంచేంద్రియ

ములు. అనగా కోరికలన్నిటిని నాశనముచేసి కొనిన పిమ్మట జీవుడు దేహాతీతు డాయెను. అప్పుడు ఎక్కడ వినిన అక్కడ ఓంకారధ్వని వినిపించును. ఇదియే పిల్లనగ్రోవి శబ్దము, మురళీధ్వని.

జీవుడు ఓంకారమూర్తి. అనగా పరమాత్మలో కలిసెనని యర్థము. జీవుడే పరమాత్మ యని తెలిసికొనలేక అజ్ఞాన మనెడి చీకటిలో త్రోవ తెలియక బాధలుపడుచున్నాడు, జీవుడు తన స్వస్వరూపానుభవమును పొందినపుడే ఆత్మసాక్షాత్కారమును పొందెనన్నమాట. అనేకవస్త్రములతో నస్థిపంజరము నలంకరించు నట్లు కథ చక్కగా తెలియుటకు రుచి కలుగ జేయుటకు ఈ విషయము లుపయోగించును.

## గోపికావస్త్రాపహరణము

గోపికల వస్త్రములను శ్రీకృష్ణుడు తీసి కొనెను. అడిగినప్పు డీయక తనయొద్దకు నగ్నలుగా, వి గ త వ స్త్రలు గా, రమ్మని చెప్పి నందులకు వారిపైన శ్రీకృష్ణుడు దురుద్దేశము కలిగియున్నాడని యజ్ఞాను లొక నిందారోపణ చేసిరి.

ఈ నేరము చేయుసరికి శ్రీకృష్ణు డారు సంవత్సరముల బాలుడై యుండెను. అట్టివాని కజ్ఞాను లారోపించెడు దుర్మార్గపు టుద్దేశ మసంభవముకదా! స్థూలముగా ఉదాహరణకు విషయబోధను చెప్పుచున్నాము.

స్త్రీలు వస్త్రములను విసర్జించి స్నానము చేయరాదని మనుధర్మశాస్త్రములో వ్రాయ బడినది. దీనికి వ్యతిరేకముగా చేసినందుకు వీరికి బుద్ధి చెప్పుటకును వారి దేహాభిమానమును నశింపజేయుటకును చేసిన పని యని మనము తెలిసికొనవలయును.

గోపికలు భక్తురాండ్రు. అట్టి భక్తులు భగవంతుడగు శ్రీకృష్ణుని దరిచేరవలెననిన దేహాభిమానమును ముందుగా పోగొట్టుకొనవలెను. పిమ్మట వస్త్రమను దేహమును విడచి జీవాత్మయే వెళ్లవలెను. అనగా దేహములను బాహ్యాధార సహాయము లేశమైన నుండ కూడదు. అనగా జీవాత్మ దేహాతీతుడైనగాని యేకత్వబుద్ధి రాదు. పరమాత్మ దర్శనమును కాదు. కనుక నీ కథలోని యభిప్రాయ మే మనగా జీవాత్మ పరమాత్మతో కలియవలె ననిన దేహాతీతమై నగ్నముగానే (Naked Soul) వెళ్లి కలియవలెను.

## గోవర్ధనగిరి నెత్తుట

భగవద్గీతలో కామ్యకర్మకంటె నిష్కామ కర్మ మేలని శ్రీకృష్ణుడు బోధచేసిన తర్వాత వైదికాచారపరులు కొంతకాలమువరకు దానిని గ్రహించికూడ కృష్ణుడు చెప్పిన ప్రకారము చేయలేదు. ముందు బ్రాహ్మణుల భార్యలు స్వార్థత్యాగముతో చేయు కర్మలయం దిష్టము కలిగి వానిని భక్తితో శ్రీకృష్ణుని గురించి చేసిరి. అందువలన భర్తలుకూడ కొంతకాలము నకు భార్యల మతమే యవలంబించి తుద కంద రును మన హిందూదేశములో స్వార్థరహిత ముగా పనిచేయుచు వచ్చిరి. ఈ వైదికయజ్ఞము లన్నియు కామ్యయజ్ఞములు. ఇవి మానిన పిమ్మట నిష్కామకర్మలు చేయసాగిరి. అందు వలన కలిగిన ఫలితముగా నీ గోవర్ధనగిరిని శ్రీకృష్ణు డెత్తుట జరిగినది.

ఇంద్రుడు మొదలగు దేవతలను మనుష్యు లేల పూజించిరి? దేవతలును మనుష్యులును ఇంద్రియములద్వారా సంబంధము కలిగి యుండిరి.

ఇంద్రియములద్వారా వారు మనుష్యులకు మంచి ప్రోత్సాహ మిచ్చుచు వచ్చిరి. వారే ఇంద్రియాధిష్ఠానదేవతలు. ఇహమందు మన దేహధారణకు కావలసినవన్నియు వారి సహాయమువలననే మనకు వచ్చెడివి. అయిన మనము చేసిన కర్మలకు తగిన ఫలముకంటె నెక్కువగ మనకు హక్కులేని ఫలమును వారీయగలరా? ఈయలేరు. మన కర్మానుసారముగా వారి అనుగ్రహమువలన మనము పొందుట కర్హములగు వాని నే యనగా మన జీవితావసరములనే (Necessities of life) మనము పొందుచుంటిమి. మనము యజ్ఞములుచేసి వానిలోని హవిర్భాగములను వారికి కృతజ్ఞతాపూర్వకముగా సమర్పించుచుండుటచే వారనుగ్రహించి మన కోరికలను నెరవేర్చుచుండిరి. ఇది పూర్వపు టాచారమై యుండెను. అట్టి యజ్ఞములు రాను రాను మానివేసితిమి. కావుననే వారివలన మన జీవితమునకు కావలసిన లాభములను పొందజాలకుంటిమి.

ఈ సృష్టి యజ్ఞవైభవములో బయలుదేరినది, యజ్ఞధర్మము (Law of sacrifice) వలననే యిది రక్షింపబడుచున్నది. అన్యోన్య సహాయము, అన్యోన్యాధారము (Law of interdependance and co-operation) సృష్టియొక్క ధర్మములై యున్నవి. ఇట్టి ధర్మములను మానవు డుల్లంఘించినపుడు దేవతల కాగ్రహము వచ్చినచో నాశ్చర్య మేమున్నది? ఇట్లుండగా మనుష్యులకును దేవతలకునుకూడ నింతకన్న సమానముగా వర్తించు గొప్ప సామాన్యధర్మ మొకటి యున్నది. అదియే సర్వేశ్వరుడగు మహామహునితో ప్రత్యేకముగా సంబంధము కలిగించునటువంటి ధర్మము. భగవద్గీతలో చెప్పిన "అధియజ్ఞ' మనున దిదియే.

మనుష్యులు తాము చేయు కర్మలను సరాసరి భగవంతుని సేవకై పూర్తిగా నర్పణచేసినచో నప్పుడు దేవతల సంబంధ మవసరము లేదు కదా! అట్లు శ్రీకృష్ణార్పణముగా కర్మ చేయు మనుష్యులపై దేవతల కధికార ముండునా? దేవతలు మనుష్యజీవితములతో సంబంధించినవారు. ఫలప్రదాతయగు ఈశ్వరుని క్రిందివర్గమువారు. ఈశ్వరుడు ప్రసాదించినను దేవతలద్వారానే మనకు ఫలము వచ్చును.

"గోవర్ధనగిరి" యనగా గోపికలదివరలో చేసికొనిన కర్మసంచితము. కనుక ఈ కర్మసంచితమే వారి యింద్రియము లను గోవులకు మేతనిచ్చు నాధారమై యున్నది. కర్మసంబంధమున్నకొలది ఇంద్రియలోలత్వము హెచ్చుచున్నది.

కనుక గోపికలను భక్తులు ఇంద్రియాతీతులై నిష్కామకర్మచేసి శ్రీకృష్ణునకే తమ ఫలము నర్పించుచు రాగా రాగా అట్టి భక్తుల కర్మబంధమువలన కలిగిన భారమును శ్రీకృష్ణుడు తాను వహించి చులకనగా వారి కర్మసంచయమను గోవర్ధనగిరి నెత్తివేసెను. శ్రీకృష్ణు డిట్లు భక్తుల కర్మను వహింపగా దేవతల కట్టి భక్తులపై నధికారము పోయెను. అప్పుడు దేవతలు కోపించిరి. తామే స్వతంత్రులమని విఱ్ఱవీగిరి. భగవంతుడు వారికి గుణపాఠము చెప్పెను. దానివలన మానవులుకూడ పాఠమును నేర్చుకొనిరి.

దీనివలన తెలిసికొనవలసిన పాఠ మేమనగా ఇంద్రియములను పోషించునది కామ్యకర్మ. అందుచేతనే యిట్టి యింద్రియములను గోవులను పోషించునది ఈ గోవర్ధనగిరి యను కామ్య

కర్మసంచితము. అది నశించినగాని రక్షణలేదు. ఇట్టి కామ్యకర్మవలన కలిగిన భారమును శ్రీకృష్ణుడు వహించెననగా భక్తులు నిష్కామ కర్మ నాచరించుచు దానిఫలమును శ్రీకృష్ణార్పణము చేయుచు రాగా రాగా అట్టి కర్మ సంచితము నశించును. ఇదియే శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి నెత్తుట. ఇంద్రియపోషణచేయు కర్మ స్వార్థము. నీచము. అధోగతికి దారి తీయును.

గోవర్ధనము అనగా గోవులను మేపునది. వృద్ధిపొందించునది. ఇంద్రియములను గోవుల కాధారమగు కర్మసంచితమైయున్నది. ఇంద్రియ లోలత్వమువలన చేయు పనులన్నియు బంధించు కర్మ యనబడును. అట్టి కర్మను నశింపజేయుటకు మనము నిష్కామకర్మ చేయవలెను. అనగా ఈశ్వరప్రీతిపూర్వకముగ చేయవలెను. కర్మ లోకముకొఱకు చేయవలెను గాని స్వార్థము కొఱకు చేయరాదు.

శ్రీం శ్రియైనమః

శ్రీరంగాచార్యగురవేనమః

# హరివాసరవ్రతమాహాత్మ్యము

శ్రీమత్కిశాంబి రంగాచార్యులుగారు

## "పద్మ" (శయని) అనెడి ఆషాఢ శుద్ధైకాదశి :

దీని మాహాత్మ్యము బ్రహ్మాండపురాణమందు చెప్పబడినది. యుధిష్ఠిరుండు ప్రార్థింపగా పూర్వము నారదునకు బ్రహ్మచెప్పిన విషయమును శ్రీకృష్ణపరమాత్మ ధర్మరాజునకుం జెప్పియుండెను. హరివాసరముకంటెను పవిత్రమైన దీలోకమందు మఱెద్దియు లేదు. సమస్త పాపములు క్షీణించుటకు సర్వప్రయత్నముల ఏకాదశీవ్రత మాచరింపవలయును. అన్ని కోరికల నీడేర్చునదియు పాపముల ద్రుంచునదియునై మహాపుణ్యమైన వ్రతమైయున్నది. ఈ ఉత్తమ వ్రతము హృషీకేశుని ప్రీతికి అవశ్యము చేయదగినది. వివస్వద్వంశసంభవుడైన మాంధాత అను నామముగల రాజర్షియగు చక్రవర్తి సత్యసంధుడును ప్రతాపవంతుడునై ప్రజలను తన ఔరసపుత్రులవలెనే పరిపాలించుచుండెను. అతని రాజ్యమందు దుర్భిక్షముగాని ఆధివ్యాధులుగాని లేక ప్రజలందరు ధనధాన్యసమన్వితులై యుండిరి. మహీపతియొక్క కోశము అన్యాయోపార్జితమైన విత్తముచేగాక న్యాయార్జితమైనట్టియు ప్రజాపీడన రహితమైనట్టియు ధనముచే నింపబడుచుండెను. ఈ ప్రకారముగా ధర్మపరిపాలనము చేయుచుండగా ననేక వర్షములు గడిచెను. అంత నొకానొక సమయమున పాపకర్మయొక్క పరిపాకమున మూడు

సంవత్సరములు అనావృష్టిచే సస్యరహితమై దుర్భిక్షము ప్రబలి ప్రజలు క్షుధార్తులై స్వాహా స్వధావషట్కార వేదాధ్యయన వర్జితులై రాజ సన్నిధికి వచ్చి—

"ఆపో నారా
పురాణేషు మనీషిభిః।
అయనం తా భగవత
స్తేన నారాయణః స్మృతః॥

అని వినుచున్నాము. విష్ణుభగవానుడు పర్జన్య రూపుడు. అంతటను వ్యాపించియున్నవాడు. ఆతనిచే వర్షముగలుగును. దానిచే అన్నము, అన్నమువలన ప్రజలు గలుగుచున్నారు. కాబట్టి వర్షము లేనియెడల ప్రజలు క్షయమును బొందెదరు. కనుక యోగక్షేమము ఎటుల గలుగునో ఆప్రకారము చేయవలయును" అని ప్రార్థించిరి. "మీరు చెప్పినది వాస్తవము. అన్నము బ్రహ్మస్వరూపము. అన్నము వలననే సమస్తము ప్రతిష్ఠింపబడినది. అన్నమువలననే సమస్త భూతములు పుట్టుచున్నవి. అన్నముచేతనే జగత్తు వర్తింపబడుచున్నది. ఈ ప్రకారమే శ్రుతిస్మృతి పురాణాదులు ఘోషించుచున్నయవి. "నృపాణామపచారేణ ప్రజానాం పీడనం భవేత్". రాజుయొక్క అపరాధముచే ప్రజలకు కష్టములు సంభవించును. బుద్ధిచే నాలోచింపగా నా స్వయంకృతాపరాధమెద్దియు గానరాదు. ఐనను ప్రజాహితమునకు ప్రయత్నించెదను" అని రాజు ప్రజలతో నుడివి దృఢమనస్కుడై భగవానుని స్మరించుచు అరణ్యమునకుబోయి యటనున్న ముఖ్యాశ్రమముల దిలకించుచు బ్రహ్మతేజముతో ప్రకాశించుచున్న బ్రహ్మసుతుడైన అంగిరోమహర్షి నిజూచి సాష్టాంగనమస్కారము జేసెను. అంత నమ్మహర్షి కుశలప్రశ్నానంతరము, అరణ్యమునకు రాజాగమన కారణంబడుగగా, ధర్మవిధానముగా భూమిని పరిపాలించుచున్నను ఏకారణముచేతనో అనావృష్టి గలిగినదనియు ఆ సంశయనివృత్తిజేయుమనియు ప్రజలకు యోగక్షేమము గలుగునటుల ఈ దుర్భిక్షమునుండి నివృత్తిని జేయుడనియు రాజు అంగిరో మహర్షిని ప్రార్థింపగా యుగములలో కృతయుగము శ్రేష్ఠమైనదనియు ధర్మము నాలుగుపాదముల పైనడచుననియు, బ్రాహ్మణేతరులు తపోయుక్తులుగ నున్నవారనియు, అతని రాజ్యమందు వృషలుడు తపస్సుచేయుచున్నవాడు గాన అకార్యకరణముచే మేఘములు వర్షించుట లేదనియు ఆ వృషలుని వధించినచో దోషము శాంతించుననియు ఋషిసత్తముడు జెప్పగా— "తపముజేయుచున్నవానిని నేను వధింపజాలను, ఈ ఉపద్రవ నాశనమునకు మరొండు ధర్మమార్గముపదేశింపు" డని రాజు ప్రార్థింప "ఈ ఆషాఢమాస శుక్లపక్షమందు వచ్చు 'పద్మ' అను ఏకాదశీవ్రత మాచరించిన ధ్రువముగా వర్షించును. ఇయ్యది సర్వసిద్ధిప్రదము, ఉపద్రవమును నాశముచేయును. కాన నీవు ప్రజాసహితముగ నీ యేకాదశీవ్రతమాచరింపు"మని ఋషి పుంగవుం డుపదేశింప రాజు సంతోషించి తన నగరమునకువచ్చి యీ ఏకాదశీదినమందు తాను ప్రజలతో చాతుర్వర్ణ్యములతో కలసి వ్రత మాచరించెను. ఆ ప్రభావముచే సువృష్టి గలిగి సస్యములు ఫలించి ప్రజలందరు సౌఖ్యము నొందిరి. ఈ పద్మావ్రతము భుక్తిముక్తిప్రదము. లోకమునకు సుఖదాయకము. పఠనశ్రవణములచే సర్వపాపములు నశించును. ఇదియే "శయనైకాదశి" యనికూడ ప్రసిద్ధి పొందినది.

## చాతుర్మాస్యవ్రతము

శ్రీమహావిష్ణువు ఈ ఏకాదశినుండి శయనించును. కార్తికశుద్ధైకాదశికి లేచును. ఈ నాలుగు మాసములు "శయనవ్రతము" "చాతుర్మాస్యవ్రతము" అని ప్రఖ్యాతి నొందినవి. ఈ వ్రతమాహాత్మ్యము భవిష్యపురాణమందు చెప్పబడినది. విష్ణుప్రసాదసిద్ధ్యర్థము విష్ణుశయనవ్రతమును మోక్షమందు కోరికగలవార లవశ్యము చేయదగినది. ఆషాఢశుద్ధైకాదశీదినమున నుపవసించి శంఖచక్రగదాధరుడును పీతాంబరుడునైన విష్ణువుయొక్క ప్రతిమను స్థాపించి పర్యంకమందు శయనింపజేసి ఇతిహాసపురాణజ్ఞులు వేదపారగులునైన బ్రాహ్మణులచే దధిక్షీరఘృతక్షౌద్రజలములచే స్నాపనముజేసి గంధముచే లేపనముజేసి ధూపదీపములసమర్పించి మంత్రములచే పుష్పములతో పూజించి—

"సుప్తే త్వయి జగన్నాథే
జగత్సుప్తం చరాచరమ్।
విబుద్ధే త్వయి బుద్ధ్యేత
జగత్సర్వం చరాచరమ్"॥

ఈ ప్రకారముగా విష్ణుప్రతిమను పూజించి కృతాంజలిపుటుడై

"చతురో వార్షికాన్మాసా
న్దేవస్యోత్థాపనావధి।
గ్రహిష్యే నియమాఞ్శుద్ధా
న్నిర్విఘ్నాన్కురు మేప్రభో"॥

అని ప్రార్థించి సంశుద్ధమానసుడై స్త్రీగాని పురుషుడుగాని విష్ణుభక్తుడైనవాడు ధృతవ్రతుడై నియమముతో కార్తికశుద్ధద్వాదశిరోజునకు వ్రతసమాప్తి చేయవలయును. ఈ వ్రత మొక్కతూరి సలిపినను సమస్తపాతకములనుండి విముక్తుడగును. ప్రతివత్సరము నీ వ్రతమాచరించువాడు దేహాంతమున సూర్యతేజముతో సమానమైన విమానమునెక్కి విష్ణులోకమున ఆనందముతో సంచరించుచుండును. దేవాలయమున బ్రతినిత్యమును మార్జనజలసేచనగోమయప్రలేపనములతో రంగవల్ల్యాదులుంచుట యెవరీ నాలుగు మాసములు జేయుదురో వారు ఏడుజన్మములవరకు విప్రేంద్రులై సత్యధర్మపరులు కాగలరు. దధిక్షీర ఆజ్యమధుశర్కరలచే ఎవడు విధివిధానముగ దైవమునుస్నాపనము జేయునో వాడు విష్ణుసారూప్యమునొంది అక్షయసుఖమునొందును. నృపుడైనవాడు దైవమునుద్దేశించి విప్రునకు యథాశక్తిగ బంగారమునహా భూమిని దానముచేసినవా డిహలోకమందు స్వర్గములోని రెండవ ఇంద్రునివలెనే అక్షయమైన భోగముల ననుభవించి అంతమున విష్ణులోకము నొందును. దేవబ్రాహ్మణులకు గంధపుష్పాక్షతాదులచేపూజించి నైవేద్యం బిడిన వా రక్షయమైన సుఖ మనుభవించి పురందరపురమున కేగుదురు. ఈ నాలుగు మాసములును హరిని తులసిచే నర్చించి కాంచనముచే తులసిదళమును జేయించి బ్రాహ్మణునకు దానముజేసిన బంగారువిమానమునెక్కి విష్ణులోకమునకు బోవును. దైవమునకు ధూపదీపములనిచ్చి వ్రతానంతరము వానిని బ్రాహ్మణునకు దానముజేసిన శ్రీమంతుడై సౌభాగ్యమైన జన్మను బొందును. కార్తికమాసపర్యంతము ఎవరు అశ్వత్థవృక్షమునకుగాని విష్ణువునకుగాని ప్రదక్షిణ నమస్కారముల జేయుదురో వారు నిస్సందేహముగ సత్యముగ విష్ణులోకము నొందుదురు. దైవబ్రాహ్మణుల యింటిముందట సంధ్యాదీపమునుబెట్టి సమాప్త్యనంతర మద్దానిని వస్త్రకాంచనములతో నెవరు దానము

జేయుదురో వా రిహలోకమున దేజస్వంతులై వైకుంఠము నొందుదురు. శ్రద్ధాసమన్వితులై యెవ్వరు విష్ణుపాదోదకమును త్రావుదురో వారు విష్ణులోకమునొంది తిరిగి పరజన్మము నొందరు. త్రికాలములందు గాయత్రి అష్టోత్తరశతము దేవాయతనమున జపముజేయువారు పాపములచే నంటబడరు. ప్రతినిత్యమును పురాణములనుగాని ధర్మశాస్త్రములనుగాని వినుచు ఆ పుస్తకమును వస్త్రసహితముగ దానముజేయువాడు పుణ్య, ధనవంతుడై భోగియై సత్యశౌచ పరాయణుడై జ్ఞానవంతుడై లోకమందు విఖ్యాతి నొందును. నామత్రయవ్రతపరుడై సమాప్తిదినమున నా బంగారు ప్రతిమను దానముజేసిన వాడు పుణ్యవంతుడై దోషరహితుడై సుగుణములతో శోభాయమానుడగును. నిత్యకృత్యములదీర్చి సూర్యున కర్ఘ్యమిచ్చి సూర్యమణ్డల మధ్యముననున్న దైవమైన జనార్దనుని ధ్యానముజేసి వ్రతానంతరమున బంగారము, రక్తవస్త్రము, గోవును దానముజేసిన ఆరోగ్యమును, పూర్ణాయువును, కీర్తి, లక్ష్మి, బలము బొందును. చాతుర్మాస్యమునందు ప్రతి దినమును వ్యాహృతులతో గాయత్రిమంత్రముచే తిలాహోమమును అష్టోత్తరశతముగాని ఇరువదియెనిమిదిసారులుగాని చేయుచు సమాప్తి దినమందు తిలపాత్రమును విప్రునకు దానము జేసిన మనోవాక్కాయములచే చేసిన పాపము సంచితపాపము నశించి రోగములేనివాడై సత్సంతానము బొందును. అన్నహోమముజేసి సమాప్తిదినమున ఘృతకుంభమును వస్త్రకాంచనములతో దానముజేసిన ఆరోగ్యము సాటిలేని కాంతియు సౌభాగ్యసంపదలను బొంది శత్రుక్షయమును బొంది బ్రహ్మతో సమానుడగును. విష్ణువునకు ప్రియకరమైనట్టియు, శుభప్రదమైనట్టియు తులసిని ఎవరు ధరింతురో వారు సర్వపాపములనుండి విముక్తులై విష్ణులోకము నొందుదురు. శాకమూలఫలములతో చాతుర్మాస్యవ్రతము సలిపి సమాప్తిదినమున గోదానముజేసిన విష్ణుమందిరమునకు బోవుదురు. పయోవ్రతముచేయువాడు సనాతనమైన బ్రహ్మలోకము నొందును. ఈ చాతుర్మాస్యవ్రత విషయమై యింకను విశేషముగా ఫలము చెప్పబడినది. గ్రంథవిస్తరభీతిచే ఇంతటితో విరమించుటమైనది. శ్రీభగవానుడు శయనించిన యీ నాలుగు మాసములు నియమముగా వ్రతము జేయుటచే పొందగలుగు ఫలము ఇంత యని చెప్పనలవికాదు. ఈ వ్రతముచే విష్ణువు ప్రీతిని తృప్తిని బొందును.

శ్లో॥ దుగ్ధాబ్ధివీచి శయనే భగవాననంతో
యస్మిన్దినే స్వపితిచాథ విబుధ్యతే చ।
తస్మిన్ననన్యమనసా ముపవాస భాజాం
పుంసాం దదాతి చ గతిం గరుడాసనోఽసౌ॥

### "కామిక" అను ఆషాఢబహుళైకాదశి

దీని మాహాత్మ్యము బ్రహ్మవైవర్తపురాణమందు చెప్పబడినది. కామికామాహాత్మ్య శ్రవణమాత్రముననే వాజపేయ యజ్ఞఫలము లభించును. ఈ దినమున శంఖచక్రగదాధరుడును శ్రీధరుడునునైన మధుసూదనుని పూజించినను ధ్యానముజేసినను అందువలన గలుగు పుణ్యముతో గంగా కాశీ నైమిశ పుష్కరాది క్షేత్రములవలన గలుగు పుణ్యము సమానము కానేరదు. కేదారకురుక్షేత్రాదులందు సూర్యగ్రహణమందు గలుగు పుణ్యము విష్ణుపూజనచే లభించు పుణ్యముతో సమానముకాదు. సింహమందు గురుడు ప్రవేశించిన సమయమున గోదా

వరియందును వ్యతీపాతసమయమున గండకీనది యందును గలుగు పుణ్యము కృష్ణపూజనఫల ముతో సమానముకాదు. ససాగరవనోపేత ముగ వసుంధరను దానముచేసినవాడును కామికావ్రతముచేయువాడును - ఈ యుభ యులును సమానఫలము నొందుదురు. ఈను చున్న గోవును అలంకారయుక్తముగ దానము జేసిన ఫలముతో సమానమైన ఫలమును కామికావ్రతమాచరించినవాడు పొందును. శ్రీధరుని పూజించుటచే సమస్త దేవతలు గంధర్వోరగపన్నగులు పూజింపబడినవారగు దురు. కాబట్టి సర్వప్రయత్నముచేతను పాప భయముగలవారీ వ్రతము నాచరింపదగును. పాపపంకసమాకులమైన సంసారార్ణవమునందు నిమగ్నులైయున్నవారు అందునుండి ఉద్ధరింప బడుట కవశ్యము పాపహరమైన పవిత్రమైన యీ కామికావ్రతమాచరింపదగును. అధ్యాత్మ విద్యానిరతులైనవారే ఫలము నొందుదురో అంత కెన్నోరెట్లు ఫలమును కామికావ్రతము జేయువారు పొందుదురు. కామికావ్రతముజేయు నరుడు రాత్రిజాగరణచేయుటచే రౌద్రుడైన యముని చూడడు, దుర్గతి నొందడు. అధో యోనులందు జన్మింపబోడు. తులసీదళములతో హరిని పూజించినవానికి తామరాకును నీర మంటనటుల పాపము లంటనేరవు. సువర్ణభార మును అంతకు నాలుగింతలు రజతమును దాన ముజేసిన పుణ్యము తులసీదళపూజనముచే గలుగును. రత్నమౌక్తికవైడూర్యప్రవాళాదు లచే నర్చించినను విష్ణువు తులసిచే పూజించిన రీతిని తృప్తినొందడు. తులసిచే కేశవుని పూజ చేసిన ఆజన్మకృతమైన పాపము తుడిచివేయ బడును.

శ్లో॥ యా దృష్టా నిఖిలాఘసంఘ
శమనీ, స్పృష్టా వపుఃపావనీ,
రోగాణా మభివందితా
నిరసినీ, సిక్తాంతకత్రాసినీ।
ప్రత్యాసత్తి విధాయినీ భగవతః
కృష్ణస్య సంరోపితా,
న్యస్తా తచ్చరణే విముక్తి
ఫలదా, తస్యై తులస్యై నమః

హరిదినమందు దివారాత్రమును ఎవరు దీపా రాధనము జేయుదురో అట్టివారి పుణ్యఫలము యొక్క సంఖ్య యెంతయో చిత్రగుప్తుడు సహి తము ఎరుగడు. విష్ణుసన్నిధిని ఏకాదశి దిన మందు ప్రజ్వలించుచున్న దీపముచే పితృదేవ తలు స్వర్గమందు అమృతమును గ్రోలినటులనే తృప్తిని చెందుదురు. ఘృతముచేగాని లేక నువ్వులనూనెచేగాని దీపమును ప్రజ్వలింపజేసిన నూర్లకోట్ల దీపములచే సూర్యలోకము నొందు ను. సర్వపాతకములను హరించునదియు, బ్రహ్మ హత్య భ్రూణహత్యాదులను నశింపజేయు నదియు. స్వర్గలోకమునిచ్చునదియు మహాపుణ్య ఫలప్రదమైనదియు నగు ఈ వ్రత మవశ్యము చేయదగినది. ఏ నరుడు దీనిని శ్రద్ధతో వినునో వాడు సర్వపాపవినిర్ముక్తుడై విష్ణులోకము బొందును. ఇద్దానిని బ్రహ్మ నారదునికి ఉపదే శింపగా ఆ వృత్తాంతమును శ్రీకృష్ణభగవానుడు యుధిష్ఠిరునకు జెప్పెను.

హరిః ఓం తత్ సత్.

# వ్యాకులత

శ్రీ సరస్వతుల చంద్రశేఖరశాస్త్రిగారు, బి. ఏ.

జీవితములో ప్రతియొక్కరికిని ఎన్నడో ఒకనాడు మనోవ్యాకులత ఏర్పడియే తీరును. లోకములో కపటమే లేనిచో, మనకెల్లరకును సువిశాలమగు హృదయమే యున్నచో, తోటి మానవుల యనుభవ విశేషములు మనకు పూర్తిగ ఎఱుకపడియుండెడివి. కాని, నా స్వానుభవములోనే, నా చింతలు అన్నియు ఆప్తులకుకూడ తెలుపుటకు నేను సాహసించియుండలేదు. నన్ను సృష్టించిన యా పరమాత్మునకే నివేదించితిని.

బౌద్ధమతము బుద్ధుని మనోవ్యాకులతయందే జనితము. జరామరణదుఃఖములను, వృద్ధాప్యము మొదలగు కాలపరిణామజనితములగు నవస్థలను పరికించి, యా ఆసియాజ్యోతి సంసారమునే త్యజించి, జోగి అయ్యెను.

నా యౌవనమునందు జరిగిన సంభవము: మా తండ్రిగారికి వారి అరువదవయేట చంకలో నొక కురుపయ్యెను. భగవత్కృపవలన వారి కంతకుముం దట్టి బాధ, నా యనుభవములో కలిగియుండలేదు. ఈ సందర్భమున వారు పడిన బాధను జూచి, నేను "జీవితమింతేకదా!" యను నిరుత్సాహమును జెంది, విరక్తివలన ఒక విధముగ నప్రయోజకుడ నైతిని. తరువాత కొంతకాలమునకు మా తండ్రిగారి మృతివలన, నా పొట్ట నేనే పోషించుకొనవలసిన సందర్భమేర్పడి, లౌకికప్రయత్నములందు నిమగ్నుడ నైతిని.

సృష్టిలో మనమెంత విరక్తిజెందినను, మన బుద్ధి నాకర్షించు బలవత్తర శక్తులున్నవి. అట్టి కారణమువలన, నేను వివాహముజేసికొని, కొంత యాలస్యముగనైనను, లోకములో నూటికి తొంబదితొమ్మిదిమందివలె గృహస్థాశ్రమమును స్వీకరించితిని. కాని నేడు వ్యాకులత లేదా? ఉన్నది, కావలయునంత యున్నది. ధనాభావము చేత, శరీరానారోగ్యము చేత, ప్రపంచపరిస్థితులవలన, ఇంకను ఎన్నో కారణములవలన వ్యాకులత ఉండనే ఉన్నది. వీనిని పోగొట్టుకొను ప్రయత్నమునుకూడ సకలమానవాళివలె జేయుచునే యున్నాను. దైవభక్తి యీ ప్రయత్నములో ఎంతవరకు పనికివచ్చును?

చాల పనికివచ్చును. నేనిట్లాలోచింతును: ఇదియంతయు నీ పోకడయే, దైవమా, నీ వెట్లాడించిన నట్లాడుదును. సుఖమును, దుఃఖమును, రెండింటిని ఒక్కమాదిరిగానే అనుభవింతును. నీవే లేనిచో, నా జీవితమునకే, యీ సృష్టికే చెప్పదగినంత ప్రయోజనమేమియు లేదు. విరక్తిగ నుందును.

మానవాళి నాటినుండి నేటివరకు, చీకటినుండి వెలుతురులోనికి వచ్చుటకే ప్రయత్నించుచున్నది. వ్యక్తులు కొందరికి సృష్టిక్రమ మవగాహనమై యున్నది. దీనిలాభమును మనమెల్లరము పొందగలము. ఆదిశక్తి సంకల్పించినప్పుడు మన కది అతిసులభమగును; ఇహలోకసుఖము జనసామాన్యమునకు లభ్యమైనప్పుడు, జాతి అంతయు ఆధ్యాత్మిక ప్రయత్నములందు పాల్గొనును. అప్పుడు మన మొకతరము పైకిలేచెదము. అంతవరకు జ్ఞానమును పొందగల్గినవారు తామరాకుమీది నీటిబొట్టువలె జీవితమును గడపవలెను.

వ్యాకులత కల్గును, కాని వివేకమను దివ్యౌషధిచే ఆ దుగ్మతను బోగొట్టుకొనవలెను. వెలుతురులోనికి అదే దారి!

# “తోమ్ తానా నానా”

శ్రీ బులుసు ఉదయభాస్కరముగారు

[సూచన :—ప్రతి పేరాలోను మొదటి కొటేషనులోని వాక్యములను జూచి దాని క్రింది వివరణమును జూచిన పై వాక్యము లెవరెవరితో పలికినది తెలియబడును. దీనికి హిందీలోని యొక చిన్న కథ యాధారము.]

‘ప్రభూ! మన సంగీతసిద్ధుడు దీపకరాగము నాలపింపగలడు గదా’. చలికాలపు దినములవి. శీతసమీరము తూపువలె సాగుచుండెను. ప్రాణుల శరీరములు శీతముచే సంకోచభావమును బొందుచుండెను. వీరబలుని సమయస్ఫురణమున కక్బరు మొగమున జిఱునవ్వు పొడసూపెను.

‘సమయానుకూలమైన తలపియ్యది. దీపకరాగము నాలపింప వినవలయు నను కోరిక కూడ నా మనసున నిండుకొనియే యున్నది’. ఉన్నత వేదికపై పాదుషా యాసీనుడై యుండెను. రెండువైపుల వరుసగా నమర్పబడిన యుత్తమాసనములపై రాజప్రతినిధులు వరుసగా గూర్చొనియుండిరి. కాని దక్షిణపంక్తిలో పాదుషాకు దగ్గఱగా నున్న యొక యాసనము రిక్తమై యెవరి రాకకో నిరీక్షించుచుండెను. పాదుషా కరములా యాసనము నలంకరింపుడని యెదుటి వ్యక్తికి సంకేతము సేయుచుండెను. ‘శీతముక్తితోబాటు సంగీతరక్తినిగూడ బడసెదము గాక!’

‘దీపకరాగమే! హంత!’ పాదుషా పలుకులకు దాన్సేను మనసు ఖిన్నమయ్యెను. ఆతని ముఖమున నెందులకో సంకోచభావ ముదయించెను. కాని రాజాజ్ఞ యాతని మనోభావముకంటె బలీయమైనది. దాన నతడు వంగెను. దీపకరాగము నాలపించి వాతావరణమును బ్రకంపింపజేసెను. రాజసౌధమున నెల్లెడల వేడిమి వ్యాపించెను. అంతర్జ్వాలకు దాన్సే నెంతయో భయకంపితుడయ్యెను.

‘అబ్బా! మూర్ఖత్వము ప్రభువులది. దాన ననుభవము పాలితునిది’. తాన్సేను స్వాస్థ్యము గోల్పోయెను. ఆతని తాప మే విధముగను శమింపకుండెను. మఱల స్వాస్థ్యము జేకూర్చుకొను దలపున నతడు పాదుషా యానతి గొని సబర్మతీతటమున గొంతకాలము వసింపబోయెను.

‘నానీ! అరుణు డుదయింపనున్నాడు. వేగమ సబర్మతికి బోయివత్తము. లెమ్ము!’ ‘తాని’ ‘నాని’ గ్రామీణయువతులు. వారిరువురి కటితలములందు కలశములు శోభించుచుండెను. ముగలుల దాడులకు గుజరాతు ఆనాటిలక్ష్యము. హైందవస్త్రీలు బాహ్యకృత్యములను భానుని జూడక పూర్వమే పాటించుకొనువారు.

“దీపకరాగమున తపనశక్తి మెండను పెద్దల నుడి యూరక పోవునా? అక్బరు దర్బారులోని సంగీతసిద్ధుడు దీపకరాగమునాలపించి స్వాస్థ్యము గోలుపోయి మఱల సేకూర్చుకొను దలంపువ

నీ సబర్మతీ తటమున గాపురమున్నవాడు' 'తాని' చూపులు 'నాని' కెదుటి పురుషుని దిల కింపుమని సైగజేయుచుండెను. 'నాని' తాన్సేను నవలోకించెను. 'తాని' తన యతర్కితపు బలుకున కొంకింత సంకోచము నొందెను.

"ఆహా! ఇంతటితో నా చింత యంత మొందగలదు. నాకు లభించినది సాధారణ వస్తువుగాదు. అది యొక్క పెన్నిధానము". పై పలుకు దాన్సేను చెవుల బడెను. ఆతని మనమున స్వాస్థ్యవిషయముగా వాడిపోయిన యాశాలత మరల జిగురొత్తెను. త్వరితగతి నాతఁడా యిరువురు రమణుల దరిసెను. తన వృత్తమునంతను సవిస్తరముగా, సవినయముగా వారి కెఱిగించుకొనెను.

"అమ్మా! సోదరీ! ... దయచేసి ... నా దీపకరాగతాపము ... నడపుడు! ... సోదరీ!" యువతుల ముఖములందు ముందుగ నేలకో సంకోచభావము గనవచ్చెను. కాని సోదరీ భావము నరసి వారి హృదయముల సంభ్రమ మడగెను. ఇరువురు తాన్సేను శపథముల ద్రోసి పుచ్చలేకపోయిరి. తాన్సేను కొంతముందునకు వంగి దోసిలి కట్టుకొని దీనుడై నిలిచియుండెను. ఆనందాతిరేకమున నాతని స్వరము గద్గదిత మయ్యెను.

'అక్కా! తడవగుచున్నది'. 'తామును మా వెంట మా గృహమునకు జనుదెంతురు గాక!' 'నాని' 'తాని' చేతినిబట్టి లాగెను. 'తాని' కలశములోని జలము కదలికకు తొణి కిసలాడెను. ఆమె చేయి తాన్సేనును తోడ రండని సంకేతము సేయుచుండెను. తాన్సేను 'తాని' 'నాని'ల మార్గము ననుగమించెను.

"ఆహా! మేఘరాగమందలి గుణ మమోఘము. కాదు! కాదు! నిజమందు మీ సంగీత లాఘవమున కీడులేదు." 'నాని' యొకమారు కాదు పలుమాఱు మేఘరాగము నాలపించెను. తాన్సే నమందానందపు సంద్రమున మునుకలు వేసెను. ఆతని యంతస్తాప మింతటితో నంత మొందెను. అనతికాలమున నతనికి మరల స్వాస్థ్యము చేకూరెను.

"మా యెదుట జేసిన శపథములను మఱువ వలదు సుడీ! పొరపడిన బ్రమాదము!" తాన్సే నీ విషయమును గుప్తముగా నుంతు నని శపథ మొనరించియుండెను. అతడు మగుడ ఢిల్లీనగర మునకు బయనమయ్యెను.

"తపనమునకు దీపకరాగము! శమనమునకు మేఘరాగము! సంగీతశాస్త్రమందలి శక్తి నిస్సీమము. కాదా మఱి! శ్రీకృష్ణుని మధుర మురళీరవమునకు గోపిక వంటయింట గాలు తము గరగి పారెడివట!" అక్బరు, నతని రాజప్రతినిధులు తమ తమ యాసనముల నలంకరించియుండిరి. తాన్సేను స్వస్థత అక్బరున కానందము గలిగించెను. ప్రసంగవశమున దాన్సేనుకు సంగీతమహత్త్వము నెంత వర్ణించినను దనివితీరకుండెను. అతడు సంతోషాతిరేకమున పొరపడి మేఘరాగమహాత్త్వము నుగ్గడించివైచెను.

"దీపకరాగమును వినిన మీదట మేఘరాగము తప్పక వినవలసినదే! ఎండలో నడచి డస్సినవానికే నీటి చల్లదనపు జ్ఞానము! పయనము కండు! సబర్మతీతటి కరుగుదము". తాన్సేను ఫాలమునందలి ముడతలు, నయనములు, భయభావము నుగ్గడించుచుండెను. తా నక్బరువద్ద దెచ్చిన ప్రసంగముపై దాన్సేనున కనుతాప మొదవుచుండెను. చేతులు కాలిన

మీదట నాకుల బట్టనెందులకు? పాదుషా యాదేశము ముందాతని యెత్తుగడలు సాగ లేదు. తాన్సేను పాదుషాను దోడ్కొని మగుడ సబర్మతీతటమును జేరక తప్పలేదు.

"చెల్లీ! మనతోడ సోదరభావమును గట్టు కొనిన తాన్సేనువలె దోచుచున్నాడు", "అక్కా! అతనితోడ నున్నవాడు యవన ప్రభువువలె దోచుచున్నాడు. మన మింటికి వడి వడిగా నడుగిడి పోవలయును". 'తాని' 'నాని'ల కలశములు జలభరితములయ్యెను. వారిరువురి దృక్కులు నొక్కమాఱు దాన్సేను పాదుషా లను దాకి చరచర వెనుకకు బోవుచున్నటుల దోచు దమ ముందు మార్గముపై బ్రసరించు చుండెను. తాన్సేను పాదుషాతోడ వారి నెట్లు కలియవలయునో తెలియక వార నీటికై చను దెంచు స్థానమునగాచియుండెను. వారిని గాంచి నంతనే పాదుషా స్వయముగ బోయి వారి యెదుట దీనుడై దోసిలి గట్టుకొని నిలువబడు టతో నిరువురు దరుణులు నిలువక తప్పలేదు.

"మేఘరాగమే! హంత! మా కళకు కళ వాసినటులే!" అక్బరు కడువినయముతో వారిని మేఘరాగము విన్పింపగోరెను. అతని వినయము 'పుత్రీ!'తో నంతమయ్యెను. 'తాని' 'నాని'ల మనంబుల పిడుగుపాటయ్యెను. అయినను 'పుత్రీ!' వారి కొకింత యూరట గలిగించెను. అయినను వారు తమ భావి నిర్ణయించుకొను టలో పొరవడలేదు. పాతివ్రత్యము ప్రాణముగా గలవారయ్యు వారు ముగలాయి చక్రవర్తి విన యమును ద్రోసివేయలేకపోయిరి.

"వీరు సాధారణ రమణులా! సాక్షాత్తు రాగరూపిణులు!" గానమధువును గ్రోలిన ప్రతి యొక్కని మోమున నానందహాసము ద్వితీయా చంద్రరేఖను దలపించెను. సంగీతము ముగిసి యంతటను బ్రశంసాకలకలము సాగెను. పాదుషా సంతోషమునకు మేరలేదు. ఇరువురు రమణుల పతుల పేరట వ్రాయబడిన జాగీరు పత్రములపై నాతని కేలు వ్రాలుసేయుచుం డెను. రమణుల ముఖములందు మాత్రము హాస్యరేఖలకు బదులు గాంభీర్యరేఖలు కన్పట్టు చుంట నెవరును గమనింపలేదు. వా రటనుండి వెడలిరి.

"కటకటా! ఎంత ప్రమాదము! ఎంతటి ఘోరదృశ్యమిది! ఇది నాకు నడుము విరుగు టయా? కాదు! ప్రాణప్రయాణమునగూడ నింతటి కష్ట మెదవునా? అసంభవము! ఒక యలభ్యమగు మహావిభూతి మంట గలిసినది. నేనెంత భాగ్యహీనుడను?" 'తాని' 'నాని' కేవలసంగీతరాణులే కాదు. మహాసతీస్వరూ పిణులుకూడను. తమ సతీత్వమును గాపాడు కొనుటకు వారు దమ కటియందు కటారుల నుంచుకొనినారు. అక్బరు సమక్షమునుండి వెడ లుటతోడనే యిరువురి మెడలపైన వారి మెఱపు కత్తులు వ్రాలినవి. రక్తము స్రవంతివలె పాఱెను. ఈ దృశ్యము నవలోకించి తాన్సే నేమేమో వెఱ్ఱియఱపుల నఱచుచు బాణా హతశకుంతమువలె విలవిల దన్నుకొనెను.

"ప్రాణనాథా! వివశతచే దమ యనుమతి బడయకుండ యవనప్రభుని యెదుట గానము జేయవలసివచ్చినది. నేను పవిత్రను. నా సతీ త్వము సురక్షితము. పాదుషా నాయెడల పుత్రీ భావము జూపినాడు. అయినను నా పాతివ్రత్య మున గొంతపాలు భ్రష్టమైనది. ఇపుడు నేను దమ పవిత్రాంకమును జేఱదగను. కావున నీ పాపమునకు దేహమును వీడుటయు మంచిదని తలచితిని. పరలోకమున దమ రాక కెదురు చూతును. ఇట్లు మీ చరణసేవకురాలు'

'తాని' 'నాని'ల పతులు వచ్చిరి. అక్బరు కన్నీటికడవలైన కన్నులతో దన యపరాధము నంగీకరించెను. ఇంటినుండి బయలువెడలుటకు పూర్వమే 'తాని' 'నాని' ప్రాణత్యాగమునకు నిశ్చయించుకొనియుండిరి. పాదుషా కరములు జాగీరుపత్రములను, సతుల పతుల కరములు వారి సతులు వ్రాసియుంచిన యుత్తరములను బట్టుకొనియుండెను. అందఱి హృదయములు రోదనము జేయుచుండెను.

ఆ యిరువురు సతీమతల్లుల జ్ఞాపకార్థము అచట నొక సంగీతమందిరము నిర్మింపబడెను. నేటికిని యీ స్మారకపు శిథిలములు 'అహమదాబాదు'లోని ఏలిస్ వంతెనకు సమీపమున గానవచ్చును.

ఓమ్ ... కాదు! కాదు! పొరపడితిని. ... "త్రోమ్ ... తా ... నా ... నా ... నా ..." తాన్సేను ఆ యిరువురు రమణులను జీవితకాలము మఱువలేకపోయెను. ఆతడేనాడు 'ఓమ్'తో గానము నారంభించుట మాని "త్రోమ్ తానా నానా"తో రాగాలాపన మారంభించెనో, ఆనాటినుండి నేటివఱకు రాగాలాపన మటులనే సాగుచున్నది.

# కర్మసిద్ధాంతము

## శ్రీమత్స్వామి నిర్వాణానందులు

భగవద్గీతలోని కర్మయోగములో జెప్పబడిన 43 శ్లోకములలోను ముఖ్యసూత్రములను తెలిపెడి శ్లోకములను దీసికొని వ్రాయుచున్నాను.

శ్లో॥ యజ్ఞార్థాత్ కర్మణోన్యత్ర
లోకోయం కర్మబంధనః।
తదర్థం కర్మకౌన్తేయ
ముక్తసంగ స్సమాచర

"యజ్ఞముకొరకు చేయు కర్మవిషయమునతప్ప మరొక విధముగా జేసిన యెట్టి కర్మయైనను లోకములో కర్మబంధము కలుగజేయునదిగా నుండును. కాబట్టి యజ్ఞముకొఱకు కర్మ చేయుము. మోక్షమును పొందుము", ఇది మొట్టమొదటి సూత్రము. యజ్ఞముకొఱకు చేయని ప్రతి పనికి మనము కట్టుబడి దానిచే బంధింపబడుచున్నాము. యజ్ఞమనగా నేమి? అనేకవిధముల యజ్ఞములనుగూర్చి గీత బోధించుచున్నది. నాల్గవ యధ్యాయములో దైవయజ్ఞము, బ్రహ్మయజ్ఞము, సన్న్యాసయజ్ఞము, ధ్యానయజ్ఞము, జ్ఞానయజ్ఞములనుగురించి చెప్పబడియున్నది. ఈ చెప్పబడిన యన్ని యజ్ఞములు, వాని నాచరణలో బెట్టినందువలన గలిగెడి ఫలితము, స్వార్థమును జంపుటేగాని మరొకటి కాదు. మన నిత్యజీవితమునం దంటిపెట్టుకొని వ్రేలాడుచున్నటువంటి "నేను, నాది" అని చెప్పబడెడి యహంకార మమకారములు పూర్తిగా తుడిచివేయబడవలయును. ఎల్లప్పుడు "కేవిధమైె సక్రమముగానుండు కర్మలన్నిటిని లెక్కపెట్టి చూపుట బహుకష్టము. కాని

సామాన్యముగా మనముచేయు కర్మలలో నిస్వార్థమువైపు మొగ్గుచూపెడి ప్రతి కర్మ సక్రమమైన కర్మయనియు, మనలను స్వార్థపరులుగా మార్చివేయుటకు సహాయపడు ప్రతి కర్మ దుష్కర్మ యనియు చెప్పవచ్చును. కర్మవలన ప్రపంచము బంధింపబడుచున్నప్పటికిని స్వార్థత్యాగమనెడి నిష్కామకర్మచే నట్టి కర్మబంధము నశించిపోవుచున్నది. గీత (4-23)లో "యజ్ఞా యాచరతః కర్మ సమగ్రం ప్రవిలీయతే" అని చెప్పబడెను. యజ్ఞముకొఱకు చేయబడిన కర్మవలన, ఒకానొకని కర్మ మనకు చెడ్డఫలితము లీయకుండ నుండుటలో నా దుష్కర్మ నశించిపోవుచున్నది. అనగా త్యాగశీలునిచే జేయబడిన కర్మ, కర్మ కానేకాదని భావము. స్వార్థత్యాగమనునది యొకని నడత, లేక ప్రవర్తనయొక్క మొట్టమొదటి ప్రధాన సూత్రముగా బరిగణింపవచ్చును.

రెండవ ముఖ్యసూత్రము సంతోషము.

శ్లో॥ ఇంద్రియస్యేంద్రియస్యార్థే
రాగద్వేషౌ వ్యవస్థితౌ ।
తయోర్న వశ మాగచ్ఛే
త్తే హ్యస్య పరిపంథినౌ (3-34)

"ఆయా యింద్రియపదార్థమునెడల, నాయా యింద్రియముకూడ, రాగముగాని ద్వేషముగాని కలిగియే యున్నది. కాని యట్టి మోహమునకు లొంగిపోగూడదు. ఏమనగా — మోహమే మనకు పరమశత్రువు. మనము మోహమువలనను కామమువలనను ప్రేరేపింపబడినవారమై కర్మ చేయదగదు. ఇందుకు కారణము — ఎంత యెక్కువగా మోహమునకు దూరమై చేసిన కర్మవలన, నిర్మలస్థాయిని పొందగలుగుదుమో, యంత యెక్కువగా నాధ్యాత్మప్రపంచమున జయమును బొందగలుగుదుము.

మూడవ ముఖ్య సూత్రము — మనకు విదితమగు కృత్యమును, సక్రమముగాను, చక్కగాను నెరవేర్చుటయై యున్నది.

శ్లో॥ శ్రేయాన్స్వధర్మో విగుణః
పరధర్మాత్స్వనుష్ఠితాత్ ।
స్వధర్మే నిధనం శ్రేయః
పరధర్మో భయావహః (3-35)

"లెస్సగా నెరవేర్పబడిన పరధర్మముకంటె, గుణములేనప్పటికి, స్వధర్మమే మంచిది. స్వధర్మనిర్వహణలో, మృత్యువాసన్నమయినప్పటికీ సిద్ధపడియుండవలెను. రధర్మ మెప్పటికిని ప్రమాదకరమైనదే.

గీతాకారుడు కులమునకు నీతిశాస్త్రమును గుదిర్చి యన్వయింపజేయుచుండును. క్షత్రియుడైయుండియు అర్జునుడు యుద్ధముచేయక స్వధర్మమును విడిచిపెట్టదలచుట చాల తప్పని శ్రీకృష్ణుడు బోధించెను. ఇట్లు శ్రీకృష్ణుని బోధనలనుగూర్చి కొందరు తప్పుగా నభిప్రాయపడుచున్నారు. ఈ వివాదమును స్నేహదృష్టితో బరికింపదలచినవారు కులము, మతము ముఖ్యమాత్రము కాదని జీవితములోని స్థితిపైన, పుట్టుకపైన ఆధారపడియుండునని సులభముగా గ్రహింపగలరు. ప్రొఫెస్సరు మెక్డోనెల్ అను ఆయన, తాను వ్రాసిన సంస్కృతవాఙ్మయ చరిత్రగ్రంథమున 405 వ పేజీలో నీ క్రింది విధముగా వ్రాసెను.

"మానవు డేకులమునకు జెందినవాడైనప్పటికిని, తన విహితకృత్యము తప్పక నెరవేర్చియే తీరవలెనని శ్రీకృష్ణుని బోధయొక్క సారాంశమై యున్నది" అని వ్రాసెను. మనకన్నిల

చూపు ద్వారముగ నితరులను మనము పరికించి చూచి మన దృక్పథమునుబట్టి వారి విధులను ఆచారములను తీర్మానింపవలసియుండును. మన భావనలను గీత దీర్ఘముగా గ్రహించుచున్నది. గీతయొక్క బోధ యట్టి సంకుచిత భావములకు భిన్నస్వరూపము దాల్చియున్నది. విహితకృత్యమెట్టిదో సర్వసాధారణముగా మనందరి జ్ఞప్తిలో నున్నప్పటికి, దానిని మన నిత్యజీవితములో నాచరించునపుడు దేశకాల పరిస్థితులనుబట్టియు, చుట్టుపట్ల ఉండు ఆచారమునుబట్టియు నా విహితకృత్యనిర్వహణములో మార్పుచేయక తప్పదు. ఎంత యల్పస్థితికి జెందిన పని యయినప్పటికిని దానిని మనము భిన్నాభిన్నములుగాజేసి, కొంత కొంత యాచరణలోపెట్టి కొంత కొంత విడిచిపెట్టివేయకుండగ, సంపూర్తిగాను, సంతృప్తికరముగాను, దానిని నిర్వహించితిమేని, విధి మనకొప్పగించిన పనిలో — మనము గెలుపొందినవారమగుదుము. తన్మూలముగ నంతకంటె మహత్తరమైన పనుల నిర్వహణకు, సృష్టి మనల నెంచుకొని పైకిలేవనెత్తును. ఎట్టి కర్మ నప్పగించినను సరే, ఢంకామీద దెబ్బకొట్టి నిర్విఘ్నముగా నిర్వహింపగలమనెడి గర్వముతో విఱ్ఱవీగి, మన ప్రధాన విహితకృత్యముల నిర్వహణలో నెంత మాత్రము వెనుకంజవేయుటగాని, యేమరుపాటుగాని కూడదు. కొద్ది కొద్ది కర్మచేసి దానితో సంతృప్తిపడకూడదు. పెరుమాళ్లచే, మన మే గూటిలో పెట్టబడియున్నామో యా స్థితి జెందిన సక్రమమైన విహితకృత్యము నాచరణలోపెట్టినపుడు మాత్రమే, అంతకంటె హెచ్చుస్థాయిలోని కర్మచేయుట కర్హత కలిగియుండెదమని ముఖ్యముగా తెలిసికొనవలయును.

శ్లో॥ తత్త్వవిత్తు మహాబాహో
గుణకర్మవిభాగయోః।
గుణాగుణేషు వర్తంత
ఇతి మత్వా న సజ్జతే॥ (3–28)

"త్రిగుణములు నవి చేయు పనిని బోల్చిచూచి యథార్థస్థితిని దెలిసికొనువాడు, త్రిగుణములు కూడ గుణములపైనే పనిచేయుచున్నవనియు, తనపైని కానేకాదనియు భావించి, నిస్సంగుడై వానినుండి తటస్థముగా నుండును".

కాపులేని యింటను మాత్రమే చోరులు చోరబడుదురు. పరమార్థమైనటువంటి దీపపు కాంతిని మనము పొందియున్నట్లయిన, త్రిగుణము లను దొంగలు మనలను దొంగిలింప జాలరు కాబట్టి యర్జునున క్రింది సలహా ఈయబడెను.

శ్లో॥ త్రైగుణ్య విషయా వేదా
నిస్త్రైగుణ్యో భవార్జున
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో
నిర్యోగక్షేమ ఆత్మవాన్॥
(2–45)

"త్రిగుణాత్మలకే వేదము లుద్దేశింపబడినవి కాబట్టి నీవు త్రిగుణాతీతుడవు, ద్వంద్వాతీతుడవు కమ్ము. సత్త్వగుణము నాధారముగా దీసికొని నిష్కాముడవై యింద్రియనిగ్రహము కలవాడవై యుండుము" అని శ్రీకృష్ణుడు బోధించెను. ఈ సలహాప్రకారముగా మనము త్రిగుణాత్ములము కావలసియున్నది.

(సశేషము)

# వార్తలు, విశేషాలు

## న్యూఢిల్లీలో శ్రీరామకృష్ణ దేవాలయావిష్కరణమహోత్సవము

న్యూఢిల్లీలో శ్రీరామకృష్ణదేవున కొక గుడి మూడులక్షల పదివేల రూపాయల వ్యయంతో నిర్మితమైంది. దానిని ఈ నోవెంబరు 30 వ తారీఖున ప్రెసిడెంటు డాక్టరు రాజేంద్రప్రసాదు గారు ఆవిష్కరించారు. మిషనుస్వాములు పెక్కండ్రున్నూ ఢిల్లీనగరపౌరులు వేలకొలది గానున్నూ సమావేశమై ఆ చక్కనిగుడిని దర్శించారు. దానిలో శ్రీరామకృష్ణదేవుని చలువ రాతి విగ్రహము పెద్దది నెలకొల్పబడి ఉంది. అచటి శ్రీరామకృష్ణమిషను సెక్రటరిగారైన శ్రీమద్రంగనాథానందస్వాములు ప్రెసిడెంటు గారికి స్వాగతాభినందనము పలికి, 'సర్వమత సామరస్యమును మైత్రిని బోధించిన గురువు శ్రీరామకృష్ణుడు, ఏకాద్వితీయపరమాత్మాధిష్ఠిత మాట మూలంగా సర్వమానవజాతియొక్క ఐక్యమును ఉద్ఘోషించిన గురువు శ్రీరామకృష్ణుడు. ఈ గుడి ఆ గురుదేవుని స్మృతికి అంకితం' అన్నారు.

ప్రజల కష్టనివారణకై శ్రీరామకృష్ణమిషను వారు ఆస్థతో నిర్వహిస్తున్న కార్యక్రమమును కొనియాడుతూ ప్రెసిడెంట్ రాజేంద్రప్రసాదు గారు ఈలాగు అన్నారు — "వీరు చేయుచున్న నిస్స్వార్థసేవ చూస్తున్న నాకు శ్రీరామకృష్ణ దేవుని భక్తుడ నౌద మని ఉవ్విళులూరెంచు చున్నది. మానవసేవయే మాధవసేవ అను లక్ష్యాన్ని బోధించిన గురువు ఆయన. ఆ లక్ష్యాన్ని ఎదుట ఉంచుకొని మిషనువారు నిర్వహిస్తున్న సేవాకార్యక్రమం చూచినప్పుడు నాకు కలిగిన మెప్పు, వారి వేదాంతోన్నతికిని ఆధ్యాత్మికసాధననిష్ఠకును నాకు కలిగిన మెప్పు కంటె ఎన్నో మడుగులు హెచ్చు. శ్రీరామకృష్ణదేవుని బోధనలు విశ్వమానవహృదయాకర్షకములు. మతప్రవణచిత్తులకే కాక మానవైక్యసిద్ధాంతప్రియులకు అనేకసహస్రసంఖ్యాకులకు గూడ ఆయన బోధనలు నచ్చినవి".

సాహిత్యఅకాడమి అసిస్టెంటుసెక్రటరిగారైన డాక్టరు కె. ఎమ్. జార్జ్ ప్రసంగిస్తూ ఈలాగు అన్నారు — "వైజ్ఞానిక సాంకేతికాభివృద్ధులు లోకాన్ని వినాశంవైపుకే ఈడుస్తున్నాయి. ఆత్మను కోల్పోయిన వారికి అవి అన్నీ ఉండి మాత్రం లాభ మేమి? కాబట్టి ప్రస్తుతం మానవుల 'ఆత్మ'ను నిలుపుకోవడానికై అన్ని మతాల వారున్నూ ఏకీభవించటం ప్రాప్తం. ఆ ఐక్యాన్ని సాధించిపెట్టగలవారు శ్రీరామకృష్ణమిషను వారు, ఎందు కంటె, సర్వమతమైత్రియందున్ను మానవైక్యమందున్నూ విశ్వాసం అంటే వారిదే!

## వఱదబాధితులకు శ్రీరామకృష్ణమిషనువారి సాహాయ్య కార్యక్రమం

### సూళూరుపేట, నెల్లూరుజిల్లా, ఆంధ్రప్రదేశ్.

నోవెంబరునెల ప్రారంభంలో నెల్లూరు, చిత్తూరు జిల్లాల కొన్ని తాలూకాలలో వఱదల వల్ల కలిగిన అపారప్రాణధననష్టమున్నూ, ఆ కష్టనివారణకై స్వయంగా సకాలానికి ఎంత

గానో పాలుపడుతున్న ఆంధ్రప్రదేశప్రభుత్వం వారు శ్రీరామకృష్ణమిషనువారిని ఆ సంస్థవంటి సంస్థలవారిని మరికొందరిని కూడా ఈ సేవా కార్యక్రమంలో పాల్గొను డని ప్రార్థించడం. వరదబాధోపశమనకార్యానికి కావలసిన ధన సాహాయ్యానికై శ్రీరామకృష్ణమిషను పత్రికలలో ప్రకటించిన విజ్ఞప్తులున్నూ, — ఇంత వరకు అందరికీన్నీ తెలిసిన విషయమే. అప్పటికే కొట్లాటవల్ల నష్టపడ్డ రామనాథపుర జిల్లా ప్రాంతాలలో సేవాకార్యక్రమంలో నిమగ్నులై ఉండిన శ్రీరామకృష్ణమిషనువారు నొవెంబరు తే 17 దికంటె ముందుగా ఈ ప్రాంతానికి రాలేక పోయ్యారు. ఆ తారీఖునాటికి వచ్చారు. తే 18 ది ఉదయం సూళూరుపేటలో బాధోపశమన కేంద్రాన్ని నెలకొల్పారు. వారి తాలూకు సన్న్యాసులున్నూ సేవకులున్నూ 18, 19 తేదీలలో కడలూరు, పుళివెంద్ర, నెడెలియవైఖండ్రిక, సూరారెడ్డిఖండ్రిక, మావిళ్లపాడు, తాళ్లంపాడు, లింగంపాడు, ముదుగులపాళెం అను ఎనిమిది గ్రామాలు చుట్టినారు. తే 19 ది మధ్యాహ్నం సూరారెడ్డిఖండ్రిక, తాళ్లంపాడు గ్రామాలలో 260 కుటుంబాల వారికి 367 దోవతులు, 451 చీరలు, 151 పిల్లలఉడుపులు, క్రొత్తతుండ్లు 255, అల్యూమినియముపాత్రలు 249 సెట్లు, 249 చాపలు, 457 పడుల బియ్యం పంచిపెట్టారు. 20, 21 తేదీలలో గొల్లములువు, మావిళ్లపాడు, లింగంపాడు, ముదుగులపాళెం, సూళ్లూరుపేటలో క్రిస్టియన్పేట బందులదొడ్డి వీధి — అనే చోట్లలో 214 కుటుంబాలవారికి 262 దోవతులను, 273 క్రొత్తచీరలను, 204 క్రొత్తపిల్లలచొక్కాలను, 250 పాతబట్టలను, 221 చాపలను, 520 అల్యూమినియంపాత్రలను 242 పళ్లబియ్యమున్నూ పంచారు. ముదుగుల పాళెం ప్రజలు వంటవార్పులకు మురికినీటిని వాడుతూ ఉండడం చూచి, వాళ్లకుగాను మిషనువారు ఒక ట్యూబు బావిని నెలకొల్పారు. 22, 23 తేదులలో సూళూరుపేట తూర్పువీధిలోనునున్న గోపాలరెడ్డిపాళెం, తప్పలగుడిసెలు, డేగలపాళెం, పుళివెండ్ల అనేచోట్లలో 202 కుటుంబాలవారికి 210 దోవతులు, 259 చీరలు, 115 తుండ్లు, పిల్లలచొక్కాలు సరిక్రొత్తవి 203, అల్యూమినియముపాత్రలు 202 సెట్లు, చాపలు 202, బియ్యము 293½ పళ్లు పంచిపెట్టబడ్డాయి. నొవెంబరు 24 వ తేదీ లగాయతు డిసంబరు 2 వ తేదివరకు సర్వారెడ్డికండ్రిక, పందులగుంట, చినసత్రం, కోటపోలూరు, కదలూరు, జువ్వలపాళెం, ఉచ్చూరివారిపాళెం, పుదూరు, నెల్లబలి, నాయుడుపేట, పల్లిపాళెం, తోపుకండ్రిక, వెలగలవాగు, వేటగిరిపాళెం. బురదమడుగు అనే చోట్లలో 623 కుటుంబాలవారికి 858 దోవతులు, 894 చీరలు, 228 దుప్పట్లు, పిల్లలచొక్కాలు 755, క్రొత్తతువాలాలు 434, చాపలు 561, హోస్సియర్‌గుడ్డ 90 గజాలు, బియ్యము 758½ పళ్లు, అల్యూమినియంపాత్రలు 2027, ప్రాతబట్టలు 850 పంచిపెట్టబడ్డాయి.

డిసంబరు 3 వ తేది మొదలు 12 వ తేది వరకు మిషనువారు చిన్నసత్రం, వటంబేడు, కొన్నంబట్టు, వెండ్లూరుపాడు, కుదిరి గ్రామాలలో 308 కుటుంబాలవారికి 492 దోవతులు, 414 చీరలు, 48 తుండ్లు, 275 దుప్పట్లు, 518 పిల్లలచొక్కాలు, 336 చాపలు, 1362 అల్యూమినియము పాత్రలు, 449 పడుల బియ్యం, 2 బస్తాల పలసరకులు, 1650 ప్రాతబట్టలు పంచిపెట్టబడ్డాయి.

కార్యక్రమం ప్రారంభమైనప్పటినుండీన్నీ ఇప్పటివరకు మిషనువారి సాహాయ్యం అందిన గ్రామాల సంఖ్య 30, కుటుంబాల సంఖ్య 1616. పంచిపెట్టబడ్డ వస్తువుల వివరాలు — 2191 దోవతులు, 2291 చీరలు, 1831 పిల్లల చొక్కాలు, 852 తుండ్లు, 503 దుప్పట్లు, 2950 పాతబట్టలు, 90 గజాల హెస్సియన్ గుడ్డ, 1569 చాపలు, 5154 అల్యూమినియము పాత్రలు, 2200 పడుల బియ్యం, 2 బస్తాల పలసరకులు, 1 ట్యూబు బావి.

చాలినంత విరాళాలు సమయానికి అందక పోవడం మూలాన కేవలధనాభావంచేత ఈ సాహాయ్యకార్యక్రమాన్ని నడుమనే చాలించుకోవలసివస్తుందేమో అని శ్రీరామకృష్ణమిషను వారు నొవెంబరు తే 22 దినాడు ప్రకటించారు. విరాళాలు అందజేయబడుతాయి, కార్యక్రమాన్ని చాలించకండి అని పలువురు ఎచ్చరించిన మీదట మిషనువారు కార్యక్రమాన్ని ఆస్థతో సాగిస్తూనే ఉన్నారు. ఇప్పుడు కొన్ని వారాలుగా విరాళాల రాబడి దినదినానికి హెచ్చుగా ఉత్సాహజనకంగా ఉంది. ఐనా వ్యయం ఆదాయాన్ని మించే ఉంటున్నందువల్ల మిషనువారు ఖసాలా అనుభవిస్తూనే ఉన్నారు. ఈ సాహాయ్య కార్యక్రమం చురుకుగా సాగడానికి ఆ ప్రాంతాల్లో తమ సర్వస్వాన్ని పోగొట్టుకొని అల్లాడుతుండే దీనప్రజల స్థితికి హృదయం కరగిన ఉదారసంపన్న మహాజనులనుండి మా వరదబాధోపశమన నిధికి శ్రీరామకృష్ణమఠ మానేజరుగారి పేరటికి విరాళాలు ఇంక నింకనూ రావాలి. సమయానికి అందని సహాయం అసలు అందనిదానితో సమానమే. ఇప్పుడు అందుతున్నట్లు విరాళం మొదటినుండే అందుతూ ఉండి ఉంటే ఇంకా ఎన్నిగ్రామాలకో ఎందఱు దీనులకో సహాయం అందజేయబడి ఉంటుంది. ఇదే మా విజ్ఞప్తి.

శ్రీ కైలాసానందస్వామి
శ్రీరామకృష్ణమఠానికి మిషనుకు అధ్యక్షులు, మదరాసు.

"మీ సోదరమానవులపై మీకు ప్రేమ కలదా? భగవంతుని చూడ గోరు వారు ఎచటికో పోనేల? — ఈ యందఱు పేదల, నిర్భాగ్యుల, దుర్బలుల రూపమున కానిపించునదా భగవంతుడు కాడా? ప్రథమమున వీరి నేల ఆరాధింప రాదు? గంగాతీరమందు నూతులు త్రవ్వ శ్రమ యేల? ప్రేమ సర్వశక్తిమంత మని నమ్ముడు. పేరుప్రతిష్ఠ లనెడు క్షణభంగు రాడంబర మెవరికి కావలెను? మీకు ప్రేమ కలదా? ఉన్నచో మీరు సర్వశక్తిసంపన్నులు. మీయందు స్వార్థపరతాలేశమైన లేదా? లేనిచో, మీ శక్తి నిర్నిరోధము. శీలమే సర్వత్ర శుభప్రద మైనది. ఓర్వలేనితనమును దురహంకారమును విడనాడుడు. ఐకమత్యముతో ఇతరులను కూడి లోకసేవ చేయ నేర్చుకొనుడు. మన దేశమున కిదియే అత్యావశ్యకము. ఓర్పుగలిగి, మరణపర్యంతము విశ్వాసపాత్రులై మెలగుడు. మీలో మీరు కలహింప వలదు. ద్రవ్యవిషయములందు నిష్కల్మషులై యుండుడు. శ్రద్ధయు నీతియు లక్ష్యమునందు నిష్ఠయు, మీకున్నంత కాలము సర్వము వర్ధిల్ల గలదు".

—శ్రీ వివేకానందస్వామి

# గ్రంథసమీక్ష

## యోగసాధన

శ్రీ శివానందస్వాముల మూలగ్రంథమునకు శ్రీ దిగవల్లి శేషగిరిరావుగారి ఆంధ్రానువాదం. పుటలు 552; ప్రాప్తిస్థానము: ఆధ్యాత్మిక గ్రంథమండలి, విజయవాడ; సాదా ప్రతి రూ. 5; గ్లేజు ప్రతి రూ. 6.

ధారణను గురించిన వివరాలు, తదభ్యాసం, ధ్యానానికి కావలసినవి, ధ్యానాభ్యాసం, ధ్యానంలో వైవిధ్యం, ధ్యానవిఘ్నాలు, ధ్యానానుభూతులు అనే విషయాలను తేట తెనుగులో తొమ్మిది అధ్యాయాలలో ప్రపంచించే ఈ పుస్తకం యోగసాధనాజిజ్ఞాసులకు కొంగు బంగారం.

## శ్రీ ధ్రువవిజయం

(బుఱ్ఱకథ)

రచయిత: కేశవతీర్థస్వామి; ప్రాప్తిస్థానం: శ్రీరామతీర్థసేవాశ్రమం, పిడుగురాలపోస్టు, గుంటూరుజిల్లా.

భక్తిరసనిష్యందమైన శ్రీ కేశవతీర్థస్వామిగారి కలమునుండి అనుగృహీతమైన యీ జానపదగీతిక వారి తక్కిన బుఱ్ఱకథలవలెనే, భక్తప్రబోధమును పరమానందమకరందాన తోగించి నెఱచూఱలిస్తున్నది అంటే మితోక్తి.

## శ్రీ దేవీసూక్తపరమార్థము

'సోఽహమ్'—సమాధి

రచయిత: శ్రీ శ్రియానందనాథాపరనామధేయ ఈశ్వర సత్యనారాయణశర్మగారు; ప్రాప్తిస్థానము: గ్రంథి ఆంజనేయశ్రేష్ఠి, చిత్తూరు; పుటలు 96; వెల 12 అణాలు.

ఋగ్వేదసంహితాభాగమందలి యెనిమిది ఋక్కులతో గూడిన యీ సూక్తమునకు 'పరమార్థవివరణ' మనుపేరుతో శ్రీ శ్రియానందులవారు రచించిన వివరణములో వైదుష్యానికిన్నీ ఆధ్యాత్మికస్వానుభూతికిన్నీ సరళసలక్షణమధురవాఙ్నైపుణికిన్నీ అరుదుగా 'ఏకత్రావాసం' పొందుపడింది. ఇందుతోపాటు వారు జతపఱచిన "సోఽహం సాహం" సమాధి అను సాధనావస్థావిశేషప్రతిపాదకవ్యాసమున్నూ తత్సాధనాజిజ్ఞాసువుల కత్యంతోపయుక్తంగా ఉంది.

—ప్రభాకర్.

# బుద్ధ ఉవాచ

శ్రీ బుద్ధభగవానుడు లోకమున కొసగిన సందేశమునందలి ముఖ్యాంశములు ఏర్చి కూర్చి విడివిడిగా సులభశైలియందు ఈ గ్రంథమున ముద్రింపబడియున్నవి.

పాకెట్టు సైజు (ప్రథమ ముద్రణము) వెల : 37 న. పై.

# శ్రీ రామకృష్ణ ఉవాచ
# శ్రీ శారదా సూక్తి నవనీతము
# శ్రీ వివేకానంద శంఖారావము

శ్రీ రామకృష్ణపరమహంస, శ్రీ శారదాదేవి, శ్రీ వివేకానందస్వామి — వీరు ముగ్గురును లోకమున కొసగిన సందేశమునందలి ముఖ్యాంశములు ఏర్చి కూర్చి విడివిడిగా సులభశైలియందు ముద్రింపబడియున్నవి. ఈ గ్రంథములలో జీవితమునందలి వివిధఘట్టములకు, వివిధవిషయములకు సంబంధించిన ఉపదేశములు గలవు. అందఱును చదివి తరింపగల చిన్న చిన్న పుస్తకములు.

పాకెట్టు సైజు (ప్రజ్జ్వలముద్రణము) ఒక్కొక్కదాని వెల : 37 న. పై.

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు - 4

# శ్రీ బ్రహ్మానందబోధనలు

(శ్రీ బ్రహ్మానందస్వామి జీవితోపదేశములు)

శ్రీ చిరంతనానందస్వామి

"శ్రీ రామకృష్ణదేవునియొక్క పారమార్థిక పుత్త్రుడు" అని పేరొందిన, శ్రీ వివేకానంద స్వామితో ఇంచుమించు సమానౌన్నత్యము నొందిన భక్తిజ్ఞానసిద్ధుడగు మహాపురుషుని సవిస్తర జీవితమును, దివ్యోపదేశములును గల యీ గ్రంథము జిజ్ఞాసువుల కందఱకు అవశ్య పఠనీయము, మహోపకారకము.

త్రివర్ణముఖచిత్రము, శ్రీ రామకృష్ణునియొక్కయు, శ్రీ బ్రహ్మానందస్వామియొక్కయు ఛాయాచిత్రములు గలవు.

344 పుటలు (ప్రథమ ముద్రణము) వెల: రూ. 3-50

# శ్రీ శారదాదేవి

రచయిత: శ్రీ నండూరి బంగారయ్యాగారు, బి. ఏ., బి. ఎల్.

శ్రీ శారదాదేవి దివ్యజీవితము ఇందు వివరముగ, మనోహరభాషలో చిత్రింపబడి యున్నది. ఆమె హృదయము నెఱుంగగోరు భక్తులీ గ్రంథమును జదివి తీరవలయును! క్రొత్తవిషయ మెంతో సేకరించి కూర్చబడిన యద్భుత గ్రంథము.

144 పుటలు వెల : రూ. 1-25

# ప్రాచ్యము, పాశ్చాత్యము

(శ్రీ వివేకానందస్వామి ప్రణీతము)

అనువాదకుడు:

శ్రీ కందుకూరు మల్లికార్జునంగారు

శ్రీ వివేకానందస్వామి వంగభాషలో వ్రాసిన "ప్రాచ్యఓ పాశ్చాత్య" యను గ్రంథమునకు ఆంగ్లానువాద మగు "The East and the West" కు ఇది తెనుగుసేత.

157 పుటలు వెల : రూ. 1-25

అడ్రెసు: మేనేజరు, శ్రీ రామకృష్ణమఠము, మైలాపూరు, మద్రాసు -4